శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః.

# శోధకవిజ్ఞప్తి.



శ్లో. పురాణ మిత్యేవ న సాధు సర్వం । న చాపి కావ్యం నవ మిత్యవద్యమ్
సన్తః పరీక్ష్యాన్యతర ద్భజన్తే । మూఢః పరప్రత్యయనేయబుద్ధిః.

అభిరూపశేఖరులారా!

ఇక్కాలమునఁ దెనుఁగుగ్రంథములను సంస్కృతమూలములతోను వ్రాఁతప్రతులతోను బోల్చి యథాశక్తి నిర్దుష్టముగా సవరించి మేము ముద్రించుటం గొందఱు చూచి 'కూర్చిరి మార్చిరి చెఱిపిరి చెడినది' యని చేయునాక్షేపణములు నాక్రోశములును గర్ణతాడితము లగుచున్నవి. వీనిం గొంత పరామర్శించుట కిపుడు మిక్కిలి యవసరమై యున్నది.

మనదేశమునఁ జదువరులపాలిటిభాగ్యదేవతయై ముద్రణపద్ధతి యేర్పడిన పిదప నాంధ్రభాషయందు గొప్పగ్రంథము లగుభారతమును భాగవతమును ముద్రితము లయినవి. ఒకగ్రంథమునకుఁ గల వ్రాఁతప్రతు లొక్కొక్కటికిని బ్రాయికముగా వ్రాయసకాఁ డొక్కొక్కఁడగుటను గాన వానియం దక్షరము లొక్కతీరు గాకయుఁ బాఠము లొక్కతెఱఁగు గాకయు నుండుటతోఁగూడ నందంద సొంతకూర్పులును వింతమార్పులును గొంతకొంత గానిపించుటయుం గలదు. కాన వానిలోఁ బెక్కులు ప్రౌఢు లగుపాఠకులకు సైతము ప్రాణగొడ్డములుగా నుండును. ఆగ్రంథమునచ్చుప్రతులం దాయా[illegible] కన్నిటికిని శోధనమును ముద్రణమును సమానము లగుటచే నాయన్నింటను బాఠ మొక్కటిగాను, నక్షరములు మఱింత విడిగా ముత్తెపుసరులవలె ముద్దులు గులుకుచును, నుండును; కాన యవి యభిజ్ఞులకే కాక యర్థము దెలియని బాలురకును స్త్రీలకును సైతము సొంపై సుఖముగాఁ బఠింపఁదగి యుండును. అచ్చపునేతికి ముందఱఁ బచ్చివెన్నయు మెచ్చా? అట్టులు గట్టఁబడి చేపట్టునకు దిట్టముగా నుండునచ్చుఁబొత్తములపస యెక్కడ! కట్టలవలెఁ గటువై దారముల నులిగొనునాకుప్రతులపస యెక్కడ! వ్రాఁతజిలుగులసిలుగులకంటె నచ్చుతేటలనీటులు మీటు గాకున్నే! ఇవి సరస్వతి నోఁచిననోములపంటలు. వీనికి ముందవి పెంటలు గావో!!

ఇట్లచ్చుప్రతులు చదువరులకనువిందులుగా నెచ్చుచు రాఁగా వ్రాఁతప్రతులు పురువులపెనువిందులై ప్రుచ్చుచుఁ బంచత నొందసాగినవి. ఔను! మంట మగ్గి మసై, నీటను దోఁగి నజ్జై, నిప్పునఁ గ్రాఁగి నీఱై, గాలిం గలసి దుమ్మై, బయలం బడి

వమైన్న, యిట్లు పంచభూతములం గలసియుఁ గలయుచును నున్నవి. ఇంతవఱకు కవియంతరింపఁ దొడఁగి దాదాపు రెండుతరము లగుచున్నవి. మనముత్తాతలకాలమునఱకే వానిముసువులును బసువులును. మనతాతలషష్టిపూర్తి కచ్చుప్రతులు పాత్తముముత్తైదువపేరంటమునకై యెత్తినబిత్తరపుఱూపులవలె మనోనయనోత్సవములై మొలకెత్తసాగినవి. అందలిపాఠములే మనతండ్రులకు వెన్నతోఁ గూర్చి పెట్టినవి. మనకు నవియే నుగ్గుఁబాలతో నూఱి పోసినవి. వేనేల? అచ్చుప్రతులపాఠములే యెల్లయెడల నల్లుకొని యిప్పు డన్నిపట్టుల నిల్లు గట్టుకొని యున్నవి.

ముద్రాక్షరములు సరులు గూర్చినయాణిముత్తెములే. అచ్చుప్రతులు చూచుటకును బట్టుటకును జదువుటకును మెచ్చులు గులుకునే. అందలిపాఠములు మన తాతలతండ్రులవాక్కులం బడి పవిత్రములై మనహృదయసీమలం బ్రతిష్ఠింపఁబడి యున్నవే! అయిన నేమి? వానియందుఁ దప్పు లుండవా? కూర్పులును మార్పులును గలుగ నేరవా? ఇది కొంత విచారింతము.

భారతాదులను రచించినకవులు గడచి యిప్పటి కయిదాఱువందలసంవత్సరముల కెక్కువయే యైనది. ఇంతదీర్ఘకాలములో దేశమునఁ బెక్కు రాజ్యవిభ్రమణములును నూతనరాజ్యజనసములును నపూర్వమతభాషాసంపర్కములును గలుగుటం జేసి జనవ్యవహారములలో మునుపటివి గొన్ని నశించుటయు మఱికొన్ని క్రొత్తగాఁ దలసూపుటయు సహజము. ఈవ్యవహారములమాఱుపాటు ననుసరించియే భాషయందును దద్వాచకము లయినపదములును వానిప్రయోగవిశేషములును గొన్ని మాసిపోయి యిప్పటివాడుకలోఁ గానిపింపకున్నవి. ఆపదాదులచొప్పు నక్కాలపుగ్రంథములను బెక్కింటిని గొనియే నిరూపింపఁదగి యున్నది. ఈవిశేషము పెక్కుభాషలయందుఁ గానిపించుచున్నదని భాషాచరిత్రములే యుద్ఘోషించుచున్నవి. ఇట్లాపదాదులు జనవ్యవహారములం గానిపింపనియిక్కాలమున నచ్చుప్రతుల శోధించి ముద్రింపఁ బూనినపండితులు వానిలో నప్పటికాలపుగ్రంథప్రయోగములనుబట్టి తమకు నిర్ణయింపఁగూడినవి తప్పఁ దక్కినవానిని నట్లే సందిగ్ధములుగా నుంచుటకుఁ బాలుపడ నోపకయుఁ, దాము ప్రకటించుప్రతు లొకటి రెండు గాక కూర్పునకు వందలకొలఁది నుంటం జేసి యాపెక్కింటను నట్టిదుస్సాధములు వ్యాపించి యుండుటకు మనసు రాకయుఁ, గూర్పను మార్పను జాలినపాండిత్యమును గవిత్వమును గలవారు గాన యారెంటిని గొని యాపదాదులు పాఠకసామాన్యమునకు సుబోధములుగా నుండునట్లు సవరించుటకు బలవంతముగాఁ దమంతఁ బ్రేరితు లగుచున్నారు. వ్రాఁతప్రతులలో నొకటిని జూచి మఱొకటిగాఁ బూర్వమునుండి వ్రాయంబడుచు వచ్చిన వగుటచేతను, మిక్కిలిపురాతనములైనవియుఁ బెక్కు మిగిలియుండుటచేతను నట్టివానిలోఁ బెక్కింట నాపదాదులు తప్పక వచ్చియుండవచ్చును. వాని వ్రాయసకాండ్రలోఁ బెక్కండ్రు గూర్పను మార్పను జాలినంతవ్యుత్పన్నులు గాకుండుటచే నట్టివారిప్రతులం దేనియు నవి మాఱుపడక యుండవచ్చును. ఒక్కొకవ్రాయసకాని

ప్రతు లోకకొన్నియో కాని వందలకొలఁదిఁ గావు గావున నా తెలియనిపదాదుల సవరించియో తీఱవలయు ననుస్వాత్మప్రేరణము వాని కంతబలవంతముగా నుండదు. ఈ కారణములంబట్టి యచ్చుప్రతులకన్న నాకుప్రతులే పాఠసౌష్ఠవమునకై మఱింత యాశ్రయణీయములుగా నుండును. పెక్కురిత్తవాదములకన్న రెండొక్కయుదాహరణములే మిన్న.

భారతమున యతిభిక్షాసమయవివరణమున ‘విఘూమేన్యస్తముసలే వ్యఙ్గారే భుక్తవజ్జనే’ శాంతి. అని యున్నది. ఇందులకు ‘డంపకములకు వంటకములకును, భోజనములకుఁ దఱియైనప్రొద్దుఁ గడపి’ ౫ ఆ. 393 అని వ్రాఁతప్రతులం దున్నది. ముసలశబ్దమునకుఁ బర్యాయముగాఁ దెనుఁగున ‘డంపక’మున్నది. అయినను ‘దంపకము దంచు’ అనియే కాని ‘డంపకము’ అని వాడుకలో లేదు. మఱిప్రయోగమందో ‘డంపుదుమేకుభృత్పరివృఢఘంబుల’ నని కాశీఖండమునఁ గలదుగాని యది ముద్రణసమయమున శోధకులకుఁ దెలియకగాని మఱవఁబడికాని యుండవచ్చును. సర్వజ్ఞత్వ మెవరిసొమ్ము? అర్థము పొసఁగియుఁ బ్రకరణమునకుఁ బొందుపడియు నుండుటకన్నఁ దేటగానుండుటే మఱింత యావశ్యకము కాఁబోలు. కాన తెలియకున్న ‘డంపకములు’ తేటగా నున్న ‘డాంబికము’లయ్యె. కనుక ‘డాంబికములకు వంటలకుఁ గొఱక’ అని పాఠము పుట్టినది. ఇవి తేటగా నుండుట యటుండ మన తాతగారినోటఁ బడియు వచ్చినదిగాన తప్పయిన నొప్పే! దీనిని మరల దిద్దుటయె తప్పు!! అచ్చుప్రతులయాగడమా యిది !!!

ఆరణ్యపర్వమున ‘ఉల్లకాంచనరథముపై నున్నవాఁడు’ షష్ఠ. ౧౫౩, అని వ్రాఁతప్రతుల నున్నది. ‘ఉల్ల’ యని యిపుడు వ్యవహారమున లేదు. ప్రయోగము ‘మూఁడు,యోజనము లిచ్చుటికి దాని కుల్లతెరువు, పట్టి వేచని యాదైత్యభర్తఁ గనుము’ అని శాంతిపర్వమునఁ గలదు. ముద్రణసమయమున నిది శోధకులకు గోచరము గాదయ్యె. కాన ‘అల్లకాంచనరథముపై నలరువాఁడు’ అని ‘ఉల్ల’ తేట తెల్లయగు ‘అల్ల’ యైనది. దీనిని మరల దిద్దవచ్చునా? పండితులు దిద్దరఁట. పండితులకైనను జిరోత్పన్నపదము లెట్లు తెలియును? దిద్ది తరములును రెండైనవఁట! అప్పుడు దిద్దినది దండితనమే యైనది; ఇప్పుడు దిద్దుటయో దుండగమే చుఁడీ!

‘మఱి’ యనియుఁ గలదు. ‘మఱి’ యనఁగా మఱపు. ఇది వెఱవంటిది. ‘మది మఱిగొన్నయట్టియెడ మానినికిం దనుఁ దాన కాచికో, లోఁదవిన’ భార. ఉద్యోగ. ఈ ‘మఱి’ తెలియక ‘మదిమది నున్నయట్టియెడ’ నని మార్పఁబడినది. మఱియు, భాగవతమున వామనఘట్టమున ‘తెఱవా విప్రులు పూర్ణులే......నీరంబునుం బోయుదే, మఱి లేకర్థుల దాసులఁ సుజనులఁ గమన్నింపుదే పైదలీ’అష్ట. 466, ఇట ‘మఱి’ నెఱుంగక ‘పోయు దే,మఱి కేయర్థుల’ నని ‘ఏమఱిక’ గా మార్చి శోధకు లేమఱిరి.

‘మందట’ యనఁగాఁ దగవు. జగన్మోహిన్యవతారఘట్టమున ‘మనకు వేల్పులకును మందట లేకుండఁ, బంచిపెట్టెద నని పడఁతి పూనె’ భాగ. అష్ట. 321, అని

యున్నది. ఈ'మందట' తెలియక యారాటముపెట్టినందున 'మాఱాటము'గా మాఱి నది.'మనముల సమ్మతించితమఱిమందటనాసభవారుతీర్చి' నారాయణకృతపంచతంత్రము ౧ ఆ. ఇట 'మందట' కు 'సమీప' మని శబ్దరత్నాకరమం దర్థ మున్నది. విను కుంభాండ యనేక కాలము...నాదగు భుజంబుల్ మందటం బొందినఁ' హరివంశము. ఉత్త. ౭ ఆ. ఇట 'మందట' యచ్చుప్రతుల 'ముచ్చట' యైనది. తెలియని మందటకన్నఁ దేట యగుముచ్చట మేలు గదా!

'దుడుకడుచు' అనఁగా మగ్న మగుట. కృష్ణబలరామబాలక్రీడావర్ణనమున 'అప్పంకముల దుడుఱకడువఁజొత్తురు' దశ.పూ. 289 అనియు, బ్రహ్మ గోగోపుల నంతర్హితులం జేసినఘట్టమున 'దుడుకనిమహిమాబ్ధి నజుఁడు ఱ దుడుకడిచె నృపా' దశ. పూర్వ. 547 యనియు నున్నది. ఇది తెలియక 'దుడుకడరఁ జొత్తు' రని మార్పఁబడినది. మరల 'దుడుకడువ' నని దిద్దుట దుడు కగునా?

భాగవతమున 'తీర్థీకుర్వన్తి తీర్థాని' ౧. స్క. ౧౩. అధ్యా. అని యున్నందులకు వ్రాఁతప్రతులఁ 'దీర్థసంఘంబులఁ దీర్థమింతురు' ప్రథ. 301 అనియున్నది. 'తీర్థమింతురు' అనియిప్పుడు వాడుట లేదు. 'ఉత్తరమింతురు' ఇత్యాదినన్నయప్రయోగములుశోధకుల కుపస్థితములు గావు. కనుక 'తీర్థసంఘంబుల ధిక్కరింతురు' అనిసవరింపఁబడినది. మఱి తాతగారిబొక్కినోటఁ జొచ్చియు నచ్చివచ్చినది గాన యది విడువరాదు. అట్టిదానిని దిద్దితిమా యంతకన్నఁ బాతకము లేదు. ముద్రణమహిమ'ముద్రణదేవతాకటాక్షము నకుఁ బాత్రము లైనతప్పులుగూడ దిద్దరానంతపవిత్రము లై యొప్పులు గులుకునా?

ఇట్టివి పెక్కులు చూపవచ్చును. వ్రాఁతప్రతులందు గ్రుడ్డిదెబ్బకును దప్పులు గలుగునే యందురేమో. ఔను! వానియందు శకటరేఫ మనియు లఘురేఫ మని యు భేద ముండదు. 'వాండు కాండు' అని యన్నియుఁ బూర్ణబిందువులే కాని యర్ధబిందువు చూపట్టదు. 'మంచ్చము రంగ్గము' అని యనవసరము లగుద్విత్వములును, 'శాయు' 'యెవ్వఁడు' అని యక్షరవ్యత్యయములును, 'కొరికె' 'నాలికె' అని యసమంజసరూపములును, బట్టినచోటఁ బెక్కులు గనుపట్టును. అయినను 'డాంబికములు' 'ధిక్కరింతురు' అనునచ్చుప్రతులసవరణలం బట్టి 'డంబకములు' 'తీర్థమింతురు' అని నిర్ణయించుకష్టమునకంటె 'వాండు' 'శాయు' అను నాకుప్రతులవ్రాఁతలను బట్టి 'వాఁడు' 'చేయు' అని దిద్దుకొనుసౌకర్య మేపాటియతిశయమో యభిజ్ఞులకుఁ దేట గాకపోవదు.

మఱియు శోధనమునకు నైపుణ్యమును గావలయు. పాండిత్య మున్నచోట నెల్ల నైపుణియు నియతముగా నుండదు. మఱియుఁ బండితులు తమతమదర్శనములచొప్పునఁ బాఠముల దిద్దుటయుఁ గలదు. స్వదర్శనాభినివేశపారవశ్య మనివార్య మగుట సహజమే కదా. ఈరెండుకారణములనుబట్టియు నచ్చుప్రతులఁ దప్పులు గలుగుట గలదు. ఈనిర్ణయము లెంతవఱకు సాధువులో ప్రకృతగ్రంథమునఁ బరామర్శింతము.

> శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోకర
> క్షైకారంభకు భక్తపాలనకళాసంరంభకున్ ౧ స్కం. ౧. ప.

ఇట క్రిందిగీఱలు గలవానిం జూడుఁడు. ఆరంభముననే హంసపాదము! మొట్టమొదటిపద్యముననే యతి తప్పినది. ఈతప్పు గ్రంథమున మఱెచ్చటనే నుండునేని వ్రాయసము గుమాస్తానిపయినో లేక కంపాసిటరు రామస్వామిమీఁదనో మోపవచ్చును. ఇట్లును గాదే! శోధకులకు రోషము వచ్చునని మహాకవికి యతి తెలియదందుమా! మొన్నటి తాతగారి కాగ్రహము వచ్చినను, నంతకంటె మునుపటిపోతనగారినిగ్రహము దగదు. కాన 'రక్షైకారంభకు భక్తపాలనకళాసంరంభకున్' అని దిద్దకుండరాదు.

> 'ఏతద్రూపం భగవతో హ్యరూపస్య చిదాత్మనః
> మాయాగుణై ర్విరచితం మహదాదిభి రాత్మని
> యథా నభసి మేఘౌఘో రేణుర్వా పార్థివోఽనిలే
> ఏవం ద్రష్టరి దృశ్యత్వ మారోపిత మబుద్ధిభిః. ౧-స్కం. 3-అధ్యా.

శ్రీధరవ్యాఖ్యా. అరూపస్య- చిదేకరసస్య, ఆత్మనో-జీవస్య, ఏతత్-స్థూలం, రూపం-శరీరం, భగవతో మాయాగుణైః, తస్యాః, గుణైః - మహదాదిరూపైః, విరచితం - కృతం, ఆత్మని - ఆత్మస్థానే, శరీరం కృత మిత్యర్థః॥ కథ మిత్యపేక్షాయాం స్వరూపావరణేన అధ్యాస ఇతి సదృష్టాంత మాహ॥ యథా వాయ్వాశ్రితో మేఘౌఘో, నభసి-ఆకాశే, అబుద్ధిభిః-అజ్ఞైః, ఆరోపితః, యథా వా పార్థివో రేణుః - ధూసరత్వాది, అనిలే, ఏవం, ద్రష్టరి - ఆత్మని, దృశ్యత్వం - దృశ్యత్వాది ధర్మకం శరీర మారోపిత మిత్యర్థః.

ఇంగల కచ్చుప్రతిపాఠము:-వినుమ రూపుండయినజీవుండు చిదాత్మకుండై పరఁగు-జీవునికిఁ బరమేశ్వరునిమాయాగుణంబులైన మహదాదిరూపములచేత నాత్మాధారస్థానముగా విరచితంబైన స్థూలశరీరంబు గగనంబునందుఁ బవనాశ్రితమేఘసమూహంబును గాలియందుఁ బార్థివధూళిధూసరత్వంబును నేరీతి నట్లు ద్రష్ట యనునాత్మయందు దృశ్యత్వము బుద్ధిమంతులు గానివారిచేత నారోపింపంబడు.

'ఆత్మని' అనుటకు 'ఆత్మస్థానే' యని యర్థము. ఇట 'ఆత్మాధారస్థానముగా' ననుట యెట్లు? స్థూలశరీరంబు' అనుటకుఁ గ్రియ యెద్ది? ఆరోపింపఁబడినది స్థూలశరీరమా? దృశ్యత్వమా? అన్వయ మేదియుఁ గానరాదు. అంతగా మూలానుగుణ్యమును లేదు.

వ్రాఁతప్రతులపాఠము — వినుమ రూపుండై యేకరసుండై యాత్మ యనఁ బరఁగుజీవునికిఁ బరమే... రూపంబులచేత నాత్మస్థానంబునందు విరచితంబైన స్థూలశరీరంబు... దృశ్యత్వమై... నారోపింపంబడు. ౧ స్కం. 67.

ఇట 'స్థూలశరీరము దృశ్యత్వమై యారోపింపంబడు' నని యన్వయము. ఇది చాల మూలానుగుణముగాఁ దెనిఁగింపఁబడినది. ఇట్లు మూలానుగుణ్యమును నన్వయమును గలయీపోతనపాఠమును గయికొనవచ్చునా? లేక యన్వయము చెడినను మూలానుగుణ్యము కొఱవడినను మనతాతగారియచ్చుప్రతిపాఠమే వలయునా?

'యత్రేమే సదసద్రూపే ప్రతిషిద్ధే స్వసంవిదా
అవిద్యయాత్మని కృతే ఇతి తద్బ్రహ్మదర్శనమ్॥
యద్యేషోపరతా దేవీ మాయా వైశారదీ మతిః
సంపన్న ఏవేతివిదుః మహిమ్ని స్వే మహీయతే॥' ౧-స్కం, ౩-అ.

శ్రీధరవ్యాఖ్యా॥ యత్ర-యదా, సదసతీ - కార్యకారణరూపే- స్థూలసూక్ష్మరూపే, స్వసంవిదా-స్వరూపసమ్యగ్జ్ఞానేన; ప్రతిషిద్ధే, భవతః. జ్ఞానేన ప్రతిషేధాగ్రహ త్వే తమేవహేతు మాహ-అవిద్యయా, ఆత్మని, కృతే-కల్పితే ఇతిహేతోః, తద్బ్రహ్మ-తదాజీవో బ్రహ్మైవభవతీత్యర్థః, కథం భూతం? దర్శనం - జ్ఞానైకస్వరూపమ్॥ వైశారదీ - విశారదః సర్వజ్ఞః ఈశః - తదీయా, దేవీ-సంసారచక్రేణ క్రీడన్తీ, ఏషా మాయా, మతిః-విద్యా... అయంభావః —యావదవిద్యాత్మనా ఆవరణ విక్షేపౌకరోతి తావన్నోపరమతే - యదాతు సైవవిద్యారూపేణపరిణతా... స్వయమేవోపరమేదితి.

అ-ప్ర—అప్పుడీస్థూలసూక్ష్మరూపంబులు రెండును స్వరూప సమ్యగ్జ్ఞానంబున నిషేధింపంబడుననితెలియు-నవిద్యంజేసి యాత్మకుఁ గల్పింపంబడె ననియెడిహేతువువలన నప్పుడు జీవుండు బ్రహ్మదర్శనమను జ్ఞానంబున కధికారియగు - నట్టిబ్రహ్మజ్ఞానమతి - విశారదయై యీశ్వరునిపై క్రీడించు-నట్టిమతిప్రకాశంబున నవిద్య యనంబడుచున్నమాయ యుపరతయై. ౧ స్కం. 67.

ఇట 'యదా-తదా' యనునన్వయము లేదు. 'ఎప్పుడు స్థూలసూక్ష్మరూపములు స్వరూపసమ్యగ్జ్ఞానమున నిషేధింపఁబడునో యప్పుడు జీవుఁడు బ్రహ్మమగు' నని యర్థము. నిషేధింపఁబడు నని తెలియు టేమి? ఆరూపములు 'ఆత్మని కృతే' ఆత్మయందుఁ గల్పితము లని యుండఁగా 'ఆత్మకుఁ గల్పితము' లెట్లు? తద్బ్రహ్మ-తదాజీవః బ్రహ్మైవభవతి' అని యుండఁగా 'బ్రహ్మదర్శనం బనుజ్ఞానమున కధికారి యగు' నఁట! బ్రహ్మదర్శనజ్ఞాన మేమి? ఇటదానికిఁ బ్రసక్తి యెట్లు? 'అట్టిబ్రహ్మజ్ఞానమతి-విశారదయై యీశ్వరునిపై క్రీడించు' దీని కర్థ మేమి? బ్రహ్మజ్ఞానమతి క్రీడించుచున్న దని యన్వయమా? మతి యనఁగా విద్య యని వ్యాఖ్య; విద్యారూపమున మాయ పరిణత యగుట చెప్పఁబడినది. ఆమతి యిట బ్రహ్మజ్ఞానమతి యయ్యెనా? లేక అతివిశారదయై యని పదచ్ఛేదమా? 'అట్టిమతిప్రకాశంబున నవిద్య యనంబడుచున్నమాయ' ఇటఁ గూడ 'మతి' వచ్చిన దేల? మూలమునందలి 'మతి' కర్థము తెలియనందున నది యిన్నిగతులు పడినది. పోనిండు. ఈమతిప్రకాశ మేమి? మూలమున నిందులకు గమకము గానరాదు. 'వైశారదీ' అనుటకు 'విశారదః సర్వజ్ఞః ఈశః తదీయావైశారదీ' అని వ్యాఖ్య. దీనికా 'విశారద యై యీశ్వరుని పై' యని తెనుఁగు?

ఇటీవలియచ్చుప్రతిపాఠము—ఎప్పుడు స్థూల... నిషేధింపఁబడు ననియును నవిద్యంజేసి యాత్మకుఁ గల్పింపఁబడు ననియును దెలియు నప్పుడు జీవుండు బ్రహ్మదర్శనంబుల కధికారి యగు దర్శనం బన జ్ఞానైకస్వరూపంబతివిశారదయైయీశ్వరునిపై క్రీడించు చునవిద్యయనంబడుచున్నమాయయుపరతయె.

ఇందు 'ఎప్పుడు-అప్పుడు' అనునన్వయము గలిగెను. 'మతి' కిందు గతులు లేవు. బ్రహ్మదర్శనజ్ఞానమును గానరాదు. 'అవిద్యంజేసి యాత్మకుఁ గల్పింపంబడెననెడి హేతువు' అనుహేతువుమాత్రము పోయినది. మఱికొన్ని సవరణలును గలిగినవి. కాని తక్కినదోషము లన్నియుఁ గలవు. వ్రాఁతప్రతులపాఠము చూడుఁడు—

ఎప్పు డీస్థూలసూక్ష్మరూపములు రెండును స్వరూపసమ్యగ్జ్ఞానంబునంజేసి ప్రతిషిద్ధంబు లగు నవిద్యంజేసి యాత్మను గల్పింపంబడ్డ వనెడిహేతువువలన నప్పు డాజీవుండు బ్రహ్మదర్శనం బగు దర్శనంబనజ్ఞానంబునంజేసి యేకస్వరూపంబు విశారదుఁ డై నయీశ్వరునిదై క్రీడించుచు నవిద్య యనఁబడుచున్నమాయ యుపరత యై. ౧ స్కం. 67

మూలమున కిట్లు మిక్కిలియనుగుణ మైనయీపాఠ మచ్చుప్రతులం బడి తాఱుమాఱైనది; తప్పులకుప్ప యైనది. మరల దిద్దవచ్చునా? ముద్రణదేవతాకటాక్షపాత్రమై యది పవిత్రీకృతమై యున్నదే! ఆదేవతకును మ తాతాతకును గోపము వచ్చినను వచ్చుఁగాక. మహాకవి కపశయము దగదు. కాన దిద్దఁబడినది.

ఒకవచనమున నిన్ని దోషములు! మీఁదఁ బెక్కువచనములం దిట్లెన్నిదోషములు దిద్దంబడి యున్నవో మఱి పద్యములం దెన్నిసవరణలు సేయంబడినవో యభిజ్ఞులై మూలమును వ్రాఁతప్రతులను నారయుప్రయాసమునకు వెనుదీయనిభాషాభిమానులకుఁ దెలియకపోవదు. ఇంతే కాక వచనములం దెన్నికూర్పులు చేర్పంబడినవియు నెన్నిమార్పులు సేయంబడినవియు నెన్నిమతములు త్రిప్పంబడినవియు నాయాపుటలం గలకుండలీకరణాదులచేతను గ్రందిపాఠాంతరములచేతను దేటతెల్లము గాఁగలదు గావున నిట విస్తరించి తెలుప నవసరము లేదు. అన్నియు నిట సంకలితముగా రూపింపఁ బూనినచో నీవిజ్ఞప్తి వేయుమడుంగు లెచ్చును. వేయిమాట లేల? ఒకభాగవతమునంత గ్రంథమే కావచ్చును. వానిని మూలముతోను వ్రాఁతప్రతులతోను బోల్చిచూచుట కవకాశము మిక్కిలియు వలయును గావునఁ జదువరులు చూడక యే పోవుదురని తలఁచి యొక్కొక్కస్కంధమునందు నొకటి రెండు దోషములను విస్తరభీతిచేఁ జన్నవైనవానినిగా స్థాలీపులాకన్యాయమున నెత్తిచూపుట సరసము.

---

'లోకమంగళదను శ్లోకరూపంబున' ద్వితీ-261

ఇందులకు 'భగవతాచతుశ్శ్లోక్యాం సంక్షేపేణ ప్రోక్తమ్' అని మూలము. కావున 'లోకమంగళచతుశ్శ్లోకిమూలంబున' అని వ్రాఁతప్రతులపాఠము.

---

విదురమైత్రేయసంవాదమున

క. అగుణున కవికారునకును, జగదవనోద్భవవినాశసత్కర్మములుం
దగులీల లయిన నాలేఁడు, సగుణుం డై యుండు టెట్లు సౌజన్యనిధీ.

సీ. అనిన నర్భకుగతి ననఘుండు మైత్రేయ, మునిఁ జూచి విదురుఁ డి ట్లనియె. తృతీ-232-233

ఇట విదురుఁ డర్భకునిగతి మైత్రేయు నడుగలేదు. నిర్గుణుఁడును నిర్వికారుఁడు నగు నీశ్వరునికి లీల లెట్లు? అని ప్రశ్నము. 'అర్భకవల్లీలాపియుజ్యతే' అనువ్యాఖ్యావం క్తిచొప్పున 'అర్భకునివలె' ననియు త్తరము కాన 'అన నర్భకునిగతి ననవుడు మైత్రేయ యని యుండవలయును.

---

చ. మఱి యపు డమ్మహాత్ముఁ డసమానబలుండు మహోగ్రబాణముల్
గఱకరిఁ దాఁక నేసి భుజగర్వ మెలర్ప విరోధిమర్మముల్. చతు-336

ఇట 'గఱకరి' తప్పు; 'గఱి గఱి' యని యొప్పు.

'యస్యామేవకవయ ఆత్మానమవిరతంవివిధవృజినసంసారపరితాపోపతప్యమాన మనుసవనం స్నాపయన్తస్తయైవనిర్వృత్యా పరయాహ్యపవర్గమార్గ మాత్యంతికం పరమపురుషార్థమపి స్వయ మాసాదితం నో ఏవాద్రియన్తే' పంచ-సప్తమాధ్యాయః.

ఇందుల కచ్చుప్రతి—పెద్దలు భాగవతు లగుటంజేసి సంప్రాప్తసర్వపురుషార్థు లగుచు వివిధ వృజినహేతుకం బగుసంసారతాపంబును బాసి యవిరతంబుఁ దద్భక్తియోగామృతస్నానంబునంజేసి పరమపురుషార్థం బైనమోక్షంబును జెందుదురు. పంచ-౧ అ. 88.

మూలమున భక్తిభోగ్యతాతిశయమున మోక్షము తనంత లభించినను బెద్దలాదరింప రని యుండఁగా మోక్షంబు నొందుదురఁట! వ్రాఁతప్రతులందు.

'హరికథామృతపానంబున నిర్వృతు లై పరమపురుషార్థం బైనమోక్షంబు నపేక్షింపరు'

అని యున్నది. దీని నేల మార్చిరో తెలియరాదు. మోక్షసాధనములలో భక్త్యుత్కర్షము శోధకులమతము గాదో!

---

కాశ్యపపత్నీవర్ణనమున.

సీ. కామితప్రదుఁ డైనకశ్యపుకాఁగిట, ముచ్చటఁ దీర్తు రేముద్దరాండ్రు
రఖిలలోకములకు నవల నై జగ మెల్లఁ, బూజింప నుందు రేపువ్వుఁబోండ్లు షష్ఠ. 255

ఇట కాశ్యపపత్నులు లోకముల కవల నై యుండు టేమి? 'యత నూత మిదం జగత్' అను మూలముచొప్పున 'లోకమున కవ్వ లై' అని యుండవలయును. అందే గీతమున

'వారికలగంపకడుపుల నేరుపరుల, నరిదిబిడ్డలఁ బడసినబిరుదుసతుల
నామములు నన్వయంబులు' షష్ఠ. 255

అని యున్నది. ఇట మీఁదఁ గాశ్యపపత్నులనామాదులు చెప్పంబడుచున్నవి గానయాపత్నులనే 'బిరుదసతుల' యని యిట కవి పేర్కొన్నాఁడు. అనఁగా 'కలగంప కడుపుల నేరుపరులను – అరిదిబిడ్డలను – బడసిన బిరుదుసతుల నామములు' అని యన్వయము. 'వారి' యనునది పూర్వసీసపాదములందు 'ఏవింత రాండ్రు' ఇత్యాదులచేఁ బ్రతిపాదిత లయినయాపత్నులనే పరామర్శించుచున్నది. కాన దీని కన్వయ మెట్లు? ఏకవాక్యముననే 'వారి' 'బిరుదుసతులు' అనురెంటిలో నేదే నొకటి యుండవలయును గాని రెండు నుండిన నన్వయము గలుగదు. రెండును భిన్నవాక్యములలోని వేని 'వారి' అనువాక్యమునకు సమాపక మేది? కనుక నిది తప్పు. 'వారి కలగంపకడుపుల నేలుపగుప, నరిది; బిడ్డలఁ బడసినబిరుదసతుల' అని దిద్దుకొనవలయును. యతిభంగ మన్నచో నీకవి (సింగన) యుభయరేఫమైత్రిని బాటించినవాఁ డని తెలియునది.

దేవేంద్రునిసభాస్థితివర్ణనమున.

'నిండుపున్నమనాఁడు గండరించినచంద్ర, మండలశ్రీలతో మాఱుమలయ
భద్రవిద్యోతాతపత్రంబు గ్రాలుచు, మిన్నేటితరఁగల మేలుకొలుపఁ
గలితదివ్యాంగనాకరతలచాతుర్య, చామీకరశ్రేణి జాడపఱుప' షష్ఠ. 260

ఇట 'ఆతపత్రము గ్రాలుచు మిన్నేటితరఁగల మేలుకొలుపు' టేమి? దివ్యాం

గనాకరతలచాతుర్యచామీకర శ్రేణి జాడపఱచుట’ యన నర్థము గలదా? ‘మండలశ్రీతోడ మాఱుమలయ భద్రవిఖ్యాతాతపత్రంబు గ్రాలంగ’ ననియును ‘మిన్నేటితరఁగల మెలుపుగొలుపఁ గలితదివ్యాంగనాకరతలచ్చాతుర్యచామర శ్రేణులజాడపడఁగ’ ననియు దిద్దునది. ‘చామరవ్యజనాదిభిః’ అని మూలము. పూర్ణచంద్రమండలశ్రీతోడ నాతపత్రమునకును, మిన్నేటితరఁగలతోడఁ జామర శ్రేణులకును సామ్యము; కాని యాతపత్రము మిన్నేటితరఁగల మేలుకొలుపలేదు. మిన్నేటితరఁగల మేలుకొలుపుటకుఁ జామీకర శ్రేణులు జాడపఱుపలేదు. చామరములు చామీకరములై యనర్థము పుట్టించినవి!

---

శ్లో॥ భూతాని తై స్తై ర్నిజయోనికర్మభి ర్భవన్తి కాలే న భవన్తి సర్వశః
న తత్ర హాత్మా ప్రకృతావపి స్థిత స్తస్యా గుణై రన్యతమో నిబధ్యతే॥ సప్తమ. ౨. అ.

ఆ-ప్ర. క. కలుగును మఱి లేకుండును, గలభూతము లెల్లఁ గాలకర్మవశములై
నిలువఁడు ప్రకృతిం దద్గుణ, కలితుఁడు గాఁ డాత్మమయుఁ డగమ్యుఁడు దలఁపన్.

మూలమున ‘ప్రకృతావపిస్థితః’ అన్నందులకు ‘నిలువఁడు ప్రకృతి’నని తెనుఁగున్నది. ‘నిలువఁబడుఁ బ్రకృతిఁ దద్గుణ’ అని దిద్దుపది, ‘క్రోడసద్గ్రంథంబుల్’ క్రోడమునకు సద్గ్రంథము లేమి? సద్గంధము లని యుండవలయును. సప్తమ. 168

మత్స్యావతారవర్ణనమున.

‘గఱులు సారించు మీసలు గడలుకొలుపు
నొడలు జళిపించుఁ గన్నులబొమల నార్చు. అష్టమ. 724.

అని యున్నది. మత్స్యము మీసలు గడలుకొలుపుటయు కనుబొమల నార్చుటయు వింతలోనివింత. మత్స్యమప్రాకృత మన్నను, దాని కీయపూర్వవ్యాపారము లనవసరములు గావున వర్ణింప నావశ్యకములు గావు, ‘మీసలఁ గడలు నివురు’ ననియుఁ ‘గన్నులఫాలప మార్చు’ ననియు దిద్దునది.

‘నయత్ప్రసాదాయుతభాగలేశమ్’ అష్టమ. ౨౪ అ.
ఇందులకు ‘నీప్రసన్నతఁ, బదివేలవపా లిలేశభావము’ అష్టమ. 731.

అని యచ్చుప్రతి. ఇట ప్రసన్నతలోనిపదివేలవపాలు ‘ఇలేశభావము’ గాదు. ‘ప్రసన్నతపదివేలవపాలి ‘లేశ’ భాగము’ అని దిద్దునది.

---

కుమారవనమును జొచ్చినసుద్యుమ్నుఁడు శివునిశాపమున స్త్రీ కాఁగా వసిష్ఠప్రార్థనమున నద్దేవుఁడు

‘స్వాంచ వాచ మృతాంకుర్వ న్నిదమాహ విశాంపతే
మాసం పుమాన్ సభవితా మాసం స్త్రీ తపసా తవ’ నవ. ౧ అ.

అని యొకమాసము పురుషుఁడుగాను నొకమాసము స్త్రీగాను నుండ నను గ్రహించినాఁడు. ఇందుల కచ్చుప్రతిని

'తనమున్నాడినమాటయుఁ నిజముగాఁ దన్మానికిం బ్రీతిగా
మనుజేంద్రుండు నెలఁ నెలం బురుషుఁడై మాసాంతరం బైనఁ గా
మిని యై' నవ. 30౹

అని యున్నది. ఇట నెలఁ నెలం బురుషుఁడగు నేనిఁ గామిని యగుటకు మాసాంతర మెక్కడిది? ఇది మూలానుగుణమును గాదే! 'మనుజుండుఁ నెల వో నెలం బురుషుఁడై' అని యుండవలయును. ఇట మనుజుఁడనఁగా మనుష్యుఁడని యర్థము కాదు. మనువుపుత్రుఁడై నసుద్యుమ్నుఁ డని యర్థము. మనుష్యుఁ డని యర్థము సేసి యిట్లనర్థము సేసిరి కాఁబోలు. మంచుకంటె రోగమే మంచి దయ్యె.

'భువి దూఁ భువిఁ దూఱు నబ్ధి సార నబ్ధిం జొచ్చు' నవ. 107

ఇట యతి తప్పు. 'అబ్ధుల్ సొచ్చు' నని యుండవలయును.

'ప, ర్యాప్తస్వేదజలాంగి వారిసముదాయాలంకృతఁ భార్గవిన్' నవ. 558

నూతినుండి 'పర్యాప్తస్వేదజలాంగి' యై లేచిన దేవయాని' 'వారిసముదాయాలంకృత' యైనదా? ఇం దేమి సారస్యము గులికెడినో? 'ఆళి సముదాయస్వర్గవిఁ భార్గవిఁ అని యుండవలయును, ఇందలి యర్థము ననుప్రాసవిభవమును జూడుఁడు. తాతగారున్నచోఁ జెప్పును.

---

శకటాసురభంజనమున

'కదాచి దౌత్థానికకౌతుకాప్లవే జన్మర్క్షయోగే సమవేతయోషితామ్' దశ. ౧ అ.
వ్యాఖ్యా॥ ఉత్థానం—'శిశోరంగపరివర్తనం, తత్రకరణీయే, కౌతుకాప్లవే-ఉత్సవాభిషేకే'

అని యున్నది. ఇందులకు

'బాలకుఁ డొదికిలఁబడ నేర్చె నని జన్మ,నక్షత్రమునం దొక నాఁడు సంగు
పొలఁతి వేడుకతోడఁ బోరుగు ప్రేతలఁ జేరి' దశ. పూ. 248

అని యున్నది. మూలమందలి 'కౌతుకాప్లవము' నకు నిట దెనుఁగు లేదు. కాన 'పొలఁతి వేడుకబోర్కుఁ బోయ ప్రేతలఁ జేరి' యని యుండవలయును. 'బోగ్కు' అని ప్రత్యేకపదముగా నిఘంటువులందు లేదు. కాన 'బోర్కు' 'పొరుగు' అయినది.

'పట్టి యలరుఁబోఁడి పట్టి యాతం డని
గట్టితలఁపుతోడఁ గట్టెఁ గాక
పట్టి కడుపు పెక్కుబ్రహ్మాండములు పట్టు
టెఱిఁగ నేనిఁ దల్లి యేల కట్టు. దశ. పూ. 383

ఇట 'యలరుఁబోఁడి' యని యుండఁగా మరల 'తల్లి' యని చెప్పవలసిన యావశ్యకత లేదు. అది యందమును గాదు. 'పట్టి యెల్లబోఁటిపట్టి యాతం డని' యని పాఠము. 'ఎల్లబోఁటి గోపాలురమంద గాదు.' దశ. పూ. 1142 అని యాస్కంధము ననే ప్రయోగాంతరము గలదు గాన యిది యబ్బురము గాదు.

'వ్రేలం ద్రొక్కనిపాదరేణువులు పై వేష్టించినం జాలదే' దశ. పూ. 574.

పాదరేణువులు వ్రేలం ద్రొక్కని వెట్లు? మూలమున 'యద్గోకులేఽపి కతమాఙ్ఘ్రిరజోఽభిషేకమ్' దశ. ౧౪౮. అనియున్నది. 'వ్రేలం దొక్కనిపాద రేణువు'లని యర్థము. గోపపర్యాయమగు 'వ్రేలు' అంగుళిపర్యాయమైన 'వ్రేలు' అయ్యె. వ్రేలు మాఱఁగా 'ఒక్కని'యు 'త్రొక్కని' యయ్యె.

'కూడి గ్రహంబులు దిరుగఁగ, మేడలతుదినెలవులందు' దశ. పూ. 1600.

'తుదినిలువులందు' అని యుండవలయు. నిలు వనఁగా నంతస్తు. 'పొలుచు చతుర్దశభువనముల్ దనకీర్తి,యాడెడినిలువులమేడగాఁగ' నిర్వచనోత్తర రామాయణము. 'నాటకసాలమేడపైనిలువున' మనుచరిత్రము.

ఇట్లు పెక్కులు చూపవచ్చును. మూలమును జూచి, పోతనకవితావైలక్ష్యమును బరిశీలించి, తక్కినకవులరచనావిశేషముల విమర్శించి, పెక్కువ్రాఁతప్రతుల శోధించి, నాకావించినసవరణలును, బూరించినగ్రంథపాతములును, విడఁదీసినకూర్పులును, దేటపఱిచిన మార్పులును సమంజసములో కావో యనువిషయమున గుణదోషగ్రహణపారీణు లగుసహృదయశిరోమణులే ప్రమాణము. తప్పో యొప్పో తమమనస్సుల నాటియున్నతాతలనాఁటిపాఠములను దీయలేకయుఁ, గావుననే తమంతటఁ దెలిసికొనఁ బూనకయుఁ 'బండితులశోధనములు' 'తాతగారిపాఠము'లని యీపూరిపుడకలనే పాశుపతాస్త్రములుగాఁ గొని తమపక్షము నిలుపుకొనఁజూచువారి కీవిజ్ఞప్తియం దవగాహించుట గజస్నానమువంటిదే యగును. వీరి కాపండితులే వ్యాసులు; ఆతాతగారే పోతయ. గ్రంథమునుగూర్చి యీవిజ్ఞప్తియందుఁ గల విషయములను దక్కం గలవిషయములను దమంతటఁ దెలిసికొనఁ జాలుకోవిదులయ్యు నసూయవలన నంగీకరింపనిచలపాదులను దెలుప బ్రహ్మదేవునివశమును గా దనుట విదితమేకదా! అట్టివారి కావ్యాసులే వచ్చి యిందలికూర్పులు మార్పులు తనమతము గా దని వాదించినను బోతనగారు తనకవనము కా దని యొట్టుపెట్టినను మెచ్చు గలుగ దన్న నిఁక నీవిజ్ఞప్తి వారిమది కెక్కునా? మొట్టమొదట దద్దినవారు మనీషులే. 'ప్రమాదో ధీమతా మపి' యన్నట్లు మనీషులకును బ్రమాదములు గలుగక పోవవు. మఱియుఁ బుస్తకములఁ దొలుతొలుత వ్రాఁతనుండి యచ్చునకుఁ దెచ్చునపుడు చిక్కులు పెక్కులుగలుగును; చిరోత్పన్నము లైనపదాదులును జిక్కులఁబెట్టును. కాన దప్పులుగలుగుటఁ గ్రోసిపుచ్చ నలవిగాదు. పిదప భాషావిషయమునఁ బరిశ్రమ మెక్కుడగుచు రాఁగా, దానంజేసి నూతనవిషయములు దేలుచునుండఁగా మునుపటిపండితులశోధనమునకుఁ జిక్కనివియు వారిమదికిఁ దెలియనివియు నగు దోషములు పెక్కులు చూపట్టి భాషావృద్ధికొలఁదిని బైపైని సవరింపఁబడుచుండును. ఇది సత్యమగుట పెక్కుభాషాచరిత్రముల సిద్ధము. ఇది తెలియక నాగరికత వర్ధిల్లి భాషాభివృద్ధి గావించుచున్నయిక్కాలమున 'శాస్త్ర మపౌరుష మాద్య' మ్మనుము

క్కను గొని పూర్వికము లెల్లఁ బ్రమాణములే యని సాధించు గ్రుడ్డిఛాందస మంద ము గాదు. పక్షపాతదూరు లగుసత్యాన్వేషణపరులసందేహనివృత్తికి సాధనములు కలవుగావు. ప్రాచ్యలిఖితగ్రంథభండారమున వ్రాఁతప్రతులు వలయునన్ని యున్నవి. వలయునేని, ప్రతులు నాయొద్దను గలవు; చూచుకొనవచ్చును. అట్లుగాక యసూయా ళువులై దురభిమానమున 'చెడినది మాఱినది' యని కట్టుఁగతలు ఘంటాపథముగాఁ జాటినను, వాడవాడల ఢంకాకొట్టినను, దిక్కుదిక్కుల శాసనములు చెక్కించినను సత్యము సత్యమై నిలుచునుగాని యసత్యముగాదు. 'సత్యమేవ జయతి' యనునానుడి తప్పదుగదా. సత్యవ్యాపనకాంక్షు లగుపండితులు నరుదుగారుగదా! భాషాభిమాన మాననీయులకును సత్యము ప్రియము గాకపోదే. కాన విచారము లేదు. భాగవత విషయమున వ్యాసులను మించినపండితుఁడు మాకు లేఁడు, పోతనను మించిన తాతగారును గలుగరు. మాకే కాదు; మీకును గలుగరు; మఱెవ్వరికిని గలుగరు. కాన యీయిద్దఱిని మున్నిడుకొని పోతన్నగ్రంథశోధనము గావించితిని. తప్పులను దప్పులుగాఁ జూపుదురేని బాలురయినను వంద్యులే. ఒప్పులను దప్పులుగాఁ బ్రాజ్ఞులు చూపిరేనియు బాలుఁడుగూడ నభినందింపఁడుగదా. కాన గుణదోషము లారసి దోషముల నెల్లరును దెలుపఁ బ్రార్థితులు.

ఇట్లు

త. తేవప్పెరుమాళ్లయ్య.

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

# పోతనాదికవికవిత్వాదివిమర్శనము.



శ్రీమదాశ్రితజనరక్షాపరాయణుం డగునారాయణునియంశంబున నవతరించినవ్యాసుండు, వివిధతత్త్వార్థప్రతిపాదకంబు లగుసంవాదంబులును, బహుధర్మావబోధకంబు లగుపుణ్యరాజచరిత్రంబులును, భక్తిరసోద్దీపకంబు లగుభగవజ్జన్మకర్మాద్యభివర్ణనంబులుం గలిగి సకలకలికల్మషాపహంబుగా నుండునట్లు మహాభాగవతపురాణంబును రచియించుటంజేసి పఠనశ్రవణాదిపరాయణు లైన యాస్తికశిరోమణుల కెల్ల నది యైహికాముష్మికశ్రేయఃప్రదంబు నత్యంతోపాదేయంబు నై యొప్పుచుండు. అయిన నది గీర్వాణభాషం బ్రణీతం బై, యందును దద్భాషాప్రవీణులకు మాత్రంబె సుగమం బై యుండుటం జూచి యందలిమహార్థంబులు ముముక్షువుల కెల్ల సుబోధములుగాను రమణీయములుగాను గావింప దొరఁకొని శ్రీరామానుగ్రహసమాసాదితసరసకవితాసామ్రాజ్యధురంధరుం డగుబమ్మెరపోతనామాత్యుండు మృదుమధురాతిసుందరపదసందర్భసౌభాగ్యంబు దీపింప నవరసభావబంధురంబుగా నమ్మహాగ్రంథంబు నాంధ్రీకరించి యనపాయం బగుయశఃకాయంబు నొంది కృతార్థుం డయ్యె.

## భాషాంతరీకరణము.

మధురసఝరీమాధురీధురీణనిరుపమాననిరర్గళకవిత్వధారావిరాజితుం డగు పోతనామాత్యుం డిమ్మహాపురాణంబునందలిపండ్రెండుస్కంధముల సహృదయహృదయంగమం బగురచనాసరణి పురణింపఁ బూర్ణముగాఁ దెనిఁగించి కీర్తిశేషుం డై నపిదపఁ గొన్నికారణంబులచే నందలిభాగంబులు కొన్ని యుత్సన్నంబులు కాఁగా వానిని నారయామాదులు పూరించి రని పండితపరంపరామూలంబున నెల్లరకుం దెల్లం బై యున్నదికదా. ఇది యిట్లుండఁ గవులకు నొకగ్రంథమును సరిగా భాషాంతరీకరించుటకన్న నొకదానిని సొంతముగా రచించుట మఱింత సుకరము. ఏ లనఁగా సొంతకృతియందుఁ దమకవితాపటిమకును బాండిత్యపరిమితికిని ననురూపము లగువర్ణనంబులును విషయములు నలవరించుకొని దానిని రచింపవచ్చును. భాషాంతరీకరణమందో యట్లు సేయ నయితి కాదు. ఇఁక బహువిధవర్ణనాసందర్భసమలంకృతంబై, నానాతత్త్వవిషయభూయిష్ఠంబై, విపులప్రబంధబంధురంబై కవితాప్రౌఢి నొప్పారునిమ్మహాపురాణంబు నన్యూనంబుగా భాషాంతరీకరించుట సుక

రంబని చెప్ప నొప్పునే? అది రసోచితచిత్రవిచిత్రరచనాచమత్కృతియు, నమేయవర్ణనాచాతురియుఁ, దత్త్వార్థపరిజ్ఞానంబును, నిరుపమప్రతిభావిస్మృమరదుర్వారకవిత్వధారాప్రవాహంబును గలమహాకవికిం గాక యందఱ కలవి గాదు. అట్టికవియే పోతన యని యాతనికవిత్వమే చాటుచున్నది. తక్కినగంగనాదులకవనంబులు పోతనదానిం బోలె నంతరసవంతములును రచనావైచిత్రి గలవియుఁ గావు. వేదాంతవిషయవైదుష్యంబునఁ గాని, తత్త్వార్థనిరూపణనైపుణ్యంబునఁ గాని వారు పోతనకంటెఁ దద్దయుఁ దక్కువ యని చెప్ప నొప్పును. మొత్తమునకు సింగనకవనంబు మాధుర్యమునను, గంగనది మృదుత్వమునను, బోతనకవితారీతిం గొంత పోలియుండును.

పోతనకవితావిలాసవైచిత్ర్యంబులు పీఠికాంతరమున విపులముగాఁ దెలుపఁబడి యుండుటవలన, వానిని సాకల్యంబున నిట వివరింపఁ బని లేదుగాని, యిప్పురాణంబును దెనిఁగించినవారింగూర్చి వేఱువేఱ మఱికొన్నివిశేషంబులుమాత్ర మిందుఁ బొందుపఱుచు చున్నాఁడను.

పోతన.

పోతన రచించినభాగము లెల్ల నద్వైతపరములుగానే యున్నవి. ఇతం డిప్పురాణము నంతయు, ముఖ్యముగాఁ దత్త్వఘట్టములను, శ్రీధరాచార్యవ్యాఖ్యానము ననుసరించియే తెనిఁగించి యున్నాఁడు. మూలార్థము కొంచెము గూఢముగా నుండునేని దానిని వివరించువ్యాఖ్యానపదములను గొన్నింటిని గూడ గద్యపద్యములందు నీటుగా దీటుకొల్పి దానిని డీకవలెఁ దేటపఱుచుచున్నాఁడు. ఎట్లన,

దశమస్కంధము – షోడశాధ్యాయము.

కాళియపత్నీస్తుతిఘట్టము.

నమోఽనంతాయ సూక్ష్మాయ కూటస్థాయ విపశ్చితే
నానావాదానురోధాయ వాచ్యవాచకశక్తయే॥
నమః ప్రమాణమూలాయ కవయే శాస్త్రయోనయే।

శ్రీధరవ్యాఖ్యానము.

౪౩॥నమఇతి॥అనంతాయ, అహంకారాపరిచ్ఛేదాత్;అతః, సూక్ష్మాయ,అదృశ్యత్వాత్; అతఏవ, కూటస్థాయ, ఉపాధికృతవికారాభావాత్: అతఏవ విపశ్చితే-సర్వజ్ఞాయ; ॥నానేతి॥ నానావాదానురోధాయ-అస్తి,నాస్తి, సర్వజ్ఞః, కించిజ్జ్ఞః, బద్ధః, ముక్తః, ఏకః అనేకః, ఇత్యాదీన్ నానావాదాన్, అనురుణద్ధి-మాయయా నువర్తతే, యస్తస్మై; వాచ్యవాచకశక్తయే-అభిధానాభిధేయశక్తిభేదాదపి, నానాత్వే ప్రతీయమానాయ ॥౪౪॥ నమఇతి॥ ప్రమాణమూలాయ – చక్షురాదీనాం చక్షురాదిరూపాయ, అతఏవ, కవయే – స్వయం తన్నిరపేక్షజ్ఞానాయ; కుతః, శాస్త్రయోనయే-వేదాత్మకనిశ్వాసాయ.

## ఆంధ్రీకరణము.

మూఁడహంకృతులచే ముసుఁగువడక.

తే. నెఱి ననంతుఁడవై దర్శనీయరుచివి, గాక సూక్ష్ముఁడవై నిర్వికారమహిమఁ
దనరి కూటస్థుఁడన సమస్తంబు నెఱుఁగు, నీకు మ్రొక్కెద మాలింపు మనిరి లాత్మ.

వ. మఱియుఁ గలండు, లేఁడు, సర్వంబు నెఱుంగు, నించుక యెఱుంగు, బద్ధుండు, ముక్తుం, డొకం, డనేకుండు నను నివి మొదలుగాఁ గలవాదంబులు మాయవలన ననురోధింపుదువు కావున నానావాదానురోధకుండ వయ్యు, నభిధానాభిధేయశక్తిభేదంబువలన బహుభావప్రతీతుండ వయ్యును, జక్షురాదిరూపంబులవలనఁ బ్రమాణమూలకుండ వయ్యు, నిరపేక్షజ్ఞానంబు కలిమిఁ గవి వయ్యు, వేదమయనిశ్వాసత్వంబువలన శాస్త్రయోని వయ్యు.

*ఇటఁ గ్రిందిగీఁతలు గలవి యెల్లఁ గవి కేవలవ్యాఖ్యానమునుండి మాత్రము గైకొని తెనిఁగించిన వగుటచే నతం డావ్యాఖ్యానమునే యనుసరించి రచించినాఁ డనుట తేటతెల్లగఁ దెలియ నగును. మఱియుఁ గేవలకావ్యసరణికి సరసములుగాఁ దోఁపనితత్త్వవిషయములను గూడ నతిపేశలకవనంబున హవణించి మనోహరములనుగాఁ దోఁపించుటయం దీకవిశిఖామణి మిక్కిలి నిపుణుఁడు.

### సప్తమస్కంధము – పంచమాధ్యాయము.

శ్లో. మతి ర్న కృష్ణే పరత స్స్వతో వా మిథోభిపద్యేత గృహవ్రతానాం
అదాంతగోభి ర్విశతాం తమిస్రం పునఃపున శ్చర్వితచర్వణానామ్॥

తెనుఁగు.

ఉ. అచ్చపుఁజీఁకటిం బడి గృహవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచుఁ బుట్టుచున్ మఱలఁ జర్వితచర్వణు లైనవారికిం
జెచ్చెరఁ బుట్టునే పరులు సెప్పిన నైన నిజేచ్ఛ నైన నే
మిచ్చిన నైనఁ గానలకు నేఁగిన నైన హరిప్రబోధముల్.

మూలము.

శ్లో. న తే విదు స్స్వార్థగతిం హి విష్ణుం దురాశయా యే బహిరర్థమానినః
అంధా యథాంధై రుపనీయమానా వాచీశతంత్ర్యా ముఱుదామ్ని బద్ధాః.

శ్లో. నైషాం మతి స్తావదురుక్రమాంఘ్రిం స్పృశ త్యనర్థాపగమో యదర్థః
మహీయసాం పాదరజోభిషేకం నిష్కించనానాం న వృణీత యావత్.

---

క్రిందిగీఁతలు మూలమునుండికాని వ్యాఖ్యానమునుండికాని గైకొని తెనిఁగించినవానిని జూపుచున్నవి. ఇట్లే తక్కినయెడల నెఱుంగునది.

తెనుఁగు.

ఉ. కాననివాని నూఁతగొని కాననివాఁడు విశిష్టవస్తువుల్
గాననిభంగిఁ గర్మములు గైకొని కొందఱు కర్మబద్ధులై
కానరు విష్ణుఁ గొంద ఱటఁ గందు రకించనవైష్ణవాంఘ్రిసం
స్థానరజోభిషిక్తు లగుసంస్కృతకర్ములు దానవేశ్వరా.

ఇట్లింతగా హృదయరంజకములుగా నిరూపింపఁబడినతత్త్వార్థముల నతిశ్రావ్య మగుమృదుమధురశైలిం గూర్చి మనోహరము లగునట్లు చెప్పినాఁడు. మఱియు మీఁదిపద్యంబులనడకసొబగును గడుంగడు ముద్దులు గులుకునందలిపదములపొందికయు, వానిభావంబుఁ జక్కఁగా నెఱుంగ లేనిపామరునిమనంబుఁగూడ నాఁచికొని యానందరసమగ్నంబుఁ గావింపక మానదు.

ఈయొకటిరెండుదృష్టాంతములవలనఁ బోతనభాషాంతరీకరణరీతి చక్కఁగాఁ దెలియవచ్చును. తాను జేయు తెనుంగు మూలావిరుద్ధముగా నుండుటయ కాక కావ్యఫణితి కనురూపముగాను నలవడుటకై కొన్నియెడల నంతగా నర్థపోషకములు కాని కతిపయవిశేషణంబుల మానియు, మూలాతిక్రమణ మయ్యు రసోత్పత్తికిని దాత్పర్యోత్కర్షమునకును నుపకారము లగుసరసపదములఁ గొన్నింటిని సొంతముగాఁ గూర్చియు, నేదేనొకదానికి మాఱుగాఁ దత్సమానార్థపర్యవసాయి యగు వేఱొకదాని నుంచియుఁ దెనిఁగించియున్నాఁడు. ఒకానొకచో నావశ్యకము లగువానియందు సైతమేదైన నొకటి నన్వయాదిసౌలభ్యంబుపొంటె విడిచిపెట్టుటయుం గలదు. అయినను మొత్తమునకు మూలార్థము సుంతైనఁ గొఱవడక కడురమణీయముగానే ప్రతిపాదితమైయుండును. వీనికెల్ల నుదాహరణంబు లింతవఱకు నే వ్రాసియుండుగద్యపద్యములఁ దెలియఁగూడును గాన విస్తరభీతి నిట వేఱువేఱ వ్రాయలేదు. అర్థరచన కొంతకటువుగా నుండునేని తద్వాచకము లగుపదముల నట్లే తెనింగింపక దానితాత్పర్యమును మాత్రము తేటగాఁ గూర్చుటను బెక్కుచోట్లఁ గానవచ్చును. మీఁద 'వాచీశతంత్ర్యా మురుదామ్ని బద్ధాః' అనుటకు శ్రీధరులు 'ఈశస్య' వాచితంత్ర్యాం వేదలక్షణాయాం రజ్జ్వాం, ఉరుదామ్ని-ఉరూణి దామాని బ్రాహ్మణాదీని యస్యాం తస్యాం బద్ధాః' అని టీక వ్రాసి 'కామ్యైః కర్మభి ర్బద్ధా ఇత్యర్థః' అని యాశయమును దెలిపియున్నారు. పోతనయు నిట నీషత్పరుషార్థక మగుమూలపదపరికరమును వదలి తదాశయమునే 'కర్మబద్ధులై' యని కోమలముగాఁ గూర్చియున్నాఁడు. మఱియు రసోద్దీపకములు కాని రిత్తకథాంశములనుగూడ రచనాచమత్కృతి నతిరమణీయములుగాఁ జేయుటయందుఁ బోతన యసమానుఁడు. ఎట్లన:

సప్తమస్కంధము – పంచమాధ్యాయము.

శ్లో. ఏకదా సురరాట్పుత్ర మంక మారోప్య పాండవ!
పప్రచ్ఛ కథ్యతాం వత్స! మన్యతే సాధు య ద్భవాన్.

### తెనుఁగు.

శా. అంతం గొన్నిదినంబు లేఁగిన సురేంద్రారాతి శంకాన్విత
స్వాంతుం డై నిజనందనుం గుఱువు లేజాడం బఠింపించిరో
భ్రాంతుం డేమి పఠించెనో పిలిచి సంభాషించి విద్యాపరి
శ్రాంతిం జూచెదఁ గాక నేఁ డని మహాసౌధాంతరాసీనుఁ డై.

ఉ. మోదముతోడ దైత్యకులముఖ్యుఁడు రమ్మని చీరఁ బంచెఁ బ్ర
హ్లాదకుమారకుం భవమహార్ణవతారకుఁ గామరోషలో
భాదివిరోధివర్గపరిహారకుఁ గేశవచింతనామృతా
స్వాదకఠోరకుం గలుషజాలమహోగ్రవనీకుఠారకున్.

వ. ఇట్లు చారులచేత నాహూయమానుం డై ప్రహ్లాదుండు సనుదెంచిన.

శా. ఉత్సాహప్రభుమంత్రశక్తియుతమై యుద్యోగ మారూఢసం
విత్సంపన్నుఁడ వైవే చదివితే వేదంబులుం శాస్త్రముల్
వత్సా రమ్మని చేరఁ జీరి కొడుకుం వాత్సల్యసంపూర్ణుఁ డై
యుత్సంగాగ్రముఁ జేర్చి దానవవిభుం డుత్కంఠ దీపింపఁగన్.

క. అనుదినసంతోషణములు, జనితశ్రమతాపదుఃఖసంశోషణముల్
తనయులసంభాషణములు, జనకులకుం గర్ణయుగళసద్భూషణముల్.

వ. అని మఱియుఁ బుత్త్రా నీ కెయ్యది భద్రం బై యున్నది చెప్పు మనినఁ గన్నతండ్రికిఁ బ్రియనందనుం డిట్లనియె.

## అష్టమస్కంధము – తృతీయాధ్యాయము.

### గజేంద్రమోక్షణఘట్టము.

శ్లో. తం తద్వదార్త్త ముపలభ్య జగన్నివాసః స్తోత్రం నిశమ్య దివిజైస్సహ సంస్తువద్భిః
ఛందోమయేన గరుడేన సమూహ్యమానశ్చక్రాయుధో౽భ్యగమదాశుయతో గజేంద్రః
32. సోంతస్సరస్యురుబలేన గృహీత ఆర్తో దృష్ట్వా గరుత్మతి హరిం ఖ ఉపాత్తచక్రం
ఉత్క్షిప్య సాంబుజకరం గిర మాహ కృచ్ఛ్రా న్నారాయణాఖిలగురో భగవ న్నమస్తే
33. తం వీక్ష్య పీడిత మజ స్సహసావతీర్య సగ్రాహ మాశు సరసః కృపయోజ్జహార
గ్రాహాద్విపాటితముఖా దరిణా గజేంద్రం సంపశ్యతాం హరి రమూముచ దుస్రియా
ఈమూఁడుశ్లోకములకు, [ణామ్.

మ. అలవైకుంఠపురంబులో నగరిలో నామూలసౌధంబుదా
పల మందారవనాంతరామృతసరఃప్రాంతేందుకాంతోపలో
త్పలపర్యంకరమావినోది యగు నాపన్నప్రసన్నుండు వి
హ్వలనాగేంద్రము పాహి పాహి యనుకు య్యాలించి సంరంభి యై.

అనునీపద్యము మొదలుకొని

శా. పూరించెన్ హరి పాంచజన్యముఁ గృపాంభోరాశి సౌజన్యమున్
భూరిధ్వానచలాచలీకృతమహాభూతప్రచైతన్యమున్
సారోదారశితప్రభాచకితపర్జన్యాదిరాజన్యమున్
దూరీభూతవిపన్నదైన్యమును నిర్ధూతద్విషత్సైన్యమున్.

అనుపద్యమువఱకుఁగలయిరువదిపద్యగద్యములను రచించినాఁడు. ఇట్లు మూలంబునందలియొకటిరెండుశ్లోకంబులకు మాఱుగా నసదృశానర్గళకవిత్వధారాప్రవాహంబు పొంగి పొరలఁ బెక్కుపద్యంబు లతిహృద్యంబులుగాను నత్యంతరసోల్లాసభాసురంబులుగాను రచించుటం బెక్కుచోట్లఁ గానవచ్చును.

నవమస్కంధము – నవమాధ్యాయము.

26. శ్లో. వ్యవాయకాలే దదృశే వనౌకోదంపతీ ద్విజౌ
క్షుధార్తో జగృహే విప్రం తత్పత్న్యాహాకృతార్థవత్
27. న భవాన్ రాక్షస స్సాక్షా దిక్ష్వాకూణాం మహారథః
మదయంత్యాః పతి ర్వీర నాధర్మం కర్తుమర్హసి
ఏష హి బ్రాహ్మణో విద్వాన్ తపశ్శీలగుణాన్వితః.
31. సోయం బ్రహ్మర్షివర్యస్తే రాజర్షిప్రవరా ద్విభోః
కథ మర్హతి ధర్మజ్ఞ ! వధం పితు రివాత్మజః
32. తస్య సాధో రపాపస్య భ్రూణస్య బ్రహ్మవాదినః.
కథం వధం యథా బభ్రో ర్మన్యతే సన్మతో భవాన్.
33. యద్యయం క్రియతే భక్ష స్తర్హిమాం ఖాద పూర్వతః
న జీవిష్యే వినా యేన క్షణంచ మృతకం యథా.
34. ఏవం కరుణభాషిణ్యా విలపంత్యా అనాథవత్
వ్యాఘ్రః పశు మి వాఖాద త్సౌదాస శ్శాపమోహితః.

తెనుఁగు.

క. ఆఁకట మలమల మాఁడుచు, వీఁక నతం డడవి నున్నవిప్రమిథునముం
దాఁకి తటాలున విప్రునిఁ, గూఁకటిచేఁ బట్టి మ్రింగఁ గొనిపోవుతఱిన్.
వ. అంత నాబ్రాహ్మణునిభార్య పతికి నడ్డంబు వచ్చి యేడ్చుచు నారాచరక్కసునకి ట్లనియె.

మ. రవివంశాగ్రణి వై సమస్తధరణీరాజ్యానుసంధాయి వై
భువనస్తుత్యుఁడ వై పరార్థరతి వై పుణ్యానుకూలుండ వై
వివరం బేమియు లేక నాపెనిమిటిన్ విప్రుం దపశ్శీలు స
త్ప్రవరున్ బ్రహ్మవిదున్ జగన్నుతగుణున్ భక్షింపఁగాఁ బాడియే.
శా. తండ్రీ మీకు దినేశవంశజులకున్ దైవం బగున్ బ్రాహ్మణుం
డం డాప్రమాటలు లేవె భూమిసురగోహత్యాభిలాషంబుఁ గై

కొండ్రే మీయటువంటిసాధువులు | రక్షోభావ మి ట్లేల మీ
తండ్రిం దాతలఁ బూర్వులం దలఁపవే | ధర్మంబునం బోగదే.

శా. అన్నా చెల్లెల నయ్యెదన్ విడువు నీ | కన్నంబు వెట్టింతు నా
ప్రాన్నాథున్ ద్విజు గంగిరుత్త్రి నకటా | హింసింప నేలయ్య నీ
వెన్నం డింతులతోడఁ బుట్టవె నిజం | బి ట్లైన మున్ముట్ట నా
పన్నన్ నన్ను శిరంబుఁ ద్రుంచి మఱి మ | త్ప్రాణేశు భక్షింపవే.

క. అని కరుణ పుట్ట నాడుచు, వనితామణి పలవరింప | వసుధాదేవుం
దినియె నతఁడు పులి పశువుం, దినుక్రియ శాపంబుకతన | ధీరహితుం డై.

ఇట నిరుపమకవిత్వాతిశయప్రయుక్తనిరంకుశస్వాతంత్ర్యమున మూలము నందలిపదపద్ధతి సరిగా ననుసరింపక సందర్భసముదితరసావేశపారవశ్యమున నీపద్యంబుల మూలంబుకంటె నత్యంతరసోద్దీపకములనుగా రచించినాఁడు.

పదలాలిత్యమును, బ్రసాదవైభవమును, సులలితసరళధారయుఁ, బోతనకవితాకమనీయతకు ముఖ్యహేతువులు. అతనికవిత్వధార యన్నిట నతిశయించినది. అది మొదును గుంటులేక కటుపదంబుల గసుసు గాక యతిప్రాసములందు మెలిగొనక యొకమహానదినిర్మలప్రవాహంబువలె నిగనిగలాడుచు నిరర్గళముగాఁ బ్రవహించుచుండును. మఱియు శృంగారరసంబు నితరరసంబులతోఁ బరస్పరనిరపేక్షముగాఁ గూర్చి కాని లేక వాని కంగముగాఁ జేసి కాని యభివర్ణించుట యీకవికి నిష్టముగాఁ గొన్నిచోటులఁ గానిపించుచున్నది. ఇతనివర్ణనావిషయములతో నితరరసపరిప్లుతములుగా నుండునవి గూడ నితనికవితామతల్లిం దనంతటఁ జిప్పిలుచుండుశృంగారరసపూరంబున నిసుమంతయైనఁ దోఁగియుండక మానవు. సమవిభక్తావయవములు శరీరసౌందర్యమున కె ట్లొకహేతువో య ట్లే పోతనపద్యంబులందలిపదసమాసాదులు తులఁ దూఁచి తీరిచినట్లు రసవైభవానురూపంబుగ సువిభక్తము లై వాని రామణీయకంబునకు మూలముగా నుండును. ఎ ట్లన:——

దశమస్కంధము – పూర్వభాగము.

మ. జవసత్త్వంబులు మేలె సాము గలదే | సత్త్రాణమే మేను భూ
ప్రవరుం బోనన మి ష్టునంగ వలెనే | పాళీ లభీష్టంబు లే
పవివో కాక కృతాంతదండకమవో | ఫాలాక్షునేత్రాగ్నివో
నవనీతంబులముగ్ధ గాదు మొసఁగన్ | నాముష్టి గోపార్భకా.

మ. ఘనుఁ డాభూసురుఁ డేఁగెనో నడుమ మార్గశ్రాంతుఁ డై చిక్కెనో
విని కృష్ణుం డిది తప్పుగాఁ దలఁచెనో | విచ్చేసెనో యీశ్వరుం
డనుకూలింపఁ దలంచునో తలఁపఁడో | యార్యామహాదేవియున్
నను రక్షింప నెఱుంగునో యెఱుఁగదో | నాభాగ్య మె ట్లున్నదో.

ఇతనికవనంబునఁ బద్యాంతము లతిరమణీయములు. పద్యాది నంకురించినరసం

బును బయింబయి నతిచతురముగాఁ బుష్టి నొందించుచుఁ దుదిని వ్యస్తపదములవిన్యాసవైఖరిచేఁగాని సుధాఝురివలె నురవడించునొకనిడుదసమాసంపుధాటిచేఁగాని దానిని బెల్లుగా వెల్లిగొలుపును.

క. కలఁ డందురు దీనులయెడఁ, గలఁ డందురు పరమయోగిగణములపాలం
గలఁ డందు రన్నిదిశలను, గలఁడు గలం డనెడివాఁడు గలఁడో లేఁడో. అష్ట.

మ. మలఁగుం దెమ్మెరగాలికిం బటురటన్మత్తద్విరేఫాలికిం
దలఁగుం గోయిలమ్రోఁతకై యలఁగు నుద్యత్కీరసంభాషలం
గలఁగుం వెన్నెలవేఁడిమిం దలఁగు మాకందాంకురచ్ఛాయకుం
దొలఁగుం గొమ్మ మనోభవానలశిఖాదోదూయమానాంగియై. దశ. పూ.

ఈకవిసంస్కృతపదరచన లించుమించుగా నన్నయకవనంబునందుంబోలె లలితములుగా నుండును. అయిన నర్థసారస్యమునను బదవాక్యసౌష్ఠవమునను నితని కవనంబు తిక్కనదానియంతప్రౌఢము గాదుగాని, రసోచితరచనావైచిత్ర్యం బిది యతనికవితకు వెనుదీసినదికాదు. ఎక్కువయని చెప్పుటయు సాహసముకాదు. తిక్కన కర్థసారస్యమునందుఁ గన్ను. పోతనకు రససౌభాగ్యమునందు దృష్టి. ఈ హేతువుం బట్టియే పోతన కొన్నియెడలఁ బదాడంబర మని కాని వ్యర్థపూరణ మని కాని పాటింపక రసైకానురూపముగాఁ బద్యముల రచించి యున్నాఁడు.

మ. వరగోవిందకథాసుధారసమహావర్షోరుధారాపరం
పరలం గాక బుధేంద్రచంద్ర! యితరోపాయానురక్తిం బ్రవి
స్తరదుర్దాంతదురంతదుస్సహజనుస్సంభావితానేకదు
స్తరగంభీరకఠోరకల్మషకనద్దావానలం బాఱునే. ప్రథ.

ఈకవి నాచనసోమునియుత్తరహరివంశమును జూచియే దీనిని రచించియుండ వచ్చును. దీనికి నిదర్శనముగా మూలమునలేక యీయుత్తరహరివంశమునందు మాత్రము గలకథాంశములును నందలిపద్యాదులవంటివి కొన్నియు నిందుఁ గానఁబడుచున్నవి. ఉదాహరణము నొక్కటిఁ బ్రదర్శించెద.

ఉత్తరహరివంశము.

మ. అరిఁ జూచుం హరిఁ జూచు సూచకములై యందంద మందారకే
సరమాలామకరందబిందుసలిలస్యందంబు లందంబులై
దొరఁగం బయ్యెదకొం గొకింత దొలఁగం దోర్దండ శరాసారముం
దరహాసామృతసారముం గురియుచుం దన్వంగి కేళీగతిన్.

దశమస్కంధము.

మ. పరుఁ జూచుం వరుఁ జూచు నొంప నలరింపం రోషరాగోదయా
విరతభ్రూకుటిమందహాసములతో వీరంబు శృంగారముం
జరగం గన్నులఁ గెంపు సొంపుఁ బరఁగం జండాస్త్రసందోహముం

సరసాలోకసమూహముల్ నెఱపుచుం జంద్రాస్య హేలాగతిన్.

పోతనకవితావిషయ మింతటితో నిలిపి యీపురాణంబును దెనిఁగించిన తక్కినకవులంగూర్చి కొంత వ్రాయుట యావశ్యకము. పోతనకంటె వా రేవిధమునను దక్కువవారే యగుదు రని ముందే చెప్పియున్నాఁడను. పోతనకవనంబునం గానిపించుపదలాలిత్యమును, వాక్ప్రసన్నతయు, శబ్దాలంకారవైచిత్రియు, వివిధవర్ణనానల్పకల్పనాచమత్కృతియు, నత్యంతరసస్ఫూర్తియు, సందర్భోచితసుకుమారసరసపదపద్యాభినివేశచాతురీగరిమయు, విలాసోల్లసితవిశృంఖలధారావిహారంబును దక్కిన వారికి రావు. వారిలో

సింగన

కవనంబున మృదుమధురగుంభితములును మానసోద్దీపకము లగువర్ణనములును గొన్ని యక్కడక్కడఁ గానంబడుచున్నవి. ఈతనిశైలిం జూడఁగాఁ బోతనకవితారీతిం గూడినంతవఱకు ననుకరించియే తనభాగమును రచింపఁ జూచినాఁ డని తోఁచుచున్నది. పోతనశైలిని సూచించుకొన్నిపద్యముల నుదాహరించుట మంచిది.

క. మోదం బై పరిదూషిత, ఖేదం బై శాబరీధరకిలికించితదృ
గ్భేదం బై బహుసౌఖ్యా, పాదం బై యొప్పు వింధ్యపాదంబునకున్. షష్ఠ.

క. పుణ్యం బై మునివల్లభ, గణ్యం బై కుసుమఫలనికాయోత్థితసా
గుణ్య మయి నైమిశాఖ్యా, రణ్యంబు నుతింపఁ దగు నరణ్యంబులలోన్. ప్రథమ.

క. పుట్టితి వజుతనువునఁ జే, పట్టితివి పురాణపురుషుభజనము పదముల్
మెట్టితివి దిక్కులం దుది, ముట్టితివి మహాప్రబోధమున మునినాథా. షష్ఠ.

క. విడిచితి భవబంధంబుల, నడఁచితి మాయావిమోహ మైనతమంబుల్
నొడిచితి నరివర్గంబులఁ, గడచితి నాజన్మను ఖరకరార్ణవమున్. ప్రథ.

వ. కుంతంబుల గ్రుచ్చుచుఁ, గుఠారంబుల వ్రచ్చుచు, ముసలంబుల మోఁదుచు, ముద్గరంబుల బాఁదుచుఁ, జక్రంబులం ద్రుంచుచు, సబళంబుల నొంచుచు. షష్ఠ.

వ. గదల వ్రేయుచుఁ గాండంబు లేయుచు; ముద్గరంబుల నొత్తుచు, ముసలంబుల మొత్తుచుఁ, గరవాలంబులఁ ద్రెంచుచుఁ, జక్రంబులఁ ద్రుంచుచు. దశ.పూ.

ఇట్టియుద్ధకవనంబులు నందంద కొన్నిపోలికలు గానంబడుచున్నవి గాని పోతనధార యత్యంతనిసర్గోల్లసితం బగునిరుపమప్రతిభాతిశయంబువలన నశ్రమంబునఁ దొరంగి రసావేశతరంగిత మై తుఱంగలించుటం జేసి యతనిరచనలు సింగనవానికంటె నతిమధురము లై, ప్రకృతిమనోహరము లై, నిబిడరసపరిప్లుతము లై కానిపించుచున్నవి. ఇది యిట్లుండ నితఁడు షష్ఠస్కంధము నద్వైతపరముగానే తెనిఁగించినాఁడు. దీనికి నిదర్శనముల నాస్కంధమునుండి కొన్నింటి వ్రాసెద.

షష్ఠస్కంధము.

సీ. అఖిలభూతముల దేహాంతస్స్థమగునాత్మ, యీశుఁ డచ్యుతుఁ డని యెఱుఁగవలయు.

వ. దేవా! రజ్జువునందు సర్పభ్రాంతి గలుగునట్లు ద్రవ్యాంతరంబుచేత బ్రహ్మంబయి
న నీయందుఁ బ్రపంచభ్రాంతి గలిగెడిని.

వ. కావున గుణంబులును గుణియును, భోక్తయును భోగ్యంబును...హర్తయు
హార్యంబును, నుత్పత్తిస్థితిలయైకకర్త యై సర్వోత్కృష్టుండైన యప్పరమేశ్వ
రుండె కాని యన్యంబు లేదు.

ఇట్లు జీవపరతాదాత్మ్యంబును జగన్మిథ్యాత్వంబును బ్రతిపాదితంబు లగు
టంజేసి యీస్కంధ మద్వైతపరముగాఁ దెనిఁగింపఁబడె ననుట తెల్ల మగుచున్నది.
మఱియు నిందు శ్రీధరవ్యాఖ్యానమునందలిపదార్థాదు లాయాతత్త్వఘట్టములందుఁ
గానఁబడుచున్నవి.

షష్ఠస్కంధము – చతుర్థాధ్యాయము.

29.శ్లో. యద్రోపరామో మనసో నామరూపరూపస్య దృష్టస్మృతిసంప్రమోషాత్
యఈయతే కేవలయా స్వసంస్థయా హంసాయ తస్మై శుచిసద్మనే నమః.

వ్యాఖ్యానము.

యదేతి॥ యదా, మనస ఉపరామః–సమాధిః...తదా, నామరూపే రూ
ప్యేతే యేన తత్తథా, తస్య ఉపరమే హేతుః; దృష్టం–దర్శనం, స్మృతిశ్చ, తయోః
సంప్రమోషాత్–నాశాత్, తదా, యః కేవలేన–స్వరూపజ్ఞానేన ప్రతీయతే, తస్మై
హంసాయ, శుద్ధాయ; శుచి–శుద్ధం మనః, సద్మ–ప్రతీతిస్థానం, యస్యతస్మై నమః.

తెనుఁగు.

మఱియు ననేకవిధనామరూపనిరూప్యం బగుమనంబునకు దృష్టస్మృతుల
నాశంబువలనం గలిగెడునుపరామం బగుసమాధియందుఁ గేవలస్వరూపజ్ఞానంబునఁ
దోఁచు నిర్మలప్రతీతిస్థానం బైనహంసస్వరూపికి నమస్కరింతు.

ఇట్లావ్యాఖ్యానమునందలిపదార్థాదులు గలిగియు నద్వైతపర మయ్యు
నుంటంజేసి యీస్కంధమును బహుతరముగా నావ్యాఖ్యానము ననుసరించియు
సింగన తెనిఁగించి యుండు నని తోఁచెడిని. అయినను బోతనవలె వ్యాఖ్యానము
ను గొని మూలము నన్యూనముగాను ననతివిపులముగాను విశదీకరించువైదుష్య
ముగాని ప్రావీణ్యముగాని యీకవియందుఁ గానము. మఱియు నావ్యాఖ్యానముఁ
జక్కఁగాఁ బాటించి మూలమును దానికి మిక్కిలి సరిగాఁ దెనిఁగించినవాఁడును
గాఁ డని మీఁదియుదాహరణముచేతనే తెలియవచ్చును. కొన్నియెడలఁ దెనిఁగింపు
మూలమునకుఁ జాల భిన్నముగాను నుండును. మూలమునఁ దత్త్వఘట్టములలోని
సమాసములఁ బోతనవలెఁ దేటపఱుప లేక యట్లే యుంచి రచించుటయు టుం
డఁగా వానిలోఁ గొన్నింటియర్థములు నిందు సరిగాఁ గానిపించుటయు లేదు. కొన్ని
యెడల నద్వైతప్రక్రియనుమాత్రము దప్పక తనకుఁ దోఁచినరీతిని మూలమునకుఁ
జాల విరుద్ధముగాను దెనిఁగించి యున్నాఁడు. కేవలకవిత్వమునుబట్టి చూడ

ఈతఁడు సింగననారయలకంటె నెక్కుడై పోతనవలె స్వకపోలకల్పితము లగువర్ణనములను గూడఁ జేర్చి మధురముగాను మనోహరముగాను దనస్కంధమును దెనిఁగించినాఁ డని చెప్ప నొప్పును. ఇతనికవనమున లక్షణదోషములు కొన్ని గానిపించుచున్నవి.

| కొనికి కాదేశము. | దుష్టసంధులు. |
| --- | --- |
| పెట్టుక. పట్టుక. | ఓ రేడ్వ్యకుఁ డని. |
| ఉకారాంతశబ్దమునకు కుప్షష్ఠి పరమగు | గ్రక్కిటి సీజగంబునను. |
| నపుడు నగామము రామి. | మహి మెట్టిదియో. |
| పాటుకు. | అడఁకు వేమియు. |
| దుష్టరూపములు. | ధాతంతవాసిని. |
| చేతును. | నేర్పరింతింతవాఁ డన రానివాఁడు. |

మఱియు సమాసదోషములు మొదలగునవి కొన్ని గానిపించుచున్నవి కాని విస్తరిభీతి నిట వ్రాయక పంచమస్కంధమును దెనిఁగించిన

గంగన్న

ను గూర్చి కొంతవ్రాయుట యుక్తము. ఈతనికవన మంతరసవంతముకాదు. దానిని సింగనకవనముకంటెఁ దక్కువ యని చెప్పవచ్చును. రసోత్పత్తికొఱకుఁ జేసినరచన లంతగా శ్రమంపడక కుదిరినవిగాఁ దోఁపమిచేఁ బోతనవానివలె నవి స్వభావసుభగములుగాఁ గానిపింపవు. అయినను మొత్తమునకు నితనికవిత్వము కొంత లలితముగాను సింగనదానికంటె సుకుమారముగాను నుండును. ఇతని తెనిఁగింపును సింగనదానివలె మూలమునకు మిక్కిలిసరిగా నుండదు. వర్ణనాసందర్భములయందు నిది మూలముకంటెఁ జాలన్యూనముగాను గొన్నియెడల భిన్నముగాను నుండును.

పంచమస్కంధము–ద్వితీయాధ్యాయము.

కటాక్షవర్ణనము.

శ్లో. బాణా విమా భగవత శ్శతపత్రపత్త్రా కాంతా వపుంఖరుచిరా వతితిగ్మ దంతౌ
కస్మైన్మయుయుంక్షసివ నేవిహరన్నవిక్ష్మకక్షే నూంయనోజడధియాంతవవిక్రమోస్తు.

తెనుఁగు.

క. పొలుపగుచున్నవిలాసం,బు లనంగజబాణములను శ్రీ బోలెడునీచం
చలసత్కటాక్షవీక్షణ,ముల నెవ్వని నింతి చిత్తమునఁ గలఁచెద వే.

అంగపరిమళలోభానుగతభ్రమరవర్ణనము.

శ్లో. శిష్యా ఇమే భగవతః పరితః పఠంతి గాయంతి సామ సరహస్య మజస్ర మీశ!
యుష్మచ్ఛిఖా విలులితాస్సుమనోభివృష్టేః సర్వేభజంత్యృషిగణా ఇవ వేదశాఖాః.

తెనుఁగు.

చ. చెదరఁగ వేదముల్ చదువుశిష్యులపైఁ దగఁ బుష్పవృష్టి స
మ్మదమున నంతలోఁ గురియు మాడ్కిని మన్మథసామగానముల్
చదివెడుశిష్యులో యనఁగ షట్పదపంక్తులు మ్రోయఁగా వడిం
బడపడి మీఁద రాలుఁ గచభారమునందులజాజుక్రొవ్విరుల్.

వీనిలో మొదటిపద్యమున మూలమునందలివిశేషణాదులు పెక్కు లేవు. రెండవదానియందు మూలార్థరీతి గానిపింపదు. ఇట్లీతనికవిత్వ మంతగా సరసమును మధురమును గాకపోయినను, మార్దవమూలమునఁ గొంత లాలిత్యమును గాంచుచున్నది. మఱియుఁ బోతనాదులకవనంబులందుంబోలె నిందు స్వకపోలకల్పితము లగువర్ణనము లెందును గానరావుగాని సరసవస్తుత్యాగములు పెక్కు కానఁబడుచున్నవి.

౧౮. ఇతి తేషాం వృషలానాం రజస్తమః ప్రకృతీనాం ధనమదరజఉత్సిక్తమనసాం...కర్మాతిదారుణం యద్బ్రహ్మభూతస్య సాక్షాద్బ్రహ్మర్షిసుతస్య నిర్వైరస్య సర్వభూతసుహృద స్సూనాయా మప్యనుజ్ఞాతాయా మనభిమత మాలంభనం త దుపలభ్య బ్రహ్మతేజసాతిదుర్విషహేణ దందహ్యమానేన వపుషా సహసోచ్చచాల సైవ దేవీ భద్రకాళీ.౧౯.భృశమమర్షరోషావేశరభసవిలసితభ్రుకుటీవిటపకుటిలదంష్ట్రారుణేక్షణాటోపాతిభయానకవదనా హంతుకామేవేదం మహాట్టహాస మతిసంరంభేణ విముంచంతీ, తతఉత్పత్య పాపీయసా మతిదృష్టానాం తేనైవాసినా వృక్ణశీర్ష్ణాం గళాత్ ప్రస్రవంత మసృగాసవ మత్యుష్ణం సహగణేన నిపీయాతిపానమదవిహ్వలోచ్చైస్తరాం స్వపార్షదైస్సహ జగౌ ననర్త విజహార చ శిరఃకందుకలీలయా. పంచ. నవమాధ్యాయము.

తెనుఁగు.

సీ. సర్వభూతములకు సఖుఁడును బ్రహ్మభూతాత్ముఁడు నిర్వైరుఁ డయిన బ్రహ్మ
సుతుని తేజంబంతఁ జూడ దుస్సహమైన, భయ మంది వడఁకుచు భద్రకాళి
క్రోధంబు ముమ్మడిగొనఁగ హుంకారంబు, సలుపుచు నట్టహాసంబు సేసి
పాపాత్ములును దుష్టపరులును రాజస, తామసకర్మసంధాను లగుచు
తే. విప్రవరునట్లుహింసించువృషలపతిని, భృత్యవర్గంబుతోఁ దలఁ బృథ్విఁగూల్చి
యపుడు వృషలాధిపునిశిరమంది లీలఁ, బాడి యాడుచు నందంద క్రీడసలిపె.

ఇది యితని తెనిఁగింపునకు మంచినిదర్శనము. ఇందు రసపూర్తి మూలంబుకంటె మిక్కిలి తక్కువ. మూలార్థమెల్ల ననతిన్యూనముగా సంగ్రహించి నిపుణముగా నొక్కసీసంబున నిమిడ్చి యతిమృదువుగా రచించినరీతిని చటఁగానవచ్చును. పోతనయేని నిట్టివర్ణనాప్రసంగము పొసంగెనా రసపారవశ్యంబునఁ జిత్రవిచిత్రరచనానల్పకల్పనాచమత్కారం బేపార స్వానవద్యహృద్యకవిత్వవిద్యావిలాస

విశేషంబులెల్లఁ జూపి రసంబులు చిప్పిలంజేయకుండునే! ఇట్లే తత్త్వఘట్టములందు మూలమునకును దెనుఁగునకును బెక్కుచోట్ల భేద మగపడినను జాలవఱకు మూలము ననుసరించియే తాత్పర్యరూపముగాఁ దెనుఁగు సేసియున్నాఁడు. కొన్నిచోట్ల శ్రీధరాచార్యవ్యాఖ్యానమందలియర్థాదులు గానిపించుటచే దానిని బూర్ణముగా ననుసరింపకపోయినను సహాయముగా నుంచుకొని సంగ్రహముగాఁ దెనిఁగించి యుండు నని తోఁచెడిని.

పంచమస్కంధము – ఏకాదశాధ్యాయము.

శ్లో. యావన్మనో రజసా పూరుషస్య సత్త్వేన వా తమసా వానురుద్ధం
చేతోభి రాకూతిభి రాతనోతి నిరంకుశం కుశలం చేతరం వా॥
సవాసనాత్మా విషయోపరక్తో గుణప్రవాహో వికృత ష్షోడశాత్మా

వ్యా. పురుషస్య, కుశలం–ధర్మ మితర–మధర్మంవా, ఆతనోతి, కైః, చేతోభిః–జ్ఞానేంద్రియైః, ఆకూతిభిః–కర్మేంద్రియైశ్చ॥ ౪॥ తతశ్చధర్మాధర్మవాసనాయుక్తం తదేవానేక దేహాదివైచిత్ర్యంకరోతీత్యాహ॥ సఇతి–తన్మనఇత్యర్థః, వాసనాయుక్తం ఆత్మోపాధిత్వా దాత్మా.

తెనుఁగు.

పురుషుని,చిత్తంబుగుణములఁ బొంది యెంత
తే. కాల ముండును మఱియంతకాలమందు, నరయవిజ్ఞానకర్మేంద్రియములచేత
మరగి ధర్మంబుమఱియధర్మంబునట్లు, తగిలి పుట్టించుచుండు నత్యంతమహిమ.

వ. మఱియు ధర్మాధర్మవాసనాయుక్తంబు. . .చిత్తంబు

ఈకవియుఁ దనస్కంధము నద్వైతపరముగాఁ దెనిఁగించె ననుటకు దాని యందలినిదర్శనములం గొన్నింటిఁ దెలిపెద:

ఆ. పరఁగఁ బెద్ద లీప్రపంచ మంతయుఁ గథ్య, మనరు ౧–ఆ. 151

వ. మనోవృత్తుల నతిక్రమించినజీవుండు పరంజ్యోతి యైననారాయణస్వరూపంబుగా నెఱుంగుము . . . ఈశ్వరుండు సర్వభూతాంతర్యామి యగుచు జీవాత్మస్వరూపంబున నుండు. ౧–ఆ. 153

వ. బ్రహ్మం బొక్కటియ సత్యంబు జగత్తసత్యంబు. ౧–ఆ. 159

ఇట్లద్వైతపరముగాఁ దెనిఁగించుటయు నితండు శ్రీధరవ్యాఖ్యానమును గొంతవేని ననుసరించి యుండు ననుటకుఁ గొంతయాధారముగా నున్నది. ఇతని కవనంబునను గొన్నిలక్షణదోషంబులు చూపట్టుచున్నవి.

కొనికి కాదేశము.

ప్రథమాశ్వాసము.

తెఱుముక. 128

ఆశ్రయించుక. 147

ద్వితీయాశ్వాసము

జుట్టుక. 12౭

నాటుక. 145

ఉకారాంతశబ్దమునకు కుషష్ఠిని

నగాగమము రామి.

ఆశ్రమమునకు. 21

సుతునకు. 56


మఱియు దుష్టము లగునఖండయతులును మఱికొన్నిదోషములును గాని పించుచున్నవి. మొత్తమునకు నితనికవిత్వము మిక్కిలి మృదువుగా నుండు ననుటకు రెండుదాహరణము లిచ్చి యితనివిషయ మింతటితో విరమించెద.

ఉ. అక్కట! తల్లిఁ బాసి హరిణార్భక మాప్తులు లేమిఁజేసి యే
దిక్కును లేక యున్న నిటఁ దెచ్చితి నాయెడ నీమృగార్భకం
బెక్కుడుప్రేమఁజేసి చరియించుచు నున్నది నాదుసన్నిధిన్
మక్కువఁజేసి దీనిఁ గడుఁ దమన్ననలం దగఁ బ్రోతు నెంతయున్.

ఉ. రాజులు మే లనంగ సురరాజసమానుఁడ నై తనూజులన్
రాజులఁ జేసి తాపసులు రాజఋషీంద్రుఁ డటంచుఁ బల్కఁగాఁ
దేజము నొంది యీహరిణదేహమునందలిప్రీతిఁ జేసి నా
యోజ సెడంగ నేఁ జెడితి యోగిజనంబులలోన బేల నై.

ఇఁక వ్రాఁతప్రతులందును నచ్చుప్రతులగన్యలందును నేకాదశద్వాదశస్కంధములను రచించినవాఁడుగాఁ దెలియుచున్న వెలిగండల

నారయ

ను గూర్చి కొంత వ్రాయవలసియున్నది. ఈరెండుస్కంధముల తెనిఁగింపు మొత్తమునకు మూలమునకుఁ జాలవఱకు సరిగా నుండదు. తత్త్వఘట్టములందుఁగాని కథాంశములందుఁగాని యిది మూలమునకంటెను బెక్కుచోట్లఁ జాల న్యూనము గాను గొన్నియెడల మిగులవిశుద్ధముగాను నుండు నని తొలుతనే చెప్పియున్నాఁడను. స్థాలీపులాకన్యాయంబున రెండుదాహరణంబు లిచ్చెద.

శ్లో. ఇంద్రియార్థభ్రమో జాగ్రత్స్వప్నోంతఃకరణభ్రమః
సుప్తం తద్వాసనాబీజం తుర్యా మూర్తి స్తదన్వితః॥ ఏకాదశ.

వ. ఇంద్రియార్థభ్రమణంబు సేసెడుదుర్మతులకు సుషుప్త్యవస్థలు వాసన కలుగుటంజేసి పరమేశ్వరునిం బొందరామి యనునాలుగవయవస్థయుఁ గలుగు.

శ్లో. తంచోపనీయ సదసి పరిమ్లానముఖశ్రియః
రాజ్ఞ ఆవేదయాంచక్రు స్సర్వయాదవసన్నిధౌ॥
తం చూర్ణయిత్వా ముసలం యదురాజ స్స ఆహుకః

సముద్రసలిలే ప్రాస్య ల్లోహం చాస్యావశేషితం
కశ్చిన్మత్స్యోఽగ్రసీ ల్లోహమ్॥ ఏకాదశ.

వ. ...దానింగొనిచని దేవకీనందనుసన్నిధానంబునంబెట్టి యెఱింగించిన నతం(డాత్మ కల్పితమాయారూపం బగుట యెఱింగియు నెఱుంగనితెఱంగున) వారలం జూచి యిట్లనియె...(సముద్రతీరంబున నొక్కమహాపర్వతం బున్నది. అందు నుండు నత్యచ్ఛ్రియవిశాలవిభీషణం బగుపాషాణంబున మీరుభుజాబలంబుచేత నీముసలం బుఁ దివిచి) దీనిచూర్ణంబు సింధుకబంధంబులం గలిపి రండు పొం డని జగద్విభుం డైనకృష్ణుం డానతిచ్చిన వారు నట్ల చేసి తత్కీలితం బైనలోహఖండంబును సరకు గొనక సాగరంబునఁ బడవైచిన నొక్కఝషంబు గ్రసించిన.

ఇట మూలమున 'రాజ్ఞే' 'యదురాజస్యఆహుకః' ఇత్యాదు లుగ్రసేనుని నిర్దేశించుచుండఁగా నతనికి మాఱుగా 'దేవకీనందనుండు' 'జగద్విభుం డైనకృష్ణుండు' అని తెనుఁగున నున్నది. మఱియుఁ దెనుఁగునఁ గుండలీకరణములలోని ముసలమాయారూపత్వపర్వతపాషాణాదు లెవ్వియు మూలమునఁ గానరావు. ఇంతే కాక యందలికుండలితవాక్యము రెండవదానికి వ్రాఁతప్రతులందు 'సముద్రతీరంబున నొక్కమహోపలం బున్నది. ఇమ్ముసలంబు మీరుభుజాబలంబున దానిమీఁదం దివిసి' అని పాఠాంతరము చూపట్టుచున్నది. మూలమునకును, వ్రాఁతప్రతుల కును, నచ్చుప్రతులకును గానిపించుపరస్పరభేదముల కిది యొకనిదర్శనము. ఇట్టిభేద ములు కథాంశములను దత్త్వసూక్ష్మములను గానఁబడుటకుఁ దెఱ యొకయుదాహర ణముఁ జూపెద. మూలము.

శ్లో॥ తక్షకః ప్రహితో విప్రాః! క్రుద్ధేన ద్విజసూనునా।
హంతుకామో నృపం గచ్ఛ న్దదర్శ పథి కాశ్యపమ్।
తం తర్పయిత్వా ప్రవిశ న్దదర్శ విషహారిణమ్।
ద్విజరూపప్రతిచ్ఛన్నః కామరూపీ వ్యదశ న్నృపమ్।
బ్రహ్మభూతస్య రాజర్షే ర్దేహోఽహి గరళాగ్నినా।
బభూవ భస్మసా త్సద్యః పశ్యతాం సర్వదేహినామ్॥
హాహాకారో మహా నాసీ ద్భువి ఖే దిక్షు సర్వతః।
విస్మితా హ్యభవ న్సర్వే దేవాసురనరాదయః॥
జనమేజయః స్వపితరం శ్రుత్వా తక్షకభక్షితమ్।

వ్రాఁతప్రతులతెనుఁగు.

వ. తక్షకప్రేరితుం డైనయయ్యుగ్రోరగుండు సనుదెంచి రాజసన్నిధి నున్నవారిచే తికి నొక్కఫలం బిచ్చిన వారు రాజున కిచ్చిన నతం డది యాస్వాదింప నందుఁ గ్రిమిరూపంబున వెడలి మహాభయంకరరూపంబునఁ గాకోదరం బై కఱచినఁ బరీక్షిత్తు పంచత్వంబు నొందుట విని తనయుం డైనజనమేజయుండు.

అచ్చుప్రతుల తెనుఁగు.

వ. ఇట్లు గ్రుద్ధుం డైన బ్రాహ్మణోత్తమునిచేఁ బ్రేరితుం డైన తక్షకుండు ద్విజరూపంబుఁ దాల్చి పరీక్షిద్వధార్థంబుగా నేతెంచుచుండి మార్గమధ్యంబునఁ గాశ్యపుం డనుసర్వవిషహరణసమర్థుం డగునొక్కవిప్రునిం గని యతని నపరిమిత ధనప్రదానంబునఁ దృప్తుం గావించి పరీక్షిన్నికటంబునకు రాకుండున ట్లొనర్చి యంతటఁ బరీక్షిన్మహారాజుచెంత నున్నవారిచేతి కొక్కఫలం బిచ్చి చనిన వారాఫలంబు రాజున కిచ్చిన నతం డాఫలంబు నాస్వాదించినం గ్రిమిరూపంబున నందుండి వెడలి మహాభయంకరరూపంబునఁ గాకోదరం బై రాజుం గఱచిన నతండు నాక్షణంబ విషాగ్నిచే భస్మీభూతుం డయ్యె. అట్టియవసరంబున భూమ్యంతరిక్షంబుల నుండునిఖలప్రాణు లాశ్చర్యకరం బగుతన్మరణంబుఁ గని హాహారవంబులు సేసిరి అంత నీయర్థంబు నతనితనయుం డైనజనమేజయుండు విని.

ఇట వ్రాఁతప్రతులపాఠము మూలముకంటె మిక్కిలి న్యూనముగాను విరుద్ధముగాను నుండుటం జూచి యచ్చుప్రతులందలిపాఠము మూలానుసారముగా రచింపఁబడెను గాఁబోలు. వ్రాఁతప్రతులవిశుద్ధపాఠమునుబట్టి పర్యాలోచింపఁగా మూలమునఁ గల 'తక్షకః ప్రహితో విప్రాః!' అనుపాఠమునకు మాఱుగా 'తక్షక ప్రహితో విప్రః' అనుతప్పుపాఠము నెట్లో కొని కవి తెనిఁగించియుండు నని తోఁచెడిని. తెనుఁగుపాఠముల రెంటను గల 'ఒక్కఫలం బిచ్చుటయు' తక్షకుండు 'క్రిమిరూపంబున నందుండి వెడలి' వచ్చుటయు మూలమునఁ గానరావు.

ద్వాదశస్కంధము -- చతుర్థాధ్యాయము.

శ్లో. బుద్ధేర్జాగరణం స్వప్నం సుషుప్తి రితిచోచ్యతే
మాయామాత్ర మిదం రాజ న్నానాత్వం ప్రత్యగాత్మని
యథా జలధరా వ్యోమ్ని భవంతి న భవంతి చ
బ్రహ్మణీదం తథా విశ్వ మవయ వ్యుదయాప్యయాత్
అన్వోన్యాపాశ్రయాత్సర్వ మాద్యంతవ దవస్తు చ
నానాత్వం ఛిద్రయోర్యద్వ జ్జ్యోతిషో ర్వాతయో రపి
యథా హిరణ్యం బహుధా సమీయతే నృభిః క్రియాభి ర్వ్యవహార వర్త్మసు
ఏవం వచోభి ర్భగవా నధోక్షజో వ్యాఖ్యాయతే లౌకికవైదికైర్జనైః.

వ్రాఁతప్రతుల తెనుఁగు.

వ. స్వప్నజాగరణసుషుప్త్యవస్థా(భేదం బాత్మమయం బై బుద్ధియుక్తం బైనమాయ) మై యోగంబునం బరిణమించు. ప్రాణిజాతంబున కీశ్వరునందు లయోదయంబులగు. ఈజగం బన్యోన్యాపాశ్రయం బై యాద్యంతవస్తువై వర్తించు) ఒక్కతేజంబు బహురంధ్రంబులఁ గానంబడుతెఱంగున నొక్క(పరమాత్మను) బెక్కువిధం

బులుగా భావింతురు. హాటకంబు పెక్కురూపంబు లయ్యు నేకం బైన తెఱంగునఁ బరమాత్ము నొక్కటిగా భావించి.

అచ్చుప్రతుల తెనుఁగు.

వ. జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు (బుద్ధిధర్మంబు లగు. ప్రత్యగాత్మయందు నానాప్రకారంబులం దోఁచు నీదృశ్యప్రపంచం బంతయు మిథ్య యని తెలియుము). ఒక్క తేజంబు బహురంధ్రంబులం గానంబడువడువున నొక్కయాత్మయె పెక్కువిధంబులఁ దోఁచుచుండు. హాటకంబు పెక్కురూపంబులు గల దైన నేకం బైన తెఱంగునఁ బరమాత్మ (వివిధచేతనాచేతనశరీరంబులయందుః) బెక్కువిధంబులం గనంబడిన నేకంబుగా భావింపవలయును.

ఇట మూలమునం దెడనెడ నుండుశ్లోకములు కొన్ని తెనిఁగింపఁబడినవి కావు. ఆశ్లోకము లుండుచోటులనే చుక్కలతోఁ జూపి తెనిఁగింపబడినవానిని మాత్రము వ్రాసినాఁడను. తెనిఁగింపఁబడినవో గీ దర్శనమునుబట్టి చూచినను మూలమునకు వలయునంతసరిగా లేవు. ఈలోపము లటుండఁగాఁ దెనుఁగుపాఠములు రెంటను గుండలితము లగుబంతు లొండొంటియందు లేవు. మఱియు నచ్చుప్రతులందలి తెనిఁగింపు సువ్యక్తముగా నద్వైతపరముగా నున్నది. వ్రాఁతప్రతుల తెనిఁగింపట్లు గానిపింపదు.

ఇట్లు మీఁది రెండుదాహరణములవలన మూలాదులు మూఁటికిని గలభేదములు విశదముగాఁ దెలియవచ్చును. మఱియు నద్యోయెడల నధ్యాయము లొకటి రెండుగాఁ దెనిఁగింపఁబడకున్నవి. ఏకాదశస్కంధమునఁ ద్రయోదశాధ్యాయమున శ్రీవిష్ణుండు హంసరూపి యై చేసినతత్త్వోపదేశము.

'వస్తునో య దనానాత్వ మాత్మనః ప్రశ్న ఈశ్వరః'

అనుశ్లోకము మొదలుగాఁ బదిగేడుశ్లోకములఁ జెప్పఁబడియున్నది. వానికెల్లఁ* దెనుఁగయిదాఱుబంతులే యున్నవి. అవియును మూలమునకు సరిగావు. అందు

మనసా వచసా దృష్ట్యా దృశ్యతేన్యై రపీంద్రియైః ।
అహమేవ న మత్తోఽన్య దితి బుధ్యధ్వ మంజసా ॥ 24

అనునీశ్లోకము 'పంచేంద్రియంబులకు దృష్టం బైనపదార్థం బనిత్యంబు. అది నిత్యదృష్టిని బ్రహ్మం బని తెలియవలయు' అని తెనిఁగింపఁబడియున్నది. కవి పదునాలుగవయధ్యాయమునఁ జెప్పఁబడినభక్తిపారమ్యధ్యానయోగములను బదిబంతులలో నఱగొఱగాఁ దెనిఁగించి, షోడశమునందలివిభూతులను జెప్పి యవ్వలిమూఁడధ్యాయములవిషయములను మూఁడుబంతులతోఁ సూచించి పండ్రెండవయధ్యాయమునకు మఱలి, యందుఁ గల

* చూడు-భాగ-ఏకా-వచన. 104

శ్లో॥ తస్మా త్త్వ ముద్ధవోత్సృజ్య చోదనాం ప్రతిచోదనామ్ ।
ప్రవృత్తించ నివృత్తించ శ్రోతవ్యం శ్రుత మేవ చ॥ 14
మా మేక మేవ శరణ మాత్మానం సర్వదేహినామ్।
యాహి సర్వాత్మ భావేన మయా స్యా హ్యకుతోభయః॥ 15

ఈశ్లోకములకే *'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' ఇత్యాదులు నాలుగుబంతులు చెప్పి పిదపఁ బందొమ్మిదవయధ్యాయమునందలిశిష్టాంశమును గొంతయు నిరువదినాలుగవదానియందలిసాంఖ్యవిధియు సప్తవింశమునందలియర్చనాప్రకారంబు గొంతను దెనిఁగించి యిరువదితొమ్మిదవదానియందుఁ గల

'గచ్ఛోద్ధవ ! మయాదిష్టో బదర్యాఖ్యం మమాశ్రమమ్' !

ఇత్యాదులను, నవ్వలిరెండధ్యాయంబులఁ గలయాదవక్షయబలరామకృష్ణనిర్యాణంబులను దెనిఁగించి యున్నాఁడు. ఈస్కంధమునఁ గలభిక్షుగీతాదులు తెనుఁగున లేవు. మఱియు †'నారాయణవిగ్రహంబు జలధిప్రాంతంబున జగన్నాథస్వరూపం బై యుండె' ననుట మూలమునం గానరాదు. మొత్తమునకు నీస్కంధమునకుఁ దెనుఁగు మూలమున నాలుగింట నొకపా లుండును. ద్వాదశస్కంధమును దెనిఁగించుటయం దిట్లధ్యాయములుగా వదలిపెట్టుట లేదు గాని యది పెక్కుచోట్ల మూలముకంటె మిక్కిలి న్యూనముగాను గొన్నియెడలఁ గడుభిన్నముగాను గానిపించుచున్నది.

వ్రాఁతప్రతులందు లేనివియు మూలానుసారము లైనవియు నగు నధికపాఠాదు లచ్చుప్రతులందుఁ గానంబడుటకుఁ బండితులు మూలముగా నుండఁబోలు నని చెప్పినాఁడనుగదా. ఆవిషయ మిట్లుండ మఱియొకవిచిత్రమును జూపట్టుచున్నది. ఈ రెండుస్కంధముల తెనిఁగింపు వ్రాఁతప్రతులం దద్వైతపరముగాఁ దోఁపదు. అచ్చుప్రతులందో యది స్పష్టముగా నద్వైతపరముగాఁ గానిపించుచున్నది. వ్రాఁతప్రతులపాఠమునుబట్టి చూడ నది యద్వైతపర మనుటకంటె విశిష్టాద్వైతపర మనుటకుఁ గొన్నియాధారము లందే కానఁబడుచున్నవి.

‡'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ యనునుపనిషత్తుల్యం బగు గీతావచనప్రకారంబున' అని యీశ్లోకమునకు విశిష్టాద్వైతులవలెఁ గవి మిక్కిలి ప్రాధాన్యము కలిమిని జూపియున్నాఁడు.

మఱియు 'జీవాత్మ భేదంబు § మొదలైనవి యెఱిఁగించి విజ్ఞానవంతుంగాఁ జేసి మన్నించితి' అని యిట జీవాత్మ భేదంబుఁ బ్రతిపాదించియున్నాఁడు.

¶ 'దేవతాంతరమంత్రాంతరసాధనాంతరంబులు వర్జించి యుండెనేని వైకుంఠంబున వసియించు' ఇది వీరవైష్ణవత్వసూచకము.

ఈవాక్యములు వ్రాఁతప్రతులందును నచ్చుప్రతులందును గానిపించుచున్న

*చూడు-ఏకాదశ-వచన. 106. †ఏకా.వచన. 121. ‡ఏకా.వ.106. §ద్వా. వ.2¶ద్వా. వ.39.

vi. ఇవి నిస్సందేహముగా విశిష్టాద్వైతపరములు. అచ్చుప్రతులందుఁ గంఠోక్తిగా నద్వైతమును బ్రతిపాదించువాక్యములు మూఁటిని వ్రాసెద.

'ప్రత్యగాత్మయందు నానాప్రకారంబులం దోఁచు నీదృశ్యప్రపంచం బంతయు మిథ్య యని తెలియుము.'

'ఇట్లాత్మస్వరూపునిగా హరిని నిరంతరంబు భావించుచుండుట విశేషంబు.'

'బ్రహ్మాత్మైక్యానుసంధానంబు.'

ఇందు మొదటిదియు మూఁడవదియు వ్రాఁతప్రతులందు లేవు. రెండవదానికి మూలము 'ఏవ మాత్మాన మాత్మస్థ మాత్మనైవామృశప్రభో.' దీనికి వ్రాఁతప్రతులం దెల్ల *'ఇట్లాత్మనాత్మ సునిఁగాఁ జేసి హరినిజాకారంబు మనంబునం దలంచుచుండుము' అని తెనుఁగు కానఁబడుచున్నది కాని యచ్చుప్రతులపాఠము కానఁబడదు. కాఁబట్టి యీవాక్యము లంతగా నవలంబనీయములు కావు. ఉభయవిధప్రతులందుఁ గానిపించుపాఠములంబట్టి కడపటి రెండుస్కంధముల తెనిఁగింపు విశిష్టాద్వైతపర మనుట న్యాయ సమంజసముగాఁ దోఁచుచున్నది. ఈ విషయము నిట్లుండ నిచ్చి మఱియొకదానిం గూర్చి కొంత చర్చించుట యావశ్యకము.

ద్వితీయతృతీయచతుర్థస్కంధములందును,బంచమషష్ఠములందును, దశమోత్తరభాగంబునందు, నేకాదశద్వాదశములను బోతనకవిశైలీ కానిపింపమిచే నవి యుత్పన్నములై నారయాదులచేఁ బూరింపఁబడిన వని పండితులు వ్రాసియున్నారు గదా. అందుఁ బంచమషష్ఠములు కేవలరామాంకితములు గాక యచ్యుతనందగోపకుమారాంకితము లగునాద్యంతపద్యగద్యాదులంబట్టి యవి పూర్ణముగా గంగనసింగనలచే రచింపఁబడిన వని నిస్సందేహముగాఁ దెలియుచున్నది. ఏకాదశద్వాదశములు రామాంకితము లయ్యుఁ గవిత్వశైలినిబట్టియు భాషాంతరీకరణవైఖరినిబట్టియుఁ బోతనగంగనసింగనల కితరుఁ డైనయొకనిచే ననఁగాఁ బండితలిఖితపీఠికానుసారముగా నారయచేఁ బూర్ణముగా రచింపఁబడిన వని తెలియుచున్నది. తక్కిన ద్వితీయాదులు మూఁటను, దశమోత్తరభాగమునను గలగద్యములను బట్టియు, రామాంకితము లగునాద్యంతపద్యములనుబట్టియు, వానియందు నయ్యెయెడలఁ బోతనపదశయ్యాదులు గానిపించుటంబట్టియు, నవి యాలుతఁ బోతనచే రచితము లని తెల్లమగుచున్నది. మఱియు శ్రీధరవ్యాఖ్యానమందలియవతారికలను విశేషాంశములను గూడఁ జేర్చి తత్త్వఘట్టములను దెనిఁగించుట పోతనకప్పుఁ దక్కిన వారెవరియందును గానఁబడదు. అట్టి తెనిఁగింపును ద్వితీయాదులు మూఁట వరుసగాఁ జూపెద.

ద్వితీయస్కంధము – పంచమాధ్యాయము.

శ్లో. ద్రవ్యం కర్మ చ కాల శ్చ స్వభావో జీవ ఏవ చ।
వాసుదేవా త్పరో బ్రహ్మ న్నత్వన్యోఽర్థోఽస్తి తత్త్వతః॥

---

* ద్వా. వ. 26.

వ్యా॥ ద్రవ్యం-మహాభూతాని, ఉపాదానరూపాణి ; కర్మ-జన్మనిమిత్తం ; కాలః-తత్క్షోభకః ; స్వభావః - తత్పరిణామహేతుః ; జీవో- భోక్తా-వాసుదేవాత్పర అన్యోర్థోనాస్తి.

తెనుఁగు॥ మఱియు దేహంబునకు ద్రవ్యంబులైనమహాభూతంబులును, జన్మనిమిత్తంబులైన కర్మంబులును, గర్మక్షోభకంబైనకాలంబును, గాలపరిణామహేతువైనస్వభావంబును భోక్తయైన జీవుండును వాసుదేవుండకా నెఱుంగుము. వాసుదేవవ్యతిరిక్తంబు లేదు.

తృతీయస్కంధము-నవమాధ్యాయము.

శ్లో. శశ్వత్స్వరూపమహసైవ నిషిద్ధభేదమోహాయ బోధధిషణాయ నమః పరస్మై
విశ్వోద్భవస్థితిలయేషు నిమిత్తలీలారాసాయ తే నమ ఇదం చకృమేశ్వరాయ।

వ్యా॥ స్వరూపమహసైవ-స్వరూపచైతన్యేనైవ, బోధః (విజ్ఞానమ్) ఏవ ధిషణం-ఆశ్రయం-యస్య...విశ్వస్య ఉద్భవాదిషు నిమిత్తం-మాయా;తస్యాః లీలా-విలాసః, తయాసహ, రాసః-క్రీడా.

తే. తవిలి శశ్వత్స్వరూపచైతన్యభూరి, మహిమచేత నపాస్తసమస్తభేద
మోహుఁడవు నఖిలవిజ్ఞానమునకునాశ్రయుండవగునీకు మ్రొక్కెదనోరమేశ.

క. జననస్థితివిలయంబుల, కనయంబును హేతుభూతమగుమాయాలీ
లను జెంది నటనసలిపెడు, ననఘాత్మక నీకొనస్తు నభివందనముల్.

చతుర్థస్కంధము-ఏకోనత్రింశాధ్యాయము.

శ్లో. అర్థే హ్యవిద్యమానేపి సంసృతిర్న నివర్తతే
మనసా లింగరూపేణ స్వప్నే విచరతో యథా.

ననుతర్హి అజ్ఞానవిలసితత్వేన సంసృతిహేతోర్దేహాదేరప్యసత్యత్వాత్కింతర్హి తన్నివర్తనప్రయాసేన తత్రాహ॥ అర్థేహీతి॥ లింగరూపేణ-ఉపాధిభూతేన.

తెనుఁగు.

సీ. నరనాథ ! వినుము స్వప్నంబుచందంబున, నజ్ఞానవిలసితంబగుటఁజేసి
తివిరి మిథ్యాభూతదేహాదికమునకు, నరయ వివర్తనాయాస మేటి
కని యంటివేనియు నర్థంబు లేకున్న, నర్థిసోపాధికంబైన మనము

ఇట్టి తెనిఁగింపునుబట్టియు సీమూఁడును బోతన మొదట రచించినవే యగునని యేర్పడుచున్నది. దశమోత్తరభాగమునఁ దత్త్వఘట్టముల నిట్టి తెనిఁగింపు కానరాకున్నను, గథాసందర్భములు పెక్కింట నాతనిశైలి నిర్వివాదముగాఁ దెలియుచున్నదిగాన నదియు మొదటఁ బోతన రచించినదే యగునని చెప్పవచ్చును. అయిన సీనాలుగింటఁ బెక్కుచోట్లఁ బోతనపదశయ్యాదులు నతని తెనిఁగింపురీతియును గానరాకున్నవి. రెం డుదాహరణముల మాత్రముఁ జూపెద.

సీ. మందారమకరంద మాధుర్యమునఁ దేలు, మధుపంబు వోవునే మదనములకు
నిర్మలమందాకినీవీచికలఁ దూఁగు, రాయంచ సనునె తరంగిణులకు
లలితరసాలపల్లవఖాది యై చొక్కు, కోయిల సేరునే కుటజములకుఁ
బూర్ణేందుచంద్రికాస్ఫురితచకోరకం, బరుగునే సాంద్రనీహారములకు

గీ. నంబుజోదర దివ్యపాదారవింద, చింతనామృతపానవిశేషమత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేర నేర్చు, వినుతగుణశీల మాటలు వేయునేల. సప్త.

సీ. నీరదాగమమేఘనిర్ముక్తపానీయ, పాన, చాతకం బేఁగునే చౌటిపడెకుఁ
బరిపక్వమాకందఫలరసంబులు గ్రోలు, కీరంబు చనునె దుత్తూరములకు
ఘనరవాకర్ణనోత్కలికమయూరంబు, కోరునే కఠినఝిల్లీరవంబుఁ
గరికుంభపిశితసద్గ్రాసమోదితసింహ, మరుగునే శునకమాంసాభిలాషఁ

తే. బ్రవిమలాకార భవదీయపాదపద్మ, యుగసమాశ్రయనైపుణోద్యోగచిత్త
మన్యుఁ జేరునె తన కుపాస్యంబు గాఁగ, భక్తమందార దుర్భవభయవిదూర.

మ. హరినామాంకితసత్కథామృతరసవ్యాలోలుఁడై నట్టిస
త్పురుషశ్రేష్ఠుఁడసత్కథాలవణవాఃపూరంబుఁ దాఁ గ్రోలునే
వరమందారమరందపానకుతుకస్వాంతద్విరేఫంబు స
త్వర మై పోవునె చేఁతివేములకుఁ దద్గంధానుమోదాత్మ మై. తృతీ.

శా. శోధింపంబడె సర్వశాస్త్రములు రక్షోనాథ వేయేటికిన్
గాథల్ మాధవశేముషీతరణిసాంగత్యంబునం గాక దు
ర్మేధన్ దాఁటఁగఁ గూడునే సుతవధూమీనోగ్రవాంఛామద
క్రోధోల్లోలవిశాలసంసృతిమహాఘోరామితాంభోనిధిన్. సప్త.

మ. ధరణీశోత్తమ నీవు కేవలసముద్యద్భక్తి ధీయుక్తి మై
వరగోవిందపదారవిందయుగభాస్వన్నావ సంధించి దు
స్తరభూరివ్యసనాకరోల్లసితదుర్దాంతోగ్రగంభీరసం
సరణాంభోధిఁ దరింపవయ్య పరమోత్సాహంబు దీపింపఁగన్. చతు.

ఇట నిర్వివాదముగాఁ బోతనకవిరచితము లనఁదగుసప్తమస్కంధపద్యము లందుఁ గానిపించుకవనప్రౌఢిమయు, భావసుభగత్వమును, రసౌత్కట్యమును, శయ్యాచారుత్వమును దక్కినపద్యములందుఁ గానరావు. మఱియును బూర్ణముగాఁ బోతనచే రచితము లనఁబడుస్కంధములందు మఱి, నెఱి, వఱలు, మఱచు, ఎఱుఁగు, పఱచు మొదలగు శబ్దములలోనిఱకార మాఱకారముతో మాత్ర మె యతిప్రాస మైత్రి సెందియుండఁగా నిద్వితీయాదులు నాలుగింట నవి లఘురేఫముతోఁగూడ నట్టిమైత్రి సెందియున్నవి. అయినను

ఉ. పాఱఁడు లేచి దిక్కులకు బాహువు లొడ్డఁడు బంధురాజిలో...
జీరఁడు. సప్త.

క. పోరుదురు గిరుగు వోడుచుచుఁ, దూఱుదురు. దశ. పూ.

చ. విరవిర లేనియట్టిబలుశీవీరుఁడు కృష్ణకుమారుఁ డొక్కచేఁ
జఱచి. దశ. పూ.

చ. మఱియొకనాఁటిరాత్రి బలశీమాధవు లుజ్జ్వలవస్త్రమాలికా
ధరులును. దశ. పూ.

ఇప్పద్యంబుల నుభయరేఫమైత్రి కానిపించుచున్నది. చీరుశబ్ద ముభయరేఫముగా నున్న దని కూచిమంచి-తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహమునం జెప్పినాఁడు గాని యది శకటరేఫమగుట కీపోతనపద్యమునే యుదాహరించినాఁడు. పోతన దీని నుభయరేఫముగాఁ దలఁచెనేమో. పోరుశబ్దప్రయోగము ప్రమాదజనితమై యుండవచ్చును. 'విరవిర' లఘురేఫముగానే.

చ. ఖురముల నేలఁ ద్రవ్వుచు నశీకుంతితవాలసమీరణంబులన్
విరవిరఁబోయి. దశ. పూ.

అనునీపద్యమునఁ గానిపించుచున్నది కాని మీఁద నిందలి రేఫమును అకారమునకు మిత్రముగాఁ బ్రయోగించుటకు హేతువు గానరాకున్నది. పోరుశబ్దమువలెనే యిదియుఁ బ్రమాదవశముననో లేకయుభయరేఫమని తలంచియో కవి ప్రయోగించి యుండును. ఎట్టిధీమంతులకును బ్రమాదము కలుగక పోవదుగదా. 'మఱి' శబ్దము దశమపూర్వభాగాంతమున నుంటంజేసి యుత్తరభాగపూరకుం డగునితరకవిచే నుంపఁబడి యుండు నని తోఁచెడిని. ఈరెండుమూఁడుచోట్లం దప్పఁ బోతనయే పూర్ణముగా రచించినతక్కినస్కంధములం దెల్ల నియతముగా రేఫద్వయమునకు మైత్రి లేమిచే నీరెండుమూఁడువిరుద్ధప్రయోగములు ప్రమాదవశమునఁ గాని మతభేదమునఁ గాని వేఱుకారణముచేఁ గాని కలిగియుండు నని తలఁపవలయునే కాని వీనిని గొని పోతన యుభయరేఫమైత్రి పాటించినవాఁ డనుట యెంతమాత్రము యుక్తము కాదు.

ఇట్లు ద్వితీయాదులు నాలుగింట బెక్కుచోట్లఁ బోతనపదశయ్యాదులు లేమిచేతను, బోతన పాటింపనియుభయరేఫమైత్రి వీనియందుఁ గానిపించుటచేతను, నివి యితరకవిపూరితము లయ్యునుండవలయు నని తోఁచెడిని. అయినను బోతనపదశయ్యాదులు నతని తెనిఁగించురీతియు నందంద కానిపించుటంబట్టియు నాద్యంతపద్యగద్యములంబట్టియు నీనాలుగును మొదటఁ బోతనచే రచితము లైనవే యగు నని యూహింపవలసియున్న దని నిరూపించియున్నాఁడను. కాఁబట్టి యివి మొదటఁ బోతనచే రచితములై, యెడనెడ నుత్సన్నములు కాఁగా నితరకవులచేఁబూరితములయ్యె నని యేర్పడుచున్నది. ఇతరకవులు వీనిని బూర్ణముగా రచించి రేని నట్లు రచించిన యితరస్కంధంబులందుంబోలె నిందును దమపేరే యుంచుకొని యుందురుగదా. ఇది యిట్లుండ వీనిని బోతనకు వెనుకఁ బూరించినవా రెవరు? నారయాదులు ముగ్గు

రా? లేక యం దొక్కరా ? మఱి వేఱొక్కరా? పండితులు నారయాదు లని మొత్తముగాఁ జెప్పియున్నారు. వ్రాఁతప్రతులందుఁ జూడఁగాఁ గొన్నిట దశమోత్తర భాగమునఁ గృష్ణవిరహోక్తిఘట్టమున 'కాటుక నెఱయంగ' అనుసీసపద్యమునాలవపాదము మొదలుకొని శిష్టభాగమును, ద్వితీయస్కంధమున బ్రహ్మ నారదునకుఁ దత్త్వోపదేశము సేయుఘట్టమున 'బహుయజ్ఞవాట' అనుపద్యము మొదలుకొని శిష్టభాగమును అనఁగాఁ జతుర్థస్కంధాంతమువఱకును, నారయకవిత్వ మని వ్రాయఁబడి యున్నది. ఈవ్రాఁతవలన నవియెల్ల నారయచేఁ బూర్ణముగా రచింపఁబడిన వని తలంపక పూర్వోక్తహేతువులంబట్టి యయ్యెయెడలఁ బూరితము లని మాత్రము తెలియవలయును. ఈస్వల్పాధారముతప్ప వేఱొక్కటి కానరాదు. ఇదియును సరియైనదో కాదో నిశ్చయింపరాకున్నది. అయినను గొంతయేని నిజము లేక యిట్లు వ్రాఁతప్రతులందు వ్రాయఁబడుటకు వీ లుండదు. మఱియు నీవిషయమున ఛందోవ్యాకరణసంబంధు లగుగ్రంథస్థనిదర్శనము లే వైనఁ గలవా యని శోధింపఁగా నాకుం గానఁబడినవానిని గొన్నింటి నిట వ్రాసెద.

దశమస్కంధోత్తరభాగంబునం దత్త్వఘట్టముల తెనిఁగింపు చాలవఱకు విశిష్టాద్వైతపరముగా నున్నది.

'దేవా భవదీయసంకల్పాధీనంబు లైనశరీరంబులం బ్రవేశించి యున్నజీవసమూహంబు నీకు శేషభూతం బని తెలిసి కృతార్థు లగుదురు'

'వెండియుఁ గొందఱు సచరాచరవస్తుజాతంబులకు నంతర్యామి వై సర్వంబు నీవ యగుటం దెలియలేక యనిత్యం బని విపరీతబుద్ధిం దెలియుదురు కాని కొందఱు జగచ్ఛరీరుండవు గాన జగద్వ్యాపకుండ వైననిన్నుఁ గటకమకుటకర్ణికాదివివిధభూషణభేదంబులం గనకంబు నిజస్వరూపంబు విడువక వర్తించుచందంబున జగద్వికారానుగతుండ వయ్యును నిఖిలహేయప్రత్యనీకకల్యాణగుణాత్మకుండ వై యుందు వని యాత్మవిదు లైనవారు తెలియుదురు.' 1220

'అట్టిజీవులు దేవతిర్యఙ్మనుష్యస్థావరాదిశరీరంబులు సొచ్చి యనురూపు లై యుందురు. అందును నీ వుంటువు తదంతరాత్మ వగుచు.' 1223

'సకలచేతనాచేతనాంతర్యామియైనసర్వేశ్వరుండు సర్వశబ్దవాచ్యుండు' 1203

'సకలబ్రహ్మాండనాయకుండ వైననీయందు శ్రుతులు ముఖ్యవృత్తిం బ్రవర్తించు' 1230

'మాయాత్మవిశిష్టుండ వగుచుఁ గార్యకారణాత్మకుండ వై.' 1204

ఇట జీవబహుత్వానురూపత్వశేషత్వములు, ఈశ్వరునిజగద్వ్యాపత్వము, చిదచిద్విశిష్టత్వము, శేషిత్వము, శరీరభూతచిదచిదాత్మకత్వము, సర్వశబ్దవాచ్యత్వము, ఈశ్వరునియందు శ్రుతులముఖ్యవృత్తిత్వము మొదలగు విశిష్టాద్వైతసిద్ధాంతములు కానిపించుచున్నవి.

ఇఁక నీయుత్తరభాగంబునం గలలక్షణదోషంబులను బ్రయోగ విశేషంబులను గొన్నింటి వ్రాసెద.

(1) సంధిదోషములు. పద్యగద్యసంఖ్య

| | |
|---|---|
| కోసిచ్చె | 724 |
| నిఖిలావనీశ్వరైన | 1017 |
| నిర్వాణమూర్తైన | 1049 |
| పిశాచపతోట | 1255 |
| ఒదిఁగుండి | 1237 |
| ఎఱిఁగెఱిఁగి | 931 |

(2) విశేషదోషములు.

| | |
|---|---|
| పుత్త్రుండు జాతమైన | 1282 |

(3) ఉకారాంతమునకు నగాగమము లేకయే కుషష్ఠి.

| | |
|---|---|
| ఎఱుకకు. | 723 |

(4) అవధిశబ్దము ఆద్యర్థకము.

| | |
|---|---|
| జారుఁడు జన్మావధియును. | 791 |
| జన్మత్రయావధి | 799 |

(5) పూఞ్ ధాతూక్త ప్రత్యయాంతము పునీతము

| | |
|---|---|
| పునీతములు | 1121 |
| పునీతములు | 1221 |

(6) ఋకారమునకు ఉకారతన్మిత్రములతో యతిమైత్రి.

| | |
|---|---|
| చెలు। వాలయఁగఁ బాటించి యుద్ధశౌవునకు. | 665 |
| కా। వునఁ దగ నర్జునుండు పవనోద్భవుఁడు. | 715 |
| మ, హోగ్రుఁడై పట్టి తెచ్చె సాళ్వుండు. | 900 |
| ఒనరింప మీఱి నశ్వ్వటయు. | 1154 |

మఱియు నీభాగంబునందలియాంధ్రీకరణము పెక్కుచోట్ల న్యూనముగాను భిన్నముగాను నున్నది. ఇఁకఁ దృతీయాదులు మూఁటను విశిష్టాద్వైతప్రతిపాదకపద్య గద్యములును మీఁదఁ జూపఁబడినదోషాదులును వ్రాసెద.

విశిష్టాద్వైతపరపద్యగద్యములు.

ద్వితీయస్కంధము.

సీ. జీవుండు భగవత్కృపావశంబునఁ జేసి
......................భగవచ్ఛరీర
తే. భూతుఁడై పారతంత్ర్యత్మబుద్ధి నొప్పి
దివ్యమాల్యానులేపన భవ్యగంధ
కలితమంగళదివ్య విగ్రహవిశిష్టుఁ
డగుచు హరిరూపమొందుటే యనఘ
ముక్తి. 269

తృతీయస్కంధము.

హేయగుణరహితుఁ డనఁగల, నాయందుల
భక్తి. ... ... 957

| | |
|---|---|
| గురుతరానేకకల్యాణగుణవిశిష్టుఁడు. | 963 |
| మత్సమానాకారతం బొందు. | 958 |

సీ॥...సకలకర్మత్యాగసరణి నొప్పి ఆత్మ
తత్త్వజ్ఞానమున మించి ........
తే॥ మహిత ఫలసంగరహితధర్మమునఁ ద
నరు, నట్టిపురుషుండు దలపోయ నఖిల
హేయ, గుణములను బాసి కల్యాణ
గుణవిశిష్టుఁ, డైనహరి నొందుఁ బర
మాత్ము ననఘుఁ డగుచు. 1026

మఱియు లీలావిభూతినిత్యవిభూతులును, లక్ష్మీనిత్యానపాయినీత్వమును భగ

వత్సమాకారప్రాప్తిరూపముక్తియు, ఈశ్వరునియఖిలహేయప్రత్యనీకకల్యాణగుణవిశిష్టత్వమును, జీవునిపారతంత్ర్యభగవచ్ఛరీరభూతత్వములును ఆత్మయాథాత్మ్యజ్ఞానపూర్వకఫలాభిసంధిరహితకర్మానుష్ఠానమును నీమూఁట నందంద ప్రతిపాదితము లైయున్నవి.

## లక్షణదోషాదులు.

(1) సంధిదోషములు.

తృతీయస్కంధము.

కూ డాడుచుండెడి 106
కది సిట్లనియెఁ 648
తలఁ చిటు 649
ఎఱిఁగేము 785

(2) విశేషదోషములు.

తృ.

అంతర్ధానుఁ డయ్యె 89

చ.

అంతర్ధానుఁ డయ్యె 735

(3) నగామము రామి

ద్వి.

వ్రాతముకు 85, 203

మనువుకు 144

చ.

వనముకు 359
రాజుకు 442

(4) అవధిశబ్దము ఆద్యర్థకము.

క. తనజన్మావధి నిజనం।
దనులను... తృతీయ 16

(5) పూర్వోక్తప్రత్యయాంతము పునీతము

తృ.

కోరి పునీతులఁ జేయు 557
సద్యఃపునీతాత్ము లై 562
పునీతాకృతిన్ 575

చతుర్థ.

ఒప్పఁ బునీతముసేయ 931

(6) ఋకారమునకు ఉకారతన్మిత్రములతో యతిమైత్రి.

ద్వితీయ

ఒప్పఁగఁదగు సప్తతంతుఋవులు. 98

తృతీయ

కావున నీవేళన త్రుంపు సజ్జన
హితోఋద్యోగానురక్తుండ వై 672

ఒదవఁగఁ గానవచ్చుగురుఋవుల్ 257

చతుర్థ.

ఒదవఁగ నిట్లనిరి మానసఋవులు 99
పోడిమిను బంచసప్తతిఋయోజనము 136
కావున నిలఁ బుణ్యతీర్థముల ఋనొప్ప 931

మఱియుఁ దత్త్వఘట్టములందు నీమూఁటను మూలమునందలిశ్లోకములు పెక్కు తెనిఁగింపఁబడకున్నవి. ఇట్లు దశమోత్తరభాగమునఁ గలఛందోవ్యాకరణదోషములును, విశిష్టాద్వైతపరము లగుగద్యపద్యములును, నసమగ్రమును గొన్నియెడల భిన్నము నగునాంధ్రీకరణమును, ద్వితీయాదులు మూఁటను గానిపించుటయు కాక కవిత్వశైలియు నించుమించుగా నొక్కతీరున నుండుటంజేసియు ద్వితీయాదులు మూఁడును దశమోత్తరభాగమును బూరించినవారిచేతనే పూరితము

లై యుండు నని తోఁచెడిని. వ్రాఁత ప్రతులందు దశమోత్తరమును బూరించినవాఁడే ద్వితీయాదులను సైతము పూరించినట్లు వ్రాయఁబడియుండుటయు నీనిర్ణయమునకుఁ గొంతదార్ఢ్యము నిచ్చుచున్నది. మఱియు గంగనసింగనలు వేఱుస్కంధములను బూర్ణముగా రచించుటకు నెత్తుకొనియుండుటవలనను వారికవనంబుల నీద్వితీయాదులు మూఁటను దశమోత్తరభాగమునను గలదోషములలోఁ బెక్కు గానిపింపమింజేసియు వారీనాలుగింటిపూరణంబున సంబంధపడియుండరనుట నిజమునకు మిక్కిలి దూరము కానేరదు. కాఁబట్టి ద్వితీయాదులు నాలుగింటిని బూరించినవాఁడొక్కండై యుండవచ్చు నని చెప్పంబోలును.

ఇది యిట్టుండఁ గడపటిరెండుస్కంధములకడకు మఱలి వత్తము. వీని తెనిఁగింపద్వైతపర మనుటకు నంతగా నుపపత్తిలేమియు విశిష్టాద్వైతపర మనుటకుఁ గలనిదర్శనములును ముందు తెలిపియున్నాఁడను. వీనియందును నాంధ్రీకరణ మతిన్యూనముగాను బెక్కుచోట్ల మూలమునకు భిన్నముగాను నుండుటను దెలిపితిని. నగాగమమురామి, కొనికి కాదేశము మొదలగుకొన్నిలక్షణదోషంబులును వీనియందుఁ గానిపించుచున్నవి. ఈహేతువులంబట్టి యీరెంటికిని ద్వితీయాదులు నాలుగింటికిని సామ్య మేర్పడుచున్నది. దుష్టము లగునఖండయతులీయాఱింట నందంద యతివిరళముగాఁ బొడసూపుటయుఁ గలదు. కడపటిరెండును దఱుచుగాఁ బద్యాత్మకములు కామింజేసి వానికినిఁ దక్కిననాలుగింటికిని ఛందోవ్యాకరణకవిత్వాదివిషయిక మగుసామ్యమును స్థిరీకరించుటకు నయితి కాదు గాని తక్కినపోలికలంబట్టియు వ్రాఁతప్రతులసాక్ష్యముంబట్టియు, నేకాదశద్వాదశములను బూర్ణముగా రచించినవాఁడే, అనఁగా నారయయే, ద్వితీయాదుల మూఁటిని దశమోత్తరభాగమును నందంద పూరించియుండు ననుట యుపపన్నముగాఁ గానిపించుచున్నది.

ద్వితీయాదులు మూఁటను బోతనపదశయ్యాదులు లేనిచోట్ల సైతము తత్త్వఘట్టముల తెనిఁగింపునం దద్వైతపర మగుశ్రీధరవ్యాఖ్యానంబునందలిపదార్థాదులు కొన్ని యందంద కానిపించుచున్నవి. అయిన నది పోతన తెనిఁగింపవలె మూలమునకు మిక్కిలి సరిగాను బూర్ణముగాను లేకయు, గంగనసింగనలకవనంబుల లేనిదోషంబులు కలిగియు, నుంటంజేసి దానిని రచించినవా రాముప్వురిలో నెవ్వరును గారు కాని, నారయయే యాస్కంధంబులలో నుత్సన్నంబులు గాక చిక్కినపోతనభాగంబు లద్వైతపరములుగా నుండుటం జూచి నడుమనడుమ విశిష్టాద్వైతపరముగాఁ దెనిఁగించుట పూర్వోత్తరవ్యాఘాతమునకుఁ బ్రసక్తి కలిగించు నని తలంచి. శ్రీధరవ్యాఖ్యానానుసారముగా శక్తికొలఁదిని దెనిఁగించియుండు ననియు, నైనను విశిష్టాద్వైతమువలనిపక్షపాతమున నందంద తద్దర్శనానుసారముగాఁ గొంత దెనిఁగించియుండు ననియుఁ దోఁచెడిని. దశమోత్తర

భాగమునఁ దత్త్వఘట్టముల నెల్ల నాతం డొక్కరుండె తెనిఁగించినట్లు తోఁచుచున్నది గాన నందుఁ బూర్వోత్తరవ్యాఘాతము ప్రసక్తింప దని తలఁచి దాని నెల్లఁ దఱుచుగా విశిష్టాద్వైతపరముగాఁ దెనిఁగించి యుండు నని యూహింపవచ్చును. అయిన నిది యూహాపోహమే కాక సిద్ధాంతము గాదు గాని శైలి మొదలైనవానిం బట్టి యాస్కంధములకుఁ గలసామ్యమే యిట్టియూహల కెడ మిచ్చియైన నవి యేకకవిపూరితములే యని సాధింపఁ జేయుచున్నది.

నారయ యెంతలాక్షణికుఁడో ‘మదిలోఁ గృష్ణుఁ డెశోద’ ద్వితీ. 180 ‘తన యాయొక్కనిశందు గోపకులు’ ద్వితీ. 182 ‘వాక్యవ్వఁగ’ తృతీ. 324 నను వీనిం జూచినఁ దెలియును. ఇట్టివి పెక్కు లాయూపుటల క్రిందఁ జూడవచ్చును. వీని నెల్లఁ బండితులు సొంతకవనమున సవరించి కప్పిపుచ్చిరి. ‘బంగారుకొండ మూఁపర మనునొరగంట’ తృతీ. 415. ఇట ‘మూఁపురము’నకు ‘మూఁపర’ మని ప్రయోగించినాఁడు. ‘రజత’మునకు ‘రజిత’ మని యున్నది. ఇట్లె పెక్కింటికి గ్రామ్యరూపములును గానంబడుచున్నవి. నారయశైలి కొంత పదసమాసపారుష్యమును బాదపూరణములును గలదై నిరాఘాట మగుధాటితోఁ గూడియుండును. ఒక్కయుదాహరణము:

మ. ఘనసాహస్రకిరీటరత్నవిలసత్కాంతిప్రశుద్ధచ్ఛటా
జనితోదగ్రరుచిప్రకాశితఫణాసాహస్రుఁ డౌ దేవతా
వనరక్షాచణుఁ బూపకృత్యము లొగిన్ వాంఛం బ్రశంసించి వా
రనురాగస్థలితోక్తు లొప్ప నడుగన్ హర్షించి యా దేవుఁడున్. తృతీయ.

మూలమునందలికటుపదరచనల నట్లె తెనుఁగున నుంచుటయు నీకవియందుఁ గానఁబడుచున్నది. ‘పురుకృథోగ్రసవేపథుః’ అనుదానిని ‘పురుకృథోగ్రసవేపథుండై’ యని తెనిఁగించి యున్నాఁడు. ‘వాచీశతంత్ర్య మురుదామ్ని బద్ధాః’ అనుదానిని ‘కర్తృబద్ధులై’ అని తెనిఁగించినపోతనరచనాసౌకుమార్యముం గనుఁడు.

ఇట్లు నేను బరిశోధింపఁగా నాకుఁ గానంబడినవిషయముల నెత్తి వ్రాసినాఁడను. నాయభిప్రాయములకుఁ గలహేతువుల నెల్లఁ దెలిపి యున్నాఁడను. అయినను సిద్ధాంతముసేయుటకు నాధారము లింకను గావలసియున్నవి. చరిత్రాద్యాధారములు లేక కేవలగ్రంథస్థనిదర్శనములంబట్టి చేసిననిర్ణయములందుఁ బొరపాటు లుండకపోవు. ఆంధ్రభాషాభిమానమాననీయు లగుపండితులు సత్యకాంక్షతో నట్టియాధారముల నాకుఁ దెలిపి యేతచ్చర్చావిషయమును మఱింతనిర్వివాదముగా నిర్ణయించుటకు సాయపడుదురు గాక యని కోరుచున్నాఁడను.

తం. తేవప్పెరుమాళ్లయ్య.

# ఉపోద్ఘాతము.



శ్రీమత్పరమయోగిలబ్ధసిద్ధు లగుయోగీంద్రుల కేనియు దురూహ మైనయీ ప్రపంచమున నిత్యంబు జననమరణాది క్లేశసాగరంబునఁ దొప్పఁదోఁగుచు దరిఁ జేర నెరవు గానక దురపిల్లుచుఁ బెల్లలయుజనులదెసం గరుణార్ద్రచిత్తుఁ డై నారాయణాంశసంజనితుం డయి చతుర్వేదవిభాగ మొనరించి వేదవ్యాసుండు నాఁ బేరెన్నిక గన్నకృష్ణద్వైపాయనమునీంద్రుండు గీర్వాణభాషం దొల్లి యెల్లధర్మముల నొప్పారిన పురాణజాతమును మహాభారతేతిహాసంబును సర్వభూతహితంబు గోరి రచియించి యుండె. అవి రచియించియుఁ "దనహృదయంబు సంతసింపకున్న సరస్వతీతటంబున నొంటి నుండి హేతువు వితర్కించుచుఁ దనలో"

"ఆత్మ సంతస మంద దాత్మలో నీశుండు సంతసింపక యున్న జాడ దోఁచె
హరికి యోగివరుల కభిలషితం బైన
భాగవతవిధంబుఁ బలుకనైతి
మోస మయ్యెఁ దెలివి మొనయదు మఱచితి
ననుచు వగచు చున్నయవసరమున"

నారదుఁ డరుదెంచి విష్ణుకథలఁ బొలుపారెడుభాగవతపురాణమును రచియింపు మని బోధించిన నమ్మెయి నమ్మహామునీంద్రుం డతిప్రౌఢం బగుకవితారీతి మెఱయ శ్రీవిష్ణుదేవునిలీలల విలసిల్లునీభాగవతంబును రచియించి కృతార్థుం డయ్యె. అప్పురాణజాతంబులలోఁ బ్రకల్పితంబు లగుగుణనామరూపాదుల ననుసరించి కేవలైకుం డగుసర్వేశ్వరుండు కొన్నిచోటుల శివుం డనియుఁ గొన్నియిక్కుల విష్ణుం డనియుఁ గొన్నితావుల బ్రహ్మ యనియు నింకం బలుచందంబుల నభివర్ణితుం డై యున్నవాఁడు. ఇక్కరణిం బెక్కుతెఱంగులఁ బరమేశ్వరు నభివర్ణించుట యద్దేవదేవునిలీలామహిమంబు లెల్లజనులకుఁ దేటపఱుపఁగాని మానవు లొండొరులతో నితండు మాదైవ మతండు మీదైవము మాదైవం బెక్కువ మీదైవంబు తక్కువ యని వాదులాడుకొనుచు నొకళ్లొకళ్లయెడ బద్ధమత్సరు లై పరస్పరనిందలు మాత్రమ కాక స్వత్వపరత్వభ్రాంతిని దైవదూషణంబుఁ జేయుచుండఁ గోరి కాదు. ఆయామూర్తులవిశేషంబులు వర్ణింపఁబడుచో నిర్వచనసౌలభ్యంబు నవలంబించి యాయామూర్తులు పృథగ్దేవతలుగఁ జెప్పఁబడియున్నవారుగాని యప్పగిదిని నిక్కముగఁ బరస్పరభిన్నులుగఁ బరిగణితులు గారు. వేదములయందును నీరీతినె సర్వకారణం బగుపరబ్రహ్మ మనేకభంగుల నెన్నఁబడియున్నది. ఇందులకుఁ బ్రమాణములు:—

"ఏకోవశీసర్వభూతాంతరాత్మా ఏకం రూపం బహుధా యః కరోతి
త మాత్మస్థం యేనుపశ్యంతి ధీరా స్తేషాం సుఖం శాశ్వత న్నేతరేషాం"
"ఏకోదేవ స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా
కర్మాధ్యక్ష స్సర్వభూతాధివాస స్సాక్షీ చేతా కేవలో నిర్గుణ శ్చ
"ఏకో నారాయణో నద్వితీయోస్తి కశ్చిత్"
"ఏకఏవ శివో నిత్య స్తతోన్యత్సకలం మృషా"
"బహునాత్ర కిము క్తేన సర్వం బ్రహ్మమయం జగత్
అనేకభేదభిన్న స్తు క్రీడతే పరమేశ్వరః"

ఇత్యాద్యిట్టి ప్రమాణంబు లనంతంబు లామ్నాయంబులను బురాణేతిహాస స్మృతులనుం గానంబడియెడి. పురాణంబులలోఁ గొన్నింట శివోత్కర్షంబును గొన్నింట విష్ణుప్రాశస్త్యంబును మఱికొన్నింట నితరదేవతాప్రాముఖ్యంబును నుగ్గడింపఁబడి యున్నవి. ఆయామూర్తివిశేషంబు లుగ్గడించుచో జనులకు భక్త్యతిశయంబు పనుపడుటకును జిత్తైకాగ్ర్యం బలవడుటకును దత్తద్దేవతాప్రాశస్త్యంబును నితరదేవతలం గ్రిందుపఱుచుటయుం జెప్పఁబడియున్నవి కాని యంతలోనన యవ్వానియందు భేదబుద్ధి పాటించుట పోలదు. అట్లు విష్ణూత్కర్షంబు ప్రతిపాదింపఁబడినపురాణములలో నగ్రగణ్యము శ్రీమహాభాగవతము. ఇందుఁ గేవలహరిలీలలు మాత్రము కాక విగళితవేద్యాంతర మగుపరతత్త్వస్వరూపము నిరూపింపఁబడి యున్నది. అయినను నిది గీర్వాణభాషయం దతిప్రౌఢశైలిని వ్రాయఁబడియున్నందునఁ బ్రాకృతజనుల కెంతయు దురవగాహం బై యుండును.

బమ్మెరపోతనామాత్యుఁడు.

ఇప్పురాణరత్నంబు నాంధ్రదేశీయులకుఁ దేటతెల్లగఁ దెలుపఁ గోరి బమ్మెరపోతనామాత్యుండు దీనిని గద్యపద్యాత్మకంబుగ నాంధ్రీకరించి శాశ్వతం బగుయశస్సంపద లనుభవించుచున్నవాఁడు. ఇక్కవిశిఖామణివృత్తాంతంబును గవితాశైలి తెఱంగును గొండొక వివరించెదము.

బమ్మెరపోతనామాత్యుండు కడపమండలములో నున్న* ఏకశిలానగర మను నామాంతరము గలయొంటిమిట్టయం దుండినవాఁడు. అమాత్యశబ్దమువలన నీతఁడు నియోగిబ్రాహ్మణుఁ డని యూహింపవలయు. ఇతఁడు కౌండిన్యసగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. కేసనమంత్రికిని లక్కమాంబకును బుత్త్రుఁడు. మల్లనకవివరునిజనకుఁడు. ఇతఁడు జీవించియుండినకాలమును నిర్ణయించుటకుఁ గొన్నియాధారములు గానంబడియెడి. "బమ్మెరపోతనామాత్యుని జన్మకర్మప్రభావాదులఁ దెలిపెడువచన

---

*ప్రతాపరుద్రదేవునిరాజ్యమునఁ బ్రధానపట్టణ మగునోరుగల్లునకును నేకశిలానగర మని నామాంతరమున్నట్లు ప్రతాపరుద్రీయమువలనను నతనిశాసనములవలనను దెలియవచ్చుచున్నది. కావున బమ్మెరపోతన యం దుండినవాఁడా యని యొకసందియము వొడమెడి. అది నిక్కమయేని నితఁ డొంటిమిట్టయం దుండె ననుసర్వజనులవ్యవహారమునకు హేతువుండదు గావున నిట్లే యిక్కడ వ్రాయఁబడియె.

రూపం బగుప్రాచీనపండితజనలిఖితగ్రంథంబు'' వలన శాలివాహనశకము ౧౩౦౦-వ సంవత్సరమున నిక్కవికుంజరుండు జనన మొందిన ట్లాంధ్ర భాగవతము నింతకుమునుపు ముద్రించినవారు తత్పీఠికయందు వ్రాసియున్నారు. బమ్మెరపోతన భోగినీదండకమును రచియించి వేంకటగిరిసంస్థానాధీశ్వరుండును బండితజనాగ్రగణ్యుండు నగుసర్వజ్ఞ సింగమహీపాలునకుఁ గృతియిచ్చిన ట్లీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది:—

"పండితకీర్తనీయుఁ డగుబమ్మెరపోతన యాసుధాంశుమా
ర్తండకులాచలాంబునిధితారక మై విలసిల్ల భోగినీ
దండకముఞ్ రచించె బహుదానవిహర్తకు రావుసింగభూ
మండలభర్తకు న్విమతమానవనాథమదాపహర్తకున్."

ఇట్లు కృతియిచ్చుటవలన వీరిరువురు సమకాలికు లనుట స్పష్టము. సర్వజ్ఞసింగభూపతి హూణశకము "౧౪౨౨-వ సంవత్సరము మొదలుకొని ౧౪౪౬-వ సంవత్సరమువఱకును విజయనగరాధీశ్వరుఁడుగానున్న ప్రౌఢదేవరాయనితో సమకాలికుఁ"* డని తెలియుచున్నది. కావున బమ్మెరపోతరా జిప్పటి కించుమించుగ నన్నూటయేఁబది సంవత్సరములకుఁ బూర్వ ముండినట్లు నిశ్చయింపవలసియున్నది.

ఇతఁడు పుట్టిననాఁటంగోలె నాంధ్రకవులలో నెవ్వరు ననుభవింపనిమహాదారిద్ర్యము ననుభవించుచుండెను. నన్నయభట్టు తనకవిత్వసంపదను రాజమహేంద్రవరాధీశుం డగురాజనరేంద్రుని కొసఁగి యతనియాస్థానపండితుండై లేమిడి నెఱుంగక కాలము గడపెను. తిక్కనసోమయాజి నెల్లూరుప్రభు వగుమనుమసిద్ధిరాజు నాశ్రయించి యతనిచే నపరిమితధనంబులు ననేకాగ్రహారంబులుం గొని యజ్ఞముసేసి ధనవంతుఁడై యుండెను. ఎఱ్ఱాప్రెగ్గడ యనవేమారెడ్డియాస్థానకవీశ్వరుఁడై యుండి లెస్సగా బ్రదికెను. భాస్కరుఁడు సాహిణిమారనవలన ధనము గ్రహించి జీవించెను. పోతనబావమఱఁది యగు శ్రీనాథుఁడు రెడ్లకుఁ గృతుల నొసంగి యెట్టిసంపద లనుభవించె ననుట తెల్లము. ఈవలఁ గృష్ణదేవరాయనియాస్థానంబున నష్టదిగ్గజము లని పేర్కొనంబడినయల్లసానిపెద్దనాదు లెట్టిమహోన్నతదశయం దుండి రనుట లోకవిదితము. తక్కుంగలయాంధ్రకవు లందఱు నెవరినేనొక్కభూపతి నాశ్రయించి ధనికులైరే మనిరి కాని బమ్మెరపోతనమాత్రము నిప్పచ్చరంబునఁ దొప్పదోఁగుచుండినను నరపతులను వినుతింప నిచ్చగింపక కేవలకృషిమాత్రజీవనోపాయుండై తనకాలము నంతయుఁ గడఁద్రోసెను. తననరస్తుతివైముఖ్యంబునుగూర్చి బమ్మెరపోతనయే భాగవతప్రథమస్కంధమున నిట్లని చెప్పికొనియున్నాఁడు:—

"ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులుఞ్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని సొక్కి శరీరముఁ బాసి కాలుచే
సమ్మెటవాటులం బడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్"

---

* బ్ర. శ్రీ. వీరేశలింగముపంతులవారి ఆంధ్రకవులచరిత్రము రెండవకూర్పు పుట ౨౫

ఇతఁడు చిన్నటినాఁటఁ బసుల మేపుటకయి తనయూరగు నొంటిమిట్టచేరువ నున్నయొకనగరంబున సంచరించుచుండ నతనిపురాకృతసుకృతపరిపాకంబునఁ జిదానందయోగీంద్రుం డనుఋషిచంద్రుండు దయాసాంద్రుండై యతనికట్టెదుటఁ బొడసూపి యతనిభక్తికి మెచ్చి యతనికి నిఖిలసంసృతిదురితతారకం బగుతారకమంత్రం బుపదేశించి చనియె. అంతఁ బోతనకుఁ గ్రమంబుగ నమ్మంత్రరాజమననంబున శ్రీరామానుగ్రహంబు పెంపున ననర్గళం బగుసహృదయహృదయంగమకవితాశక్తిప్రౌఢమఁ దనగురువృద్ధబుధబంధుజనులయభ్యర్థనంబున శ్రీభాగవతంబు నాంధ్రీకరింప సమకట్టె. అట్లు తలంపు గొని యరవిందనయనచరణారవిందంబులు డెందంబునం దిరంబుగ నెలకొలిపి యొకసోమోపరాగపుణ్యకాలంబున గంగానదికిం జని క్రుంకు లిడి ప్రాఁగన్నువెట్టి హరిచరణంబులు ధ్యానించుచున్నెడ శ్రీరామమూర్తి యతనికిఁ బ్రత్యక్షంబై నీవు "మన్నామాంకితంబుగ శ్రీమహాభాగవతంబుఁ దెలుంగు సేయుము నీకు భవబంధంబులు దెగు"నని యానతిచ్చి తిరోహితుం డయ్యె. అంతఁ బోతన పరమానందభరితుండై మగిడి తనయూరికిఁ జనుదెంచి శ్రీభాగవతమును సరసవచనరచనావైదగ్ధ్యము మెఱయ నాంధ్రీకరించి కరంబుఁ దిరంబగుయశంబు సంపాదించె.

ఇతండు భాగవతమును శ్రీరామభద్రునానతిమొగిఁ దదంకితముగ నాశ్వాసాద్యంతపద్యంబులలో శ్రీరామచంద్రుని వినుతించి యున్నవాఁడుగాని కథాప్రారంభసమయమున "నాచిత్తమునశ్రీరామచంద్రునిసన్నిధానంబు గల్పించుకొని" యని నుడివి "హరికి నందగోకుల........" మొదలగు నాలుగుషష్ఠ్యంతపద్యములచేఁ గృష్ణునిమూర్తిం గీర్తించి యతనికి సమర్పితముగా భాగవతంబు నాంధ్రంబున రచియించెద నని వ్రాసియున్నాఁడు. కేవలమూర్తిభేదమాత్ర మగుటంజేసి యిట్లు ధ్యానించియుండనోపు. ఇతఁడు "పరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర" యని గద్యము వ్రాసినయునికి చూడ నితఁడు శివభక్తుఁ డనియుం దెలియుచున్నది. ఇతఁడు కేవలశైవగ్రంథ మగు "వీరభద్రవిజయము"ను రచియించి యున్నట్లు తెలియవచ్చెడి. సర్వోపనిషదర్థవిదుం డగునిమ్మహాత్మునికి శివవిష్ణుభేదబుద్ధి సుంతేని యుండనోపునా?

ఇమ్మహాకవిభక్తిగౌరవమును బ్రభావవిశేషమును దెలుపుకొన్నికథలు పురాతనవిద్వజ్జనపారంపర్యమున మనము వినుచున్నాము. ఇక్కాలపువారు కొంద ఱవి కేవలకల్పితకథ లనియు నిక్కములు గానోపవనియుఁ బరిహసింతురు. మఱియుఁ గొందఱు వానిని బ్రవృత్తములుగానే భావించి వీనిం గొనియాడుదురు. అవి విశ్వాసార్హము లైనను గాకున్నను సకలపండితపామరజనరంజకములుగా నుండుటకు సందియము లేదు గావున వానిలోఁ గొన్నింటి నిట వివరించుచున్నాము:—

(౧) పోతన తృతీయస్కంధమున వరాహావతారఘట్టమును రచియించుచుండఁగ నొకనాఁడు భాగవతమునకుఁ దన్నుఁ గృతిపతిఁగాఁ జేయవొల్లనికతమున నతనిఁ బట్టి కట్టి తెమ్మని కర్ణాటాధీశ్వరుఁ డంపినభటులు వచ్చి యతనిని బాధింపఁదొడఁగి రనియు

నపు డమ్మహాభాగవతుఁడు హరిచరణధ్యానముచేయుచుఁ జలింపకున్న విష్ణువు శ్వేతవరాహరూపంబున నచ్చోటఁ దోఁతెంచి వారిం దఱిమిపాఱఁదోలెననియువిననయ్యెడి.

(౨) పోతన యష్టమస్కంధమున గజేంద్రమోక్షణకథను వ్రాయుచు "నల వైకుంఠపురంబులో నగరిలో" నని వ్రాసి యావలఁదోఁపక లేచియెటకేనియుం బోయె ననియు నతఁడింట లేనప్పుడు శ్రీకృష్ణస్వామి పోతనరూపమునఁదనయగారముసొత్తెంచి తనయ గారవమొప్పఁ బిలిచి పొత్తము దెమ్మని యందాపద్యములో "నామూల సౌధంబుదాపల" నని వ్రాసి మగిడి యరుదెంతునని చెప్పి చనియె ననియుఁ బదంపడి పోతరాజు సనుదెంచి యనుఁగుఁగూఁతుచే గ్రంథముఁ దెప్పించి యందు వ్రాసియున్న పైభాగంబుఁ గని యిదియెవ్వరు వ్రాసిరని కూఁతునడుగుటయు నాచిన్నది నీవింతకు మున్నె వచ్చి వ్రాసి చని యిప్పుడిమ్మెయి యడుగుట యేలొకో యని చెప్పఁగా విని యోహో భగవంతుఁడగు శ్రీహరి యవ్యాజకటాక్షంబున నిట్లు చేసియుండవలయు నని నిశ్చయించి విష్ణుమూర్తిని సందర్శింపఁ గలిగినతనయభాగ్యంబుఁ బొగడి తన యభాగ్యంబుఁ దెగడి సంతాపముఁ బొంది యావలిభాగము వ్రాయ దొరఁకొనె ననియుఁ జెప్పుదురు.

(౩) పోతన దశమస్కంధమున రుక్మిణీకల్యాణము వ్రాయునెడ "దేవకీసుతు కోర్కితీవెలు వీడంగ" ననుపద్యమున రుక్మిణీయౌవనావిర్భావవర్ణనము సేయుచు "హరికిఁ బ్రేమబంధ మధికంబుగాఁ గేశబంధ మధిక మగుచు జాల కమరె" నని వ్రాయఁగా నంతలోన నతనికూఁతురు కుంపటిలోఁ బడి కమరె ననియుఁ "బద్మనయనువలనఁ బ్రమదంబు నిండార" నని వెంబడినె వ్రాయ నామె యయ్యాపద దొలఁగి సుఖించె ననియు మఱియొకకథఁ జెప్పుదురు.

(౪) ఈకవీశ్వరునికి సకలవిద్యాసనాథుఁడగు శ్రీనాథుఁడు బావమఱఁది యని యందురు. వీరిరువురు సమకాలికు లగుటకెంతమాత్రము సందియములేదు. ఎట్లనఁగా భోగినీదండకమువలన బమ్మెరపోతరాజు వేంకటగిరిరాజయినసర్వసింగమహీపాలునికాలమువాఁ డనుట తెల్లము. శ్రీనాథుఁడు నాభూనాథునికాలమున నుండె ననుటకు నొకనిదర్శనము గలదు. శ్రీనాథుఁ డాంధ్రదేశమునం గలసకలధరణీపతుల సభలకునుబోయి తనకవిత్వాతిశయమును బ్రకటించి యందఱిచే మన్ననలును బిరుదులును ధనములును బడసి వేంకటగిరికిఁ జనుదెంచి సమస్తవిద్యలయందును నిరుపమవైదుష్యంబు గలిగి సర్వజ్ఞుం డని పేర్కొనఁబడినరావుసింగభూపతిని సందర్శింపఁ గడఁగి యతనిసభ కేఁగుటకుము న్నతఁడు త న్నేమేమి యడుగునో యెక్కడఁ దప్పులు పట్టునో యని తలఁకి

సీ. "దీనారటంకాలఁ దీర్థ మాడించితి దక్షిణాధీశుముత్యాలశాలఁ
బలుకుఁదోడై తాంధ్రభాషామహాకావ్యనైషధగ్రంథసందర్భమునకుఁ
బగులఁగొట్టించి తుద్భటవివాదప్రౌఢి గౌడడిండిమభట్టుకంచుఢక్కఁ
జంద్రశేఖరక్రియాశక్తిరాయలయొద్దఁ బాదుకొల్పితి సార్వభౌమబిరుద

మెటులు మెప్పించెదో నన్ను నింకమీఁద
రావు సింగమహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొని యుండి నీవు
సరససద్గుణనికురుంబ శారదాంబ”

యని చెప్పి చింతామణిమంత్రరాజమునఁ దనకుఁ బ్రసన్నురాలైనసరస్వతీదేవిని సంస్తుతించి యమ్మేదినీనాయకుపేరోలగమునకుఁ జనియెనఁట.

శ్రీనాథుఁడు తనబావ సుతసతీయుతుఁడై మహాదారిద్ర్యము ననుభవించుటం గని యుత్తలంపడుచిత్తంబుతో నతని నెట్టులైన నొప్పించి భాగవతమును గర్ణాటాధీశ్వరున కంకితము సేయించి ధనవంతుఁ గావింప నెంచి దారిద్ర్యదుఃఖ మతనికిఁ బెక్కు మడుంగు లెక్కుడుగాఁ దోఁపఁగోరి యొక్కనాఁడు చతురంతయానాధిరూఢుఁడై పెక్కండ్రు పరిజనులు పరివేష్టించి రాఁ బయనమై యొంటిమిట్టచేరువఁ జనుదెంచుచుండి పోతన తనపొలములోఁ గూర్చుండి తనయుండగుమల్లనచే దున్నించుచుండఁ గని తనమహత్త్వమును దెలుపఁగోరి శ్రీనాథుఁడు పల్లకి మోయువాండ్రలో ముందటిదండెను మోయువారిని బల్లకిని విడిచిపెట్టుఁడని యానతిచ్చె ననియుఁ బల్లకి యెప్పటియట్ల నడచుచుండెననియు మల్లన యీచిత్రమును దండ్రికిఁ జూప నతఁడు నాఁగటికాఁడికిఁ గట్టినయొకయెద్దును విడువు మని యాజ్ఞాపింపఁగా మడక యథాప్రకారము సాగుచుండె ననియు శ్రీనాథుఁడు పల్లకియావలిప్రక్క మోయువారినింగూడ వదలుండనఁగాఁ బల్లకి మోఁతగాండ్రు లేకయే నడచుచుండఁ గని పోతనయుఁ గాఁడియందలి రెండవయెద్దును విడిపించి దుక్కిసాగించె ననియు నంతట శ్రీనాథుఁడు పల్లకి డిగి బావ చెంతకేతెంచి హాలికు లగుమీకుఁ గుశలమా యని యుల్లసమాడె ననియు దానక్

* ఉ. “బాలరసాలసాలనవపల్లవకోమలకావ్యకన్యకం
గూళల కిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైన నేమి గహనాంతరసీమలఁ గందమూలకౌ
ద్దాలికులైన నేమి నిజదారసుతోదరపోషణార్థమై”

యని కినిసి పోతన పొడిచి చెప్పె ననియు నంత శ్రీనాథుఁ డతనిం గవుంగిటఁ గ్రుచ్చి బావా వేడుకకై మేలమాడిన నలుగనగునా యని యతని ననునయించి

క. “కమ్మనిగ్రంథం బొక్కటి
యిమ్ముగ నేనృపతికైనఁ గృతి యిచ్చినచోఁ
గొమ్మని యియ్యరె వెయ్యా
ర్లిమ్మహి దున్నంగనేల యిట్టిమహాత్మల్”

అని సరస్తవనం బగుకవనంబు సేయ నియ్యకొలుపుచు నందఱం గలసి యింటికేఁగె ననియు నింట వంటపదార్థము లేమియు లేమిని మల్లన నెటకేనియు నప్పుగొని తేరఁ

---

* ఉ. “బాలరసాలసాలనవపల్లవకోమలకావ్యకన్యకం
గూళల కిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకన్న మేలుగా
హాలికులైన నేమి మఱి యంతకును న్వగలేక యున్నఁ గౌ
ద్దాలికులైన నేమి నిజదారసుతాదికపోషణార్థమై” అని పాఠాంతరము.

బంచి యతండు విఫలమనోరథుండై మగిడి చనుదెంచుచుఁ బోతన యింటికిని నేఁ డెప్పుగిది నోగిరం బిడువాఁడ నని కొండొకవడి యలందురి యెట్టకేలకు దిట్టతనంబు దెచ్చికొని మఱుఁదిని దక్కుంగలవారిని జలకమాడి రాఁ బనిచి సరస్వతీదేవిని బరమ భక్తియుక్తుండై ధ్యానింప నద్దేవి యతనికిఁ బొడసూపి బానసము శుద్ధిచేయించి యచట నొక తెర కట్టింప నాజ్ఞాపించి యతం డట్లు కావింప నేఁ జూచికొనియెద నీ వింక వగవ వలదని యూఱడించె ననియు నంత శ్రీనాథుఁడు కృతావగాహుండై తనవారి నెల్లఁదోడ్కొని గీమునకు మఱలి వచ్చి యచ్చట సువారపుంబను లేవియు జఱుగకుండుట కబ్బురపడి భుజియింప నందఱు వరుసలుదీరి కూర్చుండ భగినిం బిలిచి యక్కా యింకఁ దడయ నేల వడ్డింపు మనవుడు నాసాధ్వి తెరమాటుననుండి భారతీదేవి పంచభక్ష్య పరమాన్నములతోఁ జతుర్విధాహారములు నించినపాత్రంబు లందియ్యఁ దెచ్చి తెచ్చి యందఱికిని వలయునంత వడ్డించి శ్రీనాథాదుల నాశ్చర్యరససాగరతరంగపరంపరాప్లావితచిత్తులఁ గావించెననియు భోజనోత్తరంబునఁ దాంబూలచర్వణములు సలుపుతఱి శ్రీనాథుఁడు తనబావ దెస నుపలక్షించి కవిశ్రేష్ఠుండవగునీ కిట్టిమహాదారిద్ర్యమనుభవింప నేల? నీవురచించుభాగవతమును నేరాజునకయిన నంకితముసేసి వలయునంతధనము సంపాదించి సుఖవృత్తి నుండుమా. పారలౌకికసుఖంబుమీఁదియాశచే నైహలౌకిక సౌఖ్యంబును నిరాకరించి యిడుములఁ బడి బడలనేల యని బోధించి యతనిడెందముఁ గరఁగింప నంతలో వాణి యతనియెదుట నిలిచి వలవల నేడువఁగాఁ బోతన

ఉ. కాటుకకంటినీరు చనుకట్టుపయిం బడ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాఁదిలికోడల యోమదంబ యో
హాటకగర్భురాణి నిను నాఁకటికిం గొనిపోయి యల్లక
ర్ణాటకిరాటకీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్ము భారతీ"

యనుపద్యముఁ జెప్పి సరస్వతి ననునయించె ననియు నంతట శ్రీనాథుఁడు పోతనభాగవతముం దెప్పించి దాని నక్కడక్కడఁ బరిశీలించుచు నష్టమస్కంధంబున గజేంద్రమోక్షణకథాప్రసంగంబున నేనుంగును మొసలివాతివలన విడిపింపఁ గరుణ వొడమి విష్ణువు వైకుంఠము నిర్గమించుచో

మ. "సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లము చక్కనొత్తఁడు వివాదప్రోద్ధతశ్రీకుచో
పరిచేలాంచల మైన వీడఁడు గజప్రాణావనోత్సాహి యై"

యని యేసన్నాహమును లేక దిగ్గన లేచి పఱతెంచె నని యుండఁ గని బావా భక్తుని శత్రువును జంపఁబోయినవిష్ణువు పరికరములు లేక వేడుకచూడఁ బోయెనా? కాకున్న నేమి సేయఁ బోయె నిట్లు చెప్పుట పోల దని యాక్షేపించె ననియు దానికిఁ బోతన యపు డేమియు నుత్తరం బియ్యక మిన్నకుండి మఱునాఁడు శ్రీనాథుఁడు మస్తకమున మానియ నిడి రాచుకొనుచుండుసమయమున నతనికుమారు నెక్కడనో దాఁచి

వచ్చి పోతన పెరటినూతిలో నొకపెనుఱాతిం బడ వైచి యల్లన వచ్చి మఱందిం గని నీకొడుకు బావిలోఁ బడియె ననుటయు శ్రీనాథుండు గుండె జల్లుమన దిగ్గన లేచి విరియఁబోసికొనినవెండ్రుకలతోఁ గాఱుచున్ననూనియతో విగళితం బగునల్పపరిధానంబుతో నవ్వాపిచెంతకుఁ బరుగెత్తి తొంగితొంగి యందుఁ జూచుచు నాక్రందనము సేయుచుండఁ బోతన వెనువెంటం బఱతెంచి శ్రీనాథా యిదియేమియవసరము? నిచ్చెనయెక్కడ? త్రాడెక్కడ? బావిలోదిగుటకు భటులెక్కడ? ఈయొడలినూనియఁ గడిగికొని జలకమాడి కేశజాలము ముడిచి యూరికి బైటఁబోయి యున్నపరివారము నెల్లఁ బిలుచుకొని వలసినయుపకరణావళి యెల్ల సంతరించుకొనికదా రావలయు. అట్లు గాక యిక్కరణి వేడుకఁ జూడవచ్చితివా కాకున్న నీవు నందుఁ బడ వచ్చితివా యని పరిహాసముచేసి నీవు పుత్త్రవాత్సల్యమున నేరీతి నాతురముతోఁ బరికరములు లేకయే పరువిడివచ్చితివో యాచాడ్పుననే పరమేశ్వరుఁడును దనభక్తులదెసం గలవాత్సల్యాతిరేకంబున భక్తునిమొఱ చెవి సోఁకగానే తటాలున లేచి యుపకరణావళిం దడవక పరువిడి యరుదెంచె నని సమాధానము చెప్పె ననియు నీకథ లూరూరను బహుపండితపామరజనపరంపరాముఖములుగ వినుచున్నాము.

పై వివరించినకథలు నిజములో కేవలకల్పితములో మిశ్రములో నిశ్చయింపఁ జాలము. వీనిం జదువువారు తమతమయుక్తికొలఁదిని భక్తికొలఁదిని నూహించుకొనవచ్చును.

పోతరాజు భాగవతము సమగ్రముగాఁ దెనిఁగించి నిరంతరహరిహరపదధ్యానైకతానమానసుం డై విశాలయశోలతల కాలవాలం బై నెగడి శాశ్వతం బగుతన పేరుం దనగ్రంథముతో నీలోకమున నిలిపి నశ్వరం బగుకాయంబు దొఱఁగి పరమపదమున కరిగె.

## గ్రంథపాతవివేచనము.

ఇమ్మహాకవి భాగవతమును దెలిఁగించి దానిని లోకమునఁ బ్రకటింపక తాళపత్రసంపుటమున లిఖించి పదిలముగా దేవతార్చనపేటికయం దుంచి పూజించుచు వచ్చి నిర్యాణకాలంబునఁ దనకుమారుఁ డగుమల్లనం బిలిచి మందసము నతనికిఁ జూపి యందున్నధనమును జతనమునఁ గాపాడు మని యాజ్ఞాపించి పంచత్వముఁ బొందె ననియుఁ దదనంతరము మల్లన దానిని విప్పి పరిశోధింపఁగా నం దనేకభాగములు శాణనామకక్రిమికులదష్టంబై నష్టంబై యుండినందునఁ బోతరాజశిష్యుం డగువెలిగందలనారయకవి కొంతభాగమును నేర్చూరిసింగన కొంతభాగమును గంగరాజు మఱికొంతభాగమును మఱలఁ దెనిఁగించిరనియుఁ గొందఱు చెప్పుచున్నారు. మఱికొందఱు సర్వజ్ఞభూపతి బమ్మెరపోతనం బిలిపించి భాగవతమునకుఁ దన్నుఁగృతిపతిఁగా నొనర్పు మని వేఁడి యతఁ డియ్యకొనమికిఁ గోపించి యన్నరపాలుఁడు భూమిలో నొకపెనుఁబల్లము ద్రవ్వించియం దాగ్రంథమును బూడ్పించెననియు నంతఁగొంత కాలమున కాతేని

పత్త్రికలలో శ్రీరామమూర్తి సాక్షాత్కరించి యాసద్గ్రంథమును బైటఁ దీయించి జగంబునఁ బ్రకటింప మగనిఁ బ్రోత్సాహపఱుపు మని యానతిచ్చి యంతర్ధానము నొందె ననియు నాయమ వేఁడికోలు నంగీకరించి సింగనృపాలుఁడు పుస్తకమును బైటఁ దీయింప నం దక్కడక్కడఁ దాటాకులఁ బలుదెఱఁగులపురుగులు తిని పెక్కుచోట్లు శిథిలములై యుండెననియు నంతటఁ బోతనశిష్యవర్గములోనివా రగు వెలిగందలనారాయణాదులు నష్టభాగములను బూరించి రనియుఁ జెప్పుచున్నారు. ఈహేతువునే కూచిమంచితిమ్మకవి "సర్వలక్షణసారసంగ్రహము"నందు

సీ. "ఘనుఁడు పోతనమంత్రియును భాగవతము రచించి చక్రికి సమర్పించు నెడల
సర్వజ్ఞసింగమక్ష్మావరుం డది తన కిమ్మని వేఁడఁగా నీయకున్న
నలిగి యాపుస్తకం బవనిఁ బాఁతించినఁ జివికి యం దొకకొంత శిథిల మయ్యెఁ
గ్రమ్మఱ నది వెలిగందల నారప్పరాజును మఱి బొప్పరాజు గంగ
రాజు మొదలగుకవివరుల్ తేజ మెసఁగఁ
జెప్పి రాగ్రంథములయందె తప్పు లొదవెఁ
గాని పోతకవీంద్రునికవితయందు
లక్షణం బెందుఁ దప్పునా దక్షహరణ!'

యని చెప్పియున్నాఁడు.

వీనిలో నేకారణము నిజ మయినను బోతరాజకృతభాగవతమున నక్కడక్కడఁ గొన్నిభాగము లుత్సన్నము లగుటయు వానిని నారయాదులు పూరించుటయు స్పష్టము. కాని యేయేభాగములు పోతనవిరచితములో యేయేభాగము లితరకవులు చెప్పిరో వాని నిర్దేశించుటకుఁ దగినయాధారము లంతగాఁ గానము. ద్వితీయస్కంధములో బ్రహ్మనారదునకుఁ దత్త్వోపదేశంబుసేయుఘట్టమునఁ "బశుయజ్ఞవాటయూపస్తంభపాత్త్రమృద్ఘటశరావవసంతకాలములను" ననుసీసపద్యము మొదలుకొని "వెలిగందలనారయ చెప్పినకవిత్వ" మని పూర్వముద్రితభాగవతమునందు ముద్రింపఁబడియున్నది. ద్వితీయస్కంధమున గద్యముంజూడఁగాఁ బోతనామాత్యరచితంబని యేయున్నది. తృతీయచతుర్థస్కంధములును "బోతనామాత్యప్రణీతం"బని యేయున్నది. పంచమస్కంధాంతగద్యమున గంగనార్యప్రణీతంబనియు, షష్ఠంబున నేర్చూరిసింగనార్యవిరచిత మనియు నున్నవి. ఈసింగన, "పేర్చూరిశాసనుం" డగు నెఱ్ఱాప్రెగ్గడకు మనుమఁ డని యాస్కంధంబునఁ దొలుతఁ జెప్పికొనియున్నాఁడు. సప్తమాష్టమనవమస్కంధములును దశమస్కంధపూర్వభాగమును బోతనామాత్యప్రణీతము లని యున్నది. దశమస్కంధోత్తరభాగమున శ్రీకృష్ణుఁడు కేళీగృహమునందు రుక్మిణీదేవితో విరసోక్తు లాడుట యనుఘట్టమునఁ "గాటుక నెఱయంగఁ గన్నీరు వఱదలై" యనుసీసపద్యము మొదలు వెలిగందల నారాయణకవివిరచిత మని ప్రాచీనపండితజనలిఖితపుస్తకములందుఁ జెప్పఁబడియున్నదని పూర్వముద్రితగ్రథపీఠికయందు వ్రాయఁబడియున్నది. ఏకాదశద్వాదశస్కంధములగద్యములలో నారాయణాఖ్యప్రణీత మని యున్నది.

ఇవి మాత్రమే కాక పోతనామాత్యవిరచితము లని గద్యము లున్నస్కంధములలో నేయేచోటుల నేయేపద్యముల నేయేకవు లెంతెంతభాగము వ్రాసిరో యెఱుంగరాదు. శైలిభేదములవలనఁ గొంతకొంత యూహింపవచ్చుఁ గాని యిద మిత్థ మని నిర్ణయము సేయ సాధ్యము గాదు.

శైలి లోనగువానింగూర్చి యిఁకఁ బ్రశంసింతము.

ఈమహాకవీశ్వరునికవిత్వ మతిసుకుమారసరసవచనరచనాధౌరేయ మై నాతికఠిన మై శబ్దార్థాలంకారశోభమాన మై కోవిదపామరజనహృదయంగమ మై వీనులవిం దై చదువువారి కమందానందంబు గలిగించును. చదువుచుండఁగానే యర్థమును గోచరం బగుటచేఁ బోతనరచన కేవలద్రాక్షాపాకము. తెలుఁగుగాఁ గోమలసురుచిరపదసముదయసంకలిత మగుట నీగ్రంథమునఁ గైశికీవృత్తిప్రధానము. ఓజఃప్రసాదమాధుర్యాదికావ్యగుణంబులు పోతనకవనంబున మెండుగాఁ గానఁబడుచుండును. రసానుగుణంబుగ శైలి నుచితరీతుల మార్చి రసపోషణంబు సేయుటయందుఁ బోతన యెంతయుసమర్థుఁడు. శృంగారరసపోషితభక్తిరసము పోతనకవనమున విలసిల్లుకైవడి నితరాంధ్రగ్రంథములయం దెక్కడను గానము. కేవలశృంగారరసమును భక్తిరసమును నెందఱేఁ గవులు వర్ణించియున్నారుగాని భక్తిరసమునకు సకలజనరంజనంబుపొంటె శృంగారరసంబు నంగంబుగ నంగీకరించి యెల్లరయుల్లంబుల హరిభక్తి నివ్వటిల్లి పల్లవింప నిట్లు చిత్రముగా వర్ణించినకవు లెవ్వరును లేరు. సగుణవర్ణనావైదగ్ధ్యంబునఁ బోతనతోఁ దులఁదూఁగువారు లేరు. ఇతనికిఁ గలహరిభక్తి యంతయు నచ్చుపడ శ్రీవిష్ణుదేవునిలీలామాహాత్మ్యంబులు పరిపరివిధములఁ దనయావచ్ఛక్తిని వినియోగించి మనోహరలీలల వర్ణించియున్నవాఁడు గావున నెట్టివారి కేని భాగవతమును జదువ దేహము పులకాంకిత మగును. సప్తమస్కంధమునఁ బ్రహ్లాదచరిత్ర ప్రస్తావమున హరిభక్తి వర్ణింపఁబడియున్నరీతి యంతయు నవాఙ్మానసగోచరము. అది చదువఁజదువ మనంబు భగవంతునిపాదారవిందయుగళంబున లయించుటయ కాక పోతనామాత్యునివర్ణనాచాతుర్యంబును నీశ్వరభక్తియు నింత యొప్పునే యని డెందమున నిబ్బరంపుటబ్బురంబును గదిరెడి.

కేవలశృంగారరసమున నష్టమస్కంధంబున మోహిన్యవతారవర్ణనంబును దశమస్కంధమున గోపికాకృష్ణవిలాసములును వీరరౌద్రరసములకు సప్తమస్కంధమున శ్రీనృసింహావతారఘట్టంబును నుదాహరణంబులు. ఇట్లక్కడక్కడ నాయా రసముల కుదాహరణము లూహించుకొనునది. మహాకావ్యలక్షణము లగు

క. "పురసింధునగర్త్వనశశి
సరసీవనమధురతిప్రసంగవిరహముల్
పరిణయతనయోదయనయ
విరచనయాత్రాజిమాత్యవిభువర్ణనముల్"

అనువీనిలోఁ బెక్కులక్షణములు భాగవతమున నక్కడక్కడ మనోజ్ఞముగా వర్ణింపఁబడి యున్నవి.

అనేకవిధము లగుశబ్దాలంకారములలో నంత్యప్రాసనియమంబును నీకవి విచ్చలవిడి ప్రయోగించియున్నాఁడు. ఈశబ్దాలంకారము పోతనకవిత్వమునందు వెలయుమనోజ్ఞభంగి నితరకవులరచనల నెక్కడనుం గానరాదు. ఇందుల కుదాహరణములు సూచించెదము.

క. “కనియె న్నారదుఁ డంతన్
వినయైకవిలాసు, నిగమవిభజనవిద్యా
జనితోల్లాసున్, భవదుః
ఖనిరాసున్, గురుమనోవికాసున్ వ్యాసున్.”

ప్రథమస్కంధము.

మ. “కనియెం గృష్ణుఁడు సాధునీరము, మహాగంభీరముం, బద్మకో
కనదాస్వాదవినోదమోదమదభృంగద్వంద్వఝంకారమున్,
ఘనకల్లోలలతావితానవిహరత్కాదంబకోలాహల
స్వనవిస్ఫారము, మందవాయుజకణాసారంబుఁ గాసారమున్.”

దశమస్కంధము.

ఇక్కడ సమాసాంత్యవర్ణము లెల్ల నొక్కటియగుట నంత్యప్రాసనియమంబు నాఁబడు. ఇట్టియంత్యనియమచిత్రములు గలపద్యంబులు పోతనకవిత్వములో లెక్కకు మిగిలినవై యున్నవి. ఇవి ప్రయోగించునపుడు తఱుచుగాఁ గ్రియాపదమును బద్యముతొలుత నుంచి వెంబడి నాక్రియతో నన్వయించువిశేష్యపదమున కనేకవిశేషణములు చెప్పి యావిశేష్యముతోఁ బద్యమును ముగించుచున్నాఁడు గావున నివి యెంతయు హృద్యములుగా నుండును. “కనియె” ననిపద్యారంభమునఁ గ్రియయుండెనేని నంత్యనియమ మవశ్య మందున్నదని యూహింపవచ్చు. ఈయలంకారవిశేషము పోతనకవిత్వములోఁ బ్రతిఘట్టమునఁ గానఁబడుచున్నను శ్రీరామభక్తాగ్రేసరుఁ డగుటంజేసి నవమస్కంధమున రామావతారకథాప్రసంగంబున ననేకపద్యముల నీశబ్దచిత్రములతో నతిమనోహరంబుగ విరచించియున్నవాఁడు. శ్రీరామదేవునికిఁ బరమభక్తుండుగావున రామాయణమునే తెనిఁగింపఁ దనకుఁ గోరికి యగ్గలంబనియు నైనను దద్గ్రంథ మంతకుఁబూర్వమే భాస్కరాదులచేఁ దెనిఁగింపబడియుండుటచే దానినే మగుడఁ దా రచియించుట చర్వితచర్వణం బనియుఁ “బదిరెను భాస్కరుఁడు లేదా రామాయణమును బండ్ల కెక్కింపనా” యనియుఁ జెప్పి పోతన విషాదపడి యది మానుకొని భాగవతముఁ దెనిఁగింపఁ బూనె ననియుఁ బెద్దలు వ్యవహరింతురు. ఈశబ్దాలంకారపక్కి నితఁడు భాస్కరరామాయణంబున సంగ్రహించియుండనోపుననితోఁచెడి.

ఉ. “పాటితదుష్టసత్త్వవసవాటక, నిద్ధబలావరుద్ధశృం
గాటక, గ్రంథిలభ్రుకుటిగాఢలలాటకఁ, గ్రూరతారకా
నాటక, నాంత్రకాంచిపరిణద్ధశవప్రపతత్కిరిచ్ఛటా

కీటక, రక్తసిక్తపటుఖేటకఁ దాటకఁ గాంచి రయ్యెడన్"

భాస్కరరామాయణము-బాలకాండము.

మ. "సవరక్షార్థము తండ్రి వంపఁ జని విశ్వామిత్రుఁడుం దోడ రా
నవలీలం దునుమాడె రాముఁ డదయుం డై బాలుఁ డై కుంతల
చ్ఛవిసంపజ్జితహాటకం, గపటభాషావిస్ఫురన్నాటక
జవభిన్నార్యమఘోటకం, గరవిరాజత్ఖేటకం దాటకన్."

భాగవతము-నవమస్కంధము.

ఉ. "పుణ్యచరిత్రుఁ డత్రిమునిపుంగవు వీడ్కొని రాముఁ డంచితా
గణ్యగుణాభిరాముఁ డుపకంఠమునం జని కాంచె దండకా
రణ్యము సిద్ధసంయమివిరాజితచారుతపోనుజాతస
త్పుణ్యము, నిర్మలాంబువరపుష్కరపూర్ణసరోవరేణ్యమున్."

భాస్కరరామాయణము - ఆరణ్యకాండము.

ఉ. "పుణ్యుఁడు రామచంద్రుఁ డటఁ బోయి ముదమ్మునఁ గాంచె దండకా
రణ్యముఁ దాపసోత్తమశరణ్యము, నుద్ధతబర్హిబర్హలా
వణ్యము, గౌతమీవిమలవాఃకణపర్యటనప్రభూతసా
ద్గుణ్యము, నుల్లసత్తరునికుంజవరేణ్యము సత్యగణ్యమున్."

భాగవతము - నవమస్కంధము.

ఎఱ్ఱాప్రగ్గడయు నీయలంకారమును బ్రయోగించియున్నాఁడు.

క. "ధీమంతు లంతఁ గాంచిరి
గోమంతము విపినకుసుమకుంచితశబరీ
సీమంతము నిర్ఝరకణ
హేమంతముఁ గనకమయమహీమంతంబున్."

హరివంశము, ఉత్తరభాగము. ఆ. ౧

క. "చారుశరీరద్యుతిజిత
శారదనీరదుఁడు ధీవిశారదుఁడు భవో
త్తారకుఁ డాశ్రితవితతికి
నారగుఁడు తదీయగృహమునకు నేతెంచెన్."

ఆ. ౬.

ఇయ్యలంకారవిశేషమును బోతన నానావిధచిత్రగతుల వీనులవిందుగా రచియించియున్నవాఁడు.

క. "భూషణములు సెవులకు నఘ
పేషణములు మృత్యుచిత్తభీషణములు హృ
త్తోషణములు కల్యాణవి
శేషణములు హరిగుణోపచితభాషణముల్."

క. "పావనములు దురితలతా
లావనములు నిత్యమంగళప్రాభవసం
జీవనములు లక్ష్మీసం
భావనములు వాసుదేవపదసేవనముల్."

ప్రథమస్కంధము.

క. "మంతనములు సద్గతులకుఁ
బొంతనములు ఘనము లైనపుణ్యముల కిదా
నీంతనపూర్వమహాఘని
కృంతనములు రామనామకృతచింతనముల్."

నవమస్కంధము.

క. "ధృతి చెడి లోఁబడె మల్లం
డతులితభవజలధితరికి హతరిపుపురికిన్
హితకరికిన్ ధృతగిరికిం
దతహరిరవభరితశిఖరిదరికిన్ హరికిన్."

దశమస్కంధము.

క. "స్ఫురితవిబుధజనముఖములు
పరివిదళితదనుజనివహపతితనుముఖముల్
గురురుచిజితశిఖిశిఖములు
నరహరికరనఖము లమరు నతజనసఖముల్."

గీర్వాణపదలఘుభూయిష్ఠము - సప్తమస్కంధము.

క. "అడిగెద నని కడువడిఁ జను
నడిగినఁ దను మగుడ నుడువఁ డని నడ యుడుగున్
వెడవెడ సిడిముడిఁ దడఁబడ
నడుగిడు నడుగిడదు జడిమ నడు గిడు నెడలన్."

ఆంధ్రపదలఘుభూయిష్ఠము, అష్టమస్కంధము.

ఇట్లు కర్ణామృతము లగుపద్యములు పెక్కుచోట్లఁ గానఁబడుచున్నవి. వెను కటిమధ్యకాలపుఁగవు లందఱుఁ బోతరాజుమార్గము నూఁతగాఁ గొని తమ "పరిణయముల"తో శబ్దచిత్రంబులఁ బెల్లుగాఁ బ్రయోగించియున్నారు.

పోతన యీరీతిని శబ్దచిత్రములకు విశేషముగాఁ జొచ్చినను నర్థాలంకారముల నొప్పరికింపక ప్రసంగము పొసంగినపుడెల్ల ననేకవిధము లగునర్థాలంకారము లుదాహరించియున్నవాఁడు. వానిలో శ్లేషానుప్రాణితాభేదాధ్యవసాయంబు నితఁడు భట్టబాణుఁడు కాదంబరియందుఁబోలెఁ గడుదీర్ఘము లగువచనములయందుఁ బ్రయోగించియున్నాఁడు. కథారంభముననే నైమిశారణ్యవర్ణనావచనము నవమస్కంధమున గంగానదీవర్ణనావచనము లోనగువానిఁ జూడ నియ్యలంకారమునందుఁ గవికిఁ గలప్రేమ తెల్లమగు.

క. "కొందఱకుఁ దెనుఁగు గుణ మగుఁ
గొందఱకును సంస్కృతంబు గుణ మగు రెండుం
గొందఱికి గుణము లగు నే
నందఱి మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్."

అని పోతనయుపోద్ఘాతమునఁ జెప్పి తత్ప్రతిజ్ఞానుసారంబుగఁ గొన్నిచోటులఁ గేవలాంధ్రపదరచనలును గొన్నియెడల శుద్ధగీర్వాణరచనలుం గావించెఁ గాని లెస్సగాఁ బరిశీలించిన గ్రంథమునఁ దెనుఁగుకంటె సంస్కృతమే యెక్కుడయి గోచరించును. అష్టమస్కంధమున స్వర్గవర్ణనావచనపూర్వభాగంబును దశమస్కంధపూర్వభాగ

మునఁ గృష్ణావతారబాల్యక్రీడాదివర్ణనంబులును నాస్కంధంబుననే ఋతువర్ణనాదుల నొప్పారుపెక్కువచనములును నాంధ్రపదభూయిష్ఠము లై యుండును గాని గీర్వాణరచనలే యీగ్రంథంబున బహుళము లై కన్పట్టుచున్నవి.

పోతన యాశ్వాసాంతగద్యమునందలి "సహజపాండిత్య" యను బిరుదం జూడ నితండు గురువులనాశ్రయించి విద్య నభ్యసింపక స్వయముగాఁ గష్టించి గ్రంథములు చదివి పాండిత్యము సంపాదించె నని యెన్నవలసియున్నది. సహజపాండిత్యుఁ డై నను బోతనకుఁ గలసహజం బగునుభయభాషాప్రావీణ్యంబును బదప్రయోగనైపుణ్యంబును నసాధారణము లై యెసఁగు. భాగవతమునఁ గానవచ్చునొకకొన్ని వ్యాకరణాదిస్ఖాలిత్యముల కిమ్మహాకవీశ్వరుఁడు గురుముఖమున విద్యాభ్యాసము సేయమియే కారణ మని కొందఱందురుగాని యది యట్లనియే నిర్ణయింపనవకాశము కానరాదు. పోతరాజుకవనంబున నిన్నిసులక్షణప్రయోగములును నిట్టిపాండితీమహిమయుఁ జూపట్టుచుండఁగా నొకటిరెండువ్యాకరణభ్రంశములును బొడసూపినయెడల వానికిఁ జిరకాలలేఖనపరంపరాజనితవ్యత్యాసములో, గ్రంథపాతంబున నితరకవిజనపూరణములో, మఱేవో కారణము లై యుండనోపు నని యూహింపవచ్చును. పోతనకుఁ గేవలగ్రంథవిలోడనజనితవైదుష్యముమాత్రమే కాక సర్వతోముఖం బగు లోకానుభవజ్ఞానంబును గలిమికిఁ దద్రచనయం దనేకభాగములు నిదర్శనము లై యున్నవి. దశమస్కంధపూర్వభాగమునందలి రాసక్రీడాభివర్ణనావచనముం జూడ నిక్కవిశ్రేష్ఠునకుఁ గలభరతశాస్త్రప్రౌఢిమయు, హావభావాద్యభినయవర్ణనాపాటవంబును, వెల్లడియగు. దశమస్కంధముననే శ్రీకృష్ణునిశైశవక్రీడాప్రసంగంబున జలక్రీడాభివర్ణనంబునుఁ జలిది గుడుచుకథయు, నాలమేపులీలయుఁ, గ్రేపుమొదవులవిలాసములును గోదోహనప్రకారములును మఱియు ననేకవిషయములును హృదయానురంజకము లగుస్వభావోక్తులఁ బొలుపార వర్ణింపఁబడి యునికిఁ జూడఁ జూడ నితనిప్రపంచజ్ఞానము తెఱం గెఱుంగనగు.

పోతనశైలికిని నన్నయ తిక్కనయెఱ్ఱన లోనగువారిశైలికిని భేదములు గానవచ్చుచున్నవి. వారికవిత్వమున వ్యాకరణప్రయోగప్రౌఢిమయు, నన్వయకాఠిన్యంబును, నాంధ్రపదబాహుళ్యంబును మెండు. పోతనకవనంబున నన్వయసౌలభ్యంబును, బదసౌకుమార్యంబును, శబ్దార్థాలంకారాదిచిత్రంబులును మెండు. కవిత్రయము వారిపద్యములలోఁ దఱుచుగా యతిప్రాసములపట్టులఁ బృథక్పదములు లేక సంధిగతాక్షరములఁగాని పదమధ్యాక్షరములఁగాని ప్రాసవిశ్రమములు ఘటిల్లఁ బాదపాదమునకు నిలిపి చదువ నెంతయు ననువుగాక యతిప్రౌఢముగా నుండును. పోతనపద్యములలోఁ దఱుచుగాఁ బ్రతిపాదాంతముననువిశ్రమస్థానంబులను బదములు ముగింపఁబడి శయ్యాచిత్రముల నొప్పి పామరులకును జదువ సులభము లై సరళము లై శ్రావ్యము లై యుండును. ఈభేదములఁ దెలుపుటకై సమానవిషయవర్ణనలు గల

కొన్నిపద్యములు రెండుగ్రంథములనుండి యెత్తి క్రింద వ్రాయుచున్నాము.

మాలిని. "ఏచి తలిర్చి తనర్చినక్రోవుల నిమ్మగుతావులజొంపములం
బూచినమంచియశోకములన్ సురపొన్నలఁ బొన్నలఁ గేదఁగులం
గాచి బెడంగుగఁ బండినయాసహకారములం గదళీతతులం
జూచుచు వీనుల కింపెసఁగన్ వినుచున్ శుకకోకిలసుస్వరముల్."

కవిరాజవిరాజితము. "చనిచని ముందట నాజ్యహవిర్హుతసౌరభధూమలతాతతులం
బెనఁగినమ్రాఁకులకొమ్మలమీఁద నపేతలతాంతము లై నను బా
యనిమధుపప్రకరంబులఁ జూచి జనాధిపుఁ డంత నెఱింగెఁ దపో
వన మిది యల్లదె దివ్యమునీంద్రనివాసము దా నగు నంచు నెదన్."

సీ. "శ్రవణసుఖంబుగా సామగానంబులు చదివెడుశుకములచదువు దగిలి
కదలక వినుచుండు కరులయుఁ గరికరశీతలచ్ఛాయఁ దచ్ఛీకరాంబు
కణములచల్లనిగా డ్పాసపడి వానిఁ జెంది సుఖం బున్నసింహములయు
భూసురప్రవరులు భూతబలుల్ దెచ్చి పెట్టు నీవారాన్నపిండతతులు
గడఁగి భక్షింప నొక్కటఁ గలసియాడు
చున్నయెలుకల పిల్లల యొండు సహజ
వైరసత్త్వంబులయు సహవాస మపుడు
చూచి మునిశక్తి కెంతయుఁ జోద్య మంది."

భారతము ఆదిపర్వము ఆ-౪-కణ్వమహామున్యాశ్రమవర్ణనము.

భాగవతమున

ఉ. "అందుఁ దమాలసాలవకుళార్జుననింబకదంబపాటలీ
చందననారికేళఘనసారశిరీషలవంగలుంగమా
కందకుచందనక్రముకకాంచనబిల్వకపిత్థమల్లికా
కుందమధూకమంజుళనికుంజములం దనరారి వెండియున్."

క. "పరిపక్వఫలభరానత
తరుశాఖానికరనివసితస్ఫుటవిహగో
త్కరబహుకోలాహలరవ
భరితదిగంతములు గలిగి భవ్యం బగుచున్."

క. "అతినిశితచంచుదళన
క్షతనిర్గతపక్వఫలరసప్రాశనమో
దితరాజశుకవచోర్థ
శ్రుతిఘోషము చెలఁగ శ్రవణసుఖదం బగుచున్."

క. "లలితసహకారపల్లవ
కలితాస్వాదనకషాయకంఠవిరాజ
త్కలకంఠపంచమస్వర
కలనాదము లుల్లసిల్లఁ గడురమ్యము లై."

క. "అతులతమాలమహీజ
ప్రతతిక్షణజాతజలదపరిశంకాంగీ
కృతతాండవఖేలనవిల
సితపింఛవిభాసిబాలశిఖిసేవ్యం బై."

తృతీయస్కంధము - కర్దమాశ్రమవర్ణనము.

క. "సుకుమారుఁ డతఁడు గోపా
లకవృత్తి వహించి యడవులం దిరుగుచు
న్నిక్కి నాక కాదు పగవా
రికి నైనఁ దలంప మన మెరియదే వగలన్."

భారతము - విరాటపర్వము.

క. "వికచముఖుఁ డగుచు శాత్రవు
లకు హితు లగునట్టివారలం గని భూపా
లకుఁ డెద కత్తెరయును నా
లుక బెల్లము నై కలయఁ బలుకఁ గావలయున్."

శాంతిపర్వము.

ఈపద్యములతోఁ బై వ్రాసినభాగవతపద్యములను బోల్చిచూడ ఛందోవిషయిక మగుభేదము గోచరించును.

భాగవతమునఁ గొన్నిచోటుల రేఫఱకారములు ప్రాసవిశ్రమములయందు మైత్రిఁ జెందుచుంటం గని కాకునూరియప్పకవి తన యప్పకవీయములో

ఉ. "బమ్మెరపోతరాజకృతభాగవతంబు సలక్షణంబు గా
కిమ్మహి నేమిటం గొదవ యెంతయు నారసిచూడఁగాను రే
ఫమ్ములు ఱాలునుం గలిసి ప్రాసము లైనకతంబునం గదా
యిమ్ముల నాదిలాక్షణికు లెల్లరు మాని రుదాహరింపఁగన్."

అని వ్రాసి పోతనకవిత్వములో నుభయరేఫసాంకర్యదోషము గన్పట్టుచున్న దని చెప్పియున్నాఁడు. చక్కఁగ విచారింపఁగా నీసాంకర్యము భాగవతమునఁ గొన్నిచోటులఁగానఁబడుచున్నను నాదోషము పోతనదియా యితరకవులదియా యనివిచారింపవలసి యున్నది. ఆంధ్రకవులలో నొకపక్షమువా రీభేదమును బాటించినవారును నింకొకపక్షమువారు దీనిని బాటింపనివారును నై యున్నవారు. ఈమతద్వితయములో నేది ప్రశస్తమో యేది యవలంబనీయమో యేయేకవు లేయేపక్షమువారో వీని నెల్ల నుపోద్ఘాతవిస్తరభీతిచే నిటఁ జర్చింపఁబూనుకొనము. పోతనరచనయం దీమైత్రి యున్నదా యనునంశముమాత్ర మిచ్చట విచార్యము.

కూచిమంచితిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహమునం దీవిషయమై కొండొక విచారించి పోతనరచనయం దీమైత్రి గానరామి కుదాహరణములు వ్రాసి

ఆ-వె "కాకునూరియప్పకవి యహోబలపతి
ముద్దరాజురామముఖ్యు లెల్లఁ
బోతరాజుకబ్బమున ఱాలు రేఫలు
గదిసె నంచుఁ జెప్పి రది హుళిక్కి."

యని సిద్ధాంతీకరించియున్నాఁడు. దీనిని స్థాపింపఁ బోతన వ్రాసినభాగములు "ప్రథమస్కంధము, ద్వితీయస్కంధమునఁగొంతయు, షష్ఠసప్తమాష్టమనవమంబులునుదశమపూర్వభాగములోనికొంతయును నై "యున్న వని చెప్పి వానిలో నీదోషము లేకుంట

కుదాహరణములు వ్రాసియున్నాఁడు. అయినను షష్ఠస్కంధము సింగనార్యప్రణీత మని యాస్కంధమునం దాద్యంతపద్యములవలనఁ దెలియవచ్చెడి. పయివాక్యము నందలి "షష్ఠ" యనుపదము ప్రక్షిప్తముగాఁ బడియున్నదేమో, ఉభయరేఫమైత్రి లేమికిఁ దిమ్మకవి వ్రాసినయుదాహరణములలోఁ గొన్నిటిని వెండియుం గొన్నింటిని నిందు వ్రాయుచున్నాము.

ఉ. "మాఱువడంగ లేనియసమర్థుల సుప్తుల నస్త్రవిద్యలం
దేఱనిపిన్నపాపల వధించె నిషిద్ధపుఁగ్రూరకర్ముఁడై
పాఱుఁడె వీఁడు పాతకుఁడు ప్రాణభయంబున వెచ్చనూర్చుచుం
బాఱెడి వీనిఁ గావుము కృపామతి నర్జున పాపవర్జనా."

చ. "వెఱచినవాని దైన్యమున వేఁదుఱ నొందినవాని నిద్రమై
మఱచినవాని సౌఖ్యముగ మద్యముఁ ద్రావినవాని భగ్నుఁడై
పఱచినవాని సాధుజడభావమువానిని గావు మంచు వా
చఱచినవానిఁ గామినులఁ జంపుట ధర్మము గాదు ఫల్గునా."

ప్రథమస్కంధము.

ఉ. "ఱెక్కలు రావు పిల్లలకు ఱేపటినుండియు మేఁత గానమిం......"

సప్తమస్కంధము.

మ. "ఉఱుకుం గుంభయుగంబుపై హరిక్రియన్ హుమ్మంచుఁ బాదమ్ములం
దిఱుకుం గంఠము వెన్ను దన్ను నెగయున్ హేలాగతి న్వాలముం
జఱచు న్నుగ్గుగఁ దాఁకు ముంచు మునుఁగున్ శల్యంబులున్ దంతముల్
విఱుఁగన్ వ్రేయుచుఁ బొంచి పొంచి కదియున్ వేదండయూథోత్తమున్."

క. "ఎఱుఁగుదుఁ దెఱవా యిప్పుడు
మఱవను సకలంబు నన్ను మఱచినయెడలన్
మఱతు నని యెఱిఁగి మొఱఁగక
మఱవక మొఱయిడిరయేని మఱి యన్యములన్."

క. "ఒఱ పగునురమును బిఱుఁదును
నెఱిదోఁకయు ముఖము సిరియు నిర్మలఖురముల్
కుఱుచచెవులుఁ దెలిగన్నులుఁ
దఱు చగుకంఠంబుఁ జూడఁ దగు నాహరికిన్."

ఆ-వె. "చావు లేనిమందు చక్కన మన కబ్బె
ననుచుఁ గడవ యసురు లడఁచికొనిన
వెఱచి సురలు హరికి మొఱలు వెట్టిరి సుధా
పూర్ణఘటము పోయెఁ బోయె ననుచు."

ఆ-వె. "వాలుఁగంటివాఁడివాలారుఁజూపుల
కూలి ధైర్య మెల్లఁ గోలుపోయి
తఱలి యెఱుక లేక మఱచె గుణంబుల
నాలి మఱచె నిజగణాలి మఱచె."

క. "వెఱచుచు వంగుచు వ్రాలుచు
వఱిముఱి గుబురులకుఁ జనుచు హరి హరి యనుచున్

మఱుఁగుచు నులుకుచు దిఱదిఱఁ
గుఱుమట్టపుఁ బొట్టివడుగు కొంత నటించెన్."

మ. "నెఱి నెల్లప్పుడు నిల్చి ప్రాణిచయము న్నిర్మించి నిర్మించి వీఁ
పిఱయ స్నీల్గుచు నావులించుచు నజుం డీసృష్టియు న్మాని మే
నొఱగన్ ఱెప్పలు మూసి కేల్దలగ దై యుండంగ నిద్రించుచుం
గుఱువెట్టం దొడఁగెం గలల్ గనుచు నుద్ఘోషించుచున్ భూవరా."

క. "కుఱుగఱులు వలుఁదమీసలుఁ
జిఱుదోఁకయుఁ బసిఁడియొడలు సిరి గలపొడలున్
నెఱమొగము నొక్కకొమ్మును
మిఱుచూపులు గలిగి విభుఁడు మీనం బయ్యెన్."

క. "పెఱవాఁడు గురుఁ డటంచును
గొఱ గానిపదంబు నూపఁ గుజనుండును నీ
నెఱత్రోవ నడవ నేర్చిన
నఱమఱ లేనట్టిపదము నందు దయాబ్ధీ."

మ. "ఉఱ కంభోనిధి రోసి వేదములకుయ్యం దైన్యముం జూచి వే
గఱు లల్లార్చి ముఖంబు సాఁచి బలువీఁకం దోఁక సారించి మే
న్మెఱయం దోడలు దీటి మీస లదరన్ మీనాకృతి న్విష్ణుఁ డ
క్కఱటిం దాఁకి వధంచె ముష్టిదళితగ్రావున్ హయగ్రీవునిన్."

అష్టమస్కంధము.

మ. "తెఱవా నీపలుకట్ల యౌ వినుము లే దేవోత్తమాహ్వానముల్
మొఱఁగం బోలునె వేల్పులం బడయుటల్ మోఘంబులే నీకు నీ
తఱిగర్భం బగుఁ బుత్త్రుఁడుం గలుగు నీతారుణ్యముం బూజ్య మా
వెఱవం గార్యము లేదు సిగ్గు దగునే వ్రీడావినమ్రాననా."

నవమస్కంధము

క. "మఱియును దనుజుఁడు రాముని
గఱవన్ గమకించి తెఱపి గానక యతనిం
జుఱచుఱఁ జూచుచు శౌర్యముఁ
బఱివోవఁగ నంత నింతఁ బదములఁ దన్నెన్."

క. "కఱచి పిఱుతివక మఱియును
వెఱవక నిజవదనజనితవిషదహనశిఖల్
మెఱయఁ దననిడుదయొడలిని
నెఱి హరిఁ బెనఁగొనియె భుజగనివహపతి వడిన్."

చ. "వెఱమఱ లేని మేటి బలువీరుఁడు కృష్ణకుమారుఁ డొక్కచేఁ
జఱచి ఖగేంద్రుచందమునఁ జక్కనిదోడలఁ బట్టి కన్నులం
జొఱచొఱ దుర్విషానలము జొబ్బిలుచుండఁగ నొత్తి లీలతో
జిఱజిఱఁ ద్రిప్పివైచెఁ బరిశేషితదర్పముఁ గ్రూరసర్పమున్."

క. "అఱువదినాలుగువిద్యలు
నఱువదినాలుగుదినంబులంతన వారల్
నెఱవాదు లై నకతమున
నెఱి నొక్కొకనాఁటివినికి నేర్చి రిలేశా.

చ. "ఎఱుఁగుదు మేము నిన్ను వనజేక్షణు మిత్రుఁడ వీవు శౌరిమి
న్నెఱయుచుఁ దల్లిదండ్రులకు మే లెఱిఁగింపఁ బ్రియుండు పంపఁగా
వఱలెడుభక్తి వచ్చితివి వారల నైన మనంబులోపలన్
మఱవఁడు శౌరి మేలు మఱి మాన్యులు రాజున కెవ్వ రిచ్చటన్."

మ. "కఱపించెన్ ఫణికోటిచే లతికలం గట్టించి గంగానది
న్నెఱిఁ ద్రోపించె విషాన్వితాన్న మొసఁగెన్ నిద్రారతిం జెంది యే
మఱియుండం బొడిపించె నాయుధములన్ మత్పుత్త్రులం దేమియున్
గొఱగాఁ డీధృతరాష్ట్రసూనుఁడు మహాక్రూరుండు కార్యంబునన్."

దశమస్కంధము.

ఇట్లు పై పద్యములు నింక ననేకములును బోతనరచిత భాగములలోఁ గేవల శకటరేఫప్రాసముల కుదాహరణములుగాఁ గానఁబడుచుండుటఁ జేసి రేఫఱకారభేదమును బోతన లెస్సగా నెఱిఁగినవాఁ డనియు నుభయరేఫముల మైత్రి కూడ దనుట యే పోతనామాత్యునిమత మనియు నూహింపవలయు ననుట స్పష్టము.
వెలిగందలనారయామాత్యులు రేఫఱకారములఁ గలిపినందుల కుదాహరణములు:—

చ. "హరిఁ బరమాత్ము నచ్యుతు ననంతునిఁ జిత్తములోఁ దలంచి సు
స్థిరత విశోకసౌఖ్యములఁ జెందినధీనిధు లన్యకృత్యముల్
మఱచియుఁ జేయ నొల్లరు తలంచిన నట్టిద యౌ సురేంద్రుఁడుం
బరువడి నూయి ద్రవ్వెడునిపానఖనిత్రము మానుకైవడిన్."

ద్వితీయస్కంధము.

క. *"మఱియును ఋష్యాశ్రమ వన
సరిదుపవననదపుళిందజనపదగిరిగ
హ్వర గోష్ఠ యజ్ఞశాలా
పుర దేవాయతన పుణ్యభూములయందున్."

మ. "తెఱఁ గొప్పన్ జననీవియోగమునఁ గుంతీస్తన్యపానంబు సో
దరసంరక్షయుఁ గల్గ దేవవిభువక్త్రస్థామృతంబున్ ఖగే
శ్వరుఁ డర్థిం గయికొన్నమాడ్కిఁ గురువంశశ్రేణి నిర్జించి త
ద్ధరణీరాజ్యముఁ గొన్నమాద్రికొడుకుల్ ధన్యాత్ములే యుద్ధవా."

క. "ధర శునకభోగ్యమును నిహ
పరదూరము నైన తను వుపాదేయముగా
నెఱి నమ్మి వస్త్రమాల్యా
భరణంబు లలంకరించుపామరజనులన్."

క. "పరఁగఁగ దర్పోద్ధతు లి
ద్దఱు కొడుకులు నీకుఁ బుట్టి ధరణికి వ్రేఁగై
నిరతము బుధజనపీడా
పరులై వర్తింతు రాత్మబలగర్వమునన్."

---

* "మఱి" యనుశబ్దములోని ఱకారము ప్రాసస్థానమందుండి రేఫముతోఁ బ్రాసమైత్రి నొందునట్టిపద్యములు తృతీయచతుర్థస్కంధముల ననేకము లున్నవి.

క. "వరుణునిబలములు దనుజే
శ్వరుతేజముఁ దేఱిచూడఁ జాలక శౌర్య
స్ఫురణము చెడి యెందేనియుఁ
బఱచెం దజ్జలధిమధ్యభాగమునందున్."

తృతీయస్కంధము.

క. "పరిపూర్ణం బగుభక్తిని
గర మనిశము సంశయాత్మకం బై చాలన్
వఱలినహృదయగ్రంథిని
నిరసించువిరక్తియుతమనీష జనించెన్."

చ. "హరిభజనీయమార్గనియతాత్మకు లై భవదీయమూర్తిపై
వఱలినభక్తియుక్తు లగువారలసంగతి గల్గఁ జేయు స
త్పురుషసుసంగతిన్ వ్యసనదుర్భరసాగర మప్రయత్నతన్
సరసభవత్కథామృతరసంబున మత్తుఁడ నై తరించెదన్."

చ. "నిరతముఁ దావకీనభజనీయపదాబ్జసుగంధలబ్ధి నె
వ్వరిమది పొందఁగాఁ గలుగు వారలు తత్ప్రియమర్త్యదేహమున్
గరము తదీయదారసుతకామసుహృద్గృహబంధువర్గమున్
మఱతురు విశ్వతోముఖ రమాహృదయేశ ముకుంద మాధవా."

చతుర్థస్కంధము.

చ. "కరువలిఁ బాయు వస్త్రమును గట్ట నెఱుంగవు చూడ్కి దిక్కులం
బఱచుచుఁ జంచరీకములభాతిఁ జెలంగెడుఁ గంధరంబునం
బొరలెడుముక్తకేశభరముం దుఱుమంగఁ దలంప విప్పుడి
ట్లరుదుగ రత్నకందుకవిహారము సల్పెదు సంభ్రమంబునన్."

క. "ధరణీసుగోత్తముఁడు తా
నరుదుగఁ దమవారు సెప్పినవి యెల్లను నే
మఱ కందుఁ బ్రీతి సేయక
నిరతము గృహకర్మ మట్లు నెఱపుచునుండెన్."

క. "ధరణీవల్లభ నిన్నును
నిరతంబును బుద్ధదేవునిం గొలిచినయా
తెఱఁగునఁ గొలిచెద మని భా
సురమతి బోధించి రపుడు సుమతిం బ్రీతిన్."

పంచమస్కంధము.

క. "అరుదుగ నరహరిభక్తిం
బొరయనియాపురుషుసుకృతపుంజంబులు వే
మఱు పుణ్యుఁ జేయ నేరవు
నరవరమధుఘటము పెక్కునదులం బోలెన్."

చ. "ఎఱుఁగమిఁ జేసినట్టిగురుహేళన మంత నెఱింగి యింద్రుఁ డ
చ్చెరువడి భీతి నొంది యతిచింతితుఁ డై తలపోసి పల్కె న
ప్పరమపవిత్రు లోకనుతభవ్యచరిత్రు విశేషపాదపం
కరుహముఁ బూజసేయక యకర్మముఁ జేసితి నల్పబుద్ధి నై."

షష్ఠస్కంధము.

క. « ఎఱుఁగమి నైనను భూసుర
వరులధనం బపహరింప వలవదు పతికిౙ
మఱపున ననలము ముట్టిన
దరికొని వెసఁ గాల్పకున్నె తను వెరియంగన్."

క. « ఎఱిఁగెఱిఁగి బ్రహ్మహత్యా
దురితంబున నీమనంబు దూఁకొనెఁ బాపో
త్తరణప్రాయశ్చిత్తము
దొరఁకొని కావింపుమయ్య దుర్జనహరణా."

దశమస్కంధము-ఉత్తరభాగము.

ఇట్లు పెక్కుచోటుల నితరకవిరచితభాగములలో నుభయ రేఫమైత్రి గలపద్యములు గానవచ్చు చున్నవి. ఇదియునుం గాక యితరదోషములు గొన్ని వారికవిత్వములఁ గన్పట్టు చున్నవి.

క. « వినుము ఫలారంభుఁడు కృప
ణుని నడిగినఁ దనయశంబునుం దనమానం
బును జెడుఁ గావునఁ దగ నీ
వెనయ వివాహేచ్ఛఁ దగులు టెఱిఁగె నిటకున్." తృతీయస్కంధము.

క. అని యిట్టులు ప్రతికూలవ
చనములు దక్షుండు పలికి శపియింతును శ
ర్వుని నని జలములు గొని కర
మున నిలిపి ట్లనియె రోషమున నఘాత్మా.

చతుర్థస్కంధము.

పై రెండుపద్యములలోఁ గ్రావ్ణార్థంతునకు సంధి. గ్రంథవిస్తరభీతిచే మఱియుఁ బ్రయోగంబులు వ్రాయక విరమించెదము. శైలింబట్టి చూడఁ దృతీయచతుర్థస్కంధములలోఁ జాలభాగములు పోతనార్యవిరచితములు గానోప వని యెన్నవలసియున్నది. ఆస్కంధములంతయు నుత్సన్నములై యుండెనేని వెలిగందలనారయాదులు వానిని బూరించి వానియంతిమగద్యములలోఁ బంచమషష్ఠైకాదశద్వాదశస్కంధాంతము లందుఁబోలెఁ దమపేరులను జెప్పికొనియేయుందురు. అట్లు చెప్పికొనకునికింజూడఁ దృతీయచతుర్థస్కంధములు పూర్ణముగా నశింపక చాలభాగము రూపుసెడఁగా నారయాదు లున్నవాని నిలిపి లేనిచోటుల నూత్నరచనలు గావించి పూరించిరని తోఁచుచున్నది. దీనిని నిర్ణయముసేయుటకుఁ దగినయాధారము లేవియు మాకుఁ జిక్కనందున నీయంశము విచార్య మని యంతర్వాణిజనంబులతో విన్నవించుచు నీవిచికిత్స నింతటితో విరమించెదము.

పోతనభాషాంతరీకరణము ప్రాయికముగ మూలగ్రంథము ననుసరించియే యుండు. కొన్నిచోటుల మూలగ్రంథములోనిశ్లోకములయర్థము లెన్నగాఁ దెలియునట్లు వ్యాఖ్యానమురీతిని విపులముగావ్రాసియుఁ గొన్నియెడలఁ దనహరిభక్తి తేటపడునట్లు వర్ణనలు మూలగ్రంథమునన్నవానికంటె నెక్కుడుగరచియించియుఁగొన్ని

తావుల శ్రీవిష్ణుపురాణము లోనగు గ్రంథములనుండి క్రొత్తకథల నెత్తి కూర్చియు నిమ్మాడ్కిని బోతన తనపొత్తమును సంస్కృతమునకంటె నెక్కుడగునట్లు పెంచి వ్రాసెను. దశమస్కంధపూర్వభాగమునందలినరకాసురునితోడిసత్యభామాయుద్ధము విష్ణుపురాణమునుండి చేకొనఁబడినది. ఇటు లున్నను మొత్తముమీఁద నాంధ్రభాగవతము సంస్కృతభాగవతము ననుసరించియే యుండును. ఈకవీశ్వరునిభాషాంతరీకరణముం జూపుటకై కొన్నియుదాహరణములు వ్రాయుచున్నాము.

సంస్కృతభాగవతము-ప్రథమస్కంధము.

« ఆత్మారామా శ్చ మునయో నిర్గ్రంథా అప్యురుక్రమే
కుర్వం త్యహైతుకీం భక్తి మిత్థంభూతగుణో హరిః »

దీనికిఁ దెనుఁగు.

క. « ధీరులు నిరపేక్షులు నా
త్మారాములు నై సమునులు హరిభజనము ని
ష్కారణము చేయు చుందురు
నారాయణుఁ డట్టివాఁడు నవ్యచరిత్రా.»

ఈపద్యము మూలశ్లోకమునకు సరిగా నున్నయది.

శ్లో. « నమః పరస్మై పురుషాయ భూయసే
సదుద్భవస్థాననిరోధలీలయా
గృహీతశక్తిత్రితయాయ దేహీ
నా మంతర్భవా యానుపలభ్యవర్త్మనే»

మ. «పరుఁడై యీశ్వరుఁడై మహామహిముఁడై ప్రాదుర్భవస్థానసం
హరణక్రీడనుఁడై త్రిశక్తియుతుఁడై యంతర్గతజ్యోతి యై
పరమేష్ఠిప్రముఖామరాధిపులకుం బ్రాపింప రాకుండుదు
స్తరమార్గంబునఁ దేజరిల్లుహరికిం దత్త్వార్థి నై మ్రొక్కెదన్.»

ఇందు శ్లోకార్థము విపులముగాఁ దెనిఁగింపఁబడినది.

శ్లో. «య త్కీర్తనం య త్స్మరణం య దీక్షణం
య ద్వందనం య చ్ఛ్రవణం య దర్హణం
లోకస్య సద్యో విధునోతి కల్మషం
తస్మై సుభద్రశ్రవసే నమో నమః»

ఉ. «ఏవిభువందనార్చనము లేవిభుచింతయు నామకీర్తనం
బేవిభులీల లద్భుతము లెవ్వనిసంశ్రవణంబు సేయు దో
షావళిఁ బాసి లోకము శుభాయతవృత్తిఁ జెలంగు నట్టి నే
నావిభు నాశ్రయించెద నఘౌఘనివృత్తిదు భద్రకీర్తిదున్.

ఇం దొకటిరెండువిశేషము లెక్కుడుగాఁ జేర్పఁబడినవి.

భాగ. ద్వితీయస్కంధము.

శ్లో. "ఏక స్స్వయం సన్ జగతస్సిసృక్షయా
ద్వితీయ యాత్మ న్నధి యోగమాయయా
సృజ స్యదః పాసి పున గ్రసిష్యసే
యథోర్ణ నాభి ర్భగవ న్స్వశక్తిభిః."

మ. "అనఘా, యొక్కఁడ వయ్యు నాత్మకృతమాయాజాతసత్త్వాదిశ
క్తిని కాయస్థితి నీజగజ్జననవృద్ధిక్షోభ హేతుప్రభా
వనిరూఢిం దగు దూర్ణ నాభిగతి విశ్వస్తుత్య సర్వేశ నీ
ఘనలీలామహిమాగ్రవంబు గడవం గా వచ్చునే యేరికిన్."

తృతీయస్కంధము.

ఇందుఁ దుఱియపాద మధికముగా నున్నను శ్లోకార్థము సుంతేనియుఁ గొఱం తవడనీక తెనిఁగింపఁబడియె.

శ్లో. "బిభర్షి కాయం పీవానం సోద్యమో భోగవా న్యథా
విత్తం చైవోద్యమవతాం భోగో విత్తవతామను హ
భోగినాం ఖలు దేహోయం పీవా భవతి నాన్యథా.
న తే శయానస్య నిరుద్యమస్య
బ్రహ్మన్నుహార్థో యతఏవ భోగాః
అభోగినో యం తవ విప్రదేహః
పీవాయత స్తద్వద నః క్షమంచేత్
కవిః కల్యోనిపుణదృ క్చిత్రప్రియకథ స్సమః
లోకస్య కుర్వతః కర్మ శేషే తద్వీక్షితాపివా."

సీ. భూమి నుద్యోగి యై భోగి యై యుండెడి నరునికై వడి మునినాథ నీవు
ఘనశరీరముఁ దాల్చి కదలవు చిత్ర ముద్యమయుక్తునికిఁ గాని ధనము లేదు
ధనవంతునకుఁ గాని తగుభోగములు లేవు భోగికిఁ గాని సంపూర్ణ మైన
తనువు లే దుద్యోగధనభోగములు లేక నేల నూరక పడి నిద్రవోవు
నీకు నెట్లు గలిగె నిరుపమదేహంబు
సముఁడ వార్యుఁడవు విశారదుఁడవు
బుధి నిధివి జనులఁ బొగడవు తెగడవు
నిద్ర ప్రతిదినంబు నిలుపనేల."

సప్తమస్కంధము.

పై శ్లోకములయర్థము సంగ్రహముగ నొకసీసపద్యమునందె వ్రాయఁబడి యున్నది.

శ్లో. "యస్స్వాత్మనీదం నిజమాయ యార్పితం
క్వచి ద్విభాతం క్వచ తత్తిరోహితం
అవిద్ధదృ క్సాక్ష్యుభయం త దీక్షతే
స ఆత్మమూల్ ⋅ఽవతు మాం పరాత్పరః"

క. "ఒకపరి జగములు వెలి నిడి
యొకపరి లోపలికిఁ గొనుచు నుభయము గనుచుం

సకలార్థ సాక్షి యగున
య్యకలంకుని నాత్మమూలు నర్థింతు మదిన్.

శ్లో. ‘‘దిదృక్షవో యస్య పదం హి మంగళం
విముక్తసంగా మునయ స్సుసాధవః
చరం త్యలోకవ్రత మవ్రణం వనే
భూతాత్మభూతా స్సుహృద స్స మే గతిః.’’

తే. గీ. ముక్తసంగు లయినమునులు దిదృక్షులు
సర్వభూతహితులు సాధుచిత్తు
లసదృశవ్రతాఢ్యులై కొల్తు రెవ్వని
దివ్యపదము వాఁడు దిక్కు నాకు.’’

అష్టమస్కంధము.

శ్లో. ‘‘కస్యాశ్చిత్పూతనాయంత్యాః కృష్ణాయంత్యపిబత్స్తనం
తోకయిత్వా రుదం త్యన్యా పదాహం చ్ఛకటాయతీం
దైత్యాయిత్వా జహా రాన్యా మేకా కృష్ణార్భభావనాం
కృష్ణరామాయితే ద్వేతు గోపవత్సాయితాః పరాః
వత్సాయితాం గృహీత్వాన్యా భ్రామయిత్వా న్యపాతయత్
కృష్ణాయితా జఘానాన్యా తత్రైకాంతు బకాయితాం
ఆహూయాయ దూరగాయద్వత్కృష్ణ స్త మనుకుర్వతీమ్.’’

సీ. ‘‘పూతన నై యొక్క పొలఁతి చరింపంగ శౌరి నై యొకకొంత చన్ను గుడుచు
బాలుఁ డై యొకభామ పాలకు నేడ్చుచో బండి నే నని లేమఁ బాఱఁ దన్ను
సుడిగాలి నని యొకసుందరి గొనిపోవ హరి నని వర్తించు నబ్జముఖియు
బకుఁడ నే నని యొక్క పడఁతి సంరంభింపఁ బద్మాక్షుఁ డనుకొమ్మ పరభవించు

ఆ. వె. నెలమి రామకృష్ణు లింతు లిద్దఱు గాఁగ
గోపవత్సగణము గొంద ఱగుచు
రసురవైరి ననుచు నబల యొక్కతె చీరుఁ
బసుల మనెడుసతుల ఁ దిరతముఖ్య.’’

శ్లో. ‘‘జయతి తేధికం జన్మ నావ్రజః
శ్రయత ఇందిరా శశ్వ దత్ర హి।
దయిత దృశ్యతాం దిక్షు తావకా
స్త్వయి ధృతాసవ స్త్వాం విచిన్వతే.’’

క. ‘‘నీవు జనించినకతమున
నోవల్లభ లక్ష్మి మంద నొప్పె నధికమై
నీవెంటనె ప్రాణము లిడి
నీవా రరసెదరు మాపు నిరూపంబున్.’’

శ్లో. ‘‘శరదుదాశయే సాధుజాతస
త్సరసిజోదర శ్రీముషాదృశా
సురతనాథ తేఽశుల్కదాసికా
వరద నిఘ్నతో నేహకిం వధః’’.

క. ‹‹శారదకమలోదరరుచి
చోరక మగుచూపువలన సుందర మమ్మం
గోరి వెల యీనిదాసుల
ధీరత నొప్పించు టిది వధించుట గాదే.''

శ్లో ‹‹ప్రణతదేహినాం పాపకర్శనం
తృణచరానుగం శ్రీనికేతనం
ఫణిఫణార్పితం తేపదాంబుజం
కృణు కుచేషు నః కృంధి హృచ్ఛయమ్.''

ఉ. ‹‹గోవులవెంటఁ ద్రిమ్మరుచుఁ గొల్చినవారలపాపసంఘముల్
ద్రోవఁగఁ జాలి శ్రీఁ దనరి దుష్టభుజంగఫణాలతాగ్రసం
భావిత మైననీచరణపద్మము చన్నులమీఁద మోపి త
ద్భావజపుష్పభల్లభవబాధ హరింపు వరింపు మాధవా.''

దశమస్కంధము.

పై శ్లోకము లన్నియు నర్థలోపము లేకుండునటులు లెస్సగాఁ దెనిఁగింపఁబడిన యునికిఁ జూడఁ గవికిఁ గలభాషాంతరీకరణచాతుర్యము తేటపడు. కేవలవర్ణనా ప్రసంగములు పొసంగినచోటులఁ బోతన మూలమునకంటె నెక్కుడుగ వ్రాసినను దత్త్వవిషయనిరూపణము సేయునపు డెల్లఁ బ్రాయికముగా మూలగ్రంథశ్లోకార్థములం బట్టియే తెనిఁగించియున్నాఁడు.

ఇదానీంతనవిద్వజ్జనులు గొందఱు సంస్కృతగ్రంథములను దెనిఁగించునెడల మూలగ్రంథములో నున్న విశేషణములనుగూడ విడువక తెనుఁగుసేయవలయు ననియు మూలగ్రంథములో లేనియెట్టివిశేషణము నేని నభిప్రాయము నేనిఁ దెనుఁగునఁ బొందింపఁదగదనియు భావించుచున్నారు. అట్లనుట్యానానధికంబుగ గీర్వాణభాషలో నినాటకములను గావ్యములను దెనుఁగుసేసినచో లెస్సగా నుండును గాని పురాణేతిహాసంబుల నాచందంబున నాంధ్రీకరించినచో నాయాంధ్రగ్రంథములు పసచెడి చదువుట కెంతయు నేవగలిగించు. 'హనుమాన్ మారుతాత్మజః' 'యుధిష్ఠిరో ధర్మపుత్రః' ఇట్టివిశేషణములు తఱుచుగాఁ బ్రయోగింపఁబడియుండుటఁ జేసి వాని నెల్ల మాటిమాటికిఁ దెనుఁగునకుఁ దెచ్చినచో భాషాశైలియందమునకు లోపము వాటిలు నని తోఁచెడి. వెండియు నాంధ్రశైలి కనుగుణంబుగ నుచితభంగుల నక్కడక్కడఁ గొన్నివిశేషణములు నభిప్రాయములును రసవంతంబుగఁ బ్రయోగించుచుఁ గథాసందర్భమునుమాత్రము మానక తెనిఁగించుటయే శ్లాఘనీయభాషాంతరీకరణ మని తలంచెదము. భారతము నాంధ్రీకరించినకవిత్రయమువారును భాగవతమును దెనుఁగుసేసిన బమ్మెరపోతరాజును నీమతము నే యవలంబించినవారు.

వెలిగందలనారయాదులకవనంబునుగుఱించి విశేషముగా నిటఁ జర్చింప నవసరము లేదు. వారును బోతనామాత్యునిశైలినే యవలంబించి దానితెఱంగుననే తమరచనలనుం జేసియున్నారు. పోతనకవనమునందుంబోలె వారికవనమునందును నంత్యానియమప్రాసాదిశబ్దాలంకారములును ఛేకయమకాదిచిత్రరచనలును నభేదాధ్యవసాయములును గానవచ్చుచున్నవి. అయినను వారికవన మెల్లవిధములఁ బోతనకవనమునకంటెఁ దగ్గయులోఁకున యనుట కెంతమాత్రమును సందియము లేదు. వీరికవనంబులలో సింగనార్యునికవనము తక్కుంగలయిరువురికవనములకంటెఁ బ్రౌఢ మనియు, నారయకవనము గంగరాజుదానికంటె సరస మనియుఁ దోఁచుచున్నయది. పోతన వ్రాసినసంపూర్ణభాగవత ముండినయెడల నెంతమనోహరముగా నుండును!

ఇందలి రుక్మిణీకల్యాణము, గజేంద్రమోక్షణము, ప్రహ్లాదచరిత్రము లోనగుకథలను బాలురకును బాలికలకును విశేషముగాఁ జెప్పింతురు. భారతముంబోలె భాగవతమును సకలపండితపామరజనంబులమనంబుల కెక్కిన గ్రంథము. పల్లియలలోనిజానపదులును జదువులయ్యుం గొని దీనిని వీథిపురాణముగాఁ జదివింతురు.

పోతనామాత్యునిశైలినిగూర్చి యెంతేని వ్రాయఁదగియున్నను బీఠికావిస్తరభయమున నింతకంటె నిట విపులముగాఁ జర్చింప నయితి కాదాయె. ఇమ్మహాకవిపదలాలిత్యమును, రచనాసౌకుమార్యమును, సరసపదప్రయోగవైచిత్ర్యంబును, నుభయభాషాప్రావీణ్యంబును, హరిలీలావర్ణనాపాటవంబును, వేదాంతార్థనిరూపణావైదగ్ధ్యంబును నితనిరచనలఁ జదువఁ జదువ గోచరించును.

ఇతనిపదము లతికోమలములు. అలంకారములు మనోజ్ఞములు. రచనలు సరసములు. పాకము మధురము. ఇతనియెడం జూపట్టుహరిభక్తి యగ్గలము. పాండిత్యము మిక్కుటము. లోకానుభవం బహీనము. వేదాంతార్థచింతనంబు మెండు. పురాణరత్నం బగునిమ్మహాభాగవతము నాంధ్రీకరించి యితండు సాపాయంబగుకాయంబు దొఱంగియు జీవించియేయున్నవాఁడు. ఇతనిభాగవతము నాంధ్రదేశీయు లెల్లరుఁ బెల్లుగాఁ జదివి భవరుగార్తులు నిర్లేపత్వమును భాషాజ్ఞానార్థులు భాషాజ్ఞానమును సుకవిపుంగవులానందమును భాగవతులు దృఢభక్తిని ముముక్షువులు మోక్షమును బొందుదురుగాక యని యనుగ్రహింప సర్వేశ్వరుం బ్రార్థించుచు నీయుపోద్ఘాతము నుపసంహరించెదము.

నాగపూడి కుప్పుస్వామయ్య, బి. ఏ.



## ఆంధ్ర భాగవత రచనాక్రమము.

పైఁ దెలిపిన పోతనామాత్యవిరచితం బగునీయాంధ్రభాగవతంబునం గలగ్రంథసంఖ్య సాకల్యంబుగా గణింప సరాసరి ముప్పదివే లగుచున్నది. ఈగ్రంథంబునకు మూలభూతం బగుసంస్కృతభాగవతంబునం గలగ్రంథసంఖ్య రమారమి యిరువది రెండువేలు. ఈమీఁదఁ జెప్పినక్రమమున మూలగ్రంథము నతిక్రమించెడిగ్రంథసంఖ్యగలదిగా నీగ్రంథము రచియింపఁబడుటకుఁ గారణం బెయ్యది యనిన, బ్రాహ్మాద్యష్టాదశపురాణంబులలో నుత్తమం బగునీపురాణం బత్యంతరహస్యార్థప్రతిపాదకంబును, బరమవేదాంతప్రతిపాద్యభగవద్గుణగణాపాదకంబును నైన యుత్తమగ్రంథం బగుటఁబట్టి యిట్టిగూఢం బైనగ్రంథార్థంబు దేటపఱుప వ్యాఖ్యానరూపముగా నభివర్ణించుట, భగవద్గుణవర్ణనాదిఘట్టంబులందు సంస్కృతభాగవతప్రతిపాదితక్రమమున నభివర్ణించి స్వకీయభగవద్భక్త్యతిశయమున స్వానవద్యకవిత్వవిద్యాచాతురీసంప్రాప్తనిరంకుశస్వాతంత్ర్యము సకలవిద్వజ్జనంబులకుం దెలుప భగవద్గుణాదులను విశేషముగావర్ణించుట, *భాగవతగ్రంథప్రతిపాదితం బై కాక విశిష్టశిష్టజనాంగీకార్యంబు లగువిష్ణుపురాణహరివంశాదిగ్రంథప్రతిపాదితంబు లగుకథావిశేషంబులం గొన్నిటిం దెలుపుట, యనునీహేతుత్రయంబువలనను ఆంధ్రభాగవతంబునందు సరాసరి యష్టసహస్రగ్రంథసంఖ్య యధికం బై యున్నది. కాన సంరక్షితసకలార్థంబులు గలధనికునకు నధికారంబు చేకూడుటచే నతనిసంపద యతిశ్లాఘ్యంబుగా నుండురీతి సంస్కృతభాగవతగ్రంథప్రతిపాదితార్థావిరుద్ధభగవద్గుణవర్ణనాదులు గల యీగ్రంథం బతిపూజ్యంబుగా సకలవిద్వజ్జనంబులచే నంగీకరింపంబడఁదగినదిగా నున్నయది. ఇదియునుం గాక భారతరామాయణవిష్ణుపురాణస్కాందాద్యుత్తమగ్రంథంబులఁ దెనుంగున గద్యపద్యాత్మకంబులుగాఁ జేసిననన్నయభట్టారకాదులయినమహాకవు లాయాగ్రంథస్థితకథాంశానుక్రమణికమాత్రము వదలక తమకుఁ దోఁచినట్లు గ్రంథరచన గావించినందున సపాదలక్షగ్రంథపరిమితం బగుమహాభారతం బాంధ్రంబున సరాసరిపంచాశత్సహస్రసంఖ్యాకగ్రంథవిస్తృతం బై యున్నది. ఇదేతీరునఁ జతుర్వింశత్సహస్రగ్రంథపరిమితం బై షట్కాండములం గలశ్రీమద్రామాయణము తెనుంగునందు ముందు చెప్పినచొప్పున భాస్కరకవి పంచదశసహస్రగ్రంథవిస్తృతంబుగా నొనర్చె. ఇట్లు మూలగ్రంథార్థం బతిసంగ్రహంబు సేసి స్వేచ్ఛననుసరించి గ్రంథంబుల రచియించుటవలన వ్యాసవాల్మీక్యాదిమహర్షులయథోక్తార్థంబు సమగ్రంబుగాఁ దెలుపఁబడక కేవలకథాంశానువర్ణనపరంబులుగా నుండుటవలన ఋషిప్రోక్తసంస్కృతగ్రంథంబులవలె నత్యాదరణీయములు గానేరవు గావునఁ బూర్వోక్తక్రమంబున నీభాగవతము వ్యాసప్రోక్తభాగవతగ్రంథార్థమున నీషన్మాత్రంబయినం బొరపాటు లేకయుండుటయు కాక యాయాసందర్భములకుఁ దగి

* ఇందు సత్యభామయుద్ధాదికథాభాగములు మూలగ్రంథం బగుభాగవతమందుఁ దెలుపఁబడనివి.

నట్టు హరిగుణవర్ణనాధిక్యాదులుం గలిగి యుండుటవలన సమగ్రభగవద్గుణప్రతిపాదక గ్రంథ మగుచున్నది. కాఁబట్టి భగవద్వ్యాసప్రణీతభాగవతమువలెఁ బోతనామాత్యవిరచితం బగునీయాంధ్రభాగవతమును బఠియించునట్టినిఖిలజనులకు నైహికాముష్మికఫలప్రదం బగు నని నిశ్చయింప నించుకయు సందియంబు పనిలేదు.

## శ్రీకృష్ణావతారకాలనిర్ణయవిచారఘట్టము.

శ్రీమదాశ్రితజనాపన్నివారణైకపరాయణుం డగునాదినారాయణుండు భూభారావతరణార్థంబు బ్రహ్మరుద్రేంద్రాదినిఖిలదేవగణంబులచే సంప్రార్థితుం డై శ్రీకృష్ణావతారంబు నొంది యఖిలదుష్టజననిబర్హణశిష్టజనపరిరక్షణాదికృత్యంబులు సలిపి యమానుషంబు లగువిచిత్రచరిత్రంబులచే నపరిమేయమహిమ నశేషభక్తజనాళికిం దెలిపి మరల బ్రహ్మాదిదేవగణప్రార్థితుం డై స్వధామం బగువైకుంఠధామంబునకరిగె. అట్టియపరిమేయానన్యాదృశానవద్యగుణగణప్రభావవినుతుం డగుభగవంతుని యవతారకాలనిర్ణయంబు నన్యూనానతిరిక్తం బగునట్లు సాకల్యంబుగాఁ దెలిపెడు భాగవతవిష్ణుపురాణహరివంశాదిగ్రంథంబులలోఁ గొన్నిటియందు శ్రీకృష్ణావతారఘట్టంబునఁ దజ్జననక్షత్రమును దదావిర్భావప్రతిపాదకనిశీథకాలవిశేషమునుమాత్రము దెలియుచున్నవి. మఱికొన్నిగ్రంథంబులయందు మాస-ఋతు-పక్ష-నక్షత్ర-ముహూర్తములుమాత్రము దెలుపఁబడియున్నవి గాని యట్టియభ్యుదయకాలంబు నిఖిలభక్తజను లత్యంతానందంబున నిదానించి తెలిసికొనుటకు నుపయుక్తం బగునట్లు యుగవర్షాదినిర్ణయం బాయవతారఘట్టంబునఁ గంఠోక్తిగా నెందుం దెలుపఁబడలేదు. అయినను దదితరఘట్టంబులయందు నాయుగవర్షాదినిర్ణయంబు విద్వజ్జనైకవేద్యం బగునట్లు వివిధవచనంబులచే సూచితంబై యున్నది. అట్టిసూచితార్థం బఖిలభక్తజనగ్రాహ్యంబు గానియెడల నాకృష్ణపరబ్రహ్మమూర్తి యేయుగంబున నేవర్షంబున నవతరించె ననియు,నట్టికాలంబు గణింప నిప్పటికి గతసంవత్సరము లిన్ని యయ్యె ననియు, నమ్మహాత్ముండు భూలోకంబున లీలామానుషవిగ్రహంబు దాల్చి యుండినవర్షంబు లిన్ని యనియుఁ, దెలియక భగవద్భక్తు లెల్లవారును సందిగ్ధమానసు లగుచున్నారు. కాఁబట్టి యట్టిసందేహనివృత్తి చేయుటచే నఖిలాస్మదీయజనుల నుల్లసింపఁ జేయందలంచి శ్రీకృష్ణావతారకాలనిర్ణయప్రతిపాదకగ్రంథంబులఁ దెలుపఁబడి యుండెడుప్రమాణవచనాభిప్రాయములఁబట్టి సర్వగ్రంథసామరస్యంబు గలుగునట్లు విశదముగా నీదిగువఁ దెలుపుచున్నాము.

## శ్రీకృష్ణావతారకాలనిర్ణాయకప్రమాణవచనార్థవిచారము.

శ్రీమద్భాగవతమునందు దశమంబునం గలతృతీయాధ్యాయమునందుఁ దెలుపఁబడి యుండెడు శ్రీకృష్ణమూర్త్యావిర్భావకాలప్రతిపాదకప్రమాణవచనములు.

శ్లో. అథసర్వగుణోపేతః కాలః పరమశోభనః
యర్హ్యేవాజనజన్మర్క్షం శాంతర్క్షగ్రహతారకమ్.

శ్లో. మందం మందం జలధరా జగర్జు రనుసాగరమ్
నిశీథే తమ ఉద్భూతే జాయమానే జనార్దనే.

ఈశ్లోకద్వయమునందు ప్రథమశ్లోకంబున "అజనజన్మర్క్షమ్" అనుటచేత రోహిణీనక్షత్ర మనియు, రెండవశ్లోకమున "నిశీథే తమఉద్భూతే" అనుటచేతఁ జీఁకటితోఁ జేరియుండెడు నిశీథకాల మనియుఁ దెలియఁబడుచున్నది. ఈమీఁదఁ జెప్పిన రోహిణీనక్షత్రనిశీథకాలములు గాక తక్కిన యుగ వర్ష ఋతు మాస పక్ష తిథులు మొదలయినవి యేమియు శ్రీభాగవతమున నందునారాయణావతారఘట్టంబునఁ దెలుపఁబడియుండలేదు.

హరివంశమునందు పూర్వభాగములోఁ గల ౫౨-వ యధ్యాయమునందలి ప్రమాణవచనములు.

యోగమాయాం ప్రతి విష్ణూక్తిః.

శ్లో. తతోఽహం సంభవిష్యామి దేవకీజఠరే శుభే
గర్భే త్వయా యశోదాయా గంతవ్య మవిలంబితమ్.

శ్లో. ప్రావృట్కాలే చ నభసి కృష్ణాష్టమ్యా మహం నిశి
ఉత్పత్స్యామి నవమ్యాంచ ప్రసూతిం త్వ మవాప్స్యసి.

ఈశ్లోకద్వయంబునందు "ప్రావృట్కాలే" అనుదానివలన వర్షర్తు వనియు "నభసి" అనుదానివలన శ్రావణమాస మనియు "కృష్ణాష్టమ్యాం నిశి" అనుటవలనఁ గృష్ణపక్షాష్టమినాఁటిరాత్రిపూఁట యనియుఁ దెలియఁబడుచున్నది. మఱియు "నవమ్యాంచ ప్రసూతిం త్వమవాప్స్యసి" అనువాక్యార్థమును వక్ష్యమాణహరివంశగ్రంథోదాహృతప్రమాణవచనస్థమగు "యా మేవరజనీంకృష్ణో జజ్ఞే వృష్ణికులేప్రభుః। తా మేవ రజనీం కన్యాం యశోదా దే వ్యజాయత" అనువచనార్థంబును సమరసపెట్టి యాలోచింపఁగా నవమీవిద్ధగలయష్టమి శ్రీకృష్ణజననతిథియని తెలియఁబడుచున్నది.

తస్మిన్నే వాధ్యాయే—యోగనిద్రాంప్రతి శ్రీమన్నారాయణోక్తిః.

శ్లో. అర్ధరాత్రే కరిష్యామి గర్భమోక్షం యథాసుఖమ్
అష్టమస్యతు మాసస్య జాతా వావాం తత స్సమమ్.

శ్లో. అహం యశోదాం యాస్యామి త్వం దేవిం యాహి దేవకీమ్
ఆవయో ర్గర్భవ్యత్యాసే కంసో గచ్ఛతి మూఢతామ్.

—అధ్యాయః-౫౩.

శ్లో. యస్మి న్నహని దేవేశం గర్భే చాధత్త దేవకీ
యశోదాపి సమాధత్త గర్భం త దహ రేవహి.

శ్లో. విష్ణో శ్శరీరజాం నిద్రాం విష్ణోర్నిర్దేశకారిణీమ్
గర్భకాలే త్వసంపూర్ణే హ్యష్టమే మాసి తే స్త్రియా.

శ్లో. దేవకీచ యశోదాచ సుషువాతే సమం తదా
యా మేవ రజనీం కృష్ణో జజ్ఞే వృష్ణికులే ప్రభుః.
శ్లో. తా మేవరజనీం కన్యాం యశోదా దే వ్యజాయత
అష్టమ్యాం శ్రావణే మాసి కృష్ణపక్షే మహాతిథౌ.
శ్లో. రోహిణ్యా మర్ధరాత్రేచ సుధాంశా వుదయోన్ముఖే
దేవక్యజనయ ద్విష్ణుం యశోదా తాంతు కన్యకామ్.
శ్లో. ముహూర్తేభిజితి ప్రాప్తే హ్యర్ధరాత్రే సుఖావహే,
తస్మిన్నేవాధ్యాయే.—
శ్లో. వసుదేవ స్తతో గత్వా దేవకీగర్భవేశ్మ తత్
దదర్శ దేవదేవేశం రాత్రౌ జాత మధోక్షజమ్.
శ్లో. శయాన మాంబుజేపత్రే వటపత్రే యథాపురా
ప్రాచీనశిరసం దేవం పశ్చిమన్య స్తపాదకమ్.

ఈవచనార్థపర్యాలోచన సాకల్యముగాఁ జేయుటవలన భాగవత విష్ణుపురాణ ప్రతిపాదితమాస ఋతు పక్ష నక్షత్ర తిథి రాత్ర్యాదులు మాత్రమే కాక జననముహూర్తము అభిజిత్తనియు, దేవకీయశోదలగర్భంబులం దేకరాత్రియందే, శ్రీకృష్ణయోగమాయ లుద్భవించి రనియు, అట్టియుద్భవకాల మసంపూర్ణమగునష్టమమాసముగా నుండె ననియు, అట్లసంపూర్ణకాలంబున జనియించినందున నే శ్రీకృష్ణమూర్తి యః తనిజననోత్తరకాలంబున గోకులవాడుకప్రకారము పన్నపత్రములఁ నుంపఁబడియుండె ననియు, అత్తటి సూతికాగృహంబునఁ దేజరిల్లెడునా శ్రీకృష్ణుండు ప్రాగ్దిఙ్నియమితశిరస్కుండును, పశ్చిమదిగ్విన్యస్తపాదయుగళుండు నై యుండె ననియు నిట్టివిశేషార్థంబులు దెలియఁబడుచున్నవి.

శ్రీమద్భాగవతైకాదశస్కంధంబునం గలషష్ఠాధ్యాయమున నుండు
శ్రీకృష్ణమూర్తిజీవితకాలనిర్ణాయకప్రమాణవచనము.
శ్రీకృష్ణంప్రతి బ్రహ్మాదిదేవోక్తిః.

శ్లో. యదువంశేఽవతీర్ణస్య భవతః పురుషోత్తమ
శరచ్ఛతం వ్యతీయాయ పంచవింశాధికం విభో.

ఈవచనమునందుండు "భవతః, పంచవింశాధికం, శరచ్ఛతం, వ్యతీయాయ" అనుపదములచే బ్రహ్మాదిదేవతలు శ్రీకృష్ణుని వైకుంఠమునకు రమ్మని పిలువవచ్చిన కాలమునందు నమ్మహాపురుషునికి జననప్రభృతిగతసంవత్సరములు ౧౨౫ – అని తెలియఁబడుచున్నది. విష్ణుపురాణమునందు నిదేక్రమంబునఁ జెప్పఁబడియున్నది. అదెట్లనిన—విష్ణుపురాణము, అంశము ౫– అధ్యాయము–౩౭—శ్రీకృష్ణంప్రతి ఇంద్రప్రేషితదేవదూతోక్తిః.

శ్లో. వసవశ్వీమరుదాదిత్యరుద్రసాధ్యాదిభి స్సహ
విజ్ఞాపయతి శక్ర స్త్వాం త దిదం శ్రూయతాం ప్రభో.
శ్లో. దుర్వృత్తా నిహతా దైత్యా భువో భారోవతారితః
త్వయా సనాథా స్త్రిదశా భవంతు త్రిదివే పునః.
శ్లో. పంచవింశత్యు త్తరకం శతంతు శరదాం గతమ్
ఇదానీం గమ్యతాం స్వర్గో భవతే యదిరోచతే.

ఈవచనములయందుఁ దెలుపఁబడిన "పంచవింశత్యుత్తరకం శతంతు శరదాం గతమ్" అనువాక్యముచేత ౧౨౫ సంవత్సరములు జరిగినవి యని తెలియఁబడు చున్నది. హరివంశాదిగ్రంథములయందు నిదేక్రమంబునఁ దెలుపఁబడియున్నది. గ్రంథవిస్తరభీతిచేత నాగ్రంథస్థప్రమాణవచనంబుల నిచ్చటఁ బ్రకాశపఱుపలేదు.

శ్రీమద్భాగవతైకాదశస్కంధమునం గల సప్తమాధ్యాయములో నుండు
శ్రీకృష్ణమూర్తినిర్యాణకాలప్రతిపాదకప్రమాణవచనములు.

శ్లో. ఉత్తరార్థమారభ్య॥ సముద్ర స్సప్తమే హ్యేనాం పురీం మాప్లావయిష్యతి.
శ్లో. యర్హ్యేవాయం మయా త్యక్తో లోకోయం నష్టమంగళః.
భవిష్య త్యచిరా త్సాధో కలినాపి నిరాకృతః.

ఈప్రమాణవచనార్థపర్యాలోచనవలనం దెలియఁబడిన దేమనిన, బ్రహ్మాదిదేవతలు శ్రీకృష్ణమూర్తిని వైకుంఠమునకు రమ్మని విన్నవించి వారివారిలోకములకుఁ బోయినతోడనే శ్రీకృష్ణుం డుద్ధవునితో నీద్వారకాపట్టణము నేఁటి కేడవదివసము నందు సముద్రునిచే నావరింపఁబడును. నేను భూలోకమును వదలఁగానే కలి ప్రవేశించును. అట్టికాల మతిత్వరితముగానే సంభవించును– అని చెప్పినందున శ్రీకృష్ణనిర్యాణకాలము కలియుగప్రవేశదిన మనియు, అట్టికలియుగాదిదివసమునకు నవ్యవహితపూర్వమాసంబుననే బ్రహ్మాదిదేవతలు శ్రీకృష్ణాహ్వానము సేయ వచ్చి రనియు సూచనగాఁ దెలియఁబడుచున్నది. ఈయర్థము విష్ణుపురాణమునందు స్పష్టముగాఁ దెలుపఁబడియున్నది. అ దెట్టు లనిన:—

విష్ణుపురాణము, అంశము– ౫, అధ్యాయ ౨౫.

శ్లో. యస్మి న్కృష్ణోదివం యాత స్తస్మి న్నేవ తదాహని
ప్రతిపన్నం కలియుగం తస్య సంఖ్యాం నిబోధత.

ఈవచనార్థపర్యాలోచనమువలన శ్రీకృష్ణనిర్యాణదివసమునందే యీభూలోకమునందుఁ గలి ప్రవేశమాయెను, అని దృఢముగాఁ దెలియఁబడుచున్నది. కాన మీఁదఁ దెలుపఁబడినభాగవతవచనసూచితార్థమునకు సామరస్యము లెస్సగాఁ గలుగుచున్న దని తెలియఁదగ్గది. బ్రహ్మాదిదేవతలు శ్రీకృష్ణాహ్వానమునందుఁ దెలియఁజేసిన–౧౨౫–సంవత్సరములు దైవసంవత్సరము లని చెప్పెడుదురాక్షేపపరిహారవిచారము.

## విష్ణుపురాణము, అంశము-౫, అధ్యాయము-౨౩.

### శ్రీకృష్ణంప్రతి ముచికుందోక్తిః.

శ్లో. ముచికుంద శ్చ తత్రాదౌ వృద్ధగార్గ్యవచః స్మరన్
సంస్మృత్య ప్రణిప త్యైనం పరం సర్వేశ్వరం హరిమ్.
శ్లో. ప్రాహ జాతో భవా న్విష్ణో రంశ స్త్వం పరమేశ్వర
పురా గర్గేణ కథిత మష్టావింశ త్తమే యుగే.
శ్లో. ద్వాపరాంతే హరే ర్జన్మ యదువంశే భవిష్యతి.

ఈవచనార్థపర్యాలోచనవలన శ్రీకృష్ణావతారము జగత్సృష్టి మొదలుకొని జరగెడి యిరువదెనిమిదవమహాయుగమునందుఁ దటస్థించునట్టిద్వాపరయుగంబున నంతిమభాగములో యదువంశమునందు శ్రీకృష్ణమూర్తి యవతరింపఁబోవుచున్నాఁ డని తొల్లి వృద్ధగార్గ్యులు చెప్పినట్లు ముచికుందమహారాజు శ్రీకృష్ణునితో విన్నపము చేసెనని తెలుపఁబడినందున ముందు నుదాహరించిన ప్రమాణవచనములలో శ్రీకృష్ణునితో బ్రహ్మాదిదేవతలు తెలిపినసంవత్సరపరిగణనము, ఐహికవ్యవహారోపయుక్తాస్మత్ప్రభవాదిసంవత్సరములే కాని యాముష్మికలోకవ్యవహార్యమాణదైవసంవత్సరంబులు కావు. కావున మీఁదఁ జెప్పినముచికుందోక్తి చొప్పున నిరువదెనిమిదవ మహాయుగంబునఁ దటస్థించిన ద్వాపరయుగం బీకలియుగంబునకు నవ్యవహితపూర్వంబయినద్వాపరయుగమే కాని వేఱొకద్వాపరయుగము కానేరదు. అదెట్లనిన:—

### సూర్యసిద్ధాంతము-అధ్యాయము-౧

శ్లో. ఆయుషోర్ధం గతం తస్య శేషా త్కల్పోఽయ మాదిమః
కల్పా దస్మాచ్చ మనవ షడ్వ్యతీతా స్ససంధయః
శ్లో. అష్టావింశయుగా దస్మా ద్యాత మేతత్కృతం యుగమ్
అతఃకాలం ప్రసంఖ్యాయ సంఖ్యా మేకత్ర పిండయేత్''

ఈవచనములందుఁ దెలిపిన ''అష్టావింశయుగా దస్మాత్'' అనుదానివలన నిది యిరువదెనిమిదవమహాయుగ* మని తెలియనాయెను. ఇచ్చట యుగశబ్దము వ్యాఖ్యాతృభిప్రాయానుసారముగా మహాయుగపర మని తెలియఁదగినది, అట్లు కానిపక్షమం దీవచనములోనే ''యాత మేతత్కృతంయుగం'' అనువచనమువలనఁగృతయుగంబునకు నష్టావింశమహాయుగాంతఃపాతిత్వము ఘటింపకపోవును. కాఁగా నదే క్రమంబునఁ గ్రిందట జరిగినకృతయుగము మొదలుకొని యిప్పుడు జరిగెడికలియుగపర్యంతము గలయుగచతుష్టయము నిరువదెనిమిదవమహాయుగంబునఁ జేరినవిగాన ముందు విష్ణుపురాణోదాహృత మగు''ద్వాపరాంతే హరే ర్జన్మ యదువంశేభవిష్యతి

*కృతాదియుగచతుష్టయము ఒకమహాయుగ మనఁబడుచున్నది గావున నొకమహాయుగమున కృతాదినాల్గుయుగములు తటస్థము లగుచున్నవి.

అనువచనమువలనఁ దెలిపినయుగమీఁకలియుగావ్యవహితపూర్వయుగం బగు ద్వాపరయుగంబే యనుట సూర్యసిద్ధాంతాదినిఖిలసిద్ధాంతగ్రంథప్రతిపాదితసిద్ధాంతముతో నత్యంతసామరస్యము నొందియున్నది గాన మీఁదఁ దెలిపినసంవత్సరనిర్ణయము దైవసంవత్సరపర మని కుశంకలు సేయుపురుషులపలుకుల కెంతమాత్రము నవకాశము గలుగనేరదు. అదియునుం గాక మీఁద నుదాహరించిన గర్గవాక్యానుస్మృతశ్రీకృష్ణజననకాలనిర్ణయవిషయము శ్రీమద్భాగవతమునందును సూచనగాఁ దెలుపఁబడియున్నది. అ దెట్టు లనిన:—

భాగవతము–దశమస్కంధము–అధ్యాయము–౫౧.

శ్లో. ఇత్యుక్త స్తం ప్రణమ్యాహ ముచికుందో ముదాన్వితః
జ్ఞాత్వా నారాయణం దేవం గర్గవాక్య మనుస్మరన్.

ఇచ్చట "గర్గవాక్యమనుస్మరన్" అనుటకుభాగవతవ్యాఖ్యానకర్తలును సర్వజ్ఞులు నగుశ్రీధరాచార్యులవారు "అష్టావింశతితమే మహాయుగే యదువంశేభగవానవతరిష్యతీతిగార్గ్యవాక్య మనుస్మర న్నిత్యర్థః" అని చెప్పియున్నారు. మఱియు నాంధ్రభాగవతకర్తయగు బమ్మెరపోతనయును దశమస్కంధపూర్వభాగములో ముచికుందపూర్వకథాభివర్ణనఘట్టమునందు నంతిమవచనాంతములో "హరికి ముచికుందుండు నమస్కరించి నారాయణదేవుం డగుట యెఱింగి యిరువదెనిమిదవమహాయుగంబునందు నారాయణుం డవతరించునని మున్ను గర్గుండు సెప్పుట తలంచి" అని వ్యాఖ్యాత్రభిప్రాయానుసారముగానే తెలిపియున్నాఁడు గాన నష్టావింశమహాయుగాంతఃపతితం బగుద్వాపరయుగం బీకలియుగావ్యవహితపూర్వవృత్తయుగమే యని దృఢముగా నఖిలజనులకుఁ దెలుపుటయం దత్యంతానందంబు నొందుచున్నాము. కాఁగా శ్రీమద్భాగవత, విష్ణుపురాణ, హరివంశాదశిష్టజనాంగీకారంబు లగువిషయముల సాకల్యముగా సంప్రదాయార్థమునకుఁ బొరపాటు రానటులు పరిశీలించినయెడ నఖిలసందేహంబులకుసామరస్యం బతిశ్లాఘ్యతమంబుగాఁ గలుగుననుటయందేమియు సందేహము లేదు గాన నిఖిలచరాచరపోషణైకాయత్తచిత్తుండగుభగవంతునియవతారాదికృత్యములనుగుఱించి కుమతప్రవిష్టు లగుకుజనులు సేయుకుత్సితాక్షేపణము లన్నియు నసంప్రదాయార్థజ్ఞాపరిపూర్ణగ్రంథార్థపరిజ్ఞానప్రయుక్తావివేకమూలకములని దృఢముగా నమ్ముచున్నారము.

నిష్కృష్టాభిప్రాయవివేచనము:—మీఁదఁ దెలిపినక్రమంబున భాగవత, విష్ణుపురాణ, హరివంశాదిగ్రంథప్రతిపాదిత ప్రమాణ వచనార్థపర్యాలోచనచేఁ గలిగెడు నిష్కృష్టాభిప్రాయం బఖిలజనులకుఁ గరతలామలకముగాఁ దెలియఁబడున ట్లీ దిగువ వివరించుచున్నాము.

ద్వాపరయుగపరిమితసంవత్సరములు ౮౬౪౦౦౦ లలో ౮౬౩౮౭౪ సంవత్సరములు, ౪ నెలలు, ౨౧ దినములు, గతమయినకాలమునందలి శ్రీముఖసంవత్సర శ్రావణబహుళనవమీవిద్ధాష్టమియందు రాత్రినిశీథకాలంబున వృషభలగ్నమునందు సంభవించినసర్వోత్తమం బగునభిజిన్ముహూర్తంబున శ్రీమదాదినారాయణపరబ్రహ్మమూర్తి లీలాగృహీతశరీరుండయి దేవకీదేవిగర్భంబున నర్భకుండయి యుదయించెను. అట్టియుదయకాలంబునఁ బ్రాగ్దిక్సమితశిరస్కుండును, బశ్చిమదిగ్విన్యస్త పాదయుగళుండును, జతుర్బాహుండును, శంఖచక్రాద్యాయుధధరుండును, అధిక తేజఃపుంజదీపితసూతికాగృహుండును నై పద్మపత్త్రంబుల శయనించి తేజరిల్లుచుండెను. అమ్మహాత్ముం డావిర్భావంబు నొందినమీఁదఁ దెలిపిన శ్రీముఖసంవత్సర శ్రావణబహుళాష్టమి మొదలుకొని లీలామానుషవిగ్రహంబుఁ దాల్చి భూలోకంబున నుండినసంవత్సరంబులు ౧౨౫ ను, నెలలు ౭ ను, దినములు ౮ యునుగా నున్నవి. అప్పురుషోత్తముండు లీలామానుషవిగ్రహంబు వదలి మరల వైకుంఠంబు ప్రవేశించినకాలంబు కలియుగాదిమసంవత్సరం బగుప్రమాదిసంవత్సర చైత్రశుద్ధప్రతిపద్భృగువాసర మగుచున్నది. బార్హస్పత్యమానరీతిని శ్రీకృష్ణావతారసంవత్సరముపార్థివ. నిర్యాణసంవత్సరము ఖర. అట్టిజగదీశ్వరునినిర్యాణానంతరము గతసంవత్సరంబుల పరిమితి ౫౦౧౨గానున్నవి. శ్రీకృష్ణమూర్త్యావిర్భావదినంబునందే నవమీఘటికలలో యశోదాదేవిగర్భంబున యోగమాయ జనించెను గాన యోగమాయ శ్రీకృష్ణానుజన్మ యని తెలియందగినది.

ఇదియునుం గాక నిఖిలాస్మదీయజనులకు నిత్యక్షేమము గలుగఁ జేసెడుసద్విద్యాభివృద్ధి నొందుటకు ముఖ్యసాధనంబులుగా నుండుసద్గ్రంథపరిష్కరణతత్ప్రకాశనాదిసత్క్రియలయందుఁ బ్రవర్తించి యుండెడునస్మత్సజాతీయు లగుజనులచే నత్యంతపరిశ్రమంబునం బరిష్కరింపంబడెడునసద్గ్రంథంబులఁ బఠించుటవలనఁ గలిగెడునానందంబు ననుభవించుసత్పురుషులు కృతజ్ఞులయి యుదేక్రమంబున నస్మదీయసద్గ్రంథంబు లభివృద్ధి నొందుట కత్యంతసహాయంబు చేయుటయం దపరిమితాసక్తి నొందియుండవలయు నని నిఖిలసజ్జనసద్విద్యావైదుష్యాభివర్ధనైకపరాయణుం డగునారాయణుని నిరంతరంబు ప్రార్థించుచున్నారము.

పురాణం - హయగ్రీవశాస్త్రులు.






## ప్రథమస్కంధము.


| విషయము. | | | పుట. |
|---|---|---|---|
| ఇష్టదేవతాదిప్రార్థనము. | ... | ... | 1 |
| కృతిపతిత్వనిర్ణయము. | ... | ... | 8 |
| గ్రంథకర్తృవంశావతారము | ... | ... | 4 |
| శ్రీమహాభాగవతకథాప్రారంభము | ... | ... | 5 |
| సూతుండు నారాయణకథాప్రశంస సేయుట | ... | ... | 8 |
| భగవంతునియేకవింశత్యవతారములు | ... | ... | 11 |
| శ్రీమహాభాగవతరచనాదివృత్తాంతము | ... | ... | 13 |
| వ్యాసుండు వ్యాకులచిత్తుండై చింతించుట | ... | ... | 15 |
| వ్యాసునికడకు నారదుండు వచ్చుట | ... | ... | 16 |
| నారదునిపూర్వజన్మవృత్తాంతము | ... | ... | 18 |
| అర్జునుండు పుత్రఘాతి యగునశ్వత్థామ నవమానించుట | ... | ... | 23 |
| ద్రౌపది యశ్వత్థామను జూచి సంభాషించుట | ... | ... | 25 |
| శ్రీకృష్ణుండు ఉత్తరాగర్భస్థుం డగునర్భకుని రక్షించుట | ... | ... | 27 |
| కుంతీదేవి శ్రీకృష్ణుని నుతించుట | ... | ... | 28 |
| ధర్మజుండు శ్రీకృష్ణసహితుండై శరతల్పగతుండైనభీష్మునికడ కేఁగుట | | ... | 31 |
| భీష్ముఁడు శ్రీకృష్ణుని స్తుతించుట | ... | ... | 33 |
| శ్రీకృష్ణుండు ద్వారకానగరంబున కరుగుట | ... | ... | 35 |
| శ్రీకృష్ణుండు ద్వారకానగరంబు ప్రవేశించుట | ... | ... | 37 |
| శ్రీకృష్ణుం డంతఃపురకాంతలం జూడఁబోవుట | ... | ... | 39 |
| ఉత్తరకుఁ బరీక్షిత్తు జనించుట | ... | ... | 41 |
| గాంధారీధృతరాష్ట్రులు దేహత్యాగము చేసికొనుట | ... | ... | 45 |
| ధర్మరాజు దుర్నిమిత్తంబులం గని చింతించుట | ... | ... | 49 |
| అర్జునుండు ద్వారకనుండి వచ్చి కృష్ణనిర్యాణము దెలుపుట | ... | ... | 50 |
| ధర్మరాజు పరీక్షిన్మహారాజునకుఁ బట్టము గట్టి మహాప్రస్థానంబున కేఁగుట | | ... | 54 |
| పరీక్షిన్మహారాజు భూధర్మదేవతలసంవాదం బాలించుట | ... | ... | 56 |
| కలిపురుషుఁడు ధర్మదేవతను దన్నుట | ... | ... | 58 |

| విషయము. | పుట.. |
|---|---|
| పరీక్షిన్మహారాజు కలిని నిగ్రహించి ధర్మపరిపాలనము సేయుట ... | 60 |
| పరీక్షిన్మహారాజు వేఁటాడి శమీకమహామునిపై మృతసర్పము నెత్తివైచుట ... | 63 |
| శమీకమహామునిపుత్త్రుం డగుశృంగిముని పరీక్షిత్తుని శపించుట ... ... | 64 |
| పరీక్షిన్మహారాజు విప్రశాపంబు దెలిసికొని ప్రాయోపవిష్టుం డగుట ... | 67 |
| శుకమహర్షి పరీక్షిన్మహారాజునొద్ద కేతెంచుట ... ... | 69 |
| **ద్వితీయస్కంధము.** | |
| శుకుండు పరీక్షిత్తునకు విరాట్స్వరూపంబు దెలుపుట ... ... | 74 |
| శుకమహర్షి పరీక్షిన్మహారాజునకు భక్తిమార్గంబు ముఖ్యం బని తెలుపుట ... | 79 |
| నారదుండు బ్రహ్మను బ్రపంచప్రకారముఁ దెలుపు మని యడుగుట ... | 83 |
| శ్రీమన్నారాయణునిలీలావతారంబులయభివర్ణనము ... ... | 92 |
| పరీక్షిన్మహారాజు శుకయోగిని బ్రపంచోద్భవాదికంబు నడుగుట ... ... | 104 |
| శ్రీమన్నారాయణుండు బ్రహ్మతపంబునకు మెచ్చి వరంబు లిచ్చుట ... | 107 |
| **తృతీయస్కంధము.** | |
| విదురుం డుద్ధవుం గని కృష్ణాదులవృత్తాంతం బడుగుట ... ... | 122 |
| విదురమైత్రేయసంవాదము ... ... | 137 |
| స్వాయంభువమనువు ప్రజావృద్ధి చేయుట ... ... | 169 |
| శ్రీయజ్ఞవరాహావతారవర్ణనము ... ... | 170 |
| శ్రీయజ్ఞవరాహమూర్తిని బ్రహ్మాదులు స్తుతియించుట ... ... | 172 |
| మైత్రేయమహాముని విదురునకు హిరణ్యాక్షహిరణ్యకశిపులజననం బెఱింగించుట ... | 176 |
| సనకసనందనాదులు వైకుంఠమున కరుగుట ... ... | 181 |
| సనకసనందనాదులు నారాయణదేవుని స్తుతించుట ... ... | 187 |
| జయవిజయులు దితిగర్భంబున హిరణ్యాక్షహిరణ్యకశిపులై పుట్టుట ... | 192 |
| హిరణ్యాక్షుఁడు యజ్ఞవరాహం బగుహరి నెదిరించి పోరుట ... ... | 195 |
| చతుర్ముఖుం డొనర్చుయక్షాదిదేవతాగణసృష్టిఁ దెలుపుట ... ... | 203 |
| కర్దమప్రజాపతి భగవదనుజ్ఞ వడసి దేవహూతిని బెండ్లియాడుట ... | 207 |
| కర్దమప్రజాపతి యోగప్రభావంబుచే విమానంబు గల్పించి భార్యతోఁగూడ విహరించుట | 214 |
| దేవహూతిగర్భంబున విష్ణుండు కపిలాచార్యుఁడుగాఁ బుట్టుట ... ... | 218 |
| దేవహూతి తనపుత్త్రుండైనకపిలునివలనఁ దత్త్వజ్ఞానంబు వడయుట ... | 221 |
| కపిలుండు దేవహూతికి భక్తియోగమును దెలియఁజేయుట ... ... | 237 |
| కపిలుండు దేవహూతికిఁ బిండోత్పత్తిక్రమంబుఁ దెలుపుట ... ... | 242 |
| గర్భస్థుం డగుజీవుండు భగవంతుని స్తుతియించుట ... ... | 243 |
| **చతుర్థస్కంధము.** | |
| కర్దమప్రజాపతిసంతతిని దెలుపుట ... ... | 255 |

| విషయము. | | | పుట. |
|---|---|---|---|
| దక్షప్రజాపతిసంతతిని దెలియఁజేయుట | ... | ... | 258 |
| ఈశ్వరునకు దక్షప్రజాపతికిని విరోధము సంభవించినకథ | ... | ... | 259 |
| దక్షప్రజాపతియజ్ఞమునకు దాక్షాయణి పోఁగోరుట | ... | ... | 262 |
| శివుఁడు వీరభద్రునిచే దక్షయజ్ఞంబు ధ్వంసంబు సేయించుట | ... | ... | 268 |
| దేవతలు వీరభద్రాదులచేఁ బరాజితు లయి బ్రహ్మతో విన్నవించుట | | ... | 270 |
| బ్రహ్మాదులు దక్షిణామూర్తిరూపుం డగునీశ్వరుని స్తుతియించుట | | ... | 272 |
| శివుఁడు బ్రహ్మాదులచేఁ బ్రార్థితుం డై దక్షాదుల ననుగ్రహించుట | | ... | 274 |
| దక్షాధ్వరంబునకు వచ్చిననారాయణుని దక్షాదులు నుతించుట | ... | ... | 276 |
| ధ్రువోపాఖ్యానము | ... | ... | 282 |
| ధ్రువుండు నారదోపదేశంబు వడసి తపంబుఁ జేయుట | ... | ... | 283 |
| సాక్షాత్కరించినభగవంతుని ధ్రువుండు స్తుతియించుట | ... | ... | 288 |
| ధ్రువుండు మరలి తనపురంబునకు వచ్చుట | ... | ... | 292 |
| ధ్రువుండు కుబేరానుచరు లైనగుహ్యకులతో యుద్ధముచేయుట | ... | ... | 295 |
| అంగపుత్రుం డగువేనునిచరిత్రము | ... | ... | 305 |
| పృథుచక్రవర్తి గోరూపధారిణి యగుభూమివలన నోషధులఁ బిదుకుట | | ... | 314 |
| పృథుచక్రవర్తి యశ్వమేధంబు సేయునెడ నింద్రుం డశ్వము నపహరించుట | | ... | 319 |
| నారాయణుండు ప్రసన్నుం డయి పృథుచక్రవర్తి ననుగ్రహించుట | | ... | 322 |
| పృథుచక్రవర్తి సభాసదులకు సద్ధర్మముల నుపదేశించి బ్రాహ్మణప్రశంస చేయుట | | ... | 327 |
| పృథుచక్రవర్తియొద్దకు సనకాదు లరుగుదెంచుట | ... | ... | 332 |
| పృథుచక్రవర్తి జ్ఞానవైరాగ్యవంతుం డయి ముక్తి నొందుట | ... | ... | 337 |
| రుద్రుండు ప్రచేతసులకు యోగాదేశ మనుస్తోత్రమును దెల్పుట | ... | ... | 343 |
| నారదుండు ప్రాచీనబర్హికి జ్ఞానమార్గమును దెలియఁజేయుట | ... | ... | 349 |
| పురంజనోపాఖ్యానము | ... | ... | ,, |
| ప్రచేతసులతపంబునకు భగవంతుండు మెచ్చి వరంబు లిచ్చుట | ... | ... | 371 |

## పంచమస్కంధము — ప్రథమాశ్వాసము.

| | | | |
|---|---|---|---|
| భగవంతుఁ డగునారాయణుండు ఋషభావతార మెత్తుట | ... | ... | 387 |
| ఋషభుండు పుత్రులకు నీతి యుపదేశించుట | ... | ... | 391 |
| భరతోపాఖ్యానము | ... | ... | 397 |
| భరతుండు హరిణజన్మంబు విడిచి బ్రాహ్మణుం డయి జనియించుట | | ... | 401 |
| వృషభరాజభృత్యులు కాళికి బలియిచ్చుటకై భరతునిఁ గొనిపోవుట | | ... | 403 |
| భరతుండు రహూగణునిమాటలకుఁ బ్రత్యుత్తరంబు లిచ్చుట | ... | ... | 405 |

## పంచమస్కంధము — ద్వితీయాశ్వాసము.

| | | | |
|---|---|---|---|
| శుకయోగి పరీక్షిత్తున కుపదేశరూపమునఁ దెలుపుభూగోళస్వరూపాదికము | | ... | 416 |

| విషయము. | | | పుట. |
|---|---|---|---|
| భగణవిషయము | ... | ... | 429 |
| శుకయోగి పరీక్షిత్తున కుపదేశరూపమునఁ దెలిపెడినరకలోకవర్ణనము | | ... | 439 |


## షష్ఠస్కంధము.


| | | | |
|---|---|---|---|
| అజామిళోపాఖ్యానము | ... | ... | 450 |
| విష్ణుదూతయమదూతలసంవాదము | ... | ... | 451 |
| దక్షుఁడు స్తుతియించినహంసగుహ్యం బను స్తవరాజము | ... | ... | 466 |
| నారదుండు శబళాశ్వులకు నివృత్తిమార్గంబు నుపదేశించుట | ... | ... | 472 |
| దక్షుండు, నారదుని శపియించి ప్రజాసర్గం బొనరించుట | ... | ... | 473 |
| దానవులు దేవతలతో యుద్ధము చేసి యోడించుట | ... | ... | 478 |
| శ్రీమన్నారాయణకవచప్రారంభము | ... | ... | 481 |
| చిత్రకేతూపాఖ్యానము | ... | ... | 505 |
| చిత్రకేతుండు తపం బాచరించి భగవత్ప్రసాదంబు నొందుట | ... | ... | 510 |
| చిత్రకేతుం డీశ్వరధిక్కారంబువలన గౌరిచే శాపంబు నొందుట | | ... | 513 |
| సవితృవంశప్రవచనాదికత | ... | ... | 516 |


## సప్తమస్కంధము.


| | | | |
|---|---|---|---|
| శ్రీహరిద్వారపాలకులైన జయవిజయులకు సనకాదులవలన శాపంబు గలుగుట | | ... | 525 |
| బాలవేషము దాల్చినయముండు దెలిపెడుసుయజ్ఞోపాఖ్యానము... | | ... | 528 |
| బ్రహ్మదేవుండు హిరణ్యకశిపునకు వరంబు లిచ్చుట | ... | ... | 532 |
| ప్రహ్లాదచరిత్రప్రారంభము | ... | ... | 537 |
| హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదుని వివిధోపాయంబుల హింసించుట | ... | ... | 544 |
| శ్రీహరి నరసింహరూపంబున స్తంభంబునం దావిర్భవించుట | ... | ... | 557 |
| శ్రీనృసింహమూర్తి హిరణ్యకశిపునితోఁ బోరి వధించుట | ... | ... | 559 |
| బ్రహ్మాదిదేవతలు శ్రీనృసింహదేవుని వేఱువేఱుగా స్తుతించుట | ... | ... | 561 |
| ప్రహ్లాదుండు నరసింహమూర్తిని స్తుతించుట | ... | ... | 565 |
| త్రిపురాసురసంహారము | ... | ... | 572 |
| నారదుఁడు ధర్మరాజునకు వర్ణాశ్రమధర్మంబు దెలుపుట | ... | ... | 574 |
| ప్రహ్లాదాజగరమునులసంవాదము | ... | ... | 579 |
| నారదునిపూర్వజన్మవృత్తాంతము | ... | ... | 587 |

శ్రీహయగ్రీవాయ నమః.

శ్రీ సరస్వతీ ప్రార్థన.

ఉ. క్షోణితలంబు నెన్నుదురు ♦ సోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీకచయ♦సుందరవేణికి రక్షితామర
శ్రేణికిఁ దోయజాతభవ♦చిత్తవశీకరవైకవాణికిన్
వాణికి నక్షదామశుక♦వారిజపుస్తకరమ్యపాణికిన్.

శా. తల్లీ నిన్నుఁ దలంచి పుస్తకము చే♦తం బూనితిన్ నీవు నా
యుల్లంబందునె నిల్చి జృంభణముగా ♦ నుక్తుల్ సుశబ్దంబు శో
భిల్లం బల్కుము నాదువాక్కునను సం♦ప్రీతిన్ జగన్మోహినీ
పుల్లాబ్జాక్షి సరస్వతీ భగవతీ ♦ పూర్ణేందుబింబాననా.

శ్రీమద్భాగవతగ్రంథప్రణేత యగువ్యాసమహర్షి ప్రార్థన.

ఉ. ప్రాంశుపయోదనీలతను♦భాసితు నుజ్జ్వలదండధారుఁ బిం
గాంశుజటాచ్ఛటాభరణు ♦ నాగమపుంజపదార్థతత్త్వని
స్సంశయకారుఁ గృష్ణమృగ♦చర్మకృతాంబరకృత్యు భారతీ
వంశవివర్ధనుం ద్రిదశ♦వందితు సాత్యవతేయుఁ గొల్చెదన్.

శ్రీమద్భాగవతార్థోపదేష్ట యగుశుకమహర్షి ప్రార్థన.

మ. సముఁడై యెవ్వఁడు ముక్తకర్మచయుఁడై ♦ సన్న్యాసియై యొంటిఁ బో
వ మహాభీతి నోహో కుమార యనుచున్ ♦ వ్యాసుండు చీరంగ వృ
క్షములుం దన్మయతం బ్రతిధ్వనులు చ♦క్కం జేసె మున్నట్టి భూ
తమయున్ మ్రొక్కెద బాదరాయణిఁ దపో♦ధన్యాగ్రణిన్ ధీమణిన్.

శ్రీమద్భాగవత ప్రార్థన.

ఆ. వేదకల్పవృక్ష♦విగళిత మయి శుక
ముఖసుధాద్రవమున ♦ మొనసి యున్న
భాగవతపురాణ♦ఫలరసాస్వాదన
పదవిఁ గనుఁడు రసిక♦భావవిదులు.

మ. లలితస్కంధము కృష్ణమూలము శుకా♦లాపాభిరామంబు మం
జులతాశోభితమున్ సువర్ణ సుమన♦స్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమల♦వ్యాసాలవాలంబు నై
వెలయున్ భాగవతాఖ్యకల్పతరు వు♦ర్విన్ సద్ద్విజశ్రేయ మై.

క. నిగమములు వేయి చదివిన
సుగమంబులు గావు ముక్తి♦సుభగత్వంబుల్
సుగమంబు భాగవత మను
నిగమంబుఁ బఠింప ముక్తి♦నివసనము బుధా.

ఆ. అతిరహస్య మైన♦హరిజన్మకథనంబు
మనుజుఁ డెవ్వఁ డేని ♦ మాపు రేపు
చాల భక్తితోడఁ ♦ జదువుఁ దా సంసార
దుఃఖరాశిఁ బాసి ♦ తొలఁగిపోవు.

శ్రీభాగవతగ్రంథప్రతిపాద్యశ్రీకృష్ణమూర్తిప్రార్థన.

మ. తరుణాబ్జారుణలోచనద్వయి కృపా♦ధారేయ మై యొప్పసా
గరకన్యాకుచకుంభపాళిఁ బులకల్ ♦ గన్పట్ట మహాసీంద్రహృ
త్సరసీజంబులు సంచలింప మురళీ♦సంజాతగీతామృత
స్ఫురణన్ రాల్గరఁగం జరించుహరికై♦శోరంబు భావించెదన్.

చ. జలనిధికన్యకాఘనకు♦చస్థలిపచ్చలతాళి గోపికా
విలసితహారమధ్యమణి♦విశ్వజగద్వలయప్రకాశకో
జ్జ్వలమహనీయరత్న మని♦వారిత కాళియభోగిభోగమం
డలగిరివజ్ర మై వెలయు♦నందతనూజు భజింతు నామదిన్.

గ్రంథనాయకుం డగుశ్రీరామమూర్తిప్రార్థన.

క. శ్రీకంఠచాపఖండన
పాకారిప్రముఖవినుత♦భండన విలస
త్కాకుత్స్థవంశమండన
రాకేందుయశోవిశాల ♦ రామనృపాలా.



# శుద్ధపత్రము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 13 | 26 | వన్యూనంబుగా | నన్యూనంబుగా |
| 17 | 29 | ప్రాతేందు | ప్రాంతేందు |
| 45 | 22 | యప్పుడుపు | యప్పుడుపు |
| ,, | 34 | యప్పుడుపు | యప్పుడుపు |
| 56 | 14 | యక్పకవి | యప్పకవి |
| 72 | 18 | తెలిపియన్నాఁడు | తెలిపియున్నాఁడు |
| ]7 | 31 | ఎఱిఁగెడువాడు | ఎఱిఁగెడువాఁడు |
| 346 | 9 | పరిస్పదంబునం | పరిస్పందంబునం |
| 364 | 22 | అనఘా త్త | అనఘాత్మ |
| 365 | 19 | ప్రకాశభూయిషలోకముల | ప్రకాశభూయిష్ఠలోకముల |
| 367 | 10 | నన్నయము | న్ననయము |
| ,, | 33 | లఘుచుఁ జ్రకాశమాన | లగుచుఁ ప్రకాశమాన |
| 369 | 13 | దృష్టంబుము | దృష్టంబును |
| 373 | 8 | క్లేశనాశనుఁడువు | క్లేశనాశనుఁడవు |
| 390 | 15 | జన్మమునంగు | జన్మమునందును |
| 405 | 1 | గంటంకంబుగా | గం.కంబుగా |
| 415 | 3 | నతకిని | నతనికి |
| 597 | 22 | జగములంగలిగిఁచు | జగములఁగలిగించు |
| 612 | 5 | గడలెడలసురులు | గడలెడల సురలు |
| ,, | 18 | హై నెఱమంటలును | హై న నెఱమంటలును |
| 642 | 19 | పలుపంచలును | పలుపంచలను |
| 655 | 30 | నభంబున | నభంబును |
| 678 | 11 | మూఁఘులయ్యెదరు | మూఢులయ్యెదరు |
| 721 | 12 | దండ్రిఁ పనిచినఁ | దండ్రి పనిచినఁ |
| 722 | 26 | ♦వడి నర్జునజాతుల | వడ ♦ నజ్ఞనజాతుల |
| 846 | 5 | నిఖిలవక్షములు | నిఖిలవృక్షములు |
| 892 | 7 | నిట్టిట్టు | నిట్టట్టు |
| 909 | 1 | విద్వజ్జనని కేతనంబును | విద్వజ్జననికేతనంబును |
| 920 | 11 | వాతాశితోఁ | వాతాశితోఁ |
| 984 | 14 | సురచిరగోరష్థన్నలిఁ | సురుచిరగోరష్థన్నలిఁ |
| 971 | 2 | పాతివ్రత్యంబునా యందలి | పాతివ్రత్యంబు నాయందలి |
| 1057 | 18 | చరితము విను | చరితము వినుస |



1. బమ్మెరపోతన - సీతా, రామ, లక్ష్మణులు.



శ్రీ ర స్తు

శ్రీరామచన్ద్రాయ పరబ్రహ్మణే నమః.

# శ్రీ మ దాం ధ్ర మ హా భా గ వ త ము

## ప్ర థ మ స్కం ధ ము.



మం గ ళ ము




కైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలనకళాసంరంభకున్ దానవో
ద్రేకస్తంభకుఁ [1]గేళిలోలవిలసద్దృగ్జాలసంభూతనా
నాకంజాతభవాండకుంభకు మహానందాంగనాడింభకున్. 1

ఇష్టదేవతాదిప్రార్థనము.

ఉ. వాలినభక్తి మ్రొక్కెద నవారితతాండవకేలికిన్ దయా
శాలికి శూలికిన్ శిఖరిజాముఖపద్మమయూఖమాలికిన్
బాలశశాంకమౌళికిఁ గపాలికి మన్మథగర్వపర్వతో
న్మూలికి నారదాదిమునిముఖ్యమనస్సరసీరుహాలికిన్. 2

ఉ. ఆతతసేవఁ జేసెద సమస్తచరాచరభూతసృష్టివి
జ్ఞాతకు భారతీహృదయసౌఖ్యవిధాతకు వేదరాశిని
ర్ణేతకు దేవతానికరనేతకుఁ గల్మషజేతకున్ నత
త్రాతకు ధాతకున్ నిఖిలతాపసలోకశుభప్రదాతకున్. 3

వ. అని నిఖిలభువనప్రధానదేవతావందనంబుఁ జేసి. 4

1 కేళిలోలవిల

ఉ. ఆదర మొప్ప మ్రొక్కిడుదు నద్రిసుతాహృదయానురాగసం
పాదికి దోషభేదికిఁ బ్రపన్నవినోదికి విఘ్నవల్లికా
చ్ఛేదికి మంజువాదికి నశేషజగజ్జననందవేదికిన్
మోదకఖాదికిన్ సమదమూషకసాదికి సుప్రసాదికిన్.

ఉ. క్షోణితలంబు[1]నన్ నుదురు సోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీకచయసుందరవేణికి రక్షితామర
శ్రేణికిఁ దోయజాతభవచిత్తవశీకరణైకవాణికిన్
వాణికి నక్షదామశుకవారిజపుస్తకరమ్యపాణికిన్. 6

శా. పుట్టం బుట్ట శరంబునన్ మొలవ నంభోయానపాత్రంబునన్
నెట్టం గల్గను గాలిఁ గ్రోల్వను బురాణింపన్ దొరంకొంటి మీఁ
దెట్టే వెంట [2]రచింతుఁ దత్సరణి [3]నీ వీవమ్మ యోయమ్మ మేల్
పట్టున్ [4]మానకుమమ్మ నమ్మితిఁ జుమీ బ్రాహ్మీ దయాంభోనిధీ. 7

ఉ. *శారద నీరదేందు ఘనసార పటీర మరాళ మల్లికా
హార తుషార ఫేన రజతాచల కాశ ఫణీశ కుంద మం
దార సుధాపయోధి సితతామర సామరవాహినీ శుభా
కారత నొప్పు నిన్ను మదిఁ గానఁగ నెన్నఁడు గల్గు భారతీ! 8

ఉ. *అంబ నవాంబుజోజ్జ్వలకరాంబుజ శారదచంద్రచంద్రికా
డంబరచారుమూర్తి ప్రకటస్ఫుటభూషణరత్నదీపికా
చుంబితదిగ్విభాగ శ్రుతిసూక్తవివిక్తనిజప్రభావ భా
వాంబరవీథివిశ్రుతవిహారిణి నన్ గృపఁ జూడు భారతీ! 9

ఉ. అమ్మలఁ గన్నయమ్మ ముగురమ్మలమూలపుటమ్మ చాలఁ బె
ద్దమ్మ సురారులమ్మ కడుపాఱడిఁ బుచ్చినయమ్మ దన్ను లో
నమ్మిన వేల్పు[5]టమ్మలమనమ్ముల నుండెడియమ్మ దుర్గ మా
యమ్మ కృపాబ్ధి యిచ్చుత మహత్త్వకవిత్వపటుత్వసంపదన్. 10

మ. హరికిం బట్టపుదేవి పున్నెముల ప్రోవర్థంపుఁబెన్నిక్క చం
దురుతోఁబుట్టువు భారతీగిరిసుతల్ తో నాడుపూఁబోఁడి తా
మరలం దుండెడిముద్దరాలు జగముల్ మన్నించునిల్లాలు భా
సురతన్ లేములు వాపుతల్లి సిరి యిచ్చున్ నిత్యకల్యాణముల్. 11

---

1 నెన్నుదురు. 2 'జరింతుఁ' అని యచ్చుప్రతి. 3 'నా ♦ కీవమ్మ' అని యచ్చుప్రతి.
4 'నా కగుదమ్మ' అని యచ్చుప్రతి.

* ఈరెండుపద్యములు వ్రాఁతప్రతులందుఁ గానంబడవు; ప్రక్షిప్తములుగాఁ దోఁచెడిని. రెండవది మహాభారతమునందలియారణ్యపర్వములోనిచతుర్థాశ్వాసంబున నత్రిగౌతమసంవాదఘట్టమున నున్నది.

5 టన్నులమ♦నమ్ముల.

వ. అని యిష్టదేవతలం జింతించి దినకరకుమారప్రముఖులం దలంచి ప్రథమకవితావిరచనవిద్యావిలాసాతిరేకివాల్మీకినుతియించి హయగ్రీవదనుజకరపరిమిళితనిగమనివహవిభాగనిర్ణయనిపుణతాసముల్లాసునకు వ్యాసునకు మ్రొక్కి శ్రీమహాభాగవతకథాసుధారసప్రయోగికి శుకయోగికి నమస్కరించి మృదుమధురవచనవర్గపల్లవితస్థాణునకుం బాణునకుం బ్రణమిల్లి కతిపయశ్లోకసమ్మోదితసూరు మయూరు నభినందించి మహాకావ్యకరణకళావిలాసుం గాళిదాసుం గొనియాడి కవికమలరవిం భారవిం బొగడి విదళితాఘు మాఘు వినుతించి యాంధ్రకవితాగౌరవజనమనోహరి నన్నయసూరిం గైవారంబు సేసి హరిహరచరణారవిందవందనాభిలాషిం దిక్కనమనీషిం భూషించి మఱియు నితరపూర్వకవిజనసంభావనంబు గావించి వర్తమానకవులకుం బ్రియంబు వలికి భావికవుల బహూకరించి యుభయకావ్యకరణదక్షుండ నై. 12

## కృతిపతిత్వనిర్ణయము.

ఉ. ఇమ్మనుజేశ్వరాధముల ఽ కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని ఽ చొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెట[1]వాటులం బడక ఽ సమ్మతితో హరి [2]కిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరా జొకఁడు ఽ భాగవతంబు జగద్ధితంబుగన్. 13

తే. [3]చేతు లారంగ శివునిఁ బూ ఽ జింపఁ డేని, నోరు నొవ్వంగ హరికీర్తి ఽ నుడువఁ డేని
దయయు సత్యంబు లోనుగాఁ ఽ దలఁపఁ డేనిఁ, గలుగ నేటికిఁ దల్లుల ఽ కడుపుఁ జేటు. 14

వ. అని మఱియు మదీయపూర్వజన్మసహస్రసంచితతపఃఫలంబున శ్రీమన్నారాయణకథాప్రపంచవిరచనాకుతూహలుండ నై యొక్క రాకానిశాకాలంబున సోమోపరాగంబు రాకం గని సజ్జనానుమతంబున నభ్రంకషశుభ్రసముత్తుంగభంగ యగు గంగకుం జని క్రుంకు లిడి వెడలి మహనీయమంజులపులినతలమంటపమధ్యంబున మహేశ్వరధ్యానంబు సేసి కించిదున్మీలితలోచనుండ నై యున్న యెడ. 15

సీ. మెఱుఁగు చెంగట నున్న ఽ మేఘంబుకైవడి, నువిద చెంగట నుండ ఽ నొప్పువాఁడు
చంద్రమండలసుధా ఽ సారంబుపోలిక, ముఖమునఁ జిఱునవ్వు ఽ మొలచువాఁడు
వల్లీయుతతమాల ఽ వసుమతీజముభంగి, బలువిల్లు మూఁపునఁ ఽ బరఁగువాఁడు
నీలనగాగ్రసన్నిహితభానునిభంగి, ఘనకిరీటము దలఁ ఽ గలుగువాఁడు

ఆ. పుండరీకయుగముఁ ఽ బోలుకన్నులవాఁడు, వెడఁదయురమువాఁడు ఽ విపులభద్ర
మూర్తివాఁడు రాజ ఽ ముఖ్యుఁ డొకఁడు నా, కన్నుఁగవకు నెదుర ఽ గానఁబడియె.

వ. ఏను నారాజశేఖరుం దేఱి చూచి భాషింప యత్నంబు సేయు నెడ నతండు దా రామభద్రుండ మన్నామాంకితంబుగా శ్రీమహాభాగవతంబుఁ దెనుంగు సేయు

1 వ్రేటులం. 2. కిచ్చెఁ జెప్పె. 3 చేతు లలయంగ.

ము నీకు భవబంధంబులు దెగు నని యానతిచ్చి తిరోహితుం డయిన సమున్మీలితనయనుండ నై వెఱఁగుపడి చిత్తంబున. 17

క. పలికెడిది భాగవత మఁట, పలికించువిభుండు రామభద్రుం డఁట నేఁ
బలికిన భవహర మగు నఁట, పలికెద వేఱొండుగాథ పలుకఁగ నేలా. 18

ఆ. భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు, శూలికైనఁ దమ్మిచూలికైన
విబుధజనులవలన విన్నంత గన్నంత, దెలియ వచ్చినంత తేటపఱుతు. 19

క. కొందఱకుఁ దెనుఁగు గుణమగుఁ, గొందఱకును సంస్కృతంబు గుణమగు రెండుం
గొందఱకు గుణము లగు నే, నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్. 20

మ. ఒనరన్ నన్నయతిక్కనాదికవు లీయుర్విం బురాణావళుల్
తెనుఁగుం జేయుచు మత్పురాకృతశుభాధిక్యంబు దా నెట్టిదో
తెనుఁగుం జేయరు మున్ను భాగవతముం దీనిం దెనింగించి నా
జననంబుం సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్. 21

మ. లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతాశోభితముం సువర్ణసుమనస్సుజ్ఞేయముం సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమలవ్యాసాలవాలంబు నై
వెలయుం భాగవతాఖ్యకల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయ మై. 22

వ. ఇట్లు భాసిల్లెడు శ్రీమహాభాగవతపురాణపారిజాతపాదపసమాశ్రయంబునను హరికరుణావిశేషంబునను గృతార్థత్వంబు సిద్ధించె నని బుద్ధి నెఱింగి లేచి మరలి కొన్నిదినంబులకు నేకశిలానగరంబునకుం జనుదెంచి యందు గురువృద్ధబుధబంధుజనానుజ్ఞాతుండ నై. 23

### గ్రంథకర్తృవంశావతారము

సీ. కౌండిన్యగోత్రసంకలితుఁ డాపస్తంబ, సూత్రుండు పుణ్యుండు సుభగుఁ డైన
భీమనమంత్రికిఁ బ్రియపుత్రుఁ డన్నయ, కలకంఠి తద్భార్య గౌరమాంబ
కమలాప్తువరమునఁ గనియె సోమనమంత్రి, వల్లభ మల్లమ వారితనయుఁ
డెల్లన యతనికి నిల్లాలు మాచమ, వారిపుత్రుఁడు వంశవర్ధనుండు

ఆ. లలితమూర్తి బహుకళానిధి కేసన, దానమాననీతిధనుఁడు ఘనుఁడు
దనకు లక్కమాంబ ధర్మగేహిని గాఁగ, మనియె శైవశాస్త్రమతముఁ గనియె.

క. నడవదు నిలయము వెలువడి, తడవదు పరపురుషగుణముఁ దనపతినుడువుం
గడవదు వితరణకరుణలు, విడువదు లక్కాంబ విబుధవిసరము వొగడన్. 25

ఉ. మానిను లీడు గారు బహుమాననివారితదీనమానస
గ్లానికి దానధర్మమతిగౌరవమంజులతాగభీరతా

స్థానికి [1]ముద్దుసానికి సదాశివపాదయుగార్చనానుకం
పానయవాగ్భవానికిని బమ్మెరకేసయలక్కసానికిన్. 26

క. ఆమానినికిం బుట్టితి, మే మిరువుర మగ్రజాతుఁ డీశ్వరసేవా
కాముఁడు తిప్పన పోతన, నామవ్యక్తుండ సాధునయయుక్తుండన్. 27

వ. అయిన నేను నాచిత్తంబున శ్రీరామచంద్రుని సన్నిధానంబు గల్పించుకొని. 28

**—షష్ఠ్యంతములు.—**

ఉ. హారికి నందగోకులవిహారికిఁ జక్రసమీరదైత్యసం
హారికి భక్తదుఃఖపరిహారికి గోపనితంబినీమనో
హారికి దుష్టసంపదపహారికి ఘోషకుటీపయోఘృతా
హారికి బాలకగ్రహమహాసురదుర్వనితాప్రహారికిన్. 29

ఉ. శీలికి నీతిశాలికి వశీకృతశూలికి బాణహస్తని
ర్మూలికి ఘోరనీరదవిముక్తశిలాహతగోపగోపికా
పాలికి వర్ణధర్మపరిపాలికి నర్జునభూజయుగ్మసం
చాలికి మాలికిన్ విపులచక్రనిరుద్ధమరీచిమాలికిన్. 30

ఉ. క్షుంతకుఁ గాలియోరగవిశాలఫణావళినర్తనక్రియా
రంతకు నుల్లసన్మగధరాజచతుర్విధఘోరవాహినీ
హంతకు నింద్రనందననియంతకు సర్వచరాచరావళీ
మంతకు నిర్జితేంద్రియసమంచితభక్తజనానుగంతకున్. 31

ఉ. న్యాయికి భూసురేంద్రమృతనందనదాయికి రుక్మిణీమన
స్స్థాయికి భూతసన్నుతవిధాయికి సాధుజనానురాగసం
ధాయికిఁ బీతవస్త్రపరిధాయికిఁ బద్మభవాండభాండని
ర్మాయికి గోపికానివహమందిరయాయికి శేషశాయికిన్. 32

వ. సమర్పితంబుగా నే నాంధ్రంబున రచియింపం బూనిన శ్రీమహాభాగవతపురాణం
బునకుం గథాప్రారంభం బెట్టి దనిన. 33

**—శ్రీమహాభాగవతకథాప్రారంభము.—**

సీ. విశ్వజన్మస్థితివిలయంబు లెవ్వని, వలన నేర్పడు ననువర్తనమున
వ్యావర్తనమునఁ గార్యములం దభిజ్ఞుఁ డై, తాన రాజగుచుఁ జిత్తమునఁ జేసి
వేదంబు లజునకు విదితముల్ గావించె, నెవ్వఁడు బుధులు మోహింతు రెవ్వ
నికి నెండమావుల నీళ్లఁ గాచాదుల, నన్యోన్యబుద్ధి దా నడరునట్లు

ఆ. త్రిగుణసృష్టి యెందు దీపించి సత్యము, భంగిఁ దోఁచు స్వప్రభానిరస్త
కుహకుఁ డెవ్వఁ డతనిఁ గోరి చింతించెద, [2]ననఘు సత్యుఁ బరుని ననుదినంబు.

---

1 ముద్దసానికి. 2 వాద్యుఁ బరుని సత్యు.

వ. ఇట్లు పీతాంబరధారియుఁ జతుర్భుజుండు నాదిపూరుషుండుఁ బరమేశ్వరుండు నగు హరియందు నిష్కాముం డై విశుద్ధం బగుధ్యానవిశేషంబుచే నిరస్తదోషుం డగుచు ధారణావతియైనబుద్ధిని సమర్పించి పరమానందంబుననొంది ప్రకృతివలన నైనసృష్టిపరంపరలఁ బరిహరించుతలంపున మందాకినీనందనుం డిట్లనియె. 217

భీష్ముఁడు శ్రీకృష్ణుని స్తుతించుట.

మ. త్రిజగన్మోహననీలకాంతితను వుద్దీపింపఁ బ్రాభాతనీ
రజబంధుప్రభ మైనచేలము పయిన్ రంజిల్ల నీలాలక
వ్రజసంయుక్తముఖారవింద మతిసేవ్యం బై విజృంభింప మా
విజయుం జేరెడువన్నెలాఁడు మది నావేశించు నెల్లప్పుడున్. 218

మ. హయరింఖాముఖధూళిధూసరపరిన్యస్తాలకోపేత మై
రయజాతశ్రమతోయబిందుయుత మై రాజిల్లునెమ్మోముతో
జయముం బార్థున కిచ్చువేడ్క నని నాశస్త్రాహతిం జాల నొ
చ్చియుఁ బోరించుమహానుభావు మదిలోఁ జింతింతు నశ్రాంతమున్. 219

మ. నరుమాటల్ విని నవ్వుతో నుభయసేనామధ్యమక్షోణిలోఁ
బరు లీక్షింప రథంబు నిల్పి పరభూపాలావళిం జూపుచుం
బరభూపాయువు లెల్లఁ జూపులన శుంభద్భక్తి వంచించునీ
పరమేశుండు వెలుంగుచుండెడును హృత్పద్మాసనాసీనుఁ డై. 220

క. తనవారిఁ జంప జాలక, వెనుకకుఁ బో నిచ్చగించువిజయునిశంకన్
ఘనయోగవిద్యఁ బాపిన, మునివంద్యునిపాదభక్తి మొనయున్ నాకున్. 221

సీ. కుప్పించి యెగసినఁ గుండలంబులకాంతి, గగనభాగం బెల్లఁ గప్పికొనఁగ
నుఱికిన నోర్వక యుదరంబులో నున్న, జగములవ్రేఁగున జగతి గదలఁ
జక్రంబుఁ జేపట్టి చనుదెంచురయమునఁ, బైనున్నపచ్చనిపటము జాఱ
నమ్మితి నాలావు నగుఁబాటు సేయకు, మన్నింపు మని క్రీడి మరలఁ దిగువఁ
తే. గరికి లంఘించుసింహంబుకరణి మెఱసి, నేఁడు భీష్మునిఁ జంపుదు నిన్నుఁ గాతు
విడువు మర్జున యనుచు మద్విశిఖవృష్టిఁ, దెరలి చనుదెంచుదేవుండు దిక్కు నాకు.

మ. తనకున్ భృత్యుఁడు వీనిఁ గాచుట మహాధర్మంబు వో మ్మంచు న
ర్జునసారథ్యము పూని పగ్గములు చేఁ జోద్యంబుగాఁ బట్టుచున్
మునికోలన్ వడిఁ బూన్చి ఘోటకములన్ మోదించి తాడించుచున్
జనులన్ మోహము నొందఁ జేయుపరమోత్సాహుం బ్రశంసించెదన్. 223

క. పలుకుల నగవుల నడపుల, నలుకల నవలోకనముల నాభీరవధూ
కులములమనములతాలిమి, కొలుకులు వదలించుఘనునిఁ గొలిచెద మదిలోన్.

ఆ. మునులునృపులుఁజూడ మునుధర్మజునిసభా, మందిరమునయాగమండపమునఁ
జిత్రమహిమతోడఁ జెలు వొందుజగదాది, దేవుఁ డమరు నాదుదృష్టియందు.

మ. ఒకసూర్యుండు సమస్తజీవులకుఁ దా | నొక్కొక్కఁడై తోఁచుపో
లిక నేదేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్నజ
న్యకదంబంబులహృత్సరోరుహములన్ | నానావిధానూనరూ
పకుఁడై యొప్పుచు నుండు నట్టిహరి నేఁ | బ్రార్థింతు శుద్ధుండనై. 226

వ. అని యిట్లు మనోవాగ్దర్శనంబులం బరమాత్ముం డగుకృష్ణుని హృదయంబున నిలిపికొని నిశ్వాసంబు మాని నిరుపాధికం బయినవాసుదేవబ్రహ్మంబునందుఁ గలిసినభీష్ముం జూచి సర్వజనులు దివసావసానంబున విహంగంబు లూరక యుండుతెఱంగున నుండిరి దేవమానవవాదితంబు లై దుందుభినినదంబులు మొరసె సాధుజనకీర్తనంబులు మెఱసెఁ గుసుమవర్షంబులు గురిసె మృతుం డయినభీష్మునికి ధర్మజుండు పరలోకక్రియలు సేయించి [1](ముహూర్తమాత్రంబు దుఃఖితుం డయ్యె నంత నచ్చటిమునులు గృష్ణునిఁ దమహృదయంబుల నిలిపి కొని సంతుష్టాంతరంగు లగుచుం దదీయదివ్యావతారనామంబులచే స్తుతియించి స్వాశ్రమంబులకుం జనిరి పిదప నయ్యుధిష్ఠిరుండు) గృష్ణసహితుం డై గజపురంబునకుం జని గాంధారీసమేతుం డయినధృతరాష్ట్రునొడంబఱిచి వారిసమ్మతంబున వాసుదేవానుమోదితుం డై పితృపైతామహం బైనరాజ్యంబు గైకొని ధర్మమార్గంబునం జేయు చుండె నని చెప్పిన విని సూతునకు శౌనకుం డి ట్లనియె.

ఆ. ధనము లపహరించి | తనతోడఁ [2]జెనకెడు, నాతతాయిజనుల | నని వధించి
బంధుమరణదుఃఖ | భరమున ధర్మజుం, డెట్లు రాజ్యలక్ష్మి | నిచ్చగించె. 228

వ. అనిన సూతుం డి ట్లనియె. 229

క. కురుసంతతికిఁ బరీక్షి, న్నరవరు నంకురముఁ జేసి | నారాయణుఁ డీ
ధరణీరాజ్యమునకు నీ, శ్వరుఁగా ధర్మజుని నిలిపి | సంతోషించెన్. 230

వ. ఇట్లు ధర్మనందనుండు భీష్మునివచనంబులం గృష్ణునిసంభాషణంబులం బ్రవర్ధమానవిజ్ఞానుండును నివర్తితశంకాకలంకుండును నై నారాయణాశ్రయుం డైన యింద్రుండునుంబోలెఁ జతుస్సాగరవేలాలంకృతం బగువసుంధరామండలంబు సహోదరసహాయుం డై యేలుచుండె. 231

సీ. సంపూర్ణవృష్టిఁ బర్జన్యుండు గురియించు, నిల యెల్లకోర్కుల | నీను చుండు
గోవులు వర్షించు | ఘోషభూములఁ బాలు, ఫలవంతములు లతా | పాదపములు
పండు సస్యములు దప్పక ఋతువుల నెల్ల, ధర్మ మెల్లెడలను | దనరి యుండు
దైవభూతాత్మతంత్రము లగురోగాది, భయములు సెందవు | ప్రజల కెందుఁ

ఆ. గురుకులోత్తముండు | గుంతీతనూజుండు, దానమానఘనుఁడు | ధర్మజుండు

1. ( ) ఈకుండలీకరణములోనిపాదము వ్రాఁతప్రతులందు లేదు. మూలమునుబట్టి యిందుఁ జేర్పఁబడిన దని తోఁచెడిని. 2. బెనఁగెడు.

సత్యవాక్య[1]ధనుఁడు - సకలమహీరాజ్య, [2]విభవభాజి యయిన - వేళయందు.

### శ్రీకృష్ణుండు ద్వారకానగరంబున కరుగుట.

వ. అంతఁ గృష్ణుండు చుట్టాలకు శోకంబు లేకుండం జేయుకొఱకు సుభద్రకుఁ బ్రియంబు సేయుకొఱకును గజపురంబునం గొన్నినెల లుండి ద్వారకానగరంబునకుం బ్రయాణంబు సేయం దలంచి కొందఱికి నమస్కరించి కొందఱిం గౌఁగిలించికొని [3]కొందఱు దనకు నమస్కరించినం గౌఁగిలించుకొని రథారోహణంబు సేయునవసరంబున సుభద్రయు ద్రౌపదియుఁ గుంతియు నుత్తరయు గాంధారియు ధృతరాష్ట్రుండును విదురుండును యుయుత్సుండును గృపాచార్యుండును ధౌమ్యుండును [4](సత్సంగంబువలన ముక్తదుస్సంగుం డగుబుధుండు సకృత్కాలసంకీర్త్యమానం బై రుచికరం బగునెవ్వనియశంబు నాకర్ణించి విడువ నోపం డట్టి) హరితోడివియోగంబు సహింపక దర్శనస్పర్శనాలాపశయనాసనభోజనంబులవలన నిమిషమాత్రంబును హరికి నెడ లేనివార లయినపాండవులం గూడికొని హరి మరలవలయు నని కోరుచు హరి చనినమార్గంబు సూచుచు హరివిన్యస్తచిత్తు లయి లోచనంబుల బాష్పంబు లొలుక నంత నంత నిలువంబడి రయ్యవసరంబున. 233

సీ. కనకసౌధములపైఁ - గౌరవకాంతలు, గుసుమవర్షంబులు - గోరి కురియ
మౌక్తికదామస - మంచితధవళాత, పత్రంబు విజయుండు - వట్టుచుండ
నుద్ధవసాత్యకు - లుత్సాహవంతు లై, రత్నభూషితచామ - రములు వీవ
గగనాంతరాళంబుఁ - గప్పి కాహళభేరి, పటహశంఖాదిశ - బ్దములు మొరయ
ఆ. సకలవిప్రజనులు - సగుణనిర్గుణరూప, భద్రభాషణములు - వలుకుచుండ
భువనమోహనుండు - పుండరీకాక్షుండు, పుణ్యరాశి హస్తి - పురము వెడలె. 234

వ. తత్సమయంబునం బౌరసుందరులు ప్రాసాదశిఖరభాగంబుల నిలిచి గోపాలసుందరుని సందర్శించి వర్గంబు లై మార్గంబు రెండుదెసలఁ గరారవిందంబులు సాఁచి యొండొరులకుం జూపుచుం దమలోనం దొల్లి గుణంబులం గూడక జీవులు లీనరూపంబు లై యుండం బ్రపంచంబు ప్రవర్తింపనిసమయంబున నొంటి దీపించుపురాణపురుషుం డితం డనువారును జీవులకు బ్రహ్మత్వంబు గలుగ లయంబు సిద్ధించుట యెట్లనువారును జీవోపాధిభూతంబు లయిన సత్త్వాదులశక్తిలయంబు జీవలయం బనువారును గ్రమ్మఱ నప్పరమేశ్వరుండు నిజవీర్యప్రేరిత యై నిజాంశభూతంబు లైనజీవులకు మోహిని యైనసృష్టి సేయ

---

1. రతుఁడు. 2. విభవరాజి. 3. 'ధర్మనందనునకుఁ గృతాభినందనుం డగుచు నతనిచే నాలింగితుఁ డై యామంత్రణంబు వడసి...రథా' అని యిట అచ్చుప్రతులపాఠము. ఇది వ్రాఁతప్రతులందు లేదు; ఇది మూలానుసారముగా నిట మార్పఁబడియె. 4. ఈపాఠము మూలానుసారముగాఁ జేర్పఁబడినది.

నిచ్ఛించుమాయ ననుసరణంబు సేయు ననువారును నామరూపంబులు లేని జీవులందు నామరూపంబులు గల్పించుకొఱకు నీశ్వరుండు వేదంబుల నిర్మించి మాయ ననుసరణంబు సేయుననువారును నిర్మలభక్తిసముత్కంఠావిశేషంబుల నకుంఠితులై జితేంద్రియు లగువిద్వాంసు లిమ్మహానుభావునిజరూపంబు దర్శింతు రనువారును యోగమార్గంబునం గాని దర్శింపరా దనువారును నై మఱియును. 235

మ. రమణీ దూరము వోయెఁ గృష్ణురథముం గ్రా దింక వీక్షింప నీ
కమలాక్షుం బొడగాన లేనిదినముల్ కల్పంబులై తోఁచు గే
హములం దుండఁగ నేల పోయి పరిచర్యల్ సేయుచుం నెమ్మి నుం
డము రమ్మా యనె నొక్కచంద్రముఖి కందర్పాశుగభ్రాంతయై. 236

మ. తరుణీ యాదవరాజు గాఁ డితఁడు వేదవ్యక్తుఁడై యొక్కఁడై
వరుసం లోకభవస్థితిప్రళయముల్ వర్తిల్లఁగాఁ జేయుదు
స్తరలీలారతుఁడై నయీశుఁ డితనిం దర్శించితిం బుణ్యభా
సుర నే నంచు నటించె నొక్కత మహాశుద్ధాంతరంగంబునన్. 237

క. తామసగుణు లగురాజులు, భూమిం బ్రభవించి ప్రజలఁ బొలియింపఁగ స
త్త్వామలతనుఁడై యీతఁడు, భామిని వారల వధించుఁ [1]బ్రతికల్పమునన్.

వ. ఇదియునుం గాక. 239

సీ. ఈయుత్తమశ్లోకుఁ డెలమి జన్మింపంగ, యాదవకుల మెల్ల నసఘ మయ్యె
నీపుణ్యవర్తనుఁ డేప్రొద్దు నుండంగ, మథురాపురము దొడ్డమహిమఁ గనియె
నీపూరుషశ్రేష్ఠు నీక్షించి భక్తితో, ద్వారకావాసులు ధన్యులైరి
యీమహాబలశాలి యెఱిఁగి [2]శిక్షింపంగ, నిష్కంటకం బయ్యె నిఖిలభువన

తే. మీజగన్మోహనాకృతి [3]నిచ్ఛగించి, పంచశరభల్లజాలవిభజ్యమాన
[4]వివశమానసమై వల్లవీసమూహ, మితనియధరామృతముఁ గ్రోలు నెల్లప్రొద్దు.

ఉ. ఈకమలాక్షు నీసుభగు నీకరుణాంబుధిఁ బ్రాణనాథుఁ గాఁ
జేకొని వేడ్కఁ గాఁపురము సేయుచు నుండెడిరుక్మిణీముఖా
నేకపతివ్రతల్ నియతి నిర్మలమానసలై జగన్నుతా
స్తోకవిశేషతీర్థములఁ గ్రోల్లిటిబాముల నేమి నోఁచిరో. 241

వ. అని యిట్లు నానావిధంబు లగుపురసుందరీవచనంబు లాకర్ణించి కటాక్షించి నగుచు నగరంబు వెడలె ధర్మజుండును హరికి రక్షణంబులై కొలిచి నడవం జతురంగబలంబులం బంచినం దత్సేనాసమేతులై తనతోడివియోగంబునకోర్వక దూరంబు వెనుఁదగిలినకౌరవుల మరలించికురుజాంగలపాంచాలదేశంబులు దాఁటి శూరసేనయామునభూములం గడచి బ్రహ్మావర్తకురుక్షేత్రమత్స్యసారస్వతమ

1. బ్రతికల్పంబులం. 2. శాసింపంగ. 3. 'నిచ్ఛయించి' అనియే ప్రతులు. 4. విమలమానస.

రుధన్వసౌవీరాభీరసైంధవవిషయంబు లతిక్రమించి తత్తద్దేశవాసు లిచ్చినకానుకలు గైకొనుచు నానర్తమండలంబు సొచ్చి పద్మబంధుండు పశ్చిమసింధునిమగ్నుం డయినసమయంబునఁ బరిశ్రాంతవాహుం డై చని చని. 242

శ్రీకృష్ణుండు ద్వారకానగరంబు ప్రవేశించుట.

మ. జలజాతాక్షుఁడు శౌరి డగ్గఱె మహాసౌధాగ్ర[1]భృంగారకం
గలహంసావృతహేమపద్మపరిఖాకాసారకం దోరణా
వళిసంఛాదితతారకం దరులతావర్గానువేలోదయ
త్ఫలపుష్పాంకురకోరకన్ మణిమయప్రాకారకన్ ద్వారకన్. 243

వ. ఇట్లు దనప్రియపురంబు డగ్గఱి. 244

మత్తకోకిలము. అన్యసన్నుతసాహసుండు మురారి యొత్తె యదూత్తముల్
[2]ధన్యు లై వినఁ బాంచజన్యము దారితాఖిలజంతుచై
తన్యమున్ భువనైకమాన్యము దారుణధ్వని[3]భీతరా
జన్యముం బరిమూర్ఛితాఖిలశత్రుదానవసైన్యమున్. 245

శా. శంఖారావము వీనులన్ విని జనుల్ స్వర్ణాంబరద్రవ్యముల్
[4]శంఖాద్యంబులుఁ గొంచు వచ్చిరి దిదృక్షాదర్పితోత్కంఠన
ప్రేంఖద్భక్తులు వంశకాహళమహాభేరీగజాశ్వావళీ
రింఖారావము లుల్లసిల్ల దనుజారిం జూడ నాసక్తు లై. 246

క. బంధులుఁ బౌరులుఁ దెచ్చిన, గంధేభహయాదు లైనకానుకలు దయా
సింధుఁడు గైకొనె నంబుజ, బంధుఁడు గొనుదత్తదీపపంక్తులభంగిన్. 247

వ. ఇట్లాత్మారాముండును బూర్ణకాముండును నైనయప్పరమేశ్వరునికి నుపాయనంబు లిచ్చి నాగరులు వికసితముఖు లయి గద్గదభాషణంబులతోడ డయ్యకుండ నడపుసయ్యకు నెయ్యంబు సూప నడ్డంబు లేనిబిడ్డలచందంబున మ్రొక్కి యి ట్లనిరి. 248

శా. నీపాదాబ్జము బ్రహ్మపూజ్యము గదా నీసేవ సంసారసం
తాపధ్వంసిని యౌఁ గదా సకలభద్రశ్రేణులం బ్రీతితో
నాపాదింతు గదా ప్రపన్నులకుఁ గాలాధీశ కాలంబు ని
ర్వ్యాపారంబు గదయ్య చాలరు నినున్ వర్ణింప బ్రహ్మాదులున్. 249

క. ఉన్నారము సౌఖ్యంబున, విన్నారము నీప్రతాపవిక్రమకథలన్
మన్నారము ధనికుల మై, కన్నారము తావకాంఘ్రికమలములు హరీ. 250

క. ఆరాటము మది నెఱుఁగము, పోరాటము లిండ్లకడలఁ బుట్టవు పురిలోఁ
[5]జోరాటన మెనయదు నీ, దూరాటన మోర్వలేము తోయజనేత్రా. 251

1. బృందారకం; శృంగారకం. 2 ధన్యమున్ వినఁ. 3. భీకరో, దన్యమున్ బరిమూర్ఛితాఖిలదైత్యదానవ. 4 శంఖాలితముఁ. 5 మాటాట మెఱుఁగ మెద నీ.

ఉ. తండ్రుల కెల్లఁ దండ్రి యగు ధాతకుఁ దండ్రివి దేవ నీవు మా
తండ్రివిఁ దల్లివిం బతివి దైవమవుఁ సఖివిఁ గురుండవుం
దండ్రులు నీక్రియం బ్రజల ధన్యులఁ జేసిరె వేల్పు లైన నో
తండ్రి భవన్ముఖాంబుజము ధన్యతఁ గానరు మావిధంబునన్. 252

క. చెచ్చెరఁ గరినగరికి నీ, విచ్చేసిననిమిష మైన వేయేం డ్లగు మా
కెచ్చోటికి విచ్చేయక, మచ్చికతో నుండ వయ్య మానగరమునన్. 253

ఆ. అంధకారవైరి యపరాద్రియవ్వలఁ, జనిన నంధ మయినజగముభంగి
నిన్నుఁ గానకున్న నీరజలోచన, యంధతమసయుతుల మగుదు మయ్య. 254

వ. అని యిట్లు ప్రజ లాడెడిభక్తియుక్తమధురమంజులాలాపంబులు గర్ణకలాపంబులుగా నవధరించి కరుణావలోకనంబులు వర్షించుచు హర్షించుచుఁ దనరాక విని మహానురాగంబున సంరంభవేగంబుల మజ్జనభోజనశయనాదికృత్యంబులొల్లక యుగ్రసేనాక్రూరవసుదేవబలభద్రప్రద్యుమ్నసాంబచారుదేష్ణగదప్రముఖ యదుకుంజరులు కుంజరతురగరథారూఢు లై దిక్కుంజరసన్నిభం బయిన యొక్కకుంజరంబు ముందట నిడుకొని సూతమాగధనటనర్తకవందిసందోహంబులమంగళభాషణంబులును భూసురాశీర్వాదవేదఘోషణంబులును వీణావేణుభేరీపటహశంఖకాహళధ్వానంబులును రథారూఢవిభూషణభూషితవారయువతీగానంబులును నసమానంబు లై చెలంగ నెదురుకొని యథోచితప్రణామనమస్కారపరిరంభబాహుస్పర్శసంభాషణమందహాససందర్శనాదివిధానంబుల బహుమానంబులు సేసి వారలుం దానును భుజగేంద్రపాలితం బయినభోగవతీనగరంబు చందంబున స్వసమానబలయదుభోజదశార్హకుకురాంధకవృష్ణివీరపాలితంబును సకలకాలసంపద్యమానాంకురపల్లవకోరకకుట్మల కుసుమఫల మంజరీపుంజభారవినమితలతాపాదపరాజీవిరాజితోద్యానమహావనోపవనారామలాలితంబును వనాంతరాళరసాలసాలశాఖాంకురఖాదనక్షుణ్ణకషాయకంఠకలకంఠమిథునకోలాహలఫలరసాస్వాదపరిపూర్ణశారికాకీరకులకలకలకల్హారపుష్పమకరందపానపరవశభృంగభృంగీకదంబఝంకారసరోవరకనకకమలమృదులకాండఖండస్వీకారమత్తవరటాయత్తకలహంసనివహక్రేంకారసహితంబును మహోన్నతసౌధజాలరంధ్రనిర్గత కర్పూరధూపధూమపటల సందర్శనసంజాత జలధరభ్రాంతివిభ్రాంతసముద్ధత పింఛనర్తన ప్రవర్తమాన మత్తమయూర కేకారవమహితంబును నానారూపతోరణధ్వజవైజయంతికానికాయనిరుద్ధతారకాగ్రహప్రకాశంబును ముక్తాఫలవిరచితరంగవల్లి కాలంకృతమందిరద్వారదేహళీవేదికాప్రదేశంబును ఘనసారగంధసారకస్తూరికాసంవాసితవణిగ్గృహగేహళీనికరకనకగళంతికావికీర్యమాణసలిలధారాసంసిక్త విపణిమార్గంబును బ్రతినివాసబహిరంగణసమర్పితరసాలదండఫలకుసుమగంధాక్షతధూపదీపరత్నాంబరాదివివిధోపహారవర్గంబును బ్రవాళనీలమర

కతవజ్రవైడూర్యనిర్మిత గోపురాట్టాలకంబును విభవనిర్జితమహేంద్రనగరకుబే
రాలకంబును నైనపురవరంబుఁ బ్రవేశించి రాజమార్గంబున వచ్చుసమయంబున.

మత్తకోకిలము. కన్ను లారఁగ నిత్యముం హరిఁ గాంచుచుం మనువార ల
య్యు న్నవీనకుతూహలోత్సవయుక్తి నాగరకాంత ల
త్యున్నతోన్నతహర్మ్య[1]రేఖల నుండి చూచిరి నిక్కి చే
సన్నలం దమలోనఁ దద్విభుసౌకుమార్యము సూపుచున్. 256

సీ. కలుముల నీనెడుకలకంఠి యెలనాఁగ, వర్తించు నెవ్వానివక్షమందు
జనదృక్చకోరకసంఘంబునకు సుధా, పానీయపాత్ర మేభవ్యుముఖము
సకలదిక్పాలకసంహతి కెవ్వాని, బాహుదండంబులు పట్టుఁగొమ్మ
లాశ్రితశ్రేణి కేయధిపునిపాదరా, జీవయుగ్మంబులు చేరుగడలు

ఆ. భువనమోహనుండు పురుషభూషణుఁ డెవ్వఁ, డట్టికృష్ణుఁ డరిగె హర్మ్యశిఖర
రాజమాన లగుచు రాజమార్గంబున, రాజముఖులు గుసుమరాజిఁ గురియ.

మ. జలజాతాక్షుఁడు సూడ నొప్పె ధవళచ్ఛత్త్రంబుతోఁ జామరం
బులతోఁ బుష్పపిశంగచేలములతో భూషామణిస్ఫీతుఁడై
నళినీబాంధవుతో శశిధ్వజముతో నక్షత్రసంఘంబుతో
బలభిచ్చాపముతోఁ దటిల్లతికతో భాసిల్లుమేఘాకృతిన్. 258

వ. ఇట్లరిగి తల్లిదండ్రులనివాసంబు సొచ్చి దేవకీప్రముఖు లయినతల్లుల కేడ్వురకు
మ్రొక్కిన. 259

క. బిడ్డఁడు మ్రొక్కినఁ దల్లులు, జడ్డన నంకముల నునిచి చన్నులతుదిఁ బా
లొడ్డగిలఁ బ్రేమభరమున, జడ్డువడం దడిపి రక్షిజలముల ననఘా. 260

### శ్రీకృష్ణుం డంతఃపురకాంతలం జూడఁ బోవుట.

వ. తదనంతరంబ యష్టోత్తరశతషోడశసహస్రసౌవర్ణసౌధకాంతం బయినశుద్ధాంత
భవనంబు సొచ్చి హరి తనమనంబున. 261

మ. ఒకదేవీభవనంబు మున్న సొర వేఱొక్కర్తు లోఁ గుందునో
సుకరాలాపము లాడదో సొలయునో సుప్రీతి నీక్షింపనో
వికలత్వంబున నుండునో యనుచు నవ్వేళన్ వధూగేహముల్
ప్రకటాశ్చర్యవిభూతిఁ జొచ్చె బహురూపవ్యక్తుఁడై భార్గవా. 262

వ. ఆసమయంబున. 263

క. శిశువులఁ జంకల నిడి తను, కృశతలు విరహాగ్నిఁ దెలుప గృహగేహళులన్
రశనలు జాఱఁగ సిగ్గున, శశిముఖు లెదురేఁగి రపుడు జలజాక్షునకున్. 264

మ. పతి నాయింటికి మున్న వచ్చె నిదె నాప్రాణేశుఁ డస్మద్గృహా
గతుఁ డయ్యెన్ మును సేరెఁ బో తొలుత మత్కాంతుండు నాశాలకే

1. సీమల నుండి. 2. నా పాలికే.

నితరాలభ్యసుఖంబు గంటి నని తా ǂ రింటింట నర్చించి ర
య్యతివల్ నూఱుఁ బదాఱువేలు నెనమం ǂ డ్రవ్వేళ [1]నాత్మేశ్వరున్. 265

వ. వారలం జూచి హరి యి ట్లనియె. 266

మ. కొడుకుల్ భక్తివిధేయు లాదురు గదా ǂ కోడండ్రు మీవాక్యముల్
గడవం జాలక యుందురా విబుధసత్కారంబు గావింతురా
తొడవుల్ వస్త్రములుం బదార్థరససందోహంబులుం జాలునా
కడమల్ గావు గదా భవన్నిలయముల్ ǂ కల్యాణయుక్తంబులే. 267

సీ. తిలక మేటికి లేదు ǂ తిలకినీతిలకమ, పువ్వులు దుఱుమవా ǂ పువ్వుఁబోఁడి
కస్తూరి యలఁదవా ǂ కస్తూరికాగంధి, తొడవులు దొడువవా ǂ తొడవుతొడవ
కలహంసఁ బెంపుదే ǂ కలహంసగామిని, కీరముఁ జదివింతె ǂ కీరవాణి
లతలఁ బోషింతువా ǂ లతికాలలితదేహ, సరసి నోలాడుదే ǂ సరసిజాక్షి

ఆ. మృగికి మేఁత లిడుదె ǂ మృగశాబలోచన, గురుల నాదరింతె ǂ గురువివేక
బంధుజనులఁ బ్రోతె ǂ బంధుచింతామణి, యనుచు సతుల నడిగె ǂ నచ్యుతుండు.

వ. అని యడిగిన వారలు హరిం బాసిన దినంబులందు శరీరసంస్కారకేళీవిహారహాస
వనమందిరగమనమహోత్సవదర్శనంబు లొల్లనియిల్లాండ్రు గావున. 269

మ. సిరి చాంచల్యముతోడి దయ్యెఁ దనకున్ ǂ జీవేశ్వరుం డంచు నే
పురుషశ్రేష్ఠు వరించు నట్టివరమున్ ǂ బుద్ధిన్ విలోకంబులం
గరయుగ్మంబులఁ గౌఁగిలించిరి సతుల్ ǂ కల్యాణబాష్పంబు లా
భరణశ్రేణులుగాఁ బ్రతిక్షణనవప్రాప్తానురాగంబులన్. 270

మత్తకోకిలము. పంచబాణుని నీఱు సేసినభర్గునిం దనవిల్లు వ
ర్జించి మూర్ఛలఁ జేయఁ జాలువిశేషహాసవిలోకనో
దంచితాకృతు లయ్యుఁ గాంతలు ǂ దంభచేష్టల మాధవుం
జంచలింపఁగఁ జేయ నేమియుఁ ǂ జాల రైరి బుధోత్తమా. 271

వ. ఇవ్విధంబున సంగవిరహితుం డై నకంసారి సంసారికైవడి విహరింప నజ్ఞాన
విలోకు లయినలోకులు లోకసామాన్యమనుష్యుం డని తలంతు రాత్మాశ్రయ
యైనబుద్ధి యాత్మయం దున్నయానందాదులతోడం గూడనితెఱంగున నీశ్వ
రుండు ప్రకృతితోడం గూడియు నాప్రకృతిగుణంబు లైనసుఖదుఃఖంబులఁ
జెందక యుండుఁ బరస్పరసంఘర్షణంబులచే వేణువులవలన వహ్నిఁ బుట్టించి
వనంబుల దహించుమహావాయువుచందంబున భూమికి భారహేతువు లై యనే
కాక్షౌహిణులతోడం బ్రవృద్ధతేజు లగురాజుల కన్యోన్యవైరంబులు గల్పించి
నిరాయుధుం డై సంహారంబు సేసి శాంతుఁ డై పిదపం గాంతామధ్యంబునఁ
బ్రాకృతమనుష్యుండునుంబోలె సంచరించు చుండె నాసమయంబున. 272

1. చిత్తేశ్వరుం.

క. యతులీశ్వరునిమహత్త్వము, మిత మెఱుఁగనిభంగి నప్రమేయుఁ డగుహరి
స్థితి నెఱుఁగక కాముకుఁ డని, రతములు సలుపుదురు తిగిచి రమణులు సుమతీ.
క. ఎల్లప్పుడు మాయిండ్లను, వల్లభుఁడు వసించు నేమ వల్లభలము శ్రీ
వల్లభున కనుచు గోపీ, వల్లభుచే సతులు మమతవలఁ బడి రనఘా. 274
వ. అని చెప్పిన విని శౌనకుండు సూతున కి ట్లనియె. 275

### ఉత్తరకుఁ బరీక్షిత్తు జనించుట.

సీ. గురునందనుండు సక్రోధుఁడై యేసిన, బ్రహ్మశిరోనామబాణవహ్నిఁ
గంపించు నుత్తరగర్భంబు గ్రమ్మఱఁ, బద్మలోచనుచేత బ్రదికె నండ్రు
గర్భస్థుఁ డగుబాలుఁ గంసారి యేరీతి, బ్రదికించె మృత్యువుభయము వాపి
జనియించి యతఁ డెన్నిసంవత్సరము లుండె, నెబ్భంగి వర్తించె నేమి సేసె
ఆ. వినుము శుకుఁడు వచ్చి విజ్ఞానపద్ధతి, నతని కెట్లు సూపె నతఁడు పిదపఁ
దనశరీర మేవిధంబున వర్జించె, విప్రముఖ్య నాకు విస్తరింపు. 276
వ. అనిన సూతుం డి ట్లనియె ధర్మనందనుండు చతుస్సముద్రముద్రితాఖిలజంబూద్వీపరాజ్యంబు నార్జించియు మిన్నుముట్టినకీర్తి నుపార్జించియు నంగనాతురంగమాతంగసుభటకాంచనాదిదివ్యసంపదలు సంపాదించియు వీరసోదరవిప్రవిద్వజ్జనవినోదంబులఁ బ్రమోదించియు వైభవంబు లలవరించియుఁ గ్రతువు లాచరించియు దుష్టశిక్షణశిష్టరక్షణంబు లొనరించియు ముకుందచరణారవిందసేవారతుండై సమస్తసంగంబులందు నభిలాషంబు వర్జించి యరిషడ్వర్గంబు జయించి రాజ్యంబు సేయుచు. 277
తే. చందనాదుల నాఁకట స్రగ్గువాఁడు, దనివి నొందని కైవడి ధర్మసుతుఁడు
సంపదలు పెక్కు గలిగియుఁ జక్రిపాద, సేవనంబులఁ బరిపూర్తి సెందకుండె.
వ. అంతం గొన్నిదినంబులకు నభిమన్యుకాంతాగర్భంబునం దున్నడింభకుండు [1]దశమమాసపరిచ్ఛేద్యుండై గర్భాంతరాళంబున మరంతం బైనయశ్వత్థామబాణానలంబున దందహ్యమానుండై తల్లడిల్లుచు. 279
ఉ. కుయ్యిడ శక్తి లే దుదరగోళములోపల నున్నవాఁడ ది
క్కెయ్యది దా ననాథ నని యెప్పుడుఁ దల్లి గణింప వింద నేఁ
డియ్యిషువహ్ని వాయుటకు నెయ్యది మార్గము నన్నుఁ గావ నే
యయ్య గలండు గర్భజనితాపద నెవ్వఁ డెఱుంగు దైవమా. 280
క. చిచ్చఱకోలవశంబునఁ, జచ్చి బహిర్గతుఁడఁ గానిసమయమునను దా
నుచ్చలితగర్భవేదనఁ, జచ్చును మాతల్లి గర్భసంతాపమునన్. 281
క. చెచ్చెర బాణజ్వాలలు, వచ్చిన విష్ణుండు గావ వచ్చు ననుచుఁ దా
ముచ్చటలు సెప్పు సతులకు, నిచ్చలు మాయవ్వ నేఁడు నిజ మయ్యెడినో.

1. 'పది యగునెల గర్భాంత' అనియే వ్రాఁతప్రతులు.

శా. రాఁడా చూడ సమస్తభూతములలో రాజిల్లువాఁ డిచ్చటన్
లేఁడా పాలునిచ్చు నమ్మునుఁ దొలఁగన్ లీలాగతిం ద్రోచి నా
కీఁడా నేఁ డభయప్రదాన మతిఁ దూరింపన్ నతత్రాత ముక్
తాఁడా యెందుఁ గావఁ డీయెడల మత్కార్యంబు దా నెట్టిదో. 283

వ. అని గతాగతప్రాణుండై భూగర్భగతుండైన శిశువు చింతించుసమయంబున. 284

సీ. మేఘంబుమీఁదిక్రొమ్మెఱుఁగుకైవడి మేని, పై నున్నపచ్చనిపటమువాఁడు
గండభాగంబులఁ గాంచనమణిమయ, మకరకుండలకాంతి మలయువాఁడు
శరవహ్ని నడఁగించుసంరంభమునఁ జేసి, కన్నుల నునుఁగెంపు గలుగువాఁడు
బాలార్కమండలప్రతిమానరత్నహా, టకవిరాజితకిరీటంబువాఁడు
తే. కంకణాంగదవనమాలికావిరాజ, మానుఁ డసమానుఁ డంగుష్ఠమాత్రదేహుఁ
డొక్కగదఁ జేతఁ దాల్చి నేత్రోత్సవముగ, విష్ణుఁ డావిర్భవించె నవ్వేళయందు.

వ. ఇట్లు భక్తపరాధీనుం డయినపరమేశ్వరుం డావిర్భవించి మంచు విరియించుమార్తాండుచందంబున శిశువునకు దశదిశలం దనచేతియఖండితమహోల్కాజాలసన్నిభం బైనగదాదండంబు మండలాకారంబుగ జిఱజిఱం ద్రిప్పి విప్రుని చిచ్చుటమ్ము వేఁడిమిపోఁడిమిఁ జెఱచి డింభకునిపరితాపంబువిజృంభణంబు నివారించి గర్భంబు కంద కుండ నర్భకునికి నానందంబుఁ గల్పించిన. 286

మ. గదఁ జేఁ బట్టి పరిభ్రమించుచు గదాఘాతంబులం [1]గ్రూరశు
క్ప్రదమై వచ్చుశరాగ్నిఁ దుత్తుమురుగా భంజించి రక్షించె నీ
సదయుం డెవ్వఁ డొకో యటంచు మదిలోఁ జర్చించుచున్ శాబకుం
డెదురై చూడ నదృశ్యుఁ డయ్యె హరి సర్వేశుండు విప్రోత్తమా. 287

వ. అంత ననుకూలశుభగ్రహోదయంబును మహోత్తరఫలసూచకంబును నైన శుభలగ్నంబునం బాండవవంశోద్ధారకుం డయినకుమారుండు జన్మించిన ధర్మనందనుండు ధౌమ్యాదిభూసురవర్గంబు రప్పించి పుణ్యాహంబు సదివించి జాతకర్మంబులు సేయించి కుమారుజన్మమహోత్సవకాలంబున భూసురులకు విభవాభిరామంబు లయినగోభూహిరణ్యహయగ్రామంబులును స్వాదురుచిసంపన్నంబు లయినయన్నంబు లిడిన వారలు తృప్తులై ధర్మపుత్రున కిట్లనిరి. 288

చ. ప్రకటితదైవయోగమునఁ బౌరవసంతతి యంతరింపఁగా
వికలత నొంద నీక ప్రభవిష్ణుఁడు విష్ణుఁ డనుగ్రహించి శా
బకు బ్రదికించెఁ గావున నృపాలక శాబకుఁ డింక శాత్రవాం
తకుఁ డగు విష్ణురాతుఁ డన ధాత్రిఁ బ్రసిద్ధికి నెక్కుఁ బూజ్యుఁడై. 289

వ. అనిన విని భూదేవోత్తములకు నరదేవోత్తముం డిట్లనియె. 290

---

1. దుర్భర, ప్రద మై.

శా. ఓపుణ్యాత్మకులార నాపలుకు మీ రూహింపుఁడా మ్రొక్కెదన్
మాపెద్దల్ శ్రుతకీర్తులై సదయులై మన్నారు [1]రాజర్షులై
యీపిన్నాతఁడు వారిఁ బోలెడిఁ గదా యెల్లప్పుడున్ మాధవ
శ్రీపాదాంబుజభక్తియుక్తుఁ డగుచున్ జీవించునే చూడరే. 291

వ. అనిన విని నరేంద్రా భవదీయపౌత్త్రుండు మనుపుత్త్రుం డయినయిక్ష్వాకునిచందంబునం బ్రజల రక్షించు [2](* శ్రీరామచంద్రునిభంగి బ్రహ్మణ్యుండు సత్యప్రతిజ్ఞుండు నగు) డేగ వెంట నంటినఁ బంట్రిల్లుభీతిమెయి వెనుకకు సమాయాతం బైన కపోతంబుఁ గాచినశిబిచక్రవర్తిరీతి శరణ్యుండును వితరణఖనియు నగు దుష్యంతసూనుం డయినభరతుపగిది [3]సోమాన్వయజ్ఞాతివర్గంబులకు యజ్వలకు ననర్గళకీర్తి విస్తరించు ధనంజయకార్తవీర్యులకరణి ధనుర్ధరాగ్రేసరుం డగుఁ గీలిపోలిక దుర్ధర్షుం డగు సముద్రునితెఱంగున దుస్తరుం డగు మృగేంద్రునికైవడి విక్రమశాలి యగు [4](*వసుమతివోలె నక్షయక్షాంతియుక్తుం డగు భానునిలాగునఁ బ్రతాపవంతుం డగు) వాసుదేవువడువున [5]సర్వభూతహితుం డగుఁ దల్లిదండ్రులమాడ్కి సహిష్ణుం డగు మఱియును. 292

సీ. సమదర్శనంబున జలజాతభవుఁ డనఁ, బరమప్రసన్నత భర్గుఁ డనఁగ
నెల్లగుణంబుల నిందిరావిభుఁ డన, నధికధర్మమున యయాతి యనఁగ
ధైర్యసంపద బలిదైత్యవల్లభుఁ డన, నచ్యుతభక్తిఁ బ్రహ్లాదుఁ డనఁగ
రాజితోదారత రంతిదేవుం డనఁ, నాశ్రయమహిమ హిమాద్రి యనఁగ

తే. యశము వర్ధించుఁ బెద్దల నాదరించు
నశ్వమేధంబు లొనరించు నాత్మసుతుల
ఘనులఁ బుట్టించు దండించు ఖలులఁ బట్టి
మానధనుఁడు నీమనుమఁడు మానవేంద్ర. 293

భుజంగప్రయాతము. హరించుం గలిప్రేరితాఘంబు లెల్లన్
భరించున్ ధరన్ రామభద్రుండపోలెం
జరించున్ సదా వేదశాస్త్రానువృత్తిన్
వరించున్ విశేషించి వైకుంఠభక్తిన్. 294

వ. ఇట్లు పెక్కేండ్లు జీవించి భూసురకుమారప్రేరితం బయినతక్షకసర్పవిషానలంబునం దనకు మరణం బని యెఱింగి సంగవర్జితుం డయి ముకుందపదారవిందభజనంబు సేయుచు శుకయోగీంద్రునివలన నాత్మవిజ్ఞానసంపన్నుం డై గంగాతటంబున శరీరంబు విడిచి నిర్గతభయశోకం బయినలోకంబుఁ బ్రవేశించు నని జాతకఫలంబు సెప్పి లబ్ధకాము లయి భూసురులు సని రంత. 295

1 రారాజులై. 2 (*) ఇవి మూలానుసారముగా నిటఁ జేర్పంబడియె. 3 సోమయాజియై జ్ఞాతి. 4 (*) ఇది మూలానుసారముగా నిటఁ జేర్పఁబడినది. 5 నక్షయకాంతియుక్తుం.

క. తనతల్లికడుపులోపల, మును సూచినవిభుఁడు విశ్వరూపమున నెల్లఁ గలం
డనుచుఁ బరీక్షింపఁగ జను, లనఘుఁ బరీక్షిన్నరేంద్రుఁ డండ్రు మునీంద్రా. 296

ఆ. కళలచేత రాజు క్రమమునఁ బరిపూర్ణుఁ, డయినభంగిఁ దాత యనుదినంబుఁ
బోషణంబు సేయఁ బూర్ణుఁ డయ్యెను ధర్మ,పటలపాలకుండు బాలకుండు. 297

వ. మఱియు ధర్మనందనుండు బంధుసంహారదోషంబు వాయుకొఱకు నశ్వమేధయాగంబు సేయుచుఁ బ్రజలవలనం గరదండంబుల సముపాత్తం బయినవిత్తంబు చాలక చిత్తంబునఁ జింతించు నెడ నచ్యుతప్రేరితులై భీమార్జునాదులు దొల్లి మరుత్తుం డనురాజు మఖంబు సేసి పరిత్యజించి నిక్షేపించినసువర్ణపాత్రాదికం బైన విత్తంబు త్తరదిగ్భాగంబువలన బలవంతులై తెచ్చిన నారాజసత్తముండు సమాయత్తయజ్ఞోపకరణుం డై [1](*సకలబంధుసమేతంబుగఁ గృష్ణుని నాహ్వానంబు సేసి) [2]పురుషోత్తము నుద్దేశించి మూఁడుజన్నంబు[3]లు గావించెఁ [4](*దదనంతరంబ కృష్ణుండు బంధుప్రియంబుకొఱకుఁ గరినగరంబునఁ గొన్నినెల లుండి ధర్మపుత్రాదులచే నామంత్రణంబు వడసి యాదవసమేతుం డయి ధనంజయుండు దోడరా నిజనగరంబునకుం జనియె) నంత విదురుండు తీర్థయాత్ర సని మైత్రేయుముందటఁ గర్మయోగవ్రతాదివిషయంబు లయినప్రశ్నంబులఁ గొన్నిటిం జేసి యతనివలన నాత్మగతిజ్ఞానంబు దెలిసి కృతార్థుం డై హస్తిపురంబునకు వచ్చిన. 298

క. బంధుఁడు వచ్చె నటంచును, గాంధారీవిభుఁడు మొదలుగా నందఱు సం
బంధములు నెఱపి ప్రీతి న, మంథరగతిఁ జేసి రపుడు మన్నన లనఘా. 299

వ. అంత ధర్మనందనుండు విదురునికి మజ్జనభోజనాదిసత్కారంబులు సేయించి సుఖాసీనుం డై తనవార లందఱు విన నిట్లనియె. 300

సీ. ఏవర్తనంబున నింతకాలము మీరు. సంచరించితి రయ్య జగతిలోన
నేతీర్థములు గంటి రెక్కడ నుంటిరి, భావింప మీవంటి భాగవతులు
తీర్థసంఘంబుల దిక్కరింతురు గదా, మీయందు విష్ణుండు మెఱయుకతన
మీర తీర్థంబులు మీకంటె మిక్కిలి, తీర్థంబు లున్నవె తెలిసి చూడ

తే. వేఱ తీర్థంబు లవనిపై వెదక నేల, మిమ్ముఁ బొడగని భాషించుమేలచాలు
వార్త లే మండ్రు లోకులు వసుధలోన, మీకు సర్వంబు నెఱిఁగెడు[5]మేధగలదు.

మత్తకోకిలము. తండ్రి సచ్చినమీఁద మాపెదతండ్రిబిడ్డలు దొల్లి పె
క్కండ్రు సర్పవిషాగ్నిబాధల గాసిఁ బెట్టఁగ మమ్ము ని

---

1 (*) ఇది మూలానుసారముగా నిట చేర్పఁబడియె. 2 'యజ్ఞేశ్వరుం డగుపురుషోత్తము' అని వ్రాఁతప్రతులు. 3 లవిచ్ఛిన్నసంపన్నంబులు గావించె. 4 (*) ఇది మూలానుసారముగా నిట చేర్పఁబడినది. 5 మేర గలదు.

ల్లాండ్ర నంతముఁ బొందఁ గుండఁగ నాలనంబున మీరు మా
తండ్రిభంగి సముద్ధరించితిరు తద్విధంబు దలంతురే. 302

క. పక్షులు తమతెక్కలలోఁ, బక్షంబులు రాసి పిల్లపదువుల మమతన్
రక్షించినక్రియ మీరలు, పక్షీకరణంబు సేయ బ్రదికితిమి గదే. 303

క. మన్నారా ద్వారకలో, నున్నారా యదువు లంబుజోదరుకరుణం
గన్నారా లోకులచే, విన్నారా మీరు వారివిధ మెట్టిదియో. 304

చ. అన విని ధర్మరాజునకు నావిదురుండు సమస్తలోకవ
ర్తనముఁ గ్రమంబుతోడ వివరంబుగఁ జెప్పి యదుక్షయంబు సె
ప్పిన నతఁ డుగ్రశోకమునఁ బెగ్గిలి కుందెడి నంచు నేమియున్
వినుమని చెప్పఁ డయ్యె యదువీరులనాశము భార్గవోత్తమా. 305

ఆ. మేలు సెప్ప నేని మే లందు లోకులు, చెట్ట యందు కీడు సెప్ప నేని
యంతమీఁద శూన్యుఁ డైనకతంబున, శిష్టమరణ మతఁడు సెప్పఁ డయ్యె.

వ. అది యెట్లనిన మాండవ్యమహామునిశాపంబునం దొల్లి యముండు శూద్ర
యోనియందు విదురుండై జన్మించియున్ననూఱువత్సరంబు లర్యముండు యథా
క్రమంబునం బాపకర్ముల దండించె నిట్లు యుధిష్ఠిరుండు రాజ్యంబుఁ గైకొని
లోకపాలసంకాశు లయినతమ్ములుం దానును కులదీపకుం డైనమనుమని ముద్దు
సేయుచుఁ బెద్దకాలంబు మహావైభవంబున సుఖ మై యుండె నంత. 307

క. బాలాజనశాలాధన, లీలావనముఖ్యవిభవలీనమనీషా
[1]లాలసు లగుమానవులను, గాలము వంచించు దురవగాహము సుమతీ. 308

గాంధారీధృతరాష్ట్రులు దేహత్యాగము సేసికొనుట.

వ. అది నిమిత్తంబుగాఁ గాలగతి యెఱింగి విదురుండు ధృతరాష్ట్రున కిట్లనియె. 309

మ. కనకాగారకళత్రమిత్రసుతసంఘాతంబులన్ ముందటం
గని ప్రాణేచ్ఛల నుండుజంతువుల నేకాలంబు దుర్లంఘ్య మై
యనివార్యస్థితిఁ జంపు నట్టినిరుపాయం బైనకాలంబు వ
చ్చె నుపాంతంబున మాఱు దీనికి మదిం జింతింపు ధాత్రీశ్వరా. 310

శా. పుట్టంధుండవు పెద్దవాఁడవు మహాభోగంబులా లేవు నీ
పట్టెల్లం జెడి పోయె దుస్సహజరాభారంబు పైఁ గప్పె నీ
చుట్టా లెల్లను బోయి రాలు మగఁడున్ శోకంబునన్ మగ్ను లై
కట్టా దాయలపంచ నుండఁ దగవే కౌరవ్యవంశాగ్రణీ. 311

క. పెట్టితిరి చిచ్చు గృహమునఁ, బట్టితిరి తదీయభార్యఁ బాడడవులకుం
గొట్టితిరి వారు మనుపఁగ, నెట్టయిన భరింప వలెనె యీప్రాణములన్. 312

క. బిడ్డలకు బుద్ధి సెప్పని, గ్రుడ్డికిఁ బిండంబు వండికొని పొం డిదె పైఁ

1 లోలాకులమానసులను.

బడ్డాఁ డని భీముం డోర, గోడ్డెము లాడంగఁ గూడుఁ । గుడిచెద వధిపా. 313

క. కనియెదవో బిడ్డల నిఁక, మనియెదవో తొంటికంటె । మనుమలమాటల్
వినియెదవో యిచ్చెద ర, మ్మనియెదవో దానములకు । నవనీసురులన్. 314

క. దేహము నిత్యము గా దని, మోహముఁ దెగఁ గోసి సిద్ధ । మునివర్తనుఁ డై
గేహము వెలువడునరుఁ డు, త్సాహముతోఁ జెందు ముక్తి । సంపద ననఘా. 315

వ. అని విదురుండు ధృతరాష్ట్రునకు విరక్తిమార్గం బుపదేశించిన నతండు ప్రజ్ఞా
చక్షుం డై సంసారంబు దిగనాడి మోహపాశంబువలన నూడి విజ్ఞానమార్గం
బునం గూడి దుర్గమం బగుహిమవన్నగంబునకు నిర్గమించిన. 316

శా. అంధుం డైనపతిన్ వరించి పతిభా । వాసక్తి నేత్రద్వయీ
బంధాచ్ఛాదనమున్ ధరించి నియమ । ప్రఖ్యాత యై యున్నత
ద్గాంధారక్షితినాథుకూఁతురును యో । గప్రీతి చిత్తంబులో
సంధిల్లం బతివెంట నేఁగె నుదయ । త్సాధ్వీగుణారూఢ యై. 317

చ. వెనుకకు రాక చొచ్చురణ । వీరునికై వడి రాజదండసం
బునకు భయంబు లేక వడిఁ । బోయెడుధీరునిభంగి నప్పు డా
వనిత దురంత మైనహిమ । వంతముపొంతవనాంతభూమికిం
బెనిమిటితోడ నించుకయు । భీతి వహింపక యేఁగెఁ బ్రీతితోన్. 318

వ. ఇట్లు విదురసహితు లై గాంధారీధృతరాష్ట్రులు వనంబునకుం జనిన మఱునాఁడు
ధర్మనందనుండు ప్రభాతంబున సంధ్యావందనంబు సేసి నిత్యహోమంబు గా
వించి బ్రాహ్మణోత్తములకు గోహిరణ్యతిలవస్త్రాదిదానంబులు సేసి నమస్కరించి
గురువందనంబుకొఱకుఁ బూర్వప్రకారంబునం దండ్రిమందిరంబునకుఁ జని
యందు విదురసహితు లయినతల్లిదండ్రులం గానక మంజుపీఠంబునఁ గూర్చున్న
సంజయున కిట్లనియె. 319

సీ. మాతల్లిదండ్రు లీ । మందిరంబున లేరు, సంజయ వా రెందుఁ । జనిరి నేఁడు
ముందర గానఁడు । ముసలి మాపెదతండ్రి, పుత్రశోకంబునఁ । బొగులుఁ దల్లి
సౌజన్యనిధి ప్రాణ । సఖుఁడు మాపినతండ్రి, మందబుద్ధుల మైన । మమ్ము విడిచి
యెటవోయిరో మువ్వుర । రెఱిఁగింపు గంగలోఁ, దనయపరాధంబుఁ । దడవికొనుచు

ఆ. భార్యతోడఁ దండ్రి । పరితాపమునఁ బడుఁ, గపట మింత లేదు । కరుణ గలఁడు
పాండుభూవిభుండు । పరలోకగతుఁ డైన, మమ్ముఁ బిన్ననాఁడు । మనిచె నతఁడు.

వ. అనిన సంజయుండు [1](*దయాస్నేహంబుల నతికర్శితుం డగుచుఁ దనప్రభువు
పోయినతెఱం గెఱుంగక కొంతదడ వూరకుండి) తద్వియోగదుఃఖంబునఁ గ
న్నీరు కరతలంబునం దుడిచికొనుచు బుద్ధిబలంబునం జిత్తంబు ధైర్యాయత్తంబు
సేసి [2](*తనభర్తృపాదంబుల మనంబున నెన్నుచు) ధర్మజున కిట్లనియె. 321

---

**1, 2 (*) ఇవి మూలానుసారముగాఁ జేర్పఁబడినవి.**

తే. అఖిలవార్తలు మున్ను నన్నడుగుచుండు, నడుగఁడీ రేయిమాతండ్రి యవనినాథ
మందిరములోన విదురుతోఁ గమంతనంబు, నిన్న యాడుచునుండెను నేఁడు లేఁడు.

వ. విదురగాంధారీధృతరాష్ట్రులు నన్ను వంచించి యెందుఁ బోయిరో [1](*వారలనిశ్చయంబు లెట్టివో) యెఱుంగ నని సంజయుండు దుఃఖించుసమయంబునం దుంబురుసహితుండై నారదుండు వచ్చిన లేచి నమస్కరించి తమ్ములుం దానును నారదుం బూజించి కౌంతేయాగ్రజుం డిట్లనియె. 323

ఉ. అక్కట తల్లిదండ్రులు గృహంబున లేరు మహాత్మ వారు నేఁ
డెక్కడ వోయిరో యెఱుఁగ నెప్పుడు బిడ్డలపేరు గ్రుచ్చి తాఁ
బొక్కుచు నుండుఁ దల్లి యెఱుక వోయెనొకో విపదంబురాశికి
నిక్కము కర్ణధారుఁడవు నీవు జగజ్జనపారదర్శనా. 324

వ. అనిన విని సర్వజ్ఞుండైననారదుండు ధర్మజున కిట్లనియె నీశ్వరవశంబై (*నదివిశ్వం బీశ్వరుండ భూతంబుల నొకటితో నొకటిం జేర్చు నెడంబాపు సూచీభిన్ననాసికలందు రజ్జుప్రోతంబు లగుచుఁ గంఠరజ్జువులఁ గట్టంబడినబలీవర్దంబులుం బోలెఁ గర్తవ్యాకర్తవ్యవేదలక్షణ యగువాక్తంత్రియందు వర్ణాశ్రమలక్షణంబులు గల నామంబులచే బద్ధులై) లోకపాలసహితంబైనలోకంబు లీశ్వరాదేశంబు వహించుఁ [3]గ్రీడాసాధనంబు లగునక్షకందుకాదుల కెట్లు సంయోగవియోగంబు లట్లు క్రీడించునీశ్వరునికిం గ్రీడాసాధనంబులైనజంతువులకు సంయోగవియోగంబు లగుచుండు నసమస్తజనంబును జీవరూపంబున ధ్రువంబును దేహరూపంబున నధ్రువంబునై యుండు మఱియొక్కపక్షంబున ధ్రువంబు నధ్రువంబునుం గాక యుండు శుద్ధబ్రహ్మస్వరూపంబు నిర్వచింప రాక రెండు నై యుండు నజగరంబుచేత మ్రింగం బడినపురుషుం డన్యుల రక్షింప లేనితెఱంగునఁ బంచభూతమయంబై కాలకర్మగుణాధీనంబైనదేహంబు పరుల రక్షింప సమర్థంబు గాదు కరంబులు గలజంతువులకుఁ గరంబులు లేనిచతుష్పదంబు లాహారంబు లగుఁ జరణంబులు గలప్రాణులకుం జరణంబులు లేనితృణాదులు భక్షణీయంబు లగు నధికజన్మంబులకు నల్పజన్మంబులు భోజ్యంబు లగు సకలదేహిదేహంబులందు జీవుండు గలుగుటం జేసి జీవునికి జీవుండ జీవిక యగు సహస్రాసహస్రాదిరూపంబైనవిశ్వమంతయు నీశ్వరుండు గాఁ దెలియు మతనికి వేఱు లేదు నిజమాయావిశేషంబున మాయావియై జాతిభేదరహితుండైనయీశ్వరుండు బహుప్రకారంబుల భోగిభోగ్యరూపంబుల నంతరంగబహిరంగంబుల దీపించుం [4](*గాన యనాథులు దీనులు నగునాదుతల్లిదండ్రులు నన్నుం బాసి యే మయ్యెదరో యెట్లు వర్తింతురో యని వగవం బనిలేదజ్ఞానమూలం బగుస్నేహంబున నైనమనోవ్యాకులత్వంబు పరిహరింపు మని మఱియు ని ట్లనియె). 325

---

1, 2, 4 (*) ఇవి మూలానుసారముగాఁ జేర్పఁబడినవి. 3 నిచ్ఛాప్రకారంబునఁ గ్రీడించునీశ్వ.

ఆ. అట్టి కాలరూపుఁ డఖిలాత్ముఁ డగువిష్ణుఁ, డసురనాశమునకు నవతరించి
దేవకృత్య మెల్లఁ దీర్చి చిక్కినపని, కెదురుచూచుచుండు నిప్పు డధిప. 326

మత్తకోకిలము. ఎంతకాలము కృష్ణుఁ డీశ్వరుఁ డిద్ధరిత్రిఁ జరించు మీ
రంతకాలము నుండుఁ డందఱు నవ్వలం బనిలేదు వి
భ్రాంతి మానుము కాలముం గడవంగ నెవ్వరు నోప రీ
చింత యేల [1]నరేంద్రసత్తమ చెప్పెదన్ విను మంతయున్. 327

వ. ధృతరాష్ట్రుండు గాంధారీవిదురసహితుండై హిమవత్పర్వతదక్షిణభాగంబున నొక్కమునివనంబునకుం జని తొల్లి సప్తర్షులకు సంతోషంబు సేయుకొఱకు నాకాశగంగ యేడుప్రవాహంబు లయి పాఱినపుణ్యతీర్థంబునం గృతస్నానుండై యథావిధి హోమం బొనరించి జలభక్షణంబు గావించి సకలకర్మంబులు విసర్జించి విఘ్నంబులం జెందక నిరాహారుం డయి శాంతి నంగీకరించి పుత్త్రార్థదారైషణంబులు వర్జించి విన్యస్తాసనుండై ప్రాణంబుల నియమించి మనస్సహితంబులైనయింద్రియంబుల నాఱింటిని విషయంబులం బ్రవర్తింపనీక నివర్తించి హరిభావనచే ధారణయోగంబు వహించి రజస్సత్త్వతమోరూపంబు లగుమలంబుల మూఁటిని హరించి మనంబు నహంకారాస్పదంబైనస్థూలదేహంబువలనం బాపి బుద్ధియందు నేకీకరణంబు సేసి [2]యట్టివిజ్ఞానాత్మను దృశ్యాంశంబువలన వియోగించి క్షేత్రజ్ఞునియందుఁ బొందించి ద్రష్టంబైనయీశ్వరునివలన క్షేత్రజ్ఞునిం బాపి మహాకాశంబుతోడ ఘటాకాశముం గలుపుకైవడి నాధారభూతంబైనబ్రహ్మమందుఁ గలిపి లోపలిగుణక్షోభంబును వెలుపలియింద్రియవిక్షేపంబును [3]లేక నిర్మూలితమాయాగుణవాసనుం డగుచు నిరుద్ధంబు లగుమనశ్చక్షురాదీంద్రియంబులు గలిగి యఖిలాహారంబుల వర్జించి కొఱడుచందంబున. 328

మ. ఉటజాంతస్స్థలవేదికన్ నియతుఁడై యున్నాఁడు నేఁ డాదిగా
నిటపై నేనవనాఁడు మేన్ విడువఁగా [4]నిజ్యాగ్ని యోగాగ్ని త
త్పటుదేహంబు దహింపఁ జూచి నియమప్రఖ్యాత గాంధారి యు
ట్టటు వో నొల్లక ప్రాణవల్లభునితో నగ్నిం బడున్ భూవరా. 329

క. [5]అంతట వారలమరణము, వింత యగుచుఁ జూడఁబడిన విదురుఁడు చింతా
సంతాప మొదవఁ బ్రీత, స్వాంతుండై తీర్థములకుఁ జనియెడు నధిపా. 330

---

1 నరేంద్రచంద్ర విశేషమున్ విను చెప్పెదన్.

2 'బుద్ధిసహితుండైనతన్ను దృశ్యాంశంబువలన' అని వ్రాఁతప్రతులు.

3 'లేనికొఱకుచందంబున' అని వ్రాఁతప్రతులు.

4 చేతెంచుదావాగ్ని.

5 'అంతట నత్యాశ్చర్యము, వింత యగుచుఁ జెవులఁ బడిన' ననియే వ్రాఁతప్రతులు.

### ధర్మజుఁడు దుర్నిమిత్తంబులం గని చింతించుట.

వ. అని విదురాదులవృత్తాంతం బంతయు ధర్మనందనున కెఱింగించి తుంబురుసహితుం డయిననారదుండు స్వర్గంబునకు నిర్గమించినవెనుక ధర్మజుండు భీమునిం జూచి యిట్లనియె. 331

సీ. ఒకకాలమునఁ బండు ǂ నోషధిచయము వే, ఱొకకాలమునఁ బండ ǂ కుండు నండ్రు
క్రోధంబు లోభంబు ǂ క్రూరత బొంకును, దీపింప నరులు వ ǂ ర్తింతు రండ్రు
వ్యవహారములుమహా ǂ వ్యాజయుక్తములండ్రు, సఖ్యంబు వంచనా ǂ సహిత మండ్రు
మగలతోనిల్లాండ్రు ǂ మచ్చరించెదరండ్రు, సుతులు దండ్రులఁ దెగఁ ǂ జూతు రండ్రు
తే. గురుల శిష్యులుదూషించి ǂ కూడ రండ్రు, శాస్త్రమార్గము లెవ్వియుఁ ǂ జాఁగవండ్రు
న్యాయపద్ధతి బుధులైన ǂ నడవ రండ్రు, కాలగతి వింత యై వచ్చెఁ ǂ గంటె నేఁడు.

మ. హరిఁ జూడన్ నరుఁ డేఁగినాఁడు నెల లే ǂ డయ్యెం గదా రారు గా
లరు లెవ్వారును యాదవుల్ సమదలో ǂ లస్వాంతు లీవేళ సు
స్థిరులై యుండుదురా మురారి సుఖియై ǂ సేమంబుతో నుండునా
యెఱవై యున్నది చిత్త మీశ్వరకృతం ǂ బెట్లో కదే మారుతీ. 333

క. మానసము గలఁగు చున్నది, మానవు బహుదుర్నిమిత్త ǂ మర్యాదలు స
న్మానవ దేహక్రీడలు, మాన విచారింప నోపు ǂ మాధవుఁ డకటా. 334

క. మనవులు సెప్పక ముందఱ, మనదారప్రాణరాజ్య ǂ మానశ్రీలన్
[1]మనుపుదు నని మాధవుఁ డిట, మనమునఁ దలపోసి మనిచె ǂ [2]మనలం గరుణన్.

క. నారదుఁ డాడిన క్రైవడిఁ, గ్రూరపుఁ గాలంబు వచ్చెఁ ǂ గుంభినిమీఁదన్
ఘోరము లగునుత్పాతము, లారభటిం జూడఁబడియె ǂ ననిలజ కంటే. 336

సీ. ఓడక ముందట ǂ నొకసారమేయంబు, మొఱుఁగుచు నున్నది ǂ మోర యెత్తి
యాదిత్యుఁ డుదయింప ǂ నభిముఖంబై నక్క, వాపోయె మంటలు ǂ [3]వాతఁ గలుగ
మిక్కిలు చున్నవి ǂ మెఱసి గృధ్రాదులు, గర్దభాదులు దీర్చి ǂ క్రందుకొనియె
నుత్తమాశ్వంబుల ǂ కుదయించెఁ గన్నీరు, మత్తగజంబుల ǂ మదము లుడిగెఁ
ఆ. గాలుదూలెభంగిఁ ǂ గదిసెఁ గపోతము, మండ దగ్ని హోమ ǂ మందిరములఁ
జుట్టుఁ బొగలు దిశల ǂ సొరిది నాచ్ఛాదించెఁ, దరణి మాసెఁ జూడు ǂ ధరణి గదలె.

క. వాతములు విసరి రేఁగె, వ్రాతము లాకసముఁ గప్పె ǂ వడి సుడిగొని ని
ర్ఘాతములు వడియె ఘనసం, ఘాతంబులు రక్తవర్ష ǂ కలితము లయ్యెన్. 338

క. గ్రహములు పోరాడెడి నా, గ్రహముల వినఁబడియె భూత ǂ కలకలములు దు
స్సహము లగుచు శిఖికీలా, వహముల క్రియఁ దోఁచె గగన ǂ వసుధాంతరముల్.

క. దూడలు గుడువవు చన్నులు, దూడలకున్ గోవు లీవు ǂ దుగ్ధము లోడలం
బీడలు మానవు పశువులఁ, గూడవు వృషభములు దఱిపి ǂ కుఱ్ఱుల నెక్కన్. 340

---

1. మను పుదు నని. 2. 'మనముల' అనియే వ్రాఁత ప్రతులు. 3. వాంతి సేసి.

క. కదలెడు వేల్పులరూపులు, వదలెడుఁ గన్నీరు వానివలనం జెమటల్
వొదలెడిఁ బ్రతిమలు [1]వెలిఁ జని, మెదలెడి నొక్కొక్కగుడిని మేదినియందున్.
క. కాకంబులు వాపోయెడి, ఘూకంబులు నగరఁ బగలు గుండ్రలు గొలిపెన్
లోకంబులు విభ్రష్ట, శ్రీకంబులగతి నశించి శిథిలము లయ్యెన్. 342
మ. యవపద్మాంకుశచాపచక్రఝషరేఖాలంకృతం బైనమా
ధవుపాదద్వయ మింక [2]మెట్టెడుపవిత్రత్వంబు నేఁ డాదిగా
నవనీకాంతకు లేదు పో మఱి మదీయాంగంబు వామాక్షిబా
హువు లాకంపము నొందు చుండు నిల కేయుగ్రస్థితుల్ వచ్చునో. 343
వ. మఱియు మహోత్పాతంబులు పెక్కులు పుట్టు చున్నయవి మురాంతకుని వృత్తాంతంబు వినరా దని కుంతీసుతాగ్రజుండు భీమునితో విచారించు సమయంబున. 344

అర్జునుఁడు ద్వారకనుండి వచ్చి కృష్ణనిర్యాణంబుఁ దెల్పుట.

క. ఖేదమున నింద్రసూనుఁడు, యాదవపురినుండి వచ్చి యగ్రజుఁ గని త
త్పాదముల నయనసలిలో, త్పాదకుఁ డై పడియె దీనుభంగి నరేంద్రా. 345
క. పల్లటిలినయుల్లముతోఁ, దల్లడపడు చున్నపిన్నతమ్మునిఁ గని వె
ల్వెల్ల నగు మొగముతో జను, లెల్లను విన ధర్మపుత్రుఁ డి ట్లని పలికెన్. 346
సీ. మాతామహుం డైనమనశూరుఁ డున్నాఁడె, మంగళమే మనమాతులునకు
మోదమే నలుగుకుముగురుమేనత్తల, కానందమే వారియాత్మజులకు
నక్రూరకృతవర్మలాయుస్సమేతులే, జీవితుఁడే యుగ్రసేనవిభుఁడు
కల్యాణయుక్తులే గదసారణాదులు, మాధవుతమ్ములు మానధనులు
తే. నందమే మనసత్యకనందనునకు, భద్రమే శంబరాసురభంజనునకుఁ
గుశలమే బాణదనుజేంద్రకూఁతుపతికి, హర్షమే పార్థ ముసలికి హాలికి బలికి.
వ. మఱియు నంధకయదుభోజదశార్హవృష్ణిసాత్వతులు మొద లయినయదువంశవీరులును హరికుమారు లైనసాంబసుషేణప్రముఖులును నారాయణానుచరు లైనయుద్ధవాదులును గృష్ణసహచరు లైనసునందనందాదులును [3](*సుఖానందు లే యని) యందఱ నడిగి ధర్మజుండు గ్రమ్మఱ ని ట్లనియె. 348
సీ. వైకుంఠవాసులవడువున నెవ్వని, బలమున నానందభరితు లగుచు
వెఱవక యాదవవీరులు వర్తింతు, రమరులు గొలు వుండునట్టికొలువుఁ
జవికె నాకర్షించి చరణసేవకు లైన, బంధుమిత్రాదులపదయుగముల
నెవ్వఁడు ద్రొక్కించె నింద్రపీఠముమీఁద, వజ్రంబు జళిపించి వ్రాలువాని
తే. ప్రాణవల్లభకెంగేలఁ బాదుసేసి, యమృతజలములఁ బోషింప నలరుపారి
జాత మెవ్వఁడు గొని వచ్చి సత్యభామ, కిచ్చె నట్టిమహాత్మునకిపుడు శుభమె.

1. కాలు చని. 2. ముట్టెడు. 3. (*) ఇది మూలానుసారము గాఁ జేర్పఁబడినది.

శా. అన్నా ఫల్గున భక్తవత్సలుఁడు బ్రహ్మణ్యుండు గోవిందుఁ డా
పన్నానీకశరణ్యుఁ డీశుఁడు జగద్భద్రానుసంధాయి శ్రీ
మన్నవ్యాంబుజపత్త్రనేత్రుఁడు సుధర్మామధ్యపీఠంబునం
దున్నాఁడా బలభద్రుఁ గూడి సుఖియై యుత్సాహియై ద్వారకన్. 350

క. ఆరామకేశవులకును, సారామలభక్తి నీవు సలుపుదువు గదా
గారాములు సేయుదురా, పోరాముల బంధు లెల్లఁ బ్రొద్దు జితారీ. 351

శా. మున్నుగ్రాటవిలో వరాహమునకై ముక్కంటితోఁ బోరుచో
సన్నాహంబునఁ గాలకేయుల ననిం జక్కాడుచోఁ బ్రాభవ
స్కన్నుం డై చనుకౌరవేంద్రుపనికై గంధర్వులం దోలుచోఁ
గన్నీ రెన్నఁడుఁ దేవు తండ్రి చెపుమా కల్యాణమే చక్రికిన్. 352

వ. అదియునుం గాక. 353

క. ఓడితివో శత్త్రువులకు, నాడితివో సాధుదూషణాలాపములం
గూడితివో పరసతులను, వీడితివో మానధనము వీరులనడుమన్. 354

క. తప్పితివో యిచ్చెద నని, చెప్పితివో కపటసాక్షి చేసినమేలుం
దప్పితివో శరణార్థుల, రొప్పితివో ద్విజులఁ బసుల రోగుల సతులన్. 355

క. అడిచితివో భూసురులను, గుడిచితివో బాలవృద్ధగురువులు వెలిగా
విడిచితివో యాశ్రితులను, ముడిచితివో పరులవిత్తములు లోభమునన్. 356

వ. అని పలికినం గన్నీరు కరతలంబునం దుడిచికొనుచు గద్గదస్వరంబునఁ బెన్నిధిం గోలుపోయినపేదచందంబున నిట్టూర్పుల నిగిడించుచు నర్జునుం డన్న కిట్లనియె.

క. మనసారథి మనసచివుఁడు, మనవియ్యము మనసఖుండు మనబాంధవుఁడున్
మనవిభుఁడు గురుఁడు దేవర, [1]మనలను దిగనాడి చనియె మనుజాధీశా. 358

క. కంటకపునృపులు సూడఁగ, మింటం గన్పించుయంత్రమీనముఁ గోలన్
గెంటించి మనము వాలుం, గంటిం జేకొంటి మత్తనికరుణఁ గాదే. 359

క. దండి ననేకులతో నా, ఖండలుఁ డెదురయిన గెలిచి ఖాండవవనముం
జండార్చికి నర్పించిన, గాండీవము నిచ్చఁ జక్రి గలుగుట నధిపా. 360

క. దిక్కులరాజుల నెల్లను, మ్రొక్కించి ధనంబు గొనుట మయకృతసభ ము
న్నెక్కుట జన్నము సేయుట, నిక్కము హరి మనకు దండనిలిచినఁ గాదే. 361

మ. ఇభజిద్వీర్యముఖాభిషిక్త మగునీయిల్లాలిధమ్మిల్లమున్
సభలో శాత్రవు లీడ్చినన్ ముడువ కాశ్చంద్రాస్య దుఃఖింపఁ గా
సభయం బిచ్చి ప్రతిజ్ఞ సేసి భవదీయారాతికాంతాళిలో
జభరశ్రీల హరింపఁడే విధవలై సౌభాగ్యముల్ వీడఁగన్. 362

శా. వైరుల్ గట్టినపుట్టముల్ విడువఁగా వారింప నావల్లభుల్

1. మనముల.

రా రీవేళ నుపేక్ష సేయఁ దగవే రావే నివారింపవే.
లేరే త్రాతలుఁ గృష్ణ యంచు సభలో దీనాంగి యై కుయ్యిడం
గారుణ్యంబున భూరివస్త్రకలితం గాఁ జేయఁడే ద్రౌపదిన్. 363
సీ. దుర్వాసుఁ డొకనాఁడు దుర్యోధనుఁడు వంపఁ, బదివేలశిష్యులుభక్తిఁ గొలువఁ
జనుదెంచి మనముఁ బాంచాలియుఁ గుడిచిన, వెనుక నాహారంబు వేఁడికొనినఁ
బెట్టెద ననవుడుఁ బెట్ట కున్న శపింతు, ననుచుఁ దోయావగాహమున కేఁగఁ
గడవల నన్నశాకములు దీఱుటఁ జూచి, పాంచాలపుత్త్రిక పర్ణశాల
తే. లోనఁ దలఁచిన విచ్చేసి లోవిలోని, శిష్టశాకాన్నలవముఁ బ్రాశించి తపసి
కోప ముడిగించి పరిపూర్ణకుక్షిఁ జేసె, నిట్టి త్రైలోక్యసంతర్పి యెందుఁ గలఁడు.
సీ. పందియై పోరాడ ఫాలాక్షుఁడెవ్వని, బలమున నా కిచ్చెఁ బాశుపతము
నెవ్వనిలావున నిమ్మేన దేవేంద్రు, పీఠార్ధమున నుండఁ బెంపుఁ గంటిఁ
గాలకేయనివాతకవచాదిదైత్యులఁ, జంపితి నెవ్వని సంస్మరించి
గోగ్రహణమునాఁడు కురుకులాంభోనిధిఁ, గడచితి నెవ్వనికరుణఁ జేసి
ఆ. కర్ణసింధురాజకౌరవేంద్రాదుల, తలలపాగ లెల్లఁ దడవి తెచ్చి
యేమహాత్ముబలిమి నిచ్చితి విరటుని, పుత్త్రి యడుగ బొమ్మపొత్తికలకు. 365
మ. గురుభీష్మాదులు గూడి పన్నినకురుక్షోణీశచక్రంబులో
గురుశక్తిన్ రథయంత యై నొగలపైఁ గూర్చుండి యామేటి నా
శరముల్ వాఱక మున్న వారలబలోత్సాహాయురుద్యోగత
త్పరతల్ చూడ్కుల సంహరించు నమితోత్సాహంబు నా కిచ్చుచున్. 366
మ. అసురేంద్రుం డొనరించుకృత్యములు ప్రహ్లాదుం బ్రవేశించి గె
ల్వ సమర్థంబులు గానికైవడిఁ గృపాశ్వత్థామ గాంగేయ సూ
ర్యసుత ద్రోణ ధనుర్విముక్తబహుదివ్యాస్త్రప్రపంచంబు నా
దెసకున్ రాక తొలంగు మాధవుదయాదృష్టిన్ నరేంద్రోత్తమా. 367
చ. వసుమతి దివ్యబాణముల వ్రక్కలు వాపి కొలంకు సేసి నా
రసములు మాటుగాఁ బఱపి రథ్యములన్ రిపు లెల్లఁ జూడ సా
హసమున నీటఁ బెట్టితి రణావని సైంధవుఁ జంపునాఁడు నా
కసురవిరోధి భద్రగతి నండయి వచ్చినఁ గాదె భూవరా. 368
సీ. చెలికాఁడరమ్మని చీరు నన్నొకవేళ, మన్నించు నొకవేళ మఱఁది యనుచు
బంధుభావంబునఁ బాటించు నొకవేళ, దాతయై యొకవేళ ధనము లిచ్చు
మంత్రియై యొకవేళ మంత్ర మాదేశించు, బోధియై యొకవేళ బుద్ధి సెప్పు
సారథ్య మొనరించుఁ జన విచ్చి యొకవేళఁ, గ్రీడించు నొకవేళ గేలిసేయు
తే. నొక్కశయ్యాసనంబున నుండుఁ గన్న, తండ్రికైవడిఁ జేసినతప్పుఁ గాచు
హస్తములు వట్టి పొత్తున నారగించు, మనుజవల్లభ మాధవుమఱపు రాదు.

క. విజయ ధనంజయ హనుమ, ద్ధ్వజ ఫల్గున పార్థ పాండుతనయ నర మహేం
ద్రజ మిత్రార్జున యంచును, భుజములు తలకడవ రాకపోకలఁ జీరున్. 370

క. వారిజగంధులు దమలో, వారింపఁగ రానిప్రేమవాదము సేయన్
వారిజనేత్రుఁడు నను దగ, వారిండ్లకుఁ బనుపు నలుక వారింప నృపా. 371

క. నిచ్చలు లోపలికాంతలు, మచ్చికఁ దనతోడ నాడుమాటలు నాకున్
ముచ్చటలు సెప్పు మెల్లన, విచ్చలవిడిఁ దొడలమీఁద విచ్చేసి నృపా. 372

చ. అటమట మయ్యె నాభజన మంతయు భూవర నేఁడు సూడుమా
యిటువలె గారవించుజగదీశుఁడు కృష్ణుఁడు లేనిపిమ్మటం
బటుతరదేహలోభమునఁ బ్రాణము లున్నవి వెంటఁ బోక నేఁ
గటకట పూర్వజన్మమునఁ గర్మము లెట్టివి చేసినాఁడనో. 373

శా. కాంతారంబున నొంటి దోడుకొని రాఁగాఁ జూచి గోవిందుశు
ద్ధాంతస్త్రీలఁ బదాఱువేల మదరాగాయత్తులై తాఁకి నా
చెంతన్ బోయలు మూఁగి పట్టికొన నాసీమంతినీసంఘమున్
భ్రాంతిన్ భామినిభంగి నుంటి విడిపింపన్ లేక ధాత్రీశ్వరా. 374

శా. ఆతేరారథికుండు నాహయము లాయస్త్రాసనం బాశర
వ్రాతం బన్యులఁ దొల్లి చంపుఁ దుదినిన్ వ్యర్థంబులై పోయె మ
చ్చేతోధీశుఁడు చక్రి లేమి భసితస్రుక్షిప్తాజ్యమాయావిమా
యాతంత్రోషరభూమిబీజములమర్యాదన్ నిమేషంబునన్. 375

మ. యదువీరుల్ మునినాథుశాపమునఁ గాలాధీను లై యందఱున్
మదిరాపానవివర్ధమానమదసమ్మర్దోగ్రరోషాంధు లై
కదనంబుల్ దమలోన ముష్టిహతులం గావించి సిఘైరి న
ష్టదశం జిక్కిరి నల్గు రేగు రచటన్ సర్వంసహావల్లభా. 376

క. భూతములవలన నెప్పుడు, భూతములకు జన్మమరణపోషణములు ని
ర్ణీతములు సేయుచుండును, భూతమయుం డీశ్వరుండు భూతశరణ్యా. 377

క. బలములు గలమీనంబులు, బలవిరహితమీనములను భక్షించు క్రియన్
బలవంతు లయినయదువులు, బలరహితులఁ జంపి రహితభావముల నృపా.

మ. బలహీనాంగులకున్ బలాధికులకుం బ్రత్యర్థిభావోద్యమం
బులు గల్పించి వినాశమున్ నెఱపి యీభూభారముం బాపి ని
శ్చలబుద్ధిన్ గృతకార్యుఁ డై చనియె నాసర్వేశ్వరుం డచ్యుతుం
డలఘుం డే మని చెప్పుదున్ భగవదీయాయత్త మూర్వీశ్వరా. 379

వ. మఱియు దేశకాలార్థయుక్తంబులు నంతఃకరణసంతాపశమనంబులు నయినహరి
వచనంబులం దలంచి చిత్తంబు పరాయత్తం బయియున్న దని యన్నరుం జెప్పి
నిరుత్తరుం డై నిరంతరహరిచరణారవిందచింతామలబుద్ధి యై శోకంబు వర్జించి

సదాధ్యానభక్తివిశేషంబులం గామక్రోధాదుల జయించి తొల్లి తన కుభయ
సేనామధ్యంబున నచ్యుతుం డానతిచ్చినగీతలు దలంచి కాలధర్మభోగాభినివేశం
బులచేత నావృతం బయినవిజ్ఞానంబుఁ గ్రమ్మఱ నధిగమించి హేతుమద్భావం
బున శోకహేతు[1](*వహంకారమమకారాత్మకంబయిన)ద్వైతభ్రమం బనియును
ద్వైతభ్రమంబునకుఁ గారణంబు దేహం బనియును దేహంబునకు బీజంబు లింగం
బనియును లింగంబునకు మూలంబు గుణంబు లనియును గుణంబులకు నిదా
నంబు ప్రకృతి యనియును బ్రహ్మాహ మనియెడుజ్ఞానంబున లీనయై ప్రకృతి లే
కుండుననియుఁ [2](*ప్రకృతియడంగుటయ నైర్గుణ్యంబనియును నైర్గుణ్యంబువలనఁ
గార్యలింగనాశం బనియును గార్యలింగనాశంబున నసంభవం బగు) ప్రకృతిం
బాసి క్రమ్మఱ స్థూలశరీరప్రాప్తుండు గాక పురుషుండు [3]సమ్యగ్భోగంబున
నుండు ననియును నిశ్చయించి యర్జునుండు విరక్తుండై యూరకుండె ధర్మజుండు
భగవదీయమార్గంబు దెలిసి యాదవులనాశంబు విని నారదువచనంబులఁ దలంచి
నిశ్చలచిత్తుండై స్వర్గమార్గగమనంబునకు యత్నంబు సేయుచుండె నాసమ
యంబున. 380

క. యదువులనాశము మాధవు, పదవియు విని కుంతి విమలభక్తిఁ భగవ
త్పదచింతాతత్పర యై, ముదమున సంసారమార్గమునకుం బాసెన్. 381

వ. ఇట్లు కంటకంబునం గంటకోన్మూలనంబు సేసి కంటకంబులు రెంటిని బరిహరించు
విన్నాణి తెఱంగున యాదవరూపశరీరంబునం జేసి యీశ్వరుండు లోకకంటక
శరీరంబులు సంహరించి నిజశరీరంబు విడిచె సంహారంబునకు నిజశరీరపరశరీరం
బులు ధరియించి క్రమ్మఱ నంతర్ధానంబు నొందునటునికైవడి లీలాపరాయణుం
డై నారాయణుండు మీనకూర్మాదిరూపంబులు ధరియించుఁ బరిహరించు నని
చెప్పి మఱియు ని ట్లనియె. 382

క. ఏదినమున వైకుంఠుఁడు, మేదినిపైఁ దాల్చినట్టి మేను విడిచినాఁ
డాదినమున నశుభప్రతి, పాదక మగుకలియుగంబు ప్రాప్తం బయ్యెన్. 383

ధర్మరాజు పరీక్షితునకుఁ బట్టము గట్టి మహాప్రస్థానంబున కేఁగుట.

సీ. కలివర్తనంబునఁ గౌర్యహింసాసత్య, దంభకౌటిల్యాద్యధర్మచయము
పురముల గృహముల భూములఁ దమలోనఁ, గలుగుట దలపోసి కరిపురమున
మనుమని రాజవై మను మని దీవించి, సింధుతోయకణాభిషిక్తుఁ జేసి
యనిరుద్ధనందనుం డైనవజ్రునిఁ దెచ్చి, మథురఁ బట్టము గట్టి మమతఁ బాసి
ఆ. కరుల హరుల భటులఁ గంకణాదికముల, మంత్రిజనుల బుధుల మానవతుల
నఖిల మయినధనము నభిమన్యుసుతునకు, నప్పగించి బుద్ధి నాశ్రయించి. 384

1, 2 (*) ఇవి మూలానుసారముగాఁ జేర్పఁబడినవి. 3 సమ్యగ్భావంబున.

వ. విరక్తుండై ధర్మనందనుండు ప్రాజాపత్యం బనియెడి యిష్టిం గావించి యగ్నుల నాత్మారోపణంబు సేసి నిరహంకారుండును నిర్దళితాశేషబంధనుండును నై సకలేంద్రియంబుల మానసంబున నడంచి ప్రాణాధీనవృత్తి యగుమానసంబును బ్రాణమందును బ్రాణము నపానమందును నుత్సర్గసహితం బయినయపానము మృత్యువునందును మృత్యువును బంచభూతంబులకు నైక్యం బైనదేహంబునందును దేహమును గుణత్రయంబునందును గుణత్రయంబు నవిద్యయందును సర్వారోపహేతు వగునవిద్యను జీవునియందును జీవుం డయినతన్ను నవ్యయం బయినబ్రహ్మమందును లయింపఁజేసి బహిరంగవ్యాపారంబులు విడిచి నారచీరలు ధరియించి మౌనియు నిరాహారుండును ముక్తకేశుండును నై యున్మత్తపిశాచబధిరజడులచందంబున నిరపేక్షత్వంబున. 385

క. చిత్తంబున బ్రహ్మము నా, వృత్తముఁ గావించికొనుచు § విజ్ఞానధనా
యత్తులు దొల్లి వెలింగెడి, యుత్తరదిశ కేఁగె నిర్గ§తోద్యోగమునన్. 386

సీ. అంత నాతనితమ్ము § లనిలపుత్త్రాదులు, కలిరాకచేఁ బాప§కర్ము లగుచుఁ
జరియించు ప్రజలసం§చారంబు లీక్షించి, యఖిలధర్మంబుల § నాచరించి
వైకుంఠచరణాబ్జ§వర్తితహృదయు లై, తద్భక్తి నిర్మల§త్వమును జెంది
విషయయుక్తులకుఁ బ్ర§వేశింపఁగా రాక, నిర్ధూతకల్మష§నిపుణమతులు

తే. బహుళవిజ్ఞానదావాగ్ని§భసితకర్ము, లైన నేకాంతులకు [1]లక్ష్య § మై వెలుంగు
ముఖ్యనారాయణస్థాన§మునకుఁ జనిరి, విగతరజ మైనయాత్మల § విప్రముఖ్య.

వ. అంత విదురుండు ప్రభాసతీర్థంబున హరియందుఁ జిత్తంబు సేర్చి శరీరంబు విడిచి పితృవర్గంబుతోడ దండధరుం డగుటంజేసి నిజాధికారస్థానంబునకుం జనియె ద్రుపదరాజపుత్త్రియుఁ బతులవలన నుపేక్షిత యై జగత్పతి యైనవాసుదేవునందు జిత్తంబు సేర్చి తత్పదంబు సేరె నిట్లు. 388

క. పాండవులసంప్రయాణము, పాండురమతి నెవ్వఁ డైనఁ § బలికిన విన్నన్
ఖండితభవుఁ డై హరిదా, సుం డై కైవల్యపదము § సొచ్చు నరేంద్రా. 389

వ. అంత నట పరీక్షిత్కుమారుండు జాతకర్మవిదు లైనకోవిదులు సెప్పినచందంబున భూసురోత్తమశిక్షావశంబున మహాభాగవతశేఖరుం డై ధరణీపాలనంబు సేయుచు నుత్తరునిపుత్త్రిక నిరావతి యనుమత్తకాశినిం బెండ్లి యయి జనమేజయప్రముఖు లై ననలువురుకొడుకుల నుత్పాదించి గంగాపులినతలంబునం గృపాచార్యుండు గురుత్వంబు సేయ యాభాగంబులకు వచ్చినదేవతల నీక్షించుచు సదక్షిణంబుగా మూఁడశ్వమేధంబు లాచరించి దిగ్విజయకాలంబున గోమిథునంబుఁ దన్ను చున్నశూద్రరాజచిహ్నాముద్రితుం డగుకలిం బట్టి నిగ్రహించె నని చెప్పిన శౌనకుండు పౌరాణికున కిట్లనియె. 390

1. లభ్య § మై. 2. పాండవకృష్ణులయానము.

తంత్రపవిత్రమానసుం డై యుండె నయ్యెడ వృషభరూపంబున నేకపాదం
బున సంచరించుధర్మదేవుండు దనసమీపంబున లేఁగ లేని లేఁగటికుఱ్ఱిచందం
బున హతప్రభ యై నేత్రసలిలంబులు గురియుచు గోరూప యై యున్నధాత్రి
కి ట్లనియె. 395

మ. నయనాంభఃకణజాల మేల విడువన్ ♦ నాతల్లి నీమేను సా
మయ మై యుండదు మోము వాడినది నీకమ్మించుచుట్టాలకున్
భయదుఃఖంబులు నేఁడు వొందవు గదా ♦ బంధించి శూద్రుల్ పద
త్రయహీనున్ ననుఁ బట్ట వత్తు రనియో ♦ తాపంబు నీ కేటికిన్. 396

సీ. మఖములు లేమి నకమర్త్యుల కిటమీఁద, మఖభాగములు లేక ♦ మాను ననియొ
రమణులు రమణుల ♦ రక్షింప రనియొ తత్పుత్రులఁ దండ్రులు ♦ ప్రోవ రనియొ
భారతి కుజనులఁ ♦ బ్రాపించు ననియొ సద్విప్రులు నృపుల సేవింతు రనియొ
కులిశహస్తుఁడు వానకురియింపకుండఁగఁ, బ్రజలు దుఃఖంబులఁబడుదు రనియొ

ఆ. [1]హీనవంశజాతు ♦ లేలెద రనియొ రాజ్యములు పాడి గలిగి ♦ జరగ వనియొ
మనుజు లన్నపానమైథునశయనాస, నాదికర్మసక్తు ♦ లగుదు రనియొ. 397

మ. జననీ నీభర మెల్ల డించుటకు నై ♦ చక్రాయుధుం డిన్నిహా
యనముల్ దాను నరాకృతిన్ మెలఁగి నిత్యానందముం జేసి పో
యిన నే నింక ననాథ నైతిఁ గుజనుం ♦ డెవ్వాఁడు శాసించునో
పెనుదుఃఖంబులఁ బొందఁగంటి ననియో ♦ భీతిల్లి చింతించుటల్. 398

క. దెవ్వర మగుకాలముచే, నెప్పుడు దేవతల కైన ♦ నిష్టం బగునీ
యొప్పిదము కృష్ణుఁ డరిగినఁ, దప్పెఁ గదా తల్లి నీవు ♦ తల్లడపడఁగన్. 399

వ. అనిన భూదేవి యి ట్లనియె. 400

క. ఈలోకంబునఁ బూర్వము, నాలుగుపాదముల నీవు ♦ [2]నడతువు నేఁ డా
శ్రీలలనేశుఁడు లేమిని, గాలముచే నీకు నొంటికా లయ్యెఁ గదే. 401

వ. మఱియు సత్యశౌచదయాక్షమంబులును సంతోషత్యాగశమదమార్జవంబు
లును దపంబును సమత్వంబును బరాపరాధసహనంబును లాభంబు గలయెడ
నుదాసీనుం డై యుండుటయును శాస్త్రవిచారవిజ్ఞానవిరక్తులును నైశ్వర్యశౌ
ర్యప్రభావదక్షత్వంబులును స్మృతియును స్వాతంత్ర్యంబును గౌశలకాంతిధైర్య
మార్దవప్రతిభాతిశయప్రశ్రయశీలంబులును జ్ఞానేంద్రియకర్మేంద్రియమనోబలం
బులును సౌభాగ్యగాంభీర్యస్థైర్యంబులును శ్రద్ధాకీర్తిమానగర్వాభావంబులును
ననియెడి ముప్పదితొమ్మిదిగుణంబులు నవియునుం గాక బ్రహ్మణ్యతాశరణ్యతాది
మహాగుణసమూహంబును శ్రీకృష్ణదేవునియందు వర్తిల్లుం గావున. 402

1 హీనవశుష్య లింక. 2 నడువఁగ నకటా.

క. గణనాతీతము లగుస,ద్గుణములు గలచక్రి సనిన - ఘోరకలిప్రే
రణమునఁ బాపసమూహ,ప్రణయుతు లగుజనులఁ జూచి - వగచెదఁ దండ్రీ.

క. దేవతలకు ఋషులకుఁ బితృ, దేవతలకు నాకు నీకు - ధీరులకును నా
నావర్ణాశ్రమములకును, గోవులకును బాధ యనుచుఁ - గుందెద ననఘా. 404

సీ. బ్రహ్మాదు లెవ్వని - భద్రకటాక్షవీ, క్షణము వాంఛింతురు - సత్తపములఁ
గమలాలయము మాని - కమల యెవ్వనిపాద,కమలంబు సేవించుఁ - గౌతుకమున
బరమయోగీంద్రులు - భవ్యచిత్తములందు, నిలుపుదు రెవ్వని - నియతితోడ
వేదంబు లెవ్వని - విమలచారిత్రముల్, వినుతింపఁగా లేక - వెగడువడియె

ఆ. నట్టివాసుదేవు - నబ్జవజ్రాంకుశ,చక్రమీనశంఖ - చాపకేతు
చిహ్నితంబు లైన - శ్రీచరణము లింకఁ, జోఁక వనుచు వగపు - సోఁకె నయ్య.

క. హరిపాదంబులు సోఁకెడి, సిరికతమున నిఖిలభువన - సేవ్యత్వముతో
స్థిర నైతి నిన్నిదినములు, హరి నాగర్వంబు మాన్ప - నరిగె మహాత్మా. 406

క. లీలాకారము దాల్చెను, శ్రీలలనేశుండు ఖలుల - శిక్షించి భవో
న్మూలనము సేయుకొఱకును, నాలుగుపాదముల నన్ను - నడపించుటకున్. 407

ఉ. ఆమధురోక్తు లానయము - లాదరహాసము లాదయారసం
బామురిపెంబు లాతగవు - లాగమనక్రియ లామనోహర
ప్రేమకరావలోకనముఁ - బ్రీతిఁ గనుంగొన లేమి మాధవుం
గామిను లేల నిర్దళిత - కర్ములు యోగులుఁ బాయ నేర్తురే. 408

క. మెల్లన నాపై యాదవ, వల్లభుఁ డడుగిడఁగ మోహ - వశ నై నేరం
జిల్లఁగ రోమాంచము క్రియ, మొల్లము లై మొలచు సస్య - ములు మార్గములన్.

వ. అని యిట్లు పూర్వవాహిని యైనసరస్వతీతీరంబున ధర్మదేవుండును భూమియు వృషభధేనురూపంబుల భాషింప రాజర్షి యైనపరీక్షిద్భూవరుండు డగ్గఱియె నాసమయంబున. 410

కలిపురుషుఁడు ధర్మదేవతను దన్నుట.

శా. కైలాసాచలసన్నిభం బగుమహా - గంభీరగోరాజముం
గాలక్రోధుఁడు దండహస్తుఁడు నృపా - కారుండు క్రూరుండు జం
ఘాలుం డొక్కఁడు శూద్రుఁ డాసురగతిం - గారుణ్యనిర్ముక్తుఁ డై
నేలం గూలఁగఁ దన్నెఁ బంచితిలఁగా - నిర్ఘాతపాదాహతిన్. 411

వ. మఱియును. 412

శా. ఆలోలాంగక నశ్రుతోయకణికా - నాక్షీణ మహాంభారవన్
బాలారూఢతృణావళీకబళలో - భవ్యాప్తజిహ్వాగ్ర నాం
దోళస్వాంత నజీవవత్స నుదయ - ద్దుఃఖాన్వితన్ ఘర్మకీ
లాలాపూర్ణశరీర నామొదవు న - ల్లంఘించి తన్నెన్ వడిన్. 413

వ. ఇట్లు ధేనువృషభంబుల రెంటినిం గంటకుండై తన్నుచున్నరాజలక్షణముద్రితుం డయినశూద్రునిం జూచి సువర్ణపరికరస్యందనారూఢుం డగునభిమన్యునందనుండు గోదండంబు సగుణంబు సేసి మేఘగంభీరరవంబు లగువచనంబుల ని ట్లనియె. 414

శా. నిన్నుం గొమ్ములఁ జిమ్మెనో కదిసెనో నిర్భీతి వై గోవులం
దన్నం గారణ మేమి మద్భుజసనాథక్షోణి నే వేళలం
దు న్నేరంబులు సేయ రా దెఱుఁగవా ధూర్తత్వమున్ భూమిభృ
త్సన్నాహంబు నొనర్చె దెవ్వఁడవు నిన్ శాసించెదన్ దుర్మతీ. 415

క. గాండీవియుఁ జక్రియు భూ, మండలిఁ బెడఁబాసి చనిన మదమత్తుఁడ వై
దండింపఁ దగనివారల, దండించెదు నీవ తగుదు దండనమునకున్. 416

వ. అని వృషభంబు నుద్దేశించి యి ట్లనియె. 417

మ. కురుధాత్రీశ్వరబాహువప్రయుగళీగుప్తక్షమామండలిం
బరికింపన్ భవదీయనేత్రజనితాంభశ్శ్రేణి దక్కన్ జనుల్
దొరఁగం [1]జేయ రధర్మసంజనితజంతుశ్రేణిబాష్పంబులన్
గురుశక్తిన్ విదళింతుఁ జూడు మితనిన్ గోమూర్తిదేవోత్తమా. 418

క. జాలిఁ బడ నేల నాశర, జాలంబులపాలు సేసి చంపెద వీనిన్
భూలోకంబున నిపు డే, నాలుగుపాదముల నిన్ను నడపింతుఁ జుమీ. 419

ఉ. వాచవి యైనగడ్డిఁ దిని వాహినులందు జలంబు ద్రావఁ గా
నీచరణంబు లెవ్వఁ డిటు నిర్దళితంబుగఁ జేసె వాఁడు దా
ఖేచరుఁ డైన వాని మణికీలితభూషణయుక్తబాహులన్
వే చని త్రుంచి వైతు వినువీదికి నేఁగిన నేల డాఁగినన్. 420

వ. అని మఱియు గోమూర్తి యయినభూదేవితో ని ట్లనియె. 421

చ. అగణితవైభవుం డగుమురాంతకుఁ డక్కట పోయె నంచు నె
వ్వగలఁ [2]గృశించి నేత్రముల వారికణంబులు దేకు మమ్మ లో
బెగడకుమమ్మ మద్విశిఖబృందములన్ వృషలున్ వధింతు నా
మగఁటిమిఁ జూడవమ్మ వెఱ మానఁ గదమ్మ శుభప్రదాయినీ. 422

క. సాధువు లగుజంతువులకు, బాధలు గావించుఖలుల భంజింపనిరా
బాధమునాయుస్స్వర్గ, శ్రీధనములు వీటిఁ బోవు సిద్ధము తల్లీ. 423

క. దుష్టజననిగ్రహంబును, శిష్టజనానుగ్రహంబుఁ జేయఁగ నృపులన్
స్రష్ట విధించెఁ బురాణ, ద్రష్టలు సెప్పుదురు పరమధర్మము సాధ్వీ. 424

వ. అనిన ధర్మనందనపౌత్రునకు వృషభమూర్తి నున్నధర్మదేవుం డి ట్లనియె. 425

---

1 జూడ ర. 2 నశించి.

ఉ. క్రూరులఁ జంపి సాధువుల। కుర్ర విజయం బొనరించునట్టి యా
పౌరవవంశజాతుఁడవు। భాగ్యసమేతుఁడ వౌదు తొల్లి మీ
వా రిటువంటివా రగుట। వారిజనేత్రుఁడు మెచ్చి దౌత్యసం
చారము సేసెఁ గాదె నృపస త్తమ భక్తిలతానిబద్ధుఁ డై. 426

వ. నరేంద్రా యేము ప్రాణులకు దుఃఖహేతువులము గాము మావలన దుఃఖంబు నొందెడుపురుషుండు లేఁడు వాదివాక్యభేదంబులఁ [1]గొందఱు మోహితు లై భేదంబు నాచ్ఛాదించి తమకు నాత్మసుఖదుఃఖంబుల నిచ్చుప్రభువని చెప్పుదురు [2]గొందఱు గ్రహదేవతాదులకుఁ బ్రభుత్వంబు సంపాదింతురు [3]గొందఱు గర్మంబునకుం బ్రాభవంబుం బ్రకటింతురు [4]గొందఱు స్వభావంబు ప్రభు వని పలుకుదు రిం దెవ్వరికిని సుఖదుఃఖప్రదానంబు సేయఁ బ్రభుత్వంబు లేదు పరులవలన దుఃఖంబు వచ్చిన నధర్మంబు పరులు సేసి రని విచారింప వలదు తర్కింపను నిర్దేశింపను రానిపరమేశ్వరునివలన సర్వంబు నగుచుండు ననిన ధర్మదేవునికి ధర్మనందనపౌత్రుం డి ట్లనియె. 427

ఆ. ధర్మమూర్తి వయ్య। ధర్మజ వృషరూప, పరమధర్మ మీవు। పలుకుత్రోవ
పాపకర్మచేయు। పాపం[5]బు సూచింపఁ, బాపకర్ముఁ డేఁగు। పథము వచ్చు. 428

వ. మఱియు దేవమాయవలన భూతంబులవాఙ్మనసంబులకు వధ్యఘాతుకలక్షణా వృత్తి సులభంబుగం దెలియ రాదు నీవు ధర్మదేవతవు కృతయుగంబునం దప శ్శౌచదయాసత్యంబు లనునాలుగు నీకుం బాదంబు లని చెప్పుదురు [6](*త్రేతాయుగంబునం బూర్వోక్తపాదచతుష్కంబునం దొక్కపాదంబు క్షీణం బయ్యె ద్వాపరంబునఁ బాదద్వయంబు నశించెఁ గలియుగంబందు నివ్వడువున) నిప్పుడు నీకుఁ బాదత్రయంబు భగ్నం బయ్యె నవశిష్టం బగుభవదీయచతుర్థపాదంబు నధర్మంబు గల్యంతంబునని గ్రహింపగమకించుచున్నయది విను మదియునుంగాక.

మ. భరముం బాపి రమావిభుండు గరుణం। బాదంబులం ద్రొక్కఁగా
స్థిర యై వేడుక నింతకాలము సుఖ। శ్రీ నొందె భూదేవి త
చ్చరణస్పర్శము లేమి శూద్రకులజుల్। శాసింతు రంచు౯ నిరం
తరశోకంబున నీరు గన్నుల నిడె౯। ధర్మజ్ఞ వీక్షించితే. 430

పరీక్షిన్మహారాజు గలిని నిగ్రహించి ధర్మపరిపాలనము సేయుట.

వ. అని యిట్లు ధరణీధర్మదేవతల బుజ్జగించి మహారథుం డయినవిజయపౌత్రుండు క్రోధాకారు మెఱుంగు తెఱంగు ధిక్కరించుచు దిక్కులకు వెక్కసం బయినయడిదంబు బెడిదంబుగ జడిపించి పాపహేతు వయినకలిరూపు మాప నుద్యోగించిన వాఁడు రాజరూపంబు విడనాడి వాడినమొగంబుతోడ భయవిహ్వలుం

---

[1] 'యోగీశ్వరులు' అచ్చుప్రతి. [2] 'దైవజ్ఞులు' అ. ప్ర. [3] 'మీమాంసకులు' అ. ప్ర.
[4] 'లోకాయతికులు' అ. ప్ర. [5] బుపేక్షింప. [6] (*) ఇది పండితులు గూర్చినది.

దేహుని దేహేంద్రియంబు గేహంబు యూపప్రముఖయజ్ఞోపకరణంబు లగు తరుగుల్మలతాదులకుఁ బురుషోత్తముని రోమంబులు మూలంబులు శిలాలోహంబులు సర్వమయుని నఖంబులు మేఘజాలంబులు హృషీకేశుని కేశంబులు మెఱుంగులు విశ్వేశ్వరుని శ్మశ్రువులు భూర్భువస్సువర్లోకరక్షకు లైన లోకపాలకుల పరాక్రమంబులకు (భూరాదిలోకంబుల క్షేమంబునకు శరణంబునకు) నారాయణుని విక్రమంబు నికేతనంబు సర్వకామంబులకు నుత్తమంబు [1]లైన వరంబులకుఁ దీర్ఘపాదుని పాదారవిందంబు లాస్పదంబులు జలంబులకు శుక్లంబునకుఁ బర్జన్యునకుఁ బ్రజాపతిసర్గంబునకు సర్వేశ్వరుని మేఢ్రంబు సంభవనిలయంబు [2]సంతానంబునకుఁ గామాదిపురుషార్థంబులకుఁ జిత్తసౌఖ్యరూపంబు లగు నానందంబులకు శరీరసౌఖ్యంబునకు నచ్యుతుని యుపస్థేంద్రియంబు స్థానంబు యమునికి మిత్రునికి మలవిసర్గంబునకు భగవంతుని పాయ్వింద్రియంబు భవనంబు హింసకు నిరృతికి మృత్యువునకు నిరయంబునకు నిఖిలరూపకుని గుదంబు నివాసంబు పరాభవంబునకు నధర్మంబునకు నవిద్యకు నంధకారంబునకు ననంతుని పశ్చిమభాగంబు సదనంబు సదనదీనివహంబునకు నీశ్వరుని నాడీసందోహంబు జన్మమందిరంబు పర్వతంబులకు నధోక్షజుని శల్యంబులు జనకస్థలంబులు [3]ప్రధానంబునకు నన్నరసంబునకు సముద్రంబులకు భూతనిధనంబునకు బ్రహ్మాండగర్భుని యుదరంబు నివేశంబు మనోవ్యాపార[4]రూపం బగు లింగశరీరంబునకు మహామహిముని హృదయంబు సర్గభూమి యగు మఱియును. 89

ఆ. నీలకంధరునకు । నీకు నాకు సనత్కు-, మారముఖ్యసుతస । మాజమునకు
ధర్మసత్త్వబుద్ధి । తత్త్వములకు నీశ్వ-, రాత్మ వినుము పరమ । మైన నెలవు. 90

సీ. నరసురాసురపితృ । నాగకుంజరమృగ-, గంధర్వయక్షరా । క్షసమహీజ
సిద్ధవిద్యాధర । జీమూతచారణ-, గ్రహతారకాప్సరో । గణవిహంగ
భూతతటిద్వసు । పుంజంబులును నీవు, ముక్కంటియును మహా । మునులు నేను
సలిలనభస్స్థల । చరములు మొదలైన, వివిధజీవులతోడి । విశ్వ మెల్ల
ఆ. విష్ణుమయము పుత్ర । వే వేల బ్రహ్మాండ, మతని జేనలోన । నడఁగి యుండు
బుద్ధి నెఱుఁగ రాదు । భూతభవద్భవ్య-, లోక మెల్ల విష్ణు । లోన నుండు. 91

క. [5]ఏకోనాకకర్తఫల, ప్రాదుర్భావ మగు లోక । పాలనకే కా
కా దేవుం డభయప్రతి-, పాదక మగు మోక్షమునకుఁ । బతి యె ట్లన్నన్. 92

1. లైనపదంబులకు. 2. 'ప్రజాసుఖోపశమనంబులకు నచ్యుతుని గుహ్యేంద్రియంబు స్థానంబు' అనియే వ్రాఁతప్రతులు. 3. ప్రధానద్రవ్యసముద్రంబులకు. 4. 'రూపంబులకు మహా' అనియే వ్రా.ప్ర. 5. ఈయధిక పాఠము మూలమున 'సోఽమృతస్యాభయస్య' అనుట మొదలుకొని, 'పురుషస్తూభయాశ్రయః' అనువఱకుఁ గల నాలుగుశ్లోకములకును వానికి శ్రీధరులు రచించిన వ్యాఖ్యానమునకును దెనుఁగై యీఘట్టమున నుండవలసినదియే. అయిన నిది పెక్కు వ్రాఁతప్రతులను నచ్చుప్రతులను గానరాదు.

వ. వినుము పరమాత్ముయు నానందేశ్వరుం డగునవ్విష్ణునకుఁ బ్రపంచమాత్రాధిక
త్వం బేమి యద్భుత మట్లగుటంజేసి యతనిమహిమాతిశయం బస్మదాదులు
నెఱుంగనేర్తురె స్థిత్యర్థపాదుం డగునీశ్వరునిపాదాంశంబులందు భూభువస్స్వ
ర్లోకంబులు గుదురుకొనియుండుఁ దదీయవిలయసమయంబునం దదుపరిమహర్లో
కంబు దపియింప నందుఁ గలజనంబు లంతరాళంబు నందక మహర్లోకశిరఃస్థానం
బైనజనలోకంబుఁ బ్రవేశించి యత్యంతం బగునవినాశిసుఖంబు లనుభవింతురు
తపోలోకంబు సంకర్షణానలశక్తిచేత నధస్త్రిలోకంబులుం దందహ్యమానంబు
లగునప్పుడు తదూష్మలం బెందక విలక్షణం బైన క్షేమంబు గలిమిఁ దజ్జనం బంద
సుఖించు జన్మజరామరణభయంబులు లేక ముక్తికిఁ బ్రత్యాసన్ను లగుటంజేసి
సత్యలోకపువాసు లంద యానందింతురు భూభువస్స్వర్లోకంబు లవ్విరాట్పురు
షునిపదస్థలం బగుట నేకపాద్విభూతి యయ్యె మహర్లోకంబు మధ్యమవిభూతి
యన నమరె జనతపోసత్యలోకంబు లమ్మహాపురుషునిశిరఃస్థానంబు గావున నది
త్రిపాద్విభూతి యనంబడుఁ దదీయలోకంబు బ్రహ్మచర్యవానప్రస్థయతులకుం
దక్క నితరుల కసాధ్యంబు గృహస్థు లయ్యు నితరత్రివిధాశ్రమధర్మంబులు గలి
గినం జేకుఱు క్షేత్రజ్ఞుం డైనపురుషుండు స్వర్గాపవర్గహేతుభూతం బైనదక్షి
ణోత్తరకర్మజ్ఞానమార్గంబులు సృజించి యంతయుఁ దాన యై యుండు. 93

క. మండలములోన భాస్కరుఁ, డుండి జగంబులకు దీప్తిఁ నొసఁగెడిక్రియ బ్ర
హ్మాండములోపల నచ్యుతుఁ, డుండుచు [1]బహిరంతరములఁ నొగి వెలిఁగించున్.

-ఇది మొదలుకొని వెలిగందల నారయకవిత్వము.-

ఉ. అట్టియనంతశక్తి జగఁదాత్మునినాభిసరోజమందు నేఁ
బుట్టి యజింపఁగా మనసు ఁ పుట్టిన యజ్ఞపదార్థజాతముల్
నెట్టన కాన రామికి విఁనిర్మల మైనతదీయరూపముం
గట్టిగ బుద్ధిలో నిలిపి ఁ కంటి నుపాయము నామనంబునన్. 95

సీ. పశుయజ్ఞవాటయూపస్తంభపాత్రమృ, ద్ఘటశరావవసంతకాలములును
స్నేహౌషధీబహులోహచాతుర్హోత్ర, మతనామధేయసఁస్మంత్రములును
సంకల్పఋగ్యజుఁస్సామనియుక్తవ, షట్కారమంత్రానుఁచరణములును

ఒకానొకవ్రాఁతప్రతియందే చూపట్టుచున్నది. మఱియుఁ బోతన మూలమును శ్రీధరవ్యాఖ్యాన సహితముగాఁ దెనిఁగించినవాఁడు. కనుకఁ గ్రిందినాలుగుశ్లోకములు పోతనకు లభించినమూలమున లే కుండవచ్చు నని తలఁచినను వానివ్యాఖ్యానమునందైనను దప్పక కనుపట్టియుండును గాన వానిని దెనిఁ గింపకుం[illegible]ు. అయిన నీతెనిఁగింపు పోతనవానియంతసమంజసముగను బ్రౌఢముగను గాకున్నది. వెలి గందల న[illegible]యకవిత్వ మాసన్నముగా నుంటచే నీభాగమును గొంత యుత్పన్నమై యుండు ననియుఁ గావున నారయకవిత్వ మిందును గొంత చేరియుండు ననియుఁ గనుక నే యిది పోతనరచనవలె సమంజ సమును బ్రౌఢమును గాదయ్యె ననియు నూహింపఁదగి యున్నది.

1. నావరణపటలి ♦ కొసఁగును దీప్తిన్.

దక్షిణల్ దేవతాధ్యానతదనుగత, తంత్ర వ్రతోద్దేశ ధరణిసురులు
తే. సర్వణంబులు బోధాయనాదికర్త్ర
సరణి మొదలగుయజ్ఞపరికరణసమితి
యంతయును సమ్మహాత్మునియవయవములు
గాఁగఁ గల్పించె విధవత్ప్రకారమునను. 96

క. యజ్ఞాంగి యజ్ఞఫలదుఁడు, యజ్ఞేశుఁడు యజ్ఞకర్త యగుభగవంతున్
యజ్ఞపురుషుఁగా నారసి, యజ్ఞముఁ గావించితిని సద్దర్పణబుద్ధిన్. 97

క. అప్పుడు బ్రహ్మలు దమలోఁ, దప్పక నన్నుఁ జూచి సముచితక్రియ [1]లగుచు
న్నప్పరమేశున కభిమత, మొప్పఁగఁ దగునస్తుతితంతువులు గావింపన్. 98

చ. మనువులు దేవదానవులు మానవనాథులు మర్త్యకోటి [2]దా
రనయము వారివారికిఁ బ్రియం బగుదేవతలన్ గుఱించుచున్
ఘన మగునిష్ఠ యజ్ఞములఁ గైకొని చేసిరి తత్ఫలంబు ల
య్యనుపమమూర్తి యజ్ఞమయుఁ డైనరమావరునందుఁ జెందఁగన్. 99

క. సువ్యక్త[3]తంత్రరూపకుఁ, డవ్యక్తుఁ డనంతుఁ డభవుఁ డాఢ్యుం డీశుం
డవ్యయుఁ డగుహరి సురగణ, సేవ్యుఁడు క్రతుఫలదుఁ డగుటఁ జేసిరి మఖముల్.

క. అగుణుం డగుపరమేశుఁడు, జగములఁ గల్పించుకొఱకుఁ జతురత మాయా
సగుణుం డగుఁ గావున హరి, భగవంతుం డనఁగఁ బరఁగె భవ్యచరిత్రా. 101

క. విశ్వాత్ముఁడు విశ్వేశుఁడు, విశ్వమయుం డఖిలనేత విష్ణుం డజుం డీ
విశ్వములోఁ దా నుండును, విశ్వము దనలోనఁ జాల వెలుఁగుచు నుండున్. 102

చ. అతనినియుక్తిఁ జేసి సచరాచరభూతసమేతసృష్టి నే
వితతముగా సృజింతుఁ బ్రభవిష్ణుఁడు విష్ణుఁడు ప్రోచుఁ బార్వతీ
పతి లయ మొందఁ జేయు హరి పంకరుహోదరుఁ డాదిమూర్తి య
చ్యుతుఁడు త్రిశక్తియుక్తుఁ డగు[4]చుండును నింతకుఁ దాన మూల మై. 103

క. విను వత్స నీవు నన్నడి, గినప్రశ్నకు నుత్తరంబు కేవలపరమం
బును బ్రహ్మం బీయఖిలం, బున కగు నాధారహేతుభూతము సుమ్మా. 104

క. హరి భగవంతుఁ డనంతుఁడు, గుణాంబుధి సృష్టికార్యకారణహేతు
స్ఫురణుం డవ్విభుకంటెం, బరుఁ డన్యుఁడు లేఁడు తండ్రి పరికింపంగన్. 105

సీ. ఇది యంతయును నిక్కమే పొంక నుత్కంఠ, మతిఁ దద్గుణధ్యానమహిమఁ జేసి
పరికింప నేనెందుఁ బలికిన యది యెల్ల, సత్యంబ యగు బుధస్తుత్య! [illegible]ము
ధీయుక్తమామకేంద్రియములు మఱచియుఁ, బొరయ వసత్పథస్ఫురణ లెందు
నది గాక మత్తను వామ్నాయతుల్యంబు, నమరేంద్రవందనీయం బైనయ్యోఁ

1 'లగుచు, న్నప్పరమేశు' అనియే వ్రా. ప్ర. 2 'యుఁ, అనయము' వ్రా. ప్ర. 3 మంత్రరూప. 4 చున్నతఁ డింతకు.

బులునుం బొడమెఁ బంచతన్మాత్రంబువలన గగనానిలవహ్నిసలిలధరాదికంబైన భూతపంచకంబు గలిగె నందు జ్ఞానేంద్రియంబు లయినత్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులును గర్మేంద్రియంబు లైనవాక్పాణిపాదపాయూపస్థంబులును మనంబును జనియించె నన్నింటిసంఘాతంబున విశ్వరూపుం డయినవిరాట్పురుషుండు పుట్టె నతనివలన స్వయంప్రకాశుం డైనస్వరాట్టు సంభవించె నందుఁ జరాచరరూపంబుల స్థావరజంగమాత్మకం బయినజగత్తు గలిగె నందు సత్త్వరజస్తమోగుణాత్మకుల మయినవిష్ణుండును హిరణ్యగర్భుండ నయిననేనును రుద్రుండునుం గలిగితి మందు సృష్టిజననకారణుం డయినచతుర్ముఖుండు పుట్టె వానివలన దక్షాదు లగుప్రజాపతులు దొమ్మండ్రు గలిగి రందు [1]భగవత్ప్రియముఖు లైనసనకసనందనాదియోగీంద్రులును నాకలోకనివాసు లయినవాసవాదులును (ఖగలోకపాలకు లగుగరుడాదులును నృలోకపాలకు లగుమనుమాంధాతృప్రముఖులును దలలోకపాలకు లగుననంతవాసుకిప్రభృతులును) గంధర్వసిద్ధవిద్యాధరచారణసాధ్యరక్షోయక్షోరగనాగలోకపాలురును మఱియు ఋషులును పితృదేవతలును దైత్యదానవభూతప్రేతపిశాచకూశ్మాండపశుమృగాదులును నుద్భవించి రిట్టిజగత్ప్రథమోద్భవంబు మహత్తత్త్వసృష్టియును ద్వితీయంబు బ్రహ్మాండసంస్థితంబును దృతీయంబు సర్వభూతజననంబును గలిగియుండు నంత మహదైశ్వర్యతేజోబలసంపన్ను లైనపురుషులు సర్వేశ్వరుం డైననారాయణునికళాంశసంభవులుగా నెఱుంగు మప్పుండరీకాక్షునిలీలావతారంబు లనంతంబులు సత్కర్మంబులు లెక్కవెట్ట నెవ్వరికి నలవి గాదు అయినను నాకుం గోచరించినంత సంక్షేపించి చెప్పెద వినుము.

శ్రీమన్నారాయణునిలీలావతారంబుల యుపవర్ణనము.

ఉ. అన్యకథానులాపము లహర్నిశముం వినునట్టిదుష్క్రియాపరా
శూన్యము లైనకర్ణముల సూరిజనస్తుత సర్వలోకస
మ్మాన్యము నై తనర్చుహరిమంగళదివ్యకథామృతంబు సౌ
జన్యతఁ గ్రోల నయ్యె బుధసత్తమ నీవు వివరించి చెప్పఁగన్. 115

వ. అని పలికి మఱియు నిట్లనియె. 116

మ. కనకాక్షుండు భుజావిజృంభణమునన్ క్షోణీచక్రముం జాపఁ జు
ట్టినమాడ్కిం గొని పోవ యజ్ఞమయ[2]దంష్ట్రిస్వాకృతిం దాల్చి య
ద్దనుజాధీశ్వరుఁ దాఁకి యుద్ధమునఁ దంష్ట్రాహతిం ద్రుంప ధా
త్రిని నూలెం గులిశాహతిం బడుమహాద్రిం బోలె యత్యుగ్రతన్. 117

వ. మఱియు సుయజ్ఞావతారంబు విను మని యిట్లనియె. 118

సీ. ప్రకటరుచిం బ్రజాపతికిని స్వాయంభువునికూఁతు రాకూతి యనులతాంగి
కర్థి జన్మించి సురయజ్ఞుండు నా నొప్పు, నతఁడు దక్షిణ యనునంగనయందు

1. 'భగవదీయముఖు లైన' వ్రా. ప్ర. 2. 'దంష్ట్రిరూపముఁ' వ్రా. ప్ర.

హైహయ యదువంశులైరి హాకా ముష్టికేషలరూప

మగు యోగ బలము వడసి.

తే. సంచిత జ్ఞాన ఫలసుఖైశ్వర్యశక్తి, శౌర్యములఁ

బొంది తమకీర్తి నదల వెలుఁగ

నిందు నందును వాసికి నెక్కి రట్టి, దివ్యతరమూర్తి

విష్ణు నుతింపఁ దరమె.

వ. వెండియు సనకాద వతారంబు వినుము.

సీ. అనఘాత్ముఁడయ్యేను గల్పాదిని విశ్వంబు సృష్టియుయఁ

దలంచి యుల్లసిత తపంబు

నర్థిఁ జేయుచు సనయున్ బల్ల బయము

నడి కారణంబుగ సన్నాఖ్యలను గల స

నందన సనక సనత్కుమార సనత్సుజాతులు

నల్వురు సంభవించి

మానవ పుత్రులై మహీనుతి కెక్కిరి పోయిన కల్పాం

తమున నగించి

తే. నర్థి యూత్మీయతత్త్వంబు పుట్టఁజేసి,

సంప్రదాయక భంగిని జగతి నెల్లఁ

గలుగఁ జేసిరి యువిష్ణు కళలఁ ధరి,

నలువు రయుత్వను నొక్కడ నమ చరిత్ర.

వ. మఱియును నరనారాయణావ తరంబు వినుము.

క. గణుతింపఁగ నరనారా, యణులను ధర్మునకు నుదయమందిరి దాక్షా
యణి యైన మూర్తివలనం, బ్రణుతగుణోత్తరులు పరమపావనమూర్తుల్.

క. అనఘులు బదరీవనమున, ఘనత తపోవృత్తినుండ విబుధాధిపుఁడున్
మనమున నిజపదహానికి, ఘనముగఁ జింతించి దివిజకాంతామణులన్.

క. రావించి తపోవిఘ్నముఁ, గావింపుండనుచు బనుపఁ గడువేడుకతో
భావభవానీకినులనఁ, గాపరలు సరి బదరికావనమునకున్.

వ. అందు

మ. నరనారాయణులున్న చోటికి మరున్నారీ సమూహంబు భా
సురలీలం జని రూప విభ్రమకళా చాతుర్యమే పారఁగాఁ
బరిహాసోక్తుల నాటపాటలఁ జరింపం జూచి నిశ్చింతతన్
స్థిరత ధ్యానతపః ప్రభావరతిం బాటించి నిష్ఠాత్ములై.

క. క్రోధము దమ తపములకును, బాధకమగు నెఱిఁగి దివిజభామలకైన
మేధాత్మకు తాక మింతయుఁ గ్రోధముఁ దారైరి సత్యగుణసంగతులై.

క. నారాయణుఁ డప్పుడప్పురుడు దన, యూరువు వెసఁ జీరఁ బొడయించెను వెం
పారంగ నూర్వశీముఖ, నారీజనకోటి దివిజనారులు మెచ్చన్.

క. ఊరువులందు జనించిన, కారణమున నూర్వశియను ఘనతకునెక్కెన్
వారల [illegible] రూపవిలాసవి,భవములకు నోడిరంతన మరీజనముల్.

వ. అంతం దాము నరనారాయణుల తపోవిఘ్నంబు గావింపం బూని
చేయు విలాసంబులు మానసిక సంకల్ప మాత్రంబున సృష్టిస్థితి
సంహారంబులకొనర్పం జాలు నమ్మహాత్ముల దెసం బనికి రాక కృతఘ్న

నకుం జేయునుపకృతులం బోలె నిష్ఫలంబులైన సిగ్గునం
గుందుచు మార్కండ్ఠిం దమకు ముఖ్యరాలింగాఁ గైకొని తమ
వచ్చిన జాడన మరలి చని రంత.

క. కాముని దహించెఁ గ్రోధము, హోమహిమను రుద్రుఁడట్టి
యతి కోపము నా
ధీమంతులు గెలిచి రనఁ, గామము గెలుచుటలు సెప్పఁగా
నేమిటికిన్.

వ. అట్టి నరనారాయణావతారంబు జగత్పావనంబై విలసిల్లె వెండియు
ధ్రువావతారంబు వివరించెద వినుము.

సీ. మానితచరితుఁ డుత్తాన పాదుండను
భూవరేణ్యునకు సత్పుత్రుఁడనఁగ
నుదయించి మహిమఁ బెంపొంది రాజ్యంబున
జనకునికడ నుండి సవతి తల్లి
యను నాడు వాక్యాస్త్రహతిఁ గుంది మహిత
తపంబు గావించి కామంబు గోడఁ
జనిమింట ధ్రువపదస్థాయి యై యు
మ యటమీఁద నర్థి వర్తించు భర్గాదిమునులు.

తే. జతురగతిఁ గ్రింద వర్తించు సప్తఋషులు
చెంపు దీపింపఁ దన్ను నుతింప వెలసి
ధ్రువుడు నానాప్తి యవిక్షుతు తుల్యుఁడగుచు
నున్న పుణ్యాత్ముఁ డిప్పుడు నున్నవాడు

వ. మఱియును బృథుని యవతారంబు వినుము.

ఉ. వేనుఁడు విప్రభాషణవ విప్రహతిచ్యుతి భాగ్యపౌరుషుం
డై నిరయంబునం బడిన నాత్మతనూభవుఁడై పృథుండు నాఁ

బూని జనించి తజ్జనకుఁ బున్నరకంబును గాపి మేదినిన్
ధేనువుఁ జేసి వస్తువితతిం బిదికెన్ హరి సత్కళాంశుఁడై. 140

వ. అని మఱియు వృషభావతారంబు నెఱింగింతు విను మాగ్నీధ్రున[1]కు డనువానికి సుదేవివలన నాభి యనువాఁ డుదయించె నతనికి మేరుదేవియందు హరి వృషభావతారంబు నొంది జడస్వభావం బైన యోగంబు దాల్చి ప్రశాంతాంతఃకరణుండును బరిముక్తసంగుండును నై పరమహంసాభిగమ్యం బగుపదం బిది యని మహాత్ములు వలుకుచుండం జరించె మఱియు హయగ్రీవావతారంబు సెప్పెద వినుము. 141

చ. అనఘచరిత్ర మన్మఖమునందు జనించె హయాననాఖ్యతన్
వినుతసువర్ణవర్ణుఁడును వేదమయుండు నఖిలాంతరాత్మకుం
డనుపమయజ్ఞపూరుషుఁడు నైన భగవంతుఁడు తత్సమస్తపా
వన మగునాసికాశ్వసనవర్గములం దుదయించె వేదముల్. 142

వ. మఱియు మత్స్యావతారంబు వినుము. 143

సీ. ఘనుఁడు వైవస్వతమనువుకు దృష్టమై, యరుదెంచినట్టి యుగాంత[2]సమయ
మందు విచిత్రమత్స్యావతారము దాల్చి, యఖిలావనీమయం బగుచుఁ జాల
సర్వజీవులకు నాశ్రయభూతుఁ డగుచు నే, కార్ణవం బైన తోయమునడుమ
మన్ముఖశ్లథవేదమార్గంబులను జిక్కు, వడకుండ శాఖ లేర్పడఁగఁ జేసి

తే. దివ్యు లర్థింప నా కర్థిఁ దెచ్చి యిచ్చి, మనువు నెక్కించుకొని పెన్నావ వనధినడుమ
మునుఁగకుండంగ నరసిన యనిమిషావ, తార మేరికి నుతియింపఁ దరమె వత్స.

వ. మఱియుఁ గూర్మావతారంబు వినుము, 145

మ. అమృతోత్పాదనయత్నులై విబుధదైత్యానీకముల్ మందరా
గముఁ గవ్వంబుగఁ జేసి యబ్ధి దరువంగాఁ గవ్వపుంగొండ వా
ర్ధి మునుంగన్ హరి కూర్మరూపమున నర్థిం దాల్చెఁ దత్పర్వత
భ్రమణవ్యాజత వీఁపుఁదీఁట శమియింపం జేయఁగా నారదా. 146

వ. వెండియు నృసింహావతారంబు వినుము. 147

మ. సురలోకంబుఁ గలంచి దేవసమితిన్ శుక్కించి యుగ్రోగ్రగదా
ధరుఁడై వచ్చు నిశాచరుం గని కనద్దంష్ట్రాకరాళాస్యవి
స్ఫురితభ్రూకుటితో నృసింహగతి నత్యుగ్రోరువక్షంబు [illegible]
కరభాస్వన్నఖరాజిఁ ద్రుంచెఁ ద్రిజగత్కల్యాణసంధాయి యై. 148

వ. ఇంక నాదిమూలావతారంబు సెప్పెద వినుము. 149

1 'డనువానికి నాభి యను...... మేరుదేవి యను నామాంతరంబు గల సుదేవియందు' అచ్చుప్రతి. 2 మందు, నొన్నత్యలీల మత్స్యావతారము.

మ. కరినాథుండు జలగ్రహగ్రహణదుఃఖాక్రాంతుఁడై వేయివ
త్సరముల్ గుయ్యిడుచుండ వేల్పులకు విశ్వవ్యాప్తి లేకుండుటన్
హరి నీవే శరణంబు నా కనినఁ గుయ్యాలించి [1]వేవేగ వా
శ్చరముం ద్రుంచి కరీంద్రుఁ గాచె మహితోత్సాహంబునం దాపసా. 150

వ. మఱియును వామనావతారంబు వినుము. 151

సీ. యజ్ఞేశ్వరుం డగు హరి విష్ణుఁ డదితిసం, తానంబునకు నెల్లఁ దమ్ముఁ డయ్యుఁ
బెం పారుగుణములఁ బెద్ద యై వామన, మూర్తితో బలిచక్రవర్తిఁ జేరి
తద్భూమి మూఁడుపాదమ్ముల నడిగి ప, దత్రయంబునకు జగత్త్రయంబు
వంచించి కొనియును వాసవునకు రాజ్య, మందింప నీశ్వరుం డయ్యు మొఱఁగి
తే. యర్థిరూపంబుగైకొని యడుగవలసె, ధార్మికులసొమ్ము విన యోచితములఁ గాని
వెడఁగుఁదనమున నూరక విగ్రహించి, చలన మందింపరాదు నిశ్చయము పుత్త్ర.

చ. బలి నిజమౌళి నవ్వటునిపాదసరోరుహభవ్యతీర్థ ము
త్కలిక ధరించి తన్నును జగత్త్రయమున్ హరి కిచ్చి కీర్తులన్
నిలిపె వసుంధరాస్థలిని నిర్జరలోకవిభుత్వహానికిం
దలఁకక శుక్రుమాటలకుఁ దారక భూరివదాన్యశీలుఁ డై. 153

వ. మఱియు నప్పరమేశ్వరుండు నారదా నీకు హంసావతారంబు నొంది యతిశయ భక్తియోగంబున సంతుష్టాంతరంగుం డగుచు నాత్మతత్త్వప్రదీపకం బగు భాగవతమహాపురాణం బుపదేశించె మన్వవతారంబు నొంది స్వకీయతేజః ప్రభావంబున నప్రతిహతం బైనచక్రంబు ధరియించి దుష్టవర్తను లైనరాజుల దండించుచు శిష్టప్రతిపాలనంబు సేయుచు నాత్మీయకీర్తిచంద్రికలు సత్యలోకంబున వెలింగించె మఱియు ధన్వంతరి యన నవతరించి తననామస్మరణంబున భూజనంబులకు సకలరోగనివారణంబు సేయుచు నాయుర్వేదంబు గల్పించె నింకఁ బరశురామావతారంబు వినుము. 154

మ. ధరణీకంటకు లైన హైహయనరేంద్రవ్రాతమున్ భూరివి
స్ఫురితోదారకుఠారధారఁ గలనన్ ముయ్యేడుమాఱుల్ పోరిం
బోరి మర్దించి సమస్తభూతలము విప్రుల్ వేఁడఁగా నిచ్చి [2]భా
సురకీర్తిన్ జమదగ్నిరాముఁ డన మించుం దాపసేంద్రోత్తమా. 155

వ. మఱియు శ్రీరామావతారంబు సెప్పెద వినుము. 156

సీ. తోయజహితవంశదుగ్ధపారావార, రాకావిహారకైరవహితుండుఁ
గమనీయకోసలక్ష్మాభృత్సుతాగర్భ, శుక్తిసంపుటలసన్మౌక్తికంబు
నిజపాదసేవకవ్రజమనఃఖనిబిడాంధ, కారవిస్ఫురితపంకరుహసఖుఁడు
దశరథేశ్వరకృతాధ్వరవాటికాప్రాంగ, ణాకరదేవతానోకహంబుఁ

1 నక్రంబు కం, ధరముం. 2 తాఁ, జరకీర్తిన్······మించెం.

తే. ఖలదానవగహనవైశ్వానరుండు, రావణాటోపశైలపురందరుండు
నగుచు లోకోపకారార్థ మవతరించె, రాముఁడై చక్రి లోకాభిరాముఁ [డగుచు.

క. చిత్రముగ భరతలక్ష్మణ, శత్రుఘ్నుల కర్థి నగ్రజన్ముం డగుచున్
ధాత్రిన్ రాముఁడు వెలసెఁ బవిత్రుఁడు దుర్భవలతాలవిత్రుం డగుచున్.

వ. అంత. 159

సీ. కిసలయఖండేందుబిసకుంద[1]పద్మాబ్జ, పదఫాలభుజరదపాణినేత్రఁ
గాహళకరభచక్రవియత్పులినశంఖ, జంఘోరుకుచమధ్యజఘనకంఠ
ముకురచందనబింబశుకగజశ్రీకార, గండగంధోష్ఠగమనకర్ణఁ
జంపకేందుస్వర్ణ[2]శఫరధనుర్నీల, నాసాననాంగదృగ్భ్రూశిరోజ

తే. నలిసుధావర్తకుంతలహంసనాభి, కలిత జనకావనీపాలకన్యకాల
లామఁ బరిణయ మయ్యె లలాటనేత్ర, కార్ముకధ్వంస ముంకువగాఁగ నతఁడు.

వ. అంత. 161

క. రామున్ మేచకజలద, శ్యామున్ సుగుణాభిరాము సద్వైభవసు
త్రామున్ దుష్టనిశాటవి, రాముం బొ మ్మనియెఁ బంక్తిరథుఁ డడవులకున్. 162

వ. ఇట్లు వంచిన. 163

చ. అరుదుగ లక్ష్మణుండు జనకాత్మజయుం దనతోడ నేఁగుదే
నరిగి రఘూత్తముండు ముదమారఁగఁ జొచ్చెఁ దరక్షుసింహ సూ
కర కరి పుండరీక కపి ఖడ్గ కురంగ వృకాహి భల్ల కా
సరముఖవన్యసత్త్వచయచండతరాటవి దండకాటవిన్. 164

క. ఆవనమున వసియించి నృ,పావననయశాలి యిచ్చె నభయములు జగ
త్పావనమునిసంతతికిఁ గృ,పావననిధి యైనరామభద్రుం డెలమిన్ 165

క. ఖరకరకులజలనిధిహిమ, కరుఁ డగురఘురామవిభుఁడు గఱకఱితోడన్
ఖరుని వధించెను ఘనభీ, కరశరముల నఖిలజనులుఁ గర మరు దందన్. 166

క. హరిసుతుఁ బరిచరుఁగాఁ గొని, హరిసుతుఁ దునుమాడి పనిచె హరిపురమునకున్
హరివిభునకు హరిమధ్యను, హరిరాజ్యపదంబు నిచ్చె హరివిక్రముఁడై. 167

వ. అంత సీతానిమిత్తంబునం ద్రిలోకకంటకుం డగుదశకంఠుం దునుమాడుటకునై
కపిసేనాసమేతుం డయి చని ముందట నతిదుర్గమం బయినసముద్రంబు పేర్చి
తెరువు సూప కున్న నలిగి. 168

మ. వికటభ్రూకుటిఫాలభాగుఁ డగుచున్ వీరుండు క్రోధారుణాం
బకుఁడై చూచినయంతమాత్రమున నప్పాథోధి సంతప్తతో
యకణ గ్రాహ తిమింగిల ప్లవ ధులీ వ్యాళప్రవాళోర్మి భృ
ద్బక కారండవ చక్ర ముఖ్యజలసత్త్వశ్రేణితో నింకినన్ 169

1 పద్మాక్షి. 2 శంపాధనుర్నీల.

వ. అయ్యవసరంబున సముద్రుండు గరుణాసముద్రుం డగు శ్రీరామభద్రుని శర
ణంబు సొచ్చినం గరుణించి యెప్పటియట్ల నిలిపి నలునిచే సేతువు బంధింపించి
తన్మార్గంబునం జని. 170

మ. పురముల్ మూఁడును నొక్కబాణమున నిర్మూలంబు గావించు శం
కరుచందంబున నేర్చె రాఘవుఁడు లంకాపట్టణం బిద్ధగో
పురశాలాంగణహర్మ్యరాజభవనప్రోద్యత్ప్రతోళీకపా
టరథాశ్వద్విపశస్త్రమందిరనిశాటశ్రేణితో వ్రేల్మిడిన్. 171

క. రావణు నఖిలజగద్వి, ద్రావణుఁ బరిమార్చి నిలిపె రక్షోవిభుఁ గా
రావణుననుజన్ముని నై, రావణసితకీర్తి మెఱసి రాఘవుఁ డెలమిన్. 172

సీ. ధర్మసంరక్షకత్వప్రభావుం డయ్యు, ధర్మవిధ్వంసకత్వమునఁ బొదలి
ఖరదండనాభిముఖ్యతఁ బొంద కుండియు, ఖరదండనాభిముఖ్యతను మెఱసి
పుణ్యజనావనస్ఫూర్తిఁ బెంపొందియుఁ, బుణ్యజనాంతకస్ఫురణఁ దనరి
సంతతాశ్రితవిభీషణుఁడు గా కుండియు, సంతతాశ్రితవిభీషణత నొప్పి
తే. మించెఁ దనకీర్తిచేత వాసించె దిశలు, దరమె నుతియింప జగతి నెవ్వరికినైనఁ
జారుతరమూర్తి నవనీశచక్రవర్తిఁ, బ్రకటగుణసాంద్రు దశరథరామచంద్రు.

వ. అట్టి శ్రీరామావతారంబు జగత్పావనంబును నస్మత్ప్రసాదకారణంబును నై
నుతికెక్కె నింకఁ గృష్ణావతారంబు వివరించెద వినుము. 174

సీ. తాపసోత్తమ విను దైత్యాంశములఁ బుట్టి, నరనాథవితతి సేనాసమేతు
లగుచు ధర్మేతరులై ధాత్రిఁ బెక్కుబాధల నలంచుటఁ జేసి ధరణి వగలఁ
బొందుచు వాపోవ భూభార ముడుపుటకై హరి పరుఁడు నారాయణుండు
[1]తన మేని ధవళాసితపుఁ గేశయుగమున, బలరామకృష్ణరూపములఁ దనరి
తే. యదుకులంబున లీలతో నుదయ మయ్యె, భవ్యయశుఁ డగు వసుదేవు భార్యలైన
రోహిణియు దేవకియు ననురూపవతుల, యందు నున్మత్తదైత్య[2]సంహారి యగుచు.

వ. ఇట్లు పుండరీకాక్షుం డగు నారాయణుండు సమస్తభూభారనివారణంబు సేయం
దన మేని కేశద్వయంబ చాలు నని యాత్మప్రభావంబు దెలుపుకొఱకు నిజకళాంశ
సంభవులైన రామకృష్ణుల దేహవర్ణంబులు శ్వేతకృష్ణంబు లని నిర్దేశించుకొఱకు
సితాసితకేశద్వయవ్యాజంబున రామకృష్ణాఖ్యల నలరి యవతరించె నందు
భగవంతుండును సాక్షాద్విష్ణుండును నైన కృష్ణుండు జనమార్గవర్తి యయ్యును
నతిమానుషకర్మంబుల నాచరించుటం జేసి కేవలపరమేశ్వరుం డయ్యె నమ్మహా
త్ముం డాచరించు కార్యంబులు లెక్కపెట్ట నెవ్వరికి నలవి గా దయినను నాకు
గోచరించిన యంత యెఱింగించెద వినుము. 176

క. నూతనగరళస్తని యగు, పూతనఁ బురిటింటిలోనఁ బొత్తులశిశువై

---

1 'చెచ్చెరఁ దనసితాసితకేశ' అ. ప్ర. 2 'సంహారు లగుచు' వ్రా. ప్ర.

చేతనమును హరియించి ప, రేతనగరమునకు ననిచెఁ గృష్ణుఁడు పెలుచన్. 177

క. వికటముగ నిజపదాహతిఁ, బ్రకటముగా మూఁడునెలల బాలకుఁ డై యా
శకటనిశాచరు నంతక, నికటస్థునిఁ జేసె భక్తనికరావనుఁ డై. 178

క. ముద్దులకొమరుని వేఁతల, రద్దుల కై తల్లి ఱోల రజ్జునఁ గట్ట
[1]నుద్దు లన మిన్ను ముట్టిన, మద్దుల వడిఁ గూల్చె జనసమాజము వొగడన్.

మ. [2]మదిఁ గృష్ణుండు యశోదబిడ్డఁ డని సమ్మం జాల యోగీంద్ర త
ద్వదనాంభోజములోఁ జరాచరసమస్తప్రాణిజాతాటవీ
నదనద్యద్రిపయోధియుక్త మగునానాలోకజాలంబు భా
స్వదనూనక్రియఁ జూపెఁ దల్లికి మహాశ్చర్యంబు వాటిల్లఁగన్. 180

చ. వరయమునానదీహ్రదనివాసకుఁ డై నిజవక్త్రనిర్గత
స్ఫురితవిషాంబుపానమున భూజనులన్ మృతిఁ బొందఁ జేయుభీ
కరగరళద్విజిహ్వుఁ డగుకాళియపన్నగుఁ దన్నదంబుఁ జె
చ్చెర వెడలించి కాచె యదుసింహుఁడు గోపకగోగణంబులన్. 181

మ. తనయా [3]గోపకు లొక్కరేయితటి నిద్రం జెందఁ గార్చిచ్చు వ
చ్చినఁ గృష్ణా మము నగ్నిపీడితుల రక్షింపం దగుం గావ వే
యనినం గన్నులు మీరు మోడ్పుఁ డిదె దావాగ్నిన్ వెస న్నాస్త నే
నన వా రట్లొనర్ప మ్రింగె శిఖిఁ బద్మాక్షుండు లీలాగతిన్. 182

క. మందునిగతి యమునాంబువు, లందు నిసిం గ్రుంకి బద్ధుఁ డై చిక్కినయా
నందుని వరుణునిబంధన, మందు నివృత్తునిఁగఁ జేసె హరి సదయుం డై. 183

మ. హయసూనుం డగుదానవుండు నిజమాయన్ గోపరాజిన్ గుహా
[4]శ్రయ యాన గ్లొసరించి తత్పథము నీరంధ్రంబు గావించినన్
రయ మొప్పం గుటిలాసురాధమునిఁ బోరం ద్రుంచి గోపావళిన్
దయతోఁ గాచినకృష్ణుసన్మహిమ మేతన్మాత్రమే తాపసా. 184

క. దివిజేంద్రప్రీతిగ వల్లవజను లేఁటేటఁ జేయులాలితసవనో
త్సవము హరి మాన్పిన గోపవరులు గావింప కుస్ను బలరిపుఁ డలుకన్. 185

తే. మందగొందలమంద నమందవృష్టిఁ, గ్రందుకొనుఁడంచునింద్రుండు మందలింపఁ
జండపవనసముద్ధూతచటులవిలయ, సమయసంవర్తకాభీలజలధరములు. 186

శా. సప్తస్కంధశిఖాకలాపరుచిమత్సౌదామనీవల్లికా
దీప్తోదగ్రముహుస్తమఃపిహితధాత్రీభాగనీరంధ్ర మై

---

1 'బద్దులకు మిన్ను' అ. ప్ర. 2 'మదిలోఁ గృష్ణుఁ డెశోద' అనియే వ్రాఁతప్రతులు.
3 'యొక్కనిశందు గోపకులు నిద్రం' అనియే వ్రా. ప్ర. 4 'శ్రయులంగా నొనరించి' అనియే వ్రాఁతప్రతులు.

సప్తాశ్వస్ఫురదిందుమండలనభస్సంఛాదితాశాంతర
వ్యాప్తాంభోదనిరర్గళస్ఫుటశిలావాఃపూరధారాళమై. 187

వ. కురియువానజల్లు పెల్లున రిమ్మలు గొని సొమ్మలువోయి గోకులం బాకులం బయి
కృష్ణ కృష్ణ రక్షింపు రక్షింపు మని యార్తిం బొంది కుయ్యిడ నఖండకరుణా
సముద్రుండును భక్తజనసురద్రుముండును నగుచుఁ బుండరీకాక్షుండు. 188

శా. సప్తాబ్దంబులబాలుఁడై నిజభుజాస్తంభంబునన్ లీలతో
సప్తాహంబులు శైలరాజము లసచ్ఛత్త్రంబుగాఁ దాల్చి సం
గుప్తప్రాణులఁ జేసె మాధవుఁడు గోగోపాలకవ్రాతమున్
సప్తాంభోధిపరీతభూధరున కాశ్చర్యంబు చింతింపఁగన్. 189

సీ. సాంద్రశరచ్చంద్రచంద్రికాధవళిత, విమలబృందావనవీథియందు
రాసకేళీమహోల్లాసుఁడై యుత్ఫుల్ల, జలజాక్షుఁ డొకనిశాసమయమునను
దనరాగుమంద్రమధ్యమతారముల నింపు, దళుకొత్త రాగభేదములఁ జెలఁగి
ధైవతఋషభగాంధారనిషాదపం, చమషడ్జమధ్యమస్వరము లొలిఁ

తే. గళలు జాతులు మూర్ఛనల్ గలుగ వేణు
నాళవివరాంగుళిన్యాసలాలనమున
మహితగతిఁ బాడె నవ్యక్తమధురముగను
బంకజాక్షుండు దారువు లంకురింప. 190

మ. హరివంశోద్గతమంజులస్వననినా[1]దాహూతలై గోపసుం
దరు లేతేర ధనేశుచారుఁ డగు గంధర్వుండు గొంపోవఁ ద
త్తరుణుల్ గుయ్యిడ శంఖచూడునిభుజాదర్పంబు మాయించి తాఁ
బరిరక్షించినయట్టికృష్ణుని నుతింపన్ శక్యమే యేరికిన్. 191

చ. నరక ముర ప్రలంబ యవన ద్వివ ముష్టిక మల్ల కంస శం
బర శిశుపాల పంచజన పౌండ్రక వల్వల దంతవక్త్ర వా
నర ఖర సాల్వ వత్స బక నాగ విదూరథ రుక్మి కేశి ద
ర్దుర వృష ధేనుక ప్రముఖదుష్టనిశాటులఁ ద్రుంచె వేల్మిడిన్. 192

వ. మఱియును. 193

మ. [2]బలభీమార్జునముఖ్యచాపధరరూపవ్యాజతం గ్రూరులన్
ఖలులన్ దుష్టధరాతలేశ్వరుల సంగ్రామైకపారీణదో
ర్బలకేళిం దునుమాడి సర్వధరణీభారంబు మాయించి సా
ధుల రక్షించినయట్టికృష్ణుని ననంతుం గొల్తు నెల్లప్పుడున్. 194

వ. అట్టిలోకోత్కృష్టుం డైనకృష్ణునియవతారమాహాత్మ్యం బెఱింగించితి నింక వ్యా
సావతారంబు వినుము. 195

---

1 'దాహూయ లై' అని వ్రా. 2 'బలభీమార్జునచాపనైపుణులరూపవ్యాజతం' అనియే వ్రా.

చ. [1]ప్రతియుగమందు సంకుచిత+భావులు నల్పతరాయువుల్ సుదు
ర్గతికులు నైనమర్త్యుల క+గమ్యములున్ స్వకృతంబులున్ సుశా
శ్వతములు నైనవేదతరు+శాఖలు దా విభజించినట్టిస
న్నుతుఁడు పరాశరప్రియతన+నూజుఁడు నా హరి పుట్టె నర్మిలిన్. 196

వ. మఱియు బుద్ధావతారంబు వినుము. 197

మ. అతిలోభాత్ములు సూనృతేతరులు భే+దాచారసంశీలు రు
ద్ధతపాషండమతౌపధర్మ్యులు జగ+త్సంహారు లైనట్టియా
[2]దితిసంజాతు లధర్మవాసనల వ+ర్తింపం దదాచారసం
హతి మాయించి హరించె దానవులఁ బ+ద్మాక్షుండు బుద్ధాకృతిన్. 198

వ. మఱియుఁ గల్క్యవతారంబు వినుము. 199

మ. వసజాతు ల్తవశూన్యు లై మఱి వష+ట్స్వాహాస్వధావాక్యశో
భసరాహిత్యులు సూనృతేతరులునుం + బాషండులు న్నైనవి
ప్రనికాయంబును శూద్రభూపులుఁ గలిం + బాటిల్లినం గల్కి యై
జననం బంది యధర్మము న్నడఁచు సం+స్థాపించు ధర్మం బిలన్. 200

వ. అని మఱియుఁ బితామహుండు నారదున కి ట్లనియె మునీంద్రా పుండరీకాక్షుండంగీకరించినలీలావతారకథావృత్తాంతంబు నేను నీకు నెఱింగించునంతకు మున్న హరి వరాహాద్యవతారంబు లంగీకరించి తత్ప్రయోజనంబులఁ దీర్చె మన్వంతరావతారంబు లంగీకరించినవియు నంగీకరింపం గలవియు నై యున్నయవి వర్తమానంబున ధన్వంతరిపరశురామావతారంబులుం దాల్చి యున్నవాఁడు భావికాలంబున శ్రీరామాద్యవతారంబుల నంగీకరింపంగలవాఁ డమ్మహాత్ముండు సృష్ట్యాదికార్యభేదంబులకొఱకు మాయాగుణావతారంబు లందు బహుశక్తిధారణుండై నభగవంతుండు సర్గాదిని దపస్సులును నేనును ఋషిగణంబులును నవప్రజాపతులును నై యవతరించి విశ్వోత్పాదనంబు గావించుచుండు ధర్మంబును విష్ణుండును యజ్ఞంబులును మనువులును నింద్రాది దేవగణంబులును ధాత్రీపతులును నయి యవతరించి జగంబుల రక్షించు చుండు నధర్మంబును రుద్రుండును మ

---

1 "ఉ. ప్రత్యుగమందు సంకుచిత+భావులు నల్పతరాయువుల్ సుదౌ
ర్గత్యగు లైనమర్త్యుల క+గమ్యమునున్ స్వకృతంబు నిత్యమున్
సత్యము నైనవేదతరు+శాఖలఁ దా విభజించినట్టియా
సాత్యవతేయమూర్తి యయి + జాతమునొందె హరి ప్రసన్నుఁడై". అని మే వ్రాఁతప్రతులందీపద్యము చూపట్టుచున్నది. యకారమును అచ్చు గాఁ గొని పూర్వస్వరముతో సంధిగూర్చుట నాఁడయకవనమునఁ బెక్కుచోట్లఁ జూపట్టెడి. 'యజ్ఞాంగుఁ డెజ్ఞఫలుఁడు' 'మదిలోఁ గృష్ణుఁ డెశోద' 'ప్రత్యుగమందు' ఇత్యాదులు పెక్కు గలవు. పండితులు సాంతకవనములో వీనిని దిద్దిరని తోఁచెడిని.

2 'దితిసంతాన మనంతధామముల' వ్రా. ప్ర.

హారగణంబులును రాక్షసానీకంబులును నై (యవతరించి) విలయంబు నొందించు
చుండు నిట్టియంగునం బరమేశ్వరుండును సర్వాత్మకుండును నైనహరి విశ్వోత్ప
త్తిస్థితిలయహేతుభూతుం డై విలసిల్లు ధరణీరేణువుల నయిన గణుతింప నలవి
యగుం గాని యమ్మహాత్మునిలీలావ[1]తారాద్భుతకర్మంబులు లెక్కవెట్ట నెవ్వరికి
నశక్యం బై యుండు నీకు సంక్షేపరూపంబున నుపన్యసించితి సవిస్తరంబుగా
నెఱింగింప నాకుం దరంబు గా దనిన నన్యులం జెప్ప నేల వినుము. 201

చ. అమరఁ ద్రివిక్రమస్ఫురణ నందిన యమ్మహితాత్ముపాదవే
గమున హతంబు లైనత్రిజగంబుల కావల వెల్గుసత్యలో
కము చలియించినం గరుణఁ గైకొని కాచి [2]ధరించెఁ బాదప
ద్మమునను నట్టియప్రతిహతం బగుశక్తి గణింప శక్యమే. 202

మ. హరిమాయాబల మే నెఱుంగనట శక్యంబే సనందాదిస
త్పురుషవ్రాతము కైన బుద్ధి నితరంబున్ మాని సేవాధిక
స్ఫురణం దచ్చరితానురాగ[3]గుణవిస్ఫూర్తిన్ సహస్రాస్యను
న్దరతం బొల్పగు శేషుఁడుం దెలియఁ డన్నన్ జెప్ప నే లొండొరున్. 203

చ. ఇతరము మాని తన్ను మది నెంతయు నమ్మి భజించువారి నా
శ్రితజనసేవితాంఘ్రిసరసీరుహుఁ డైనసరోజనాభుఁ డం
చితదయతోడ నిష్కపటచిత్తమునం గరుణించునట్టివా
రతులదురంత మైన తనరునవ్విభుమాయఁ దరింతు రెప్పుడున్. 204

వ. మఱియును సంసారమగ్నులయి దివసంబులు [4]ద్రోచియు నంతంబున శునక
సృగాలభక్ష్యంబు లైనకాయంబులందు మమత్వంబు సేయక భగవదర్పణంబు
సేసినపుణ్యాత్ములం గొందఱు గల రెఱింగింతు వినుము నేను నీబ్రహ్మత్వంబునం
జెందురాజసంబు విడిచి యమ్మహాత్మునిపాదారవిందంబుల భక్తినిష్ఠుండ నయి
శరణాగతత్వంబున భజియించునప్పుడు దెలియుదు రాజసగుణుండ నై యున్న
వేళం దెలియం జాలఁ గావున శాస్త్రంబులు ప్రపంచింపక కేవలభక్తిజ్ఞానయో
గంబున సేవింతు మఱియు సనకాదు లగుమీరును భగవంతుం డైనరుద్రుండును
దైత్యపతి యైనప్రహ్లాదుండును స్వాయంభువమనువును నతనిపత్ని (యగుశతరూప)
యుఁ దత్పుత్రు (లగుప్రియవ్రతోత్తానపాదు)లునుం బ్రాచీనబర్హియు ఋభువు
ను (వేనజనకుం డగునంగుండును) ధ్రువుండును వెండియు. 205

సీ. గాధి రఘూత్తమేక్ష్వాకు దిలీప మాం, ధాతృ భీష్మ శుక యయాతి సగర
రఘు ముచుకుం దైళ రంతిదేవోద్ధవ, సారస్వతోదంక భూరిషేణ
శ్రుతదేవ మారుతి శతధన్వ పిప్పల, బలి విభీషణ శిబి పార్థ విదుర
లంబరీష పరాశ రాలర్క దేవల, సౌభరి మిథిలేశ్వ రాభిమన్యు

1 తారంబులు లెక్క. 2 ధరించుపాద. 3 'గణిత; గణుతి' వ్రా. ప్ర. 4 ద్రొబ్బియు.

తే. లార్ష్ణిషేణాదు లైనమహాత్ము లెలమిఁ, దవిలి యద్దేవుభక్తిఁ జిత్తముల నిల్పి
తత్పరాయణు లౌట దుర్దాంత మైన, విష్ణుమాయఁ దరింతురు విమలచరిత.
మ. అనఘా వీరల నెన్న నేమిటికిఁ దిర్యగ్జంతుసంతానప
క్షినిశాటాటవికాఘజీవనివహస్త్రీశూద్రహూణాదు లై
నను నారాయణభక్తియోగమహితానందాత్ము లై రేని వా
రనయంబుం దరియింతు రవ్విభునిమాయావైభవాంభోనిధిన్. 207

వ. కావున. 208

క. శశ్వత్ప్రశాంతు నభయుని, విశ్వాత్ముఁ బ్రబోధమాత్రు విభు సంశుద్ధున్
శాశ్వతు సదసత్పూరుషు, నీశ్వరుఁ జిత్తమున నిలుపు మెప్పుడు మునీంద్రా. 209
వ. అట్లయిన నప్పుణ్యాత్ముల ననవద్యశీలుర నవిద్య లజ్జావనతవదన యై పొందంజాలక
వైముఖ్యంబున దవ్వుదవ్వులం దలంగి పోవు మఱియును. 210
చ. హరిఁ బరమాత్ము నచ్యుతు ననంతునిఁ జిత్తములం దలంచి సు
స్థిరత విశోక[1]సౌఖ్యములఁ జెందినధీనిధు లన్యకృత్యము
ల్మఱచియుఁ జేయ నొల్లరు తలంచిన నట్టిద యౌ సురేంద్రుఁడుం
బరువడి నుయ్యి ద్రవ్వునె పిపాసితుఁ డై సలిలాభిలాషితన్. 211

ఉ. సర్వఫలప్రదాతయును సర్వశరణ్యుఁడు సర్వశక్తుఁడున్
సర్వజగత్ప్రసిద్ధుఁడును సర్వగతుం డగుచక్రపాణి యా
సర్వశరీరులన్ నిగమసంగతిఁ జెంది విశీర్యమాణు లై
పర్విన చో[2]నభంబుగతి బ్రహ్మము దాఁ జెడ కుండు నెప్పుడున్. 212
ఉ. కారణకార్యహేతు వగుకంజదళాక్షునికంటె నన్యు లె
వ్వారును లేరు తండ్రి భగవంతు ననంతుని విశ్వభావనో
దారుని సద్గుణావళు లుదాత్తమతిం గొనియాడ కుండినం
జేరవు చిత్తముల్ ప్రకృతిఁ జెందనినిర్గుణ మైనబ్రహ్మమున్. 213

మ. నిగమార్థప్రతిపాదకప్రకట మై నిర్వాణసంధాయి గా
భగవంతుండు రచింప భాగవతకల్పక్ష్మాజ మై శాస్త్రరా
జగరిష్ఠం బగునీపురాణకథ సంక్షేపంబునం జెప్పితిన్
జగతిన్ నీవు రచింపు దీని నతివిస్తారంబుగాఁ బుత్త్రకా. 214
చ. పురుషభవంబు నొందుట యపూర్వము జన్మములందు నందు భూ
సురకులమందుఁ బుట్టు టతిచోద్యము నిట్లగుటన్ మనుష్యు ల
స్థిర మగుకార్యదుర్దశలచేత నశింపక విష్ణుసేవనా
పరతఁ దనర్చి నిత్య మగుభవ్యపథంబునఁ బొందు టొప్పదే. 215

1 రాజ్యములఁ. 2 నభంగగతి.

మ. ఉపవాసవ్రతశౌచశీలమఖసంధ్యోపాసనాగ్నిక్రియా
జపదానాధ్యయనాదికర్మముల మోక్షప్రాప్తి సేకూర ద
చ్ఛుభభక్తిన్ హరిఁ బుండరీకనయనున్ [1]సర్వాతిశాయిన్ రమా
ధిపుఁ బాపఘ్నుఁ బరేశు నచ్యుతుని నర్థిం గొల్వ లేకుండినన్. 216

క. వనజాక్షుమహిమ నిత్యము, వినుతించుచు నొరులు వొగడ వినుచున్ మదిలో
ననుమోదించుచు నుండెడు, జనములు దన్మోహవశతఁ జనరు మునీంద్రా. 217

క. అని వాణీశుఁడు నారద, మునివరునకుఁ జెప్పినట్టిముఖ్యకథాసూ
చన మతిభక్తిఁ బరీక్షి, జ్జనపాలునితోడ యోగిచంద్రుఁడు నుడివెన్. 218

పరీక్షితుఁడు శుకుని బ్రపంచోద్భవాదికంబు నడుగుట.

సీ. విను శుకయోగికి మనుజేశుఁ డిట్లను, మునినాథ దేవదర్శనము గలుగ
నారదమునికిఁ బంకేరుహభవుఁ డెఱిం, గించిన తెఱఁగు సత్కృప దలిర్ప
గణుతింప సత్త్వాదిగుణశూన్యుఁ డగుహరి, కమలాక్షు లోకమంగళము లైన
కథలు నా కెఱిఁగింపు కైకొని నిస్సంగ, మైననాహృదయాబ్జమందుఁ గృష్ణు
తే. భవ్యచరితుని నాద్యంతభావశూన్యుఁ, జిన్మయాకారు ననఘు లక్ష్మీసమేతు
నిలిపి యస్థిరవిభవంబు నిఖిలహేయ, భాజనం బైనయీకళేబరము విడుతు.

వ. అదియునుం గాక యెవ్వం డేని శ్రద్ధాభక్తియుక్తుం డై కృష్ణగుణకీర్తనంబులు వినుచుం బలుకుచుండు నట్టివానిహృదయపద్మంబునందుఁ గర్ణరంధ్రమార్గంబులం బ్రవేశించి కృష్ణుండు విశ్రమించి సలిలగతం బైనకలుషంబును శరత్కాలంబు నివారించుచందంబున నాత్మగతం బైనమాలిన్యంబు నపకర్షించుఁ గావున. 220

మ. భరితోదగ్రనిదాఘతప్తుఁ డగుపాంథుం డరణ్యానిసం
[2]చరణక్లేశసముద్భవం బగుపిపాసం జెంది యాత్మీయమం
దిరముం జేరి గతశ్రముం డగుచు నెందేనిం జనం బోనిభం
గి రమాధీశుపదారవిందయుగసంగీభూతుఁ డై మానునే. 221

వ. అదియునుం గాక సకలభూతసంసర్గశూన్యుం డైనయాత్మకు భూతసంసర్గం బేప్రకారంబునం గలిగె నది నిర్నిమిత్తంబునం జేసియో కర్మమూలంబునం జేసియో యాక్రమంబు నా కెఱింగింపుము. 222

సీ. ఎవ్వనినాభియం దెల్లలోకాంగసం, స్థానకారణపంకజంబు వొడమె
నం దుదయించి సర్వావయవస్ఫూర్తిఁ, దనరారునట్టిపితామహుండు
గడఁగి యెవ్వనియనుగ్రహమున నిఖిలభూ, తముల సృజించె నుత్కంఠతోడ
నట్టివిధాత యేయనువున సర్వేశు, రూపంబు గనుఁగొనె రుచిరభంగి
తే. నాపరంజ్యోతి యైనపద్మాక్షునకును, నలినజునకుఁ బ్రతీకవిన్యాసభావ
గతులవలనను భేదంబు గలదె చెప్పుమ, యతిదయాసాంద్ర యోగికులాబ్ధిచంద్ర.

1. సర్వాధిశాయిన్. 2 'చరణక్లేశపిపాసపీడితబుభుక్షుం' అని వ్రా. ప్ర.

వ. మఱియును భూతేశ్వరుం డయినసర్వేశ్వరుం డుత్పత్తిస్థితిలయకారణం బైనతన
మాయను విడిచి రమానాయకుం డై యేయేప్రదేశంబుల శయనంబు సేసె నది
యునుం గాక పురుషావయవంబులచేఁ బూర్వకాలంబున లోకపాలసమేతంబు
లైనలోకంబు లెత్తెఱంగునం గల్పితంబు లయ్యె నదియునుం గాక మహాకల్పం
బులును నవాంతరకల్పంబులును (భూతభవిష్యద్వర్తమానకాలంబులును) దేహా
భిమానులై జనియించినదేవపితృమనుష్యాదులకుం గలుగు నాయుఃప్రమాణంబు
లును(బృహత్సూక్ష్మ)కాలానువర్తనంబును (నేయేకర్మంబులం జేసి) జీవు లే(యే
లోకంబుల నొందుదురు మఱియు నే)యేకర్మంబులం జేసి దేవాదిశరీరంబులం
బ్రాపింతు రట్టికర్మమార్గప్రకారంబును [1]సత్త్వాదిగుణంబులపరిణామంబు లగు
దేవాదిరూపంబులం గోరుజీవులకు నేయేకర్మసముదాయం బెట్లు సేయం దగు
నెవ్వనికి నర్పింపం దగు నవి యెవ్వనిచేత గ్రహింపంబడు భూపాతాళకకుబ్వ్యో
మగ్రహనక్షత్రపర్వతంబులును సరిత్సముద్రంబులును ద్వీపంబులును నేప్రకా
రంబున సంభవించె నాయాస్థానంబులం గలవారిసంభవంబు లేలాగు (వియ
ద్బాహ్యాభ్యంతరంబులం) గలుగు బ్రహ్మాండప్రమాణం బెంత మహాత్ములచరి
త్రంబు లెట్టివి వర్ణాశ్రమవినిశ్చయంబులును ననుగతంబు లై (యాశ్చర్యావహంబు
లగు హరి)యవతారచరిత్రంబులును యుగంబులును యుగప్రమాణంబులును
యుగధర్మంబులును బ్రతియుగంబునందును మనుష్యుల కేయే ధర్మంబు లాచర
ణీయంబు (లట్టిసాధారణధర్మంబులును విశేషధర్మంబులును జాతివిశేషధర్మం
బులును రాజర్షిధర్మంబులును నాపత్కాలజీవనసాధనభూతంబు లగుధర్మంబు
లును)మహదాదితత్త్వంబులసంఖ్యయు సంఖ్యాలక్షణంబును నాతత్త్వంబులకు
హేతుభూతలక్షణంబులును భగవత్సమారాధనవిధంబును నష్టాంగయోగక్రమం
బును యోగీశ్వరులయణిమాద్యైశ్వర్యప్రకారంబును వారలయర్చిరాదిగతులు
ను లింగశరీరభంగంబులును ఋగ్యజుస్సామవేదంబులును నుపవేదంబు లైన
యాయుర్వేదాదులును ధర్మశాస్త్రంబులును నితిహాసపురాణంబులసంభవంబును
సర్వభూతంబులయవాంతరప్రళయంబును (మహాప్రళయంబును) నిష్టాపూర్తం
బులును (యాగాదివైదికకర్మజాలంబులును) వాపీకూపతటాకదేవాలయాది
నిర్మాణంబులును నన్నదానం బారామప్రతిష్ఠ (మొదలగుస్మార్త) కర్మంబులును
గ్రామ్యంబు లైనయగ్నిహోత్రంబు (లయనుష్ఠానప్రకారంబు)ను జీవసృష్టియు
(ధర్మార్థకామంబు లనియెడుత్రివర్గంబున నాచరణప్రకారంబును మలినోపాధిక)
పాషండసంభవంబును జీవాత్మబంధమోక్షప్రకారంబును స్వరూపావస్థానవిధం
బును సర్వతంత్రుం (డైనయీశ్వరుం డాత్మమాయం జేసి సర్వకర్మసాక్షి య

1. గుణవంతు లయి పరిణామాపేక్షకు లయినవా రెవ్వరియందే కర్మము లాచరింపఁదగు నెవ్వని
చేత గ్రహింపంబడు.

య్యు) నమ్మాయ నెడఁబాసి యుదాసీనగతిని (విభుండై) క్రీడించు తెఱంగును
గ్రమంబునఁ బ్రసన్నుండ నైననాకు నెఱింగింపుము బ్రాహ్మణశాపంబునం జేసి
శోకవ్యాకులితచిత్తుండ నై యనశనవ్రతుండ నైననీవు వినుట యెట్లని సందే
హింపవలవదు (త్వదీయముఖారవిందవినిస్సృత) నారాయణకథామృతపానకుతూ
హాలి నైననాకు నింద్రియంబులు వశంబు లై యుండు నది గావున నే నడిగిన
ప్రశ్నంబులకు నుత్తరంబులు సవిస్తరంబులుగా [1]నానతిచ్చి కృతార్థునిం జేయఁ
బరమేష్ఠితుల్యుండ వగునీవ పూర్వసంప్రదాయానురోధంబున నర్హుండ వగుదు
వని విష్ణురాతుం డయినపరీక్షిన్నరేంద్రుండు బ్రహ్మరాతుం డైన శుకయోగి నడిగిన
నతండు బ్రహ్మనారదసంవాదంబును నేకసంప్రదాయానుగతంబును గతానుగతిక
ప్రకారంబును నై తొల్లి సర్వేశ్వరుండు బ్రహ్మకల్పంబున బ్రహ్మ కుపదేశించిన
భాగవతపురాణంబు వేదతుల్యంబు నీ కెఱింగింతు వినుమని చెప్పె నని
సూతుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు శుకయోగీంద్రుండు పరీక్షిన్న
రేంద్రున కిట్లనియె. 224

సీ. భూపాలకోత్తమ భూతహితుండు సు, జ్ఞానస్వరూపకుఁ డైనయట్టి
ప్రాణికి దేహసంబంధ మెట్లగు నన్న, మహి నొప్పనీశ్వరమాయ లేక
కలుగదు నిద్రలోఁ గలలోనఁ దోఁచిన, దేహబంధంబుల తెఱఁగువలెను
హరియోగమాయామహత్త్వంబునం బాంచ, భౌతికదేహసంబంధుఁ డగుచు

తే. నట్టిమాయాగుణంబుల నాత్మ యోలి
బాల్య కౌమార యౌవనభావములను
నరసుపర్వాదిమూర్తులఁ బొరసి యేను
నాయ దిది యనుసంసారమాయఁ దగిలి. 225

వ. వర్తించుచు నిట్లున్నజీవునికి భగవద్భక్తియోగంబున ముక్తి సంభవించుట
యెట్లన్న నెప్పుడేని జీవుండు ప్రకృతిపురుషాతీతం బయినబ్రహ్మస్వరూపంబు
నందు మహితధ్యాననిష్ఠుం డగు నప్పుడు విగతమోహుం డై యహంకారమమ
కారాత్మకం బయినసంసరణంబు దొఱంగి ముక్తుం డయి యుండు మఱియు
జీవేశ్వరులకు దేహసంబంధంబులు గానంబడు చుండు నట్టిదేహధారి యైనభగ
వంతునందలిభక్తిం జేసి జీవునకు ముక్తి యెట్లెఱుంగునం గలుగు నని యడిగితివి
జీవుం డవిద్యామహిమం జేసి కర్మానుగతం బయినమిథ్యారూపదేహసంబంధుండు
భగవంతుండు నిజయోగమాయామహిమంబునం జేసి స్వేచ్ఛాపరికల్పితచిద్ఘనలీ
లావిగ్రహుండు గావున భగవంతుం డైనయీశ్వరుండుస్వభజనంబు ముక్తిసాధన
జ్ఞానార్థంబు కల్పితం బని చతుర్ముఖునకుఁ [2]దదీయనిష్కపటతపశ్చర్యాదిసేవితుం
డయి నిజజ్ఞానానందఘనం బయినస్వరూపంబు సూపుచు నానతిచ్చె నదిగావున
జీవునికి భగవద్భక్తి మోక్షప్రదాయకం బగు నిందులకు నొక్కయితిహాసంబు

1 నానతిమ్మని విష్ణురాతుం. 2 నాతనియొక్క నిష్కపట.

గల దెఱింగింతు నాకర్ణింపుము దాన [1]భవదీయసంశయనివృత్తి యయ్యెడు
నని శుకయోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె. 226

నారాయణుండు బ్రహ్మతపంబునకు మెచ్చి వరంబు లిచ్చుట.

సీ. హరిపాదభక్తిరహస్యోపదేష్టయు, నఖిలదేవతలకు నధివిభుండు
నైనవిధాత గల్పాదియందును నిజా, శ్రయపద్మమున కధిష్ఠాన మరయ
నర్థించి జలముల నన్వేషణముసేసి, నలినంబుమొదలు గానంగ లేక
విసివి క్రమ్మఱను దద్బిసరుహాసీనుఁ డై, సృష్టినిర్మాణేచ్ఛఁ జిత్తమందుఁ

తే. జాలనూహించి తత్పరజ్ఞానమహిమ, సరణి మనమునఁ దోఁపక జడనుపడుచు
లోకజాలంబుఁ బుట్టింపలేక మోహి, తాత్ముఁడై చింతనొందు నయ్యవసరమున.

వ. జలమధ్యంబున నుండి కాదిస్పర్శషోడశాక్షరంబును నేకవింశాక్షరంబునుం గా
నక్షరద్వయం బినుమాఱు మహామునిజనధనం బయినతపస్తపేతివాక్యంబు వి
నంబడిన నవ్వాక్యంబు వలికినయప్పురుషుని వీక్షింపంగోరి నలుదిక్కులకుం జని
వెదకి యెందునుం గానక మరలివచ్చి నిజస్థానంబైనపద్మంబునం దాసీనుండై యొ
క్కింత చింతించి యట్టివాక్యంబు దన్నుఁ దపంబు సేయు మని నియమించుటగాఁ
దలంచి ప్రాణాయామపరాయణుండై జ్ఞానేంద్రియకర్మేంద్రియంబులజయించి యే
కాగ్రచిత్తుండై సకలలోకసంతాపహేతు వగుతపంబు వేయిదివ్యవత్సరంబులు
గావింప నీశ్వరుండు ప్రసన్నుండై పొడసూపిన నక్కమలసంభవుండు తత్క్షణంబ
రాజసతామసమిశ్రసత్త్వగుణాతీతంబును శుద్ధసత్త్వగుణావాసంబును నకాలవిక్ర
మంబును సర్వలోకోన్నతంబును సకలసురగణస్తుత్యంబును లోభమోహభయ
విరహితంబును నపునరావృత్తిమార్గంబును ననంతతేజోవిరాజితంబును నైన
వైకుంఠపురంబుం బొడగని యందు. 228

సీ. సూర్యచంద్రానలస్ఫురణలఁ జొర నీక, నిజదీధితిస్ఫూర్తి నివ్వటిల్ల
దివ్యమణిప్రభాదీపితసౌధవి, మానగోపురహర్మ్యమండపములుఁ
బ్రసవగుచ్ఛస్వచ్ఛభరితకామితఫల, సంతానపాదపసముదయములుఁ
గాంచనదండసంగతమారుతోద్ధూత, తరళవిచిత్రకేతనచయములుఁ

తే. వికచకైరవదళదరవిందగతమ, రందరసపానమదవదిందిందిరప్ర
భూతమంజులనినదప్రబుద్ధరాజ, హంసశోభితవరకమలాకరములు. 229

సీ. వల నొప్పఁగా న దైవం కేశవాత్పర, మ్మని పల్కు రాజకీరావళియును
మహిమ [2]సర్వం విష్ణుమయ మీజగ, త్తని, చదివెడుశారికాసముదయంబు
నే పారఁగా జితం తే పుండరీకాక్ష, యని లీలఁ బాడుపికావళియును
లలిమీఱఁగా [3]మంగళం భగవాన్ విష్ణు,వో యని పల్కుమయూరములును

---

1 'భవదీయశరీరబాధానివృత్తి'. అని వ్రాఁతప్రతులు. 2, 3 ఈరెండును వ్యాకరణదుష్టము లయ్యు వ్రాఁతప్రతుల నిట్లె కానిపించుచున్నవి. 2. జగద్విష్ణుమయ మఖిల మ్మని. 3, మంగళం మధుసూదన, యనుచుఁ బల్కెడుమయూరావలియును. అ. ప్ర.

తే. దవిలి [1]వషడితిస్వాహాస్వధానుశబ్ద
కలితముగ మ్రోయుమధుపనికాయములును
గలిగి యఖిలైకదివ్యమంగళవిలాస
మహిమఁ జెన్నొందు వైకుంఠమందిరంబు. 230

వ. మఱియుం బయోధరావళీవిభాసితనభంబునుంబోలె వెలుంగు చున్నయద్దివ్య
ధామంబునందు. 231

సీ. సలలితేందీవరశ్యామాయమానోజ్జ్వ, లాంగులు నవ్యపీతాంబరులును
ధవళారవిందసుందరపత్త్రనేత్రులు, సుకుమారతనులు భాసురవినూత్న
రత్నవిభూషణగ్రైవేయకంకణ, హారకేయూరమంజీరధరులు
నిత్యయౌవనులు విగనిర్మలచరితులు, రోచిష్ణు లంచితారూఢయశులు
తే. నగుసునందుండు నందుండు నర్హణుండుఁ
బ్రబలుఁడును నాది యగునిజపార్శ్వచరులు
మఱియు వైదూర్యవిద్రుమామలమృణాళ
తుల్యగాత్రులు దను భక్తితో భజింప. 232

సీ. క్షాళితాఖిలకల్మషవ్రజామరనదీ, జనకకోమలపదాబ్జములవాని
నఖిలసంపత్కారణాపాంగలక్ష్మీవి, లాసితవక్షస్స్థలంబువానిఁ
బద్ధమిత్త్రామిత్త్ర[2]భాసితకరుణాత, రంగితచారునేత్రములవాని
[3]భువననిర్మాణనైపుణభవ్యనిజజన్మ, కారణనాభిపంకజమువాని
తే. నహిహితాహితశయనవాహములవాని, సేవితామరతాపసశ్రేణివాని
నఖిలలోకంబులకు గురుఁడైనవానిఁ, గాంచెఁ బరమేష్ఠి కన్నులకలవు దీఱ.

క. కమనీయరూపరేఖా, రమణీయతఁ జాల నొప్పు రమణీమణి య
క్కమలాలయ దనమృదుకర,కమలంబుల విభునిపాదకమలము లొత్తన్. 234

వ. వెండియు. 235

శా. శ్రీకాంతాతిలకంబు రత్నరుచిరాజిప్రేంఖితస్వర్ణడో
లాకేళిన్ విలసింపఁ దత్కచభరాలంకారస్రగ్గంధలో
భాకీర్ణప్రచరన్మధువ్రతమనోజ్ఞాలోలనాదంబు ల
స్తోకానుస్వరలీల నొప్పఁగ నిజేశున్ వేడ్కతోఁ బాడఁగన్. 236

వ. అట్టినిత్యవిభూతియందు. 237

మ. సతతజ్ఞానరమాయశోబలమహైశ్వర్యాదియుక్తున్ జగ
త్పతి యజ్ఞేశు ననంతు నచ్యుతు దళత్పంకేరుహాక్షున్ శ్రియః

---

1 'శ్రౌషడ్వషట్స్వధేత్యాదిశబ్ద' అచ్చుప్రతి. 2 భాసితపుష్కర, న్నయనాభినవవదనంబువాని. 3 సృష్టికారణవిరించిప్రభూతస్థాన, కమనీయనాభి.

పతి నాద్యంతవికారదూరుఁ గరుణాపాథోనిధిన్ సాత్వతాం
పతి వర్ధిష్ణు సహిష్ణు విష్ణు గుణవిభ్రాజిష్ణు రోచిష్ణునిన్. 238

మ. దరహాసామృతపూరితాస్యు నిజభక్తత్రాణపారాయణు
న్నరుణాంభోరుహపత్రలోచనుని [1]బీతావాసుఁ ద్రైలోక్యసుం
దరు మంజీరకిరీటకుండలముఖోద్యద్భూషు యోగీశ్వరే
శ్వరు లక్ష్మీయుతవక్షుఁ జిన్మయు దయాసాంద్రుం జతుర్బాహునిన్. 239

వ. మఱియు ననర్ఘరత్నమయసింహాసనాసీనుండును సునందనందకుముదాదిసేవితుం డును బ్రకృతిపురుషమహదహంకారంబు లనుచతుశ్శక్తులును గర్మేంద్రియజ్ఞా నేంద్రియమనోమహాభూతంబు లనుషోడశశక్తులును బంచతన్మాత్రంబులును బరి వేష్టింపఁ గోటికోట్యర్కప్రభావిభాసితుండును (స్వేతరాలభ్య)స్వాభావికసమస్త భాగ్యోదయుండును నై (స్వస్వరూపంబునం గ్రీడించుసర్వేశ్వరుం డై)నపరమ పురుషుం బురుషోత్తముం బుండరీకాక్షు నారాయణుం జూచి సాంద్రానందకం దళితహృదయారవిందుండును రోమాంచకంచుకితశరీరుండును నానందబాష్ప ధారాసిక్తకపోలుండును నగుచు. 240

క. వరపరమహంసగమ్య, స్ఫురణం దనరారుపరమపురుషునిపదపం
కరుహము లజుఁ డాత్మ చతు, శ్శిరములు సోఁకంగ నతులు సేసిన హరియున్.

చ. [2]ప్రియుఁ డగుబొడ్డుఁదమ్మితొలిబిడ్డఁడు వేలుపుఁబెద్ద భూతసం
చయములఁ జేయుకర్త నిజశాసనపాత్రుఁడు ధాత మ్రొక్కినన్
దయ దళుకొత్తఁ బల్కెఁ బ్రమదస్మితచారుముఖారవిందుఁ డై
నయమునఁ బాణిపంకజమునన్ హరి యాతనిదేహ మంటుచున్. 242

వ. ఇట్లనియె. 243

ఆ. కపటమునుల కెంతకాలంబునకు నైన, సంతసింప నేను జలజగర్భ
చిరతపస్సమాధిఁ జెంది విసర్గేచ్ఛ, మెలఁగునిన్నుఁ బరిణమింతుఁ గాని. 244

తే. భద్ర మగుఁగాక నీకు నోపద్మగర్భ, వరము నిపు డిత్తు నెఱిఁగింపువాంఛితంబు
దేవదేవుఁడ నగునస్మదీయపాద, దర్శనావధి వో విపద్దశల కనఘ. 245

చ. సరసిజగర్భ నీయెడఁ బ్రసన్నత నొంది మదీయలోక మే
నిరవుగఁ జూపు టెల్లను నహేతుకభూరిదయాకటాక్షవి
స్ఫురణన కాని నీ దగుతపోవిభవంబునఁ గాదు నీతప
శ్చరణము నాదువాక్యములసంగతిఁ గాదె సరోజసంభవా. 246

---

1 'బీతాచ్ఛాదు' అచ్చుప్రతి. 2 'ప్రియుఁ...తొలిబిడ్డని...సం, చయములఁ బుట్టఁజేయు నిజశాసనపాత్రు నుపస్థితున్ మనో, దయ దళుకొత్తఁ బల్కె' అనియే వ్రాఁతప్రతులు.

క. [1]తప మనఁగ మత్స్వరూపము, తప మనుతరువునకు ఫలవితానము నే నా
తపమున నే జననస్థి, త్యుపసంహరణము లొనర్చుచుండుదుఁ దనయా. 247

క. కావున మద్భక్తికిఁ దప, మేవిధమున మూలధనము నిది నీమది రా
జీవభవ యెఱిఁగి తప మిటు, గావించుట విగతమోహకర్ముఁడ వింకన్. 248

క. అని యాన తిచ్చి కమలజ, యెనయఁగ భవదీయమానసేప్సిత మే నై
నను నిత్తు వేఁడు మనినను, వనరుహసంభవుఁడు వికచవదనుం డగుచున్. 249

చ. హరివచనంబు లాత్మకుఁ బ్రియం బొనరింపఁ బయోజగర్భుఁ డో
పరమపదేశ యోగిజనభావన యీనిఖిలోర్వియందు నీ
యరయనియట్టియర్థ మొకఁ డైనను గల్గునె యైన నామదిన్
బెరసినకోర్కి దేవ వినిపింతు దయామతిఁ జిత్తగింపవే. 250

వ. దేవా సర్వభూతాంతర్యామి వై భగవంతుండ వైన నీకు నమస్కరించి మదీయ వాంఛితంబు విన్నవించెద నవధరింపు మవ్యక్తరూపంబు లై వెలుంగుభవదీయ స్థూలసూక్ష్మరూపంబులును నానాశక్త్యుపబృంహితంబు లైన బ్రహ్మాదిరూపంబులును నీయంత నీవే ధరియించి జగదుత్పత్తిస్థితిలయంబులం దంతుకీటంబునుం బోలెఁ గావించుచు నమోఘసంకల్పుండ వై లీలావిభూతిం గ్రీడించుమహిమంబుఁ దెలియునట్టిపరిజ్ఞానంబుఁ గృప సేయుము భవదీయశాసనంబున జగన్నిర్మాణంబు గావించునపుడు బ్రహ్మాభిమానంబునం జేసి యవశ్యంబును మహదహంకారంబులు నామదిం బొడముం గావునఁ దత్పరిహారార్థంబు వేఁడెద నన్నుం గరుణార్ద్రదృష్టి విలోకించి దయ సేయు మని విన్నవించిన నాలించి పుండరీకాక్షుం డతని కిట్లనియె. 251

క. వారిజభవ శాస్త్రార్థవి, చారజ్ఞానమును భక్తిసమధికసాక్షా
త్కారము లనునీమూఁడు ను, దారత నీమనమునందు ధరియింప నగున్. 252

సీ. పరికింప మత్స్వరూపస్వభావములును, మహిమావతారకర్మములుఁ దెలియఁ
దత్త్వవిజ్ఞానంబు దలకొని మత్ప్రసా, దమునఁ గల్గెడి నీకుఁ గమలగర్భ
సృష్టిపూర్వమునఁ జర్చింప నే నొకరుండఁ, గలిగి యుండుదు వీతకర్మ నగుచు
సమధికస్థూలసూక్ష్మస్వరూపములుఁ ద, త్కారణప్రకృతియుఁ దగ మదంశ

ఆ. మందు లీన మైన నద్వితీయుండ నై, యుందు నాకు నన్య మొకటి లేదు
సృష్టికాలమందు [2]సృజ్యమానం బగు, జగము మత్స్వరూప మగును వత్స.

క. అరయఁగఁ గల్పప్రళయాం, తరమున నాద్యంతవిరహితక్రియతోడం
బరిపూర్ణనిత్యమహిమం, బరమాత్ముఁడ నై సరోజభవ యే నుందున్. 254

1 'తప మనఁగ నాదుహృదయము, దప మన మద్రూప మనఘ ధర్మము దప మా, తపమున నే జనన' అనియే వ్రాఁతప్రతులు. 2. దృష్టమానం బగు.

వ. అదియునుం గాక నీవు న న్నడిగినయీజగన్నిర్మాణమాయాప్రకారం బెఱింగింతు
లేనియర్థంబు శుక్తిరజతభ్రాంతియుంబోలె నేమిటి మహిమం దోఁచి క్రమ్మఱఁ
దోఁపకమాను నదియె నామాయావిడంబనం బని యెఱుంగు మదియునుం
గాక లేనియర్థంబు దృశ్యమానం బగుటను గలయర్థంబు దర్శనగోచరంబు గా
కుండుటను ద్విచంద్రాదికంబును దమఃప్రభాసంబును దృష్టాంతంబులుగాఁ దెలి
యు మేప్రకారంబున మహాభూతంబులు భౌతికంబు లయిన ఘటపటాదులందుఁ
బ్రవేశించి యుండు నాప్రకారంబున నేను నీభూతభౌతికంబు లయినసర్వకార్యం
బులందు సత్త్వాదిరూపంబులం బ్రవేశించి యుండుదు భౌతికంబులు భూతంబు
లందుఁ గారణావస్థం బొందుచందంబున భూతభౌతికంబులు గారణావస్థం బొంది
నాయందు నభివ్యక్తంబులై యుండవు సర్వదేశంబులయందును సర్వకాలంబుల
యందును నేది చోదితం బై యుండు నట్టిదియ పరబ్రహ్మస్వరూపంబు తత్త్వం
బెఱుంగ నిచ్ఛయించిన మిముబోఁటివారలకు నీచెప్పినమదీయతత్త్వాత్మకం బైన
యర్థంబ యర్థం బని యెఱుఁగు మీయర్థం బుత్కృష్టం బయినయది యేకాగ్ర
చిత్తుండవై యాకర్ణించి భవదీయచిత్తంబున ధరియించిన నీకు సర్గాదికర్మంబు
లందు మోహంబు సెంద కుండెడి నని భగవంతుం డయినపరమేశ్వరుండు చతు
ర్ముఖున కానతిచ్చి నిజలోకంబుతో నంతర్ధానంబు నొందె నని చెప్పి శుకుండు
వెండియు నిట్లనియె. 255

సీ. అవనీశ బ్రహ్మయి ట్లంతర్హితుం డైనఁ, బుండరీకాక్షుని బుద్ధి నిలిపి
యానందమునఁ బొంది యంజలి గావించి, తత్పరిగ్రహమునఁ దనదుబుద్ధి
గైకొని పూర్వప్రకారంబునను సమ, స్తప్రపంచంబును దగ సృజించి
మఱియొకనాఁడు ధర్మప్రవర్తకుఁ డగు, చఖిలప్రజాపతి యైనకమల
తే. గర్భుఁ డాత్మహితార్థమై కాక సకల, భువనహితబుద్ధి నున్నతస్ఫురణ మెఱసి
మానితంబైనయమనియమములరెంటి, నాచరించెను సమ్మోదితాత్ముఁ డగుచు.
వ. అయ్యవసరంబున. 257
క. ఆనలినాసననందను, లైనసనందాదిమునుల కగ్రేసరుఁడున్
మానుగఁ బ్రియతముఁడును నగు, నానారదుఁ డేఁగుదెంచె నబ్జజుకడకున్.
క. చనుదెంచి తండ్రికిం బ్రియ, మొనరఁగ శుశ్రూషణంబు లొనరిచి యతఁడుం
దనదెసఁ బ్రసన్నుఁడగుటయుఁ, గని భగవన్మాయఁ దెలియఁగా నుత్సుకుఁ డై.
సీ. అవనీశ నీవు నన్నడిగినపగిది నా, తఁడుఁ దండ్రి నడుగఁ బితామహుండు
భగవంతుఁ డాశ్రితపారిజాతము హరి, గృపతోడఁ దన కెఱింగించినట్టి
లోకమంగళచతుఃశ్లోకమూలంబున, దశలక్షణంబులఁ దనరుభాగ
వతము నారదున కున్నతిఁ జెప్పె నాతఁడు, చారుసరస్వతీతీరమునను
తే. హరిపదధ్యానపారీణుఁ డాత్మవేది, ప్రకటతేజస్వి యగుబాదరాయణునకుఁ

గోరి యెఱింగించె నమ్మహోదారుఁ డెలమి, నాకు నెఱింగించె నెఱింగింతు నీకు నేను.

వ. అదియునుం గాక యిప్పుడు విరాట్పురుషునివలన నీజగంబు లేవిధంబున జనియించె ననునివి మొదలయిన ప్రశ్నంబులు గొన్ని నన్నడిగితి వేను నన్నింటికి నుత్తరం బగునట్లుగా నమ్మహాభాగవతం బుపన్యసించెద నాకర్ణింపు మమ్మహాపురాణంబు చతుఃశ్లోకరూపంబును దశలక్షణంబును నై సంకుచితమార్గంబున నొప్పు నందు దశలక్షణంబు లెవ్వి యనిన సర్గంబును విసర్గంబును స్థానంబును బోషణంబును నూతులును మన్వంతరంబులును నీశానుచరితంబులును నిరోధంబును ముక్తియు నాశ్రయంబును ననం బదితెఱంగు లయ్యె దశమాశ్రయవిశుద్ధ్యర్థంబు దక్కినతొమ్మిదిలక్షణంబులు సెప్పంబడె నవి యెట్టి వనిన. 261

తే. మహదహంకార పంచతన్మాత్రగగన, పవనశిఖితోయభూభూతపంచకేంద్రి
యప్రపంచంబు భగవంతునందుఁ గనుట, సర్గ మందురు దీనిని జనవరేణ్య.

క. సరసిజగర్భుండు విరా, ట్పురుషునివలనన్ జనించి భూరితరచరా
చరభూతసృష్టిఁ జేయుట, పరువడిని విసర్గ మండ్రు భరతకులేశా. 263

క. లోకద్రోహినరేంద్రా, నీకముఁ బరిమార్చి జగము నిల్పినహరి యా
వైకుంఠనాథువిజయం, బాకల్పస్థాన మయ్యె నవనీనాథా. 264

క. హరి సర్వేశుఁ డనంతుఁడు, నిరుపమశుభమూర్తి సేయు నిజభక్తజనో
ద్ధరణము పోషణ మవనీ, వర యూతు లనంగఁ గర్మవాసన లరయన్. 265

తే. జలజనాభదయాకటాక్షప్రసాద, లబ్ధనిఖిలైకలోకపాలకవిభూతి
మహిమఁ బొందినవారిధర్మములు విస్తరమునఁ బలుకుట మన్వంతరములు భూప.

క. వనజోదరు నవతారక, థనముఁ దదీయానువృత్తిఁ దచ్చారిత్రం
బును విస్తరించి పలుకం, జనునవి యీశానుకథలు సౌజన్యనిధీ. 267

సీ. వసుమతీనాథ సర్వస్వామి యైనగో, విందుండు చిదచిదానందమూర్తి
సలలితస్వోపాధిశక్తిసమేతుఁ డై, తనరారు నాత్మీయధామమందు
ఫణిరాజమృదులతల్పంబుపై సుఖలీల, యోగనిద్రారతి నున్నవేళ
నఖిలజీవులు నిజవ్యాపారశూన్యులై, యున్నతేజంబు [1]లుఱులుకొనఁగ

తే. జరుగునయ్యవస్థావిశేషంబు లెల్ల, విదితమగునట్లు వలుకుట యది నిరోధ
మన నిది యవాంతరప్రళయం బనంగఁ, బరఁగు నిఁక ముక్తిగతి వినుపార్థివేంద్ర.

సీ. జీవుండు భగవత్కృపావశంబునఁ జేసి, దేహధర్మంబు లై ధృతి ననేక
జన్మానుచరితదృశ్యము లైనయజ్జరా, మరణంబు లాత్మధర్మంబు లయిన
ఘనపుణ్యపాపనికాయనిర్మోచన, స్థితి నొప్పి పూర్వసంచితము లైన
యపహతపాప్మత్వాదృష్టతద్గుణ, వంతుఁ డై తగ భగవచ్ఛరీర

---

1. లుర్లుమనఁగ ; లుర్లుమడఁగ.

తే. భూతుఁడై పారతంత్ర్యాత్మబుద్ధి నొప్పి, దివ్యమాల్యానులేపనభవ్యగంధ
కలితమంగళదివ్యవిగ్రహవిశిష్టుఁ, డగుచు నారిరూప మొందు టేరయనఘ ముక్తి.

వ. మఱియు నుత్పత్తిస్థితిలయంబు లెందగుఁ (దుఁ బ్రకాశింపఁబడు) నది యాశ్రయం బనంబడు నదియ పరమాత్మ బ్రహ్మశబ్దవాచ్యంబు నదియ ప్రత్యక్షానుభవంబున విదితంబు సేయుకొఱకు నాత్మ కాధ్యాత్మికాదివిభాగంబు సెప్పంబడియె నది యెట్లనిన నాత్మ యాధ్యాత్మికాధిదైవికాధిభౌతికంబులం ద్రివిధం బయ్యె నందు నాధ్యాత్మికంబు చక్షురాదిగోళకాంతర్వర్తి యై యెఱుంగంబడుఁ జక్షు రాదికరణాభిమాని యై ద్రష్ట యైనశరీరకుం డతండె యాధిదైవికుం డనం దగుఁ జక్షురాద్యధిష్ఠానాభిమానిదేవత యై సూర్యాదితేజోవిగ్రహుండు నగుచు నెవ్వనియందు నీయుభయవిభాగంబునుం గలుగు నతండె యాధిభౌతికుండును విరాడ్విగ్రహుండును నగుం గావున ద్రష్టయు దృక్కును దృశ్యంబు ననం దగునీమూఁటి యందు నొకటి లేకున్న నొకటి గానరా దీత్రితయంబు నెవ్వం డెఱుంగు నతండు సర్వలోకాశ్రయుం డై యుండు నతండె పరమాత్మయును నమ్మహాత్ముండు లీలార్థం బై జగత్సర్జనంబు సేయుతలంపున బ్రహ్మాండంబు వినిర్భేదించి తనకు సుఖశయనంబు నపేక్షించి మొదల [1]జలతత్త్వంబు సృజియించె స్వతఃపరిశుద్ధుండు గావున (స్వసృష్టం బై) యేకార్ణవాకారం బైనజలరాశియందు శయనంబు సేయుటం జేసి "శ్లో. ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః। అయనం తస్య తాః పూర్వం తేన నారాయణః స్మృతః" యను (ప్రమాణము చొప్పున) నారాయణశబ్దవాచ్యుండు గావున నతనిప్రభావంబు వర్ణింప దుర్లభం బుపాదానభూతం బయిన ద్రవ్యంబును ద్రివిధం బయినకర్మంబును గలాకాష్ఠాద్యుపాధిభిన్నం బయినకాలంబును [2]జ్ఞానాదికం బగుజీవస్వభావంబును (భోక్తయగు) జీవుండును నెవ్వనియనుగ్రహంబునం జేసి వర్తించుచుండు నెవ్వనియుపేక్షం జేసి వర్తింపకుండు నట్టిప్రభావంబు గలసర్వేశ్వరుండు దా నేక మయ్యు ననేకంబుగాఁ దలంచి యోగతల్పంబునం బ్రబుద్ధుం డై యుండి యటమీఁద స్వసంకల్పంబునం జేసి హిరణ్మయం బైనతనవిగ్రహంబు నధిదైవతంబును నధ్యాత్మికంబును నధిభూతంబును ననుసంజ్ఞాయుతం బై త్రివిధంబుగా సృజియించె. 270

సీ. అట్టివిరా[3]డ్విగ్రహంబందు గగన తేజః ప్రాణములు సర్వజంతువులకు
నైనట్టిజీవుని ననుసరింపుచు నుండుఁ, బంబి జీవుండు శరీరంబువలన
వెలువడి చన జీవి వెనుకొని ప్రాణముల్, చనుచుండు నిజనాథు ననుసరించి
భటులచందంబునఁ బాటిల్లు క్షుత్తును, భూరితృష్ణయు మఱి ముఖమువలనఁ

---

1 జలతత్త్వంబు 2. ద్రవ్యకాలాదిస్వభావంబును భోక్త. 3 'విరాడ్విగ్రహాంతరాకాశంబువలన నోజస్సహోబలంబు లయ్యెఁ, బ్రాణంబు సూక్ష్మరూపక్రియాశక్తిచే, ననియించి ముఖ్యాసువనఁగఁ బరఁగె' అనియే అచ్చుప్రతి.

తే. దాలుజిహ్వాదికంబు లుద్భవము నొందె
నందు నుదయించె నానావిధైకరసము
లెనయ నవి యెల్ల జిహ్వచే నెఱుఁగఁబడును
మొనసి పలుక నపేక్షించుముఖమువలన. 271

వ. *మఱియు [1]వాగింద్రియంబు పుట్టె దానికి దేవత యగ్ని యారెంటివలన భాష
ణంబు వొడమె నాయగ్నికి మహాజలవ్యాప్తం బగుజలంబున నిరోధంబు గలు
గుటం జేసి యాజలంబె ప్రతిబంధకంబయ్యె దోధూయమానం బైనమహావాయు
వువలన ఘ్రాణంబు పుట్టెం గావున వాయుదేవతాకం బైనఘ్రాణేంద్రియంబు
గంధగ్రహణసమర్థం బయ్యె నిరాలోకం బగునాత్మ నాత్మయందుఁ జూడం గోరి
తేజంబువలన నాదిత్యదేవతాకం బై రూపగ్రాహకం బైనయక్షియుగళంబు
పుట్టె ఋషిగణంబులచేత బోధితుం డగుచు భగవంతుండు దిగ్దేవతాకంబును
శబ్దగ్రాహకంబును నైనశ్రోత్రేంద్రియంబు పుట్టించె సర్జనంబు సేయుపురుషుని
వలన మృదుత్వకాఠిన్యంబులును లఘుత్వగురుత్వంబులును నుష్ణత్వశీతలత్వంబు
లునుం జేసెడుత్వగింద్రియాధిష్ఠానం బగుచర్మంబు పుట్టె బహిర్గతం బయిన
చర్మంబువలన రోమంబు లుదయించె వానికి మహీరుహంబు లధిదేవత లయ్యె
నందు నధిగతస్పర్శగుణుండును నంతర్బహిః ప్రదేశంబుల నావృతుండును నగువా
యువువలన బలవంతంబులును నింద్రదేవతాకంబులును నాదానసమర్థంబులును
నానాకర్మకరణదక్షంబులును నగుహస్తంబు లుదయించె స్వేచ్ఛావిషయగతిస
మర్థుం డగునీశ్వరునివలన విష్ణుదేవతాకంబు లగుపాదంబు లుదయించెఁ బ్రజా
నందామృతార్థి యగుభగవంతునివలనఁ బ్రజాపతిదేవతాకం బై స్త్రీసంభోగాది
కామ్యసుఖంబు లు గార్యంబులుగాఁ గలశిశ్నోపస్థంబు లుదయించె మిత్రుం డధి
దైవతంబుగాఁ గలిగి భుక్తాన్నాద్యసారాంశత్యాగోపయోగం బగుపాయు వ
నెడిగుదం బుద్భవించె వానికృత్యం బుభయమలమోచనంబు దేహంబుననుండి
దేహాంతరంబుఁ జేరం గోరి పూర్వకాయంబు విడుచుటకు సాధనం బగునాభి
ద్వారంబు సంభవించె నట్టినాభియ ప్రాణాపానబంధస్థానం బనంబడుఁ దద్బంధ
విశ్లేషంబె మృత్యు వగు నదియ యూర్ధ్వాధో దేహభేదకం బనియును జెప్పఁబడు
నన్నపానాదిధారణార్థంబుగ నాంత్రకుక్షినాడీనిచయంబులు గల్పింపంబడియె
వానికి నదులును సముద్రంబులును నధిదేవత లయ్యె వానివలనఁ దుష్టిపుష్టులను
నుదరభరణరసపరిణామంబులు గలిగియుండు నాత్మీయమాయాచింతనం బొనర్చు
నపుడు కామసంకల్పాదిస్థానం బగుహృదయంబు గలిగె దానివలన మనంబును

---

* ఈవచనమంతయు వ్రాఁతప్రతులపాఠమునకు భిన్నము. ఇట విస్తరభీతిచే నాభేదము తెలుపఁబడినది గాదు. 1 'నగ్నియు వాగ్దేవతయు నానికవలన నోఘాయమానం బైనమహా' వ్రా.ప్ర.

జంద్రుండును గాముండును సంకల్పంబును నుదయించె నంతమీఁద జగత్సర్జ
నంబు సేయువిరాడ్విగ్రహంబువలన సప్తధాతువులును బృథివ్యప్తేజోమయంబు
లయినసప్తప్రాణంబులును వ్యోమాంబువాయువులచే నుత్పన్నంబు లై గుణాత్మ
కంబు లైనయింద్రియంబులును నహంకారప్రభవంబు లైనగుణంబులును సర్వ
వికారస్వరూపం బగుమనస్సును విజ్ఞానరూపిణి యగుబుద్ధియును వివిధం బగు
నిది యంతయు సర్వేశ్వరునిస్థూలవిగ్రహంబునం బుట్టుమఱియును. 272

క. వరుసఁ బృథివ్యాద్యష్టా, వరణావృత మై సమగ్రవైభవములఁ బం
కరుహభవాండాతీత, స్ఫురణం జెలువొందు నతివిభూతి దలిర్పన్. 273

క. పొలుపగుసకలవిలక్షణ, ములు గలయాద్యంతశూన్యమును నిత్యము నై
లలి సూక్ష్మమై మనోవా, క్కులకుం దలపోయఁగా నగోచర మగుచున్. 274

సీ. అలఘుతేజోరూప మైనరూపమునకు, క్షితినాథ నాచేతఁ జెప్పఁబడిన
మానితస్థూలసూక్ష్మస్వరూపంబులు, వల నొప్పఁగలభగవత్స్వరూప
మమ్మహాత్మునిమాయాబలంబునఁ జేసి, దివ్యమునీంద్రులుఁ దెలియ లేరు
వసుధేశ వాచ్యమై వాచకంబై నామ,రూపముల్ క్రియలును రూఢిఁ దాల్చి

ఆ. యుండునట్టియీశ్వరుండు నారాయణుం, డఖిలధృతి జగన్నియంత యైన
చిన్మయాత్మకుండు సృజియించు నీప్రజా,పతుల ఋషుల మునులఁ బితృవరులను.

వ. మఱియును. 276

సీ. సురసిద్ధసాధ్యకిన్నరవరచారణ, గరుడగంధర్వరాక్షసపిశాచ
భూతవేతాళకింపురుషకూశ్మాండగు,హ్యకడాకినీయక్షయాతుధాన
విద్యాధరాప్సరోవిషధరగ్రహమాతృ,గణవృకహరిఘృష్టిఖగమృగాళి
భల్లూకరోహితపశువృక్షయోనుల, వివిధకర్మంబులు వెలయఁ బుట్టి

తే. జలనభోభూతలంబుల సంచరించు, జంతురాసుల సత్త్వరజస్తమోగు
ణములఁ [1]దిర్యక్సురాసురనరధరాది,భావముల భిన్ను లగుచుండు పౌరవేంద్ర.

మ. ఇర వొందన్ [2]ద్రుహిణాత్మకుం డగుచు రమాధీశుండు విశ్వంబు సు
స్థిరతన్ నిల్పి కృపాకటాక్షమున రక్షించున్ సమస్తప్రజో
త్కరసంహారము సేయునప్పుడు హరాంతర్యామి యై యంతయున్
హరియించుం బవనుండు మేఘముల మాయం జేయుచందంబునన్. 278

క. ఈపగిదిని విశ్వము సం,స్థాపించును మనుచు నడఁచు ధర్మాత్మకుఁ డై
దీపితతిర్యఙ్నరసుర, రూపంబులు దాల్చి హరి పరుసం డజుఁ డెలమిన్. 279

సీ. హరియందు నాకాశ మాకాశమున వాయు, వనిలంబువలన హుతాశనుండు
హవ్యవాహనునందు నంబువు లుదకంబు, వలన వసుంధర గలిగె ధాత్రి

---

1 'సురనరతిర్యగనాగకాది; సురనరకీటకనాగకాది' అని వ్రాఁతప్రతులు.

2 'భువనావనుం డగు' అని వ్రాఁతప్రతులు.

వలన బహుప్రజావళి యుద్భవం బయ్యె, నింతకు మూలమై యొసఁగునట్టి
నారాయణుఁడు చిదానందస్వరూపకుం, డవ్యయుం డజరుఁ డనంతుఁ డాద్యుఁ
తే. డాదిమధ్యాంతశూన్యుం డనాదినిధనుఁ, డతనివలనను సంభూత మైనయట్టి
సృష్టిహేతుప్రకార మీక్షించి తెలియఁ,జాల రెంతటిమునులైన జనవరేణ్య.

వ. అదియునుం గాక. 281

మ. ధరణీశోత్తమ భూతసృష్టి నిటు సంస్థాపించి రక్షించు నా
హరి కర్తృత్వము నొల్ల కాత్మగతమాయారోపితం జేసి తా
నిరవద్యుండు నిరంజనుండుఁ బరుఁడున్ నిష్కించనుం డాద్యుఁడున్
నిరపేక్షుండును నిష్కళంకుఁ డగుచున్ నిత్యత్వముం బొందెడిన్. 282

వ. (బ్రహ్మసంబంధి యగు) నీకల్పప్రకారం (బవాంతరకల్పంబుతోడ) సంకుచితప్రకారంబున నెఱింగించితి నిట్టిప్రాకృతవైకృతకల్పప్రకారంబులును దత్పరిమాణంబులును గాలకల్పలక్షణంబులును విగ్రహంబును నవాంతరకల్పంబులు మన్వంతరాదిభేదవిభాగస్వరూపంబును నతివిస్తారంబుగ నెఱింగింతు విను మదియునుం బద్మకల్పం బనం దగు నని భగవంతుం డైనశుకుండు పరీక్షిత్తునకుం జెప్పె నని సూతుండు మహాత్ములకు నెఱింగించిన. 283

క. విని శౌనకుండు సూతుం, గనుఁగొని యి ట్లనియె సూత కరుణోపేతా
జననుతగుణసంఘాతా, ఘనపుణ్యసమేత విగతకలుషవ్రాతా. 284

వ. పరమభాగవతోత్తముం డైనవిదురుండు బంధుమిత్రజాతంబుల విడిచి సకలభువనపావనంబులును గీర్తనీయంబులును నైనతీర్థంబులను నగణ్యంబు లైనపుణ్యక్షేత్రంబులను దర్శించి క్రమ్మఱ వచ్చి కౌషారవి యగుమైత్రేయుం గని యతనివలన నధ్యాత్మబోధంబు వడసె నని వినంబడు నది యంతయు నెఱింగింపు మనిన నతం డి ట్లనియె. 285

క. వినుఁ డిపుడు మీరు న న్నడిగిన తెఱఁగున శుకమునీంద్ర గేయుఁ బరీక్షి
జ్జనపతి యడిగిన నతఁ డాతని కెఱిఁగించినవిధంబుఁ దగ నెఱిఁగింతున్. 286

వ. సావధానుల రై వినుం డని. 287

ఉ. రామ గుణాభిరామ దినరాజకులాంబుధిసోమ తోయద
శ్యామ దశాననప్రబలసైన్యవిరామ సురారిగోత్రసు
త్రామ సుబాహుబాహుబలదర్పతమఃపటుతీవ్రధామ ని
ష్కామ కుభృల్లలామ గరకంఠసతీనుతనామ రాఘవా. 288

క. అమరేంద్రసుతవిదారణ, కమలాప్తతనూజరాజ్యకారణ భవసం
తమసదినేశ్వర రాజో, త్తమ దైవతసార్వభౌమ దశరథరామా. 289

మాలిని. నిరుపమగుణజాలా! నిర్మలానందలోలా!
దురితఘనసమీరా! దుష్టదైత్యప్రహారా!
శరధిమదవిశోషా! చారుసద్భక్తపోషా!
సరసిజదళనేత్రా! సజ్జనస్తోత్రపాత్రా. 290

గద్యము. ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీమహాభాగవతపురాణంబునందుఁ బరీక్షిత్తుతోడ శుకయోగి భాషించుటయు భాగవతపురాణవైభవంబును ఖట్వాంగు మోక్షప్రకారంబును ధారణాయోగవిషయం బయినమహావిష్ణుని శ్రీపాదాద్యవయవంబుల సర్వలోకంబులు నున్నతెఱంగును సత్పురుషవృత్తియు మోక్షవ్యతిరిక్తసర్వకామ్యఫలప్రదదేవతాభజనప్రకారంబును మోక్షప్రదుండు శ్రీహరి యనుటయు హరిభజనవిరహితులైనజనులకు హేయతాపాదనంబును రాజప్రశ్నంబును శుకయోగి శ్రీహరిస్తోత్రంబు సేయుటయు వాసుదేవప్రసాదంబునం జతుర్ముఖుండు బ్రహ్మాధిపత్యంబు వడయుటయు శ్రీహరివలన బ్రహ్మరుద్రాదిలోకప్రపంచంబు పుట్టుటయు శ్రీమన్నారాయణదివ్యలీలావతారపరంపరావైభవవృత్తాంతసూచనంబును భాగవతవైభవంబును బరీక్షిత్తు శుకయోగి నడిగినప్రపంచాదిప్రశ్నంబులును నందు శ్రీహరి ప్రధానకర్త యని తద్వృత్తాంతంబు సెప్పుటయు భగవద్భక్తివైభవంబును బ్రహ్మతపశ్చరణంబునకుం బ్రసన్నుం డై హరి వైకుంఠనగరంబుతోడఁ బ్రసన్నుం డయిన స్తోత్రంబు సేసి తత్ప్రసాదంబునం దన్మహిమంబు వినుటయు వాసుదేవుం డానతిచ్చినప్రకారంబున బ్రహ్మ నారదునికి భాగవతపురాణప్రధానదశలక్షణంబు లుపన్యసించుటయు నారాయణవైభవంబును జీవాదితత్త్వసృష్టియు శ్రీహరినిత్యవిభూత్యాదివర్ణనంబును గల్పప్రకారాదిసూచనంబును శౌనకుండు విదురమైత్రేయసంవాదంబు సెప్పు మని సూతు నడుగుటయు ననుకథలం గలద్వితీయస్కంధము.

ఓం తత్సద్బ్రహ్మార్పణమస్తు.



శ్రీ

శ్రీరామచన్ద్రాయ పరబ్రహ్మణే నమః.

# శ్రీమదాంధ్రమహాభాగవతము

## తృతీయస్కంధము.

---



మహితవినుతదివిజ
స్తోమ యశస్సీమ రాజసోమ సుమేరు
స్థేమ వినిర్జితభార్గవ
రామ దశాననవిరామ రఘుకులరామా. 1

వ. మహనీయగుణగరిష్ఠు లగునమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమే
తుం డైనసూతుం డిట్లనియె నట్లు ప్రాయోపవిష్టుం డైనపరీక్షిన్నరేంద్రు
నకు శుకయోగీంద్రుం డిట్లనియె. 2

ఉ. పాండునృపాలనందనులు బాహుబలంబున ధార్తరాష్ట్రులన్
భండనభూమిలో గెలిచి పాండురశారదచంద్రచంద్రికా
ఖండయశఃప్రసూనకలికాతతిఁ గౌరవరాజ్యలక్ష్మి నొం
డొండ యలంకరించుచు జయోన్నతి రాజ్యము సేయుచుండఁగన్. 3

క. మనుజేంద్ర విదురుఁ డంతక,మును వనమున కేఁగి యచట మునిజనగేయున్
వినుతతపోధారేయు, న్ననుపమగుణజనవిధేయు నమ్మైత్రేయున్. 4

క, కనుఁగొని తత్పాదంబులు, దనఫాలము సోఁక మ్రొక్కి తగ నిట్లనియెన్
మునివర సకలజగత్పావనచరితుఁడు కృష్ణుఁ డఖిలవంద్యుం డెలమిన్. 5

క. మండితతేజోనిధి యై, పాండవహితమతిని దూతభావంబున వే
దండపురి కేఁగి కురుకుల, మండనుఁ డగుధార్తరాష్ట్రమందిరమునకున్. 6

తే. చనఁగ నొల్లక మద్గృహంబునకు భక్త
వత్సలుం డగుకృష్ణుండు వచ్చు టేమి
కతము నా కది యెఱిఁగింపు కరుణతోడ
ననుచు విదురుండు మైత్రేయు నడిగె ననిన. 7

క. విని వెఱఁ గంది పరీక్షి, న్మనుజవరేణ్యుండు విమలమతినిస్తంద్రున్

మునికులజలనిధిచంద్రున్, సునిశితహరిభక్తిసాంద్రు । శుకయోగీంద్రున్. 8

క. కని యిట్లనె మైత్రేయుని, ననఘుం డగువిదురుఁ డే।రహస్యము లడిగెన్
ముని యేమి సెప్పె నేపగి, దిని దీర్థము లాడె నెచటఁ । దిరుగుచు నుండెన్. 9

తే. ఇన్నియును దెలియఁగ నాన।తిచ్చి నన్ను, నర్థి రక్షింపవే విమ।లాంతరంగ
ఘనదయాపాంగ హరిపాద।కమలభృంగ, మహితగుణసంగ పాపత।మఃపతంగ.

చ. అనవుడు బాదరాయణి ధ।రాధిపు కిట్లనుఁ బూరువంశవ
ర్ధన విను కష్టుఁ డైనధృత।రాష్ట్రనృపాలుఁడు పెంపుతో సుయో
ధనముఖపుత్రులం గడు ము।దంబునఁ బెంచుచుఁ బాండురాజు ద
ప్పినపిదపం దదాత్మజులు । వెల్కుటి తన్నని చేర వచ్చినన్. 11

వ. ఇట్లు సేర వచ్చినపాండవులయెడ నసూయానిమగ్నులై సుయోధనాదులు. 12

క. పెట్టిరి విషాన్న మంటం, గట్టిరి ఘనపాశములను । గంగానదియం
దొట్టిరి రాజ్యము వెడలం, గొట్టిరి ధర్మంబు విడిచి । కుటిలాత్మకులై. 13

క. క్రూరాత్ము లగుచు లాక్షా, గారంబున వారు నిద్రఁ । గైకొని యుండన్
దారుణశిఖి దరికొలిపిరి, మారణకర్మముల [1]కప్రమత్తత వెలయన్. 14

తే. సూరిజనగేయ మగురాజ।సూయయజ్ఞ,విలసదవభృథసేక।పవిత్ర మైన
ద్రౌపదీచారువేణీభ।రంబు వట్టి, కొలువులోపలి కీడ్చిరి । కుచ్ఛితమున. 15

క. కావున వారల కపకృతి, గావింపని దొకదినంబుఁ । గలుగదు తమజ
న్మావధి నిజనందనులను, వావిరి నయ్యంధనృపతి । వల దనఁ డయ్యెన్. 16

తే. మాయజూదంబు వన్ని దు।ర్మార్గవృత్తిఁ
బుడమిఁ గొని యడవులకుఁ బో । నడువ నచటఁ
దిరిగి వారలు సమయంబు । దీర్చి యేఁగు
దెంచి తమయంశ మడిగినఁ । బంచి యీక. 17

వ. ఉన్నయెడ. 18

చ. సకలనియంత యైనహరి । సర్వశరణ్యుఁడు మాధవుండు సే
వకనవకల్పకంబు భగ।వంతుఁ డనంతుఁ డనంతశక్తి నం
దకధరుఁ డబ్జలోచనుఁడు । ధర్మతనూభవుచే నియుక్తుఁ డై
యకుటిలభక్తియోగమహి।తాత్మకుఁ డై ధృతరాష్ట్రుపాలికిన్. 19

క. చని యచట భీష్మగురుత, త్తనయకృపాచార్యనిఖిల।ధాత్రీపతులున్
విని యనుమోదింపఁగ ని, ట్లనియెన్ ధృతరాష్ట్రుతోడ । నవనీనాథా. 20

క. కౌరవపాండవు లిరువురు, నారయ నీ కొక్కసమమ । యవనీవర నీ
వేరీతి నైనఁ బాండుకు, మారులపా లొసఁగితేని । మను నుభయంబున్. 21

క. అని ధర్మబోధమునఁ బలి, కినమాటలు సెవుల నిడమిఁ । గృష్ణుఁడు విదురున్

1 'కప్రమత్తుల రగుచుఁ' వ్రా. ప్ర.

ఘననీతిమంతుఁ బిలువం, బనిచినఁ జనుదెంచెఁ గురుసǂభాస్థలమునకున్. 22

వ. చనుదెంచి యచటిజనంబులచేత నుపస్థితం బయినకార్యంబు దెలిసినవాఁ డయి
ధృతరాష్ట్రు నుద్దేశించి యి ట్లనియె. 23

మ. ధరణీనాయక పాండుభూవిభుఁడు నీǂతమ్ముండు దత్పుత్రులం
బరిరక్షించిన ధర్మువుం దగవునుం ǂ బాటిల్లు వంశంబు సు
స్థిరసౌఖ్యోన్నతిఁ జెందు శత్రుజయముం ǂ జేకూరు గోపాలశే
ఖరుచిత్తంబును వచ్చు న ట్లగుట యాఁ ǂ గౌరవ్యవంశాగ్రణీ. 24

ఆ. వారితండ్రిపాలు ǂ వారికి నొసఁగి నీ, పాలు సుతుల కెల్లఁ ǂ బంచి యిచ్చి
చలము విడిచి ధర్మǂ మలవడ నీబుద్ధిఁ, జొనుపవయ్య కులము ǂ మనుపవయ్య.

చ. వినుము నృపాల నాపలుకు ǂ వేయును నేల సమీరసూతి నీ
తనయులపేరు విన్నఁ బదǂతాడితదుష్టభుజంగమంబుచా
డ్పునఁ గన లొందు నింతయును ǂ మున్నును జెప్పితిఁ గాదె వానిచే
తన భవదీయపుత్రులకుఁ ǂ దప్పదు మృత్యు వ దెన్నిభంగులన్. 26

వ. అదియునుం గాక. 27

క. నీపుత్రులశౌర్యంబును, జాపాచార్యాపగాత్మǂజాతకృపభుజా
టోపంబును గణ్ణమరా, లాపంబులు నిజముగాఁ దǂలంతె మనమునన్. 28

వ. అ ట్లని వినుము. 29

ఉ. ఏపరమేశుచే జగము ǂ లీసచరాచరకోటితో సము
ద్దీపిత మయ్యె నేవిభునిǂదివ్యకళాంశజు లబ్జగర్భగౌ
రీపతిముఖ్యదేవమునిǂబృందము లెవ్వఁ డనంతుఁ డచ్యుతుం
డాపురుషోత్తముండు గరుǂణాంబుధి కృష్ణుఁడు వో నరేశ్వరా. 30

ఉ. అట్టిజగన్నివాసుఁడు ముǂరాసురభేది పరాపరుండు చే
పట్టి సఖుండు వియ్యమును ǂ బాంధవుఁడున్ గురుఁడున్ విభుండు నై
యిట్టుల మైనప్రేమమున ǂ నెప్పుడుఁ దోడ్పడు చుండ వారలన్
జుట్టనవ్రేల నెవ్వారికిఁ ǂ జూపఁగ వచ్చునె పార్థివోత్తమా. 31

ఉ. కావునఁ బాండునందనులఁ ǂ గాఱియపెట్టక రాజ్యభాగమున్
వావిరి నిచ్చి రాజ్యమును ǂ వంశముఁ బుత్రుల బంధువర్గముం
గావుము గాక లోభి యగుǂకష్టసుయోధనుమాట వింటివే
భూవర నీయుపేక్ష నగుఁ ǂ బో కులనాశము బంధునాశమున్. 32

తే. ఒకనికై యిట్లు కుల మెల్లǂ ను క్కడంప
నెత్తికొనఁ జూచె దిది నీతిǂయే నృపాల
వినుము నామాట నీసుయోǂధనుని విడిచి
కులము రాజ్యంబుఁ దేజంబు ǂ నిలుపవయ్య. 3

క. అని యిట్లు దఱిమి చెప్పిన, విని దుర్యోధనుఁడు రోషవివశుం డగుచు
న్ననతనయశకునిదుశ్శా,సనుల నిరీక్షించి తామసంబునఁ బలికెన్. 34

క. దాసీపుత్రుని మీఁర లు,దాసీనుం జేయ కిటకుఁ దగునె పిలువఁ గా
నాసీనుం డై ప్రేలెడు, గాసిలి చెడి పోవ వెడలఁగ్రా నడువ రనా. 35

వ. అని యిట్లు దుర్యోధనుం డాడినదురాలాపంబులు దనకు మనస్తాపంబు సేయం గార్యంబు విచారించి ధైర్యం బవలంబించి యొండు వలుక నొల్లక శరశరాసనం బులు విడిచి క్రోధంబు నడంచి వనంబునకుం జని యందు. 36

సీ. విష్ణుస్వయంవ్యక్తవిమలభూములను బ,విత్రంబు లగుహరిక్షేత్రములను
నెలకొని దేవతానిర్మితహరిదివ్య,భూముల గంగాదిపుణ్యనదుల
సిద్ధపురాణప్రసిద్ధపుణ్యాశ్రమ, స్థలముల నుపవనస్థలములందు
గంధమాదనముఖక్ష్మాభృత్తటంబుల, మంజులగిరికుంజపుంజములను

తే. వికచకైరవపద్మకహ్లారకమరంద, పానవశమత్తమధుకరగానబుద్ధ
రాజహంసవిలోలకరాజమాన, మగుచుఁ జెలువొందుపంకేరుహాకరముల. 37

క. మఱియును ఋష్యాశ్రమ వన, సరి దుపవన నద పుళింద జనపద గిరిగ
హ్వర గోష్ఠ యజ్ఞశాలా, పుర దేవాయతనపుణ్యభూములయందున్. 38

క. కూరలుఁ గాయలు సీ ళ్లా, హారముగాఁ గొనుచు నియమ మలవడఁగ నసం
స్కారశరీరుం డగుచు ను, దారత నవధూతవేషధరుఁ డై వరుసన్. 39

క. హర్షము గదురఁగ భారత, వర్షమునం గలుగుపుణ్యవరతీర్థము లు
త్కర్షం జూచుచు విగతా,మర్షుం డై సంచరించె మనుజవరేణ్యా. 40

వ. ఇట్లు సంచరించుచుఁ బ్రభాసతీర్థమునకు వచ్చునప్పుడు. 41

చ. అరుగుచు దైత్యభేదనదమూపరిలబ్ధసమస్తమేదినీ
భరణధురంధరుం డగుచుఁ బాండుసుతాగ్రజుఁ డొప్పు[1]చుండు న
త్తఱి విదురుండుఁ దత్సరిదుదంచితసాల రసాల మాధవీ
కురువక మాలతీ వకుళ కుంజ లసత్తటమందు నున్నెడన్. 42

చ. నరవర వేణుజానలవినష్టమహాటవిమాడ్కిఁ బాండుభూ
వరధృతరాష్ట్రసూను [2]లనివారణఁ జాల విరోధ మెత్తి యొం
డొరుల జయింపఁ గోరి కదనోర్విఁ గురుక్షితిపాలముఖ్యు లం
దఱు మృతు లౌటయున్ విని ఘనంబుగ శోకనిమగ్నచిత్తుఁ డై. 43

ఉ. ఆయెడఁ గాలు దన్నక రయంబున నేఁగి సరస్వతీనదీ
తోయములందుఁ గ్రుంకి మునితుల్యుఁడు వే చనియెం దనూనపా
త్తోయరుహాప్తభార్గవపృథుత్రితసోమ[3]సుదాసశక్తిభృ

1 'చుండ భూ, వర విదురుండుఁ దన్నికటవర్యతమాలరసాల' అ. ప్ర. 2 'లనివార్య నిరూఢవిరోధ' అచ్చుప్రతి. 3 'కుమారగోసుధా, వాయు' వ్రా. ప్ర.

ద్వాయుయమాభిధానయుతవాహినులం దనురక్తిఁ గ్రుంకుచున్. 44
ఉ. వెండియుఁ బుణ్యభూములఁ బవిత్రసరిత్తులఁ జూచుచున్ రమా
మండనుఁ డుండుదివ్యరుచిమన్మణిచారుకవాటగేహళీ
మండితసౌధగోపురవిమానము లున్నతభక్తిఁ జూచుచున్
నిండినవేడ్కఁ గృష్ణపదనీరజచింతనుఁ డై క్రమంబునన్. 45

విదురుం డుద్ధవుం గని కృష్ణాదులవృత్తాంతం బడుగుట.

చ. చని చని తొంటిమత్స్యకురుజాంగలభూము లతిక్రమించి చ
య్యన యమునానదిం గదిసి యచ్చట భాగవతున్ సరోజలో
చన[1]నిజభక్తు సద్గుణవిశారదు శాంతుని దేవమంత్రిశి
ష్యుని మహితప్రసిద్ధుఁ బరిశోషితదోషుఁ బ్రబుద్ధు నుద్ధవున్. 46
క. కని యనురాగవికాసము, దనమనమునఁ బొంగలింపఁ దగ గాఢాలిం
గన మాచరించి నెయ్యంబునఁ గుశలప్రశ్న సేసి ముదమునఁ బలికెన్. 47
క. [2]హరిభక్తుల పుణ్యాత్ముల, దురితవిదూరుల విరోధిదుర్దమబలులం
గురుకులతిలకుల కుంతీ, వరసూనుల సేమ మరసి వారనిభక్తిన్. 48
వ. ఇట్లనియె. 49
చ. హరి దననాభిపంకరుహమందు జనించినయట్టిభారతీ
శ్వరుఁ డతిభక్తి వేఁడ యదువంశమునన్ బలకృష్ణమూర్తు లై
పరఁగ జనించి భూభరముఁ బాపినభవ్యులు రేవతీందిరా
వరు లట శూరసేనునినివాసమునన్ సుఖ మున్నవారలే. 50
చ. కురుకులు లాదరింపఁగ సఖుండును నాప్తుఁడు నై తనర్చి సో
దరతరుణీజనంబులను దత్సుతులం గడుగారవంబునం
గరుణ దలిర్ప నాత్మజులకంటెఁ బ్రియోన్నతిఁ బ్రోచువాఁడు సు
స్థిరమతి నున్నవాఁడె వసుదేవుఁడు వృష్ణికులప్రదీపకా. 51
శా. కందర్పాంశమునం దనూజుఁ బడయం గామించి భూదేవతా
బృందంబున్ భజియించి తత్కరుణఁ [3]దాపింఛప్రభావిష్ణుపెం
పొందన్ రుక్మిణి గన్ననందనుఁడు ప్రద్యుమ్నుండు భాస్వచ్ఛమా
సందోహంబులు దన్నుఁ గొల్వ మహితోత్సాహంబుతో నొప్పునే. 52
క. సరసిజలోచనకరుణా, పరిలబ్ధసమస్తధరణిపాలనమహిమం
బరమప్రీతి సుఖించునె, చిరవిభవోదారుఁ డుగ్రసేనుఁడు జగతిన్. 53
చ. లలితపతివ్రతామణి విలాసవతీతిలకంబు పార్వతీ
లలన గుమారుఁ గన్నటు సులక్షణ జాంబవతీలలామ ని

---

1 నిజభక్తసద్గుణ. 2 హరిభక్తులు పుణ్యాత్ములు, దురితవిదూరులు విరోధిదుర్దమబలులుఁ గురుకులతిలకులు గుంతీ, వరసూనులు కుశలులే య వారితభక్తిన్' అ.ప్ర. 3 'దీపింపం బ్రభావంబు' అ.ప్ర.

ర్మలగతిఁ గన్నపట్టి సుకుమారతనుండు విరోధిభంజనో
త్కలిక సుఖించునే గుణకదంబుఁడు సాంబుఁడు వృష్ణిపుంగవా. 54

క. హరిపదసేవకుఁ డరిభీ, కరుఁ డర్జునువలన మిగులఁ గార్ముకవిద్యల్
[1]దిరముగఁ గఱచినసాత్యకి, వరసుఖవిభవముల నున్నవాఁడె ధరిత్రిన్. 55

మ. జలజాతాంకుశచక్రచాపకులిశచ్ఛత్త్రాదిరేఖాంకితో
జ్జ్వలగోవిందపదాబ్జలక్షితవిరాజన్మార్గధూళిచ్ఛటా
కలితాంగుండు విధూతకల్మషుఁడు నిష్కామైకధర్ముండు స
త్కులజాతుం డన నొప్పునట్టిఘనుఁ డక్రూరుండు [2]జీవించునే. 56

క. శ్రుతులును గ్రతుజాతము స, మ్మతిఁ దాల్చినయట్టి వేదమాతగతిన్ శ్రీ
పతిఁ దనగర్భంబున ర, క్షితుఁ జేసినగరిత దేవకీసతి [3]సుఖమే. 57

వ. మఱియు మహాత్మా మహితోపాసకు లగువారలకోర్కులు నిండింపం జాలిన భగవంతుండును శబ్దశాస్త్రంబునకుం గారణం బని తన్ను నఖిలదేవతాజనంబు లగ్గింపం గలమేటియును సకలజీవచతుర్విధాంతఃకరణంబు లయినచిత్తాహంకారబుద్ధిమనంబులకుం గ్రమంబున వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధు లధిదైవతంబు లగుచు నట్టిచతుర్విధతత్త్వంబులకుఁ దుర్యం బైనతత్త్వంబు మనస్సు తన్మనోమయుండు నైనయనిరుద్ధకుమారుండు సంతోషచిత్తుం డగునే యని. 58

మ. ఇతరారాధన మాని కృష్ణుఁ గమలాధీశుం బయోజాసనా
ర్చితు భక్తిన్ నిజనాథుఁగా సతతమున్ సేవించుపుణ్యుల్ జగ
న్నుతు లధ్యాత్మవిదుల్ మహాభుజులు మాన్యుల్ ధర్మమార్గుల్ సము
న్నతి సత్యాత్మజచారుదేష్ణగదు లానందాత్ములే యుద్ధవా. 59

తే. క్రోధమాత్సర్యధనుఁడు సుయోధనుండు
వోలుచునెవ్వనిసభఁ జూచి కలుష మొదవి
మనములోన నసూయానిమగ్నుఁ డయ్యె
నట్టిధర్మజుఁ డున్నాఁడె యనఘచరిత. 60

తే. ఘనగదాభ్యాసచిత్రసంగతుల మెఱసి, కురుకుమారుల భూరిసంగరములోన
హతులఁ గావించి వెలసినయట్టి జెట్టి, వాయుతనయుండు గుశలియై వఱలునయ్య.

చ. హరికరుణాతరంగితకటాక్షనిరీక్షణలబ్ధశౌర్యవి
స్ఫురణఁ దనర్చి తన్ను నని బోయగతి న్నభవుం డెదిర్చినన్
బరవస మొప్పఁగా గెలిచి పాశుపతాస్త్రముఁ గొన్నశత్రుభీ
కరుఁడు ధనంజయుండు సుభగస్థితి మోదము నొందునే గదా. 62

1. 'గఱచిన బలియుఁడు సాత్యకి, గఱలినసుఖలీల నున్నవాఁడె' గ్రా. ప్ర. 2. 'భద్రాత్ముఁడే' అ. ప్ర. 3. 'సుఖియే' వ్రాఁతప్రతులు.

మ. తెఱఁ గొప్పన్ జననీవియోగమునఁ గుంతీస్తన్యపానంబు సో
దరసంరక్షయుఁ గల్గి దేవవిభువక్త్రామృతంబుం ఖగే
శ్వరుఁ డర్థిం గయికొన్నమాడ్కిఁ గురువంశశ్రేణి నిర్జించి త
ద్ధరణీరాజ్యముఁ గొన్నమాద్రికొడుకుల్ ధన్యాత్ములే యుద్ధవా. 63

తే. పాండుభూమీశ్వరుండు సంప్రాప్తమరణుఁ, డైనశిశువులఁ బ్రోచుటకై నిజేశుఁ
గూడి చన కున్నయట్టిమాకుంతిభోజ,తనయ జీవించునే నేఁడు మనుచరిత్ర.

వ. అని వెండియు. 65

మ. అనుసంభూతుఁడు పాండుభూవిభుఁడు నిర్వాణంబునం బొందఁ దా
తనిపుత్రుల్ దనుఁ జేర వచ్చినను మాధ్యస్థ్యంబుఁ బోఁ దట్టి యె
గ్గొనరించెన్ [1]ధృతరాష్ట్రభూమివిభుఁ డట్లూహింపఁగా నెగ్గు సే
సినవాఁడే యగుఁ గాక మేలు గలదే చింతింపఁగా నుద్ధవా. 66

క. అనుజుఁడు వీఁ డనకయ తన, తనయులు నను వెడల నడువఁ దా నూరక యుం
డినధృతరాష్ట్రుఁడు నరకం, బునఁ బడు నా దైనదుఃఖమున ననఘాత్మా. 67

వ. అదియునుం గాక పరమశాంతుండ నైననీమనంబున దుఃఖంబు గర్తవ్యంబు గా
దంటేని. 68

క. నరలోకవిడంబనమున, హరి పరమపరుండు మానవాకృతితో ని
ద్ధరఁ బుట్టి యాత్మమాయా, స్ఫురణన్ మోహింపఁజేయు భూజనకోటిన్. 69

ఉ. కావున నమ్మహాత్ముని వికారవిదూరుని సర్వమోహమా
యావిలమానసుండ నగునప్పుడు సంసృతి దుఃఖ నౌదు స
ద్దేవునిసత్కృపామహిమఁ దేలినవేళ సుఖింతు నేన కా
[2]దావిధిశంకరప్రభృతు లవ్విభుమాయఁ దరింప నేర్తురే. 70

వ. అయిన నమ్మహాత్మునికరుణాతరంగితాపాంగపరిలబ్ధవిజ్ఞానదీపాంకురనిరస్తసమస్త
దోషాంధకారుండ నగుటను మదీయచిత్తంబు హరిపరాయత్తం [3]బయినఁ దన్మా
ర్గంబు సతతంబు నిరీక్షించుచు నుండుదు మఱియును. 71

సీ. అట్టిసరోజాక్షుఁ డార్తియపదభక్తు, లడవుల నిడుమలఁ గుడుచు చుండ
దాస్యంబు సేయఁ గొందఱు విరోధులు పట్టి, బద్ధునిఁ జేయ సన్నద్ధు లైన
బలహీనుమాడ్కి మార్పడ లేఁడ యనఘుఁ, డని తలంచెద వేని నచ్యుతుండు
పరుల జయింప నోపక కామ విద్యాభి, [4]జనధనమత్తు లై జగతిఁ బెక్కు

తే. బాధల నలంచుదుష్టభూపతుల నెల్ల, సైన్యయుక్తంబుగా నని సంహరించు
కొఱకు సభలోన నప్పుడాకురుకుమారు,లాడుదుర్భాషణములకు నలుగఁడయ్యె.

---

1 'మఱిఁ బాండుభూవిభునకు ♦ నూహింపఁగా' వ్రా. ప్ర. 2 'దావిధిరుద్రముఖ్యులకు ♦ నవ్వి...రచ్చునే.' వ్రాఁతప్రతులు. 3 'బయినకారణంబునను దత్త్వంబు సతతంబు' అచ్చుప్రతి 4 'జాత్యధనఁబుల ♦ జగతిఁ' అ. ప్ర.

మ. జననం బందుట లేనియీశ్వరుఁడు దా జన్మించు టెల్లన్ విరో
ధినిరాసార్థము వీతకర్ముఁ డగునద్దేవుండు గర్మప్రవ
ర్తనుఁ డౌ టెల్లఁ జరాచరప్రకటభూతశ్రేణులం గర్మవ
ర్తనులం జేయఁ దలంచి కాక కలవే దైత్యారికిం గర్మముల్. 73

క. హరి నరుల కెల్లఁ బూజ్యుఁడు, హరి లీలామనుజుఁడును గుణాతీతుఁడు నై
పరఁగి సభవకర్మంబులఁ, బొరయం డట హరికిఁ గర్మములు లీల లగున్. 74

క. మదిఁ దనశాసన మిడి నిజ, పదములు సేవించులోకపాలాదులఁ [1]బెం
పొదవింప యదుకులంబున, నుదయించెను భువిని బలసహోదరుఁ డగుచున్.

తే. చలన మందక భూరిసంసరణతరణ, మైనసత్కీర్తి దిక్కుల నతిశయిల్లి
వఱల సమమతి నై యున్నవాఁడె కృష్ణుఁ
డనుచు విదురుఁడు యుద్ధవు నడుగుటయును. 76

వ. అట్టియెడ నయ్యుద్ధవుండు. 77

క. యదుకులనిధి యగుకృష్ణుని, పదజలజవియోగతాపభరమున మాటల్
ప్రిదులక హృదయంబెరియఁగఁ, బెదవులు దడుపుచును వగలఁ బెంపఱియుండెన్.

క. అని చెప్పి బాదరాయణి, మనుజేంద్రునివలను సూచి మఱి యి ట్లనియెన్
విను మొకనాఁ డయ్యుద్ధవుఁ, డనయము నై దేండ్లబాలుఁ డై యున్నతఱిన్. 79

వ. మున్ను కృష్ణునిం గూడి యాడుబాలకులలో నొక్కబాలునిఁ గృష్ణునింగా భావించి పరిచర్య సేయుచుండ గుణవతీమతల్లి యగుతల్లి సనుదెంచి యాఁకొంటి వది యేల రా వన్న యని పిలిచిన జననీవాక్యంబులు గైకొనక యఖండతేజోనిధి యైనపుండరీకాక్షుపాదారవిందమకరందసేవానురక్తిం జేసి యున్నయుద్ధవుండు నేఁడు కృష్ణవియోగతాపంబున హరివార్త విదురునకుఁ జెప్పం జాలక (యొప్పఱి)యుండుట యే మివిచిత్రం బని వెండియు నిట్లనియె నంత నుద్ధవుండు సరోజాక్షుపాదారవిందమకరందసుధాజలనిధిమగ్నమానసుం డై సముత్కంఠం జింతించి యొక్కముహూర్తమాత్రంబునకు బాష్పజలపూరితలోచనుం డై గద్గదకంఠుం డగుచు. 80

క. ఘనముగ నెమ్మనమున [2]నిం, చినకృష్ణవియోగజనితశిఖి దరికొనఁగాఁ
గనుఁగవఁ బెడచే నొత్తుచుఁ, బెను పొందినమతిశిఖరిభుఁడు విదురున్. 81

వ. కనుంగొని యి ట్లనియె. 82

క. యముఁ డనుఘనకాలభుజం, గమపుంగవుఁ డెగచి పట్టఁ గా యదువంశో
త్తములచరిత్రలుఁ గత్తుక, లను లే మని చెప్పుదుం గలంగెడి మనమున్.

సీ. మునిజనముఖపద్మములు ముకుళింపంగ, ఖలజనలోచనోత్పలము లలర
జారచోరులకోర్కి సఫలత నొందంగ, దానవదర్పాంధతమస మడర

---

1 బెం, పొదవించుట కొఱకులమున. 2 'నిం, చిన......దరికొలుపన్' అవ్వప్రతి.

వరయోగిజనచక్రవాకంబు లడలంగఁ, గలుషజనానురాగంబు పర్వ
భూరిదోషాగమస్ఫూర్తి వాటిల్లంగ, నుదితధర్మక్రియ [1]లుడిగి మడఁగ
తే. మానుషాకారరుచికోటి మందపఱిచి, యనఘుఁడే మన నేర్తుఁ గృష్ణాభిధాన
లోకబాంధవుఁ డుత్తమశ్లోకమూర్తి, మించు తేజంబుతో నస్తమించె నయ్య.
వ. మఱియును. 85
క. హలకులిశజలజరేఖా, లలితశ్రీకృష్ణపాదలక్షిత యై ని
ర్మలగతి నొప్పెడుధరణీ, లలనామణి నేఁ డభాగ్యలక్షణ యయ్యెన్. 86
క. యాదవులవలన రాజ్య, శ్రీ దొలఁగెను ధర్మగతి నశించెను భువి మ
ర్యాదలు దప్పె నధర్మో, త్పాదనమున దైత్యభేది దప్పినపిదపన్. 87
వ. మఱియు లలితనికషణవిరాజమానమణిగణకిరణసుషమావిశేషవిడంబితవిమలసలిలంబులందుఁ బ్రతిఫలితసంపూర్ణచంద్రమండలరుచి నిరీక్షించి జలచరబుద్ధిం జేసి తజ్జలవిలోలమీనంబు లనూనస్నేహంబునం దలంచుచందంబునఁ గృష్ణానుచరు లైనయదువృష్ణికుమారు లమ్మహనీయమూర్తిం దమకు నగ్రేసరుం డని కాని లీలామానుషవిగ్రహుం డైనపరమాత్ముం డని యెఱుంగక హరిమాయాజనితం [2]బగునసద్భావంబునం జేసి భోజనశయనాసనానుగమనంబులం జేరి సహోదరాదిభావంబులం గూడి చరియింతు రట్టిదేవుని మాయాపయోనిధినిమగ్నులు గాకుండ నజ్జభవభవాదులకైనం దీఱదు సర్వగుణగరిష్ఠులును సత్పురుషశ్రేష్ఠులును నగుపరమభాగవతులకుం దక్కఁ దక్కినవారలకుం జెప్ప నేల యదియునుం గాక యభిజనవిద్యాధనబలగర్వమదాంధీభూతచేతస్కు లైనశిశుపాలాదిభూపాలకు లమ్మహాత్మునిం బరతత్త్వం బని యెఱుంగక నిందించుదుర్భాషలు దలంచి మనస్తాపంబు నొందు చుండుదు నని వెండియు. 88
మ. అవితృప్తవ్రతధీసమాహితతపోవ్యాసంగు లైనట్టిభా
గవతశ్రేష్ఠుల కాత్మమూర్తి నిఖిలైకజ్యోతి యై చూపి [3]లో
కవిశోకంబులు నిర్దహించి కమలాకాంతుండు శాంతుండు మా
నవరూపం బగుదేహమున్ వదలి యంతర్ధానుఁ డయ్యెం జుమీ. 89
సీ. మర్త్యవికాసైకమానమై తనకును, విస్మయజనకమై వెలయునట్టి
యాత్మీయయోగమాయాశక్తిఁ జేపట్టి, చూపుచు నత్యంతసుభగ మగుచు
భూషణంబులకును భూషణం బై వివేకముల కెల్లను బరకాష్ఠ యగుచు
సకలకల్యాణసంస్థాన మై సత్య మై, తేజరిల్లెడునట్టిదివ్యమూర్తి
తే. తాన తనమూర్తినిజశక్తిఁ దనర ధరించి, యమతనూభవురాజసూయాధ్వరంబు
నందు నెవ్వనిశుభమూర్తి నర్థితోడ, నిందు వేడుకఁ జూచి వర్ణించు చుండు.

---

1 'లుర్లు మడఁగ; లుర్లి పడఁగ' వ్రా. ప్ర. 2 'బైనదుసద్భావంబునం జేసి' వ్రా. ప్ర.
3 'లో, కవిలోకంబులు' వ్రా. ప్ర.

కం. ప్రకటముగఁ గమలభవసృష్టికిఁ గారణ మిమ్మహాత్ముఁ డే యనుచును ను
త్సుకు లై తన్మూర్తిని దప్పక చూచిరి గాదె తత్సభాజను లెల్లన్. 91

వ. మఱియు శాంతోగ్రరూపధరుం డైన సర్వేశ్వరుండు శాంతరూపుండు గావునఁ బరకృతాపరాధనిపీడ్యమానమానసుం డయ్యు ననుకంపాయత్తచిత్తుం డై వర్తించుపరాపరుండును బ్రకృతికార్యం బైనమహత్తత్త్వరూపుండును జననవిరహితుం డయ్యును దారువులవలన ననలంబు దోఁచుచందంబున జననంబు నొందుచుండు నట్టిసరోజనాభుని హాసరాసలీలానురాగవిలోకనప్రతిలబ్ధమాన లైన గోపకామినులు దన్మూర్తిదర్శనానుషక్తమనీషలం గలిగి వర్తించి రదియునుం గాక. 92

చ. దివిజులకోర్కిఁ దీర్ప వసుదేవునియింట జనించి కంసదా
నవుఁడు హరించు నన్భయమునం జని నందునియింట నుంటకున్
యవనజరాసుతాదులకు నాజి నెదుర్పడ లేక సజ్జన
స్తవ మథురాపురిన్ విడిచి దాఁగుటకున్ మదిఁ జింత నొందుదున్. 93

వ. అదియునుం గాక. 94

సీ. కడఁగి పెక్కిడుమలఁ గుడుచుచుఁ జిత్తముల్, గలఁగఁగ బంధనాగారములను
వనరినదేవకీవసుదేవులను డాయఁ, జనుదెంచి భక్తివందన మొనర్చి
తలిదండ్రులార యేఁ గలుగంగ మీరలు, కంసుచే నలజడిఁ గ్రాఁగుచుండఁ
గడిఁదిశత్రునిఁ జంపఁగా లేక చూచుచు, నున్ననాతప్పుఁ బ్రసన్ను లగుచుఁ

తే. గావుఁ డని మానతిచ్చినదేవదేవు, నప్పుడావహమధురవాక్యములఁ దలఁచి
తలఁచినాచిత్తమునఁ బెగ్గలఁగుచుండుఁ, బృషిలపాతకభూమిభృద్భిదుర విదుర.

కం. విమలమతిఁ దలఁప నెవ్వని, బొమముడిమాత్రమున నఖిలభూదేవీభా
రము వాయు నట్టిహరిపద, కమలమరందంబుఁ గ్రోలుఘనుఁ డెవ్వాఁడో. 96

కం. మందప్రజ్ఞుఁడ నై గో, విందుని మురదైత్యహరుని విష్ణునిఁ బరమా
నందుని నందతనూజుని, మందరధరుఁ జిత్తమందు మఱతునె యెందున్. 97

చ. అదియును గాక మీకు నృపులందఱుఁ జూడఁగ ధర్మసూతిచేం
బొదవినరాజసూయసవనోత్సవమందును జన్మనామాదిగాఁ
బదపడి యుగ్రానఘశిశుపాలుఁడు యోగిజనంబు నిట్టి ద
ట్టి దని యెఱుంగ నోపనికడిందిపదంబునఁ బొందెనే కదా. 98

చ. కురునృపపాండునందను లకుంఠితకేళిఁ జమూసమేతు లై
యరిదిరణోర్చి నెవ్వనిముఖాంబురుహామృతమూర్తి లోచనో
త్కరములఁ గ్రోలి పార్థవిశిఖప్రకరక్షతపూతగాత్రు లై
గురుతరమోక్షధామమునకుం జని సౌఖ్యము [2]నొందిరో తుదిన్. 99

1 ననుకంపాయుక్తుం డై. 2 'నొందరే కదా' వ్రా. ప్ర.

సీ. అట్టిసరోజాక్షుఁ డాద్యంతశూన్యుండు, సుభగుండు త్రైలోక్యసుందరుండు
కమనీయసాగరకన్యకాకుచకుంకు, మాంకితవిపులవక్షాంతరుండు
సకలదిక్పాలకస్వకిరీటన్యస్త, పద్మరాగారుణపాదపీఠుఁ
డజుఁ డనంతుఁడు సమానాధికవిరహితుం, డిద్ధమూర్తిత్రయాధీశ్వరుండు
తే. నైన హరి యుగ్రసేనుని నఖిలరాజ్య, రుచిరసింహాసనమునఁ గూర్చుండఁబెట్టి
భృత్యభావంబునొంది సంప్రీతి నతని, పనుపు సేయుట కెప్పుడు పాయమనము గుంటు.

వ. అని వెండియు నిట్లనియె ననఘా (పరాత్పరుండును యోగీశ్వరేశ్వరుండును నగు కృష్ణుండు భగవద్భక్తుండును బరమభాగవతోత్తముండును నైన యుగ్రసేనుని సేవించుట యాశ్చర్యంబు గాదు తన్ను హరియింపం దలంచి కుచంబుల విషంబు ధరియించి స్తన్యపానంబు సేయించిన దుష్టచేతన యైన పూతనకుం జన్నిచ్చి పెంచిన యశోదాదేవికి నైన నందరాని నిజపదంబుఁ గారుణ్యాయత్తచిత్తుం డై యొసంగె ననిన నిజపదధ్యానపరాయణు లగువారల ననుసరించి సేవించుట సెప్ప నేల యనిన నుద్ధవునికి విదురుం డిట్లనియె భక్తవత్సలుండును గారుణ్యజలనిధియు (నై భాగవతజనుల ననుగ్రహించు) పుండరీకాక్షుండు భాగవతసేవ సేసెం గాక నిజదాసలోకంబున కొసంగుపరమపదంబు నుగ్రకర్ము లైన రాక్షసుల కెట్లొసంగె నత్తెఱం గెఱింగింపు మనిన విదురునకు నుద్ధవుం డిట్లనియె. 101

మ. దనుజానీక మనేకవారములు నోర్ద్దర్పంబు సంధిల్లఁగా
వినతాసూనుభుజాధిరోహుఁ డగు నవ్విష్ణున్ సురాభాయుధు
న్ననిలో మార్కొని పోరు పోరు హరి దైత్యారాతి యంచుం దదా
ననముం జూచుచుఁ గూలి మోక్షపదము న్బ్రాపింతు రత్యున్నతిన్. 102

క. ధీరజనోత్తమ నవసిత, సారసలోచనుఁడు కృష్ణు జననంబును ద
చ్చారిత్రము నెఱిఁగింతు ను, దారత నీ విపుడు వినుము తద్విధ మెల్లన్. 103

చ. ధరణిభరంబు వాపుటకుఁ దామరసాసనుప్రార్థనన్ రమా
వరుఁ డలకంసబంధననివాసమునన్ వసుదేవదేవకీ
వరులకు నుద్భవింప బలవంతుఁడు కంసుఁడు హింస సేయు న
న్వెఱపున నర్ధరాత్రి సుతుఁ గొని యవ్వసుదేవుఁ డిష్టులన్. 104

క. నందునిమందకుఁ జని త, త్సుందరితల్పమునఁ బాలు నూడకయుండన్
నందనుని నునిచి యూనక, దుందుభి మరలంగ నేఁగెఁ దొల్లిటిపురికిన్. 105

క. హరి యేకాదశసంవ, త్సరములు నందవ్రజమునఁ దను హరి యని యె
వ్వరు నెఱుఁగకుండ బాలల, తోఁ [1]క్రీడించుచుండె దగ్గయుఁ బ్రీతిన్.

క. గోపాలవరుల కైనను, నాపోవఁగఁ దనసమానచిరతాకార మొగిం
జూపని శ్రీపతి వేడుక. గోపాలురఁ గూడి కాచె గోవత్సములన్. 107

1 'గూడాడుచుండె' అనియే వ్రాఁతప్రతులు.

వ. అయ్యవసరంబునం గృష్ణుండు లీలావినోదంబులు దోడిగోపాలబాలురకుం
జూపం దలంచి. 108

చ. వరయమునానదీసలిల‡వర్ధితసౌరభయుక్తపుష్పమే
దురమకరందపాన[1]పరి‡తుష్టమధువ్రతయూథమాధవీ
కురవకకుందచందనని‡కుంజములందు మయూరశారికా
పరభృతరాజకీరమృదు‡భాషలభంగిఁ జెలంగి పల్కుచున్. 109

ఉ. శ్రీరమణీమనోవిభుఁడు ‡ సింహకిశోరముఁబోలె లీలఁ గా
మారదశన్ రమావిమల‡మందిరముం బురుడించుగోతతిన్
వారక మేపుచుం దరళ‡వంశరవస్ఫుటమాధురీసుధా
సారముచేత గోపజన‡సంఘములన్ ముద మందఁ జేయుచున్. 110

వ. మఱియును. 111

మ. చిరకేళీరతి బాలకుల్ దృణములన్ ‡ సింహాదిరూపంబులం
గర మొప్పన్ విరచించి వాని మరలన్ ‡ ఖండించుచందంబునం
గరుణాతీతులఁ గామరూపు లగున‡క్కంసప్రయుక్తక్షపా
చరులం గృష్ణుఁడు సంగరస్థలములం ‡ [2]జక్కాడె లీలాగతిన్. 112

చ. వరయమునానదీజలని‡వాసమహోరగవిస్తృతాస్యవి
స్ఫురితవిషానలప్రభల‡సోఁకునఁ గ్రాఁగినగోపగోధనో
త్కరముల నెల్లఁ గాచి భుజ‡గప్రవరున్ వెడలంగఁ దోలి త
త్సరిదమలాంబుపానమున ‡ సంతస మందఁగఁ జేసె గోతతిన్. 113

మ. దివిజాధీశుగుఱించి వానకొఱకై ‡ దీపింప నందాదివ
ల్లవు లేఁటేఁట ననూనసంపదల ను‡ల్లాసంబునం జేయును
త్సవముం గృష్ణుఁడు మాన్పి గోపగణముల్ ‡ సంప్రీతి నొందన్ శచీ
ధవుగర్వం బడఁపంగ నవ్యయముగాఁ ‡ దాఁ జేసె గోయాగమున్. 114

చ. హరిహయుఁ డంత రోషవివ‡శావిలమానసుఁడై సరోరుహో
దరుమహిమం బెఱుంగక మ‡దం బడరంగ వలాహకాదిభీ
కరఘనపంక్తిఁ బంపిన న‡ఖండశిలామయభూరివర్షముల్
గురిసె ననూనగర్జనల ‡ గోకుల మాకుల మంది మ్రుందఁగన్. 115

ఉ. ఆతఱి మంద గొందలము ‡ నందఁగ వల్లవు లెల్లఁ గృష్ణ కృ
ష్ణేతివిభీతవాక్యములఁ ‡ జిందఱవందఱలై కలంగుచుం
గాతరులై మముం గరుణఁ ‡ గావుము కావు మనాథనాథ ని
ర్ధూతకళంక భక్తపరి‡తోషణభూషణ పాపశోషణా. 116

మ. అని యిబ్భంగి విపన్నులై పలుకఁ గు‡య్యాలించి కృష్ణుండు స

1 పరి‡తుష్టితభృంగసమూహమాధవీ. 2. 'జెండాడె' వ్రా. ప్ర.

జనవర్ధిష్ణుఁడు గోపగోనివహరక్షాదక్షుఁడై దేవతా
జను లగ్గింపఁ గరాంబుజాతమున సచ్ఛత్త్రంబుఁగాఁ దాల్చె బో
రన గోవర్ధనశైలముం దటచరద్రమ్యామరీజాలమున్. 117

వ. వెండియు. 118

సీ. శరదాగమారంభసంపూర్ణపూర్ణిమా, చంద్రసాంద్రాతపోజ్జ్వలిత మగుచు
వెలయుబృందాటవీవీథియం దొకనాఁడు, రాసకేళీమహోల్లాసుఁ డగుచు
రుచిరసౌభాగ్యతారుణ్యమనోరమ, స్ఫూర్తిఁ జెన్నొందినమూర్తి దనర
సలలితముఖచంద్రచంద్రిక గోపికా, నయనోత్పలముల కానంద మొదవ
తే. భవ్యచాతుర్యభంగిఁ ద్రిభంగి యగుచు, నబ్జనాభుండు సమ్మోద మతిశయిల్ల
లీలఁ బూరించువరమురళీనినాద, మర్థి వీతేర విని మోహితాత్మ లగుచు. 119

చ. పతులు మఱందులున్ సుతులు బావలు నత్తలు మామలున్ సము
న్నతి వల దన్న మానక మనంబునఁ గృష్ణపదాబ్జసేవనా
న్వితరతి గోపకామినులు వే చనుదేఁ గరుణాపయోధి శో
భితగతి రాసకేళి సలిపెం దరుణీనవపుష్పచాపుఁడై. 120

ఉ. రాముఁడు దాను గూడి మథురాపురికిం జని యందు వైభవో
ద్దామనృపాసనంబున ముదంబున నున్నదురాత్ముఁ గంసు దు
ష్టామరశత్రుఁ ద్రుంచి ముద మారఁగఁ దల్లిని దండ్రి నంచిత
శ్రీమహితాత్ములై తనరఁ జేసె సరోరుహనాభుఁ డున్నతిన్. 121

మ. నలు వొప్పంగ షడంగయుక్తమహితా[1]మ్నాయంబుఁ జౌషష్టివి
ద్యలు సాందీపనిచే నెఱింగెఁ జెలు వొందన్ విన్నమాత్రంబులో
పల నే లోకగురుండు దాన తనకున్ భావింప నన్యుల్ గురు
ల్గల రే లోకవిడంబనార్థ మగు లీలల్ గావె యమ్మేటికిన్. 122

ఉ. [2]మించి ప్రభాసతీర్థమున మృత్యువశంబునఁ బొంది పోయి యా
పంచజనోదరస్థుఁ డగుబాలకు దేశికునందనుం బ్రభో
దంచితలీలఁ దెచ్చి గురుదక్షిణగా నతిభక్తియుక్తి న
ర్పించె గురుండు చిత్తమునఁ బెంపెసలార మురారి వెండియున్. 123

సీ. ఘనుఁడు విదర్భేశుఁ డన నొప్పుభీష్మకు, వరసుతామణి నవవారిజాక్షిఁ
బద్మాసమానరూపశ్రీవిభాసితఁ, గమనీయభూషణఁ గంబుకంఠిఁ
జతురస్వయంవరోత్సవసమాగతచైద్య, సాల్వమాగధముఖ్యజనవరేణ్య
నికరసమావృతఁ బ్రకటసచ్చారిత్ర, రుక్మిణి నసమానరుక్మకాంతి
తే. నమరగుప్తామృతంబు విహంగవిభుఁడు, గొనినకైవడి మనుజేంద్రకోటిఁ దోలి

1 'మ్నాయాగనైర్మల్యవి, ద్యలు' వ్రా. ప్ర. 2 'మించి ప్రభాసతీర్థజలమధ్యమునన్ మృతిఁ బొంది పోయి' వ్రా. ప్ర.

కమలనాభుండు నిజభుజాగర్వ మలరఁ, దెచ్చి వరియించె నతని నుతింపవశమె.

చ. పసువడి భూరిసప్తవృషభంబుల ముక్కులు గుట్టఁ దద్బల
స్ఫురణ సహింపఁ జాలక నృపుల్ దలపడ్డ జయించి నగ్నజి
ద్ధరణిపునందనన్ వికచతామరసాక్షిఁ బ్రమోదియై స్వయం
వరమునఁ బెండ్లియాడె గుణవంతుఁ డనంతుఁ డనంతశక్తితోన్. 125

మ. ప్రతివీరక్షయకారి నాఁ బరఁగి సత్రాజిత్తనూజాహృదీ
ప్సితముం దీర్పఁ దలంచి నాకమునకుం బెంపారఁగా నేఁగి వ
ర్ణితశౌర్యోన్నతిఁ బారిజాత మిలకు న్లీలాగతిం దెచ్చె ను
ద్ధతి దేవేంద్రు జయించి కృష్ణుఁ డన నేతన్మాత్రుఁడే చూడఁగన్. 126

సీ. మానితాఖిలజగన్మయదేహమునఁ బొల్చు, ధరణిదేవికిఁ బ్రియతనయుఁ డైన
నరకదానవుని సునాభాఖ్యఁ జెన్నొందు, ఘనచక్రధారావిఖండితోత్త
మాంగునిఁ జేయ నయ్యవనీలలామంబు, వేఁడినఁ దత్పుత్రు విపులరాజ్య
పదమున నిల్పి లోపలిమందిరమునకుఁ, జేరఁగ నరకుండు సెఱలఁ బెట్టి

తే. నట్టికన్యలు నూఱుఁ బదాఱువేలు, నార్తబాంధవుఁ డైనపద్మాక్షుఁ జూచి
హర్షబాష్పాంబుధారాప్రవర్ష మొదవఁ, బంచశరబాణనిర్భిన్నభావ లగుచు.

చ. లలితతదీయసుందరవిలాసవిమోహిత లైనవారి నిం
పొలసినకోర్కెఁ దీర్చుటకు నొక్కముహూర్తమునన్ వరించి క
న్యల లలితావరోధభవనంబుల నందఱ కన్నిరూపులై
కలసి సుఖస్థితిం దనిపెఁ గాంతల భక్తినితాంతచిత్తలన్. 128

క. చతురతతో నందొక్కొక, యతివకుఁ బదురేసి సుతుల నాత్మసముల ను
న్నతభుజశక్తులఁ గాంచెను, వితతం బై కీర్తి దిశల వినుతికి నెక్కన్. 129

సీ. మథురాపురము జతుర్విధబలౌఘములతో, నావరించినకాలయవనసాల్వ
మగధభూపాలాదిమనుజేంద్రలోకంబు, సైన్యయుక్తము గాఁగ సంహరించి
తనబాహుశక్తిఁ జిత్తముల సర్థించిన,భీమపార్థులకు సుదామవిజయ
మొసఁగి తద్వైరుల నుక్కడంగఁగఁ ద్రుంచి, బాణశంబరమురపల్వలాది

తే. దనుజనాయకసేనావితానములను, హలధరాదిసమేతుఁ డై హతులఁ జేసె
[1]దంతవక్త్రాదిదైత్యులు దన్ను నెదుర, భండనములోనఁ ద్రుంచె దోర్బలము మెఱసి.

వ. వెండియుం గృష్ణుండు కౌరవపాండవభండనంబునకుం దోడ్పడి రాజన్యు లన్యో
న్యమాత్సర్యోత్సాహసమేతులై సైనికపాదఘట్టనంబుల ధరాచక్రంబు గంపింప
ననన్యసామాన్యంబు లయినశంఖభేరీప్రముఖతూర్యఘోషంబులు నింగి ముట్టఁ
దురంగమరింఖాసముద్ధూతధూళిపటలపరిచ్ఛన్నభానుమండలంబునుం గాఁ జను
దెంచి కురుక్షేత్రంబున మోహరించిన నుభయపక్షబలంబులం దునుమాడి నిఖిల

1 దంతిమె యవనాదిదైత్యులు.

రాజ్యవైభవమదోన్మత్తుం డయినసుయోధనుండు నిఖిలరాజసమక్షంబునఁ గర్ణ శకునిదుశ్శాసనాదులదుర్మంత్రంబున నిరంతరంబుఁ గుంతీనందనుల కెగ్గు సేసిన దోషంబునం జేసి సంగరరంగంబున భీముగదాఘాతంబునం దొడలు విఱిగి పుడమిం బడి గతాయుశ్శ్రీవిభవుం డై యుండ సపరితోషచిత్తుండ నై చూచితిని గదా యపరిమితబాహుబలోత్సాహు లైనభీష్మద్రోణభీమార్జునులచేత నఖిలధరాధిపతుల నష్టాదశాక్షౌహిణీబలంబులతోడం దునిమించితి నింకను మత్సమానబలు లయినయదువీరుల జయింప నెంతవారలకైనం దీరదు మధుపానమదవిఘూర్ణితతామ్రవిలోచను లై వర్తించుయాదవుల కన్యోన్యవైరంబులు గల్పించి పోరించి యితరేతరకరాఘాతంబుల హతులై తన్నుఁ గలసినం గాని భూభారం బుడుగదని చిత్తంబునం దలంచి యంత ధర్మనందనుచే నిస్సపత్నంబగురాజ్యంబు పూజ్యంబుగాఁ జేయించుచు మర్త్యులకుం గర్తవ్యంబు లైనధర్మపథంబులు సూపుచు బంధుమిత్రులనెల్లఁ బరితోషంబు నొందించుచుం దత్పరోక్షంబున వారి వంశం బుద్ధరింపం దలంచి యభిమన్యువలనియుత్తరాగర్భంబు నిలిపి గురుతనయప్రయుక్తమహితబ్రహ్మాస్త్రపాతంబునం దగ్గర్భదళనంబు గాకుండ నర్భకుని రక్షించి నిజపదారవిందసేవారతుం డైనధర్మసుతుచేఁ గీర్తిప్రతాపంబులు నివ్వటిల్లం దురంగమేధంబులు మూఁడు సేయించి వెండియు. 131

సీ. వల నొప్ప లౌకికవైదికమార్గముల్, నడపుచు ద్వారకానగరమందు
నవిదితాత్మీయమాయాప్రభావమున ని, స్సంగుఁ డై యుండి సంసారిపగిదిఁ
జెంది కామంబులచేత విమోహితుం, డై సుఖించుచు ముదితాత్ముఁ డగుచు
నంచితస్నిగ్ధస్మితావలోకముల సు, ధాపరిపూర్ణసల్లాపములను
తే. శ్రీనికేతన మైనశరీరమునను, బాండునందనయనుకులప్రకరములను
లీలఁ గారుణ్యమొలయఁ బాలించుచుండె, నార్తరక్షాచణుండు నారాయణుండు.

సీ. సంపూర్ణపూర్ణిమాచంద్రచంద్రిక నొప్పు, రమణీయశారదరాత్రులందు
సలలితకాంచనస్తంభసౌధోపరి, చంద్రకాంతోపలస్థలములందు
మహితకరేణుకామధ్యదిగ్గజముల, గతిని సౌదామినీలతలనడిమి
నీలమేఘంబులలీల [1]ముక్తానుయు, క్తస్నిగ్ధనీలరత్నములభాతి
తే. సతతయౌవనసుందరీయుతవిహారుఁ, డగుచు సతు లెంద ఱందఱ కన్నిరూప
ములను గ్రీడించెఁ బెక్కబ్దములు సెలంగి, నందనందనుఁ డభినవానందలీల. 133

వ. అంత నొక్కనాఁడు. 134

చ. మునివరు లేఁగుదేర యదు[2]భోజవరేణ్యులు గూడి ముట్టఁ బ
ల్కినఁ గన లొంది వారు దమకించి శపించినఁ గొన్నిమాసముల్
చను నెడ దైవయోగమున జాతరఁ బో సమకట్టి వేడుకల్

1 ముక్తాయుక్త. లాలితస్నిగ్ధనీలములభాతి. 2 'ముఖ్యులు గొందఱు గూడి' అ. ప్ర.

మనములఁ దొంగలింపఁ గరిమన్ నిజయానము లెక్కి యాదవుల్. 135

ఉ. కోరి ప్రభాసతీర్థమునకుం జని తన్నదిఁ గ్రుంకి నిర్మలో
దారత నందు దేవమునితర్పణముల్ పితృతర్పణంబులున్
వారనిభక్తిఁ జేసి నవవత్సలతోఁ బాలుపారుగోవులన్
భూరిసదక్షిణాకముగ భూసురకోటికి నిచ్చె వెండియున్. 136

క. అజినపట రత్నకంబళ, రజత మహారజత తిల ధరా వరకన్యా
గజ తురగ రథములను సద్ద్విజకోటికి నిచ్చెఁ బెంపు దీపింపంగన్. 137

వ. ఇట్లు సఫలంబు లయినభూదానంబు మొదలుగాఁ గలదానంబు లనూనంబులుగా భగవదర్పణబుద్ధిం జేసి యనంతరంబ. 138

తే. ఎసఁగుమోదంబు సంధిల్ల నిష్టమైన, రసికమృదులాన్న మర్థిఁ బారణలు సేసి
మంజులాసవరసపానమత్తులగుచుఁ, గడఁగియన్యోన్యహాస్యవాక్యములఁ గలఁగి.

వ. ఇట్లు దమలోన మదిరాపానమదవిఘూర్ణితతామ్రలోచను లయి మత్సరంబుల నొండొరులం బొడిచి సమస్తయాదవులును వేణుజాతానలంబునఁ దద్వంశపరంపరలు దహనంబు నొందుచందంబునం బొలిసి రది యంతయుం గనుంగొని శ్రీకృష్ణుం డప్పుడు. 140

క. చతురతతో నిజమాయా, గతిఁ జూచి లసద్విలోలకల్లోలసమం
చితవిమలకమలసార, స్వతజలముల విహితవిధులు సలిపినవాఁడై. 141

క. ఒకవృక్షమూలతలమున, సకలంకగుణాభిరాముఁ డాసీనుండై
యకుటిలమతి [1]బదరీవన, మునకును బొమ్మనుచు మొఱఁగి పోయిన నేనున్. 142

క. క్రమమున నిజకులసంహా, రము సేయఁ గడంగు టెఱిఁగి రమణీయశ్రీ
రమణుచరణాబ్జయుగవిర, హమునకు మది నోర్వలేక యనుగమనుఁడనై. 143

క. హరి నరయుచుఁ జని చని యొక, తరుమూలతలంబునందుఁ దనదేహరుచుల్
నరఁగఁగ నున్నమహాత్మునిఁ, బరునిఁ బ్రపన్నార్తిహరుని భక్తవిధేయున్. 144

వ. మఱియును. 145

సీ. అస్మత్ప్రియస్వామి నచ్యుతుఁ బరు సత్త్వగుణగరిష్ఠుని రజోగుణవిహీను
సురుచిరద్వారకాపురసమాశ్రయు నన్యాశ్రయు నీలనీరదశ్యామవర్ణు
దళదరవిందసుందరపత్త్రనేత్రు లక్ష్మీయుతుఁ బీతకౌశేయవాసు
విలసితవామాంకవిన్యస్తదక్షిణ, చరణారవిందు శశ్వత్ప్రకాశు

తే. ఘనచతుర్బాహు సుందరాకారు ధీరుఁ, జెన్నుగలలేఁతరావిపై వెన్ను మోపి
యున్నవీరాసనాసీను నన్నుఁ గన్న, తండ్రి నానందపరిపూర్ణు దనుజహరుని.

మత్తకోకిలము. కంటిఁ గంటి భవాబ్ధి దాఁటఁగఁ గంటి నాశ్రితరక్షకుం
గంటి యోగిజనంబు డెందముఁ గంటిఁ జుట్టముఁ గంటి ము

---

1 'బదరీవని, కేళి నీ వరుగు మని మొఱఁగి యేఁగిన' అ. ప్ర.

క్కంటికిం గన రానియొక్కటిఁ గంటిఁ దామరకంటిఁ జే
కొంటి ముక్తివిధానముం దలకొంటి సౌఖ్యము లందఁగన్. 147

వ. అయ్యవసరంబునం బరమభాగవతోత్తముండును మునిజనసత్తముండును ద్వైపాయనసఖుండును బరమతపోధనుండును నఘశూన్యుండును నఖిలజనమాన్యుండును బుధజనవిధేయుండును నగు మైత్రేయుండు దీర్ఘాచరణంబు సేయుచుం జనిచని. 148

మ. కనియెం దాపసపుంగవుం డఖిలలోకఖ్యాతవర్ధిష్ణు శో
భనభాస్వత్పరిపూర్ణయౌవనకళాభ్రాజిష్ణు యోగీంద్రహృ
ద్వనజాతైకచరిష్ణుఁ గౌస్తుభముఖోద్యద్భూషణాలంకరి
ష్ణు నిలింపాహితజిష్ణు విష్ణుఁ బ్రభవిష్ణుం గృష్ణు రోచిష్ణునిన్. 149

క. తదనంతరంబ హరిఁ దన, హృదయాంభోరుహము ముకుళితేక్షణముల స
మ్మదమునఁ జూచుచు నానత, వదనుం డై యుండె ముదము వఱలఁగ ననఘా.

వ. అంత దగ్గఱ నేతెంచి యున్న మైత్రేయుండు వినుచు నుండ దరహాసచంద్రికాసుందరవదనారవిందుండును నానందసుధానిష్యందకందళితహృదయుండును భక్తానురక్తదయాసక్తవిలోకనుండును నగు పుండరీకాక్షుండు నన్ను నిరీక్షించి యిట్లని యానతిచ్చెఁ బూర్వభవంబున వసుబ్రహ్మలు సేయుసత్త్రియాగంబున వసువై భవదీయహృదయంబున నితరపదార్థంబులు గోరక మదీయపాదారవిందసేవం గాంక్షించితివి గావునం దన్నిమిత్తంబున నేను నీహృదయంబున వసియించి సమస్తంబును గనుచుండుదు నాత్మారాముండ నై నన్ను నెవ్వరేనియు సదసద్వివేకులై యెఱుంగం జాలరు వారలకు నేను నగోచరుండ నై యుండుదు మత్పరిగ్రహంబు గలనీకు నీజన్మంబ కాని పునర్భవంబు నొందకుండుటకు భవదీయపూర్వజన్మకృతసుకృతవిశేషఫలంబు కతన నియ్యాశ్రమంబున మత్పాదారవిందసందర్శనంబు గలిగె నదియునుం గాక పద్మకల్పంబునందు మన్నాభిపద్మమధ్యనిషణ్ణుం డయిన పద్మసంభవునకు (జన్మమరణాదిసంసృతినివర్తకంబును నవిరతానశ్వరసౌఖ్యప్రవర్తకంబును నగు) మన్మహత్త్వంబుఁ దెలియఁ జేయు నట్టిదివ్యజ్ఞానంబు నీకు నెఱింగింతు నని యమ్మహనీయ తేజోనిధి యానతిచ్చిన సుధాసమానసరసాలాపంబులు గర్ణకలాపంబులై మనస్తాపంబులం బాపిన రోమాంచకంచుకితశరీరుండను నానందబాష్పధారాసిక్తకపోలుండను బరితోషసాగరాంతర్నిమగ్నమానసుండను నయి యంజలిపుటంబు నిటలతటంబున ఘటియించి యిట్లంటి. 151

క. పురుషోత్తమ నీపదసర,సిరుహధ్యానామృతాభిషేకస్ఫురణం
గర మొప్పిన నాచిత్త మి,తరవస్తువులందు వాంఛఁ దగులునె యెందున్. 152

చ. జననము లేనినీవు భవసంగతి నొందుట కేమికారణం
బనియును గాలసంహరుఁడవై జగముల్ [1]విలయించునీవు పా
యనిరిపుభీతికై సరిదుదంచితదుర్గము నాశ్రయించు టె
ట్లనియును దేవ నామనమునందుఁ దలంతు సరోజలోచనా. 153

వ. అదియునుం గాక. 154

క. శ్రీరమణీశ్వర నీవా, త్మారాముఁడ వయ్యు లీలఁ దరుణీకోటిం
గోరి రమించితి వనియును, వారక నేఁ దలఁతు భక్తవత్సల కృష్ణా. 155

క. పరతత్త్వజ్ఞులు గరుణా, కర నిను సంసారి వనుచుఁ గడఁకఁ దలంపన్
అరసి ననుఁ గాచు టెల్లను, గర మరుదు తలంచి చూడఁ గమలాధీశా. 156

వ. దేవా నీ వఖండితవిజ్ఞాననిర్మలాంతఃకరణుండ వయ్యును ముగ్ధభావంబునఁ బ్రమత్తునిచందంబున విమోహితుండై వడిం బ్రవర్తించుచు నెందేని నొదిఁగి యుండుటం దలంచి నాడెందంబు గుందు చుండు నరవిందలోచన పురందరవందిత ముకుంద యిందిరాసుందరీరమణ సరస్వతీరమణునకుం గరుణించి యానతిచ్చినసుజ్ఞానంబు ధరించుశక్తి నాకుం గలదేనిఁ గృపసేయుము భవదీయశాసనంబు ధరియించి భూరిసంసారపారావారోత్తరణంబు సేయుదు నని విన్నవించి బహుభంగులం బ్రస్తుతించిన భగవంతుండును బ్రసన్నపారిజాతంబును నైనకృష్ణుండు పరతత్త్వనిర్ణయంబు నెఱింగించిన. 157

క. సరసిజలోచనకరుణా, పరిలబ్ధజ్ఞానకలితభావుఁడ నగుటం
బరతత్త్వవేది నై, తచ్చరణసరోజముల కెరఁగి సమ్మతితోడన్. 158

క. హరిపదజలరుహవిరహా, తురతన్ దుర్దాంతదుఃఖతోయధిఁ గడవన్
వెరవేది తిరుగ వలసెను, సరసిజభవకల్పవిలయసమయము[2]దాఁకన్. 159

వ. ఇట్లు దిరుగుచు. 160

మ. నరనారాయణతాపసాశ్రమపదౌన్నత్యంబునం బొల్చుభా
సురమందార రసాల సాల వకుళాశోకామ్ల పున్నాగ కే
సర జంబీర కదంబ నింబ కుట జాశ్వత్థ స్ఫురన్మల్లికా
కరవీరక్షితిజాభిరామ బదరీకాంతార సేవారతిన్. 161

క. చను చున్నవాఁడ నని పల్కినపలుకుల కులికి కళవళించుచు విదురుం
డనుపమశోకార్ణవమున, మునిఁగియు నిజయోగసత్త్వమునఁ దరియించెన్. 162

వ. ఇట్లు విదురుండు శోకపావకునిం దనవివేకజలంబుల నార్చి యుద్ధవుని కిట్లనియె.

మ. అనఘా యుద్ధవ నీకుఁ గృష్ణుఁ డసురేంద్రారాతి మన్నించి చె
ప్పినయధ్యాత్మరహస్యతత్త్వవిమలాభిజ్ఞానసారంబు బో
రన నన్నుం గరుణించి చెప్పినఁ గృతార్థత్వంబునం బొందెదన్

1 'విలయించు' అ. ప్ర. 2 తుదగాన్; తడగాన్.

విను పుణ్యాత్ములు శిష్యసంఘముల నుర్విం బోవరే వెండియున్. 164

క. భగవద్భక్తులు సుజనులు, దగ వెతిఁగి పరోపకారతాత్పర్యవివే
కగరిష్ఠులై చరింతురు, జగతిం బొగడొంది వృష్ణికసత్తమ యెందున్. 165

క. అనవుడు నుద్ధవుఁ డవ్విదు, రున కిట్లను ననఘ మునివరుఁడు సాత్యాద్వై
ష్ణునిభుం డగుమైత్రేయుఁడు, దనమనమున మనుజగతి వరదలఁ దలఁచి తగన్.

క. హరి మురభేదిఁ బరాపరుఁ, గరుణాకరుఁ దలఁచునట్టిఘనుఁ డమ్మునికుం
జరుకడ కేఁగిన నాతఁడు, గర మర్థిం దెలుపు సాత్త్వికజ్ఞానంబున్. 167

వ. అని యుద్ధవుండు విదురుం గూడఁ జని చని. 168

ఉ. ముందటఁ గాంచె నంత బుధముఖ్యుఁడు హల్లకఫుల్లపద్మని
ష్యందమరందపానవిలసన్మదభృంగఁ జలత్తరంగ మా
కందలవంగలుంగలతికాచయసంగ సురాంగనాశ్రితా
నందితపుణ్యసంగ యమునన్ భవభంగ శుభాంగ నర్మిలిన్. 169

క. కని డాయ నేఁగి మోదం,బునఁ దత్సరిదమలపులినభూములఁ దగ నా
దినశేషము [1]నివసించెను, వనజోదరపాదపద్మవశమానసుఁ డై. 170

క. మఱునాఁడు రేపకడ భా,సురపుణ్యుఁడు ఘనుఁడు మధునిషూదనచరణ
స్మరణక్రీడాకలితుఁడు, దరియించెం గలుషగహన[2]దమునన్ యమునన్.171

వ. ఇట్లు యమునానది నుత్తరించి యుద్ధవుండు బదరికాశ్రమంబునకుం జనియె
ననిన విని రాజేంద్రుండు యోగీంద్రున కిట్లనియె. 172

క. శౌరియు నతిరథవరులు మ,హారథసమరథులు యదుబలాధిపు లెల్లం
బోరి మృతిఁ బొంద నుద్ధవుఁ, డేరీతిన్ బ్రదికె నాకు నెఱిఁగింపు తగన్. 173

సీ. నావుడు రాజేంద్రునకు శుకయోగీంద్రుఁ, డిట్లను మున్ను లోకేశుచేత
సంప్రార్థితుం డైనజలరుహనాభుండు, వసుమతిపై యదువంశమందు
నుదయించి తనుఁదాన మదిలోనఁ జింతించి, తెలి వొంది యాత్మీయకులవినాశ
మొనరించి తాను బంచోపనిషణ్ణయ, మగుదివ్యదేహంబు నంటఁ జెందఁ

తే. దలఁచి విజ్ఞానతత్త్వంబు ధరణిమీఁదఁ, దాల్చి జనకోటి కెఱిఁగింపఁ దగినధీరుఁ
డుద్ధవుఁడుదక్క నితరులేరనోప రితఁడు,నిర్జితేంద్రియుఁ డాత్మసన్నిభుఁ డటంచు.

క. క్షితిపై నిలిపినకతమున, నతనికి మృతి దొరక దయ్యె నవనీశ రమా
పతియభిమానము గలిగిన, యతిపుణ్యుఁడు సనియె బదరికాశ్రమమునకున్.

వ. అంత. 176

క. ఉద్ధవుఁ డరిగినపిదప స, మిద్ధపరిజ్ఞాను సుజనహితు మైత్రేయున్
వృద్ధజనసేవ్యుఁ దాపస, వృద్ధశ్రవుఁ జూడఁ గోరి విదురుఁడు గడఁకన్. 177

---

1 నివసించిరి ..మానసు లై. 2 దమునశబ్దము సాంతము గాన 'దమునస' అని యుండఁ దగు. అయినను వ్రాఁతప్రతులందు 'దమునన్' అనియే కానిపించుచున్నది.

వ. యమునానది దాఁటి కతిపయప్రయాణంబులఁ బుణ్యనదులను హరిక్షేత్రంబులను దర్శించుచు నతిత్వరితగమనంబున. 178

క. చని చని ముందటఁ గనుఁగొనె, ఘనపాపతమపతంగఁ గరుణాపాంగం
గనదుత్తుంగతరంగన్, జనవరసుతబహుళపుణ్యసంగన్ గంగన్. 179

క. అందు నరవిందసౌరభ, నందితపవమానఘాతనటదూర్మిపరి
స్పందితకందళశీకర, సందోహలసత్ప్రవాహజలమజ్జనుఁడై. 180

సీ. ఘనసారరుచివాలుకాసముదంచిత, సైకతవేదికాస్థలమునందు
యమనియమాదియోగాంగక్రియానిష్ఠఁ, బూని పద్మాసనాసీనుఁ డగుచు
హరిపాదసరసీరుహన్యస్తచిత్తుఁడై, బాహ్యేంద్రియవ్యాప్తిఁ బాఱఁదోలి
సకలవిద్వజ్జనస్తవనీయసముచితా, చారవ్రతోపవాసములఁ గ్రుస్సి

తే. యున్నపుణ్యాత్ము విగతవయోవికారు, వినుతసంచారు భువనపావనవిహారు
యోగిజనగేయు సత్తతిభాగధేయు, శ్రితవిధేయు నమేయు మైత్రేయుఁ గాంచె.

విదురమైత్రేయసంవాదము.

వ. ఇట్లు గనుంగొని యమ్మునీంద్రునిపాదంబులకుం బ్రణమిల్లి ముకుళితహస్తుండై యిట్లనియె మునీంద్రా లోకంబున సకలజనంబులు మనంబుల ఘనంబు లగుసౌఖ్యంబు లందం దలంచి తత్ఫలప్రాప్తిహేతువు లైనకర్మంబు లాచరించి దైవోపహతు లై తత్కర్మంబులచేత నిష్ఫలారంభు లగుచును కర్మంబులు బంధకంబులును దుఃఖహేతువులునుం గాని సౌఖ్యదాయకంబులై పాపనిష్కృతిఁ జేయ నోప వది యట్లుండె భూరిదుఃఖానుసారం బైనసంసారచక్రంబునందుఁ బరిభ్రమించుచుం గామవిమోహితు లై పూర్వకర్మానుగతంబు లైనశరీరంబులు దాల్చుచుం జచ్చుచు మరలం బుట్టుచు నెంతకాలంబునకుం బాపనిష్కృతిఁ గానక మాత్ర్యయావనవనకుఠారు లై జనియించి వర్తించుమూఢాత్ములం బశుప్రాయుల రక్షించు కొఱకుఁ గాదె నారాయణపరాయణు లైనమీవంటిపుణ్యాత్ములు లోకంబునం జరియించుట యదియునుం గాక. 182

మ. అవివేకానుగతస్వకార్యజలవేలాకీర్ణమై మిత్రబం
ధువధూపుత్రజలగ్రహోగ్రయుతమై దుర్దాంతమైనట్టిదు
ర్భవపాథోధిఁ దరించువారె హరిసంబంధక్రియాలోలభా
గవతానుగ్రహనావ లేనియధముల్ గారుణ్యసంధాయకా. 183

క. మునినాథచంద్ర ననుఁ గై, కొని కాచుతలంపు బుద్ధిఁ గూడినయేనిన్
వినుము మదీప్సిత మది నా, చనవునఁ గావింపవయ్య సజ్జనతిలకా. 184

వ. అని వెండియు విదురుండు మైత్రేయుం జూచి మునీంద్రా [1]త్రిగుణాత్మకమాయానియంత యగుభగవంతుండు స్వతంత్రుం డయ్యు నవతరించి యేయే యవతారం

1. 'పురుషార్థేశ్వరుం డైనభగవంతుఁడు.' వ్రా. ప్ర.

బుల నేయేకర్మంబు లాచరించె నదియు [1]నిష్క్రియుం డగునీశుండు మొదలం బ్రపంచంబు నేవిధంబునం గల్పించె నేరీతిం బాలించె (మఱియు నీవిశ్వంబు) నాత్మీయహృదయాకాశగత[2]ముం జేసి నివృత్తవృత్తి యగుచు యోగమాయ యం దెట్లు వసియించె బ్రహ్మాండంబునందు నేలీల వర్తించె నందు బ్రహ్మాదిరూపంబులం బొంది బహుప్రకారంబుల నెట్లు క్రీడించె భూసురగోసురాదులం బరిరక్షించుటకై మత్స్యాద్యవతారంబులు ధరియించి యేయే ప్రయోజనంబులం దీర్చెం బయోరుహగర్భాండకటాహాంతర్గతంబు [3]లై లోకపాలసహితంబు లైన లోకంబులను లోకాలోకపర్వతంబులను బహిర్భాగంబులను నేయే తత్త్వభేదంబులను నెత్తెఱంగునం బుట్టించె నందుఁ (బ్రదీపితం బగు) జీవకోటి యెవ్వానిం గొల్చి బ్రదుకు జనులకుఁ [4]గర్మనామరూపభేదంబు లెట్లు నిర్దేశించె నింతయు సవిస్తరంబుగా వివరింపు ముత్తమశ్లోకమౌళిమండనుండును యోగీశ్వరేశ్వరుండును నైన పుండరీకాక్షునిచరిత్రశ్రవణంబునం గాని (జన్మమరణాదిసకలదుఃఖాకరంబులును దుష్కర్మప్రాప్తంబులును నగు) భవబంధంబు లుడగ వని వెండియు నిట్లనియె.

తరలము. సతతమున్ సరసీరుహోదరసత్కథామృతపూరమున్
శ్రుతిపుటాంజలిచేత నిమ్ముల జుఱ్ఱియుం దనివోదు భా
రతకథామిష మూని విష్ణుఁ బరాశరప్రియసూతి స
న్నుతి నుతించినచోట సన్మునినాథ నామది నుబ్బునన్. 186

క. ఇతరకథావర్ణనముల, నతిహేయత నొందెఁ జిత్త మనఘూత్త రమా
పతిచరితామృతరతి సం,సృతివేదన లెల్లఁ గాయఁ జేయు మునీంద్రా. 187

తే. భూరివిజ్ఞాననిధు లగునారదాది, నిర్మలాత్ముల కయిన వర్ణింప రాని
హరికథామృతపానంబు నందు విసివి, యొల్లననువాఁడె పో వెఱ్ఱి గొల్లఁ డనఘ.

వ. అదియునుం గాక. 189

సీ. అరవిందనాభునియపరావతార మై, జనన మందినపరాశరసుతుండు
[5]చతురవర్ణాశ్రమాచారధర్మములును, ఠవణింప లోకవిడంబనములు
నగుగ్రామ్యకథలు పెక్కర్థిఁ గల్పించుచు, హరికథావర్ణనమందు లోన
నించుకించుక గాని యేర్పడఁ జెప్పమి, నంచితవిజ్ఞాన మాత్మ నిలువ

తే. కున్నఁ జింతించి మఱి నారదోపదిష్టుఁ, డగుచు హరికీర్తనామృతమాత్మఁ గ్రోలి
విమలసుజ్ఞాననిధి యన వినుతికెక్కి, ధన్యుఁ డయ్యెను లోకైకమాన్యుఁ డగుచు.

వ. కావున. 191

క. సరసిరుహోదరుమంగళ, చరితామృత మాత్మఁ గ్రోలు జనుఁ డితరకథా

---

1. 'సృష్టిపూర్వంబునఁ బ్రపంచంబు' వ్రా. ప్ర. 2 'యైనయోగమాయ' వ్రాఁతప్రతులు. 3 'లైనలోకాంతరంబులను లోకాలోకపర్వతంబులను లోకపాలురను విశ్వంబును నెత్తెఱంగునఁ బుట్టించె' వ్రాఁతప్రతులు. 4 జాతకర్మనామ. 5. మహి నొప్పువర్ణాశ్రమాచారధర్మముల్. అ. ప్ర.

గరళముఁ గ్రోలునె హరిసం, స్మరణము జీవులకు నఖిలసౌఖ్యద మనఘా. 192

క. శ్రీవనితాధిపనామక,థావిముఖుల కిహముఁ బరము దవ్వై పిదపం
బోవుదురు నరకమునకున్, వావిరి నే వారిఁ జూచి వగతు మునీంద్రా. 193

క. ఏనరుఁడే నొకనిమిషం, బైన వృథావాదగతిని హరిపదకమల
ధ్యానానందుఁడు గాఁడే, నానరునకు నాయువల్ప మగు మునినాథా. 194

చ. మృదుగతిఁ బుష్పఁదేనియ రమించుచుఁ బానము సేయఁ బాఱుష
ట్పదవిభుపోల్కి నార్తజనబాంధవు విశ్వభవస్థితివ్యయా
స్పదమహితావతారుఁ డగుపంకరుహోదరునిత్యమంగళ
ప్రదగుణకీర్తనామృతముఁ బాయక [1]గ్రోలెదఁ జెప్పవే దయన్. 195

క. అని విదురుఁడు మైత్రేయుం, డనుమునినాయకుని నడిగె నని వేదవ్యా
సునితనయుం డభిమన్యుని, తనయునకుం జెప్పి మఱియుఁ దగ నిట్లనియెన్.

వ. ఇట్లు విదురుండు మైత్రేయు నడిగిన నతం డతనిం గని యతిమృదుమధురవచన
రచనుం డై యిట్లనియె ననఘా కృష్ణకథాశ్రవణతత్పరుండ వై నీవు నన్నడి
గితివి గావున భద్రం బయ్యె నీవు భగవద్భక్తుండవు గావున హరికథాసక్తుండ
వగుట విచిత్రంబు గా దదియునుం గాక మాండవ్యశాపంబున సాత్యవతేయు
వలన (భ్రాతృక్షేత్రంబున) శూద్రయోనిం బుట్టినట్టి (ప్రజాసంయమనుండ వగు)
ధర్ముండవు పరమజ్ఞానసంపన్నుండవు నారాయణునకుం బ్రియతముండవు గావునఁ
గృష్ణుండు నిర్యాణకాలంబునం దనసన్నిధికిం జనిననన్ను డాయం జీరి విజ్ఞానం
బెల్ల నుపదేశించి నీకు నెఱింగింపు మని యానతిచ్చుటం జేసి యవశ్యంబును
నీకు నెఱింగింతు దత్తావధానుండ వై వినుము. 197

క. వనజాక్షుయోగమాయా, జనితం బగువిశ్వజననసంస్థానవినా
శనముల తెఱఁ గెఱిఁగించుచు, ననఘా విష్ణునిమహత్త్వ మభివర్ణింతున్. 198

సీ. సకలజీవుల కెల్లఁ బ్రకటదేహము నాత్మ, నాథుండుఁ బరుఁడు నానావిధైక
మత్యుపలక్షణమహితుండు నగుభగ, వంతుండు సృష్టిపూర్వంబునందు
నాత్మీయమాయ లయంబు నొందినవిశ్వ, గర్భుఁ డై తాన యొక్కటి వెలుంగు
పరమాత్ముఁ డభవుం డుపద్రష్ట యయ్యు వ, స్త్వంతరపరిశూన్యుఁ డగుటఁ జేసి

తే. ద్రష్ట గాకుండు మాయాప్రధానశక్తి, నతులచిచ్ఛక్తిగలవాఁ డనఁగుచుఁ దన్ను
లేనివానిఁగఁ జిత్తంబులోనఁ దలఁచి, ద్రష్ట యగుఁ దనభువననిర్మాణవాంఛ.

తే. బుద్ధిఁ గోరిచిన సమ్మహాపురుషవరుఁడు, గార్యకారణరూప మై ఘనత కెక్కి
భూరిమాయాభిధానవిస్ఫురితశక్తి, వినుతి కెక్కినయట్టియవిద్యయందు. 200

క. పురుషాకృతి నాత్మాంశ, స్ఫురణము గలశక్తి నిలిపి పురుషోత్తముఁ డీ
శ్వరుఁ డభవుం డజుఁడు నిజో, దరసంస్థితవిశ్వ మపుడు దగఁ బుట్టించెన్. 201

1. క్రోలెదఁ.

సీ. ధృతిఁబూని కాలచోదితము నవ్యక్తంబుఁ, బ్రకృతియు ననుపేళ్లఁ బరఁగుమాయ
వలన మహత్తత్త్వ మెలమిఁ బుట్టించె మా, యాంశకాలాదిగుణాత్మకంబు
నైనమహత్తత్త్వ మచ్యుతదృగ్గోచ, ర మగుచు విశ్వనిర్మాణవాంఛ
నందుటఁ జేసి రూపాంతరంబునఁ బొంది, నట్టిమహత్తత్త్వమందు నోలిఁ

తే. గార్యకారణకర్త్రాత్మకత్వ మైన, మహితభూతేంద్రియకమనోమయ మనంగఁ
దగునహంకారతత్త్వ ముత్పన్నమయ్యెఁ, గోరి సత్త్వరజస్తమోగుణక మగుచు.

వ. వెండియు రూపాంతరంబులం బొందుచున్న సాత్త్వికాహంకారంబువలన మనంబును వైకారిక కార్యభూతంబులైన దేవతాగణంబులును సంభవించె నింద్రియాధిష్ఠాతలైనవానివలన శబ్దంబు పూర్వంబునఁ బ్రకాశంబగుటంజేసి జ్ఞానేంద్రియంబులయినత్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులును గర్మేంద్రియంబులయినవాక్పాణిపాదపాయూపస్థములును దైజసాహంకారంబున నుత్పన్నంబు లయ్యెఁ దామసాహంకారంబువలన శబ్దస్పర్శరూపరసగంధంబు లుదయించె నందు శబ్దంబు నిజగుణం బయినశబ్దంబువలన నాకాశంబుఁ బుట్టించె గగనంబు గాల[1]మాయాంశయోగంబునం బుండరీకాక్షునిరీక్షణంబున స్పర్శతన్మాత్రంబువలన వాయువుం గలిగించెఁ బవనుండు నభోబలంబున రూపతన్మాత్రంబువలన లోకలోచనం బైన తేజంబు నుత్పాదించెఁ దేజంబు గాల[2]మాయాంశయోగంబున నుత్తమశ్లోకుని విలోకనంబునఁ బవమానయుక్తం బగుచు రసతన్మాత్రంబువలన నంబువులం బుట్టించె సలిలంబు గాల[3]మాయాంశయోగంబునం బరమేశ్వరానుగ్రహంబు గలిగి తేజోయుక్తం బైనగంధగుణంబువలనఁ బృథివిఁ గలిగించె నందు గగనంబునకు శబ్దంబును వాయువునకు శబ్దస్పర్శంబులును దేజంబునకు శబ్దస్పర్శరూపంబులును సలిలంబునకు శబ్దస్పర్శరూపరసంబులును బృథివికి శబ్దస్పర్శరూపరసగంధంబులును గుణంబులై యుండుఁ గాల[4]మాయాంశలింగంబులు గలిగి మహదాద్యభిమానంబులు నొందిన దేవతలు విష్ణుకళాకలితు లగుచు రట్టిమహదాదితత్త్వంబులైక్యంబు సాలమిం బ్రపంచంబులు గల్పింప సమర్థంబులు గాక కృతాంజలులై యోగీశ్వరేశ్వరుం డైననారాయణు నిట్లని స్తుతియించె. 203

దండకము. శ్రీనాథ నాథా జగన్నాథ నమ్మౌళికరత్నావిపక్షక్షమాభృత్సహస్రాక్ష నీరేజపత్త్రేక్షణా దేవదేవా భవద్దాసవర్గోపతాపంబులం బాపఁగా నొప్పుదివ్యాతపత్రంబు నాఁ బొల్చుయుష్మత్పదాంభోజమూలంబు పుణ్యాలవాలంబుగాఁ బొంది యోగీంద్రు లుద్దామసంసారతాపంబులం బోవఁగా మీటి వర్తింతు రోతండ్రి యీశా సమస్తాఘనిర్ణాశ యీవిశ్వమం దెల్లజీవుల్ భవోదగ్రదుర్వారతాపత్రయాభీలదావాగ్నిచేఁ గ్రాఁగి దుఃఖాబ్ధిలోఁ దోఁగి యేకర్మమున్ ధర్మముం బొందఁ

1 మాయాశక్తియోగ. 2 మాయాశక్తియోగ. 3 మాయాశక్తియోగ. 4 మాయాశక్తిలింగ.

గా లేక సంసారచక్రంబునందుం బరిభ్రామ్యమాణాత్ము లై యుందు రమ్మూఢ
చేతస్కులం జెప్పఁగా నేల యోదేవ విజ్ఞానదీపాంకురం బైనమీపాదపంకేరుహ
చ్ఛాయఁ బ్రాపింతుమజ్ఞాతి సన్మౌనిసంఘంబు లై కాంతికస్వాంతతం బేర్చి దుర్దాం
తపాపౌఘనిర్ణాశకాంబుప్రవాహాభ్రగంగానివాసంబు గా నొప్పమీపాదయుగ్మం
బు యుష్మన్ముఖాంభోజనిస్స్యోద్గతం బైన వేదాండజశ్రేణిచేతం గవేషించి సంప్రా
ప్తు లై యుందు రోనాథ వైరాగ్యశక్తిస్ఫుటజ్ఞానబోధాత్ము లై నట్టిధీరోత్త
ముల్ నిత్యనైర్మల్యభవ్యాంతరంగంబులం దేవపరంజ్యోతిపాదాబ్జపీఠంబు గీలించి
కైవల్యసంప్రాప్తు లై రట్టినిర్వాణమూర్తిం బ్రశంసింతు మింద్రాదివంద్యా ము
కుందా సమస్తంబుఁ గల్పింపఁ బాలింపఁ దూలింపఁగాఁ బెక్కుదివ్యావతారం
బులం బొందునీపాదపంకేరుహధ్యానపారీణసుస్వాంతు లై యొప్పుభక్తాళికిన్ మో
క్షదం బైననీపాదకంజాతముల్ గొల్తు మీశా రమాధీశ పుత్రాంగనామిత్రసంబం
ధబంధంబులం జెంది [1]నిత్యంబు దుష్టక్రియాలోలు రై దేహగేహంబులం దోలి
వర్తించుదుర్మానవశ్రేణులం దంతరాత్ముండ వై యుండియున్ దూరమై తోఁచు
నీపాదపద్మంబు లర్చింతు మో దేవ బాహ్యేంద్రియవ్యాప్తి నుద్వృత్తు లై నట్టి
మూఢాత్ము లధ్యాత్మతత్త్వప్రభావాఢ్యు లై నీపదాబ్జాతవిన్యాసలక్ష్మీకళావాస
ముం గన్న యయ్యుత్తమశ్లోకులం గానఁగాఁజాల రప్పుణ్య [2]లాదుష్టులం జూడఁగా
నొల్ల రంభోధిరాట్కన్యకాకాంత వేదాంతశుద్ధాంతసిద్ధాంత మై యొప్పునీసత్క
థాసారచంచత్సుధాసారపూరంబులం గ్రోలి సౌఖ్యోన్నతిన్ సోలి ధీయుక్తు
లై వ్రాలి తాపంబులం దోలి మోదంబులం దేలి సంపన్ను లై మాన్ననిత్యప్ర
పన్నుల్ మహోత్కంఠతం బేర్చి వైకుంఠధామంబు నల్పక్రియాలోలు రై
కాంతు రద్దివ్యవాసైకసంప్రాప్తికిం గోరు చున్నార మో దేవ వైరాగ్యవిజ్ఞాన
బోధాత్మ యోగక్రియారూఢి నంతర్బహిర్వ్యాప్తిఁ జాలించి శుద్ధాంతరంగంబు
గావించి స్వాత్మస్థవాసుండ వై చిన్మయాకారత న్నున్ననీయున్న తానంత తేజో
విలాసోల్లసన్మూర్తిఁ జిత్తంబులం జేర్చి యానందలోలాత్మతం బొల్చుయోగీశ్వర
శ్రేణికిం దావకీనానుకంపానులబ్ధస్ఫుటజ్ఞానముం గల్గుటం జేసి యాయాసముం
లేద యో దేవతాచక్రవర్తీ సదానందమూర్తీ జగద్గీతకీర్తీ [3]లసద్భూతవర్తీ భవ
ద్దాసు లై నట్టిమమ్మున్ జగత్కల్పనాసక్తచిత్తుండ వై నీవు త్రైగుణ్యవిస్ఫూర్తిఁ
బుట్టించినం బుట్టుటే కాక నీభవ్యలీలానుమేయంబుగా సృష్టినిర్మాణముం జేయ
నేమెంతవా [4]రాము మీశక్తియుక్తిన్ భవత్పూజ గావింతు మట్లుండె నీసత్క
ళాజాతు లై నట్టిమ మ్మెన్న నే మున్న దధ్యాత్మతత్త్వంబ వన్నం బరంజ్యోతి
వన్నం బ్రపంచంబు కెల్ల న్నధిష్ఠాత వన్నన్ సదాసాక్షి వన్నన్ గుణాతీత నీవే

1. 'సోహంమనేతిక్రియాలోలు రై' వ్రా. ప్ర. 2. లాదుర్మదాంధాత్ములన్. 3. 'శుభావర్తి
ఈదాసుల మైనమమ్మున్' వ్రా. ప్ర. 4. రమ్ము.

కదా పద్మపత్త్రాక్ష సత్త్వాదిత్రైగుణ్యమూలంబు నా నొప్పు మాయాగుణం బం
దు నుద్యన్మహత్త్వ మైనట్టినీవీర్యముం బెట్టుటం జేసి నీ వింతకుం గారణం
బౌదు వాయాయుకాలంబుల న్నీకు సౌఖ్యంబు లే మెట్లు గావింతు మేరీతి నన్నం
బు భక్షింతు మెబ్భంగి వర్తింతు మేనిల్కడ న్నుందు మీజీవలోకంబ యాధా
రమై యుండి భోగంబులం బొందుచు న్నన్న మేరీతి భక్షించు నిష్కార్యసం
ధాను [1]లైనట్టిమాకుం జగత్కల్పనాశక్తికిన్ దేవ నీశక్తి దోడ్పాటు గావించి
విజ్ఞానముం జూపి కారుణ్యసంధాయి వై మమ్ము రక్షింపు లక్ష్మీమనఃపల్వలక్రోడ
యోగీంద్రచేతస్సరోహంస దేవాదిదేవా నమస్తే నమస్తే నమః. 204

సీ. అనినఁ బ్రసన్నుఁడై హరి మహదాదుల, కన్యోన్యమిత్రత్వ మంద కున్న
కతమున నిఖలజగత్కల్పనాశక్తి, వొడమ కుండుటఁ దనబుద్ధి నెఱిఁగి
కైకొని కాలవేగమున నుద్రేకంబు, నొందినప్రకృతితోఁ బొంది నిజబ
లము నిల్పి తా నురుక్రముఁడన సప్తవింశతితత్త్వములయందుసమత నొక్క

తే. పరి ప్రవేశించి యాతత్త్వభవ్యగుణము, నందు జ్యేష్ఠానురూపంబులలరఁ జెంది
యొకటినొకటినిగలయకయుండివిశ్వ,రచన నెఱుఁగనియాతత్త్వనిచయమునకు.

వ. ఇట్లు విశ్వనిర్మాణనిపుణత్వంబు నెఱుంగం జూపుచు నన్నింటికి నన్యోన్యతం
గల్పించి తనయనుగ్రహంబునం బ్రేరితం బై కానంబడి క్రియాసామర్థ్యంబునం
జె న్నొందినతత్త్వవితానంబు [2]దేవప్రేరితం బయి స్వకీయంబు లగునంశంబుల
చేతం బుట్టించిన విరాడ్విగ్రహంబై తత్త్వవితతి దమయందుఁ జెందినపుండరీకా
క్షునికళాంశంబున నొకటికొకటికి నైక్యంబు వాటిల్లి పరిణతం బై రూపాంతరం
బునుం జెందె నేతత్త్వంబున నేనియుఁ జరాచరలోకపుంజంబులు నిండి యుండు
నాహిరణ్మయం బైనవిరాడ్విగ్రహంబు నొందినపురుషుండు సర్వజీవసమేతుం
డై యుండె నంత. 206

క. జలములలోపల నిమ్ముల, జలరుహజా[3]తాండమందు సాహస్రాబ్దం
బులు నిలిచెఁ గార్యరూపా, కలితం బగు [4]నవ్విరాట్స్వగర్భము వసుసన్. 207

తే. దైవకర్మాత్మశక్తివితానములను
దగిలి తనచేతఁ దనుఁ దాన దైవశక్తి
యగుచు వెలుఁ గొందుచును బ్రకారాంతరమునఁ
దనువు వితతంబు గాని చైతన్య మొంది. 208

తే. రూపసంసక్తిఁ జేసి నిరూఢకర్మ, శక్తి యగుచుఁ గ్రియాధురాసక్తి దశవి
ధములు గలిగినప్రాణరూపమున నాత్మ, శక్తిభోక్తృత్వమగుచున్నశక్తిగలిగి.

క. త్రివిధం బగుచును నాధ్యా, త్మ్యవిభేదంబులను బాపి [5]మఱి యభిభూతా

---

1 లమ్మైనమాకుం. 2 'లం గూడి స్వకీయం బైనకళలచేత' వ్రాఁతప్రతులు, 3 తఘటమఁదు.
4 'నవ్విరాజితగర్భము' వ్రా. ప్ర. 5 'మఱియును బొలుపొం, దువిగాజం బగుగర్భము' వ్రా. ప్ర.

త్మవిరాడ్రూపమ్మగు నిది, వివిధప్రాణులకు [1]నాత్మవిభవమై మఱియున్. 210

కం. జీవంబై పరమాత్ముకుఁ, దావలమై యాదిమావతారం బగున
ద్దేవునిగర్భంబున భూ, తావలితోడం బ్రపంచ మర్థిం దోఁచెన్. 211

వ. ఇట్లు దోఁచినవిరాట్పురుషుం డాధ్యాత్మికాధిదైవికాధిభౌతికంబు లనుభేదంబులచేఁ బూర్వోక్తక్రమంబున వెలుఁగొందు ననుచు వినుచునకు మైత్రేయుం డెఱింగించె నని చెప్పి వెండియు ని ట్లనియె. 212

చ. హరి పరమాత్ముఁ డీశుఁ డజుఁ డాఢ్యుఁ డనంతుఁ డనంతమూర్తి సా
గరతనయాహృదీశుఁడు వికారవిదూరుఁడు నిత్యమంగళా
కరుఁడు కృపాపయోనిధి యకల్మషచిత్తుఁడు సర్వశక్తి దా
మరసవిలోచనుండు బుధమాన్యచరిత్రపవిత్రుఁ డిమ్ములన్. 213

వ. ఇత్తెఱంగున (నీశుం డగునధోక్షజుండు) మహదాది[2]తత్త్వంబులమనంబుల ఘనంబు లగుతలంపులు దా మనంబున నెఱింగి (యట్టితత్త్వంబుల వివిధవృత్తిలాభంబునకై స్వకీయచిచ్ఛక్తిచే నిట్టు లొనర్తు నని చింతించి) నిజకళాకలితం బగు విరాడ్విగ్రహంబునందు (నగ్నిప్రముఖం బగు)[3]దేవతావళి కెల్ల నివాసంబగుచుఁ గానంబడినవైరాజపురుషుని మూర్త్యవయవంబుల వినిపింతు దత్తావధానుండవై వినుము. 214

సీ. నరనుత యాదిపూరుషోత్తముని పృథగ్భావంబు నొందిన ముఖంబువలన
భువనపాలకుఁడై పవమానసఖుఁ డంత, నాత్మనిశ్వాసనంశమైన వాణి
కనయంబు ననుకూలమగుచు నిజస్థాన, మునఁ బ్రవేశించె నమ్ముఖమునందుఁ
బరఁగ జీవుండు శబ్దము నుచ్చరించుఁ బృథగ్భావము లగునేత్రముల నినుఁడు
తే. చక్షురింద్రియయుక్తుఁడై సరవిఁ జెంది, రూపవిజ్ఞానమహిమ నిర్వహధి నొందు
మఱియుఁ జర్మంబులను బవమానుఁ డీశ్వ, రాంశమైతత్త్వగింద్రియమందుఁ గూడి.

వ. నిజవాసంబు నాశ్రయించిన జీవుండు స్పర్శేంద్రియగతుం డగుఁ బృథగ్భావంబైన శ్రోత్రంబుల దిక్కు లచ్యుతకళాంశం బగు శ్రవణేంద్రియయుక్తంబులై నిజస్థానంబునం బొందిన జీవుండు శబ్దజ్ఞానగతుం డగు (వెండియుఁ దాలువు నిర్భిన్నంబయిన లోకపాలుం డగువరుణుం డందుఁ బ్రవేశించి రసనేంద్రియంబుచేఁ బ్రకాశించినం బ్రాణి రసంబులం గ్రహించెం బరమేశ్వరునినాసికేంద్రియంబు పృథగ్భావంబు నొంది యాశ్వినేయాధిష్ఠానంబై ఘ్రాణాంశంబు నొందిన జంతువు గంధగ్రహణసమర్థం బయ్యె) వెండియు భిన్నం బయినచర్మంబును నోషధులును బరమపురుషాంశంబు లయినకేశంబులం గూడి నిజనివాసంబు నొందిన జీవుండు [4]కండూయమానుం డగుభిన్నభూతం బైనమేఢ్రంబునం బ్రజాపతి రేతంబున నిజస్థానంబు నొందినజీవుం డానందంబునం బొరయు భిన్నభావం బైనగుదంబున మిత్రుం డచ్యుతాంశంబును

1 లాత్మవిభురూపం బై. 2 భూతంబులమనంబుల. 3 భూతావళి. 4. కండూయనంబందు.

పొందుపాయువుం గూడి నిజాధిష్ఠానంబు నొందుడు జీవుండు విసర్గంబుఁ జెందు వేఱువేఱైన బాహువులం ద్రిదశాధీశ్వరుండయిన పురందరుండు క్రయవిక్రయాది శక్తియుక్తుం డగుచు నిజస్థానంబు నొందినజీవుండు వానిచేత జీవికం బొందు (మఱియుఁ బాదంబులు నిర్భిన్నంబులయినవిష్ణుండు స్వావాసంబుగైకొని గతిశక్తిం బొందిన జీవుండు గమనాగమనార్హుం డయ్యె) వెండియు భిన్నభావం బయినహృదయంబును మనంబుతోడం గలసి (నిజాధిష్ఠానంబుగఁ) జంద్రుండు ప్రవేశించిన జీవుండు శరీరసంకల్పాదిరూపం బగువికారంబునం బొందు భిన్నభావంబైనయహంకారంబు నహంప్రకృతియుక్తుండై రుద్రుండు (నిజస్థానంబుగా) వసియించిన నాయహంకృతిచే శరీరి కర్తవ్యంబులు నడుపు బుద్ధివాగీశ్వరావాసంబై హృదయంబుతోడం గలసి నిజాధిష్ఠానంబున [1](*బోధాంశంబుచే వెలింగిన శరీరి బోద్ధవ్యతం బొందు భిన్నంబైనచిత్తంబు బ్రహ్మావాసంబై చేతనాంశంబు నొందినఁ బ్రాణి) విజ్ఞానంబునుం బొందు నట్టివిరాట్పురుషునిశీర్షంబున స్వర్గంబును జరణంబుల వసుమతియు నాభియందు గగనంబునుం గలిగె సత్త్వాదిగుణపరిణామంబుల నమరులై రూర్జిత సత్త్వగుణంబున నద్దేవతలు త్రిదివంబును బొందిరి రజోగుణంబున మనుజులును గవాదులును ధరణిం బొందిరి తామసంబున భూతాదులైన రుద్రపారిషదులు (ద్యావాపృథివ్యంతరం బగు) వియత్తలంబునుం బొందిరి ముఖంబువలన నామ్నాయంబు లుత్పన్నంబు లయ్యె వెండియు. 216

క. ధరణీదివిజులు శ్రుతులును, నరవర యమ్మేటిముఖమునం బొడముట భూ
సురుఁ డఖిలవర్ణములకున్, గురుఁడున్ ముఖ్యుండు నయ్యె గుణరత్ననిధీ. 217

క. ధర బ్రాహ్మణాదికము ద, స్కరబాధలఁ బొందకుండఁ గైకొని కావం
బురుషోత్తముబాహువులన్, నరనాథకులంబు పుట్టె నయతత్త్వనిధీ. 218

క. గణుతింపఁగఁ గృషిగోర, క్షణవాణిజ్యాదికర్మకలితంబుగ నా
గుణనిధియూరువులందుం, బ్రణుతింపఁగ వైశ్యజాతి ప్రభవం బయ్యెన్. 219

తే. తివిరి సేవకధర్ములై దేవదేవు, పదములను శూద్రసంతతు లుదయ మైరి
వీర లందఱుఁ దమతమవిహితకర్మ, మలరఁ జేయుచు జనకుండు నాత్మగురుఁడు.

క. అగుసర్వేశుఁ బరాత్పరు, జగదేకప్రభునిపాదజలజాతంబుల్
దగిలి భజింతురు సతతము, నిగమోక్తిన్ భక్తియోగనిపుణాత్మకులై. 221

తే. మహిమ దీపింపఁ గాలకర్మస్వభావ
శక్తిసంయుక్తుఁ డగుపరేశ్వరునిభూరి
యోగమాయావిజృంభణోద్యోగ మెవ్వఁ
డెఱిఁగి నుతియింపఁగా నోపు సిద్ధచరిత, 222

1 (*) శరీరవిజ్ఞానంబు.

ఉ. అన్య[1]కథాకలాపము లహర్నిశముం బఠియించి చాలమా
లిన్యము నాత్మశోభనవిలీ[2]నత నొందుమదీయజిహ్వ సౌ
జన్యముఁ జెందె నేఁడు హరిసద్గుణదివ్యకథామృతంబు స
న్మాన్య[3]చరిత్రమై నెగడుమద్గురువాక్యపదంబుఁ జెందఁగన్. 223

మ. హరినామాంకితసత్కథామృతరసవ్యాలోలుఁడై నట్టిస
త్పురుషశ్రేష్ఠుఁడు సత్కథాలవణవాఃపూరంబుఁ దాఁ గ్రోలునే
వరమందారమరందపానకుతుకస్వాంతద్విరేఫంబు స
త్వరమై పోవునె చేఁతివేములకుఁ దద్గంధానుమోదాత్తమై. 224

క. హరిమహిమముఁ దన్నాభీ, సరసిజసంజాతుఁడైన చతురాననుఁడుం
బరికించి యెఱుఁగఁ డన్న ని, తరమనుజులఁ జెప్ప నేల తత్త్వజ్ఞనిధీ. 225

తే. శ్రుతులు దమలోన వివరించి చూచి పుండరీకలోచను నుత్తమశ్లోకచరితు
సమరగణవంద్యమానపాదాబ్జయుగళు, వెదకికనుఁగొనలేవంద్రు విమలమతులు.

క. [4]హరియుం దనమాయాగతిఁ, బరికించియుఁ గానఁ డయ్యెఁ బరిమితి లేమిన్
మఱి మాయావిని మోహిని, చరితముఁ గనుఁగొందు రెట్లు చతురాస్యాదుల్.

క. ఆదివిజాధీశుఁడు మహ, దాదులు దిక్పతులుఁ బంకజాసనుఁడున్ గౌ
రీదయితుఁడు గనఁ జాలని, శ్రీదేవునిపదయుగంబుఁ జింతింతు మదిన్. 228

క. అని మైత్రేయుం డవ్విదు, రున కెఱిఁగించిన తెఱంగు రుచిరముగా న
ర్జునపౌత్రునకుఁ బరాశర, మునిమనుమం డెఱుఁగఁ జెప్పి ముదము దలిర్పన్.

వ. వెండియు ని ట్లనియె. 230

క. భూమీశ్వర మైత్రేయమ, హాముని విదురునకు నట్లు హరిగుణశుభలీ
లామాహాత్మ్యముఁ జెప్పిన, నామైత్రేయునకు విదురుఁ డనియెన్ మఱియున్.

క. అగుణుం డగునీశ్వరునకు, జగదవనోద్భవవినాశసత్కర్మములుం
దగులీల లైన నాతఁడు, సగుణుం డై యుండు టెట్లు సౌజన్యనిధీ. 232

సీ. అనిన నర్భకుగతి ననవుడు మైత్రేయ, మునిఁ జూచి విదురుఁ డిట్లనియె మరల
బాలుఁడు క్రీడావిలోలమానసమున, దీపించి లీలానురూపుఁ డగుచుఁ
గైకొని కామానుగతుఁడై రమించును, నర్భకుఁ డర్థి వస్త్వాంతరమున
నర్భకాంతరమున నైనను బాలకే, ళీసంగుఁ డగుచు నోలిని జరించు

తే. [6]దనుజభేదనుఁ డెట్లు స్వాతంత్ర్యవృత్తి
వెలయ వర్తించె నేరీతి విక్రమించె

1 కథానులాపము. 2 'నము నైనమదీయ' వ్రా. ప్ర. 3 'చరిత్రుఁడై నెగడు' వ్రాఁత ప్రతులు. 4 ఈపద్యము పెక్కుప్రతులఁ గనుపట్టదు. 5 'గానిచో' అచ్చుప్రతి. 6 'హరియు నెప్పుడు నివృత్తుఁ డత్యంతతృప్తుఁ, డగుట వర్తించు టెట్లు క్రీడాదులందు' అచ్చుప్రతి.

మఱియుఁ ద్రిగుణాత్మకం బైనమాయఁ గూడి
యఖిలజగములఁ గల్పించి యంతమీఁద. 233
సీ. అమ్మాయచేత నీయఖిలంబు [1]ద్రుంచిన, శశ్వత్ప్రకాశుఁ డీశ్వరుఁడు పరుఁడు
ననఘాత్మ దేశకాలావస్థలందును, నితరులయందు నహీన మైన
జ్ఞానస్వభావంబుఁ బూని యాప్రకృతితో, నెబ్భంగిఁ గలసెఁ దా నేక మయ్యు
గోరి సమస్తశరీరంబులందును, జీవరూపమున వసించి యున్న
తే. [2]జీవుని దగువిభూతిప్రసిద్ధి యేమి, కర్మమున సంభవించెను గడఁగి నాదు
చిత్త మజ్ఞానదుర్గమస్థితిఁ గలంగి, యద్భుతంబునఁ బొందెడు ననఘచరిత.
వ. అది గావున సూరిజనోత్తముండ వైననీవు మదీయవాంఛితంబు నెఱింగింప స
మర్థుండ వని విదురుండు మైత్రేయమహామునీంద్రు నడిగె నని బాదరాయణతనూ
భవుం డభిమన్యునందనున కిట్లనియె. 235
క. సరసిరుహోదరుమంగళ, చరితామృతపానకుతుకసంగంబున ని
ర్భరుఁ డగువిదురునకు మునీ, శ్వరుఁ డగుమైత్రేయుఁ డనియె సజ్జనతిలకా. 236
చ. వినుము వితర్క[3]వాదములు విష్ణుని ఫుల్లసరోజపత్రనే
త్రుని ఘనమాయ నెప్పుడు విరోధము సేయుఁ బరేశు నిత్యశో
భనయుతు బంధనాదికవిపద్దశలుం గృపణత్వభావము
న్ననయముఁ బొంద లేవు విభుఁ డాద్యుఁ డనంతుఁడు నిత్యుఁ డౌటనున్. 237
వ. మఱియును. 238
చ. పురుషుఁడు నిద్రవోఁ గలలఁ బొందుసమస్తసుఖంబు లాత్మసం
హరణశిరోవిఖండనము లాదిగ జీవునికిం బ్రబోధమం
దరయఁగఁ దోఁచు చున్నగతి నాదిఁ బరేశుఁడు బంధనాదులం
బొరయక తక్కె నిట్లనుచు బుద్ధిని సంశయ మందె దేనియున్. 239
వ. అవ్విధం బతనికిం గలుగ నేర దది యె ట్లంటేని. 240
చ. లలితవిలోలనిర్మలజలప్రతిబింబితపూర్ణచంద్రమం
డలము దదంబుచాలనవిడంబనహేతువు నొందియున్ వియ
త్తలమునఁ గంప మొందనివిధంబున సర్వశరీరధర్మముల్
గలిగి రమించునీశునకుఁ గల్గఁగ నేరవు కర్మబంధముల్. 241
వ. కావున జీవునకు నవిద్యామహిమం జేసి కర్మబంధనాదికంబు సంప్రాప్తం బగుం
గాని సర్వభూతాంతర్యామి యైనయీశ్వరునకుం బ్రాప్తంబు గానేర దని వెం
డియు. 242
చ. నరునకు నాత్మదేహజగుణంబులఁ బాపఁగ నోపుఁ బంకజో

---

1 'సృజియించి; పాలించి పొలియించి ♦ పరమపురుషుఁ డనఘాత్మ' అచ్చుప్రతి.
2 'జీవునకు దుర్భగక్లేశ♦సిద్ధి యెట్టి' అచ్చుప్రతి. 3 'వాక్యములు' వ్రా. ప్ర.

దరచరణారవిందమహిమాతతస్ఫుటభక్తియు యింద్రియంబు లీ
శ్వరవిషయంబులైన మది • సంచితనిశ్చలతత్త్వమైనచో
సరసిజనేత్రుకీర్తనమె • చాలు విపద్దశలన్ జయింపఁగన్. 243

చ. హరిచరణారవిందయుగళార్చనసన్నుతిభక్తియోగముల్
నిరతముఁ గల్గువారు భవనీరజగర్భుల కంద రానిభా
సురపదమందుఁ జేరుదురు • సూరిజనస్తవనీయ యట్టిస
త్పురుషులపూర్వజన్మఫలమున్ గణుతింపఁ దరంబె యేరికిన్. 244

వ. అని చెప్పిన విదురుండు మైత్రేయుం గనుంగొని ముకుళితహస్తుండై తనమనం
బున వినమితమస్తకుండుగాఁ దలంచుచుఁ (దనమనంబున శ్రీహరిం దలంచుచు)
వినయవచనరచనుండై యి ట్లనియె మునీంద్రా భవదీయవాక్యంబులచేత నా
మనంబున నారాయణుండు లోకైకనాథుం డెట్లయ్యె ననియు శరీరధారి యైన
జీవునికిఁ గర్మబంధంబు లేరీతి సంభవించె ననియుం బొడమినసంశయంబు
నేఁడు నివృత్తం బయ్యె పూర్వమున నేను నామనంబున లోకంబున కీశ్వరుండు
హరి యనియు జీవుండు పరతంత్రుం డనియును దలంపుదు నారాయణభక్తి
ప్రకారంబు ప్రాణిగోచరం బైనయవిద్యకు [1]నధిష్ఠానం బనం దనరుచుం(డు నారా
యణుండు) దనకు నాధారంబు లేక సమస్తంబునకుం దాన యాధారభూతుం
డై విశ్వంబుం బొదివి విశ్వంబులోనఁ దా నుండు నెఱుం గెల్లు శరీరాభిమానం
బును బొంది యెవ్వఁడు (మూఢతముం డై) సంసారప్రవర్తకుం డగు నెవ్వండు
(భక్తిమార్గంబునఁ) బరమాత్ముం డైనపుండరీకాక్షునిం జెందు వీర [2]లిద్దఱును
(సంశయక్లేశంబులు లేమిం జేసి) సుఖానందపరిపూర్ణు లై యభివృద్ధి నొందు
వార లగుదు రెవ్వండు సుఖదుఃఖానుసంధానంబుచే లోకానుగతుం డగుచుం
బ్రమోదఖేదంబుల నొందు నతండు దుఃఖాశ్రయుం డగు నారాయణభజ
నంబున సమస్తదుఃఖనివారణం బగుటను భవదీయచరణసేవానిమిత్తంబువను
బ్రపంచంబు ప్రతీతిమాత్రంబు గలిగి యున్న దయిన నందులకుఁ గారణంబు
లే [3]కుండుటం జేసి తెలియనివాఁడ నై వర్తింతు నని వెండియు. 245

క. లలి నామదిఁ దలఁపుదు సుమ, తులు గొనియాడంగఁ దగినతోయజనాభుం
డలవడ నల్పతపోవృ, త్తులతలపోఁతలకు మిగుల • దుర్లభుఁ డనియున్. 246

సీ. ఇంద్రియంబులతోడ • నెలమి నొప్పెడిమహ, దాదుల నితరేతరానుషంగ
ముగఁ జేసి వానియం • దొగి విరాడ్దేహంబు, పుట్టించి యందుఁ జేపట్టి తాను
వసియించు నాతఁడు • వరుస సహస్రసం, ఖ్యాకంబు లగుమస్తకాంఘ్రిబాహు

---

1 నాశనకారణం. 2 'లిద్దఱియందును సుఖానందపరిపూర్ణుఁ డై యభివృద్ధి నొందువాఁ డె వ్వం డని సంశయంబు నొందుమానవుండు దుఃఖాశ్రయుం డగు' వ్రా. ప్ర. 3 కుంటఁ దెలిసిన వాఁడ నై యది నివర్తింతు నని' వ్రా. ప్ర.

కలితసత్పురుషునిఁ గాఁ బ్రహ్మవాదులు, వలుకుదు రావిరాట్పురుషునందు

తే. భువనజాలంబు లలజడిఁ బొరయ కుండఁ
బ్రాణదశకంబు నింద్రియార్థములు నింద్రి
యాధిదైవతములుఁ గూడ ననఘ త్రివిధ
మగుచు విప్రాదివర్ణము [1]లయ్యె నట్టి. 247

క. ఇలఁ బుత్రపౌత్రనప్తృల, గలిగినవంశములతోడఁ గడుఁ జోద్యముగా
లలిఁ బ్రజ లేగతిఁ గలిగిరి, గలిగినయాప్రజలచే జగము లెట్లుండెన్. 248

క. చతురత దీపింపఁ బ్రజా, పతులకుఁ బతి యనఁగ వెలయుపద్మాపతి యే
గతిఁ బుట్టించెను స్రష్టృ, ప్రతతులచే నవవిధప్రపంచము మఱియున్. 249

తే. వానిభేదంబులును మనువంశములును, మనుకులాధీశ్వరులును దన్మనుకులాను
చరితములు నేవిభూతి నేజాడ దీని, నింతయును బుట్టఁజేసె నాకెఱుఁగఁ బలుకు.

క. [2]ధరణిం గ్రిందట మీఁదట, ధరణికిఁ గలలోకములను దత్త్వస్థితులున్
వరుసలుఁ బరిమాణంబులు, నెఱిఁగింపఁ గదయ్య నాకు నిద్ధచరిత్రా. 251

క. సుర తిర్య ఙ్నర రాక్షస, గరు డోరగ సిద్ధ సాధ్య గంధర్వ నభ
శ్చరముఖభవములు మునికుం, జర గర్భస్వేదజాండజముల తెలుంగున్. 252

క. త్రిగుణప్రధానకంబులు, నగునవతారములఁ బూర్ణ మై వెలసినయా
జగదుత్పాదనరక్షణ, నిగమములవిధంబు వానినిలుకడలుఁ దగన్. 253

క. చక్రాయుధుసౌందర్యప, రాక్రమముఖగుణములును ధరామరముఖవ
ర్ణక్రమములు నాశ్రమధ, ర్మక్రియలును శీలవృత్తమతభావములున్. 254

తే. యోగవిస్తారమహిమలు యోగములును
జ్ఞానమార్గంబులును బరిజ్ఞానసాధ
నములు నై యొప్పుసాంఖ్యయోగములు వికచ
జలజనయనకృతంబు లాశాస్త్రములును. 255

సీ. పాషండధర్మంబుఁ బ్రతిలోమకులవిభా, గములు జీవులగుణకర్మములును
బలుకులగతులను గలిగెడిధర్మమో, క్షములయందులపరస్పరవిరోధ
ములు లేనిసాధనములను భూమిపాలక, నీతివార్తలు దండనీతిజాడ
యును బృథగ్భావంబులును విధానములును, బితృమేధములును దత్పితృవిసృష్టి

తే. గతులుఁ దారాగ్రహంబులుఁ గాలచక్ర
మున వసించిననిలుకడలును దపములు
దానములుఁ దత్ఫలంబులుఁ [3]దగుప్రవాస
ధర్మములుఁ బ్రజ లొనరించుకర్మములును. 256

1 'లయ్యె నందు' అ. ప్ర. 2 'సరవిం గ్రిందన్ మీఁదన్' అ. ప్ర. 3 'దనరు ప్రవాస, ధర్మ' అచ్చుప్రతి.

చ. వదలక భూజనావళికి । వచ్చువిపద్దశధర్మముల్ సరో
జదళనిభాక్షుఁ డేగతిని । సంతస మందెడు నెట్టివారి కిం
పొదవఁగఁ గాన వచ్చు గురు।వుల్ బ్రియశిష్యులు గొల్చు వారు స
మ్మదమునఁ గోరునర్థములు । మానుగ నెల్లెఱిఁగింతు రిమ్ములన్. 257

క. విలయాదిభేదముల న, య్యలఘునిఁ బరమేశు నెవ్వ । రంచితభక్తిం
గొలుతు ర దెవ్వరిలో ను, త్కలికన్ సుఖియించు జీవ।తత్త్వము మఱియున్.

క. గోవిందునిరూపంబున, జీవబ్రహ్మలకు నైక్య।సిద్ధియు నెటు సం
భావన నుపనిషదర్థం, బై [1]వెలసెడిజ్ఞాన మెట్టి । దార్యస్తుత్యా. 259

తే. ఉచిత మగునట్టిశిష్యప్ర।యోజనములు
సజ్జనులచేత విజ్ఞాన।సాధనములు
నేమి పలుకంగఁబడు వాని । నెల్ల మఱియుఁ
బొలుచువైరాగ్యమునఁ దగు।పురుషభక్తి. 260

తే. ఇన్నియుఁ దెలియ నానతి । యిచ్చి నన్ను, నర్థి రక్షింపు యజ్ఞదా।నాదిపుణ్య
ఫలము వేదంబు సదివిన।ఫలము నార్త,జనులఁ గాచినఫలముతో।సమముగావు.

క. అని విదురుఁడు మైత్రేయుని, వినయంబునఁ దెలియ నడుగు।విధ మెల్లను వ్యా
సునిసుతుఁ డభిమన్యుసినం, దనున కెఱింగించి మఱియుఁ । దగ నిట్లనియెన్. 262

చ. ఇలఁ గలమానవావళికి । నెల్ల నుతింప భజింప యోగ్యమై
వెలసినపూరువంశము ప।విత్రము సేయఁగఁ బుట్టి సద్గుణా
కలితయశఃప్రసూనలతి।కాతతికిం బ్రతివాసరంబుఁ బెం
పలరఁగఁ బ్రోది వెట్టుదు గ।దయ్య ముకుందకథామృతంబునన్. 263

తే. అల్పతర మైనసుఖముల । నందుచున్న, జనులదుఃఖంబు మాన్పంగఁ।జాలునట్టి
[2]పుండరీకాక్షుగుణకథా।ప్రోత మైన, వితతనిగమార్థ మగుభాగ।వతము నీకు. 264

వ. ఎఱింగింతు విను మని యి ట్లనియె. 265

సీ. అమ్మహాభాగవ।తామ్నాయ మొకనాఁడు, గైకొని పాతాళ।లోకమందు
నప్రతీకజ్ఞాని । యై వాసుదేవాఖ్యఁ, బొలుచుసంకర్షణ।మూర్తి దివ్య
పురుషుండు దనుఁ దాన । బుద్ధిలోఁ జూచుచు, సలలితధ్యానము।కుళితనేత్రుఁ
డై సనందాభ్యుద।యార్థంబు గను విచ్చి, చూచిన వారు సం।స్తుతు లొనర్ప

తే. సమర గంగావగాహను । లై యహీంద్ర,కన్య లార్ద్రజటాబంధ।కలిత లగుచు
భర్తృవాంఛానుబుద్ధి న।ప్పరమపురుషుఁ, గదియ నేతెంచి తత్పాద।కమలయుగము.

క. సేవించి భక్తితో నా, నావిధపూజోపహార।నతిసుతులను నా
దేవునిహృదయము వడసిరి, యావేళ సనందనాదు । లమ్మహితాత్మున్. 267

మ. ఘనసాహస్రకిరీటరత్నవిలస।త్కాంతిప్రసిద్ధచ్ఛటా

---

1 'వెలయుఁ జ్ఞాన' అ. ప్ర. 2 'పుండరీకవిలోచన।ప్రోక్త మైన' వ్రా. ప్ర.

జనితోదగ్రరుచిప్రకాశితఫణాసాహస్రునిన్ దేవతా
వనదక్షు న్ననురాగపకృత్యము లోగిన్ వాంఛం బ్రశంసించి వా
రనురాగస్థలితోక్తు లొప్ప నడుగన్ హర్షించి యాదేవుఁడున్. 268

తే. భూరినిగమార్థసారవిచార మగుచుఁ, దనరునీభాగవతము సాదరతఁ బలికె
నలినభవసూతి యైనసనత్కుమార, కునకు నెఱిఁగించె[2]నతఁడు సాంఖ్యునకుఁ దగను.

క. [3]ఎఱిఁగించిన నతఁడు పరా, శరునకు నుపదేశ మిచ్చె సన్మతి నతఁడున్
సురగురున కొసఁగె నాతఁడు, గరమనుమగ నాకుఁ జెప్పెఁ గైకొని యేనున్.

క. నీ కిప్పుడు వివరించెద, నాకర్ణింపుము సరోరుహాక్షుం డగుసు
శ్లోకునిచరితామృతపరి, షేకుఁడ వై ముదము గదురఁ జెలఁగుము విదురా. 271

వ. ఇట్లు భగవత్ప్రోక్తంబును ఋషిసాంప్రదాయికంబును బురుషోత్తమస్తో
త్రంబును బరమపవిత్రంబును భవలతాలవిత్రంబును నయినభాగవతకథాసూ
త్రంబు (శ్రద్ధాళుండవు భక్తుండవు నగు)నీకు నుపన్యసించెద వినుము. 272

సీ. అనఘ యేకోదకం బై యున్నవేళ నం, తర్నిరుద్ధానలదారువితతి
భాతిఁ జిచ్ఛక్తిసమేతుఁ డై కపటని, ద్రాలోలుఁ డగుచు నిమీలితాక్షుఁ
డైననారాయణుం డంబుమధ్యమున భా, సురసుధాఫేనపాండురశరీర
రుచులు సహస్రశిరోరత్నరుచులతోఁ, జెలిమి సేయఁగ నొప్పుశేషభోగ

తే. తల్పమునఁ బవ్వళించి యనల్పతత్త్వ
దీప్తిఁ జెన్నొందఁగా నద్వితీయుఁ డగుచు
నభిరతుం డయ్యుఁ గోర్కులయందుఁ బాసి
ప్రవిమలాకృతి నానందభరితుఁ డగుచు. 273

తే. యోగమాయావిదూరుఁ డై యుగసహస్ర
కాలపర్యంత మఖిలలోకములు మ్రింగి
పేర్చి మఱి కాలశక్త్యుపబృంహితమున
సమత సృష్టిక్రియాకలాపములఁ దగిలి. 274

క. తనజఠరములోపలఁ దాఁ, చినలోకనికాయముల సృజించుటకును సా
ధన మగుసూక్ష్మార్థము మన, సునఁ గని కాలానుగతరజోగుణ మంతన్. 275

సీ. పుట్టించెఁ దద్గుణంబునఁ బరమేశ్వరు, నాభిదేశమునందు నలిననాళ
ముదయించె మఱి యప్పయోరుహముకుళంబు, గర్మబోధిత మైనకాలమందు
దనతేజమునఁ బ్రవృద్ధం బైనజలముచే, జలజాప్తుగతిఁ బ్రకాశంబు నొందఁ
జేసి లోకాశ్రయస్థితి సర్వగుణవిభా, సితగతి నొప్పురాజీవమందు

తే. నిజకళాకలితాంశంబు నిలిపి దాని, వలన నామ్నాయమయుఁడు నవరగుణుండు

---

1 'ప్రశంసించుచు, న్నను...నడుగ న్నాదేవుఁడున్ వారికిన్' వ్రా. ప్ర.
2 'సాంఖ్యాయనునకు నతఁడు. 3 పరఁగ నతం డంతఁ బరా' అ. ప్ర.

నాత్మయోనియునైన తోయజభవుండు, సరవిఁ జతురాననుండు నాఁ జనన మయ్యె.

తే. అతఁడు తత్పద్మకర్ణికయందు నిలిచి
వికచలోచనుఁ డై లోకవితతి దిశలు
నంబరంబును నిజచతురాననములఁ
గలయఁ బరికించి చూచుచుఁ గమలభవుఁడు. 277

చ. అలఘుయుగాంతకాలపవనాహతసంచలదూర్మిజాలసం
కలితజలప్రభూత మగుకంజముఁ దద్వనజాతకర్ణికా
తలమున నున్నతన్ను విశదక్రియ గల్గినలోకతత్త్వమున్
నలిఁ దెలియంగ నోపక మనంబునఁ జాల విచార మొందుచున్. 278

వ. ఇట్లని వితర్కించె. 279

ఉ. ఈజలమందు నీకమల మేగతి నుద్భవ మయ్యె నొంటి నే
నీజలజాతపీఠమున నేగతి నుంటి మదాఖ్య యెద్ది నా
కీజననంబు నొందుటకు నెయ్యది హేతువు బుద్ధిఁ జూడ నే
యోజ నెఱుంగలే నని పయోరుహగర్భుఁడు విస్మితాత్ముఁ డై. 280

క. ఆవనజనాళమూలం, బావనములలోన నర్థి నరయుటకొఱకై
యావనజాతప్రభవుం, డావనరుహనాళవివరమం దభిముఖుఁ డై. 281

మ. అతిగంభీరవిశాలవారినిధిలో యాంతర్నిమగ్నాంగుఁ డై
చతురాస్యుం డొగి దివ్యవత్సరసహస్రం బబ్జమూలంబు స
న్మతి నీక్షించియుఁ గాన లేక భగవన్మాయామహత్త్వంబు వి
స్మృతిఁ గావింప విభీతుఁ డై మరలఁ జేరెం దత్సరోజాతమున్. 282

తే. అట్లు గ్రమ్మఱఁ జేరి యయ్యబ్జపీఠ, మందు నష్టాంగయోగక్రియానురక్తిఁ
బవను బంధించి మహితతపస్సమాధి, నుండి శతవర్షములు సనుచుండ నంత.

ఆ. అట్టియోగజనిత మైనవిజ్ఞానంబు, గలిగి యుండి దానఁ గమలనయనుఁ
గాన లేక హృదయకమలకర్ణికయందు, నున్నవానిఁ దన్నుఁ గన్నవాని. 284

మ. కనియెన్ నిశ్చలభక్తియోగమహిమం గంజాతగర్భుండు శో
భనచారిత్రు జగత్పవిత్రు విలసత్పద్మాకళత్రున్ సుధా
శనముఖ్యస్తుతిపాత్రు దానవచమూజైత్రున్ దళత్పద్మనే
త్రు నవీనోజ్జ్వలనీలమేఘనిభగాత్రుం బక్షిరాట్పత్త్రినిన్. 285

వ. మఱియును, 286

చ. అలఘుఫణాతపత్రనిచయాగ్రసమంచితనూత్నరత్నని
ర్మలరుచిచే యుగాంతతిమిరంబు నడంచి యకల్మషోల్లస
జ్జలములఁ జేసి యందు నవసారసనాళసితైకభోగముం
గలిగినశేషతల్పమునఁ గైకొని యున్నమహాత్ము నొక్కనిన్. 287

సీ. వరపీతకౌశేయపరిధానకాంతి సం,ధ్యాంబుదరుచినిచయంబు గాఁగఁ
గమనీయనవహేమకలితకిరీటంబు, రమణఁ గాంచనశిఖరంబు గాఁగ
మానితమౌక్తికమాలికారుచి సాను,పతితనిర్ఝరపరంపరలు గాఁగఁ
జెలు వొందునవతులసీదామకములు లా,లితతటజౌషధీలతలు గాఁగ

తే. వరభుజంబులు నికటస్థవంశములుగఁ, బదము లంగణపాదపప్రచయములుగ
లలితగతి నొప్పుమరకతాచలవిడంబి, తాత్మదేహంబు గలుగుమహాత్ము హరిని.

వ. మఱియు నపరిచ్ఛిన్నంబును నిరుపమానంబును నిఖిలలోకసంగ్రహంబును నతివిస్తారవర్తులాయామంబును నై వివిధవిచిత్రదివ్యమణిభూషణంబున నాత్మీయనిర్మలద్యుతిచేతం బ్రకాశంబు నొందం జేయుదివ్యదేహంబు దనర వివిధంబు లగుకామంబు లభిలషించి విశుద్ధం బైన వేదోక్తమార్గంబున భజియించుపురుషశ్రేష్ఠులకుఁ గామధేను వనం దగిన పాదపద్మయుగంబును నలికఫలకలలితరుచినిచయంబులకు నోటువడి కృపాపాత్రుం డై చంద్రుండు బహురూపంబులఁ బదసరోజంబుల నాశ్రయించె నన నొప్పుపదనఖంబులును గమలాభూకాంతలకు నుపధానరూపంబు లనం దగి నీలకదళికాస్తంభంబులడంబు విడంబించునూరుయుగళంబును గనకమణిమయమేఖలాకలాపాభిరామంబుఁ గదంబకింజల్కశోభితపీతాంబరాలంకృతంబు నై విలసిల్లుకటీమండలంబును శృంగారవాహినీజలావర్తంబు నాఁ బొలు పొందునాభివివరంబును జఠరస్థనిఖిలబ్రహ్మాండముహుర్ముహురుద్భవకృశీభూతం బనం దగుమధ్యభాగంబును మహితముక్తాఫలమాలికావిరచితరంగవల్లీవిరాజితంబు నవతులసీదామకిసలయతల్పంబుఁ గుసుమమాలికాలంకృతంబు ఘనసారకస్తూరికాచందనవిలిప్తంబుఁ గౌస్తుభరత్నదీప్తిప్రదీప్తంబు శ్రీవత్సలక్షణలక్షితంబు నై యిందిరారమణికిఁ గేళీమందిరం బనం బొల్చువక్షస్స్థలంబును సుఖకేళీసమారంభపరిరంభణాంభోధిరాట్కన్యకాకరాంభోజకీలితకనకమణికంకణనికషంబు లనం బొలుపారురేఖాత్రయవిరాజమానం బైనకంధరంబును సుమహితానర్ఘదివ్యమణిప్రభావిభాసితకేయూరకంకణముద్రికాలంకృతంబు లయిన బాహువులును సకలలోకార్తినివారకదరహాసచంద్రికాధవళితంబు లైనకర్ణకుండలమండనమణిమరీచులు నర్తనంబులు సలుపం దనరి నిద్దంబు లగుచెక్కుటద్దంబులును బరిపక్వబింబఫలప్రవాళపల్లవాధరశోణాయితంబును నఖిలభువనపరిపాలనంబునకు నేన చాలుదు నని వివాదించునయనయుగళంబునకు సీమాస్తంభంబుఁ జంపకప్రసూనరుచివిభాసంబు నగునాసాదండంబును గమలకుముదంబులకుం బెంపు సంపాదించుచుఁ గరుణామృతతరంగితాపాంగంబు లై కర్ణాంతవిశ్రాంతంబు లై చెలువొందునేత్రంబులును సలలితశ్రీకారంబునకు నక్షరత్వంబు సార్థకం బయ్యె ననం దగుకర్ణంబులును నిక్షుచాపచాపద్వయంబురూపంబునఁ జూపట్టుబొమయుగళంబును నపరపక్షాష్టమీశశాంకశంకాస్పదఫాలఫలకంబును నీలగిరీం

ద్రిశృంగసంగతబాలమార్తాండ మండలవిడంబిత పద్మరాగమణిఖచితకాంచనకిరీ
టంబునం బొలుపారి సూర్యేందుపవనానలప్రకాశంబులకు నవకాశంబు సూపక
త్రిలోకవ్యాపకసమర్థంబు లగు తేజోవిశేషంబులఁ జెలు వొంది సంగరరంగంబుల
దానవానీకంబుల హరింపం జాలుసుదర్శనాదిదివ్యసాధనంబులచే దురాసదం
బగుదివ్యరూపంబునుం గలిగి మఱియును. 289

ఉ. హారకలాపపుష్పనిచయంబులఁ జంచదనర్ఘరత్నకే
యూరకరాంగుళీయకమహోజ్జ్వలబాహుసహస్రశాఖ [1]లో
ప్పారఁగఁ జూడ నొప్పి భువనాత్మకలీల నదృష్టమూలవి
స్ఫారితభోగివేష్టితవిభాసితచందనభూరుహాకృతిన్. 290

మ. విలసత్కుండలిరాజసఖ్యమున నుర్వీభృత్సమాఖ్యన్ సము
జ్జ్వలితోదారశిరోవిభూషణసహస్రస్వర్ణకూటంబునన్
సలిలావాసతఁ జారుకౌస్తుభవిరాజద్రత్నగర్భంబునన్
నలినాక్షుండు గనుంగొనంగఁ దగె మైనాకావనీభృద్గతిన్. 291

క. వితతార్జ్ఞానజప, స్తుతిమకరందప్రహృష్టశ్రుతిజాతమధు
వ్రతగణపరివృతశోభా, గతకీర్తిప్రసవమాలికలు గలవానిన్. 292

వ. కనుంగొని చతురాననుండు. 293

సీ. అనఘు సర్వేశ్వరు నాద్యంతశూన్యుని, ధన్యుని జగదేకమాన్యచరితుఁ
[2]దన్నాభిసరసిజోద్భవసరోజంబును, నప్పుల ననిలుని నంబరమును
మానితభువనత్రాణదృష్టిని బొడ,గనెఁ గాని యితరముఁ గానలేక
యాత్మీయకర్మబీజాంకురంబున రజో,గుణయుక్తుఁ డగుచు నకుంఠితప్ర
తే. జాభిసర్గాభిముఖత నవ్యక్తమూర్తుఁ, డై సహరియందుఁ దనహృదయంబుఁ జేర్చి
యమ్మహాత్మునిఁ బరము ననంతు నభవు, నజు [3]నమేయుని నిట్లని యభినుతించె.

సీ. నలినాక్ష మాయాగుణవ్యతికరమునఁ, జేసి కార్యంబై నసృష్టిరూప
మునఁ బ్రకాశించునీఘనరూపవిభవంబు, రూపింప దేహధారులకు దుర్వి
భావ్యంబు దలపోయ భగవంతుఁడవు నైన,పద్మాక్ష నీస్వరూపంబుకంటె
నన్య మొక్కటి సత్యమై బోధకంబైన,యది లేదు గాన నీయతులదివ్య
తే. మైనరూపంబు నాకుఁ బ్రత్యక్ష మయ్యె, నదియుఁ గాక వివేకోదయమునఁ జేసి
వరద నీరూప మజ్ఞానగుణతమోని,వారకం బయ్యె నాకు శశ్వత్ప్రదీప. 295

క. ఘన[4]సత్పురుషానుగ్రహ,మునకై యమితావతారమూలం బగుచుం
దనరెడినీరూపము శో,భన మగు భవదీయనాభిపద్మమువలనన్. 296

1 'ల, న్నారయఁ జూడ' వ్రా. ప్ర. 2 'దన్నాభిసరసముద్భవసరోజంబును' వ్రా. ప్ర. 3 'నమేయు నజేయు నిట్లని నుతించె' వ్రా. ప్ర. 4 'సత్పురుషపరిగ్రహ' వ్రాఁతప్రతులు.

క. జననం బందిననాచే, ననయము మొదలనె గృహీతకమయ్యె జగత్పా
వన నీదుసుస్వరూపము, ఘనరుచిరం బై స్వయంప్రకాశక మగుటన్. 297

వ. మఱియు జ్ఞానానంద[1]పరిపూర్ణమాత్రంబును (ననావృతప్రకాశంబును) భేదరహి
తంబును బ్రపంచజనకంబును బ్రపంచవిలక్షణంబును భూతేంద్రియాత్మకంబును
నేకంబును నైనరూపంబు నొందియు నెందును బొడగాననట్టినిన్ను నాశ్రయించె
ద నదియునుం గాక జగన్మంగళస్వరూపధరుండ వై నీయుపాసకుల మైనమామం
గళంబులకొఱకు నిరంతరధ్యానంబుచేత నీదివ్యరూపంబునం గానంబడితి విట్టినీవు
నిరయభాక్కు లై నిరీశ్వరవాదంబునం జేసి కుతర్కంబులు ప్రసంగించుభాగ్యర
హితులచేత నాదృతుండవు గావు మఱియుం గొందఱు కృతార్థు లైనమహాత్ములు
భవదీయశ్రీచరణారవిందకోశగంధంబు వేదమారుతానీతం బగుటం జేసి తమత
మకర్ణకుహరంబులచేత నాఘ్రాణించుచుండుదురు వారలహృదయకమలంబుల
యందు భక్తిపారతంత్ర్యంబున గృహీతపాదారవిందంబులు గలిగి ప్రకాశింతు
వదియునుం గాక ప్రాణులకు [2]ద్రవ్యాగారసుహృన్నిమిత్తం బయినభయంబును
దన్నాశనిమిత్తం బయినశోకంబును ద్రవ్యాదిస్పృహయును దన్నిమిత్తం బయిన
పరిభవంబును (మఱియు నంతఃదృష్ణయు నది ప్రయాసంబున లబ్ధం బైన నార్తి
మూలం బగు)[3]తదీయం బైనవృథాగ్రహంబును నిశ్రీపాదారవిందంబులందు వై
ముఖ్యం బెంతకాలంబు గలుగు నంతకాలంబును బ్రాప్తంబు లగుం గాని మా
న వాత్మనాయకుండ వగునిన్ను నాశ్రయించిన భయనివృత్తిహేతు వైనమో
క్షంబు గలుగు మఱియునుం గొందఱు సకలపాపనివర్తకం బయినత్వదీయనామ
స్మరణకీర్తనంబులందు విముఖు లై కామ్యకర్మప్రావీణ్యంబునం జేసి నష్టమతు లై
యింద్రియపరతంత్రు లై యమంగళంబు లైనకార్యంబులు సేయుచుండుదు రదా
నం జేసి వాతాదిత్రిధాతుమూలం బైన(క్షుత్తృడాది)దుఃఖంబులచేతను శీతోష్ణ
వర్షవాతాదిదుఃఖంబులచేతను నతిదీర్ఘం బైనకామాగ్నిచేతను (నవిచ్ఛిన్నం బగు
క్రోధంబుచేతనుం) దహ్యమాను లగుదురు వారలఁ గనిన నాచిత్తంబు గలంకం
బొందు జీవుండు భవదీయమాయా[4]పరిభ్రామ్యమాణుం డై యాత్మ వే ఱని యె
ప్పుడు దెలియు నంతదాఁక (నిరర్థకం బై దుస్తరం బైన)సంసారసాగరంబు దరి
యింపం జాలకుండు సన్మునీంద్రు లైనను భవదీయనామస్మరణంబు మఱచి
యితరవిషయాసక్తు లై రేని వారలు దివంబులందు వృథాప్రయత్ను లై సంచ
రించుచు రాత్రులయందు నిద్రాసక్తు లై స్వప్నగోచరంబు లయినబహువిధ
సంపదలకు నానందించుచు శరీరపరిణామాదిపీడలకు దుఃఖించుచుం బ్రతిహతంబు
లైనయుద్యోగంబుల భూలోకంబున సంసారు లై వర్తింతురు నిష్కామధర్మ

1 ‘స్వరూపమాత్రంబును’ వ్రా. ప్ర. 2 ‘ద్రవ్యశరీరసుహృ’ వ్రా. ప్ర. 3 ‘మదీయం బనువృథాగ్రహ’ వ్రా. ప్ర. 4 సంక్రాంతుం డై.

లై నిన్ను భజియించుసత్పురుషులకర్ణమార్గంబులం బ్రవేశించి భవదీయభక్తి
యోగపరిశోభితం బై సహృత్సరోజకర్ణికాపీఠంబున వసియింతు వదియునుంగాక.

మ. వరయోగీంద్రులు యోగమార్గముల భావంబందు నేనీమనో
హరరూపంబుఁ [1]దలంచి యే గుణగణధ్యానంబు గావింతు ర
ప్పురుషశ్రేష్ఠపరిగ్రహంబునకు నై యా ల్పారఁ దద్ధ్యానగో
చరమూర్తిన్ ధరియింతు గాదె పరమోత్సాహుండ వై మాధవా. 299

తే. అరయ నిష్కామధర్ము లై యనట్టిభక్తులందు నీవు ప్రసన్నుండ వై నరీతి
హృదయముల బద్ధకాము లై యెనయు దేవ. గణములందుఁ బ్రసన్నతఁ గలుగ వీవు.

చ. అరయ సమస్తభూతహృదయంబులయందు వసించి యేక మై
పరఁగి సుహృత్ప్రియాత్మగుణభాసితధర్ముఁడవుం బరాపరే
శ్వరుఁడవు నై తనర్చుచు నసజ్జనదుర్లభ మైనయట్టిసు
స్థిర మగుసర్వభూతదయచేఁ బొడగానఁగ వత్తు నచ్యుతా. 301

మ. క్రతుదానోగ్రతపస్సమాధిజనసత్కర్మాగ్నిహోత్రాఖిల
వ్రతచర్యాదుల నాచరింప నఖిలవ్యాపారపారాయణ
స్థితి నొప్పారెడినీపదాబ్జయుగళీసేవాభిపూజాసమ
ర్పితధర్మం బగువానిభంగి నసురారీ దేవచూడామణీ. 302

తే. తవిలి శశ్వత్స్వరూపచైతన్యభూరి, మహిమచేత నపాస్తసమస్తభేద
మోహుఁడ వఖిలవిజ్ఞానమునకు నాశ్ర, యుండ వగునీకు మ్రొక్కెద నోరమేశ.

క. జననస్థితివిలయంబుల, కనయంబును హేతుభూత మగుమాయాలీ
లను జెంది నటన సలిపితి, వనఘాత్మక నీకొనర్తు నభివందనముల్. 304

సీ. అనఘాత్మ మఱి భవదవతారగుణకర్మ, ఘనవిడంబన హేతుకంబు లయిన
రమణీయ మగుదాశరథవసుదేవకు, మారాదిదివ్యనామంబు లోలి
వెలయంగ మనుజులు వివశాత్ము లై యవ, సానకాలంబున సంస్మరించి
జన్మజన్మాంతరసంచితదురితంబుఁ, బాచి కైవల్యసంప్రాప్తు లగుదు

తే. రట్టిదివ్యావతారంబు లవతరించు, నజుఁడ వగునీకు మ్రొక్కెద ననఘచరిత
చిరశుభాకార నిత్యలక్ష్మీవిహార. భక్తమందార దుర్జనభయవిదూర. 305

తరలము. జననవృద్ధివినాశహేతుకసంగతిం గలయే ను నీ
వును హరుండుఁ ద్రిశాఖ లై మనువుల్ మరీచిముఖామరుల్
పొనర నం దుపశాఖ లై చెలువొంద నింతకు మూల మై
యనయమున్ భువనద్రుమాకృతి వై ననీ కిదె మ్రొక్కెదన్. 306

మ. పురుషాధీశ భవత్పదాబ్జయుగళీపూజాదికర్మక్రియా

---

1 'ధరించి తద్గుణగణ' వ్రా. ప్ర. 2 'దనర నం దుపశాఖ లై భువనాత్మ దీనికి మూల మై' అచ్చుప్రతి.

పరతం జెందనిమూఢచిత్తునిఁ బశుప్రాయున్ మనుష్యాధమున్
జరయు న్నంతము నొందఁ జేయ నతిదక్షుం డైనకాలంబు త
ద్గురుకాలాత్ముఁడ వైననీకు మది సంతోషంబునన్ మ్రొక్కెదన్. 307

సీ. సర్వేశ కల్పాంతసంస్థిత మగుజల, జాతమం దేను సంజనన మంది
భవదీయసుస్వరూపముఁ జూడ నర్థించి, బహువత్సరములు దపంబు సేసి
క్రతుకర్మములు పెక్కు గావించియును నినుఁ, బొడగానఁగా లేక బుద్ధి భీతిఁ
బొందిననాకు నిప్పుడును నిర్హేతుక, కరుణచే నఖిలలోకైకవంద్య
తే. మాన సతతప్రసన్నకోమలముఖాబ్జ, కలితభవదీయదివ్యమంగళవిలాస
మూర్తి దర్శింపఁ గలిగె భక్తార్తిహరణ, కరణ తుభ్యం నమో[1] యని మరలఁ బలుకు.

సీ. అమరతిర్యఙ్మనుష్యాదిచేతనయోను, లందు నాత్మేచ్ఛచేఁ జెందినట్టి
కమనీయశుభమూర్తి గలవాఁడ వై ధర్మ, సేతు వనంగఁ బ్రఖ్యాతి నొంది
విషయసుఖంబుల విడిచి సంతతనిజా, నందానుభవసమున్నతిఁ దనర్తు
వది గాన పురుషోత్తమాఖ్యఁ జెన్నొందుదు, వట్టిని న్నెప్పుడు నభినుతింతు
తే. నర్థి భవదీయపాదంబు లాశ్రయింతు, మహితభక్తిని నీకు నమస్కరింతు
భక్తజనపోషపరితోష పరమపురుష, ప్రవిమలాకార సంసారభయవిదూర.

సీ. తలకొని పంచభూతప్రవర్తక మైన, భూరిమాయాగుణస్ఫురణఁ జిక్కు
వడక లోకంబులు భవదీయజఠరంబు, లో నిల్పి ఘనసమాలోలచటుల
సర్వంకషోర్మిభీషణవార్థినడుమను, ఫణిరాజభోగతల్పంబునందు
యోగనిద్రారతి నుండంగ నొకకొంత, కాలంబు సనఁగ మేల్కనినవేళ
తే. నలఘుభవదీయనాభితోయజమువలనఁ, గడఁగి ముల్లోకములు సోపకరణములుగఁ
బుట్టఁ జేసితి వతులవిభూతి మెఱసి, పుండరీకాక్ష సంతతభువనరక్ష. 310

క. నిగమస్తుత లక్ష్మీపతి, జగదంతర్యామి వగుచు సర్గము నెల్లం
దగుభవదైశ్వర్యంబున, నగణితసౌఖ్యానుభవము నందింతు గదే. 311

సీ. జలజాక్ష యెట్టివిజ్ఞానబలంబునఁ, గల్పింతు వఖిలలోకంబు లోలి
నతజనప్రియుఁడవు నా కట్టిసుజ్ఞాన, మర్థిమైఁ గృపసేయు మయ్య వరద
సృష్టినిర్మాణేచ్ఛఁ జెంది నాచిత్తంబు, దత్కర్మకౌశలత్వమునఁ దగిలి [నట్టి
యును గర్మవైషమ్యమునఁ బొందుకతమున, దురితంబుఁ బొరయక తొలఁగు
తే. వెరవు నాకెల్లఁ గలుగు నవ్విధము దలఁచి, కర్తవర్తను నను భవత్కరుణ మెఱసి
తగఁ గృతార్థునిఁ జేయవే నిగమవినుత, సత్కృపామూర్తియో దేవచక్రవర్తి.

చ. భవదుదరప్రభూత మగుపద్మమునందు వసించి యున్న నే
నవిరళతావకీనకలితాంశమునం దనరారువిశ్వముం
దవిలి రచించుచున్ బహువిధంబులఁ బల్కెడి వేదజాలముల్

1 'విశ్వంభరణదేవ.' వ్రా. ప్ర.

శివతర మై ఫలింపఁ గృప • సేయుము భక్తఫలప్రదాయకా. 313.

చ. అని యనుకంప దోఁప వినయంబునఁ జాఁగిలి మ్రొక్కి చారులో
చనసరసీరుహుం డగుచు • సర్వజగత్పరికల్పనారతిం
దనరిననన్నుఁ బ్రోచుటకుఁ • దా నిటు సన్నిధి యైనయీశ్వరుం
డనయము నాదుదుఃఖము దయామతిఁ బాపెడు నంచు నమ్రుఁ డై. 314

క. వనరుహసంజాతుఁడు నెమ్మనమున హర్షించె ననుచు • మైత్రేయమహా
ముని ఘనుఁ డగువిదురునకున్, వినయంబున నెఱుఁగఁ జెప్పి • వెండియుఁ బలికెన్.

మ. వనజాతప్రభవుండు కేవలతపోవ్యాసంగుఁ డై పద్మలో
చను గోవిందు ననంతు నాథుఁ దనవాక్ప్రౌక్తిన్ నుతింపన్ సుధా
శనవంద్యుండు ప్రసన్నుఁ డై నిఖిలవిశ్వస్థాపనాలోకనం
బునఁ జూచెన్ విలయప్రభూతబహువార్పూరంబులన్ వేల్లిడిన్. 316

తే. అట్లు వొడగని యాగ్నుఁ డై నట్టిపద్మభవునివాంఛిత మాత్మఁ దీర్పంగఁ దలఁచి
యతనిమోహనివారకం బైనయట్టి, యమృతరసతుల్యమధురవాక్యముల ననియె.

చ. తలకొని నీయొనర్చుపసి • దప్పి మదిం దలపోయుదుఃఖముం
దలఁగుము నాదులీలకుఁ బ్రధానగుణం బగు సృష్టికల్పనం
బలవడఁ జేయుబుద్ధి హృదయంబునఁ జొన్పి తపస్సమాధిని
ష్ఠల నతిభక్తులన్ ననుఁ బ్రసన్నునిఁ జేయుము చెందు కోరికల్. 318

క. నీ వొనరించుతపోవి, ద్యావిభవవిలోకనీయ • మగునీసృష్టిం
గావింపుము లోకంబుల,లో వెలిఁగెడినన్నుఁ గందు • లోకస్తుత్యా. 319

క. నాలోనిజీవకోటులు, వాలాయము నీకుఁ గానవచ్చు నిపుడు నీ
వాలోకింపుము దారువి, లోలహుతాశనునికరణి • లోకస్తుత్యా. 320

సీ. నలు వొంద నఖిలజీవులయందుఁ గలనన్నుఁ, దెలిసి సేవింపుము • నలినగర్భ
భవదీయగోషముల్ • వాయును భూతేంద్రి, యాశ్రయవిరహిత • మై విశుద్ధ
మైనజీవుని విమలాంతరాత్ముఁడ నైన, నను నేకముగఁ జూచునరుఁడు మోక్ష
పదమార్గవర్తి యై • భాసిల్లు బ్రహ్మాండ, మందును వివిధకర్మానురూప

తే. పద్ధతులఁ జేసి పెక్కురూపముల నొందు, జీవతతి రచియించు నీచిత్త మెపుడు
మత్పదాంబుజయుగళంబు నమరగియున్న, కతన రాజసగుణమునఁ గలుగదఘము.

క. విను మదియుఁ గాక ప్రాణుల, కనయము నెఱుఁగంగ రానియనఘుఁడఁ దేజో
ధనుఁడఁ బరేశుఁడ నీచే, తను గానంబడితి నిదె పితామహ కంటే. 322

వ. మఱియు భూతేంద్రియగుణాత్ముం డనియు జగన్మయుం డనియు నన్ను నీచిత్తం
బునందుఁ దలంపుము తామరసనాళవివరపథంబు వెంటం జని జలంబులలోనం
జూడం గోరినట్టిమదీయస్వరూపంబు. 323

క. నీ కిప్పుడు గానంబడ, నాకులకును సురగపతిపినాకుల కైనన్
[1]వాకొనఁగం దలపోయను, రాకుండు మదీయరూప[2]రమ్యత్వంబుల్. 324

క. కావున మచ్చారిత్రక, థావిలసిత మైనసుమహితస్తవము జగ
త్పావనము విగతసంశయ, భావుఁడ వై బుద్ధి నిలుపు పంకజజన్మా. 325

క. సగుణుఁడ నై లీలార్థము, జగములఁ గల్పింపఁ దలఁచుచతురుని నన్నున్
సగుణునిఁగా నుతియించితి, దగ సంతస మయ్యె నాకుఁ దామరసభవా. 326

క. ఈమంజుస్తవరాజము, నీమనమునఁ జింతఁ దక్కి నిలుపుము భక్తిన్
ధీమహిత నీమనంబునఁ, గామించినకోర్కు లెల్లఁ గలుగుం జుమ్మీ. 327

క. అనుదినమును ద్రిజగత్పా, వన మగునీమంగళస్తవంబుఁ బఠింపన్
వినినను జనులకు నేఁ బొడ, గనఁబడుదు నవాప్తసకలకాముఁడ నగుచున్. 328

తే. వనతటాకోపనయనవివాహదేవ, భవననిర్మాణభూమ్యాదివివిధదాన
జపతపోవ్రతయోగయజ్ఞములఫలము, మామకస్తవఫలము సమంబు గాదు.

క. జీవావలిఁ గల్పించుచు, జీవావలిలోనఁ దగ వసించుచుఁ బ్రియవ
స్త్వావలి లోపలఁ బ్రియవ, స్త్వావలి యై యుండునన్ను ననిశముఁ బ్రీతిన్.

క. తలఁపుము మత్ప్రీతికి నై, కలిగించితి నిన్ను భువనకారక నాలో
పల నడఁగి యేక మై ని, శ్చలగతి వసియించి యున్నజగముల నెల్లన్. 331

తే. తగ నహంకారమూలతత్త్వంబునొంది, నీవు పుట్టింపు మనుచు రాజీవభవుఁడు
వినఁగ నానతియిచ్చి యవిష్ణుఁ డభవుఁ, డంత నంతర్హితుండయ్యె ననఘచరిత.

క. అని చెప్పిన మైత్రేయునిఁ, గనుఁగొని విదురుండు పలికెఁ గడుముద మొప్పన్
జననుత నలినదళాక్షుఁడు, సనినం బద్మజుఁడు దేహసంబంధమునన్. 333

క. మానససంబంధంబును, బూనినయీసర్గ మెట్లు పుట్టించె దయాం
భోనిధివై నా కింతయు, మానుగ నెఱిఁగింపవయ్య మహితవిచారా. 334

వ. అనవుడు నమ్మునివరేణ్యుండు విదురున కిట్లనియెఁ బుండరీకాక్షువరదానప్రభావంబునం బంకజాసనుండు శతదివ్యవత్సరంబులు భగవత్పరంబుగాఁ దపంబుగావించి (తత్కాలవాయువుచేఁ గంపితం బగునిజనివాసం బయిన) పద్మంబును వాయువును జలంబులను గనుంగొని యాత్మీయతపశ్శక్తిచేత నభివృద్ధిం బొందినవిద్యాబలంబున వాయువు బంధించి తోయంబులతోడ నొక్కతోయంబ సమస్తంబునుం గ్రోలి యంత గగనవ్యాపి యగుజలంబును గనుంగొని. 335

ఉ. వారిజసంభవుండు బుధవంద్యుఁడు చిత్తమునం దలంచె దై
త్యారిఁ బయోవిహారి సముదంచితహారి నతాఖిలామృతా
హారి రమాసతీహృదయహారి నుదారి విదూరభూరిసం
సారి భవప్రహారి విలసన్నుతసూరి నఘారి నయ్యెడన్. 336

1 'వాక్రువ్వఁగ' వ్రా. ప్ర. 2 'రమణీయంబున్' వ్రా. ప్ర.

తే. అట్లు దలఁచి సరోజజుం [1]డంబుజమును గగనతలమునఁ జూచి యాకమలకోశ
లీనమై యున్నలోకవితానములను, నొయ్యఁ బొడగని హరిచే నియుక్తుఁడైన.

తే. వానిఁగాఁ దన్నుఁ దలఁచి యవ్వనరుహంబు
లోపలికిఁ బోయి మున్నందులోన నున్న
ముజ్జగంబులఁ జూచి యిమ్ముల సృజించె
మఱి చతుర్దశభువనముల్ మహిమఁ జేసి. 338

క. [2]పరఁగ సుధాశనతిర్య,ఙ్నరవివిధస్థావరాదినానాసృష్టి
స్ఫురణ నజుం డొనరించెం, బరువడి నిష్కామధర్మఫలరూపమునన్. 339

వ. ఇట్లు భువనంబులఁ బద్మజుండు గల్పించె నని మైత్రేయుండు విదురున కెఱిం
గించిన. 340

క. విదురుఁడు దురితావనిభృ,ద్భిదురుఁడు మునివరునిఁ జూచి ప్రియము మనమునం
గదురఁగ నిట్లని పలికె న,తిదురంతం బయినవిష్ణుదేవునిమహిమన్. 341

తే. అమరె భువనంబు లతనికాలాఖ్యతయును, గాంతి సేయుతదీయలక్షణము లర్థి
నాకు నెఱిఁగింపు మయ్య వివేకచరిత, యనిన మైత్రేయుఁ డవ్విదురునకు ననియె.

సీ. ఆద్యంతశూన్యంబు నవ్యయం బై తగు, తత్త్వ మింతకు నుపాదాన మగుట
గుణవిషయములు గైకొని కాలమును మహ, దాదిభూతములు దా నాశ్రయింపఁ
గాలానురూపంబుఁ గైకొని యీశుండు, దనలీలకై తనుఁ దా సృజించెఁ
గర మొప్ప నఖిలలోకములందుఁ దానుండుఁ, దనలోన నఖిలంబుఁ దనరుచుండుఁ

తే. గాన విశ్వమునకుఁ గార్యకారణములు
దాన యమ్మహాపురుషునితనువువలనఁ
బాసి విశ్వంబు వెలి యై ప్రభాస మొందె
మానితాచార యావర్తమానసృష్టి. 343

క. తెఱఁ గొప్ప నఖిలవిశ్వముఁ, బురుషోత్తము[3]మాయచేతఁ బుట్టుం బెరుఁగున్
విరతిం బొందుచు నుండుం, గర మర్థిన్ భూతభావికాలములందున్. 344

వ. అట్టిసర్గంబు నవవిధం బందుఁ బ్రాకృతవైకృతభేదంబులు గాల ద్రవ్యగుణంబులను త్రివిధంబులకుఁ బ్రతిసంక్రమంబు లగుచునుండు నందు మహత్తత్త్వగుణాశ్రయంబు ప్రథమసర్గం బది నారాయణసకాశంబున గుణవైషమ్యంబునం బొందు ద్రవ్యజ్ఞానక్రియోదయంబైనయహంకారతత్త్వంబు ద్వితీయసర్గంబు శబ్దస్పర్శరూపరసగంధంబు లనుపంచతన్మాత్రద్రవ్యశక్తియుక్తంబైనపృథివ్యాదిభూతసర్గంబు మూఁడవది యైయుండు [4]జ్ఞానేంద్రియంబు లైనత్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులుఁ [5]కర్మేంద్రియంబు లైనవాక్పాణిపాదపాయూపస్థములు నను దశవిధేంద్రియ

---

1 డంబుపులను. 2 మఱియు. 3 దేహమందు. 4 'జ్ఞానయుక్తంబు లైన' ప్రాఁతప్రతి.
5 'కర్మకలాపంబు లైన' వ్రా. ప్ర.

జననంబు చతుర్థసర్గంబు సాత్త్వికాహంకారజనితం బైనమనోమయసుమనోగణసర్గం బైదవసర్గం బై యొప్పు జీవలోకంబునకు నబుద్ధికృతంబు లైన యావరణవిక్షేపంబులం జేయుతామససర్గం బాఱవ దైయుండు నియ్యాఱు నీశ్వరునకు లీలార్థంబు లయినప్రాకృతసర్గంబు లయ్యె నింక వైకృతసర్గంబు లేడవది మొదలుగాఁగలుగు నవి వినిపింతు వినుము [1]పుష్పోత్పత్తిరహితంబులై ఫలించెడు నశ్వత్థోదుంబరపనసన్యగ్రోధాదు లైనవనస్పతులును బుష్పితంబులై ఫలపాకాంతంబు లైన(వ్రీహియవముద్గా)ద్యోషధులును నారోహణానపేక్షంబులైన(మాలతీమల్లికాది)లతలును ద్వక్సారంబు లైనవేణ్వాదులును [2]గఠినీభూతమూలంబులును శిఖావిస్తృతంబులును నగులతావిశేషరూపంబు లైనవీరుధంబులును బుష్పవంతంబు లయి ఫలప్రాప్తంబు లగు(చూతాది)ద్రుమంబులును నవ్యక్తచైతన్యంబులు నూర్ధ్వస్రోతంబులు నంతస్స్పర్శంబులుఁ దమఃప్రాయంబులు నై [3]స్థావరంబు లయినయీయాఱు నేడవసర్గంబగు నెనిమిదవసర్గంబుతిర్యక్సర్గంబిరువదియెనిమిదిభేదంబులుగలిగిశ్వస్తనాదిజ్ఞానశూన్యంబు లయి యాహారాదిజ్ఞానమాత్రనిష్ఠంబు లయి ఘ్రాణంబువలన నెఱుంగం దగినవాని నెఱుంగుచు హృదయంబున దీర్ఘానుసంధానరహితంబులై వర్తించుద్విశఫంబులు గలవృషభమహిషాజకృష్ణ సూకర రోహిష గవయ రురు మేష ముఖరనవకంబును నేకశఫంబు గలఖరాశ్వాశ్వతరగౌరశరభచమర్యాదిషట్కంబును బంచనఖంబులు గలశునక సృగాల వృక వ్యాఘ్ర మార్జార శశ శల్యక సింహ కపి గజ కూర్మ గోధాముఖభూచరద్వాదశకంబును మకరాదిజలచరంబులును గంక గృధ్ర బక శ్యేన భాస భల్లూక బర్హి హంస సారస చక్రవాక కాకోలూకాది(*ఖేచరంబులు నయ్యె) (నర్వాక్స్రోతం బై యేకవిధం బగు) మానుషసర్గంబు రజోగుణప్రేరితం బై [5]కర్మకరణదక్షం బై దుఃఖం బందును సుఖంబు గోరు నిది తొమ్మిదవసర్గం బనం దగు నీత్రివిధసర్గంబులు వైకృతసర్గంబు లనంబడు నింక దేవసర్గంబు వినుమదియు నెనిమిదిదెఱంగులు గలిగి యుండు నందు విబుధ పితృ సురాదులు మూఁడును గంధర్వాప్సరస లొకటియు యక్షరక్షస్సు లేకంబును భూతప్రేతపిశాచంబు లొకటియు సిద్ధ చారణ విద్యాధరు లేకంబును గిన్నర కింపురుషు లొకటియునుం గా దేవసర్గం బయ్యె నిట్లు బ్రహ్మనిర్మితంబు లైనదశవిధసర్గంబులు నెఱింగించితి (నింక మనువులం దదంతరంబుల నెఱింగించెదఁ గల్పాదులయందు నీప్రకారంబున స్వయంభూతుండును) నమోఘసంకల్పుండును నగునప్పుండరీ

---

1 'అపుష్పఫలవంతంబు లైనవనస్పతులును' వ్రా. ప్ర. 2 'లతలు ముదిరి కాఠిన్యంబు నొంది యారోహణానపేక్షంబు లైనవీరుధంబులును' వ్రాఁతప్రతి. 3 'యీస్థావరంబు లాఱు సప్తమసర్గం బయ్యె' వ్రా. ప్ర. 4 (*) 'ఖేచరంబులు మొదలుగాఁ గలతిర్యక్సర్గం బయ్యె' అ. ప్ర. 5 'కర్మారంభంబునం గలిగి తొమ్మిదవసర్గం బనం' వ్రా. ప్ర.

కాక్షుండు రజోగుణయుక్తుం డై స్రష్ట యగుచు స్వస్వరూపం బయినవిశ్వంబు నాత్మీయసామర్థ్యంబునం గల్పించె నయ్యీశ్వరునిమాయావ్యాపారంబులచే నీ సృష్టియందు నద్యావర్తంబులం బడి భ్రమించుచున్నమహీరుహంబులుంబోలెఁ బూర్వాపరభావంబు లెఱుంగంబడ కుండు నీకల్పంబునం దుండు దేవాసురాదులు ప్రతిమన్వంతరంబునందును నిట్ల నామరూపంబులచే నిర్దేశింపంబడుదురు మఱియు నిం దొక్కవిశేషం బెఱింగించెదఁ గౌమారసర్గం బనునది దేవసర్గాంతర్భూతం బయ్యును బ్రాకృతవైకృతోభయాత్మకం బై దేవత్వమనుష్యత్వరూపం బై నసనత్కుమారాదిసర్గం బనంబడె నమోఘసంకల్పుం డై నపుండరీకాక్షుండు దనుఁ దాన యిట్లు విశ్వభేదంబును గల్పించె నని మైత్రేయుండు విదురునకుం జెప్పి కాలలక్షణం బెఱింగించువాఁ డై యి ట్లనియె. 345

సీ. భువిఁ గనకార్యాంశములకు నంతము నన్య, వస్తుయోగంబు నేరవలన లేక
ఘటపటాదికజగత్కార్యంబునకు నిజ, సమవాయకారణత్వమునఁ బరఁగి
జాలసూర్యమరీచిసంగతగగనస్థ, మగుత్రసరేణుషడంశ మరయఁ
బరమాణు వయ్యెఁ దత్పరమాణువం దర్క, గతియెంతదడవుదత్కాలమగును

తే. సూక్ష్మకాలంబు విను మది సూర్యమండ,లంబు ద్వాదశరాశ్యాత్మకం బనంగఁ
గలుగుజగమున నొకయేఁడుగ డచిచనినఁ, గాలమెంతగునదిమహత్కాలమనఘ.

వ. అందుఁ బరమాణుద్వయం బొక్కయణు వగు నణుత్రితయం బొక్కత్రసరేణు వగు నవి మూఁడు గూడ నొక్కత్రుటి యగు నాత్రుటిశతం బొక్కవేధ యనం బరఁగు నట్టివేధలు మూఁడు గూడ నొక్క లవం బనందగు నవి మూఁ డైన నొక్కనిమేషం బనం జను నిమేషత్రయం బొక్కక్షణం బగు క్షణపంచకం బొక్క కాష్ఠ యనందగు నవి పది యైన నొక్కలఘు వన నొప్పు నట్టిలఘుపంచదశకం బొక్కనాడి యనం బరఁగు నట్టినాడికాద్వయం బొక్కముహూర్తం బయ్యె నట్టి నాడిక లా ఱైన నే డైన మనుష్యులకు నొక్కప్రహరంబగు నదియ యామంబనం జను దివసపరిమాణవిజ్ఞేయం బగునాడికోన్మానలక్షణం బెఱింగింతువినుము షట్పల తామ్రంబునం బాత్రంబు రచియించి చతుర్మాషసువర్ణంబునం జతురంగుళాయామశలాకంబుఁ గల్పించి దానం దత్పాత్రమూలంబున ఛిద్రంబుఁ గల్పించి తచ్ఛిద్రంబునం బ్రస్థమాత్రతోయంబు పరిపూర్ణంబు నొందునంతకాలం బొక్క నాడిక యగు యామంబులు నాలుగు నన నొక్కపగ లగు రాత్రియు నిప్పగిది జరగు నట్టియహర్నిశంబులు గూడ మర్త్యుల కొకదివసం బగు నవి పదునేనైన నొక్కపక్షం బగు శుక్లకృష్ణ(నామంబులం బరఁగినయ)పక్షంబులు రెండు గూడ నొక్కమాసం బగు నది పితృదేవతలకు నొక్కదివసం బగు నట్టిమాసంబులు రెం డైన నొక్కఋతు వగు షణ్మాసంబు లరిగిన నొక్కయయనం బగు నవి దక్షిణోత్తరాయణంబులు రెండు గూడి ద్వాదశమాసంబు లైన నొక్క

సంవత్సరం బగు నది దేవతలకు నొక్కదివసంబు నట్టిసంవత్సరశతంబు నరులకుం బరమాయు వై యుండుఁ గాలాత్ముండును నీశ్వరుండును నైనసూర్యుండు గ్రహనక్షత్రతారాచక్రస్థుం డై పరమాణ్వాదిసంవత్సరాంతం బైన కాలంబునం జేసి ద్వాదశరాశ్యాత్మకంబైనజగంబున సౌరబార్హస్పత్యసావనచాంద్రనాక్షత్రమానభేదంబులం గానంబడుచున్నవాఁ డై సంవత్సర పరివత్స రేడావత్స రానువత్సర వత్సరనామంబుల సృజ్యం బైనబీజాంకురంబులశక్తిం గాలరూపం బైనస్వశక్తిచేత నభిముఖంబుగాఁ జేయుచుం బురుషులకు నాయురాదివ్యయంబులం జేసి విషయాసక్తి నివర్తింపం జేయుచుం గోరికలు గలవారికి యజ్ఞముఖంబులం జేసి గుణమయంబు లైనస్వర్గాదిఫలంబుల విస్తరింపం జేయుచు గగనంబునఁ బరువువెట్టు వత్సరపంచకప్రవర్తకుం డగుమార్తాండునకుం బూజ గావింపు మని మైత్రేయుండు వలికిన విదురుం డి ట్లనియె. 347

క. నరపితృదేవగణాయుః, పరిమాణము లెఱుఁగ నాకుఁ బలికితివి మునీ
శ్వర యెఱిఁగింపు త్రిలోకో,పరిలోకవిలోక నైకపరు లగువారిన్ 48

ఉ. పూనినయోగసిద్ధి దగఁ బొందిననేత్రయుగంబునన్ బహి
ర్జానము గల్గి యుండి భువనంబులఁ జూచుచు నుండువారికి
న్నానుగఁ గల్గు కాలగతి నా కెఱిఁగింపు మునీంద్ర నావుడు
న్జానయశాలి యవ్విదురు నాదర మొప్పఁగఁ జూచి యి ట్లనున్. 349

సీ. జనసుతకృతయుగసంఖ్య నాలుగువేలు, దివ్యవర్షములు దదీయసంధ్య
లెనుబదినూఱేండ్లు విను త్రేత వత్సర, త్రిసహస్రము లగుఁ దదీయసంధ్య
లాఱునూఱేడులు నగు ద్వాపరము రెండు, వేలవత్సరముల వెలయుసంధ్య
లోలి నన్నూఱేడు లొగిఁ గలియుగము స, హస్రవర్షములు సంధ్యాంశమరయ

తే. [1]రెండునూఱేడులును నిల్చియుండుఁ జువ్వె
యనఘ సంధ్యాంశమధ్యంబులందు ధర్మ
మతిశయించును సంధ్యాంశమందు ధర్మ
మల్ప మై కానఁబడు చుండు ననఘచరిత. 350

వ. మఱియు ధర్మదేవత కృతయుగంబున నాలుగుపాదంబులును ద్రేతయందు మూఁడుపాదంబులును ద్వాపరంబునం బాదద్వయంబును గలియుగంబున నేకపాదంబును గలిగి సంచరించు న ట్లగుటం జేసి. 351

క. పాదవిభేదంబున మ, ర్త్యాదులును దఱుఁగు నధర్మ మాఁకొలఁదిని యు
త్పాదిల్లి వృద్ధిఁ బొందు ధ, రాదివిజులు [2]పాదబుద్ధిరతు లగుదు రిలన్. 352

సీ. భూర్భువస్స్వర్లోకములకంటెఁ బొడువునఁ, గడు నొప్పుసత్యలోకంబునందు
నుండు బ్రహ్మకుఁజతుర్యుగసహస్రము లేఁగ, దివ మొక్కటియగు రాత్రియునునిట్ల

1 ‘యుగశతాబ్దంబులును నిల్చి యుండు’ వ్రా. ప్ర. 2 పాపబుద్ధి.

చన ధాతనిద్ర వో।జగములు మడఁగు మే,ల్కనిచూడ మరలలో।కములువుట్టుఁ
దద్దినమునఁ జతు।ర్దశమను లగుదు రం, దొక్కొకమనువున । కొనర దివ్య
తే. యుగములోలిని డెబ్బది।యొక్కమాఱు,సనిన మనుకాలమయ్యెన।మ్మనుకులంబు
సురలు మునులును సప్తర్షి।లరయభగవ,దంశమునఁ బుట్టిపాలింతు।రఖిలజగము.
క. హరి పితృసుపర్వతిర్య,జ్నరరూపములన్ జనించి । నయమున మన్వం
తరముల నిజసత్త్వంబునఁ, బరిపాలనసేయు జగముఁ । బౌరుష మొప్పన్. 354
క. క్రమమునఁ ద్రైవర్గికస, ర్గము సెప్పంబడె సరోజ।గర్భుఁడు దివసాం
తమునఁ దమఃపిహితపరా,క్రముఁ డై శయనించు నిద్రఁ । గైకొని యంతన్.
సీ. ఆరాత్రి భువనత్ర।యము దమఃపిహిత మై, భానుచంద్రులతో వి।లీన మైన
సర్వాత్ముఁ డగుహరి । శక్తిసమేత మై, కడఁగి వెలుంగుసం।కర్షణాగ్ని
భువనత్రయంబును । దవిలి దహింప న,య్యనలకీలలఁ బొడ।మినమహోష్మ
లలమినఁ గమరి మ।హర్లోకవాసులు, జనలోకమునకును । జనుదు రపుడు
తే. విలయసమయసముత్కట।విపులచండ
వాతధూతోర్మిజాలదు।ర్వారవార్ధి
భువనములు మున్గ నమ్మూఁడు।భువనములను
దత్పయోరాశిమీఁదఁ బ।ద్మావిభుండు. 356
ఉ. చారుపటీర హీర ఘన।సార తుషార మరాళ చంద్రికా
పూర మృణాళ హార పరి।పూర్ణసుధాకర కాశ మల్లికా
సారనిభాంగశోభితభు।జంగమతల్పమునందు యోగని
ద్రారతిఁ జెంది యుండు జర।రస్థిరభూర్భువరాదిలోకుఁ డై. 357
క. జనలోకనివాసకు ల,ర్థిని వినుతింపంగ నతుల।దివ్యప్రభచేఁ
దనరుచు మీలితనిజలో,చనుఁ డై వసియించు నతఁడు । సముచితలీలన్. 358
వ. ఇవ్విధంబున. 359
సీ. కైకొని బహువిధ।కాలగత్యుపలక్షి, తము లై యహోరాత్ర।తతులు జరగ
శతవత్సరంబులు । జనులకుఁ బరమాయు, వై నసంగతిఁ బంక।జాసనునకుఁ
బరమాయు వగుశతా।బ్దంబు లందుల సగ, మరిగిన నదియ ప।రార్ధ మండ్రు
గాన పూర్వార్ధంబు । గడచుటఁ జేసి ద్వి, తీయపరార్ధంబు । దీనిపేరు
తే. గడఁగి పూర్వపరార్ధాది।కాలమందు, బ్రహ్మకల్పాఖ్య నెంతయుఁ।[1]బరఁగు నందు
బ్రహ్మయుదయించుటం జేసి । బ్రహ్మకల్ప,మనియు శబ్దాత్మక బ్రహ్మ।మనియు నెగడె.
క. విను మెన్నఁడు పంకజనా, భునినాభీసరసియందు । భువనాశ్రయ మై
తనరినపద్మము వొడవదు, ననఘా యది పద్మకల్ప । మన విలసిల్లున్. 361

1. 'బరఁగుచుండు, బ్రహ్మకల్పంబు శబ్దంబు బ్రహ్మమనుచుఁ, బలుకఁబడు నట్టిబ్రహ్మకల్పంబు తుదిని.' వ్రా. ప్ర.

వ. పూర్వపరార్ధాదినిం గలిగిన[1] బ్రహ్మకల్పంబుఁ జెప్పితి నింక ద్వితీయపరార్ధంబు మొదల నెన్నఁడేని హరి సూకరాకారంబు దాల్చె నది వరాహకల్పం బనందగు నట్టి వరాహకల్పం బిపుడు వర్తమానం బగుచున్నది వెండియు. 362

సీ. దీపింపఁ గాలస్వరూపుఁ డైనట్టిప, ద్మాక్షుఁ డనంతుఁ డనాదిపురుషుఁ
డఖిలవిశ్వాత్మకుఁ డగునీశునకుఁ బర, మాణ్వాదియుగపరార్ధాంత మగుచు
జరగునీకాలంబు చర్చింప నొక్కని, మిషమాత్రకాల మై మెలఁగుచుండుఁ
గాని యీశ్వరునకుఁ గర్త గాఁ జాల ది, క్కాలంబు విను మది గాక దేహ
తే. మందిరార్థాదికర్త్రాభిమానశీలు, రైనవారికి నాశ్రయం బగుటఁ జేసి
యరయ హరి తద్గుణవ్యతికరుఁడు గాన, కాల మమ్మేటి కెన్నఁడుఁ గర్తగాదు.

వ. మఱియు షోడశవికారయుక్తం బై పృథివ్యాదిపంచభూతపరివృతం బయి దశావరణంబులు గలిగి పంచాశత్కోటివిస్తీర్ణం బై బ్రహ్మాండకోశంబు దనర్చుచుండు.

చ. హరి పరమాణురూపమున నందు వసించి విరాజమానుఁ డై
సరి వెలుఁగొందు నిమ్ముల నసంఖ్యము లైనమహాండకోశముల్
నెఱిఁ దనయందు డింద నవనీరజనేత్రుఁ డనంతుఁ డాద్యుఁ డ
క్షరుఁడు పరాపరుం డఖిలకారణకారణుఁ డప్రమేయుఁ డై. 365

క. నిరతిశయోజ్జ్వలతేజ, స్స్ఫురణం దనరారుపరమపురుషుని విష్ణుం
బురుషోత్తము వర్ణింపను, సరసిజభవభవుల కైన శక్యమె చెప్పుమా. 366

క. అని మైత్రేయుఁడు విదురుం, గనుఁగొని వెండియును బలికెఁ గాలాహ్వయుఁడై
తనరినహరి[2]మహిమల నే, వినిపించితి సృష్టిమహిమ విను మెఱిఁగింతున్. 367

వ. పరమేష్ఠి యాసృష్ట్యాది నహమ్మను దేహాభిమానబుద్ధిం గలమోహంబును నంగనాసంగమస్రక్చందనాదిగ్రామ్యభోగేచ్ఛలు గలమహామోహంబును దత్ప్రతిఘాతజాతం బైనక్రోధంబునందుఁ గలుగునంధతామిస్రంబును దన్నాశంబునం దహ మేవ మృతోఽస్మి యనుతామిస్రంబును జిత్తవిభ్రమంబును ననునవిద్యాపంచకమిశ్రంబుగా సర్వభూతావలిం బుట్టించి యాత్మీయచిత్తంబునం బాపసృష్టిఁ గల్పించుటకుఁ బశ్చాత్తాపంబు నొంది భగవద్ధ్యానామృతపూతమానసుం డై యూర్ధ్వరేతస్కులును బరమపవిత్రులును నైనసనక సనందన సనత్కుమార సనత్సుజాతు లనుమునులఁ బుణ్యావర్తనుల నతిసత్త్వగుణగరిష్ఠులధీరజనోత్తముల నాగ్యుల హరి ప్రపన్నులంగా దివ్యదృష్టిం గల్పించి వారలంజూచి మీరుమీ యంశంబులం బ్రజలం బుట్టించి ప్రపంచంబు వృద్ధిఁ బొందింపుం డనిన వారలు తద్వచనంబు లపహసించుచుఁ బద్మజుం గని మోక్షధర్ములును నారాయణపరాయణులును నై ప్రపంచనిర్మాణంబునకుఁ బ్రతికూలవాక్యంబులు పలికిన [3]నుదయించినక్రోధంబు బుద్ధిచే నిగ్రహింపఁబడినను నరవిందసంభవునిభ్రూమధ్యంబు

---

1 పద్మకల్పంబు. 2 మహి మెల్లను. 3 'గనలాంను నరవిందసంభవు భ్రూమధ్య' వ్రా. ప్ర..

వలనం గ్రోధస్వరూపంబున నీలలోహితుండు నిఖిలసురాగ్రజుం డై యుదయించె నివ్విధంబున. 368

మ. జననం బందిననీలలోహితుఁడు గంజాతాసనుం జూచి యి
ట్లను నో దేవ మదాఖ్య యెట్టిది మదీయావాస మెచ్చోటు నా
కనయంబు న్నాఁటఁగింపవే యనుడు నయ్యంభోజగర్భుండు లా
లనముం దోఁపఁ గుమార నీజననవేళన్ రోదనం బిచ్చుటన్. 369

తే. రుద్రనామంబు నీకు నిరూఢ మయ్యెఁ, జంద్రసూర్యానలానిలసలిలగగన
పృథివిప్రాణతపోహృదింద్రియము లనఁగఁ, గలుగు నేకాదశస్థానములు వసింప.

వ. అని వెండియు మన్యు మను మహాకాల మహచ్ఛివ బుతధ్వజోరు రేతో భవ కాల వామదేవ ధృతవ్రతు లనునేకాదశనామంబులు గలిగి ధీ వృత్త్యశ నోమా నియుత్సర్పి రి లాంబి కేరావతీ సుధా దీక్షా నామపత్నీసమేతుండ వై పూర్వనియుక్తంబు లయిననామంబులం దత్తన్నివాసంబుల వసియించి ప్రజలం గల్పింపు మని నిర్దేశించిన భగవంతుం డగునీలలోహితుండు విశ్వగురుం డైన పితామహునిచే నియుక్తుం డై సత్త్వాకృతిస్వభావంబుల నాత్మసము లైనప్రజలం గల్పించె. 371

ఉ. రుద్రునిచేత నీగతి నిరూఢమతిన్ సృజియింపఁబడ్డయా
రుద్రగణంబు లోలి నవరుద్ధత విశ్వము మ్రింగె నమ్మహో
పద్రవశాంతికై యజుఁడు భర్గులఁ జూచి కుమారులార మీ
రౌద్రవిలోకనానలభరంబునఁ గ్రాఁగె సమస్తలోకముల్. 372

క. మీసృష్టి చాలు నింకన్, ధీసత్తములార వినుఁడు ధృతి మీరు తపో
వ్యాసంగచిత్తు లై చనుఁ,డా సన్మంగళము లగు దృఢంబుగ మీకున్. 373

మ. భగవంతుం బురుషోత్తమున్ హరిఁ గృపాపాథోధి లక్ష్మీశ్వరున్
సుగుణభ్రాజితు నచ్యుతుం బరుఁ బరంజ్యోతిం బ్రభున్ సర్వభూ
తగుహావాసు నధోక్షజున్ శ్రితజనత్రాణైకదక్షు న్నజున్
జగదాత్ముం గను చుందు రార్యులు తపశ్శక్తిన్ స్ఫుటజ్ఞాను లై. 374

వ. అనిన విని. 375

ఉ. కైకొని యిట్లు పంకరుహగర్భనిమంత్రితు లైనరుద్రు లు
ద్రేకముఁ దక్కి కానలకు నేయుతు లై తప మాచరింప న
స్తోకచరిత్రు లేఁగిరి చతుర్ముఖుఁ డంతఁ బ్రపంచకల్పనా
లోకనుఁ డై సృజించె జనలోకశరణ్యుల ధీవరేణ్యులన్. 376

తే. వినుము భగవద్బలాన్వితవినుతగుణులు, భువనసంతానహేతువిస్ఫురణకరులు
పద్మసంభవతుల్యప్రభావయుతులు, పదురు గొడుకులు పుట్టిరి భవ్యయశులు.

సీ. అరవిందసంభవునంగుష్ఠమున దక్షుఁ, డూరువువలనను నారదుండు

నాభిఁ బులహుఁడు గర్ణములఁ బులస్త్యుండు, త్వక్కున భృగువు హస్తమునఁ గ్రతువు
నాస్యంబువలన నయ్యంగిరసుఁడు ప్రాణ, మున వసిష్ఠుఁడు మనమున మరీచి
గన్నుల నత్రియుఁ గాఁ బుత్రదశకంబు, గలిగిరి వెండియు నలినగర్భు
తే. దక్షిణస్తనమువలన ధర్మ మొదవె, వెన్నువలనను నుదయించె విశ్వభయద
మైనమృత్యు వధర్మంబు నందకలిగె, నాత్మఁ గాముండు జననము నందె మఱియు.
సీ. భ్రూమధ్యతలమునఁ గ్రోధంబు నధరంబు,నందు లోభంబు నాస్యమున వాణి
యును మేఢ్రమందుఁ బయోధు లపానంబు,నందు నఘాశ్రయుఁ డైననిరృతి
లాలితచ్ఛాయవలన దేవహూతివి,భుండు గర్దముఁడును బుట్టి రంత
నబ్జజుఁ డాత్మదేహమున జనించిన, భారతిఁ జూచి విభ్రాంతిఁ బొరసి
తే. పంచశరబాణనిర్భిన్నభావుఁ డగుచుఁ, గూఁతు రని పాపమునకు సంకోచపడక
కవయఁ గోరినజనకునిఁ గని మరీచి,మొదలుగాఁ గలయమ్మునిముఖ్యు[1]లెఱిఁగి. 380
వ. ఇట్లనిరి.
ఉ. చాలుఁ బురే సరోజభవ సత్పథవృత్తిఁ దొఱంగి కూఁతు ని
ట్లాలరి వై రమింప హృదయంబునఁ గోరుట ధర్మ[2]రీతియే
చేలరి వైతి నీతగవుఁ బెద్దతనంబు[3]ను నేలపాలు గా
శీలము వోవఁ దట్టి యిటు సేసినవారలు మున్ను గల్గిరే. 381
ఉ. నీవు మహానుభావుఁడ వనింద్యచరిత్రుఁడ విట్టిచోట రా
జీవభవుండు దా విధినిషేధము లాత్మ నెఱుంగఁ డయ్యె నీ
భావభవప్రసూనశరబాధితుఁ డై తనకూఁతుఁ బొందెఁ బో
వావి దలంప లే కనుచు వారక లోకులు ప్రువ్వఁ దిట్టరే. 382
క. పాపము దలఁపక నిమిషము,లోపలఁ జెడుసౌఖ్యమునకు లోనైతివె యిం
తే పో ధారుణిఁ 'గామా, న్ధోఽపి న పశ్యతి' యనంగఁ దొల్లియు వినమే. 383
మ. అని యిబ్భంగి మునీంద్రు లాడినకఠోరాలాపముల్ వీనుల
న్విని లజ్జావనతాననుం డగుచు నానీరేజగర్భుండు స
య్యన దేహంబు విసర్జనీయముగఁ జేయన్ దిక్కు లేతెంచి త
త్తనువుం గైకొనఁ బుట్టె దిక్కలిత మై తామిస్రనీహారముల్. 384
వ. అంత. 385
చ. ఉడుగక పంకజాతభవుఁ డొండొకదేహముఁ దాల్చి ధైర్యమున్
విడువక సృష్టిపూర్వసమవేతమునన్ సృజియించు నైపుణిం
బొడమమి కాత్మలోనఁ దలపోయుచు నుండఁ జతుర్ముఖంబులన్
వెడలె ననూనరూపముల వేదము లంచితధర్మయుక్తి మై. 386

1 లలిగి. 2 సంగతే. 3 జలంబుపాలు గా.

తే. మఱియు మఖములు మహితకర్మములుఁ దంత్ర
ములును నడవళ్లు నాశ్రమములుఁ దదీయ
ముఖచతుష్కమునందునఁ బొడమె ననిన
విని మునీంద్రునిఁ జూచి యవ్విదురుఁ డనియె. 387

క. తోయజసంభవుఁ డప్పుడు, నేయే ముఖమండలమున నేనే సృష్టిన్
ధీయుతుఁడై సృజియించెను, బాయక యత్తెఱఁగుఁ దెలియఁబలుకుము నాకున్.

వ. అని యిట్లు విదురుం డడిగిన మైత్రేయుం డతనితో ని ట్లనియె ఋగ్యజుస్సామాథర్వంబు లనువేదంబులును [1]హోతృకర్మంబు లయినయప్రగీతమంత్రస్తోత్రంబు లగుశస్త్రంబులును నధ్వర్యుకర్మం బైనయిజ్యయు సంప్రగీతస్తోత్రం బయినస్తుతియును నుద్గాతృప్రయోజ్యంబైన ఋక్సముదాయరూపంబగుస్తోమంబును బ్రాయశ్చిత్తం బగుబ్రహ్మకర్మంబును నాయుర్వేదధనుర్వేదగాంధర్వవేదంబు లనునుపవేదంబులును విశ్వకర్మశాస్త్రం బగుస్థాపత్యంబును బ్రాగాదిముఖంబుల నుత్పన్నంబు లయ్యెఁ బంచమవేదం బగునితిహాసపురాణంబులు సర్వముఖంబులం గలిగె మఱియుఁ గర్మతంత్రంబు లయినషోడశ్యుక్థ్యలును జయనాగ్నిష్టోమంబులును నాప్తోర్యామాతిరాత్రంబులును వాజపేయగోసవంబులును ధర్మపాదంబు లైనవిద్యాదానతపస్సత్యంబులును బ్రహ్మచర్యగృహస్థవానప్రస్థయత్యాశ్రమంబులును ననువీనికి నొక్కొక్కటికిం జతుర్విధంబు లైనవృత్తులును గలిగియుండు నందు సావిత్రం బన బ్రహ్మచర్యం బది యుపనయనంబాదిగా దివసత్రయంబు గాయత్రి జపించుటయ ప్రాజాపత్యం బన వేదవ్రతచతుష్టయం బందుఁ బ్రతివ్రతంబును వ్రతులు సంవత్సరపర్యంతంబుగా నాచరింప నగు బ్రాహ్మంబు వేదగ్రహణాంతంబు నాచరింపం దగు బృహత్తన నైష్ఠికంబియ్యవి యను బ్రహ్మచారివృత్తిచతుష్టయంబును ననిషిద్ధకృష్యాదివృత్తి యగువార్తయు యజనాది[2]కర్మోపయుక్తంబైనయాచ్ఞాదిరూపధనసంచయంబును బరుల యాచింప కుండునయాచితం బగుశాలీనంబును క్షేత్రపతితకణిశకణసంగ్రహణరూపం బగుశిలోంఛంబును ననుగృహస్థవృత్తులు నాలుగును నకృష్టపచ్యాహారు లగువైఖానసులును నూతనఫలంబు లబ్ధంబైనఁ బూర్వసంచితపదార్థత్యాగంబుగలవాలఖిల్యులును బ్రాతఃకాలంబున నేదిక్కు విలోకింతురద్దిక్కునకుం జనియచ్చట లభించుపదార్థంబుల భుజించి జీవించునౌదుంబరులును దమంత ఫలించి తరుపతితంబు లగుఫలంబులఁ దినుచుండు ఫేనపులును ననుచతుర్విధవృత్తులు గలవానప్రస్థులును స్వాశ్రమవిహితకర్మప్రధానకుం డగుకుటీచకుండును

---

1 'హోతృకర్మకం బైనశాస్త్రంబును నధ్వర్యుకర్మం బైనయిజ్యయు స్తుతియు సామగానంబును స్తోమంబును గాతృప్రయోజ్యం బైనఋక్సముదాయంబును బ్రాయశ్చిత్త.' ౹వా. ప్ర.

2 'కర్మంబులు గలయర్థసంపాదన మనుసంచయంబును' ౹వా. ప్ర.

గర్భోపసర్జనంబు సేసి జ్ఞానప్రధానుం డయినబహూదుండును గేవలజ్ఞానాభ్యాసనిష్ఠుం డగుహంసుండును బ్రాప్తం బైనపరబ్రహ్మతత్త్వంబు గల నిష్క్రియుండును ననుసన్న్యాసిచతుర్విధవృత్తులును (మోక్షఫలప్రదం బై యాత్మానాత్మవివేకవిద్యారూపం బగు)నాన్వీక్షకి(యు స్వర్గాదిఫలప్రదం బై కర్మవిద్యారూపమగు) త్రయి(యు జీవనఫలప్రదానం బై కృష్యాదిరూపం బగు) వార్త(యు నర్థసంపాదనైకప్రయోజనం బగు)దండనీతియు మోక్షధర్మకామార్థంబు లైన న్యాయవిద్యాచతుష్టయంబును భూర్భువస్సువ యనువ్యాహృతులును బూర్వాదిముఖంబులవలన నుదయించె మఱియు నతనిహృదయాకాశంబువలనం బ్రణవంబును రోమంబులవలన నుష్ణిక్ఛందంబును ద్వగింద్రియంబువలన గాయత్రీఛందంబును మాంసంబువలనఁ ద్రిష్టుప్ఛందంబును స్నాయువువలన ననుష్టుప్ఛందంబును నస్థివలన జగతీఛందంబును మజ్జవలన పంక్తిచ్ఛందంబును బ్రాణంబువలన బృహతీఛందంబును గకారాదిపంచవర్గాత్మకంబు లయినస్పర్శంబు లనుజీవుండును నకారాదిస్వరాత్మకం బైనదేహంబును నూష్మంబు లను శషసహవర్ణచతుష్టయరూపంబు లగునింద్రియంబులును నంతస్థంబు లగుయరలవ యనువర్ణంబులు షడ్జాదిసప్తస్వరరూపంబు నాత్మబలంబు నయిన శబ్దబ్రహ్మంబును జతుర్ముఖునిలీలావిశేషంబున నుత్పన్నం బయ్యె వ్యక్తావ్యక్తం బై వైఖరీప్రణవాత్మకం బైనశబ్దబ్రహ్మంబువలనం [1]బరమాత్మ యవ్యక్తాత్మకుం డగుటం జేసి పరిపూర్ణుండును వ్యక్తాత్మకుం డగుటం జేసి యింద్రాదిశక్త్యుపబృంహితుండును నై కానంబడు నయ్యవసరంబున నజుండు భూరివీర్యవంతు లయినఋషిగణంబులసంతతి యవిస్తృతం బని తలంచి పూర్వతనుపరిగ్రహంబు సాలించి యనిషిద్ధకామాసక్తం బైనదేహాంతరపరిగ్రహంబు సేసి [2]నిత్యంబుఁ బ్రజాసృష్టియందు వ్యాసక్తుండ నైనం బ్రజ లభివృద్ధి నొందక యుండుట కేమి కారణం బగు నని యచ్చెరు వొంది తద్వృద్ధి యగువిధం బాలోచించుచు దైవం బిచ్చట విఘాతుకంబు గాన తదానుకూల్యం బావశ్యకం బని దాని నెమరు చూచుచు యథోచితకృత్యకరణదక్షుం డగుచుండుచతుర్ముఖునిదేహంబు ద్వివిధం బయిన నట్టిరూపద్వయవిభాగంబు స్వరాట్టగుస్వాయంభువమనువును దన్మహిషి యగు శతరూప యనుకన్యకయుం గా మిథునం బయి జనియించె నమ్మిథునంబువలనం బ్రియవ్రతోత్తానపాదు లనుపుత్రద్వయంబు నాకూతి దేవహూతి ప్రసూతు

---

1 'నింద్రాదిశక్త్యుపబృంహితుండును వ్యక్తాత్ముండును బరిపూర్ణుండునగునారాయణుండు కానంబడు. వ్రా. ప్ర. 2 మిథునసృష్టిఁ గల్పింపఁ దలంచెనని శుకుండు పరీక్షునకుఁ జెప్పిన నతం డిట్లనియె నిత్యంబై వ్యాపకంబై యథోచితకార్యకరణసమర్థం బైనచతుర్ముఖునిరూపద్వయంబునందు నొక్కరూపంబునందుఁ బ్రజాసంహోపసంకోచంబును నొక్కరూపంబునఁ బ్రజావిస్తారంబు నెట్లు సంభవించె ననిన రూపద్వయవిభాగంబువలన మనువును శతరూప యనుకన్యకయుం. వ్రా. ప్ర.

లనుకన్యకాత్రయంబునుం గలిగి రందు నాకూతిని రుచికునకును దేవహూతిం
కర్దమునకును బ్రసూతిం దక్షునకును నిచ్చె వీరలవలనఁ గలుగుప్రజాసంతతుల
చేత జగంబులు పరిపూర్ణంబు లయ్యె. 389

### స్వాయంభువమనువు ప్రజావృద్ధి సేయుట.

క. అని మైత్రేయుఁడు పలికిన, విని మనమున హర్ష మొదవ § విదురుఁడు మునినా
థునిఁ జూచి పలికెఁ గ్రమ్మఱ, వనజోదరపాదభక్తి§వశమానసుఁ డై. 390
క. ఘనుఁడు స్వయంభువునకుఁ బ్రియ,తనయుఁడు స్వాయంభువుండు § దైతేయవిభే
దనసేవాచతురుండును, జనవినుతుం డాదిరాజ§సత్తముఁ డౌటన్. 391
క. అతనిచరిత్రం బవ్యా, హతసుఖదము నిఖిలమంగ§ళావహము సమం
చితముం గావున బుధసే, వితనా కెఱుఁగంగఁ బలుక§వే మునితిలకా. 392
క. అదియును గాక ముకుందుని, పదకమలమరందపాన§పరవశు లై పెం
పొదవినవారిచరిత్రము, సదమలమతి వినిన భవము § సఫలము గాదే. 393
చ. అని విదురుండు వల్కిన దయాన్వితుఁ డై మునినాథచంద్రుఁ డి
ట్లను శ్రుతిశాస్త్రపారకలి§తాత్మకుఁ డై నరుండు పద్మలో
చనచరణారవిందయుగ§సంగము గల్గినసజ్జనుండు వాం
దినఫల మొందు భాగవత§దివ్యకథాశ్రవణుండు వేల్మిడిన్. 394
క. అని చెప్పి మునికులాగ్రణి, దనుజారికథాసుధాప్లు§తస్వాంతుం డై
తనువునఁ బులకాంకురములు, మొనయఁగ నానందబాష్ప§ములు జడిగురియన్.
సీ. వినిపింపఁ దొడఁగె నా§ఘనుఁడు స్వాయంభువుఁ, డంగనాయుక్తుఁ డై§యబ్జగర్భు
నకు మ్రొక్కి వినయవి§నమితోత్తమాంగుఁ డై, హస్తముల్ మొగిచి యి§ట్లనియెఁ బ్రీతి
జీవరాసులకు రా§జీవసంభవ నీవ, జననరక్షణవినా§శముల కరయ
హేతుభూతుఁడవు మా § కెద్ది యాచరణీయ, మైనకర్మము దాని § నానతిమ్ము
తే. ఎట్టికర్మంబు సేసిన § నెసఁగు నీకు, నవహితం బైనసంతోష § మాత్మజుండు
జనకునకు భక్తిఁ బరిచర్య§సలిపి కీర్తి, నంది నుతికెక్కి వర్తించు § నందు నిందు.
వ. [1]కావున నెఱింగింపు మట్టిసత్కర్మంబు.
క. అని పలికినస్వాయంభువ, మనుమృదుభాషలకు నలరి § మనమునఁ గమలా
సనుఁ డనురాగము ముప్పిరిగొనఁ బ్రియతముఁ డైనసుతున§కును నిట్లనియెన్.
చ. మునుకొని తండ్రియాజ్ఞఁ దల § మోచి నిజోచితకృత్య మేమి వం
చినఁ దనశక్తియుక్తి నెడ § సేయక చేయుట పుండరీకలో
చనపదసేవ సేయుట ప్ర§జాపరిపాలనశాలి యాటయుఁ
జనకునకున్ సుతుండు పరి§చర్య లొనర్చుట సువ్వె పుత్రకా. 398

---

1 'కావున నెఱిఁగింపు మట్టిసత్కర్మ మనఘ' అని యిది క్రింది తేటగీతిలో నైదవపాదముగాఁ గొన్నిప్రతులఁ గనుపట్టెడి.

వ. కావున. 399

మ. వివరింపన్ హరి యజ్ఞమూర్తిఁ బరముండు విష్ణుండు హృషీకేశుఁ డే
శవుఁ బద్మాక్షు గుఱించి జన్మములు శశ్వద్భక్తిఁ గావింప మా
ధవుఁ డాత్మం బరితోష మొందు నతఁ డుద్యత్ప్రీతుఁ డై యున్న లో
కవితానంబులు దుష్టి నొందు ననఘా కావింపుమా యజ్ఞముల్. 400

చ. అకుటిలభక్తిఁ గేశవసమర్పణబుద్ధిఁ గ్రతుక్రియల్ వొన
ర్పక విపరీతులై యుముకరాసులు దంచి ఫలంబు నందఁ గా
నక చెడురీతి నూరక ధనవ్యయ మౌటయ కాని మోక్షదా
యక మగు చున్నసత్ఫలము నందరు విష్ణుపరాఙ్ముఖక్రియుల్. 401

ఉ. కావున యజ్ఞముల్ హరి వికారవిదూరు గుఱించి చేయు నీ
భావము సూనృతవ్రత శుభస్థితిఁ జెందెదు నీకుమారులున్
నీవును నీధరాభరము నెమ్మి వహింపుము సజ్జనావలిం
బ్రోవుము ధర్మమార్గమునఁ బుత్రక దోషలతాలవిత్రకా. 402

క. అనవుడు నతనికి నతఁ డి, ట్లనియె న్నఘనాశ నీదునానతి యె ట్ల
ట్లొనరించెద నాకును నా, తనయులకు వసించి యుండఁ దగు నెల వెందున్. 403

## శ్రీయజ్ఞవరాహావతారాభివర్ణనము.

తే. అరయ లేదు విధాత యీయఖిలజంతు, జాతముల కెల్ల నాధారభూత మైన
ధరణి యిప్పుడు ఘనజలాంతర్నిమగ్న, మైనకతమునఁ జోటు లేదంటిఁ దండ్రి.

క. కావున భూమ్యుద్ధరణము, గావించునుపాయ మిపుడు గైకొని నాకున్
దేవా నీ వెఱిఁగింపుము, నావుడుఁ బద్మజుఁడు దనమనంబునఁ దలఁచెన్. 405

మ. జలమధ్యంబున లీన మొందినధరాచక్రంబు నేనేర్పునన్
నిలుపన్ వచ్చును బూర్వమందు జగముల్ నిర్మించునాఁ డాది స
ప్పులఁ బుట్టించినమీఁద నవ్వసుమతిం బుట్టించితి న్నట్టియ
ప్పులలోఁ గ్రుంకి రసాతలాంతరమునం బొందెం గదా పృథ్వియున్. 406

సీ. అఖిలజగత్కల్పనాటోపమునకుఁ బా, ల్పడిననాచేత నెబ్బంగి నిపుడు
దగిలి విశ్వంభరోద్ధరణంబుఁ గావింప, నగు నని సర్వభూతాంతరాత్ముఁ
బురుషోత్తముని నవపుండరీకాక్షు ల, క్ష్మీపతిఁ దనమనస్స్థితునిఁ జేసి
తలపోయు చున్నఁ బద్మజునాసికావివ, రమ్మున యజ్ఞవరాహమూర్తి

తే. యర్థి నంగుష్ఠమాత్ర దేహంబుతోడ, జనన మంది వియత్తలస్థాయి యగుచు
క్షణములోపల భూరిగజప్రమాణ, మయ్యె నచ్చటిజనముల కద్భుతముగ. 407

సీ. అంతఁ బ్రజాసర్గమందు నియుక్తులై, [1]నట్టిమరీచ్యాదు లైనమునులు
మనుకుమారకులు [2]నమ్మనుసహితంబుగ, యజ్ఞవరాహంబు నర్థిఁ జూచి

---

1 ‘నట్టిమరీచిముఖామరులును’ వ్రా. ప్ర. 2 ‘నమ్మనువును సహిత మై’ వ్రా. ప్ర.

యిట్టియాశ్చర్య మెక్కెందేనిఁ గలదె నా, సారంధ్రనిర్గతస్తబ్ధరోమ
లోకంబు మనము విలోకింప నంగుష్ఠ,మాత్రమై యీక్షణమాత్రలోన

తే. మహిమ దీపింప దంతిప్రమాణమును మ,హోన్నతంబైనగండశైలోపమంబు
నయ్యెనని వితర్కించి రయ్యబ్జభవుఁడు,హర్ష మిగురొత్తఁజూచి యిట్లనితలంచె.

క. నామనమునఁ గలదుఃఖవి,రామముఁ గావించుకొఱకు రాజీవాక్షుం
డీమేర యజ్ఞపోత్రి,శ్రీమూర్తి వహించె నిది విచిత్రము దలఁపన్. 409

వ. అని వితర్కించుసమయంబున సూకరాకారుం డయినభగవంతుండు. 410

తే. ప్రళయజీమూతసంఘాతభయదభూరి, గర్జనాటోపలోభకృద్ఘనగభీర
రావమడరింపనపుడు రాజీవభవుఁడు, మునులునానందమునఁబొందిరనఘచరిత.

వ. అంత మాయామయవరాహఘుర్ఘురారావంబు బ్రహ్మాండకోటరపరిస్ఫోటనంబు
గావింప విని జన స్తపస్సత్యలోకనివాసు లయినమునులు ఋగ్యజుస్సామమంత్రం
బుల వినుతించిరి యజ్ఞవరాహరూపధరుం డయినసర్వేశ్వరుండు సత్పురుష
పాలనదయాపరుండు గావున దిగ్గజేంద్రలీలావిలోలుం డై. 412

సీ. కఠినసటాచ్ఛటోత్కటజాతవాతని,ర్ధూతజీమూతసంఘాతముగను
క్షురనిభసునిశితఖురపుటాహతచల,త్ఫణిరాజదిగ్గజప్రచయముగను
జండదంష్ట్రోత్థవైశ్వానరార్చిస్స్రవ, ద్రజతహేమాద్రివిస్రంభముగను
ఘోరగంభీరఘుర్ఘురభూరినిస్వన, పంకిలాఖిలవార్ధిసంకులముగఁ

తే. బొరలుఁ గెరలునటించుసంబరముజెరల,రొప్పు నుప్పర మెగయునుగొప్పరించు
ముట్టెబిగియించు మసముసమూఁచుకొనుచు, నడరు సంరక్షితక్షోణియజ్ఞఘోణి.

వ. మఱియు నయ్యజ్ఞవరాహంబు. 414

సీ. తివిరి చతుర్దశభువనంబు లనుదొంతు,లొరగఁ గొమ్ములఁజిమ్ము నొక్కమాటు
[1]పుత్తడికొండ మూఁపుర మనునొరగంట,నొరసు రారాపాడు నొక్కమాటు
ఖురముల సప్తసాగరమున [2]సేతువు, లొనరొత్త మట్టాడు నొక్కమాటు
నాభీలవాలవాతాహతిచే [3]మిన్ను, నొదవించు బయలుగా నొక్కమాటు

తే. గన్నుఁగొనల విస్ఫులింగములు సెదర
నురుభయంకరగతిఁ దోఁచు నొక్కమాటు
పరమయోగీంద్రజనసేవ్యభవ్యవిభవ
యోగ్యమై కానఁ గానగు నొక్కమాటు. 415

వ. ఇట్లు విహరించుచుఁ బ్రాతర్మధ్యందినతృతీయసవనరూపుం డయినయజ్ఞవరాహ
మూర్తి యగుసర్వేశ్వరుండు మహాప్రళయంబునందు యోగనిద్రావశుం డై
యుండునవసరంబున నుదకస్థం బైనభూమి రసాతలగతం బైనదాని నుద్ధరించు

1 'బంగారుకొండ మూఁపర మను నొరగంట' వ్రా. ప్ర. 2 రొంపిగా, నుక్కించి మట్టా
డు' అ. ప్ర. 3 'మింటి, నొరసి బ్రద్దలు సేయు నొక్కమాటు' అచ్చుప్రతి.

టకు సముద్రోదరంబుఁ దఱియం జొచ్చు వేగంబు సైరింపం జాలక సముద్రుం
డూర్ధ్వ లనుభుజంబు లెత్తి విశీర్ణహృదయుం డై యార్తునిపగిది యజ్ఞవరాహ
నన్ను రక్షింపు రక్షింపు మని యాక్రోశింప నిశితకరాళక్షురతీక్ష్ణంబు లైన ఖురా
గ్రంబుల జలంబులు విచ్ఛిన్నంబులు గావించి యపారంబయిన రసాతలంబుఁ బ్రవే
శించి భూమిం బొడగనునవసరంబున. 416

క. శరనిధిలోన మహోగ్రా,మరకంటకుఁ డెదురఁ గాంచె మఖమయగాత్రున్
ఖురవిదళితకులగోత్రున్, ధరణికళత్రున్ గవేషధాత్రిం బోత్రిన్. 417

వ. ఇట్లు పొడగని దైత్యుండు రోషభీషణాకారుం డై. 418

మ. గద సారించి యసహ్యవిక్రమసమగ్రస్ఫూర్తితో వ్రేయఁగా
నది దప్పించి వరాహమూర్తి నిజదంష్ట్రాగ్రాహతిం ద్రుంచెఁ బెం
పొదవం గ్రోధమదాతిరేకబలశౌర్యోదారవిస్తారసం
పదఁ బంచాస్యము సామజేంద్రుఁ జల మొప్పం ద్రుంచుచందంబునన్. 419

మ. దితిజాధీశుని నీగతిం దునిమి యుద్వృత్తిం దదీయాంగశో
ణితపంకాంకితగండతుండుఁ డగుచున్ విష్ణుండు దా నొప్పె వి
స్తృతసంధ్యాంబుదధాతుచిత్రితసముద్దీప్తక్షమాభృద్గతిన్
క్షితి దంష్ట్రాగ్రమునన్ ధరించి జలరాశిం బాసి యేతేరఁగన్. 420

తే. బాలశీతాంశురేఖావిభాసమాన, ధవళదంష్ట్రాగ్రమున నున్నధరణి యొప్పె
హరికి నిత్యానపాయిని యైనలక్ష్మి, నెరయఁ బూసినకస్తూరినికర మనఁగ. 421

శ్రీయజ్ఞవరాహమూర్తిని బ్రహ్మాదులు స్తుతించుట.

వ. అట్టియజ్ఞపోత్రిమూర్తిం జూచి కమలాసనప్రముఖు లిట్లని స్తుతియించిరి. 422

సీ. దేవ జితం జితం తే పరమేశ్వర, జితయజ్ఞభావన శ్రుతిశరీర
కారణసూకరాకారుండ వగునీకు, నతిభక్తి మ్రొక్కెద మయ్య వరద
భవదీయరోమకూపములందు లీనంబు, లై యుండు నంబుధు లట్టియధ్వ
రాత్మక మై తనరారునీరూపంబు, గానంగ రాదు దుష్కర్ములకు
తే. నట్టినీకుఁ బ్రణామంబు లాచరింతు, మఖిలజగదేకకీర్తి దయానువర్తి
భవ్యచారిత్ర పంకజపత్రనేత్ర, చిరశుభాకార యిందిరాచిత్తచోర. 423

వ. అని వెండియు నిట్లు స్తుతియించిరి. 424

సీ. త్వక్కున నఖిలవేదములు రోమంబుల, యందు బర్హిస్సులు నక్షులందు
నాజ్యంబు పాదంబులందుఁ జాతుర్హోత్ర, కలితంబు లగుయజ్ఞకర్మములును
స్రుక్కు తుండంబున స్రువము నాసికను ని,డాపాత్ర ముదరకోటరమునందుఁ
[2]కర్ణరంధ్రంబుల గ్రహపాత్రచమసముల్, గళమునందు నుపసత్తులును జిహ్వఁ

---

1 'నగుచుఁ బూసినకస్తూరినిగమ మనఁగ' వ్రా. ప్ర.

2 ఇందులకు మూలము 'చమసాః కర్ణరన్ధ్రే। ప్రాశిత్ర మాస్యే గ్రసనే గ్రహాస్తు తే యచ్చ.

తే. దగుఁ బ్రవర్గ్యపాత్రయును దంష్ట్రలందుఁ
బ్రాయణీ[1]యోదయనులు శిరమున సవన
రూపమునఁ బంచప్రాణముల్ రూఢి యగుచు
సభ్య మావసథ్యమును నగ్నిచయన మయ్యె. 425

వ. వెండియు ముఖంబువలనఁ బ్రాశిత్రారణ్యాగ్నిహోత్రహవిర్భక్షణంబులును నభివ్యక్తిదీక్షయు, రేతంబున సోమంబును, నవస్థానంబున సవనంబులును, ధాతువుల సప్తసంస్థలును, సంధుల సర్వయాగంబులు నై యొప్పుచుండు. 426

క. హవరూపివి హవనేతవు, హవభోక్తవు నిఖిలహవఫలాధారుఁడవుఁ
హవరక్షకుఁడవు నగునీ, కవితథ మగునుతు లొనర్తు రమయ్య ముకుందా. 427

తే. సత్త్వగుణమున సద్భక్తి సంభవించు, భక్తియుతముగఁ జిత్తంబు భవ్యమగును
హృదయపద్మంబునందుల నెఱుఁగఁబడిన, యట్టినీకు నమస్కారమయ్య వరద.

మ. అరవిందోదర తావకీనసితదంష్ట్రాగ్రావలగ్నక్షమా
ధరనద్యబ్ధివనాటవీయుతసమస్తక్ష్మాతలం బొప్పె భా
సురకాసారబలావతీర్ణమదవచ్ఛుండాలరాడ్దంతశే
ఖరసంసక్తసపత్త్రపంకజము రేఖం బొల్పు దీపింపఁగన్. 429

వ. మఱియును. 430

మ. చతురామ్నాయవపుర్విశేషధర చంచచ్చక్రాకారాకార నీ
సితదంష్ట్రాగ్రవిలగ్నమైనధర రాజిల్లెం గులాగేంద్ర రా

---

ర్వాణంతే భగవ న్నగ్నిహోత్రమ్ ॥ దీక్షానుజన్మోపసదశ్శిరోధరం త్వం ప్రాయణీయోదయనీయదంష్ట్రః । జిహ్వాప్రవర్గ్య స్తవ శీర్షకం క్రతో స్సభ్యావసథ్యం చితయోఽసవో హి తే। సోమస్తు రేత స్సవనాన్యవస్థితిః సంస్థావిభేదా స్తవదేహధాతవః। సర్వాణి సత్త్రాణి శరీర సన్ధయ స్త్వం సర్వయజ్ఞక్రతు రిష్టిబన్ధనః' దీనికిఁ బయి తెనుఁగు కొంత యందంద విరుద్ధముగాఁ గానిపించుటచే నచ్చుప్రతులందు

'శ్రవణాస్యబిలములఁ ♦ జమస ప్రాశిత్రముల్, గళమున నిష్టిత్రి ♦ కంబు జిహ్వఁ

తే. దగుఁ బ్రవర్గ్యము నగ్నిహో♦త్రములు నీకు, చర్వణంబున సభ్యాప♦సథ్యు లుత్త
మాంగ మసువులు చయనము ♦ లగుఁ గిటీశ, యనుచు నుతియించి రత్తఱి ♦ యజ్ఞవిభుని.

వ. వెండియు ముహుర్ముహుర్భగవదావిర్భావం బుదీక్షణీయేష్టి యగునీనుదంష్ట్రలు ప్రాయణీయం బను దీక్షానంతరేష్టియు నుదయనీయం బనుసమాప్తేష్టియు యుష్మద్రేతంబు సోమంబును ద్వదీయావస్థానంబు ప్రాతస్సవనాదులు నీనుత్వఙ్మాంసాదిసప్తధాతువు లగ్నిష్టో మోక్థ్యషోడశీవాజపేయాతిరాత్రాప్తోర్యామంబు లనుసంస్థాభేదంబులును ద్వాదశాహాదిరూపంబు లైనబహుయాగసంఘాతరూపంబులు నగుసర్వసత్త్రంబులు భవదీయశరీరసంధులు ససోమాసోమంబు లగుయజ్ఞక్రతువులు నీవ మఱియును నీవు యజనబంధనంబులచే నొప్పుచుండు వదియునుం గాక' అని మూలమునకును శ్రీధరవ్యాఖ్యకును ననుగుణముగా నొకపాఠము గూర్పఁబడె నని తోఁచెడిని.

1 'ఉదయనీయ' మని శబ్దరూపము.

జితశృంగోపరిలగ్న మేఘముగతిం జెల్వారె విద్వజ్జనాం
చితహృత్పల్వల[1]క్రోల భూరమణ లక్ష్మీనాథ దేవోత్తమా. 431

సీ. సమధికస్థావరజంగమాత్మక మైన, వసుమతీచక్ర మవక్రలీల
నుద్ధరింపుము కరుణోపేతచిత్తుండ, వగుచు నస్మన్నాథ యయ్య ధరణి
[2]మాత యా లెట్లని మదిఁ దలంచెద వేనిఁ, జర్చింప మాకు విశ్వమున కీవు
జనకుండ వగుట యుష్మత్పత్ని భూదేవి, యగుట మాకును దల్లియయ్యె నిపుడు

తే. ధరకు నీతోడఁ గూడ వందన మొనర్తు, మరణియందును యాజ్ఞికుఁ డగ్ని నిలుపు
కరణి మీ తేజ మీధరాకాంతయందు, నిలుప ధరణి పవిత్రమై నెగడెఁ గాన.

వ. అదియునుం గాక. 433

చ. తలఁప రసాతలాంతరగతక్షితిఁ గ్రమ్మఱ నిల్పినట్టి నీ
కలితన మెన్న విస్మయము గాదు సమస్తజగత్తు లోలిమైఁ
గలుగఁగఁ జేయు టద్భుతము గాక మహోన్నతి నీ వొనర్చు పెం
పలరిన కార్యముల్ నడప నన్యులకుం దరమే రమేశ్వరా. 434

చ. సకలజగన్నియామకవిచక్షణలీలఁ దనర్చునట్టి నం
దకధర తావకస్ఫురదుదారత మంత్రసమర్థుఁ డైనయా
జ్ఞికుఁ [3]డరణిన్ హుతాశనుని నిల్పినకై వడి మన్నివాస మా
టకుఁ దలపోసి యీక్షితి దృఢంబుగ నిల్పితి వయ్య మాధవా. 435

చ. సలలితవేదశాస్త్రమయసౌకరమూర్తిఁ దనర్చుచున్ రసా
తలమున నుండి వెల్వడునుదారత మేను విదుర్పఁ దత్సటో
చ్చలితశివాంబుబిందువుల సాధుజనస్తపసత్యలోకవా
సుల మగుమేము దోఁగి పరిశుద్ధి వహించితి మయ్య మాధవా. 436

ఉ. విశ్వభవస్థితిప్రళయవేళలయందు వికారసత్త్వముల్
విశ్వము నీవ యై నిఖిలవిశ్వము లోలి సృజింపు దిందిరా
ధీశ్వర యీశ కేశవ త్రయీమయ దివ్యశరీర దేవ నీ
శాశ్వతలీల లిట్టి వని సన్నుతి సేయఁగ మాకు శక్యమే. 437

సీ. పంకజోదర నీ వపారకర్ముండవు, భవదీయకర్మముల్ పార మెద్ది
నెఱిఁగెద నని మది నిశ్చయించినవాఁడు, పరికింపఁగా మతిభ్రష్టు గాక
విజ్ఞానిగా చూడ విశ్వంబు నీయోగ, మాయాపయోనిధిమగ్న మాటఁ
దెలిసియుఁ దమబుద్ధిఁ దెలియనిమూఢుల, నే మన నఖిలలోకేశ్వరేశ

తే. దాసజనకోటి కతిసౌఖ్యదాయకములు, వితలకరుణాసుధాతరంగితము లైన
నీకటాక్షేక్షణములచే నెఱయ మమ్ముఁ, జూచి సుఖులను జేయ వే సుభగచరిత.

క. అని బ్రహ్మవాదు లగుస, న్మునివర్యులు భక్తియోగమున వినమితు లై

1 లోల - క్రోడ. 2 'మాతౌట యె ట్లని' వ్రా. ప్ర. 3 'డరణందుఁ బావకుని' వ్రా. ప్ర.

మనమున మోదము ముప్పిరి, గొనఁ బొగడిరి ఖురవిదళితధరిత్రిం బోత్రిన్.

ఉ. అంతట లీలపోలె జగదాత్ముఁడు యజ్ఞవరాహమూర్తి య
త్యంతగభీరభీషణమహార్ణవతోయచయంబులన్ ఖురా
క్రాంతముఁ జేసి క్రమ్మఱ ధరాతల మప్పులమీఁద నిల్పి వి
శ్రాంతి వహింపఁ జేసి గుణశాలి తిరోహితుఁ డయ్యె నయ్యెడన్. 440

ఉ. మంగళ మైనయీకథ సమంచితభక్తిఁ బఠింప విన్నవా
రిం గరుణార్ద్రదృష్టిఁ గని శ్రీహరి నాలఁ బ్రసన్నుఁ డౌను స
త్సంగతుఁ డైనవిష్ణుఁడు ప్రసన్నుఁడు దా నగునేని వారికిన్
మంగళముల్ లభించు ననుమానము లే దది గాక వెండియున్. 441

చ. హరి నిజదాసకోటికి గురూహళియుఁ డై రమియించు నట్టిస
త్పురుషుల కిష్టవస్తుపరిపూర్ణమనోరథసిద్ధి గల్గు సు
స్థిర మగు చున్నమోక్ష మఱి చేతిది యై చెలు వారు నన్న న
స్థిరతరతుచ్ఛవస్తువులు సేకుఱుటల్ మఱి చెప్ప నేటికిన్. 442

ఉ. కాన సరోజలోచను జగత్స్తవనీయకథాసుధారసం
బానినయట్టిజిహ్వ యితరానుకథాలవహోదకంబులం
బానము సేయఁ జూచునె సుపర్వమహీజమరందపానశో
భానయశాలి యైనమధుపప్రభుఁ డేఁగునె వేఁపచెట్లకున్. 443

క. అని మైత్రేయమునీంద్రుం, డనఘుఁడు విదురునకుఁ జెప్పినట్టితెఱం గ
గ్గునపౌత్రునకున్ వ్యాసుని,తనయుఁడు వినిపించి మఱియుఁ దగ ని ట్లనియెన్.

క. అని చెప్పిన[1]మైత్రేయునిఁ, గనుఁగొని విదురుండు పల్కు ఘనతర మగునా
దనుజకులాంతకుచరితము, విని తనియదు నామనంబు విమలచరిత్రా. 445

చ. సవనవరాహమూర్తికథ సర్వము నీదయ వింటి వెండియున్
వివరముగా వినం బలుకవే గుణసాంద్ర మునీంద్రచంద్ర మా
ధవగుణకీర్తనామృతవితానముఁ గర్ణపుటాంజలిన్ వెసం
జవిఁ గొన కేల మాను జనసంతతికిన్ భవతాపవేదనల్. 446

వ. కావున. 447

సీ. శ్రీహరి యజ్ఞవరాహరూపముఁ దాల్చి, మించి హిరణ్యాక్షుఁ ద్రుంచె ననుచు
నప్పుడు మునినాథ చెప్పితి నాతోడ, సవ్వరాహంబు దంష్ట్రాగ్రమునను
ధరణి నెబ్భంగిని ధరియించె హరికి హి, రణ్యాక్షుతోడ వైరమున కేమి
కారణ మసుర నేగతి సంహరించెఁ దా, నింతయు నెఱిఁగింపు మిద్ధచరిత

తే. యనిన మైత్రేయముని విదురునకు ననియె, హరికథాకర్ణనమునఁ బెంపారునీకు

1 యమ్మైత్రే, యునిఁ గని విదురుండు పల్కు నుత్తమ మగు.

జన్మఫలసిద్ధియగుటకుసందియంబు,వలదు హరిమాయ విధికైన నవశమె తెలియ.

క. అనఘాత్మ నన్ను నీ వడి, గినయాకథ ధుర్యుఁడు విష్ణుకీర్తనపరతం
దనరిననారదు నడుగ న, తని కతఁ డెఱిఁగింప హరికథాశ్రవణమునన్. 449

క. దండధరుఁ బెల్చ డాకాలఁ దన్ని ధ్రువుఁడు, నిండు నందును వాసికి నెక్కె నట్టి
విష్ణుసంకీర్తనం బరవిందభవుఁడు, దివిజులకుఁ జెప్పె నది నీకుఁ దేటపఱుతు.

వ. ఆకర్ణింపుము. 451

మైత్రేయమహాముని విదురునకు హిరణ్యాక్షహిరణ్యకశిపులవృత్తాంతం బెఱింగించుట.

సీ. బలిసి దక్షప్రజాపతితనూభవ దితి, సంతానవాంఛితచింత వొడమ
నొకనాఁడు పుష్పసాయకశరనిర్భిన్న, భావ యై విరహతాపమున వచ్చి
పతిసమాగమవాంఛ ప్రభవింప నిజనాథు, సన్నిధి నిలిచి యస్ఖలితనియతి
నగ్నిజిహ్వుండును యజురధీశుండును, నగువిష్ణుఁ దనచిత్తమందు నిలిపి

తే. తగఁ బయస్సున నగ్నిహోత్రంబు సేసి
కమలహితుఁ డస్తశైలసంగతుఁడు గాఁగ
హోమశాలాంగణమునఁ గూర్చున్నవిభుని
గశ్యపునిఁ గాంచి విమలవాక్యముల ననియె. 452

చ. గజవిభుఁ డుద్ధతి న్ననఁటికంబములన్ విదళించులీలఁ జి
త్తజుఁడు ప్రసూనసాయకవితానముచేత మదీయచిత్తమున్
గజిబిజి సేసి పెన్వగలఁ గాఱియ వెట్టఁగ నాథ నీపదాం
బుజములఁ గాన వచ్చితిఁ బ్రభుత్వ మెలర్పఁగ నన్నుఁ గావవే. 453

వ. అదియునుం గాక నాతోడిసవతు లెల్లను భవత్కృపావిశేషంబున గర్భాధానంబులు వడసి నిర్భరానందంబున నుండం జూచి శోకవ్యాకులితచిత్త నై యున్న నన్ను రక్షించుట పరమధర్మంబు నీవు విద్వాంసుండవు నీయెఱుంగనియర్థంబు గలదే నీవంటిమహానుభావు లయినసత్పురుషు లార్తు లైనవారికోర్కులు వ్యర్థంబులు గా కుండఁ దీర్చుట ధర్మపథం బని వెండియు ని ట్లనియె. 454

క. పతిసమ్మానము వడసిన, సతులకు నభిమతఫలార్థసంసిద్ధియు నూ
ర్జితయశముఁ గలిగి లోక, స్తుత మై చెలువారు చుండుఁ జువ్వె మహాత్మా. 455

క. తనధర్మపత్నివలనను, మనుకొని తాఁ బుత్రరూపమున నుదయించున్
వినుదీప మందు ముట్టిం, చినదీపము రెండు గావె శిఖ యొకఁ డయ్యున్. 456

క. కావున నీయర్థమ యా, [1]త్మా వై పుత్త్రి యని వేదతతులం దోలిన్
వావిరిఁ బలుకుట వినవే, ధీవర ననుఁ గావు మధికదీనం గరుణన్. 457

చ. వరకరుణామతిన్ దుహితృవత్సలతం దనరారునట్టిమ
ద్గురుఁ డొకనాఁడు మమ్ముఁ దనకూఁతుల నందఱఁ బిల్చి మీమనో

1 'త్మా వై నామాసి పుత్ర యని వేదములన్' వ్రా. ప్ర.

హారు నెఱిఁగింపుఁ డిత్తుఁ గమలాననలార య టన్న నందులోఁ
బురుషవరేణ్య నేము పమలముపూర్వ మ ర్తిలి నీ వరింపమే. 458
క. దితి యీగతిఁ గామవిమో, హితమతి బహువచనముల హృదీశునిఁ బలుకన్
ధృతిఁ గృపణురాలి నిజప్రియ, సతిఁ గని కశ్యపుఁడు వలికె సల్లాపమునన్.
వ. నీవు చెప్పినయట్ల పురుషులకు నంగనలవలన ధర్మార్థకామంబులు సిద్ధించుఁ గర్ణ ధారుండు నావచేతం బయోధిఁ గడచుచందంబున గృహమేధిసర్వాశ్రమవాసుల నరసి రక్షించుచు నిజాశ్రమంబున వ్యసనార్ణవంబుఁ దరియించు నట్లు సేయుపురుషునందుల నర్ధంబుభార్య భార్యయందు సకలగృహకార్యభారంబునుం జేర్చి పురుషుండు నిశ్చింతుండై సుఖయించుచుండు మఱియు నితరాశ్రమదుర్జయంబులైన యింద్రియశత్రువర్గంబుల భార్యాసమేతుండైన గృహస్థుండు దుర్గాధిపతియైన రాజు శత్రుసంఘంబుల జయించుచందంబున లీలామాత్రంబునం జయించు నిట్టి నీకుం బ్రత్యుపకారంబు సేయ సకలగుణసంపన్ను లగుసత్పురుషులు నూఱేండ్లకును జన్మాంతరంబులకునైన సమర్థులు గా రనిన మముబోఁటివారలు సేయ నోపుదురే యైన నీమనంబునం గలదుఃఖంబు దక్కు మని యి ట్లనియె. 460
తే. తరళలోచన నీవు సంతానవాంఛ, జేసి వచ్చితి వోఁ గులశీలవర్త నములుగలభార్యమనమునకనమరుకోర్కెఁ,దవిలి తీర్చుటపతికిఁ గర్తవ్యమరయ.
మ. తరుణీ యొక్కముహూర్త ముండు మిది సంధ్యాకాల మిక్కాలమం దరయన్ భూతగణావృతుం డగుచుఁ గామారాతి లీలన్ వృషే శ్వరయానంబున సంచరించుట నభావ్యం బయ్యె నీయుగ్రవే ళ రమింపంగ నిషిద్ధకర్మ మగు నేలా ధర్మమున్ వీడఁగన్. 462
మ. అరవిందానన వీఁడె నీమఱఁది లీలాటోపరుగ్రక్షుమా చరఝంఝానిలధూతపాంసుపటలచ్ఛన్నుండు ధూమ్రైకదు ర్భరవిద్యోతవికీర్ణభీషణజటాబద్ధుండు భస్మావలి ప్తరుచిస్ఫారసువర్ణవర్ణుఁడును నై భాసిల్లు నత్యుగ్రుఁడై. 463
క. అనలసుధాకరరవిలో, చనముల వికసింపఁ జేసి సమధికరోషం బునఁ జూచు చున్నవాఁ డదె, వనితాబంధుత్వ మరయ వలవదు సుమ్మీ. 464
క. అతనికిఁ దలపోయ హితా, హితులును సమ్మాన్యులును విహీనులు నతిగ ర్హితులును లేరీశుఁడు సమ, మతియును నిఖిలైకభూతమయుఁడై యుండున్.
క. కావున మద్భ్రాత భవ, ద్దేవరుఁ డని తరుణి నీమదిం జూడకు మా దేవాదిదేవుఁ ద్రిజగ, త్పావను నిఖిలైకనేత భగవంతు హరున్. 466
వ. ఏమును సత్పురుషులైనవిద్వాంసులును భుక్తభోగంబై దూరతోన్యస్తంబైన పుష్పమాలికయునుం బోలె నమ్మహాత్మునిచరణారవిందవందనాభిలాషిణియైన యవిద్యాదేవి ననుసరించి వర్తింతు మదియునుం గాక. 467

సీ. ఎవ్వనికరుణ బ్రహ్మేంద్రాదిదిక్పాల, వరు లాత్తపదవైభవములఁ దనరి
రెవ్వనియాజ్ఞ వహించి వర్తించును, విశ్వనేత్రి యగునవిద్య యెపుడు
నెవ్వనిమహిమంబు లిట్టి వట్టివి యని, తర్కింప లేవు వేదంబు లయిన
నెవ్వని సేవింతు రెల్లవారును సమా, నాధికరహితుఁ డై యలరు నెవ్వఁ
తే. డట్టిదేవునిఁ ద్రిపురసంహారకరుని, నస్థిమాలాధరుండు భిక్షాశనుండు
భూతిలిప్తాంగుఁ డుగ్రపరేతభూమి, వాసుఁ డనియు హసించెదువారు మఱియు.

క. ధర శునకభోగ్యమును నిహ, పరదూరము నైనతను వుపాదేయముగా
నెఱి నమ్మి వస్త్రమాల్యా, భరణంబు లలంకరించుపామరజనులున్. 469

క. ఘననిర్భాగ్యులుగా మదిఁ, గను మని యీరీతిఁ బ్రియకుఁ గశ్యపుఁ డెఱిఁగిం
చిన దితి గ్రమ్మఱఁ బలికెను, మనసిజసాయకవిభిన్నమానస యగుచున్. 470

క. మునుకొని లజ్జావనతవ, దన యై ప్రాణేశుకొంగుఁ దాలిమి దూలం
బెనఁగొనియె వారకామిని, యనువున వినిషిద్ధకర్మమం దభిముఖి యై. 471

వ. ఇట్లు సేసినభార్యానిర్బంధంబునకుం దొలంగ నేరక యీశ్వరనమస్కారం బొనరిం
చి యేకాంతంబున నిజకాంతాసంగమంబు దీర్చి సంగమానంతరంబున వార్చి
స్నాతుం డై ప్రాణాయామంబును జేసి విరజంబును సనాతనంబును నైన బ్రహ్మ
గాయత్రి జపియించె నంత. 472

క. దితియును నిషిద్ధకర్మ, స్థితికై మదిలోన సిగ్గు చిట్టాడఁగ నా
నతవదన యగుచు నాపశు, పతివలనిభయంబు గల్గి పరమప్రీతిన్. 473

వ. కశ్యపుం గనుంగొని యిట్లనియె సమస్తభూతపతి యైనపరమేశ్వరుండు నాచేసి
నయపరాధంబు సహించి మద్గర్భపరిపాలనంబు సేయుంగాక రుద్రుండును మహా
త్ముండును స్వయంప్రకాశుండును నలంఘ్యుండును సకామజనఫలప్రాపకుండును
నిష్కామజనమోక్షప్రదుండును న్యస్తదండుండును ధృతదండుండును దుష్టశిక్ష
కుండును బరమాత్ముండును జగదంతర్యామియు నిర్గుణుండును నిష్కాముండును
భక్తసులభుండును భగవంతుండును నగునప్పరమేశ్వరునకు నమస్కరించెద మ
ఱియు షడ్గుణైశ్వర్యసంపన్నుండును జగద్భర్తయు మహానుగ్రహశీలుండును
నిర్దయపరిపాల్యవధూరక్షకుండును సతీదేవీపతియు నైనయాసర్వేశ్వరుండు
నన్ను రక్షించుం గాత మని సన్నుతించి. 474

క. అర్భకులు లేని దగుటను, గర్భము నిజనాథువలనఁ గమలానన కా
విర్భూత మైనఁ గర్త వి, నిర్భరపరితోష మాత్మ నెలకొన నుండెన్. 475

వ. అంతఁ గశ్యపుండు దత్కాలసముచితసంధ్యావందనంబులు దీర్చి. 476

క. ఆచెలువగర్భచిహ్నము, లేచినఁ బరితోష మాత్మ నేపారక మా
రీచి తగ నిజతలోదరిఁ, జూచి యకర్మమున కాత్మ స్రుక్కుచుఁ బలికెన్. 477

---

1 ఈవచనము వ్రాఁతప్రతులం గనుపట్టదు.

మ. సతి నీ వేగతి నింద కోడక మనోజాతేక్షుకోదండని
ర్గతనారాచపరంపరాహతవిశీర్ణస్వాంత వై పాపసం
గతి లజ్జాభయధర్మముల్ విడిచి దుష్కాలంబు నాతో రమిం
చితి బల్మిన్ వెలయాలికై వడిని దుశ్శీలక్రియాలోలతన్. 478

వ. అట్లగుటం జేసి. 479

[1]క. సతి విను భూతగణప్రే, రితులై రుద్రానుచరులు ప్రకృష్టశక్తిసమ
న్వితు లుగ్రకర్ము లతిశౌ, ర్యతములు భద్రానుభద్రు లనునామములన్. 480

క. పరఁగినదర్పోద్ధతు లి,ద్దఱు గొడుకులు నీకుఁ బుట్టి ధరణికి వేఁగై
నిరతము బుధజనపీడా, పరులై వర్తింతు రాత్మబలగర్వమునన్. 481

తే. అట్టిదుష్టాత్మకులకును మహాత్ము లలిగి, విశ్వవిదుఁ డైనహరికిని విన్నవింప
నతఁడు కోపించి హరి కులిశాయుధమున, గిరుల నఱకినగతి వారి ధరణిఁ గూల్చు.

క. అని కశ్యపుఁ డెఱిఁగించిన, విని దితి భయ మంది చాల విహ్వలమతి యై
తనహృదయేశుముఖాబ్జముఁ, గనుఁగొని యి ట్లనియె విగతకౌతుక యగుచున్.

చ. ధర సుజనాపరాధు లగుతామసచిత్తుల కెందు నాయువున్
సిరియు నశించి పోవు మృతి సేకుఱు శత్రులచేత నింత యూ
నరయఁగ నిక్కవంబు భవదాత్మజు లార్యుల కెగ్గు [2]సేసినం
గరుణను వారు వారి మదిఁ గైకొని కావ ననుగ్రహింపరే. 484

చ. అనవుడుఁ గశ్యపుండు కమలానన కి ట్లను నింతి నీవు చే
సినవిపరీత[3]కర్మమునఁ జేకుఱె నిట్టియవస్థ దీనికిన్
మనమునఁ దాప మొందుటను మాధవుపాదసరోజయుగ్మచిం
తనమునఁ జేసియున్ నను ముదంబునఁ గొల్చుటఁ జేసియుం దగన్. 485

తే. రమణి నీసుతులలో హిరణ్యకశిపు,వలన నుదయించువారిలోపల ముకుంద
పదసరోజాతవిన్యస్తభావుఁ డైన, తనయుఁ డుదయింపఁ గలఁ డతిధార్మికుండు.

వ. మఱియును. 487

క. ఘనపుణ్యుం డన్వయపా, వనుఁ డగునప్పుణ్యాతమునివరకీర్తిలతల్
వనజభవాండోదర మె,ల్లను నిండఁగఁ బర్వు బుధలలాముం డగుటన్. 488

తే. వామలోచన వినుము దుర్వర్ణహేమ, మగ్ని[4]పుటమునఁ బరిశుద్ధమై వెలుంగు
నట్లు దుష్టాత్మసంభవుఁ డయ్యు వంశ, పావనుం డగు హరిపాదభక్తుఁ డగుట.

తే. అంచితాష్టాంగయోగక్రియాకలాపు, లైనయోగీశ్వరులు నమ్మహానుభావు
నతులశీలస్వభావవిజ్ఞానసరణిఁ, దాముఁ జరియింప నాత్మలఁ దలఁతు రెపుడు.

ఉ. ఆమహితాత్మకుండు సుగుణాంబుధి భాగవతోత్తముండు ల

1 ఈపద్యము వ్రాఁతప్రతులం జూపఁబడెడి. 2 'సేయుభూ, సురులప్రసదగ్నిపాల్పడక శోధన మా హరిచేసెపంచతన్' అ. ప్ర. 3 ధర్మమునఁ. 4 ముఖమునఁ.

శ్రీమహిళాధినాథుఁ దులసీదళదాముఁ బరేశు నాత్మహృ
త్తామరసంబునందుఁ బ్రమదంబున నిల్పి తదన్యవస్తువుం
దా మదిలో హసించు హరిదాస్యవిహారవినిశ్చితాత్ముఁ డై. 491

వ. అట్టినీపౌత్రుండు. 492

సీ. మహితదేహాద్యభిమానంబు దిగనాడి, చిరతరాలంపటశీలుఁ డగుచుఁ
బరసమృద్ధికి నాత్మఁబరితోష మందుచు, బరదుఃఖమునకుఁ దాపమునఁబొందు
నీవిశ్వ మంతయు నేవిభుమయ మని, యెవ్వనికరుణచే నెఱుఁగ నయ్యె
నట్టియీశ్వరునకు నాత్మసాక్షికి మోద, మడరంగఁ జూచు ననన్యదృష్టి

తే. నతినిదాఘోగ్రసమయంబునందునిఖిల, జంతుసంతాపమడఁగించుచంద్రుమాడ్కి
నఖిలజగములదుఃఖంబు లపనయించు, రూఢి నాతఁ డజాతవిరోధి యగుచు.

1వ. మఱియు హరిధ్యాననిష్ఠాగరిష్ఠుం డగునమ్మహాభాగవతాగ్రగణ్యుండు. 494

క. విమలాంతరంగబహిరం, గములను స్వేచ్ఛానురూపకలితుం డగునా
కమలాధీశ్వరుకుండల, రమణీయముఖంబుఁ జూచుఁ బ్రమదం బెసఁగన్. 495

తే. మఱియునీవిశ్వ మాహరిమయముగాఁగ, మనములోపలఁదలఁచునమ్మనునిభుండు
మనుమహాత్ములలోననీమనుమఁడధికుఁ, డనఁగనుతికెక్కనంచుఁగశ్యపుఁడువలుక.

క. విని తనతనయులు మధుసూ, దనుచే హతు లగుదు రనుచుఁ దనమనుమఁడు స
జ్జననుతభాగవతుం డగు, ననుచు మదిం జాల దుఃఖహర్షము లొందవన్. 497

వ. ఉండునంత నాదితియుఁ గశ్యపవీర్యసంభృతం బైనగర్భంబు దుర్భరతేజోభిరా
మంబును నన్యతేజోవిరామంబును దినదినప్రవర్ధమానంబును నై నివ్వటిల్ల నిజో
దరస్థితు లైనకుమారు లమరదమను లై వర్తింపఁగల రని చింతించుచు గర్భంబు
శతవర్షంబులు ధరియించి యున్నయనంతరంబ. 498

ఉ. ఆదితిగర్భమందు రుచిరాకృతితో నొకతేజ మన్యతే
జోదమలీల వెల్వడి వసుంధరయుఁ గగనంబు నిండి సం
ఛాదితపద్మబాంధవనిశాకరదీప్తులు గల్గి సూచికా
భేదమహోగ్రసంతమసభీషణ మైన భయాకులాత్ము లై. 499

చ. అమరగణంబు లెల్లఁ గమలాసనుపాలికి నేఁగి తత్పదా
బ్జములకు మ్రొక్కి యంజలులు ఫాలములం గదియంగఁ జేర్చి చి
త్తముల భయంబు సంభ్రమముఁ దార్కొన నిట్లని విన్నవించి రో
యమరకులాగ్రగణ్య దురితార్ణవతారణ సృష్టికారణా. 500

ఉ. నీవు చరాచరప్రచయనేతవు ధాతవు సర్వలోకపా
లావళిమౌళిభూషణుఁడ వంచితమూర్తివి దేవదేవ వా
ణీవర యీయజాండమున నీవు నెఱుంగనియర్థ మున్నదే

1 ఈవచనము వ్రాఁతప్రతులఁ గనుపట్టదు.

భావమునం దలంపుము విపన్నుల మమ్ము భవత్ప్రపన్నులన్. 501

వ. దేవా [1]కార్యరూపం బగుచేతనాచేతనాత్మకప్రపంచంబునకుఁ గారణుండ వైన నీ చేత సమస్తభువనంబులును సృజియింపంబడియె నీవు సర్వభూతాత్మభావవిదుండవు లోకనాథశిఖామణిభూతుండవు విజ్ఞానవీర్యుండ వవిద్యం జేసి యిట్టిస్రష్టృరూపంబు నొందితి గృహీతరజోగుణుండవు నీయందుఁ బ్రపంచంబు లీనం బై యుండు సుపక్వయోగంబు నొంది నిష్కాము లై ధ్యానంబున ని న్నరయుచు నిర్జితశ్వాసేంద్రియాత్ము లై భవత్ప్రసాదంబు వడసినవారలకుం బరాభవంబు లెక్కడి దెవ్వని[2]వాక్పాశబద్ధు లై పశువులచందంబున నిఖిలజీవులు వర్తింతు రట్టినీకు నమస్కరింతు (మహోరాత్రవిభాగాభావంబున లుప్తకర్మంబు లగు) లోకంబులకు సేమంబు గావింపుము శరణాగతుల మైనమమ్ముఁ గరుణాకటాక్షంబుల నీక్షించి రక్షింపుము కశ్యపువీర్యంబు దితిగర్భంబుననుండి సకలదిగ్వలయంబు నాక్రమించి దారువందులహుతాశనుచందంబున (లీనం బై) ప్రవృద్ధం బగుచున్న దని విన్నవించినబృందారకసందోహంబులకు నానందకందళితంబుగా నరవిందనందనుం డి ట్లనియె. 502

సనకసనందనాదులు వైకుంఠమున కరుగుట.

క. గీర్వాణులార యుష్మ, త్పూర్వజు లాత్మీయసుతులు పుణ్యులు విచర
న్నిర్వాణులు సనకాదులు, సర్వంకషశేముషీవిచక్షణు లెందున్. 503

క. వారలు నిస్పృహు లగుచు న,వారణ భువనంబు లెల్ల వడిఁ గ్రుమ్మరుచున్
ధీరు లొకనాఁడు భక్తిన్, శ్రీరమణీశ్వరపదాబ్జసేవానిరతిన్. 504

చ. చని చని కాంచి రంత బుధసత్తము లంచితనిత్యదివ్యశో
భనవిభవాభిరామముఁ బ్రపన్నజనస్తవనీయనామమున్
జననవిరామ మార్యజనసన్నుతభూమము భక్తలోకపా
లనగుణధామముం బురలలామముఁ జారువికుంఠధామమున్. 505

ఉ. ఆమహనీయపట్టణమునందుల నుండెడువార లాత్మని
ష్కామఫలంబు సత్ఫలముగాఁ దలపోసి ముముక్షుధర్ము లై
శ్రీమహిళాధిపాంఘ్రిసరసీరుహపూజ లొనర్చుచున్ మహో
ద్దామతదీయరూపములఁ దాల్చి సుఖించుచు నుందు రెప్పుడున్. 506

చ. విగతరజస్తమోగుణుఁడు విశ్రుతచారుయశుండు శుద్ధస
త్త్వగుణుఁ డజుం డనాది భగవంతుఁ డనంతు డనంతశక్తియున్

1 ‘కార్యకారణరూపంబును జేతనాచేతనప్రపంచకారణంబును నైనసమస్తభువనంబులు నీచేతం గ్రువ్వంబడిన వనియు నీవు సర్వభూతాత్మభావుండ వనియు సుపక్వయోగంబునొంది నిష్కాము లైనవారు ధ్యానంబున నరయుదురు నిర్జితేంద్రియాత్ము లై’ వ్రా. ప్ర. 2 ‘వాగ్జాలంబుచేఁ బాశబద్ధంబు లైనపశువుల’ అ. ప్ర.

నిగమచయాంతవేద్యుఁడు విశనిశ్చలనిర్మలధర్మమూర్తియు
న్నగుహరిపేరఁ బెం పెసఁగు శ్రీ నన్నగరోపవనమ్ము లిమ్ములన్. 507

వ. మఱియుఁ గైవల్యశబ్దంబు మూర్తిభవించినతెఱంగునం బొలు పారుచు నైశ్శ్రే
యసనామంబున నభిరామం బై సతతంబును సకలర్తుధర్మంబులు గలిగి యర్థిజనం
బులమనంబుల ఘనంబులుగ నీరిక లెత్తినకోరికలు సారికలు గొన నొసంగుచు
నితరతరురహితంబులును గామక్షోభనసహితంబులును బుష్పఫలభరితంబులును
నై తనర్చుసంతానవనసంతానంబులు సమంచితవసంతసమయసౌభాగ్యసంపదభిశో
భితవాసంతికాకుసుమవిసరపరిమళమిళితగళితమకరందలలితామోదముదితహృద
యు లై యఖండతేజోనిధి యగుపుండరీకాక్షుచరిత్రంబు లుగ్గడింప లేక ఖండిత
జ్ఞాను లయ్యును నిరతిశయవిషయసుఖానుభవకారణం బగుట నిందిరాసుందరీ
రమణచరణసేవావిరమణకారి యై యున్న దని తలంచి తద్గంధప్రాపకగంధవహు
నిం దిరస్కరించి నారాయణభజనపరాయణు లై చరియించుసుందరీయుక్త
వైమానికులును వైమానికమానసోత్సేకంబునుం బారావత హంస సారస శుక
పిక చాతక తిత్తిరి మయూర రథాంగముఖ్యవిహంగకోలాహలవిరామంబునుం
గా నరవిందనయనకథాగానంబు లనూనంబులుగా మొరయ మదవదిందిందిర
సందోహకలితపుష్పవల్లీమతల్లికలును నకుంఠితచరిత్రుం డైనవికుంఠనిలయుని
కంఠంబునం దేజరిల్లువిలసితతులసీదామంబుం గనుంగొని యీతులసీదామంబు
హరిమంగళగళవిలగ్నం బై యుండుసౌభాగ్యంబు వడయుట కేమితపంబు గావిం
చెనో యని బహూకరించుచందంబున నొప్పుచందనమందారకుందారవిందపున్నా
గనాగవకుళాశోకకురవకోత్పలపారిజాతాదిప్రసూనమంజరులును మంజరీపుంజ
రంజితనికుంజంబులయందు నుత్తుంగపీనకుచభారాకంపితమధ్యంబులుఁ గటితట
ఘటితకనకమేఖలాకలాపనినదోపలాలితనీలదుకూలశోభిత పృథునితంబభారాలస
యానహసితకలహంసమయూరగమనంబులు నసమశరకుసుమశరవిలసితంబు
నపహసించునయనకమలంబులుం గలిగినసుందరీసందోహంబులం దగిలి కందర్ప
కేళీవిహారంబుల నానందంబు నొందక ముకుందచరణారవిందసేవాపరిలబ్ధమర
కతవైడూర్యహేమమయవిమానారూఢు లై హరిదాసులు విహరించుపుణ్యప్రదే
శంబులును నిందిరాసుందరి త్రైలోక్యసౌందర్యఖని యైనమనోహరమూర్తి ధరి
యించి రమణీయరణితమణినూపురచరణారవింద యై నిజహృదయేశ్వరుం డైన
సర్వేశ్వరునిమందిరంబునం జాంచల్యదోషరాహిత్యంబుగ వర్తింపం గరకమల
[1]భ్రమణీకృతలీలాంబుజాత యై తననీడ కాంచనస్ఫటికమయకుడ్యప్రదేశంబులం
బ్రతిఫలింప శ్రీనికేతనునినికేతనసమ్మార్జనకైంకర్యంబ పరమధర్మం బని తెలుపు
చందంబునం జూపట్టుచు నిజవనంబునం దనరుసౌరభాభిరామంబు లగుతులసీదళ

1 భ్రమరీకృత.

దామంబుల నాత్మనాయకునిచరణారవిందంబుల నర్పించుచు నొసలిమృగమదపు
టసలున మసలుకొని [1]తుంపెసలుగునియుకురులనులలితతిలప్రసూనరుచిరాఘనాసం
దనరుమోముఁదామర విమలసలిలంబులఁ బ్రతిబింబింప నిజమనోనాయకుచేతం
జుంబితం బగుట గాఁ దలంచి లజ్జావనతవదనయై యుండం జేయుప్రవాళలతికాకు
లంబు లైనకూలంబులు గలనడబావులును గలిగి పుణ్యంబునకు శరణ్యంబును
ధర్మంబునకు నిర్మలస్థానంబును సుకృతమూలంబునకు నాలవాలంబును నయి
పొలు పొందుచుండు. 508

చ. హరివిముఖాత్ము లన్యవిషయస్పృహచిత్తులుఁ బాపవర్తులు
న్నిరయనిపాతహేతువును నింద్యచరిత్రము నైనదుష్కథా
నిరతిఁ జరించువారలును నేరరు పొందఁగ నిందిరామనో
హరచరణారవిందభజనాత్మకు లుండెడుగొంది నారయన్. 509

వ. వెండియు. 510

చ. హరిఁ బరమేశుఁ గేశవు ననంతు భజింపఁగ ధర్మతత్త్వధీ
పరిణతిసాధనం బగుస్వభావముఁ దాల్చినయట్టిమర్త్యులా
సరసిజనేత్రుమాయను భృశంబుగ మోహితులై తదంఘ్రిపం
కరుహము లర్థిమెఁ గొలువఁ గానమిఁ బొందరు తత్పదంబునన్. 511

చ. మఱియు సరోరుహోదరునిమంగళదివ్యకథానులాపని
ర్భరపరితోషబాష్పకణబంధురచారుకపోలగద్గద
స్వరపులకీకృతాంగు లగువారలు నిస్పృహచిత్తులు న్నహం
కరణవిదూరులు న్నగుసుకర్ములయుండెడిపుణ్యవాసముల్. 512

వ. అందు. 513

మ. వరవైకుంఠము సారసాకరము దివ్యస్వర్ణశాలాంకగో
పురహర్మ్యావృత మైనతద్భవన మంభోజంబు దన్మందిరాం
తరవిభ్రాజితభోగి కర్ణిక తదుద్యద్భోగపర్యంకమం
దిర వొందఁగ వసియించుమాధవుఁడు దా నేపారు భృంగాకృతిన్. 514

వ. అంత. 515

మ. హరిచేఁ బాలిత మైనకాంచనవిమానారూఢ మైనట్టిస
త్పురుషానీకముచేఁ దనర్చి విభవాపూర్ణప్రభావోన్నతిం
గర మొప్పారుతదీయధామము జగత్కల్యాణమూర్తుల్ మునీ
శ్వరు లర్థిన్ నిజయోగశక్తిఁ బరితుష్టస్వాంతు లై చెచ్చెరన్. 516

వ. డాయం జని. 517

చ. మరకతరత్నతోరణసమంచితకుడ్యకవాటగేహాళీ

1 తుంపెసలాడుకురులను.

విరచితకక్ష్యాషట్క మరవిందదళాక్షువిలోకనోత్సవా
దరమతి నవ్యముం గనక దాఁటి యనంతరకక్ష్యయందు ని
ద్దఱను దదీయపాలుర నుదారసమానవయోవిశేషులన్. 518

సీ. కాంచననవరత్నకటకాంగుళీయక, హారకేయూరమంజీరధరులఁ
గమనీయసౌరభాగతమత్తమధుకర, కలితసద్వనమాలికావిరాజి
తోరస్స్థలుల గదాధారుల ఘనచతు, ర్బాహుల నున్నతోత్సాహమతుల
నారూఢరోషానలారుణితాక్షుల, భ్రూలతాకౌటిల్యఫాలతలుల

తే. వేత్రదండాభిరాముల వెలయునమ్ము
కుంద శుద్ధాంతమందిరాళిందభూమి
నున్నయిద్దఱ సనకాదియోగివరులు
సూచుచును వృద్ధు లయ్యు నాసుభగమతులు. 519

క. ధీరతఁ బంచాబ్దములకు,మారకులై కానఁబడుచు మనమున శంకం
గూరక చతురాత్మకు లని, వారితగమనముల డాయవచ్చిన నెదురన్. 520

క. శ్రీలలనేశ్వరదర్శన, లాలసులై యేఁగుబుధలలాముల నతిదు
శ్శీలతఁ దద్వచనప్రతి, కూలమతిం బోవ కుండఁ గుటిలాత్మకులై. 521

క. వారించిన వారలు బ్రం, దారకులీక్షించు చుండ దారుణపటురో
షారుణితాంబకులై రొద, వారించుచు వారు నచటివారును వినఁగన్. 522

వ. ఇట్లనిరి. 523

చ. పరము ననంతు భక్తపరిపాలు [1]సుహృత్తము నిష్టు నీశ్వరే
శ్వరు భజియింపఁ గోరి యనివారణ నిద్దఱు నేఁగి నిచ్చలుర్
భరితముదాత్ములై కొలువఁ బాయక తద్భజనాంతరాయత
త్పరమతి మాకు నిప్పు డరిపడ్డదురాత్ముల నేఁడు గంటిరే. 524

వ. అని మఱియు సనకసనందనాదులు జయవిజయులం జూచి యిట్లనిరి మీమనంబుల
స్వామిహితార్థంబై నిష్కపటవర్తనుల మైనమాబోఁటులఁ గుహకవృత్తి గలయి
తరజనంబులు భగవత్సదనంబుఁ బ్రవేశింతురో యను శంకం జేసి కొందఱం బ్రవే
శింపం జేయుటయుఁ గొందఱ వారించుటయు దౌవారికస్వభావం బని వారింపం
దలంచితి రేనిఁ బ్రశాంతదివ్యమంగళవిగ్రహుండును గతవిగ్రహుండును భగవం
తుండును విశ్వగర్భుండును నైనయీశ్వరుండు ప్రాప్యంబును బ్రాపకంబును బ్రాప్త
యు ననుభేదశూన్యుండుగావున మహాకాశంబునందు ఘటపటాద్యాకాశంబులు వే
ఱులేక యేకంబై తోఁచుచందంబున విద్వాంసు లగువారమ్మహాత్ముని సకలాత్మ
భేదరహితునింగాఁ బొడగందు రదియునుం గాక లోకంబునందులరాజులు సాప

1 సుహృత్తు ననీశు నీశ్వ.

రాధు లయినకింకరజనంబుల నాజ్ఞాపించుచందంబున నీశ్వరుండు దండించునో యనుభయంబునం జేసి వారించితి మని తలంచితి రేని భూసుర వేషధారుల మైన మాకును వైకుంఠనాయకుం డైనసర్వేశ్వరునకును భేదంబు లే కుండుటం జేసి శంక సేయం బని లే ది ట్లగుట యెఱింగి మందబుద్ధుల రై మమ్ము వారించినయ నుచితకర్ము లగుమీరలు మదీయశాపార్హు లగుదురు గావున భూలోకంబున లోభ మోహంబు లనుశత్రువులు బాధింపం బుట్టుం డని పలికిన. 525

క. వారలు విని తమమనముల, భూరిస్ఫుటచండకాండ ♦ పూగంబులచే
వారింప రానిభూసుర, దారుణవాక్యముల కులికి ♦ తల్లడపడుచున్. 526

క. పరితాపంబును బొందుచు, సరసిజలోచనునిభటులు ♦ సనకాదిమునీ
శ్వరులపదాంబుజములకుం, గర మర్థిఁ ప్రొక్కి నిటల ♦ ఘటితాంజలు లై. 527

వ. ఇ ట్లనిరి. 528

మ. వరయోగీశ్వరులార మమ్ము మది నో ♦ వ్వ న్నిట్లు మీ రన్నని
ష్ఠురవాక్యంబుల కింక మామనములం ♦ శోకింపఁగా రాదు స
త్పురుషశ్రేణిఁ బరాభవించినవృథా ♦ భూతాత్ములం మమ్ము మా
దురితం బింతకుఁ దెచ్చె మీఁద శుభముం ♦ దూకొందు మే మారయన్. 529

వ. అని యె ట్లంటి రేని. 530

ఉ. మీకరుణావలోకనస ♦ మేతులఁ గా మముఁ జేయఁ జిత్తముల్
దూకొనె నేని మాచనవుఁ ♦ ద్రోయక యీఁ దగు లోభమోహముల్
గైకొని పుట్టుచోట నవ ♦ కంజదళాక్షునినామవిస్మృతిం
బైకొన కుండ దానసె శుభం బగు మీఁదిమదీయజన్మముల్. 531

వ. అనుసమయంబున. 532

మ. హరి సర్వేశుఁ డనంతుఁ డాకలకలం ♦ బాలించి పద్మాలయా
సరసాలాపవినోదసౌఖ్యరచనల్ ♦ సాలించి శుద్ధాంతమం
దిరమాణిక్య[1]కవాటముల్ గడచి యే ♦ తెంచెం బ్రపన్నార్తిసం
హరుఁ డై నిత్యవిభూతిశోభనకరుం ♦ డై మానితాకారుఁ డై. 533

వ. మఱియును. 534

చ. శరనిధికన్యకామణియు ♦ సంభ్రమ మొప్పఁగఁ దోడ రా మనో
హరనిజలీలనొప్పఁ బరమ ♦ హంస[2]మునీంద్రగవేషపాదపం
కరుహములం వినూత్నమణి ♦ కాంచననూపురమంజుఘోషముల్
వరుసఁ జెలంగ నార్యజన ♦ వంద్యుఁడు యోగిజనైకసేవ్యుఁ డై. 535

చ. కరమణిహేమకంకణని ♦ కాయఝుణంకృతు లుల్లసిల్ల న
చ్చర లిడుహంసపక్షసిత ♦ చామరగంధవహోచ్ఛలత్సుధా

1 మగేహముల్. 2 'మునీశ్వరవంద్యపాద' అ. ప్ర.

కరరుచిరాతపత్రసుభగప్రవిలంబితహారవల్లరీ
సరసగళత్తుషారకణజాలవిరాజితమంగళాంగుఁ డై. 536

వ. మఱియును. 537

సీ. నిఖిలమునీంద్రవర్ణితసస్మితప్రస,న్నాననాంబుజముచే నలరువాఁడు
విశ్రుతస్నేహార్ద్రవీక్షణనిజభక్త,జనగుహాశయుఁ డనఁ దనరువాఁడు
మానితశ్యామాయమానవక్షమున నం,చితవైజయంతి రాజిల్లువాఁడు
నతజనావనకృపామృతతరంగితము లై, భాసిల్లులోచనాబ్జములవాఁడు
తే. నఖిలయోగీంద్రజనసేవ్యుఁ డైనవాఁడు
సాధుజనముల రక్షింపఁ జాలువాఁడు
భువనచూడావిభూషణభూరిమహిమ
మించు వైకుంఠపురము భూషించువాఁడు. 538

సీ. కటివిరాజితపీతకౌశేయశాటితోఁ, వితతకాంచీగుణద్యుతి నటింప
నాలంబికంఠహారావళిప్రభలతోఁ, గౌస్తుభరోచులు గ్రందుకొనఁగ
నిజకాంతిజితతటిద్వ్రజకర్ణకుండల,రుచులు గండద్యుతుల్ ప్రోదిసేయ
మహనీయనవరత్నమయకిరీటప్రభా,నిచయంబు దిక్కుల నిండఁ బర్వ
తే. వైనతేయాంసవిన్యస్తవామహస్త,కలితకేయూరవలయకంకణము లొప్ప
నన్యకరతలభ్రమణీకృతానుమోద,సుందరాకారలీలారవింద మమర. 539

వ. మఱియుఁ జరణారవిందమంజుకింజల్కపుంజప్రభారంజితతులసీమరందబంధురగం
ధానుబంధసుగంధిగంధవహాస్వాదకలితసేవాతత్పరు లై చనుదెంచుయోగీంద్రు
లకు మానసానందకారియు బహిఃకరణాంతఃకరణపరితోషప్రకీర్ణరోమాంచరుచి
దాయకంబును బ్రభాపూర్తియుక్తంబును నగుమూర్తితోడ నిజసౌందర్యవరకళా
వినిర్జితశ్రీరమణీసౌందర్యభాసమానుం డగుచుఁ బొడచూపి యయ్యఖిలవిశ్వ
గురుం డైన సర్వేశ్వరుండు వేంచేసె నప్పుడు. 540

చ. స్థిరశుభలీల నట్లరుగుదెంచిన యవ్విభువిద్రుమారుణా
ధరనవపల్లవస్ఫురదుదంచితకుందరుచిస్మితైకసుం
దరవదనారవిందము ముదంబునఁ దప్పక చూచి యమ్మునీ
శ్వరులు నిజాత్మలం దనివి సాలక వెండియుఁ జూచి రిమ్ములన్. 541

చ. సునిశితభక్తిఁ దన్ముఖముఁ జూచినచూడ్కులు ద్రిప్ప లేక యుం
గనుఁగొని రెట్టకేలకు నకల్మషభక్తవిఘాతభేదముల్
మునిజనచిత్తమోదములు ముక్తినివాసకవాటభేదముల్
వినుతవినూత్ననూపురితవేదము లమ్మహనీయుపాదముల్. 542

చ. కని నఖపద్మరాగమణికాంతివిభాసితపాదపద్మము
ల్మనములయందుఁ గీల్కొలిపి లబ్ధమనోరథయుక్తు లై పునః

పునరభివందనంబులు విభూతి దలిర్ప నొనర్చి యోగమా
ర్గనిరతచిత్తులుం వెదకి కానఁగ లేనిమహానుభావునిన్. 543

క. మానసమున నిలిపిరి త, ద్ధ్యానాస్పదుఁ డైనవానిఁ దత్త్వజ్ఞులకుం
గాన నగువాని భక్తజ, నానందకరైకమూర్తి నలరినవానిన్. 544

వ. మఱియుం జక్షురింద్రియగ్రాహ్యం బగుదివ్యమంగళవిగ్రహంబు ధరియించి యున్నపురుషోత్తము నుదాత్తతేజోనిధిం జూచి సనకాదు లిట్లని స్తుతియించిరి.

సనకాదులు నారాయణదేవుని స్తుతియించుట.

చ. వనజదళాక్ష భక్తజనవత్సల దేవ భవత్సుతుండు మ
జ్జనకుఁడు నైనపంకరుహజాతుఁడు మాకు రహస్య మొప్పఁ జె
ప్పినభవదీయమంగళగభీరపరిగ్రహవిగ్రహంబు నే
మనయముఁ జూడఁ గంటిమి కృతార్థుల మై తగ మంటి మీశ్వరా. 546

సీ. దేవ దుర్జనులకు భావింప హృదయసం, గతుఁడ వై యుండియుఁ గానఁబడవు
కడఁగి నీదివ్యమంగళవిగ్రహంబునఁ, జేసి సమంచితాశ్రితుల నెల్ల
జేకొని సంప్రీతచిత్తులఁగాఁ జేయు, దతిశయకారుణ్యమతిఁ దనర్చి
కమలాక్ష సర్వలోక ప్రజాధిప [1]భవ, దనుదర్శనాభిలాషానుతాప

తే. విదితదృఢభక్తియోగ ప్రవీణు లగుచు, సర్వమై వీతరాగు లైనట్టియోగి
జనమనఃపంకజాతనిక్షిప్తమూర్తి, వని యెఱుంగుదు రయ్యనిన్నాత్మవిదులు.

క. యుక్తిం దలఁప భవద్వ్యతి, రిక్తము లైనట్టియితరదృఢకర్మంబుల్
ముక్తిదము లయినసీపద, భక్తులు తత్కర్మములను బాటింప రిలన్. 548

ఉ. కావునఁ గీర్తనీయగతకల్మషమంగళతీర్థకీర్తిసు
శ్రీవిభవప్రశస్తసుచరిత్రుఁడ వైనభవత్పదాబ్జసే
వావిమలాంతరంగబుధవర్గ మనర్గళభంగి నన్యముం
భావమునం దలంచునె కృపాగుణభూషణ పాపశోషణా. 549

చ. పరమతపోవిభూతభవపాపుల మై చరియించుమాకు నేఁ
డరయ భవత్పదాశ్రితుల నల్గి శపించిన భూరిదుష్కృత
స్ఫురణ నసత్ప్రథకపరిభూతుల మై నిజధర్మహాని గా
నిరయము నొందఁగా వలసె నేరము వెట్టక మమ్ముఁ గావవే. 550

చ. కర మనురక్తి షట్పదము గమ్యసుగంధమరందవాంఛచేఁ
దర మిడి శాతకంటకవృతస్ఫుటనవ్య[2]తరప్రసూనమం
జరులను డాయుపోలిక భృశం బగువిఘ్నములం జయించి నీ
చరణసరోజముల్ గొలువ సమ్మతి వచ్చితి మయ్య కేశవా. 551

చ. అలరుభవత్పదాంబుజయుగార్పితి మై పెను పొందునట్టియా

1 'భవ, దనుసరణాభిలాషానులాప' అ. ప్ర. 2 'దరత్ప్రసూన' ప్రా. ప్ర.

తులసి పవిత్రమైనగతిఁ దోయజనాభ భవత్కథాసుధా
కలితము లైనవాక్కుల నకల్మషయుక్తిని విన్నఁ గర్ణముల్
విలసితలీలమై భువిఁ బవిత్రము లై విలసిల్లు మాధవా. 552

చ. మహితయశోవిలాసగుణమండన సర్వశరణ్య యింద్రియ
స్పృహులకుఁ గాన రాక యతసీకుసుమద్యుతి నొప్పుచున్న నీ
సహజశరీర మిప్పుడు భృశంబుగఁ జూచి మదీయ[1]దృక్కు లిం
దహహ కృతార్థతం బొరసె నచ్యుత మ్రొక్కెద మాదరింపవే. 553

క. అని సనకాదులు దత్పద, వనజములకు మ్రొక్కి భక్తివశమానసు లై
వినిపించిన గోవిందుఁడు, మునివరులం జూచి పలికె ముదితాత్ముం డై. 554

వ. ఈయిరువురు జయవిజయాభిధానంబులు గలమదీయద్వారపాలకులు మీరు మి
మ్ముం గైకొనక మదీయాజ్ఞాతిక్రమణు లయి చేసినయపరాధంబునకుఁ దగినదం
డంబు గావించితి రది నాకు నభిమతం బయ్యె నదియునుం గాక భృత్యవర్గంబు
సేయునపరాధంబు స్వామిదియ కాన యీతప్పునకు మానసీయుండ నై నన్ను
మన్నించి ప్రసన్ను లగుదురు గాక యని వెండియు ని ట్లనియె. 555

చ. తనువునఁ బుట్టినట్టిపెడిదం బగుకుష్ఠమహాగదంబుచే
వనరి తదీయచర్మము [2]వివర్ణత నొందినరీతి భృత్యు లొ
ప్పనిపని సేసినన్ విభులు బంధురచారుయశంబుఁ బేరు పెం
పును జెడి పోయి దుర్యశముఁ బొందుచు నుందురు లోకమందులన్. 556

చ. అలవడ నాకు మీవలన నబ్బినతీర్థసుకీర్తనీయస
ల్లలితవినిర్మలామృతవిలాసయశోవిభవాభిరామ మై
వెలయువికుంఠనామ మపవిత్రమనశ్శ్వపచాధమాదిలో
కులచెవి సోఁకఁ దత్క్షణమ కోరి [3]పునీతులఁ జేయు వారలన్. 557

తే. అట్టినేను దలంప మీయట్టిసాధు, జనుల కపకార మర్థిఁ జేసిన మదీయ
బాహుసము లైనఁ ద్రుంతు నుత్సాహలీల, నన్న నితరుల మీమ్రోల నెన్న నేల.

క. ధరణీసురోత్తమసేవా, పరిలబ్ధం బయినయట్టిపాతకనాశం
కరనిఖిలభువనపూత, స్ఫురితాంఘ్రిసరోజతోయములు గలనన్నున్. 559

క. అలఘుమతి విరక్తునిఁ గాఁ, దలఁపక నిజశుభకటాక్షదామకకలితా
ఖిలసంపద్విభవ శ్రీ, లలనారత్నం బురస్స్థలంబును జెందున్. 560

చ. క్రతువులు సేయుచో శిఖిముఖంబున వేలుచునట్టిసద్ఘృత
ప్లుతచరుభక్షణన్ ముదముఁ బొందదు నిస్స్పృహధర్మమార్గసం
గతుఁ డగుభూసురోత్తమముఖంబున వేడ్క భుజించునయ్యవి
స్తృతకబళంబులన్ మనము తృప్తి వహించినరీతి నిచ్చలున్. 561

1 'నేత్రముల్, అహహ' వ్రా. ప్ర. 2 'వివర్ణము' వ్రా. ప్ర. 3 'పవిత్రుల' వ్రా. ప్ర.

సీ. సతతంబు నప్రతిహతయోగమాయావి,భూతిచేఁ బ్రఖ్యాతిఁ బొందు నేను
నేమహీసురులసమిద్ధనిర్మలపాద,నలినరజోవితానములు భక్తి
హాటకనవరత్నకోటీరమునఁ దాల్తు, నట్టినాచరణాంబుజాంబువులను
దవిలి ధరించి సద్యఃపునీతాత్ములై, రర్థిఁ జంద్రావతంసాదిదేవ
తే. చయము లెవ్వాఁడు బ్రాహ్మణజనులు దమకు
నపకృతుల్ సేసిరేని మా రలుగఁ డతఁడు
విప్రులను నన్నుఁ గాఁగ భావించునతఁడు
ధర్మపద్ధతి నా ప్రియతముఁడు వాఁడు. 562

ఉ. గోవితతిన్ ధరాదివిజకోటిని నన్నును దీనవర్గమున్
వావిరి భేదబుద్ధిఁ గనువార లధోగతిఁ బొంద నందు నా
శీవిషరోషవిస్ఫురణఁ జెంది కృతాంతభటుల్ మహోగ్రగృ
ధ్రావలివోలెఁ జంచువుల నంగము లుద్ధతిఁ జింతు రెప్పుడున్. 563

చ. ధరణిసురోత్తముల్ బహువిధంబులఁ దమ్ముఁ బరాభవించినన్
దరహసితాస్యులై యతిముదంబున నిచ్చలుఁ బూజ సేయుచున్
సరసవచోవిలాసముల సన్నుతి సేయుచుఁ దండ్రి నాత్మజుల్
గర మనురక్తిఁ బిల్చుగతిఁ గైకొని పిల్చినవారు నాసముల్. 564

క. వినుఁ డయ్యనఘచరిత్రుల, కనయముఁ బ్రియతముఁడ నగుచు నమ్ముడువోదున్
మును నన్ను భృగువు దన్నినఁ, గనలక పరితోషయుక్తిఁ గైకొంటిఁ గదే.

సీ. పొలుచునా[1]చిత్తమందులయభిప్రాయంబు, దెలియంగలేక యుద్వృత్తు లగుచుఁ
గడఁగి మీయానతిఁ గడచినఁ దద్దోష, ఫలము వీరలకు సంప్రాప్త మయ్యె
మునులార నాచిత్తమున నున్న తెఱఁగును, నిట్టిద భూమిపైఁ బుట్టి వీర
లచిరకాలమున నాయంతికంబునకును, నరుదెంచునట్లుగా ననుమతింప
తే. వలయునని యమ్ముకుందుండు పలుకుటయును, విని మనంబున సనకాదిమునివరేణ్యు
లమ్మహాత్ముని మృదులభాషామృతంబుఁ, దవిలి గ్రోలియు రోషసందష్టు లగుచు.

సీ. మునివరుల్ దమచిత్తములఁ దృప్తిఁ బొందక, పంకజాతాక్షుఁడు పలికినట్టి
పరిమితగంభీరబహుళార్థదురవగా,హములును విస్ఫురదతిసుఘోష
మానమాధుర్యసమన్వితమ్ములు విని,ర్గతశబ్దరోషనికాయములును
నైనవాక్యములకు నాత్మలఁ బరితోష,మంది [2]యిట్లనిరి నెయ్యమున మనల
తే. నొడయఁ డిప్పుడు నందించియో తలంప,నర్థి నిందించియో మత్కృతైకదండ
మునకు సంకోచమందియో యనుచుసంశ, యాత్ము లగుచువివేకించియంతలోన.

క. నలినాక్షుఁడు దమదెసఁ గృప, గలిగినభావంబుఁ దెలిసి కౌతుక మొలయం
బులకీకృతాంగులై యు,త్కలికన్ హర్షించి నిటలఘటితాంజలులై. 568

1 'మానసాంభోజాతభావంబు' అ. ప్ర. 2 'యుల్లముల...మనిచె' అ. ప్ర.

క. భరితనిజయోగమాయా,స్ఫురణం దనరారునతివిభూతియు బలముం
బరమోత్కర్షముఁ గలయీ,శ్వరునకు నిట్లనిరి మునులు సద్వినయమునన్.
తే. పొలుపు దీపింప నిత్యవిభూతినాయ,కుఁడవు భగవంతుఁడవు ననఘుఁడవు నీవు
మత్కృతం బిప్డు నీ కభిమత మటంటి, వీశ భవదీయచారిత్ర మెఱుఁగఁ దరమె.
ఉ. దేవగణాలి కెల్లఁ బరదేవత లై తనరారునట్టివి
ప్రావలి కాత్మనాయకుఁడ వై పెను పొందిననీకు నీధరా
దేవత లెల్ల నెన్న నధిదేవత లై రఁట యెట్టిచోద్యమో
దేవ సమస్తపావన సుధీజనతావన విశ్వభావనా. 571
చ. కమలదళాక్ష నీవలనఁ గల్గినధర్మము దావకావతా
రముల సురక్షితం బగుఁ దిరంబుగ నీశ్వర నిర్వికారత
త్త్వమునఁ దనర్చుని న్నరయఁ దత్ఫలరూపముఁ దత్ప్రధానగో
ప్యము నని పల్కుచుందురు కృపామయలోచన పాపమోచనా. 572
చ. మహిఁ దలపోయ నెవ్వనిసమగ్రపరిగ్రహముల్ లభింప ని
స్పృహమతు లై మునీశ్వరులు మృత్యుభయంబునఁ బాతు రట్టిస
న్మహితవివేకశాలి గుణమండన నీ కిల నన్యసత్పరి
గ్రహ మది యెట్టిచోద్యము జగత్పరిపాలన నిత్యఖేలనా. 573
సీ. సతతంబు నర్థార్థిజనశిరోలంకార, పదరేణువులు గలపద్మ [1]నేఁడు
జలజకింజల్కనిష్యందమరందలో, భాగతభ్రమర[2]నాయకివిధమున
ధన్యజనార్పితోదంచితతులసికా,దామంబునకు నిజధామ మగుచు
భాసిల్లుభవదీయపాదారవిందముల్, విలసితభక్తి సేవించు చుండఁ
తే. గమలనయన కృపావలోకనము లోలయ, నర్థిఁ [3]జూడవు భాగవతానురక్తిఁ
జేసి భవదీయమహిమంబు చిత్ర మరయ, చిరశుభాకార యిందిరాచిత్తచోర.
మ. చిరభాగ్యోదయ దేవదేవ లలితశ్రీవత్సలక్ష్మాంగ యీ
వరవిప్రానుపదైకపుణ్యరజమే వర్ణింప నీమేని కా
భరణం బంటివి సర్వలోకులకు విప్రశ్రేణిమాహాత్మ్య మీ
వెఱుఁగం జెప్పుట కై ధరించితి గదా యెన్నం బునీతాకృతిన్. 575
వ. అదియునుం గాక. 576
సీ. ధర్మమూర్తివి జగత్కర్తవు నగునీవు, ప్రోవంగఁ దగువారిఁ బ్రోవవేని
నవిరళవేదోక్త మగుధర్మమార్గ మ,సన్మార్గ మగుఁ గాన సత్త్వగుణవి
శిష్టుండ వగుచు నీజీవరాసులసేమ, మరసి రక్షింతు నీ దైవశక్తి
చేతను ధర్మవిఘాతుల దండించు, నీకు నంచిత మైననిగమధర్మ
తే. మార్గనాశకరంబులు మదికి నింపు, గావు విప్రులయందు సత్కరుణ మెఱసి

1 'మనెడు. 2 నాయకునిపగిది. 3 బోడసూపు' అ. ప్ర.

ఘనతఁ బలికినవినయవాక్యములునీకు, యుక్తమగుచుండుసతతంబుభక్తవరద.
వ. అట్లయినం బరులయెడ వినయంబులు వలికినఁ బ్రాభవహాని యగు నని తలంచితి వేని. 578
తే. విశ్వమున కెల్లఁ గర్తవు విశ్వనిధివి, విశ్వసంరక్షకుఁడవు నై వెలయునీకుఁ
గడఁగిప్రాభవహాని యెక్కడిది దలఁప,వినయములునీకు లీల లై వెలయుఁ గాన.
తే. మునుల మగుమమ్ము నతిమోదమునను నీవు, సత్కరించుట లెల్ల సజ్జనపరిగ్ర
హార్థమై యుండుఁ గాదె మహాత్మ యొకటి,విన్నవించెద మీజయవిజయులకును.
తే. అలిగి యేము శపించినయంతకంటె, బెడిద మగునాజ్ఞ సేయ నభీష్ట మేనిఁ
జేయు మది గాక సమధికశ్రీ దనర్పఁ, జేసి రక్షించితేని రక్షింపు మీశ.581
వ. అట్లయిన మాకుం బ్రియం బగుం గావున ననపరాధులు నతినిర్మలాంతఃకరణులు నైనవీరలకు ననృతంబులు వలికితి మేనియు మమ్మయినం జిత్తంబుకొలంది నాజ్ఞాపింపు మని కరకమలంబులు మొగిచి కృతాంజలు లై యున్నమునులం గరుణార్ద్రదృష్టిం గనుంగొని. 582
క. అనఘుఁడు భగవంతుం డి, ట్లనియెన్ మునులార వీర లనయము భువికిం
జని యచట నసురయోనిన్, జనియించి మహోగ్రలోభసంగతు లగుచున్.583
క. దేవజనావళి కుపహతిఁ, గావించుచు నిఖిలభువనకంటకవృత్తిన్
జీవించుచు నాయెడ సం,భావితవైరానుబంధభావను లగుచున్. 584
క. ఆహవముఖమున నను నతి,సాహసమున నెదిరి పోరి చక్రనిశితధా
రాహతిఁ దెగి వచ్చెద రు,త్సాహ మెలర్పంగ నాదుసన్నిధి కంతన్. 585
వ. అదియునుం గాక. 586
క. నను వైరంబున నైనను, మనమునఁ దలఁచుటను నాసమక్షమున మదా
నన మీక్షించుచు నిల్గుట, ననఘాత్మకు లై వసింతు రస్మత్పదవిన్. 587
క. వినుఁ [1]డిలమీఁద నిఁకెన్నఁటికిని బుట్టువు లేదు వీరికిని మీరలు వ
ల్కినయట్ల నాదుచిత్తము,ననుఁ దలఁతుం గాన మీమసంబుల నింకన్. 588
ఉ. దీనికిఁ జింతఁ దక్కుఁడు సుధీజనపుంగవులార నావుడు
న్మానలినాసనాత్మజు లనంతునిభావము దా మెఱింగి పెం
పూనిన వేడ్కఁ దేలి తెలి వొందినచిత్తములన్ నుతించి రం
భోనిధిశాయి నార్తజనపోషణభూషణుఁ బాపశోషణున్. 589
వ. మఱియును. 590
ఉ. ఆసనకాదు లంతఁ బులకాంకురముల్ నన లొత్త బాష్పధా
రాసుభగాక్షు లై మునిశరణ్యు నరేణ్యు నగణ్యు దేవతా
గ్రేసరుదివ్యమంగళశరీరముఁ జూపతదీయధామమున్

---

1 డిట మీఁదటి కెన్నఁటి.

భాసురలీలఁ జూచి నవ§పద్మదళాక్షునకున్ వినమ్రులై. 591

క. తమపలికినభాషణములు, కమలోదరు[1]వాక్యసరణి § గాఁ దలఁచుచు నె
య్యమునన్ వైష్ణవలక్ష్మిం, బ్రమదంబునఁ బ్రస్తుతించి § పరమేశ్వరుచేన్. 592

క. ఆమంత్రితులై తగ నిజ, ధామములకుఁ జనిరి వారు § దడయక లక్ష్మీ
రాముఁడు జయవిజయుల నభి, రామంబుగఁ జూచి పలికె § రయ మొప్పారన్.

క. మీ రసురయోనియం దని, వారితులై జనన మంద § వలసెను నే దు
ర్వారబలాఢ్యుఁడ నయ్యును, వారింపఁగ నోప విప్ర§వచనము లెందున్. 594

క. అది గాన దనుజయోనిం, బదపడి జనియించి మద్వి§పక్షుల రై మీ
మది నెపుడు నన్నె తలఁచుచు, వదలక నాచేతఁ జచ్చి § వచ్చెద రిటకున్. 595

ఉ. పోం డని యాన తిచ్చి హరి § ఫుల్లసరోరుహపత్రనేత్రుఁ డా
ఖండలముఖ్యదిగ్వరని§కాయకిరీటలసన్మణిప్రభా
మండితపాదపీఠుఁడు ర§మారమణీమణి దోడ నేఁగు దే
నిండినవేడ్కఁ నేఁగె నిజ§నిర్మలమందిరపుణ్యభూమికిన్. 596

వ. అంత. 597

క. నిజతేజోహాని గ జయ, విజయులు ధరఁ గూలి రపుడు § విహ్వలు లగుచుం
ద్రిజగముల సురవిమాన, వ్రజముల హాహారవంబు § గ్రందుగఁ జెలఁగన్. 598

క. వారలువో దితిగర్భా, గారంబున నున్నవారు § గడఁగి తదీయో
దారఘనతేజ మిపు డని, వారణ మీతేజ మెల్ల § వమ్ముగఁ జేసెన్. 599

ఉ. ఇంతకు మూల మాహరి ర§మేశ్వరుఁ డర్థి నొనర్చు కార్యముల్
వింత లె సర్వభూతభవ§వృద్ధివినాశనహేతుభూతుఁ డా
ద్యంతవికారశూన్యుఁడు ద§యానిధి మీయెడ మేలు సేయు నీ
చింత దొఱంగి వేచనుఁడు § చేకుఱు మీఁద మనోరథార్థముల్. 600

క. అని వనజాసనుఁ డాడిన, విని తద్వృత్తాంత మెఱిఁగి § విబుధులు నాకం
బున కేఁగిరి దితి నిజనా, థునిమాటలు దలఁచి యపరి§తోషముతోడన్. 601

జయవిజయులు దితియందు హిరణ్యాక్షహిరణ్యకశిపు లై పుట్టుట.

తే. ఇంతితనసుతుల్ సురలఁగా§రింతురనుచుఁ, దలఁచుచుండంగ నంత వ§త్సరశతంబు
సనఁగ నటమీఁదఁ గనియెఁ గ§శ్యపునిదేవి, యఖిలలోకైకకంటకు § లైనసుతుల.

వ. అయ్యవసరంబున. 603

తే. ధరణి గంపించెఁ గులపర్వ§తములు వడఁకె
జలధులు గలంగెఁ దారకా§వళులు డుల్లె
గగన మగలెను మ్రొగ్గె ది§క్కరులు దిశల
మిడుఁగుఱు చెదరెఁ బిడుగులు § పుడమిఁ దొరఁగె. 604

---

1 'భాషణములు' అ. ప్ర.

సీ. హోమానలంబుల। ధూమంబు లడరెను, బ్రతికూలవాయువుల్। బలసి వీచెఁ
దరువు లెల్లెడ విట।తాటంబు లై కూలె, గ్రహతారకావళి। కాంతి మాసె
బెరసి మొగిళ్లు నె।త్తురువాన గురిసెను, మెఱుఁగులు దెసల మి।ర్రిట్లు గొలిప్పె
స్వర్భానుఁ డొగి నప।ర్వమున భానునిఁ బట్టెఁ, గైకొని చిమ్మచీఁ।కట్లు పర్వె
తే. మొనసి కుక్కలు మొఱఁగెను। మోర లెత్తి, పగలు నక్కలు వాపోయె। ఖగములార్త
రవము లిచ్చెను దేవతా। ప్రతిమ లొరగెఁ, గన్నులను నశ్రుకణములు। గ్రందుకొనఁగ.
క. మొదవులు నెత్తురుఁ జీమును, బిదికెన్ గార్దభరవంబు। భీషణ మయ్యెన్
మద ముడిగెఁ గరులకటములఁ, బొదివెఁ దురంగములవాల।ముల నిప్పు లొగిన్.
క. గుహలు రొద లిచ్చెఁ బాప, గ్రహమిత్రతఁ జెంది నక్ర।గతులను సౌమ్య
గ్రహములు వర్తించెను దు,స్సహ తేజో దితితనూజ।సంభవ వేళన్. 607
మ. భయదప్రక్రియ నట్లు దోఁచినమహో।త్పాతంబు లీక్షించి సం
క్షయకాలం బని కాని సాధుహననో।గ్రక్రూర దేవాహితో
దయసంక్షోభము గా నెఱుంగక సమ।స్తప్రాణిజాతంబు స
ద్భయ మందెన్ సనకాదియోగిజనముల్। దక్కన్ బుధేంద్రోత్తమా. 608
వ. అట్లావిర్భవించినయనంతరంబ. 609
మ. కులశైలాభశరీరముల్ దనర ర।క్షోనాథు లత్యుగ్రదో
ర్బల మొప్పం బదఘట్టనన్ ధర సలిం।పన్ రత్నకేయూరకుం
డలకాంచీకటకాంగుళీయకకిరీ।టస్వర్ణమంజీరని
ర్మలకాంతుల్ దులకింప నాత్మరుచిచే। మందీకృతార్కాంశులై. 610
వ. ఉన్నసమయంబునం గశ్యపుండు నిజతనూభవులఁ జూడం దలంచి దితిమందిరంబు
నకుఁ జనుదెంచి సుతులం గనుంగొని వారలకు నామకరణంబు సేయం దలంచి.
చ. దితిజఠరంబునందుఁ దన। తేజము మున్నిడినట్టిపుత్రు న
ద్భుతచరితున్ హిరణ్యకశి।పుం డనుపేరఁ బ్రసూతివేళ నా
దితి మును గన్నపట్టి రవి। తేజునిఁ గాంచనలోచనుండు నా
హితమతిఁ బేరఁ బెట్టి చని।యెన్ నిజనిర్మలపుణ్యభూమికిన్. 612
వ. అయ్యవసరంబున సతులతేజోవిరాజితుం డైనహిరణ్యకశిపుండు హిరణ్యగర్భవర
దానగర్వంబునను దుర్వారపరిపంథిగర్వనిర్వాపణాఖర్వభుజావిజృంభణంబునను
నిఖిలలోకపాలాదుల జయించి (స్వవశం బొనర్చి) సంతుష్టాంతరంగుం డై యెం
దునుం దనకు మృత్యుభయంబు లేక నిర్భయుండై సుఖం బుండెఁ దత్సోదరుం
డైనహిరణ్యాక్షుండు ప్రతివాసరంబుఁ జండవేదండశుండాదండమండితభుజాదం
డంబున గదాదండంబు ధరియించి తన్ను నెదిరి కదనంబు సేయం జాలినయరివీ
రునిం గానక భూలోకం బెల్లఁ గ్రుమ్మరి దివంబునకు దాడివెట్టి యందు సమరవి
ముఖు లయినబర్హిర్ముఖులం గనుంగొని వనజాసనవరప్రదానంబుఁ జింతించి హి

తులు సెలంగ నహితులు గలంగ సుమహితవైజయంతికాదామం బభిరామం
బై వెలుంగం జరణంబుల మణినూపురంబులు మొరయ నిజదేహద్యుతి దిక్కు
లం బిక్కటిల్లం జనుదెంచువానిం గని విభీతచిత్తు లయి దేవతాగణంబులు గరు
డునిం గని పఱచునురగనికరంబులుంబోలె నిజనివాసంబు లర్కనివాసంబులుఁ
గాంచనావాసంబులుం గా నొనర్చి యెక్కడి కేనియుం జనిన. 613

ఉ. శౌర్యము వోవఁ దట్టి నిజసాధనముల్ దిగ నాడి విక్రమౌ
దార్యపరాక్రమక్రమము [1]దప్పఁగ భీతిలి పాఱి రక్కటా
కార్యముఁ దప్పి నాకు లని గైకొని యార్చి సుమేరుపర్వత
స్థైర్యుఁడు వార్ధిఁ జొచ్చె నతిదర్పితభూరిభుజావిజృంభి యై. 614

వ. ఇట్లు సొచ్చిన. 615

క. వరుణునిబలములు దనుజే, శ్వరుతేజముఁ దేఱి చూడఁ జాలక శౌర్య
స్ఫురణము సెడి యెందేనియుఁ, బఱచెం దజ్జలధిమధ్యభాగమునందున్. 616

క. అమరారివిపులనిశ్శ్వా, సములం బ్రభవించినట్టిజలనిధికల్లో
లములను విపులగదాదం, డమునం బో నడిచె నతిదృఢం బగుశక్తిన్. 617

చ. మఱియును నమ్మహాజలధిమధ్యమునన్ సురవైరి పెక్కువ
త్సరములు క్రీడ సల్పి రిపుసైన్యవిదారణశౌర్యఖేలనా
పరతఁ జరించి యవ్వరుణపాలిత మైనలసద్విభావరీ
పురమున కేఁగి యందుఁ బరిపూర్ణత నున్నపయోధినాథునిన్. 618

వ. మఱియును. 619

సీ. యాదోగణాధీశుఁ డగుచుఁ బాతాళభు, వనపరిపాలుఁ డై తనరు చున్న
వరుణునిఁ గనుఁగొని పరిహాసితోక్తుల, నిట్లను విశ్వము దెన్నఁ గలుగు
సకలలోకైకపాలకులలో నతిబలా, ధికుఁ డని జగము నుతింపఁ దగిన
శూరుండ విపుడు నీపౌరుష మొప్పంగఁ, గదనరంగమున నన్నెదిరి చూడు
తే. నీభుజావిక్రమంబును బ్రాభవంబు
నడఁతు నని పల్కుటయు విని యబ్ధివిభుఁడు
పగఱజయమును వృద్ధియు బలము నాత్మ
బలముఁ దలపోసి దనుజుతో బవరమునకు. 620

క. సమయము గా దని తనచి, త్తమునం గలరోషవహ్నిఁ దాలిమి యనుతో
యములం దగ నార్చుచు నుప, శమితోక్తులఁ బలికె దనుజసత్తముతోడన్.

చ. మనమున శాంతిఁ బూని నియమంబున సంగర ముజ్జగించి యే
మనయము నున్నవార మిపు డాహవకేళిఁ జరింప రాదు నీ
ఘనభుజవిక్రమస్ఫురితగాఢవిజృంభణముల్ జయింపఁ జా

1. దవ్వఁగ.

లినప్రతివీరు లెవ్వరును లేరు ముకుందుఁడు దక్క నెక్కడన్. 622

చ. గొనకొని యమ్మహాత్ముఁడు వికుంఠపురంబున నున్నవాఁడు దా
నని మొనఁ బెక్కుమాఱు లభియాతుల నోలి జయించి శక్తిపెం
పున నడిసన్నవీరుఁ డని భూజనకోటి నుతింప విందు వే
చను మతఁ డిచ్చు నీకు నని సర్వముఁ దీఱెడు నంతమీఁదటన్. 623

ఉ. నిందకు నోర్చి యాజిమొన నిల్వఁగ నోపక పీఁగి పాఱునీ
పందల వెంటఁబెట్ట మగపంతమె సర్వశరణ్యుఁ డైన గో
విందుఁడు దీర్చు నీపని వివేకవిహీన చనంగ నోపు దే
నందుల కేఁగు మాతఁ డమరారులఁ బోర జయించు నిచ్చలున్. 624

వ. అదియునుం గాక. 625

క. పురుషాకృతిఁ బ్రతియుగమునఁ, బురుషోత్తముఁ డవతరించి భూరిభుజావి
స్ఫురణన్ దుష్టనిశాటుల, హరియించుచు నుండు మునిగణార్చితపదుఁడై. 626

ఉ. కావున నావిభుం డొడరి కయ్యము దయ్య మెఱుంగఁ జేసి ర
క్షోవర నీభుజాబలము సాంపతి మేదినిఁ గూలి సారమే
యావళి కాశ్రయం బగుదు వచ్చటి కిప్పుడ పోఁగు దేని నీ
చేవయు లావు నేర్పడును జెప్పఁగ నేటికి మీఁదికార్యముల్. 627

చ. అని వరుణుండు వల్కిన దురాగ్రహ మెత్తి హిరణ్యలోచనుం
డనయము మానసంబున భయం బొకయింతయు లేక సంగరా
వని నెదిరింతు నేఁ డమరవర్ధను దుష్టవిమర్దనున్ జనా
ర్దను ననుచున్ వికుంఠనగరస్ఫుటసంచితమార్గవర్తి యై. 628

క. చనునవసరమున నారద, మునివరుఁ డెదు రేఁగుదెంచి ముదము దలిర్పన్
దనుజేంద్ర యెందుఁ బోయెద, వని యడిగిన నారదునకు నతఁ డిట్లనియెన్.

చ. సరసిరుహోదరుం డొడరి సంగర మే నొనరించి యిందిరా
వరుని ననంతుఁ ద్రుంచి సురవైరికులంబుల కెల్ల మోదవి
స్ఫురణ ఘటింపఁ జేయుటకు బూని వికుంఠపురానువర్తి నై
యరిగెద నన్న నమ్మునికులాగ్రణి దానవనాథు కిట్లనున్. 630

చ. గురుభుజుఁ డమ్మహాత్ముఁడు వికుంఠపురంబున నేఁడు లేఁడు భూ
భరము వహింప నాదికిటిభావము దాల్చి రసాతలంబునం
దిరవుగ నున్నవాఁ డచటి కేఁగఁగ నోపుదు వేని నేఁగు మం
దరయఁగఁ గల్గు నీకు నసురాంతకుతోడి రణం బవశ్యమున్. 631

హిరణ్యాక్షుఁడు యజ్ఞవరాహం బగుహరి నెదిరించి పోరుట.

చ. అనవుడు దానవేంద్రుఁడు హుతాశనుకైవడి మండి పద్మలో
చను నెదిరించువేడుకలు సందడిగొల్ప ననల్పతేజుఁ డై

ఘనగదఁ గేలఁ బూని త్రిజ । గద్భయదాకృతిఁ దాల్చి వ్రేల్మిడిం
జనియె రసాతలంబునకుఁ । జండభుజాబలదర్ప మేర్పడన్. 632

వ. చని జలమధ్యంబున. 633

క. దివిజారి యెదురఁ గాంచెను, నవిరళదంష్ట్రాభిరాము । నమరలలామున్
గువలయభరణోద్దాముఁ, సవనమయ స్తబ్ధరోము । జలదశ్యామున్. 634

వ. అయ్యవసరంబున సూకరాకారుండైన హరియు. 635

క. వనజరుచిసన్నిభము లగు, తనలోచనయుగళదీప్తిఁ । దనరఁ దదాలో
కనముల దనుజాధీశుని, తనుకాంతి హరింపఁ జేసెఁ । దత్క్షణమాత్రన్. 636

వ. మఱియు నయ్యాదివరాహం బవార్యశౌర్యంబున మాఱు లేనివిహారంబునం
జరియించునట్టియెడ. 637

సీ. తుదమొదళ్లకుఁ జిక్కఁ । దునిసి పాఱఁగ మోరఁ, గులశైలములఁ జిమ్ముఁ । గొంతదడవు
బ్రహ్మాండభాండంబు । పగిలి చిల్లులు వోవఁ, గొమ్ములఁ దాటించుఁ । గొంతదడవు
జలధు లేడును బంక । సంకులంబై యింక, ఖురముల మట్టాడుఁ । గొంతదడవు
నుడురాజుసూర్యుఁడు । నొక్కమూలకుఁ బోవఁ, గుఱుచవాలము ద్రిప్పుఁ । గొంతద
తే. గునియుఁ గుప్పించు లంఘించుఁ । గొప్పరించు [డవు
నెగయు ధరఁ ద్రవ్వు బొఱియఁగా । నేపు మిగిలి
దానవేంద్రునిగుండెలు । దల్లడిల్లఁ
బంది మెల్లన రణపరి । స్పంది యగుచు. 638

వ. మఱియును. 639

క. కనుఁగవ నిప్పులు రాలఁగ, సునిశితదంష్ట్రాగ్రయుతవ । సుంధరుఁ డగుచుం
దన కెదు రేతేరఁగ నీ, వనచర మేరీతి నిపుడు । వనచర మయ్యెన్. 640

క. అని యాశ్చర్యభయంబులు, దనమనమునఁ దొంగలింపఁ । దనుజాధిపుఁ డి
ట్లనియెఁ భీకరసూకర, తను వొంది చరించు దనుజ । దర్పాపహుతోన్. 641

క. ఘనసూకర మూఢాత్మక, వనరుహసంభూతదత్త । వరదానమునం
గనినరసాతలగతభువి, యనయంబును నాయధీన । మై వర్తించున్. 642

క. గొనకొని నీ వీధరణిం, గొని పోకుము విడుము కాక । కొని యేఁగెద వేఁ
గొనియెద నీప్రాణముఁ గై, కొను నావచనములు సలము । కొన నేమిటికిన్. 643

క. మాయావి వగుచు నిప్పుడు, వాయక యీపుడమిఁ జోర । భావంబున [1]నీ
వీయెడఁ గొని పోఁ జూతువె, యాయతభుజబలముచేత । నడఁపక యనుచున్.

సీ. అవిరళయోగమా । యాబలంబునఁ జేసి, యల్పపౌరుషమున । నలరునిన్ను
నర్థి సంస్థాపించి । యస్మత్సుహృద్భృత్య, కులుల కెల్లను మోద । మొలయఁ జేయఁ
జెలు వేది మద్గదా । శీర్ణుఁడ వగునిన్నుఁ, గనుఁగొని దేవతా । గణము లెల్ల

1 ( గొం, పోయెదు నాశత్రువులకు, ధియుత మిత్రుండపోలెఁ దెంపు తలిర్పన్. వ్రా. ప్ర.

ర్ములు లై చాల నెఱి నశించెద రన్న, విని యజ్ఞపోత్రి యై వెలయుచున్న

తే. హరి సరోజాతభవముఖామరుల కెల్ల, వచ్చు సురవస్థ కార్తిలో నంత నొంది
నిశితదంష్ట్రాగ్ర[1]లసిత యై నెగడు ధరణి, దేవితో నొప్పె నా దేవదేవుఁ డంత.

క. [2]సురరిపువాక్యాంకుశముల, గుఱుకుపితస్వాంతుఁ డగుచుఁ గోమరారె వసుం
ధరతోడ భీతి నొందిన, కరిణిం గలకరికులేంద్రుకరణిం బెలుచన్. 646

తే. నిశితసితదంతరోచులు నింగిఁ బర్వఁ, గంధి వెడలి భయంకరాకారలీల
నరుగుభీషణముఖవరాహావతార, మొనరఁ దాల్చినపద్మలోచనుని వెనుక. 647

క. కరివెనుకఁ దగులునక్రము, కరణిం జని దైత్యవిభుఁడు గదిసి యిటు లనున్
దురితపయోనిధితరికిం, గిరికిన్ ఖురదళితమేరుగిరికిన్ హరికిన్. 648

క. నిందకు రోయక లజ్జం, జెందక వంచనను రణము సేసి జయంబుం
బొందెద నని [3]తలఁచుచు నిటు, పందగతిం బాఱ బంటుతనమె నీకున్. 649

వ. అని యాక్షేపించినం బుండరీకాక్షుండు గోపోద్దీపితమానసుం డై. 650

క. తోయములమీఁద భూమి న, నాయాసత నిల్పి దాని కాధారముగాఁ
దోయజనాభుఁడు దనబల, మాయతమతిఁ బెట్టె సురలు హర్షము నొందన్.

తే. కుసుమములవృష్టి బోరనఁ గురిసె నంత
విభవ మొప్పార దేవదుందుభులు మొరసెఁ
గడఁక వీతెంచె గంధర్వగానరవము
నందితము లయ్యె నప్సరోనర్తనములు. 652

వ. అయ్యవసరంబున నయ్యజ్ఞవరాహమూర్తిధరుం డై నకమలలోచనుండు కనకకుండలకేయూరగ్రైవేయకటకాంగుళీయకభూషణరోచులు నింగిఁ బర్వ సమరసన్నద్ధుం డై. 653

చ. ఘనగదఁ గేలఁ బూని మణికాంచనదివ్యవిచిత్రవర్మ మిం
పొనరఁగఁ దాల్చి దానవనియుక్తమరుక్తినిశాతబాణముల్
దనఘనమర్మముల్ గలఁప దానవహంత నితాంతశౌర్యుఁ డై
కనలుచు వచ్చునద్దనుజుఁ గన్గొని రోషవిభీషణాకృతిన్. 654

వ. ఇట్లనియె. 655

మ. వినరా యోరి యమంగళాచరణ యుర్విద్విత్రిన్ నను న్నీమది
న్ననయంబున్ వనగోచరం బగుమృగం బంచుం దలం తౌర నే
నెనయన్ వన్యమృగంబ యౌదు బలిమి న్నే తెంచునీబోఁటియూ
శునకశ్రేణి వధింతు నేఁ డనిమొనం జోఁ కోర్చి వర్తించినన్. 656

క. బలిమి గలదేని నాతోఁ, గలనను నెదిరించి పోరఁ గడఁగుము నీకో

1 కోరకవసితధరణి. 2 'వరబలయుత జలచరగణ, పరిపీడాకులవిలోలభావముతోడం, గురి చాల భీతి నొందిన, కరిణిం గల' వ్రా. ప్ర. 3 మదిఁ దలఁచిటు.

ర్కులు నేఁడు దీర్తు నూరక, తలపోయ వికత్థనంబు • దగదు దురాత్మా. 657

చ. విను మిది గాక సంగరవి • వేకవిశారదు లైనయట్టిస
జ్జనములు మృత్యుపాశములఁ • జాల నిబద్ధులు నయ్యు నీవలెన్
గొనకొని యాత్మసంస్తుతుల • కున్ ముద మంద రిదేల యీవిక
త్థనములు బంటుపంతములె • దైత్యకులాధమ యెన్ని చూడఁగన్. 658

మ. ధృతిఁ బాతాళమునందు నీ వనెడిసం • దీప్తోగ్రనిక్షేప మే
నతిదర్పంబునఁ గొందుఁ జూడు మిదె దే • వారాతి నన్నెన్నె దా
గతలజ్జుం డన దాఁగి యుండి రణముం • గావింతు యుష్మద్గదా
వితతద్రావితుఁ డన్నన న్నెదురుమా • పే తీర్తు నీకోరికల్. 659

ఉ. ఎన్నఁ బదాతియూథముల • కెల్ల విభుండవు పోటుబంట వై
నన్ను రణోర్విఁ నేఁ డెదిరి • నన్ భవదీయబలంబు నాయువున్
మిన్నక కొందుఁ జూడు మిది • మేరఁగ మేదిని వీతదైత్య మై
వన్నెకు నెక్కఁ జేసెద న • వార్యపరాక్రమవిక్రమంబునన్. 660

చ. నను నెదురంగఁ జాలినఘ • నం బగుశౌర్యము ధైర్యమున్ బలం
బును గలవేని నిల్వు రణ • భూమిని నీహితు లైనవారికిం
గనుఁగవ బాష్పపూరములు • గ్రమ్మఁగ మాన్పఁగ నోపుదేనిఁ జ
య్యనఁ జనఁ బొమ్ము దానవకు • లాధమ యూరక రజ్జు లేటికిన్. 661

క. నను నిట సంస్థాపించెద, నని పలికితి వంతవాఁడ • వౌదువు నీకున్
నెన రైనచుట్టములఁ బొడఁగని రా యిదె యమునిపురికిఁ • గాఁపుర మనుగన్.

మ. అని యిబ్భంగి సరోరుహాక్షుఁడు హిర • ణ్యాక్షున్ విడంబించి ప
ల్కినహాసోక్తుల కుల్కి రోషమదసం • గీభూతచేతస్కుఁ డై
కనుఁగ్రేవన్ మిడుఁగుర్లు నాలఁ బొడమం • గాఁ గిన్కమైఁ దోఁకఁ ద్రొ
క్కినకృష్ణోరగరాజుమాడ్కి మదిలోఁ • గీడ్పాటు వాటిల్లఁగన్. 663

క. చలితేంద్రియుఁ డై నిట్టూర్పులు నిగిడించుచును బొమలు • ముడివడ రోషా
కులమానసుఁ డై గదఁ గొని, జలజాక్షున కెదురునడచె • సాహస మొప్పన్.

వ. అ త్తఱి హిరణ్యాక్షుం డతిభయంకరాకారుం డై. 665

మ. గద సారించి మదాసురేంద్రుఁడు సమ • గ్రక్రోధుఁ డై మాధవుం
గుదియన్ వ్రేసిన వ్రేటు గైకొనక ర • క్షోహంత శౌర్యోన్నతిన్
గద కేలన్ ధరియించి దానిఁ దునుకల్ • గావించినం దైత్యుఁ డు
న్మదుఁ డై యొండుగదన్ రమావిభుని భీ • మప్రక్రియన్ వ్రేసినన్. 666

చ. అది దనుఁ దాఁక కుండ దను • జారి గదారణకోవిదక్రియా
స్పదకరలాఘవక్రమముఁ • బైకొని చూపి విరోధిపేరురం
బదయత వ్రేయ వాఁడు వివ • శాకులభావము నొంది యంతలో

మదిఁ దెలివొంది వ్రేసె రిపుమానవిమర్దను నాజనార్దనున్. 667

వ. ఇట్లు దలపడి యన్యోన్యజయకాంక్షల నితరేతరతుంగతరంగతాడితంబు లగు దక్షిణోత్తరసముద్రంబులరాగంబునఁ బరస్పరశుండాదండఘట్టితమదాంధగంధసింధురయుగంబుచందంబున రోషభీషణాటోపంబులం దలపడుబెబ్బులులగబ్బున నతిదర్పాతిరేకంబున నెదిర్చి యంకెలు వైచుమదవృషభంబులరభసంబున నసహ్యసింహపరాక్రమంబున విక్రమించి పోరు నెడ హిరణ్యాక్షుండు సవ్యమండలభ్రమణంబునఁ బరివేష్టించినం బుండరీకాక్షుండు దక్షిణమండలభ్రమణంబునం దిరిగి విపక్షువక్షం బశనిసంకాశం బగుగదాదండంబునం బగిల్చిన వాఁడు దెప్పిఱి తెలివొంది లేచి దనుజపరిపంథిఘాతంబు నొప్పించె నప్పు డమ్మేటివీరులు శోణితసిక్తాంగు లై పుష్పితాశోకంబులం బురుడించుచుం బాయుచు డాయుచు వ్రేయుచు రోయుచు నొండొరులరుధిరంబు లాఘ్రాణించుచుఁ దిరస్కారపరిహాసోక్తుల నిచ్చుచుఁ బోరుసమయంబున సముత్సాహబలులసమరంబుఁ జూచు వేడ్కఁ బద్మసంభవుండు నిఖిలమునిసిద్ధసాధ్యదేవగణంబులతోడఁ జనుదెంచి ధరిత్రీనిమిత్తంబున నసురవరునితోడం బోరుయజ్ఞవరాహున కిట్లనియె. 668

ఉ. అంచితదివ్యమూర్తి పరమాత్మక యీకలుషాత్ముఁ డైన న
క్తంచరుఁ డస్మదీయవరగర్వమునన్ భువనంబు లెల్లఁ గా
రించు మదించి యిట్టివిపరీతచరిత్రునిఁ ద్రుంప కిట్లుపే
క్షించుట గాదు వీని బలిసేయు వసుంధరకున్ శుభం బగున్. 669

క. బాలుఁడు గరమున నుగ్ర, వ్యాళము ధరియించి యాడువడువున రక్షః
పాలునిఁ ద్రుంపక యూరక, పాలార్చుట నీతిగా శుభప్రద మింకన్. 670

వ. అదియునుం గాక. 671

మ. అనఘా యీయభిజిన్ముహూర్తమున దేవారాతి మర్దింపవే
ననయంబున్ మఱి దైత్యవేళ యగుసంధ్యాకాల మేతెంచినన్
ఘనమాయాబలశాలి యైన దనుజున్ ఖండింపఁగా రాదు గా
వున నీవేళన త్రుంపు సజ్జనహితప్రోద్యోగరక్తుండ వై. 672

క. అని సరసిజగర్భుఁడు వ, ల్కినవచనము లర్థి విని నిలింపులు గుంపుల్
గొని చూడ సస్మితానన, వనజము చెలువొంద నసురవరు కభిముఖుఁ డై. 673

తే. పుండరీకాక్షుఁ డయ్యును భూరిరోష, నిరతిఁ దరుణారుణాంభోజనేత్రుఁ డగుచు
ఘనగదాదండ మెత్తి రాక్షసునిహనువు, నుగ్రగతి మొత్తె వాఁడును నోసరించె.

క. పఱువడి దితిసుతుఁ డతిభీ, కరగదఁ జేఁ బూని చిత్రగతులను బద్మో
దరు డాసి చేతిగద సా, గరమునఁ బడ నడిచె బాహుగర్వ మెలర్పన్. 675

వ. అంత. 676

తే. హరి నిరాయుధుఁ డైన సురారి సమర, ధర్మ మాత్మఁ దలఁచి యుద్ధంబుఁ దక్కి

నిలిచి చూచుచు నుండెను ✱ నింగి యమర, వరులహాహారవంబుల ✱ భరిత మయ్యె.
క. సరసిజనేత్రుఁడు దనుజే, శ్వరుసంగరధర్మమునకు ✱ సమధికశౌర్య
స్ఫురణకుఁ దనచిత్తంబునఁ, గర మాశ్చర్యంబు నొంది ✱ కడఁక దలిర్పన్. 678
మ. కుతలోద్ధర్త మనంబునం దలఁచె ర✱క్షోరాడ్వధార్థంబుగా
దితిసంతానకులాటవీమహితసం✱దీప్తప్రభాశుక్రమున్
సతతోద్యజ్జయశబ్దసన్ముఖరభా✱స్వచ్చక్రమున్ సంతతా
శ్రితనిర్వక్రముఁ బాలితప్రకటధా✱త్రీచక్రముం జక్రమున్. 679
వ. అదియునుం బ్రచండమార్తాండమండలప్రభాపటలచటులవిద్యోతమానంబును బటునటజ్జ్వాలికాపాస్తసమస్తకుటిలారాతిబలాఖర్వదుర్వారబాహాగర్వాంధకారంబును నసహ్యకహకహనినదాధరీకృతసాగరఘోషంబును సకలదేవతాగణజేగీయమానంబును ననంతతేజోవిరాజితంబును నిజప్రభాపటలపూరితబ్రహ్మాండకటాహంబును నై రయంబునం జనుదెంచి దనుజారిదక్షిణకరసరోజంబు నలంకరించిన నాశుభాంగుండు రథాంగపాణి యై దివంబున నమరగణంబులు జయజయశబ్దంబులు వలుక నసురవిభున కెదురు గా నడచిన. 680
క. పొడగని దనుజుఁడు పెదవులు, దడుపుచుఁ బొలివోనిబంటు✱తనమున బీరం
బుడుగక భీషణగదఁ గొని, యడిచెన్ మఖమయవరాహు ✱ నమితోత్సాహున్.
క. త్రిదశారి దన్ను వ్రేసిన, గదఁ బదమునఁ బోవఁ దన్ని ✱ కమలాక్షుఁడు పెం
పొదవఁగ మనమున మోదము, గదురఁగ లేనగవు వదన✱కమలముఁ [1]బొదువన్.
వ. ఇవ్విధంబున గదఁ బోవం దన్ని యసురవిభునితో ని ట్లనియె. 683
చ. ఘనగదఁ గేలఁ బూని భుజ✱గర్వ మెలర్పఁగ నన్ను సంగరా
వని నెదిరింతు రార యని✱వారణ దైత్యకులేశ్వరాధమా
యనవుడు వాఁడు [2]నుబ్బి గద ✱ నంబుజనాభుని వ్రేసె వ్రేసినం
దనుజవిభేది వట్టికొనెఁ ✱ దార్క్ష్యుఁ డహీంద్రునిఁ బట్టుకైవడిన్. 684
క. దితిజుఁడు దనబల మప్రతి, హతతేజం డగుసరోరు✱హాక్షుని శౌర్యో
న్నతిమీఁదఁ బెట్ట కుండుట, మతి నెఱిఁగియుఁ బెనఁగె దురభి✱మానము పేర్మిన్.
వ. అంత. 686
సీ. కాలానలజ్వాల✱జ్వాలావిలోలక, రాళ మై పెంపొందు✱శూల మంది
సురవైరి యజ్ఞసూ✱కరరూపధరుఁ డైన, వనజనాభునిమీఁద ✱ వైవ నదియు
సద్ద్విజోత్తముమీఁదఁ ✱ జపలత గావించు, నభిచారకర్మంబు✱నట్ల బెండు
పడి పఱతేఁ గని ✱ పద్మోదరుఁడు దానిఁ, జక్రధారాహతిఁ ✱ జండవిక్ర
తే. మమున నడుమన వడిఁ ద్రుంచె✱నమరభర్త, మహితదంభోళిచే గరు✱త్మంతుపక్ష
మతిరయంబునఁ ద్రుంచిన✱గతిఁ జెలంగి, సురలు మోదింప నసురులు ✱ సొంపుడింప.

1. మ్రోవన్. 2. నవ్వి.

వ. అయ్యవసరంబున నయ్యసుర దనశూలంబు చక్రంబుచేత నిహతం బగుటం గని.

క. దితిజుఁడు రోషోద్ధతుఁ డై, యతినిష్ఠురముష్టిఁ బొడిచె హరి నాలోకో
న్నతుఁ డొప్పెఁ గుసుమమాలా, హతి దిగ్గజరాజుఁబోలె నతిదర్పితుఁ డై. 689

మ. హరిమీఁదన్ దితిసంభవుండు ఘనమాయాకోట్లు పుట్టించినన్
ధరణీచక్రము భూరిపాంసుపటలధ్వాంతంబునం గప్పె భీ
కరపాషాణపురీషమూత్రఘనదుర్గంధాస్థిరక్తావళుల్
గురిసెన్ మేఘము లభ్రవీథిని మహాక్షోభక్రియాలోలమై. 690

వ. మఱియును. 691

చ. తవిలి విముక్తకేశపరిధానము లుగ్రకరాళదంతతా
లువులును రక్తలోచనములుం గలభూతపిశాచఢాకినీ
నివహము లంతరిక్షమునఁ నిల్చి నిజాయుధపాణులై మహా
రవము గ యక్షదైత్యచతురంగబలంబులఁ గూడి తోఁచినన్. 692

వ. అంత. 693

క. త్రిసవనపాదుం డగునా, బిసరుహనేత్రుండు లోకభీకర మగునా
యసురాధిపు మాయావిని.రసనకరం బైనశస్త్రరాజముఁ బనుపన్. 694

క. ఆచక్రభానుదీప్తి ధ, రాచక్రమునందు నిండి రయమున నమ్మా
యాచక్రము నడఁగించెను, నీచక్రముఁ డైనయామినీచరు నెదురన్. 695

వ. అంత నిక్కడ. 696

క. దితి దనవిభువాక్యంబుల, గతి దప్పద యనుచుఁ దలఁపఁగాఁ జన్నుల శో
ణితధార లొలికె రక్షః, పతి యగుకనకాక్షుపతనభావము దోఁపన్. 697

వ. అయ్యవసరంబున నసురవిభుండు దనచేసినమాయాశతంబులు గృతఘ్నునకుం గావించినయుపకారంబులుంబోలె హరిమీఁదఁ బని సేయక విఫలంబు లయినం బొలివోవనిబంటుతనంబునఁ బుండరీకాక్షుఁ జేరం జనుదెంచి బాహుయుగళంబు సాఁచి పూఁచి పొడిచి రక్షోవైరివక్షంబుఁ బీడించిన నయ్యధోక్షజుండు దప్పించుకొని తలంగినం జెలంగి దైత్యుండు నిష్ఠురం బగుముష్టిం బొడిచిన నసురాంతకుండు మిసిమింతుండు గాక రోషభీషణాకారంబున వాసవుండు వృత్రాసురుం దెగటార్చినచందంబున వజ్రవజ్రసన్నిభం బగునఱచేతం [1]గఱకుటసురకటితటంబుఁ జటులగతి వ్రేసిన (నాహిరణ్యాక్షుండు దిర్దిరం దిరిగి యుదస్తలోచనుండై సోలి యెట్టకేలకు నెదుర నిలువంబడె నంత.) 698

క. దిట చెడి లోఁబడె దైత్యుఁడు, నటికిన్ దంష్ట్రావిభిన్నశత్రుమహోర
స్తటికిన్ ఖరఖురపుటికిం, గటితటహతకమలజాండఘటికిం గిటికిన్. 699

వ. ఇట్లు లోఁబడిన. 700

1 గఱకు దనుజకటి.

మ. [1]దివి నింద్రాదులు సంతసింప హరి మొత్తెం గర్ణమూలంబునం
బవిసంకాశకఠోరహస్తమున శుంభద్భల్లిలమై దాన దా
నవలోకేశుఁ డుదస్తనేత్రుఁ డగుచు న్దైన్యంబు వాటిల్లఁగా
భువిమీఁదన్ బడి కూలె మారుతహతోద్యన్మాలావనీజాకృతిన్. 701

క. బుడబుడ నెత్తురు గ్రక్కుచు, వెడరూపము దాల్చి గ్రుడ్లు వెలికుఱుక నిలం
బడి పండ్లు గీఁటుకొనుచును, విడిచెం బ్రాణములు దైత్యవీరుం డంతన్. 702

తే. పడినదనుజేశ్వరునిఁ జూచి పద్మసంభ, వాదిదివిజులు వెఱఁగంది యాత్మలందు
నితఁడు వొందుట యెట్లొకో యీయవస్థ, ననితలంచుచు మఱియు నిట్లనిరి వరుస.

మ. వరయోగీంద్రులు యోగమార్గముల నెవ్వాని న్మనోవీథి సు
స్థిరతన్ లింగశరీరభంగమునకై చింతింతు రా పంకజో
దరుపాదాహతిఁ దన్ముఖాంబురుహముం దర్శించుచుం జచ్చె దు
ర్భరి[2]తోత్తంసుఁడు దైత్యవల్లభుని[3]సౌభాగ్యంబు దా నెట్టిదో. 704

చ. సమమతి వీరు దైత్యకులశాసనుపారిషదుల్ మునీంద్రశా
పమున నికృష్టజన్మమునఁ బైకొని పుట్టియు నేఁడు విష్ణుచే
సమయుటఁ జేసి మీఁద నగుజన్మమునన్ జలజాక్షునిత్యవా
సమున వసింతు రెన్నఁటికిఁ జావును బుట్టువు లేవు వీరికిన్. 705

క. అని వెఱఁగందుచుఁ ద్రిసవన,తను వొందినయట్టివికచతామరసాక్షు
న్ననిమిషముని యోగిజనా, వనదక్షున్ దనుజకరటివరహర్యక్షున్. 706

వ. కనుంగొని. 707

చ. వనజదళాక్ష యీజగతివారలమర్మము లీ వెఱింగి యీ
సునఁ బగఁ బుట్టునీదివిజసూదనుఁ జంపితి గాన యింక శో
భన మగు నంచు హస్తములు ఫాలములం గదియించి యందఱున్
వినమితులై నుతించిరి వివేకవిశాలునిఁ బుణ్యశీలునిన్. 708

వ. అంత. 709

చ. నవనవరాహమూర్తి సురశత్రువుఁ ద్రుంచినమీఁద భారతీ
ధవముఖదేవతామునికదంబము దన్ను నుతించునట్టిసం
స్తవమున కాత్మలోనఁ బ్రమదంబునఁ బొంది సమగ్రమంగళో
త్సవము దలిర్ప నందఱఁ బ్రసాదవిలోకన మొప్పఁ జూచుచున్. 710

చ. అరిగె వికుంఠధామమున కమ్మహితోత్సవసూచకంబు గా
మొరసె సుపర్వదుందుభులమోఘములై ధరణీతలంబునం

---

1 'దివి నింద్రాదులు సంతసింప హరి యుద్రేకంబుగాఁ, బవిసంకాశకఠోరహస్తమున శుంభద్భల్లిలమై వ్రేయ దానవ'—వ్రాఁతప్రతులు. 2 తోద్దాత్తుఁడు. 3 యీభాగ్యంబు.

గురిసెఁ బ్రసూనవృష్టి శిఖికుండము లెల్లెడఁ దేజరిల్లె భా
స్కరశశిమండలంబులు నిరజద్యుతితో వెలుఁగొందె నత్తఱిన్. 711

క. అని యీపుణ్యచరిత్రము, వనరుహసంభవుఁడు త్రిదివవాసులకుం జె
ప్పినయది మైత్రేయుఁడు విదురున కెఱిఁగించినవిధంబు రూఢము గాఁగన్.

క. శుకయోగి పరీక్షిత్తున, కకుటిలమతి నెఱుఁగఁ జెప్పె నని సూతుఁడు శౌ
నకముఖ్యులైనమునివరు,లకుఁ దెలియఁగఁ జెప్పె మఱియు లాలన మొప్పన్.

వ. ఇవ్విధంబున మైత్రేయుండు సెప్పిన విని విదురుండు సంతసిల్లె ననిన. 714

క. అనఘం బగునీచరితము, వినినఁ బఠించిన లభించు విశ్రుతకీర్తుల్
వనజోదరుపదభక్తియు, మునుకొని యిహపరసుసౌఖ్యములు జనములకున్.

వ. అని చెప్పి వెండియు సూతుండు మహర్షుల కిట్లనియె నట్లు పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని మునీంద్రా హిరణ్యాక్షవధానంతరంబున వసుంధర సమస్థితిం బొందినవిధంబును స్వాయంభువమనువుఁ బుట్టించినయనంతరంబున విరించి దిర్యగ్జాతిజంతుసృష్టినిమిత్తంబు లైనమార్గంబు లెన్ని సృజించె మహాభాగవతోత్తముం డగువిదురుండు కృష్ణున కపకారంబు దలంచినపాపవర్తను లగుధృతరాష్ట్రపుత్రులం బాసి జనకుం డగుకృష్ణద్వైపాయనునకు సముం డగుచుఁ దనమనోవాక్కాయకర్మంబులు కృష్ణునందఁ జేర్చి భాగవతజనోపాసకుం డై పుణ్యతీర్థసేవాసమాలబ్ధయశోవిగతకల్మషుం డగుచు మైత్రేయమహాముని నేమిప్రశ్నంబు లడిగె ననిన నెల్లం దెలియ నానతి మ్మనిన రాజేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె. 716

సీ. విమలాత్ముఁ డైనయవ్విదురుండు మైత్రేయ, మునివరుఁ జూచి యిట్లనియెఁ బ్రీతిఁ
జతురాత్మ సకలప్రజాపతి యైనట్టి, జలజగర్భుఁడు ప్రజాసర్గమందు
మును ప్రజాపతులను బుట్టించి వెండియుఁ, జిత్తమం దేమి సృజింపఁ దలఁచె
మును సృజించినయట్టిమును లమరీచ్యాదు, లబ్జజునాదేశ మాత్మ నిలిపి

తే. యర్థి నెట్లు సృజించిరి యఖిలజగము, మెఱసి మఱివారు భార్యాసమేతు లగుచు
నేమి సృజియించి రది గాక కామినులను, బాసియే మిసృజించి రాభద్రయశులు.

క. అందఱుఁ దమలో నైక్యముఁ, జెందినచో నేమి దగ సృజించిరి కరుణా
కందళితహృదయ యన్నియుఁ, బొందుగ నెఱిఁగింపు మయ్య బుధనుత నాకున్.

చతుర్ముఖుం డొనర్చు మహదాదిదేవతాగణసృష్టిం దెలుపుట.

సీ. అనిన మునీంద్రుఁ డిట్లనియె జీవాదృష్ట, పరుఁడు మాయాయుక్తపురుషవరుఁడుఁ
గాలాత్మకుఁడు ననుకారణంబున నిర్వి, కారుఁ డైనట్టిజగన్నివాసుఁ
డాదిజాతక్షోభుఁ డయ్యె నమ్మేటివ, లనను గుణత్రయంబును జనించె
నాగుణత్రయమునం దయ్యె మహత్తత్త్వ, మది రజోగుణహేతు వైన దాని

తే. యం దహంకార మొగిఁ ద్రిగుణాత్మకమునఁ

బొడమె మఱి దానివలనఁ బ్రభూత మయ్యెఁ
బంచతన్మాత్ర లందు సంభవము నొందె
భూతపంచక మీసృష్టికి హేతు వగుచు. 719

వ. అవియును దమలోనఁ బ్రత్యేకంబ భువననిర్మాణకర్మంబునకు సమర్థంబులు గాక యన్నింటిసంఘాతంబునఁ బాంచభౌతికం బైనహిరణ్మయాండంబు సృజియించె నదియును జలాంతర్వర్తి యై వృద్ధిఁ బొందు చుండె నందు. 720

సీ. నారాయణాఖ్య నున్నతి నొప్పు బ్రహ్మంబు, సాహస్రదివ్యవర్షంబు లోలి
వసియించి యుండె నావాసుదేవునినాభి,యందు సహస్రసూర్యప్రదీప్తిఁ
దనరుచు సకలజీవనికాయయుత మగు,పంకజాతంబు సంభవము నొందెఁ
బరఁగంగ నందులో భగవదధిష్ఠితుం, డై స్వరాట్టగుచతురాననుండు

తే. జనన మందెను దత్పద్మసంభవుండు, [1]నామరూపగుణాదిసంజ్ఞానమేతుఁ
డగుచు నిర్మాణమొనరించెనఖిలజగము, వనజజుండు నిజచ్ఛాయవలన మఱియు.

సీ. తామిస్రమునునంధతామిస్రమును దమ.మును మోహనముమహామోహనంబు
ననుపంచమోహరూపాత్మక మైనయ,విద్యఁ బుట్టించి యవ్వేధఁ దనకు
నది తమోమయదేహ మని మది రోసి త, త్తనువు విసర్జించె ధాత్రిమున్న
దేహంబు సతతక్షుత్తృష్ణల కావాస,మును రాత్రిమయము నయ్యెను దలంప

తే. నందులో యక్షరక్షస్సులన జనింప, వారికప్పుడు క్షుత్తృషల్ వలలఁ గొంద
ఱాచతుర్ముఖు భక్షింత మనిరి కొంద, ఱతని రక్షింత మని తగ నాడి రంత.

వ. ఇట్లు వలుకుచు భక్షించువార లయి ధాతసన్నిధికిం జనిన నతండు భయవిహ్వలుం డై యేను మీజనకుండను మీరలు మత్పుత్రులరు నన్ను హింసింపకుం డనుచు మా మాజక్షిత రక్షత యనుశబ్దంబులు వలుకం దన్నిమిత్తంబున వార లకుం గ్రమంబున యక్షరక్షోనామంబులు ప్రకటంబు లయ్యె వెండియుం బ్రభా విభాసితం బైనయొక్కకాయంబు ధరియించి సత్త్వగుణగరిష్ఠులుం బ్రభావం తులు నగుసుపర్వులం బ్రముఖులంగా సృజియించి తత్ప్రభామయగాత్రవిసర్జనం బు సేసిన నది యహోరూపం బై దేవతాళికి నాశ్రయం బయ్యె మఱియు జఘ నంబువలన నతిలోలుపు లైనయసురలం బుట్టింప వార (లతికాముకు లగుటం జేసి య)య్యజునిం జేరి మిథునకర్మం బపేక్షించిన విరించి నగుచు నిర్లజ్జులయినయసు రులు దనవెంటం దగులం బఱచి ప్రపన్నార్తిహరుండును భక్తజనానురూపసం దర్శనుండును నైననారాయణుం జేరి తత్పాదంబులకుం బ్రణమిల్లి యిట్లనియె.

క. రక్షింపుము రక్షింపు ము,పేక్షింపక వినుతనిఖిలబృందారక వి
శ్వక్షేమంకర విను మిటు, దక్షత నీయాజ్ఞ నేను దల నిడి వరుసన్. 724

తే. ఈప్రజాసృష్టికల్పనం బే నొనర్ప, నందుఁ బాపాత్ము లైనయీయసురు లిపుడు

1 నామధేయాభిరూపసంజ్ఞా.

నను రమింపఁగ డాయ వచ్చినఁ గలంగి, యిటకు వచ్చితి ననుఁ గావు మిద్ధచరిత.

వ. అదియునుం గాక లోకంబువారలకుం గ్లేశంబు లొనరింపం గ్లేశంబునం బొందిన వారలక్లేశంబు లపనయింపను నీవ కాక (యితరులు గలరే) యని స్తుతియించినఁ బద్మజుకార్పణ్యం బెఱుంగ నవధరించి వివిక్తాధ్యాత్మదర్శనుం డగుచుఁ గమలసంభవ భవద్ఘోరతనుత్యాగంబు సేయు మని యానతిచ్చిన నతండు నట్ల చేసె నంత నదియును. 726

సీ. నవ్యకాంచనరణత్క్వణితనూపురారావ, విలసితపాదారవిందయుగళ
కాంచీకలాపసంకలితదుకూలవ, స్త్రస్ఫారపులినవితతంబబింబ
రాజితాన్యోన్యసంశ్లేషపీనకరికుంభ, పృథుకుచభారకంపితవలగ్న
మదిరారసాస్వాదమదవిఘూర్ణితచారు, సితనవవికచరాజీవనయన
తే. యపరపక్షాష్టమీశశాంకాభనిటల, మదవదలికులరుచిరోపమానచికుర
లలితచంపకకుసుమవిలాసనాస, హాసలీలావలోకన యబ్జపాణి. 727

క. అనఁ దగి సంధ్యారూపం, బున లలనారత్న మపుడు పుట్టిన దానిం
గనుఁగొని దానవు లుపగూ, హన మొగిఁ గావించి పలికి రందఱుఁ దమలోన్.

క. ఈసౌకుమార్య మీవయ, సీసౌందర్యక్రమంబు నీధైర్యంబు
న్నీ[1]సౌభాగ్యవిశేషము, నేసతులకుఁ గలదు చూడ నిది చిత్ర మగున్. 729

చ. అని వెఱఁ గంది యద్దనుజు లందఱు నిట్లని రీతిలోదరిం
గని మన మంతనుండియును గాముకవృత్తిఁ జరించుచుండఁగా
మనయెడ దీనిచిత్తమున మక్కువ లేమికి నేమిహేతువో
యని బహుభంగులం బలికి రాప్రమదాకృతి నైనసంధ్యతోన్. 730

వ. ఇట్లనిరి. 731

క. ఓకదళీస్తంభోరువ, యేకుల మేజాడదాన వెవ్వరిసుత వి
ట్లీకాంతంబున నిచ్చట, నేకారణమునఁ జరించె దెఱిఁగింపు తగన్. 732

క. భవదీయచారురూప, ద్రవిణలసత్పణ్యభూమిఁ దగుమోహమునం
దవిలినదుర్భరులను మముఁ, గవయవు పుష్పాస్త్రబాధ ఘన మయ్యెఁ గదే.

వ. [2]అని యంత. 734

సీ. గురుకుచభారసంకుచితావలగ్నంబు, దనరారునాకాశతలము గాఁగ
లలితపల్లవపాణితలమునఁ జెన్నొందు, చెందు పతత్పతంగుండు గాఁగ
సలలితనీలపేశలపృథుధమ్మిల్ల, బంధంబు ఘనతమపటలి గాఁగఁ
బ్రవిమలతరకాంతిభావవిలోకన, జాలంబు దారకాసమితి గాఁగఁ
తే. గడఁగి మైపూఁత సాంధ్యరాగంబు గాఁగ
నంగనాకృతి నొప్పుసంధ్యావధూటిఁ

1 సౌబగు నీవిశేషము. 2. మఱియుఁ దదీయసౌందర్యం బుగ్గడింప నలవి కాక చింతించుచు.

గదిసి మనముల మోహంబు । గడలుకొనఁగ
నసురు లందఱుఁ గూడి యి । ట్లనిరి మఱియు. 735

క. వెలయఁగఁ బద్మం బేక, స్థలముననే యొప్పుఁ గాని । త్వత్పదపద్మం
బిల బహుగతుల ననేక,స్థలములఁ దనరారుఁ గాదె । తరుణాబ్జముఖీ. 736

క. అని దనుజులు దమమనముల, ననురాగము లుప్పతిల్ల । నందఱు నాసం
ధ్యను బట్టికొనిరి వనజా,సనుఁ డప్పుడు హృదయమందు । సంతస మందెన్.

క. సరసిజభవుఁ డయ్యెడఁ దన, కర మాఘ్రాణింప నపుడు । గంధర్వులు న
ప్సరసలుఁ బుట్టిరి ధాతయుఁ, బరువడి నాత్మీయతనువుఁ । బాసిన నదియున్. 738

వ. చంద్రికారూపంబైనఁ దద్గాత్రంబు (విశ్వావసుపురోగము లగు) గంధర్వాప్సరో
గణంబులు గైకొనిరి వెండియుం గమలగర్భుండు దంద్రోన్మాదజృంభికానిద్రా
రూపం బైనశరీరంబు దాల్చి పిశాచగుహ్యకసిద్ధభూతగణంబులం బుట్టించిన
వారలు దిగంబరులు ముక్తకేశులు నయినం జూచి ధాత లోచనంబులు ముకు
ళించి తద్గాత్రంబు విసర్జనంబు గావించిన నది వారలు గైకొనిరి వెండియు
నజుండు దన్ను నన్నవంతునిఁ గాఁ జింతించి యదృశ్యదేహుం డగుచుం బితృ
సాధ్యగణంబులం బుట్టించిన వారలు దమ్ముఁ బుట్టించినయదృశ్యశరీరంబునకుం
గార్యం బగుదేవభాగంబుఁ గైకొనినం దత్కారణంబునం బితృసాధ్యగణంబుల
నుద్దేశించి శ్రాద్ధంబుల హవ్యకవ్యంబు లాచరింతురు మఱియును. 739

సీ. సజ్జనస్తుత విను । చతురతఁ బంకజా,సనుఁడు దిరోధాన । శక్తివలన
నరసిద్ధవిబుధకి । న్నరులను బుట్టించి, తవిలి వారికిఁ దిరో । ధాననామ
ధేయ మైనట్టియా । దేహంబు నిచ్చెను, వెండియు భారతీ । విభుఁడు దనకుఁ
బ్రతిబింబ మగుశరీ । రమునఁ గిన్నరులఁ గిం,పురుషులఁ బుట్టింపఁ । బూని వారు

తే. ధాతృప్రతిబింబదేహముల్ । దాల్చివరుస,నిద్దఱిద్దఱు గవగూడి । యింపులొదవ
బ్రహ్మపర మైనగీతముల్ । పాడుచుండి, రంతఁ బంకజసంభవుఁ । డాత్మలోన.

క. తనసృష్టి వృద్ధి లేమికిఁ, గనలుచు శయనించి చింతఁ । గరచరణాదుల్
గొనకొని కదలింపఁగ రా, లినరోమము లుగ్రకుండ । లివ్రజ మయ్యెన్. 741

క. వనజజుఁడు దన్నుఁ గృతకృ,త్యునిఁ గా భావించి యాత్మఁ । దుష్టి వహింపన్
మనమున నిఖిలజగత్పా,వను లగు[1]మనులం ద్రిలోక । వరుల సృజించెన్. 742

సీ. పుట్టించి వారికిఁ । బురుషరూపం బైన, తనదేహ మిచ్చినఁ । దగిలి వారు
గనుఁగొని మున్ను పు । ట్టినవారిఁ గూడి యా,వనజసంభవున కి । ట్లనిరి దేవ
యఖిలజగత్స్రష్ట । వైననీచేతఁ గా,వింపఁగఁబడినయీ । వితతసుకృత
[2]మాశ్చర్యకరము య । జ్ఞాదిక్రియాకాండ, మీమనుసర్గ మం । దీడ్య మయ్యెఁ

1 బ్రహ్మణ్యముఖ్యవరుల. 2 మాశ్చర్యకర మయ్యె ♦ నందు యజ్ఞాదిక్రి,యాకాండ మిది నిశ్చ ♦యంబు నొందె.

తే. దద్ధవిర్భాగములు మాకుఁ దవిలి జిహ్వ
లందు నాస్వాదనములు సేయంగఁ గలిగె
ననుచు మనముల హర్షంబు లతిశయిల్ల
వినుతి సేసిరి భారతీవిభుని మఱియు. 743

వ. వరతపోయోగవిద్యాసమాధియుక్తం బగుచు ఋషి వేషధరుండును హృషీకాత్ముం
డును నై ఋషిగణంబులం బుట్టించి సమాధియోగైశ్వర్యతపోవిద్యావిరక్తియుక్తం
బగు నాత్మీయశరీరాంశంబు వారికిం గ్రమంబున నొక్కొక్కనికి నిచ్చె నని మైత్రే
యుండు సెప్పిన విని విదురుండు పరమానందంబునం బొంది గోవిందుచరణార
విందంబులు డెందంబునం దలంచి వెండియు మైత్రేయునిం జూచి యిట్లనియె.

సీ. మునినాథ స్వాయంభు వనుమనువంశంబు, పరమసమ్మతము దప్పదు తలంపఁ
గొనకొని తద్వంశమున మిథునక్రియఁ, జేసి ప్రజావృద్ధిఁ జెప్పి తీవు
అదియును గాక స్వాయంభువమనువుకుఁ, బూని ప్రియవ్రతోత్తానపాదు
లనునందనులు గల రంటివి వారు స, ప్తద్వీపవతి యైనధాత్రి నెల్ల
తే. ధర్మమార్గంబు లేమియుఁ దప్పకుండ, ననఘు లై యెట్లు పాలించి రయ్య వారి
చరిత మెల్లను సత్కృపానిరతబుద్ధి, నెఱుఁగ వినిపింపు నాకు మునీంద్రచంద్ర.

వ. అదియునుం గాక తన్మనుపుత్త్రియు యోగలక్షణసమేతయు నగు దేవహూతి యను
కన్యకారత్నంబును స్వాయంభువుండు గర్దమునకు నేవిధంబునం బెండ్లి చేసె నా
దేవహూతియందు మహాయోగి యయినకర్దముండు ప్రజల నేలాగునం బుట్టించె
నదియునుం గాక కర్దముండు రుచి యనుకన్యను దక్షప్రజాపతికి నిచ్చె నని
చెప్పితి వారుచియందు నమ్మహాత్ముం డేసృష్టి నేలాగునం బుట్టించె నవి యన్ని
యుం దెలియ నానతీయవలయు నని యడిగిన విదురునకు మైత్రేయుం డిట్లనియె.

—కర్దముఁడు భగవదనుజ్ఞ వడసి దేవహూతిని బెండ్లి యాడుట.—

క. విను మనఘ కృతయుగంబున, మునినాథుం డయినకర్దముఁడు ప్రజల సృజిం
పను వనజసంభవునిచే,త నియుక్తుం డగుచు మది ముదము సంధిల్లన్. 747
తే. ధీరగుణుఁడు సరస్వతీతీరమందుఁ, దవిలి పదివేలదివ్యవత్సరము లోలిఁ
దపము సేయుచు నొకనాఁడు జపసమాధి, నుండి యేకాగ్రచిత్తుఁడై నిందువేడ్క.
క. వరదుఁ బ్రసన్ను మనోరథ, వరదానసుశీలు నమరవంద్యు రమేశున్
దురితవిదూరు సుదర్శన, కరుఁ బూజించిన నతండు కరుణాకరుఁడై. 749
వ. అంతరిక్షంబునం బ్రత్యక్షం బైన. 750
సీ. తరణిసుధాకర[1]కిరణసమంచిత, సరసీరుహోత్పలస్రగ్విలాసుఁ
గంకణనూపురగ్రైవేయముద్రికా, హారకుండలకిరీటాభిరాముఁ
గమనీయసాగరకన్యాకౌస్తుభ, మణిభూషణోద్భాసమానవక్షు

---

1 కిరణదరాంచిత.

సలలితదరహాసరుచిచంద్రికాధవళిత,చారుదర్పణవిరాజితగండభాగుం
తే. శంఖచక్రగదాపద్మచారుహస్తు, నలికులాలకరుచిభాస్వదలికఫలకుఁ
బీతకౌశేయవాసుఁ గృపాతరంగి,తస్మితేక్షణుఁ బంకజోదరుని హరిని. 751
వ. మఱియు శబ్దబ్రహ్మశరీరవంతుండును సదాత్మకుండును జ్ఞానైకవేద్యుండును నైన తేజోంశవిన్యస్తచరణారవిందుండును నయినగోవిందుని గనుంగొని సంజాతహర్షలహరీపరవశుండును లబ్ధమనోరథుండును నగుచు సాష్టాంగదండప్రణామంబు లాచరించి తదనంతరంబ. 752
క. ముకుళితకరకమలుం డయి, యకుటిలసద్భక్తిపరవశాత్మకుఁ డగుచుం
వికచాంభోరుహలోచను,నకు ని ట్లనియెం దదాననమునుఁ గనుఁగొనుచున్. 753
సీ. అజ్ఞాక్ష సకలభూతాంతరాత్ముఁడ వనఁ, దనరు చుండెడిభవద్దర్శనంబుఁ
దలకొని సుకృతసత్ఫలభరితంబు లై,నట్టియనేకజన్మానుసరణిఁ
బ్రకటయోగక్రియాభ్యాసనిరూఢు లై,నట్టియోగీశ్వరు లాత్మ నిచ్ఛ
యింతురు యోగీశ్వరేశ్వర నీ భవ,త్పాదారవిందసందర్శనంబు
తే. గంటి భవవార్ధి గడవంగఁ గంటి మంటిఁ,గడఁగినాలోచనంబులకలిమి నేఁడు
తవిలి సఫలత నొందె మాధవ ముకుంద, చిరదయాకార నిత్యలక్ష్మీవిహార.
వ. అదియునుం గాక దేవా భవదీయమాయావిమోహితు లై హతమేధస్కు లై సంసారపారావారోత్తారకంబు లైనభవదీయపాదారవిందంబులు దుచ్ఛవృత్తికాము లయి సేవించి నిరయగతు లైనవారికిం దత్కాలమయోగ్యంబు లగు మనోరథంబుల నిత్తు వట్టికాము లైనవారి నిందించునేనును (గృహమేధధేనువు నశేషమూలయుం) త్రివర్గకారణయు సమానశీలయును నయినభార్యం బరిణయంబుగా నపేక్షించి కల్పతరుమూల(సదృశ)ంబు లైనభవదీయపాదారవిందంబులు సేవించితి నయిన నొక్కవిశేషంబు గలదు విన్నవించెద నవధరింపుము బ్రహ్మాత్మకుండ వయినభవదీయవచస్తంత్రీనిబద్ధు లై లోకులు కామహతు లై రఁట యేనును వారల ననుసరించినవాఁడ నై కాలాత్మకుండ వైననీకు నభిమతం బగునట్లుగాఁ గ్రమయం బైనభవదాజ్ఞాచక్రంబు ననుసరించుటకుఁ గాని మదీయకామంబు కొఱకుఁ గాదు భవదీయమాయావినిర్మితంబును ([1]గాలాత్మకభూరివేగసమాయుక్తంబును నక్షరంబును నైనబ్రహ్మంబునందు భ్రమణశీలంబును)నధిమాససమేతత్రయోదశమాసారంబును షష్ట్యుత్తరశతత్రయాహోరాత్రమయపర్వంబును ఋతుషట్కసమాకలితనేమియుం జాతుర్మాస్యత్రయవిరాజితనాభియు నపరిమితక్షణలవాదిపరికల్పితపత్త్రశోభితంబునుం గాలాత్మకభూరివేగసమాయుక్తంబును నైనకాలచక్రంబు సకలజీవనికరాయుర్గ్రసనతత్పరం బగుం గాని కామాభిభూతజనానుగతపశుప్రాయు లగులోకుల విడిచి భవపరితాపనివారణకారణం బయిన

1 'బ్రహ్మాత్మకంబును' అని వ్రాతప్రతులు.

భవదీయచరణాతపత్రచ్ఛాయాసమాశ్రయులై తావకీనగుణకథనసుధాస్వాదనరుచిరలహరీనిరసితసకలదేహధర్ములైన భగవద్భక్తజనాయుర్హరణసమర్థంబు గాకుండు నని వెండియు. 755

మ. అనఘా యొక్కఁడ వయ్యు నాత్మకృతమాయాజాతసత్త్వాదిశ
క్తినికాయస్థితి నీజగజ్జననవృద్ధిక్షోభహేతుప్రభా
వనిరూఢిం దగు దూర్ణనాభిగతి విశ్వస్తుత్య సర్వేశ నీ
ఘనలీలామహిమార్ణవంబుఁ గడవంగా వచ్చునే యేరికిన్. 756

వ. దేవా శబ్దాదివిషయసుఖకరం బగురూపంబు విస్తరింపం జేయు టెల్ల నస్మదనుగ్రహార్థంబు గాని నీకొఱకుం గాదా త్మీయమాయాపరివర్తితలోకతంత్రంబు గలిగి మదీయమనోరథసుధాప్రవర్షివై ననీకు నమస్కరించెద. 757

మ. అని యిబ్భంగి నుతించినన్ విని సరోజాక్షుండు మోదంబునన్
వినతానందనకంధరోపరిచరద్విభ్రాజమానాంగుఁడు
స్మనురాగస్మితచంద్రికాకలితశోభాలోకుఁడు నై మునీం
ద్రునిఁ గారుణ్య మెలర్పఁ జూచి పలికెన్ రోచిష్ణుఁడై వేడ్కతోడిన్. 758

క. మునివర యేకోరిక నీ, మనమునఁ గామించి నను సమంచితభక్తిన్
ఘనగుణఁ బూజించితి నీ, కనయము నాకోర్కి సఫల మయ్యెడుఁ జుమ్మీ. 759

వ. అని యాన తిచ్చి ప్రజాపతిపుత్త్రుండును సమ్రాట్టును నైనస్వాయంభువమనువు బ్రహ్మావర్తదేశంబునందు సప్తార్ణవమేఖలామండితమహీమండలంబుఁ బరిపాలించుచున్నవాఁ డమ్మహాత్ముం డపరదివసంబున[1] నింతులకు శతరూప యనుభార్యాసమేతుం డై భర్తృకామ యగుకూఁతుం దోడ్కొని భవదీయసన్నిధికిం జనుదెంచి నిను ననురూపవయశ్శీలసంకల్పగుణాకర యైనతనపుత్త్రిం బరిణయంబు గావించు భవదీయమనోరథంబు సిద్ధించు ననుం జిత్తంబున సంస్మరించుచుండు నమ్మునికన్య నిను వరించి భవద్వీర్యంబువలన నతిసౌందర్యవతు లగునకన్యలం దొమ్మండ్రం గను నాకన్యకాసవకంబునందు మునీంద్రులు పుత్త్రోత్పాదనంబులు సేయంగలరు నీవు మదీయశాసనంబును ధరియించి మదర్పితాశేషకర్ముండ వగుచు నైకాంతికస్వాంతంబున భూతాభయదానదయాచరితజ్ఞాని వై నాయందు జగంబులు గల వనియు నీయందు నేఁ గల ననియు నెఱింగి సేవింపుము చరమకాలంబున ననుం బొందఁగలవు భవదీయవీర్యంబువలన నేను నీభార్యాగర్భంబుఁ బ్రవేశించి మత్కళాంశంబునఁ (బుత్త్రుండ నై) సంభవించి నీకుం దత్త్వసంహిత నుపన్యసింతు నని జనార్దనుండు గర్దమున కెఱింగించి యతండు గనుంగొను చుండ నంతర్హితుం డై. 760

చ. అతులసరస్వతీసరిదుదంచితబాలరసాలసాలశో

1 డ ట్లుండి యింతులకు.

భితతటతుంగరంగ మగుబిందుసరంబు వినిర్గమించి యం
చితగరుడావరోహణము సేసి తదీయగరుత్ప్రభూతరు
క్ప్రతతివిలక్షణక్రమవిరాజితసామము వించు మోది యై. 761

చ. అరిగె వికుంఠధామమున కంత సకామునఁ డైన కర్దముం
డరయ విమోహి యై మనమునందలిముందటవచ్చుకోరికల్
పరిగొనుచుండఁ దత్క్షణమ బిందుసరంబున కేఁగి యిందిరా
వరుఁ దలపోయుచుండె జనవంద్యుఁడు భక్తినితాంతచిత్తుఁ డై. 762

వ. అంత స్వాయంభువుండు కనకరథారూఢుం డగుచు నిజభార్యాసమేతుఁ డై భర్తృవాంఛాపర యైనపుత్త్రికం దోడ్కొనుచు నిజతనూజకుం దగినవరు నన్వేషించుచు భువనంబునం గలయం గ్రుమ్మరి యెంమనుం గానక వచ్చి వచ్చి. 763

ఉ. ముందటఁ గాంచె నంత బుధముఖ్యుఁడు విష్ణుఁడు కర్దముం దయా
నంద మెలర్పఁ జూడ నయనంబుల రాలినబాష్పముల్ ధరన్
బిందువు లై వెసం దొరఁగి పేర్చి సరస్వతిఁ జుట్టి పాఱుటన్
బిందుసరోవరం బనెడిపేరఁ దనర్చినపుణ్యతీర్థమున్. 764

ఉ. అందుఁ దమాల సాల వకుళార్జున నింబ కదంబ పాటలీ
చందన నారికేళ ఘనసార శిరీష లవంగ లుంగ మా
కంద కుచందన క్రముక కాంచన బిల్వ కపిత్థ మల్లికా
కుంద మధూక మంజులనికుంజములం దనరారి వెండియున్. 765

క. పరిపక్వఫలభరానత, తరుశాఖానికరనివసితస్ఫుటవిహగో
త్కరబహుకోలాహలరవ, భరితదిగంతములు గలిగి భవ్యం బగుచున్. 766

క. అతినిశితచంచుదళన, క్షతనిర్గతపక్వఫలరసాస్వాదనమో
దితరాజశుకవచోర్థ, శ్రుతిఘోషము సెలఁగ శ్రవణసుఖదం బగుచున్. 767

క. లలితసహకారపల్లవ, కలితాస్వాదనకషాయకంఠవిరాజ
త్కలకంఠపంచమస్వర, కలనాదము లుల్లసిల్లఁ గడు రమ్యము లై. 768

క. అతులతమాలమహీజ, ప్రతతిక్షణజాతజలదపరిశంకాంగీ
కృతతాండవఖేలనవిల, సితపింఛవిభాసిబాలశిఖిసేవ్యం బై. 769

క. కారండవ జలకుక్కుట, సారస బక చక్రవాక షట్పద హంసాం
భోరుహ కైరవ నవక, హ్లార విరాజితసరోగృహాకరయుత మై. 770

క. కరి పుండరీక వృక కా, సర శశ భల్లూక హరిణ చమరీ హరి సూ
కర ఖడ్గ గవయ వలిముఖ, శరభ ప్రముఖోగ్ర వన్యసత్త్వాశ్రయ మై. 771

వ. ఒప్పునప్పరమతాపసోత్తమునియాశ్రమంబుఁ గనుంగొని మితపరిజనంబులతోడం జొచ్చి యందు. 772

సీ. అంచితబ్రహ్మచర్యవ్రతయోగ్య మై, విలసిల్లుఘనతపోవృత్తిచేత

దేహంబు రుచిరసందీప్తమై చెలువొందఁ, గడుఁ గృశీభూతాత్మకాయుఁ డయ్యు
నలినోదరాలాపనవసుధాపూరంబు, శ్రోత్రాంజలులఁ ద్రావి చొక్కి యున్న
కతనఁ గృశీభూతకాయుండు గాక జటావల్కలాజినశ్రీ వెలుంగఁ

తే. కమలపత్రవిశాలనేత్రములు దనర, నలినసంస్కారసంచితానర్ఘ్యమూర్తి
రత్నమును బోలియున్న కర్దమునిఁ జూచి, భక్తి నమ్మను వెరఁగె దత్పాదములకు.

వ. ఇట్లు వందనంబు గావించినం గర్దముండు దనగృహంబునకు విందై చనుదెంచిన యమ్మనువు నాదరించి యర్ఘ్యపాద్యాదివిధులం బరితుష్టునిం గావించి పూర్వోక్తం బైన భగవదాదేశంబు సంస్మరించి స్వాయంభువున కి ట్లనియె. 774

సీ. వరగుణాకర భగవద్భక్తియుక్తుఁడ, వైన త్వదీయపర్యటన మెల్ల
శిష్టపరిగ్రహదుష్టనిగ్రహములఁ, గోఱకుఁ గదా పుణ్యపురుష మఱియు
వనజహితాహితవహ్నిసమీరవై, వస్వతివార్ధిపవాసవాత్మ
కుఁడవు హరిస్వరూపుఁడ వైన నీకును, మానితభక్తి నమస్కరింతు

తే. ననఘ నీ విప్పు డే నేమియఖిలలోక, జైత్ర మగు హేమమణిమయస్యందనంబు
నెక్కి కోదండపాణి వై యుగ్రసైన్య, పదవిఘట్టనచే భూమిభాగ మగల. 775

మ. తరణింబోలెఁ జరింప కున్న ఘననిద్రం బొంది [1]యెందేని భూ
వర పక్షోదరకల్పితంబు లగుసీరవర్ణాశ్రమోదారవి
స్తరపాథోనిధిసేతుభూతమహిమాచారక్రియల్ దప్పి సం
కరమై చోరభయంబునన్ నిఖిలలోకంబుల్ నశించుం జుమీ. 776

వ. అని పలికి భవదాగమనంబునకు నిమిత్తం బెయ్యది యనవుడు సమాహితసకల నిత్యకర్మానుష్ఠానుండైన మునీంద్రునకు స్వాయంభువుం డి ట్లనియె. 777

క. సరసిజగర్భుఁడు దనచే, విరచిత మైనట్టి వేదవితతుల నెల్లన్
ధర వెలయించుటకై బుధ,వర మిమ్ముం దనముఖంబువలన సృజించెన్. 778

క. దురితస్వరూపపాట, చ్చరపీడం బొందకుండ సకలక్షోణిం
బరిపాలించుటకై మము, నరవిందభవుండు భుజములందు సృజించెన్. 779

క. నెఱి నట్టిజలజభవునకుఁ, [2]గర మంతఃకరణగాత్రకము లై వరుసం
బరఁగిన బ్రహ్మక్షత్త్రము, లరయ రమాధీశ్వరునకు నవనీయంబుల్. 780

వ. కావున హరిస్వరూపుండ వై దుర్దర్శనుండ వయిన [3]నినుం గనుట మదీయ భాగ్యంబున సిద్ధించె భవత్పాదకంజకింజల్కపుంజరంజితం బైన మదీయమస్తకంబును దావకవచనసుధాపూరితంబు లైన శ్రవణంబులును మంగళాకరత్వంబున సాఫల్యంబునం బొందె నేను గృతార్థుండ నైతి దుహితృస్నేహదుఃఖపరిచ్ఛిన్నాంతఃకరణుండ(నై సకలదేశభ్రమణఖిన్నుండ) నయిన నావిన్నపం బవధరింపు మని యి ట్లనియె. 781

1 యెందేని. 2 'కరుణాంతఃకరణ. 3 భవద్దర్శనంబు మదీయ' వ్రా. ప్ర.

మ. వరయోగీశ్వర దేవహూతి యనునీవామాక్షి మత్పుత్రి దా
వరలావణ్యగుణాఢ్యులన్ వినియు నెవ్వారిన్ మదిం గోర కా
తుర యై నారదుపంపునన్ మిము వరింతు న్నంచు నేతెంచె నీ
తరుణీభిక్షఁ బరిగ్రహింపుము శుభోదాత్తక్రియాలోలతన్. 782

క. అమలినగృహమేధికక, ర్మములకు ననురూపగుణవిరాజితశీల
క్రమములఁ దనరినతరుణిం, బ్రమదమున వరింపుమయ్య భవ్యచరిత్రా. 783

క. అనఘ విరక్తుల కైనం, దనయంత లభించుసౌఖ్యతతి వర్జింపం
జన దఁట కాముకులకు న, బ్బిన మానుదురే లభించుప్రియసౌఖ్యంబుల్. 784

క. వినుము ఫలారంభుఁడు గృప, ణుని నడిగినఁ దనయశంబు నుం దగుమానం
బును జెడుఁ గావున నీవును, నెనయ వివాహేచ్ఛఁ దగులు[1] టెఱిఁగి యిచటికిన్.

క. చనుదెంచితి మస్మత్ప్రా, ర్థనఁ గైకొని మత్తనూజఁ దగ వరియింపుం
డన ముని స్వాయంభువునిం, గనుఁగొని మఱలంగఁ బలికెఁ గడుముద మొప్పన్.

సీ. అనఘ నీచేత నననన్యవత్తముగఁ బ్రతిష్ఠితం బైనయీ తీవఁబోఁడి
కమనీయరూపరేఖావిలాసంబుల, మానితలక్ష్మిసమాన యగుచు
నొకనాఁటిరాత్రియం దుడురాజచంద్రికా, ధవళితనిజసౌధతలమునందు
మహిత[2]హిరణ్మయమంజీరశోభిత, చరణ యై నిజసఖీసహిత యగుచుఁ

తే. గందుకక్రీడఁ జరియింప గగనమందు, వరవిమానస్థుఁ డగుచు విశ్వావసుండు
నాఁగఁ దనరినగంధర్వనాయకుండు, తరుణిఁ జూచి విమోహియై ధరణిఁ బడియె.

తే. పుండరీకాక్షు నెఱుఁగనిపురుషపశువు, లీలతలోదరిఁ బొడగాన రేమి సెప్ప
నట్టి[3]కొమరాలు భాగ్యోదయమునఁ దాన, వచ్చి కామింపనొల్లనివాఁడు గలఁడె.

క. ఈకన్యారత్నమునకు, నాకును గుణరూపవర్తనంబులయెడ నా
లోకింప సమమ కావునఁ, గైకొని వరియింతు విగతకల్మషవృత్తిన్. 789

క. విమలాత్మ దీని కొకసమ, యము గల దెఱిఁగింతు విను గుణాకర యగునీ
రమణికి నపత్యపర్యం, తము వర్తింపుదు గృహస్థధర్మక్రియలన్. 790

ఆ. అంతమీఁద విష్ణునాజ్ఞ యాదలఁ దాల్చి, శమదమాదియోగసరణిఁ బొంది
సన్న్యసించువాఁడ జలజనేత్రునివాక్య, కారణమునఁ జేసి ధీరచరిత. 791

క. శ్రీవిభునివలన నీలో, కావళి యుదయించుఁ బెరుఁగు నడఁగును విను రా
జీవభవాదుల కతఁడే, భూవర నిర్వాణహేతుభూతుం డరయన్. 792

వ. అది గావున నమ్మహాత్మునియాజ్ఞోల్లంఘనంబు సేయ రా దని కర్దముండు వలికిన విని స్వాయంభువుండు నిజభార్య యైనశతరూపతలంపును బుత్రి యైనదేవహూతిచిత్తంబును నెఱింగినవాఁడై మునిసమయంబున కియ్యకొని ప్రహృష్టహృదయుం డగుచు సమంచితగుణగణాఢ్యుం డయినకర్దమునకు దేవహూతిని విధ్యు

1 'టెఱిఁ గేమిటకున్' వ్రా. ప్ర. 2 రణన్మణిమంజీర. 3 'కోమలి' వ్రా. ప్ర.

క్తప్రకారంబున వివాహంబు సేయించె దదనంతరంబు శతరూపయును బారిబర్హ సంజ్ఞికంబు లైనవివాహోచితదివ్యాంబరాభరణంబులు దేవహూతికర్దముల కొసంగె నివ్విధంబున నిజకులాచారసరణిం బరిణయంబు గావించి విగతచింతాభరుండై స్వాయంభువుండు దుహితృవియోగవ్యాకులితచిత్తుం డగుచుఁ గూఁతుం గౌఁగిలించుకొని చుబుకంబుఁ బుడుకుచుఁ జెక్కిలి ముద్దుగొని శిరంబు మూర్కొని ప్రేమాతిరేకంబున బాష్పధారాసిక్తమస్తకం జేసి తల్లీ పోయివచ్చెద నని చెప్పి కర్దమునిచేత నామంత్రితుండై నిజభార్యాసమేతుండై రథం బెక్కి సపరివారుండై.

చ. తరళతరంగవీచిసముదంచితబిందుసరస్సరస్వతీ
సరిదరవిందతుందిలలసత్తరుతీరనివాససన్మునీ
శ్వరనికరాశ్రమాకలితసంపదలం గనుఁగొంచు వేడ్క ము
ప్పిరిగొన నేఁగె నాత్మపుటభేదనవిస్ఫుటమార్గవర్తి యై. 794

వ. ఇట్లు సని చని బ్రహ్మావర్తదేశంబునందు. 795

సీ. ఎందేనిఁ దొల్లి లక్ష్మీశుండు యజ్ఞసూ,కరమూర్తిఁ గైకొని సరభసమున
నొడలు జాడించినఁ బుడమిపై రాలిన,రోమజాలంబులు రుచిరహరిత
వర్ణమై పొలుపారు వరకుశకాశము, లుంబును యజ్ఞక్రియాకలాప
యోగ్యంబు లై చాలనొప్పారి బర్హిస్సు, సంభవించిన దాన సకలఋషులుఁ

తే. గ్రతువులొనరించి తద్విష్ణు కారులైన,యసురులను ద్రుంచి రట్లు స్వాయంభువుండు
విష్ణుపరముగ మఖము గావించి రుచిర, మేధఁ జెలువొందె నట్టియాతీయపురము.

క. డాయం జనఁ బురజనములు, పాయనములు దెచ్చి యిచ్చి బహుగతులనుతుల్
సేయఁగ మంగళతూర్యము, లాయతిగతి మొరయఁ జొచ్చె నంతఃపురమున్.

వ. ఇట్లు ప్రవేశించి తాపత్రయోపశామకం బగు భగవద్భక్తి వృద్ధిఁ బొందించుచుఁ బుత్రమిత్రకళత్రసుహృద్బాంధవసహితుం డై పరమానందంబున. 798

మ. అతిభక్తిం బ్రతివాసరంబును హరివ్యాసంగుఁ డై మాధవాం
కితగంధర్వవిపంచికాకలితసంగీతప్రబంధానుమో
దితుఁ డై యిష్టవిభూతులందు ననురక్తిం జెంద కేప్రొద్దు న
చ్యుతసేవైకపరాయణుం డగుచు సత్స్తోకప్రభావోన్నతిన్. 799

మ. హరిపాదాంబురుహద్వయార్పితతులస్యామోదముం గొంచుఁ ద
చ్చరితంబుల్ దలపోయుచుం బొగడుచుం జర్చించుచుం వించుఁ ద
త్పరిచర్యావ్యతిరిక్తసంసరణసద్ద్వారకామంబులం
బరిభూతంబులఁ జేసి మోక్షపదసంప్రాప్తిక్రియారంభుఁ డై. 800

క. నిగమార్థగోచరుం డనఁ, దగుహరిచరితప్రసంగతత్పరచిత్తుం
డగునతనికి [1]మన్వంతర, మగుయామము లొగి నయాతయామములయ్యెన్.

---

1 'స్వాంతరగము, లగుయామము.

సీ. వెండియు నమ్మేటిఽవిష్ణుమంగళకథా, కర్ణనధ్యానానుఽరాగానుతులు
సలుపుచు దా స్వప్నఽజాగ్రత్సుషుప్తులఁ, దలఁగించి యాపుణ్యఽతముఁడు దాను
జక్రిదాసుఁడు గాన ఽ శారీరమానస,దివ్యమానుషభౌతిఽకవ్యథలను
దగులక సన్మునీంఽద్రశ్రేణి[1]తోఁగూడఁ, దనరువర్ణాశ్రమఽధర్మగతులు
తే. దప్పకుండంగ నడపుచుఁ ఽ దగిలి సర్వ,భూతహితవృత్తి నతులవిఽఖ్యాతలీల
నేకసప్తతియుగము లఽస్తోకచరితుఁ, డగుచు వర్తించె సమ్మోద ఽ మతిశయిల్ల.
క. అని యమ్మనుచరితము విను,గన మైత్రేయమునివఽరుఁడు దయతోఁ దగ
వినిపించి కర్దమునికథ, దనరఁగ నెఱిఁగింతు నని ముఽదంబునఁ బలికెన్. 803

కర్దమప్రజాపతి యోగభావంబుచే విమానంబు గల్పించి భార్యతోఁ గూడఁ దాను విహరించుట.

వ. ఇట్లు స్వాయంభువుండు దేవహూతిం గర్దమునికి వివాహంబు సేసి మరలి చనినం దదనంతరంబ దేవహూతియుఁ బతిభక్తి గలిగి భవునికి భవాని పరిచర్య సేయు చందంబునఁ బతియ తనకు నేడుగడయుం గా నెఱింగి యమ్మునీంద్రుని చిత్తవృత్తి కొలఁది దినదినంబునకు భక్తితాత్పర్యస్నేహభయంబులు రెట్టింపం బ్రియశుశ్రూషణంబులు గావించుచు ననూనతేజోవిరాజిత యగుచుఁ గామక్రోధదంభలోభాదిగుణవిరహిత యై శరీరశుద్ధి వహించి చతురసౌహార్దస్నేహంబులు గలిగి పతియ దైవంబుగా భావించి మృదుమధురవచనరచన యై పతిభక్తి నేమఱక వర్తింప దైవయోగంబు నైనను దప్పింప సమర్థుం డైనకర్దముండు నిజసేవాయాసకృశీభూతదేహ యై యున్న దేవహూతిం గరుణాతరంగితాపాంగుం డై కనుంగొని మంజుభాషణంబుల ని ట్లనియె. 804

ఉ. మానితధర్మమార్గమహిఽమస్ఫుటభూరితపస్సమాధివి
ద్యానిభృతాత్తయోగసముఽపార్జితవిష్ణుకటాక్షలబ్ధశో
భానఘదివ్యభోగబహుఽభద్రవితానము లస్మదీయసే
వానిరతిన్ లభించు ననిఽవారణ నిత్తును దివ్యదృష్టియున్. 805
తే. నెలఁత తద్దివ్యదృష్టి నఽన్నియును నీకుఁ, గానవచ్చు విలోకింపు ఽ కమలపత్త్రి
నయనబొమముడిమాత్రనఽనాశమందు,నితరమగుతుచ్ఛభోగంబుఽ లేమి సెప్ప.
సీ. అనుపమరాజ్యదఽర్పాంధచేతస్కులై, పాపవర్తను లైనఽపార్థివులకు
ధృతిఁ బొంద రానియీఽదివ్యభోగంబులు, నీదుపాతివ్రత్యఽనిష్ఠఁ జేసి
సంప్రాప్తములు నయ్యె ఽ సమత భోగింపుము, [2]కార్యసిద్ధియు నగుఁఽగాక నీకు
ననుటయు నతివయు ఽ ననుపమయోగమా,యావిచక్షణశాలి ఽ యైనకర్ద
తే. మునిఁ గనుంగొని[3]విగతాధిఽయును నపాంగ,కలితలజ్జానతాస్యపంఽకజయునగుచు
వినయ[4]సౌహార్దములఁ జేసి ఽవిహ్వలంబు, లయినపలుకులఁ బతికి నిఽట్లనియెఁ బ్రీతి.

---

1 ‘ఇందఁగ’ అ. ప్ర. 2 ‘కార్యసిద్ధ్యర్థ్యయ్యెడుఁగాక’ వ్రా. ప్ర. 3 నిశ్చింతయును. 4 ‘ప్రణయములంజేసి’ వ్రా. ప్ర.

వ. అనఘా (యమోఘ) యోగమాయావిభుండవు[1] సమర్థుండవు నయిననీయందు నీయ
నుపమదివ్యభోగంబులు గలుగుట నిక్కం బని యెఱుంగుదు భవత్సంగతి నన్ని
యు నాకుం గలుగు నయినను దేవా నీ వానతిచ్చినసంతానపర్యంతం బైనశరీర
సంగమసమయంబు చిత్తంబునం దలంచి భవదంగసంగమంబుఁ గృపసేసి మన్నిం
పుము భవదీయసంయోగవాంఛాపరతం గృశీభూతం బయిన యీ దేహం బేవిధం
బున మజ్జనభోజనపానసుఖంబులం బరితుష్టిం బొందు నట్టిమన్మనోరథంబుఁ దీర్ప
రతితంత్రం బగు కామశాస్త్రప్రకారం బుపశిక్షించి యందులకు నుచితంబులయిన
వివిధాంబరాభరణమాల్యానులేపన మందిరారామ ప్రముఖనిఖిలవస్తువిస్తారంబు
గావించి నన్నుం గరుణింపు మనిన నమ్మహాత్ముండు నిజయోగమాయాబలంబునం
దత్క్షణంబ. 808

సీ. దివ్యమణిస్తంభదీప్తిఁ జెన్నొందుచు, మరకతస్థలములమహిమ దనర
వరవజ్రకుడ్యకవాటశోభితము లై, విద్రుమదేహళీవీథు లమరఁ
గొమరొప్ప నవశాతకుంభకుంభములపై, హరినీలశకలవిస్ఫురణ మెఱయఁ
దగఁ బద్మరాగంపుమొగడలఁ జెలువొందు, వైదూర్యవలభులు వన్నెఁజూపఁ
తే. దరళతరధూతకేతుపతాక లొలయ, మంజుశింజత్సమంచితమధుపకలిత
సురుచిరాలంబమానప్రసూన[2]రాజి, మాలికల నొప్పు వివిధగృహాళిదనరి. 809

క. మఱియును దుకూలచీనాం, బరకౌశేయాదివివిధపటపరివృతమం
దిరసుభగాకారం బై, యరు దార విచిత్రపట్టికాలంకృత మై. 810

మ. లలితోద్యానవనాంతసంచరణలీలాలోలహంసాళికో
కిలపారావతచక్రవాకశుక[3]కేకివ్యూహమంచత్సము
త్కలికం గృత్రిమపక్షులన్ నిజవిహంగశ్రేణి యంచుం గుతూ
హలి యై పల్కుచు నాడు చుండుఁ బ్రతిశాఖారోహణవ్యాప్తులన్. 811

వ. వెండియు. 812

క. ఘనసౌధాంతరశయ్యా, సనకేళీగేహకృతకజగతీధరశో
భనచంద్రకాంతచారుభ, వనఫలభరితావనీజవంతము లగుచున్. 813

క. సకలర్తుశోభితంబును, సకలశుభావహము సకలసంపత్కరమున్
సకలోపభోగయోగ్యము, సకలేప్సితకామదంబు సదలంకృతమున్. 814

వ. అగుచు నొప్పుదివ్యవిమానంబుఁ గల్పించి తదీయసుషమావిశేషవిచిత్రంబులు
నిర్మించినతానునుం దెలియం జాలనియద్భుతకర్మం బైనవిమానంబు దేవహూ
తికిం జూపినం జూచి **యమ్ముద్దియ** సంతసింప కుండుట యెఱింగి సర్వభూ
తా(ంతరా)శయాభిజ్ఞుండును సంతుష్టాంతరంగుండును నైనకర్దముం డి ట్లనియె.

---

1 నధికుండవు 2 'మాలికములఁ దనరినవివిధగేహములఁగలిగి, 3 కేకీశారికానీకము' వ్రా. ప్ర.

తే. అతివ భగవత్కృతంబును నఖిలమంగళాకరంబును నగునీజలాశయమునఁ
దవిలి క్రుంకినజంతువితానములకుఁ, గామ్యఫలసిద్ధి సేకుఱుఁ గాన నీవు. 816

క. ఇజ్జలముల నతిభక్తిని, మజ్జన మొనరించి యీవిమానము వేడ్కన్
లజ్జావతి యెక్కవె యని, బుజ్జవ మొగిఁ దోఁపఁ గర్దముఁడు వల్కుటయున్.

వ. విని యాకువలయాక్షి పతిసేవాయాసమలినాంబరయు వేణీభూతశిరోజయు ధూళిధూసరి[1]తాతికృశీభూతాంగియు శబలస్తనయు నై భర్తృనియోగంబున సరస్వతీసలిలసంభూతజలచరాశ్రయం బగుబిందుసరోవరంబుఁ బ్రవేశించి తజ్జలంబులఁ గ్రుంకు లిడుసమయంబునఁ దద్వాఃపూరమధ్యంబున [2]సుచిరసూక్ష్మాంశుకధారిణులుఁ గిశోరవయఃపరిపాకశోభితలు నుత్పలగంధులు నగుకన్యాసహస్రంబులు దేవహూతిం గనుంగొని యిట్లనిరి. 818

క. తరుణీ సంచితకర్మాచరణల మగుమేము నీకు సదమలభక్తిం
బరిచర్య సేయ నేర్తుము, కరుణాకలితేక్షణములఁ గనుఁగొను మమ్మున్. 819

సీ. అని పల్కి డాసి యయ్యతివకు నభ్యంజనోద్వర్తనములు పెంపొనరఁ జేసి
మలయజకర్పూరమహితవాసితహేమకలశోదకంబుల జలక మార్చి
ధవళవస్త్రంబులఁ దడి యార్చి సర్వాంగధూపంబు లొసఁగి కస్తూరి యలఁది
మంజుశింజన్మణిమంజీరకింకిణీ, కలరవాకలితమేఖలలు [3]పూన్చి

తే. కనకతాటంకముద్రికాకంకణాది, సముచితానర్ఘ్యహేమభూషణము లొసఁగి
భవ్యమాల్యానులేపనాంబరము లిచ్చి, షడ్రసోపేతవివిధాన్నసమితిఁ దనిపి.

వ. మఱియుం గనకపాత్రరచితంబు లగుకర్పూరనీరాజనంబులు నివాళించి రుచిరాసనంబునఁ గూర్చుండఁ బెట్టి దర్పణంబు సేతి కిచ్చినం దత్ప్రతిఫలితనిజదేహంబు గనుంగొని కర్దముని మనంబునం దలంచిన నతండునుం గన్యకాసహస్రంబును దత్క్షణంబునఁ దనసన్నిధి నుండుటం జూచి నిజభర్తృయోగమాయాప్రభావంబునకు నద్భుతంబు నొందె నంతఁ గర్దముండునుం గృతస్నాన యైనదేవహూతిం గనుంగొని వివాహంబునకు ముందట నేచందంబునం దనకుం జూపె నాచందంబునం జెన్నొందుచుండుటకు నానందభరితుం డై భార్యాసహితంబుగఁ దత్కన్యకాసహస్రంబు గొలువ నిజవిమానారూఢుం డై తారాగణపరివృతరోహిణీయుక్తుం డగుసుధాకరుండునుంబోలె నొప్పుచుండె దదనంతరంబ. 821

చ. చిరశుభమూర్తి యమ్ముని యశేషదిగీశవిహారయోగ్యమున్
సురుచిరమందగంధవహశోభితమున్ నికటప్రధాతుని
ర్ఝరసరిదంబుశీతలతుషారము నై తనరారుమేరుకం
దరమున కేఁగి దేవవనితాయుతుఁ డై నకుబేరుచాడ్పునన్. 822

---

1 'తకుచసమేతయు నై'. 2 'రుచిరమందిరావాసులు'. 3 'రత్నఖచితతాటంక' వ్రా. ప్ర.

వ. మఱియును. 823

మ. అమరోద్యానవనప్రదేశములు సర్వారామభూముల్ దళ
త్కుముదాంభోజవిభాసిమానససరః కూలంబులున్ మంజుకుం
జములుం జైత్రరథంబు విస్ఫురితవిస్రంభంబునం జూచె న
య్యమునం గర్దమయోగి గామగవిమానారూఢుం డై చెచ్చెరన్. 824

వ. ఇవ్విధంబున సమస్తభూభాగంబును వాయువేగంబునం గలయం గ్రుమ్మరి నిఖిల
వైమానికలోకంబు నతిశయించి (లోకంబులం జరించె) మోక్షదాయకుండును
దీర్ఘపాదుండు నగుపుండరీకాక్షుని సన్నుతించి సేవించుపుణ్యాత్ములకుం బొంద
రానిపదార్థంబులు గలవే యిట్లు కర్దముండు దేవహూతికి నిఖిలధరాచక్రం
బంతయుం జూపి మరల నిజనివాసంబునకుం జనుదెంచి కామకేళీవినోదాత్మిక
యై యున్నభార్య నుపలక్షించి రతిప్రసంగవ్యాసంగంబు గైకొని బహువిధంబు
లయినయిష్టోపభోగంబుల బహువత్సరంబు లొక్కముహూర్తంబు గా జరపుచు
నన్యోన్యసరసావలోకనంబుల సముచితాలింగనసంభాషణంబులం గాలనిరూప
ణంబు సేయ నేరక శతవత్సరంబులు గడపి తదనంతరంబ. 825

క. మునివరుఁ డొకనాఁ డిమ్ములఁ, దననిజదేహంబు నవవిధంబులు గావిం
చి నయంబునఁ దద్వీర్యముఁ, దనసతిగర్భమున నవవిధంబుగ నిలిపెన్. 826

క. అది కారణంబుగాఁ, బెం, పొదవినమునివలన [1]దేవహూతియుఁ గూఁతుల్
ముదమునఁ గనెఁ దొమ్మండ్రన్,ముదితయు మది సంతసించె మునివరుఁడంతన్.

తే. సన్న్యసింపంగఁ గోరుట సతి యెఱింగి,యాత్మఁ బొడమినసంతాప మగ్గలింపఁ
జింత వాటిల్లఁ జెక్కిటఁ జేయి సేర్చి, పదమునను నేల వ్రాయుచుఁ బలికెఁ బతికి.

సీ. అనఘ సంతానపర్యంతంబుననుఁ గూడి,వర్తింతు ననుచుఁ బూర్వమునఁ బలికి
కూఁతుల నిచ్చితి కోమ రార నిప్పు డీ,తరుణులు పతులను దమకుఁ దార
యరసి వర్తింతురో యని భీతి నొందెదఁ, గావున నీపుత్రికలకుఁ దగిన
వరుల సంపాదించి పరిణయంబులు సేసి, తత్త్వసంహిత నాకుఁ దవిలి తెలుపు

తే.సుతునిఁ గృప సేసి ననుఁ గావుసుజనవినుత,యర్థసంసారదుఃఖంబు నపనయింప
నర్హుఁడవు నీవ కావె మోహమున నింత,కాల మూరక పోయె నేగతియు లేక.

చ. [2]ఉపరతి పుట్టె నైహికసుఖోపగతానుభవంబులందు మున్
చపలతఁ గామభోగరతిసంగముఁ గోరి మహాత్మ నిన్ను న
చ్చపుఁదలఁ పొప్పఁగా దెలియఁ జాలకయున్ వరియించుటన్ భవ
త్కృప ఫలియించె ముక్తి నినుఁ గేవలభక్తి భజింపఁ గల్గదే. 830

వ. అదియునుం గాక. 831

---

1 'దేవహూతికిఁ గూఁతు,ర్లుదయించిరి తొమ్మండ్ర,మ్ముదితయు' వ్రా. ప్ర. 2 'ఉపరతి పుట్టె నీయిహసుఖానుభవంబులయందు మున్న నేఁ జపలత' వ్రా. ప్ర.

చ. సమమతి నొప్పుసత్పురుషసఖ్యము సద్గతికారణంబు నీ
చమతివిలోలదుష్పురుషసఖ్యము దుర్గతిహేతు వంచుఁ జి
త్తమునఁ దలంచి యోగిజనతానుత మిమ్ము భజింతుఁ బ్రాణిసం
గమమునఁ బుణ్యపాపములు గ్రక్కొని పొందవె యెట్టివారలన్. 832

క. అని యిట్లు వేదనాభర, మున మునుకుచుఁ బలుకఁ గర్దముఁడు మనుపుత్త్రిం
గనుఁగొని సరసిజనయనువ, చనములు మది సంస్మరించి సతి కిట్లనియెన్. 833

క. మనుసుత నీమది దుఃఖం, బునఁ బొందకు మచిరకాలమున భగవంతుం
డనఘుం డక్షరుఁడు జనా, ర్దనుఁడు భవద్గర్భమందుఁ దగ వసియించున్. 834

క. వరనియమవ్రతనిష్ఠా, చరణనియుక్తాంతరంగసమధికవై సం
భరితతపోధనదాన, స్ఫురితశ్రద్ధానుభక్తిపూర్వము గాఁగన్. 835

మ. హరి నారాయణుపాదపద్మములు సమ్యగ్భక్తిఁ బూజింపు త
త్పురుషశ్రేష్ఠుఁడు మానసంబున భవత్పూజానుసంప్రీతుఁడై
కర మర్థిం దరుణీశిరోమణి భవద్గర్భస్థుఁడై యుండి తాఁ
గరుణం జేయు భవన్మనోజనితశంకాగ్రంధివిచ్ఛేదమున్. 836

దేవహూతిగర్భంబున విష్ణుండు కపిలాచార్యుండు గాఁ బుట్టుట.

చ. అనవుడు దేవహూతి హృదయంబున సంతస మంది యమ్మునీం
ద్రునివచనక్రమంబునఁ బరఁగన్ భగవంతు ననంతుఁ బద్మలో
చను [1]హరి విష్ణు నర్చనము సల్పుచు నుండఁగఁ గొన్నియబ్దముల్
చనునెడ దానవాంతకుఁడు సమ్మతిఁ గార్దమ మైనతేజమున్. 837

క. ధరియించి యమ్మునీంద్రుని, తరుణీగర్భంబువలన దనుజారి శమీ
తరుకోటరమున వైశ్వా, నరుఁ డుదయించినవిధంబునన్ జనియించెన్. 838

సీ. అయ్యవసరమున నాకాశమున దేవ, తూర్యఘోషంబులు దుములమయ్యె
నందితదేవతాబృందంబు లందంద, కురిసిరి మందారకుసుమవృష్టి
గంధర్వకిన్నరగానంబు వీతెంచె, నప్సరోగణములయాట లొప్పె
వావిరి దిక్కులుఁ గావిరి విరిసెను, దవిలి వార్ధులు[2]కలంతలును మానె

తే. సాధుజనములమనములు సంతసిల్లె, హోమవహ్నులు ప్రభలఁ జెన్నొంది వెలిఁగెఁ
గుసుమఫలభారములనొప్పెఁ గుజములెల్ల, సర్వసస్యాళిఁ జెన్నొందె జగతియెల్ల.

వ. ఇట్టిమహోత్సవంబున దేవహూతికిం దత్త్వబోధంబు గావించుకొఱకుఁ దదీ
యగర్భంబున నుదయించినపరబ్రహ్మస్వరూపుం డైననారాయణుని దర్శించు
కొఱకు మరీచిప్రముఖమునిగణసమేతుం డై చతుర్ముఖుండు సనుదెంచి యమ్మహా
త్ముని దర్శించి కర్దమదేవహూతులం గనుంగొని యిట్లనియె. 840

క. నుతచరితులార మీరలు, కృతకృత్యులు విష్ణుపూజఁ గేవలభక్తిన్

---

1 'చరణాంబుజార్చనలు. 2 కలంకపులు' వ్రా. ప్ర.

మతి నిష్కపటులరై చే, సితిరి తదర్చనఫలంబు సేకుఱె మీకున్. 841
క. శ్రితభయహరణుఁడు మునిజన, నుతచరితుఁడు పరుఁడు మీమనోరథసిద్ధిన్
వితతంబుగఁ గావించుటఁ, జతురత మీజన్మ మింక సఫలతఁ బొందెన్. 842
క. వినుఁడు సకాములరై హరి, ననుపమభక్తిన్ భజించు[1]నదె ముక్తికిఁ జా
లును మీపుణ్యం బే మని, కొనియాడఁగ వచ్చు నీతికోవిదులారా. 843
వ. అని వెండియుఁ గర్దమునిం గనుంగొని యిట్లను భవదీయతనూభవలఁ బ్రకట
శీలవ్రతాచారసంపన్ను లైనమునివరేణ్యులకుం బెండ్లి సేయు మట్లయిన వారి
వలనం బ్రజాసృష్టి బహువిధంబుల వృద్ధిం బొందు నని చెప్పి మఱియు నిట్లనియె.
చ. అనఘ భవత్సుతుండు సముదంచితతేజుఁడు నైనయిమ్మహా
త్మునిఁ బరమేశు నీశు నజితు న్నవికారు నమేయు నచ్యుతు
న్ననఘుని నక్షరున్ హరి ననంతుని నీశునిఁగాఁ దలంపు మీ
ఘనుఁడు సమస్తచేతననికాయహృదీప్సితదాయి గావునన్. 845
సీ. మానితజ్ఞానవిజ్ఞానయోగంబులు, ననునుపాయంబుల నొనరఁ జేసి
యోలిమైఁ గర్మజీవుల నుద్ధరించుట,కొఱకు సమ్మహితాత్మకుఁడు సమగ్ర
హాటకరుచిజటాజూటుండు నుత్ఫుల్ల,పంకజనేత్రుండుఁ బద్మవజ్ర
హలకులిశాంకుశలలితరేఖాంకిత,చరణతలుండును సత్త్వగుణుఁడు
తే. నగుచు నిప్పుడు సరసీరుహాక్షి నీదు,గర్భమం దుదయించును ఘనుఁడు నీకుఁ
దత్త్వబోధంబుఁ గావించు దాన నీకు, హృదయమందుల సంశయ మెల్లఁ బాపు.
వ. మఱియును. 847
క. నుతికెక్కి సిద్ధగణసే,వితుఁడై ఘనసాంఖ్యయోగవిలసితతత్త్వ
స్థితినిరతుఁ డగుచుఁ గపిలా,ఖ్యతఁ దనరి చరించు నీజగత్త్రయ మెల్లన్. 848
క. అని పలికి యమ్మరీచిం, గని యుద్వాహార్థ మునిచి కమలజుఁ డంతం
దనసందను లగునారద, సనకాదులఁ గూడి యాత్మసదనము కరిగెన్. 849
వ. అంత నాకర్దముండు కమలసంభవచోదితుం డగుచు యథోచితంబుగా నాత్మీయ
దుహితల వివాహంబు సేయం దలంచి మరీచికిం గళ యనుకన్యకను నత్రికి
ననసూయను సంగిరసునకు శ్రద్ధను బులస్త్యునకు హవిర్భువును బులహునకు
గతిని గ్రతువునకుఁ గ్రియను భృగునకు ఖ్యాతిని వసిష్ఠునకు నరుంధతిని నథ
ర్వునకు శాంతినిం గా నిజకులాచారసరణిం బరిణయంబు గావించిన వారును
గృతదారపరిగ్రహులును గర్దమకృతసంభావనాసంభావితులును నగుచు నతని
చేత ననుజ్ఞాతు లై జాయాసహితు లగుచు నిజాశ్రమభూములకుం జని రిట్లు
వర్తింప యుగత్రయంబు సనుటయుం గర్దముండు (దేవోత్తముం డగువిష్ణుండు
దనమందిరంబున నవతరించి వసించి యుంటం) దనచిత్తంబున నెఱింగి వివిక్తస్థలం

1 'నాయాసమె చాలును' వ్రా. ప్ర.

బునకుం జని యచ్చటఁ గపిలునికి వందనం బాచరించి యి ట్లనియె. 850

సీ. చతురాత్మ వినుమాత్మకృతము లై నట్టియ, మంగళభూతకర్మంబు లనెడి
దావాగ్నిశిఖలచే దందహ్యమాను లై, నట్టిజీవులు దుద ముట్ట లేక
పాయక సంసారబద్ధు లై యుందురు, [1]తద్భవహేతుభూతంబు లయిన
సకలదేవతలుఁ [2]బ్రసన్నులు నగుదురు, బహుజన్మపరిచితప్రాప్తయోగ
తే. చిరసమాధితపోనిష్ఠచే వివిక్త, దేశముల యోగిజనములు ధృతుల నేమ
హానుభావు విలోకింతు రట్టిదివ్య, పురుషరత్నంబ నాయింటఁ బుట్టితీవు. 851

వ. మఱియు సంసారచక్రపరిభ్రామ్యమాణుల మగుచు గ్రామ్యుల మయినమావర్త
నంబులును గణింపక మదీయగృహంబునం బూర్వంబునం బ్రతిశ్రుతంబు లైన భవ
దీయవాక్యంబులు దప్పకుండ ననుగ్రహింప నుదయించి తని వెండియు ని ట్లనియె.

క. తలపోయఁగ నప్రాకృత, బలయుక్తచతుర్భుజాదిభవదవతారం
బులు నీ కనురూపము లై, పొలుపొందుం గాదె పరమపురుష మహాత్మా. 853

వ. అదియునుం గాక. 854

క. అనయము భవదీయాశ్రిత, జనసంరక్షణముకొఱకు సమ్మతితోఁ దా
ల్చినమానవరూపంబులు, ననురూపము లయ్యెఁ గాదె హరి నీ కెపుడున్. 855

క. సుమహితతత్త్వజ్ఞానా, ర్థము విద్వజ్జనగణంబు దవిలి నమస్కా
రము లోలిఁ జేయు[3]పదపీ, ఠము గలనినుఁ బొగడ వశమె ఠవణిల్లంగన్. 856

సీ. సమధికషడ్గుణైశ్వర్యాకారుఁడవు, పరమేశ్వరుండవు ప్రకృతిపురుష
మహదహంకారతన్మాత్రతత్త్వబోధక, హేతుకాలాత్మవిఖ్యాతిధృతివి
జగదాత్ముఁడవు చిచ్ఛక్తివి నాత్మయ, జఠరనిక్షిప్తవిశ్వప్రపంచ
మును గలసర్వజ్ఞమూర్తివి స్వచ్ఛంద, శక్తియుక్తుండవు సర్వసాక్షి
తే. వగుచుఁ గపిలాఖ్యఁ దనరారు నట్టినీకు, ననఘ మ్రొక్కెదఁ బుత్రుండ వగుచునీవు
నాకుఁ బుట్టినకతన ఋణత్రయంబు, వలనఁ బాసితి నిక్క మోవరద నేను.

తే. మానితవ్రతయోగసమాధినియతిఁ, జెంది భవదీయపాదారవిందయుగము
డెందమునఁ జేర్చి శోకంబులందుఁ దొలఁగి, సంచరించెద నంచితస్థలములందు.

క. అని యిట్లు విన్నవించిన, మునిపుంగవుఁ డైనకర్దమునివచనంబుల్
విని భగవంతుం డగున, య్యనఘుఁడు కపిలుండు వలికె నర్మిలి దోఁపన్. 859

సీ. నాచేతఁ బూర్వంబునం బ్రతిశ్రుత మైన, వచనముల్ దప్పక వరమునీంద్ర
నీయింటఁ బుట్టితి నీమనిర్హేతుక, భూరిదయాగుణంబున నవాప్త
సకలకాముఁడ నేను సన్మునివేషంబు, ధరియించు టెల్ల నాకొఱకుఁ గాదు
విను మహాత్మకు లైనమునులకుఁ బరమాత్మ, గురుసద్వివేకంబు నరసి చూపు

---

1 'బహుళకాలం బిట్లు వఱలు చుండ. 2 ప్రసన్నతనొందిరి. 3 పదయుగ్మము గల...గణు
తింపంగాన్' వ్రా. ప్ర.

తే. తత్త్వబోధంబుకొఱకును | దాల్పఁబడిన, యంచితవ్యక్తమార్గ మైనట్టిదేహ
మని తలంపుము మత్పద | ధ్యానభక్తి, ధీపరాయణమహిమంబు | దేజరిల్ల. 860

క. సమధికనిష్ఠం గృతయో, గమునఁ సన్న్యస్తసకల | కర్ముఁడ వై మో
హముఁ బాసి భక్తిచే మో, క్షము[1]కై భజియింపు నను వి | కారరహితుఁడై. 861

క. ననుఁ బరమేశుఁ బరంజ్యో, తిని ననఘు ననంతు దేవ | దేవు సకలభూ
తనికాయగుహాశయు నా, ద్యుని నజు నాద్యంతశూన్యు | దురితవిదూరున్. 862

క. తిరముగ భవదీయాంతః, కరణసరోజాతకర్ణి | కాతలమున సు
స్థిరుఁ జేసి యింద్రియంబుల, నిరసించి మనోంబకమున | నెఱిఁ గను మనఘా.

వ. అట్లని. 864

క. తనరినమోక్షము నొందెద, నని పలికినఁ గర్దముండు | నమ్మునికులచం
ద్రుని వలగొని వందనములు, ఘనముగ నతిభక్తిఁ జేసి | కౌతుక మలరన్.

క. మునిగణసేవిత మగువన, మునకుం జని యందు మాన | సమున నిస్సంగుం
డును వహ్నిరహితుఁ డనికే, తనుఁడును నాత్మైకశరణ | తత్పరుఁ డగుచున్. 866

వ. పరబ్రహ్మంబుఁ జిత్తంబున నిల్పి యహంకారంబు విడిచి మమత్వంబు నిరసించి దయాగుణంబునం జేసి సకలభూతంబులందు సమత్వంబు భజియించి శాంతశేముషీగరిష్ఠుం డగుచు నిస్తరంగం బగువార్ధిచందంబున ధీరుం డై నిఖలప్రపంచంబును వాసుదేవమయంబుఁగాఁ దలంచుచు భక్తియోగంబున భాగవతగతిఁ బొందె నని చెప్పి వెండియు మైత్రేయుండు విదురునిం గనుంగొని కర్దముండు వనంబునకుం జనినయనంతరంబ మాతృవత్సలుం డయినకపిలుండు బిందుసరంబున వసియించి యుండ దేవహూతి తత్త్వమార్గప్రవర్తకుం డయినసుతునిం గనుంగొని బ్రహ్మవచనంబులు దలంచుచు నిట్లనియె. 867

దేవహూతి పుత్రుం డైనకపిలునిచేఁ దత్త్వజ్ఞానంబు వడయుట.

క. అసదింద్రియ[2]ఘర్షణమున, వసుమతి నిర్విణ్ణ నగుచు | వనరెడినాకీ
యసత్కృశమోహతమోవిని, రసనం బనఘా తగ నే | వెరవున ఘటించున్. 868

క. పటుఘనసీరంధ్రతమః, పటలపరీవృతజగత్ప్ర | పంచమునకు నె
క్కటిలోచన మై మహితో, త్కటరుచి వెలుఁగుదువు భాను | కైవడి ననఘా.

ఉ. భూరిమదీయమోహతమ | ముం బెడఁబాప సమర్థు లన్యు లె
వ్వారలు నీవ కాక నిర | వద్య నిరంజన నిర్వికార సం
సారలతాలవిత్ర బుధ | సత్తమ సర్వశరణ్య ధర్మవి
స్తారక సర్వలోకశుభ | దాయక నిత్యవిభూతినాయకా. 870

చ. నిను శరణంబు సొచ్చెద న | నింద్యతపోనిధి నన్నుఁ గావవే
యని తను దేవహూతి విన | యంబున సన్నుతి సేసి వేఁడిన

---

1. 'భజియింపుము వివిక్తకౌనవమ్మంగున్' వ్రా. ప్ర. 2. మర్షణమున.

న్ననుపమసత్కృపాకలితుఁడై కపిలుం డనురాగ మొప్ప స
జ్జననిచయాపవర్గఫలసాధన మైతగుతల్లి వాక్యమున్. 871

క. విని మందస్మితలలితా,ననకమలుం డగుచు నెమ్మనమునఁ బ్రమోదం
బనయంబుఁ గడలుకొన నిజ,జననికి ని ట్లనియెఁ బరమశాంతుం డగుచున్. 872

క. విను జీవునిచిత్తము దా, ఘనభవబంధాపవర్గకారణ మది యే
చినఁ ద్రిగుణాసక్తం బయి,నను సంసృతిబంధకారణం బగు మఱియున్. 873

తే. అదియు నారాయణాసక్త మయ్యెనేని, మోక్షకారణ మగు నని మునికులాబ్ధి
చంద్రుఁడన నొప్పుకపిలుండు జననితోడ,నర్థి వినఁ జెప్పి మఱియు నిట్లనియెఁ బ్రీతి.

వ. మఱియుఁ జిత్తం బహంకారమమకారరూపాభిమానజాతంబు లగు (కామలోభాది) కలుషవ్రాతంబులచేత నెప్పుడు విముక్తం బై పరిశుద్ధం బగు నప్పుడు సుఖదుఃఖవివర్జితంబు (నేకరూపంబు) నై ప్రకృతికంటెఁ బరుండును బరమపురుషుండును నిర్భేదనుండును స్వయంజ్యోతియు సూక్ష్మస్వరూపుండును నితరవస్త్వంతరాపరిచ్ఛిన్నుండును నుదాసీనుండును నైనపరమాత్ముని దదీయమహోహతౌజస్కం బైనప్రపంచంబును (జ్ఞానవైరాగ్యభక్తియుక్తం బగుమనంబుచేఁ) బొడగాంచి యోగిజనులు పరతత్త్వసిద్ధికొఱకు నిఖిలాత్మకుం డైననారాయణునందు సంయుజ్యమానం బయినభక్తిభావంబువలన నుదయించినమార్గంబునకు నితరమార్గంబులు సరి గావండ్రు [1]విద్వాంసులు సంగం బింద్రియార్థాద్యసద్విషయంబుగ నొనరింపంబడి జీవునకు నశిథిలం బగుబంధంబునకుఁ గారణం బగు ననియు నదియె సద్విషయం బైన నంతఃకరణసంయమనహేతుభూతం బగుచు సాధుజనులకు ననర్గళమోక్షద్వారం బగుననియుఁ దెలియుదురు (సహనశీలురు) సమస్తశరీరధారులకు సుహృత్తులును బరమశాంతులును గారుణికులును నై పరిత్యక్తకర్మఫలస్వభావులును (విస్మృతస్వజనబంధుజనులును) నై మత్పదాశ్రయులును మద్గుణధ్యానపారీణులును మత్కథాప్రసంగసఫలితశ్రవణులును నగుచు (మదీయకథల నొడువుచు వినుచు) నుండుపరమభాగవతోత్తముల (నాధ్యాత్మికాది) తాపత్రయంబు దపింపఁ జేయం జాల దట్టిసర్వసంగవివర్జితు లగుపరమభాగవత (జనుల సంగం బపేక్షణీయం బది సకలదోషనివారకం బగు నట్టి) సత్సంగంబునను (సర్వప్రాణిహృత్కర్ణరసాయనంబు లగుమదీయకథాప్రసంగంబులు గలుగు) మద్గుణాకర్ణనంబునుం జేసి శీఘ్రంబుగఁ (గ్రమంబునం) [2]గైవల్యమార్గదంబు లగు శ్రద్ధాభక్తు లుదయించు (నదియునుం గాక) యేపురుషుం డైన నేమి మద్విరచితజగత్కల్పనాది విహారచింతనంబున నుదయించినభక్తిం జేసి యింద్రియసుఖంబులవలన ననుదృష్టశ్రు

1. 'ఇదియు విద్వాంసులు సత్సంగంబునుం గా నజరంబునుగా నంతఃకరణసంయమనహేతుభూతంబునుంగా సాధుజనులకు ననర్గళమోక్షద్వారంబునుంగాఁ దెలియుదురు' వ్రా. ప్ర. 2 'గైవల్యమార్గదం బగుభక్తి యుదయించు' వ్రా. ప్ర.

తంబులైన యైహికాముష్మికంబులవలనను విముక్తుం డగుచుఁ జిత్తగ్రహణార్థంబు ఋజువు లైనయోగమార్గంబులచే [1]సంయుక్తుం డగునట్టియోగి ప్రకృతిగుణసేవనంబుచేత వైరాగ్యగుణవిజృంభితం బైనజ్ఞానయోగంబుచేతను మదర్పితభక్తియోగంబుచేతను బ్రత్యగాత్మకుండ నైననన్ను నంతఃకరణనియుక్తునిం గావించు నని చెప్పిన విని దేవహూతి కపిలున కిట్లనియె. 875

క. ఏభక్తి భవద్గుణపర, మై భవపాపప్రణాశ । మై ముక్తిశ్రీ
లాభము రయమునఁ జేయునొ, యాభక్తివిధంబుఁ దెలియ । నానతి యీవే. 876

వ. అదియునుం గాక భవదుదితం బయిన యోగంబును దదంగంబులును దద్గతతత్త్వావబోధంబును సాకల్యంబుగ మందబుద్ధి నైననాకు స్ఫుటంబుగాఁ దెలియ నానతిమ్మనినఁ గపిలుం డిట్లనియె. 877

సీ. జనయిత్రి విను మతి । సకలపదార్థప,రిజ్ఞానతత్త్వపా । రీణ మగుచు
నామ్నాయవిహితక । ర్మాచారములు గల్గి, తివుటమై వర్తించు । దేవగణము
పూని నైసర్గికం । బైన నిర్హేతుక, మగుభగవత్సేవ । దగిలి ముక్తి
కంటె గరిష్ఠంబు । గావున నదియు భుక్తాన్నంబు జీర్ణంబు । నందఁ జేయు
తే. దీప్తజఠరాగ్నిగతి లింగ । దేహనాశ,కంబు గావించు నదియును । గాక విష్ణు
భక్తివైభవములఁ దేట । పఱుతు వినుము, సద్గుణవ్రాత యోగలక్షణసమేత.

చ. అమలినభక్తిఁ గొందఱు మహాత్ములు మచ్చరణారవిందయు
గ్మము హృదయంబునన్ నిలిపి । కౌతుకులై యితరేతరానులా
పముల మదీయదివ్యతనుపౌరుషముల్ గొనియాడు చుండి తూ
షము మదిఁ గోర నొల్ల రనిశంబు మదర్పితసర్వకర్ములై. 879

సీ. పరికింపఁ గొందఱు । భాగవతోత్తముల్, ఘనత కెక్కినపురా । తనము లైన
చారుప్రసన్నవ । క్త్రారుణలోచన,ములు గల్గి వరదాన । కలితములుగఁ
దనరుమద్దివ్యావ । తారవైభవములు, మది నొప్పఁ దమయోగ । మహిమఁ జేసి
యనుభవించుచుఁ దదీ । యాలాపములు సంస్తు,తించుచుఁ దివుటఁ ద । ద్దివ్యవిలస
తే. దవయవోదారసుందర । నవవిలాస, మందహాసమనోహర । మధురవచన
రచనచే నపహృతమనః । ప్రాణు లగుచు, నెలమి నుందురు నిశ్శ్రేయ । సేచ్ఛ లేక.

మ. కణఁకన్ వారలు వెండి మోక్షనిరపేక్షస్వాంతులై యుండియు
న్నణిమాద్యష్టవిభూతిసేవితము నిత్యానందసంధాయియున్
గణనాతీతము నప్రమేయము సమగ్రశ్రీకమున్ సర్వల
క్షణయుక్తంబును నైనమోక్షపదవిం । గైకొందు రత్యున్నతిన్. 881

వ. ఇట్లు పొంది. 882

---

1. 'యోగయుక్తుం డగుచుఁ బ్రకృతిగుణంబులఁ గైకొనక జ్ఞానవైరాగ్య...మదర్పితభక్తిం జేసియుఁ బ్రత్యగాత్మకుం డైననన్ను నంతఃకరణ' వ్రా. ప్ర.

క. తనరుదు రప్పుణ్యాత్ములు, జనయిత్రి మదీయకాలచక్రగ్రసనం
బును నొందక నిత్యం బగు, ననుపమసుఖవృత్తి నుండు రది యెట్లన్నన్. 883

మ. [1]సముఁడై స్నేహముచే సుతత్వమును విశ్వాసంబుచేతన్ సఖి
త్వముఁ జాలన్ హితవృత్తిచేతను సుహృత్త్వంబున్ సుమంత్రోపదే
శముచేతన్ నిజదేశికుండనఁగ నిచ్చల్ ప్రోచుచు న్నిష్టదై
వము నై వారికిఁ గాలచక్రభయముల్ వారింపుదుం గావునన్. 884

వ. అని యిట్లు దెలుపుచు మఱియు ని ట్లనియె. 885

చ. విను మది గాక యీభువి దివిం బలుమాఱుఁ జరించు నాత్మ దా
ధనపశుపుత్రమిత్రవనితారతిపైఁ దగులంబు మాని న
న్ననఘుని విశ్వతోముఖు ననన్యగతిన్ భజియించెనేని వా
నిని ఘనమృత్యురూపభవశరధి నేఁ దరియింపఁ జేయుదున్. 886

సీ. రూఢిఁ బ్రధానపూరుషనాయకుండను, భగవంతుఁడను జగత్ప్రభుఁడ నైన
నాకంటె నన్యులఁ గైకొని తగిలిన, యాత్మలు భవభయం బందు నెపుడుఁ
గావున నాయాజ్ఞఁ గడవంగ నోడుటఁ, జేసి వాయువు వీచు శిఖి వెలుంగు
నినుఁడు దపించుఁ దా నింద్రుండు వర్షించు, భయమంది మృత్యువు పఱవు వెట్టుఁ

తే. గాన విజ్ఞానవైరాగ్యకలిత మైన, భక్తియోగంబునం జేసి పరమపదము
కొఱకున యోగివరులు మచ్చరణభజను, లగుచుఁ జరియింపుదురు నిర్భయాత్ము లగుచు.

క. గురుభక్తిం జిత్తము మఱి, స్థిర మై విలసిల్లునంతపర్యంతము స
త్పురుషుల కిహలోకంబునఁ, జిరతరమోక్షోదయంబు సేకుఱు చుండున్. 888

క. అని యిట్లు సన్మునీంద్రుఁడు, జననికి హరిభక్తియోగసంగతి నెల్లన్
వినిపించి వెండియును ని, ట్లనియెన్ సమ్మోదచిత్తుఁ డగుచుఁ గడంకన్. 839

వ. అవ్వా యివ్విధంబున భక్తియోగప్రకారంబు సెప్పితి నింకఁ దత్త్వలక్షణంబు
వేఱు వేఱ యెఱింగింతు నేతత్త్వగుణంబుల నెఱింగినవారలు ప్రకృతిగుణంబులవలన
విముక్తు లగుదురు హృదయగ్రంథివిచ్ఛేదకంబు(నాత్మదర్శనరూపంబు) నగు నాజ్ఞా
నం బాత్మకు నిశ్శ్రేయసకారణంబు గావున దాని నెఱింగింతు నందు నాత్మకు స్వరూ
పం బెట్టి దనిన ననాదియుఁ బురుషుండును సత్త్వాదిగుణశూన్యుండును బ్రకృతిగుణ
విలక్షణుండును బ్రత్యక్స్వరూపుండును స్వయంప్రకాశుండును నెవ్వాం డెవ్వని
తోడ నీవిశ్వంబు సమన్వితం బగు నతండు[2] గుణత్రయాత్మకత్వంబున వ్యక్తంబును
భగవత్సంబంధియు నగు ప్రకృతియందు యదృచ్ఛచే లీలావశంబునం బ్రవేశించిన
నాప్రకృతి గుణత్రయమయం బై స్వరూపం బయిన ప్రజాసర్గంబుఁ జేయం గనుం
గొని యప్పుడు మోహితుం డయి విజ్ఞానతిరోధానంబునం జేసి గుణత్రయా
త్మకం బయిన ప్రకృత్యధ్యాసంబున నన్యోన్యమేళనం బగుటయు నంతం బ్రకృతి

1. సమతిన్. 2 'దేవసంబంధియై గుణత్రయానూత్నాత్మకస్థలఁ బ్రకృతియందు లీలావశ' వ్రా.ప్ర.

వ. అట్లు కపిలుం డేఁగినఁ బిదప దేవహూతియుం బుత్త్రుండు సెప్పినయోగమార్గం బున విజ్ఞానంబు గలిగి యుండియుం బెనిమిటి యైనకర్దమునిం దనయుం డైన కపిలునిం బాసి వినష్టవత్సంబు గలగోవుచందంబునం దల్లడిల్లుచుఁ గపిలమహా మునిం దలంచుచుం గర్దమతపస్సామర్థ్యరచితం బైనయట్టి. 1043

ఉ. మానితసౌరభప్రసవమంజులపక్వఫలప్రవాళభా
రానతచూతపోతవిటపాగ్రనికేతనరాజకీర[1]స
ష్టానిసుఖానులాపపరిమండితకర్దమతాపసాశ్రమో
ద్యానవనప్రదేశకమలాకరతీరనికుంజపుంజముల్. 1044

వ. వెండియు. 1045

సీ. అంచితస్ఫటికమయస్తంభదీప్తిచేఁ, గొమరారుమరకతకుడ్యములను
సజ్జాతివజ్రాలసజ్జాలరుచులచే, భాసిల్లునీలసోపానములను
దీపించుచంద్రకాంతోపలవేదుల, విద్రుమగేహళీవిలసితముల
హాటకరత్నకవాటశోభితముల, నలరినసౌధశాలాంగణముల
తే. వరపయఃఫేనపటలపాండురకరీంద్ర,దంతనిర్మితఖట్వాంగధవళపటవి
రచితశయ్యాళులను జతురంతయాన,కనకపీఠాదివస్తుసంఘముల నెల్ల. 1046

వ. మఱియు వికచకమలకుముదసౌగంధికబంధురసుగంధానుబంధిగంధవహశోభితం బును నరవిందనిష్యందకందళితమరందరసపానమదవదిందిందిరసందోహఝుం కారసంకులంబును నై చెలువారుబావులుగలిగి పురందరసుందరీనందితం బైన కర్దమాశ్రమంబుఁ బరిత్యజించి కుటిలంబు లైనకుంతలంబులు జటిలంబులుగా ధరియించి సరస్వతీబిందుసరోవరంబులం ద్రిషవణస్నానంబు గావించుచు నుగ్ర తపోభారంబునం గృశీభూతశరీర యై నిజకుమారుండును బ్రసన్నవదనుండును గపిలనామధేయుండును నగునారాయణుని (సమస్తన్యస్తచింతలచే) ధ్యానంబుసే యుచుఁ బ్రవాహరూపం బైనభక్తియోగంబునను నధికవైరాగ్యంబునను [2]యుక్తా నుష్ఠానజాతం బై బ్రహ్మత్వాపాదకం బగుజ్ఞానంబునను విశుద్ధమనంబును గలిగి.

సీ. అనయంబునాత్మనాశ్రయకుఁడుసువిశ్వతో,ముఖుఁ డనంతుఁడు పరముఁడు నజుండు
చతురుండు నిజపరిజ్ఞానదీపాంకుర,మహిమనిరస్తసమస్తభూరి
మాయాంధకారుఁ డమేయుఁ డీశ్వరుఁ డగు,నాపరబ్రహ్మంబునం దవిరత
బద్ధతత్త్వజ్ఞానపరతచే నిర్ముక్త,జీవభావమున విశిష్టయోగ
తే. భవ్యసంప్రాప్తనిర్మలబ్రహ్మభావ,ములను గలిగి సమాధిచే నెలమి దనరు
నపునరావృత్తమగుత్రిగుణప్రధాన,తత్త్వముల నొప్పి సంతతోదారనియతి.
తే. కలలఁ దోఁచినవస్తుసంఘముల మేలు,కని కనుంగొనఁగా లేనిమనుజుపోల్కిఁ

---

1 'కేకీనికరానులాప పరికీర్తిత...తీరనికుంజ'. 2 'బ్రహ్మజ్ఞానంబునను జ్ఞానహేతువు లైనయుక్తానుష్ఠానంబులను విశుద్ధ' వ్రా. ప్ర.

బొలఁతి దనయాత్మ మఱచి యి ǂ మ్ములసధూమ, మైనపావకుగతినుండె ǂ నంతలోన.

క. గురుయోగశక్తిచే నం, బరతలమున కెగసి సత్కృ ǂ పామయుఁ డగునా
పరవాసుదేవుచరణాం, బురుహయుగన్యస్తచిత్త ǂ మును గల దగుచున్. 1050

వ. ఇట్లు కపిలోక్తమార్గంబున దేవహూతి శ్రీహరియందుఁ గలసె నయ్యంగనారత్నంబు మోక్షంబునకుం జనినక్షేత్రంబు సిద్ధిపదం బనుపేరం బరఁగి ప్రసిద్ధి వహించె నంత నక్కడఁ గపిలుండు దల్లిచేత ననుజ్ఞాతుం డై సిద్ధచారణగంధర్వాప్సరోమునినివహసంస్తూయమానుం డగుచు సముద్రునిచేత దత్తార్హణపూజానికేతనంబులు వడసి సాంఖ్యాచార్యాభిష్టుతం బగుయోగంబు నవలంబించి (లోకత్రయ)శాంతికొఱకు సమాహితుం డై (స్వపిత్రాశ్రమంబు విడిచి) యుదగ్భాగంబునకుం జనియె నని మైత్రేయమహాముని విదురున కిట్లనియెఁ దండ్రీ యీయుపాఖ్యానంబు నాకు గోచరించినరీతి నీకుం జెప్పితి నిది కపిలదేవహూతిసంవాదం బత్యంతపావనంబు గపిలప్రణీతంబు నయినయోగంబు దీనిం బరమభక్తియుక్తుం డై యెవ్వండు పఠించు నెవ్వండు విను నట్టిపుణ్యాత్ములు విగతపాపు లై గరుడధ్వజుం డైనపుండరీకాక్షుని శ్రీచరణారవిందంబులం బొందుదు రని మైత్రేయుండు విదురున కెఱింగించినవిధంబున శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకుం జెప్పె నని సూతుండు శౌనకాదిమహామునులకు నీకథావృత్తాంతంబు సెప్పిన విని ప్రహృష్టహృదయు లై మునికులోత్తమా భవద్వాక్పూరం బగుభగవత్కథామృతంబులు గ్రోలు చుండ మామనంబులు దనివోవ దింకను దరువాతివృత్తాంతంబులు మాకు విశదంబులు గ వినిపింప నీవ యర్హుండ వని యడుగుటయు. 1051

చ. జనకసుతామనోవిమల ǂ సారసకోమలచంచరీక చం
దన శరదిందు కుందహార ǂ తార మరాళ పటీర చంద్రికా
వినుతయశోవిశాల రఘు ǂ వీర దరస్మితపద్మపత్త్రలో
చన నిటలాంబకప్రకట ǂ చాపవిఖండన వంశమండనా. 1052

తరలము. పరమపావన విశ్వభావన ǂ బాంధవప్రకరావనా
శరధిశోషణ సత్యభాషణ ǂ సత్కృపామయభూషణా
దురితతారణ సృష్టికారణ ǂ దుష్టలోకవిదారణా
ధరణిపాలన ధర్మశీలన ǂ దైత్యమర్దనఖేలనా. 1053

మాలిని. దివిజగణశరణ్యా ǂ దీపితానంతపుణ్యా
ప్రవిమలగుణజాలా ǂ భక్తలోకానుపాలా
భవతిమిరదినేశా ǂ భానుకోటిప్రకాశా
కువలయహితకారీ ǂ ఘోరదైత్యప్రహారీ. 1054

గద్యము. ఇది శ్రీపరమేశ్వరకరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజ

పాండిత్యపోతనామాత్యప్రణీతం బయిన శ్రీమహాభాగవతం బనుమహాపురాణంబునందు విదురనీతియు విదురునితీర్థాభిగమనంబును యుద్ధవసందర్శనంబును గౌరవయాదవకృష్ణాదినిర్యాణంబును గంగాద్వారంబున విదురుండు మైత్రేయునిం గనుటయు విదురమైత్రేయసంవాదంబును జగదుత్పత్తిలక్షణంబును మహదాదులసంభవప్రకారంబును మహదాదులు నారాయణు నభినందించుటయు విరాడ్విగ్రహప్రకారంబును శ్రీమహాభాగవతభక్తికారణం బగుపద్మసంభవు జన్మప్రకారంబును బ్రహ్మతపంబును బరమేష్ఠికిఁ బుండరీకాక్షుండు ప్రత్యక్షం బగుటయు బ్రహ్మకృతం బయినవిష్ణుస్తోత్రంబును గమలసంభవునిమానససర్గంబును బరమాణువులపుట్టువును భూర్భువస్సువరాదిలోకవిస్తారంబును గాలదివసమాసవత్సరాదినిర్ణయంబును నాయుఃపరిమాణంబును జతుర్యుగపరిమాణంబును బద్మసంభవుసృష్టిభేదనంబును సనకాదులజన్మంబును స్వాయంభువమనువుజన్మంబును శ్రీహరివరాహావతారంబును భూమ్యుద్ధరణంబును సూకరాకారుం డైనహరిని విధాత స్తుతియించుటయు దితికశ్యపసంవాదంబును గశ్యపుండు రుద్రునిం బ్రశంసించుటయుఁ గశ్యపువలన దితి గర్భంబు ధరించుటయుఁ దత్ప్రభావంబునకు వెఱచి దేవతలు బ్రహ్మసన్నిధికిం జని దితిగర్భప్రకారంబు విన్నవించుటయు సనకాదులు వైకుంఠంబున కరుగుటయు నందు జయవిజయుల కలిగి సనకాదులు శపించుటయు శ్రీహరిదర్శనంబును బ్రాహ్మణప్రశంసయు సనకాదులు హరిని నుతించుటయు హిరణ్యకశిపుహిరణ్యాక్షులజన్మప్రకారంబును హిరణ్యాక్షునిదిగ్విజయంబును సవనవరాహహిరణ్యాక్షులయుద్ధంబును బ్రహ్మస్తవంబును హిరణ్యాక్షువధయు నమరగణంబులు శ్రీహరి నభినందించుటయు హరి వరహావతారవిసర్జనంబు సేయుటయును దేవతిర్యఙ్మనుష్యాదులసంభవంబును గర్దమమహామునితపంబునకు సంతసించి శ్రీహరి ప్రత్యక్షం బగుటయుఁ గర్దముండు స్వాయంభువమనుపుత్త్రి యైనదేవహూతిం బరిణయం బగుటయు దేవహూతిపరిచర్యలకు సంతసిల్లి కర్దముండు నిజయోగకల్పితం బగువిమానంబునందు నిలిచి సహస్రదాసీపరివృత యైనదేవహూతిం గూడి భారతాదివర్షంబులు గలయం గ్రుమ్మరుటయు దేవహూతి కర్దమునివలనఁ గన్యకానవకంబును గపిలునిం గనుటయుఁ దత్కన్యకావివాహంబులును గర్దమునితపోయాత్రయుఁ గపిలదేవహూతిసంవాదంబును శబ్దాదిపంచతన్మాత్రలజన్మప్రకారంబును బ్రహ్మాండోత్పత్తియు విరాట్పురుషకర్మేంద్రియపరమాత్మప్రకారంబును బ్రకృతిపురుషవివేకంబును నారాయణునిసర్వాంగస్తోత్రంబును సాంఖ్యయోగంబును భక్తియోగంబును జీవున కైనగర్భసంభవప్రకారంబును జంద్రసూర్యమార్గంబును బితృమార్గంబును దేవహూతినిర్యాణంబును గపిలమహాముని దపంబునకుం జనుటయు ననుకథలం గలతృతీయస్కంధము. 1055.

ఓం తత్స ద్బ్రహ్మార్పణ మస్తు.

శ్రీ ర స్తు

శ్రీరామచన్ద్రాయ పరబ్రహ్మణే నమః.

# శ్రీమదాంధ్రమహాభాగవతము

## చతుర్థస్కంధము



విలసితధరణీతన
యావదనసరోజవాసరాధిప సితరా
జీవదళనయన నిఖిలధ
రావరనుతసుగుణధామ రాఘవరామా. 1

వ. మహనీయగుణగరిష్ఠు లగునమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుం డైనసూతుం డిట్లనియె నట్లు ప్రాయోపవిష్టుం డైనపరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె. 2

సీ. జననాథ విను విదురునకును మైత్రేయ,మునినాథచంద్రుఁ డిట్లనియె మఱియు
స్వాయంభువున కర్థి శతరూపవలనను, గూఁతులు మువ్వు రాకూతి దేవ
హూతిప్రసూతులు నొనరఁ బ్రియవ్రతో,త్తానపాదులు నను తనయయుగము
జనియింప నందగ్రసంభవ యైనయా,కూతిని సుమహితభ్రాతృమతిని
తే. దనకు సంతానవిస్తరార్థంబు గాఁగఁ, బుత్రికాధర్మ మూఁది యాపువ్వుఁబోఁడిఁ
బ్రకటమూర్తి రుచిప్రజాపతికి నిచ్చె,మనువు ముద మొంది శతరూప యనుమతింప.

వ. అట్లు వివాహం బైనరుచిప్రజాపతి బ్రహ్మవర్చస్వియుఁ బరిపూర్ణగుణుండును గావునఁ జిత్తైకాగ్రతం జేసి యాకూతియందు శ్రీవిష్ణుండు యజ్ఞరూపధరుం డగు పురుషుండుగను జగదీశ్వరి యగునాదిలక్ష్మి యమ్మహాత్మునకు నిత్యానపాయిని గావునఁ దదంశంబున దక్షిణ యనుకన్యకారత్నంబుగను మిథునంబు సంభవించె నందు స్వాయంభువుండు సంతుష్టాంతరంగుం డగుచుఁ బుత్రికాపుత్రుండును వితతతేజోధనుండును శ్రీవిష్ణుమూర్తి(రూపుండును నగుయజ్ఞునిఁ) దనగృహంబునకుఁ దెచ్చి యునిచె రుచియుఁ గామగమన యైనదక్షిణ యనుకన్యకాలలామంబును దనయొద్దన నిలిపె నంత సకలమంత్రాధిదేవత యగుశ్రీయజ్ఞుండు (దనుఁ బతిఁగం గోరెడు) దక్షిణ యనుకన్యకం బరిణయం బయ్యె వార లాదిమిథునంబు

గావున నది నిషిద్ధంబు గాకుండె నని చెప్పి మైత్రేయుండు వెండియు ని ట్లనియె.

క. ధీమహిత యంత వారల, యామాఖ్యలు గలుగు దేవతావళి గడఁకన్
వేమఱు [1]నభినందించుచు, నామిఘనమువలనఁ బుట్టె నతిబలయుతమై. 5

వ. వారు తోషుండును ప్రతోషుండును సంతోషుండును భద్రుండును శాంతియు నిడస్పతియు నిధ్మ్ముండును గవియు విభుండును వహ్నియు సుదేవుండును రోచనుండును నన బన్నిద్దఱు సంభవించిరి (వారలు స్వాయంభువాంతరంబునం దుషితు లను దేవగణంబులై వెలసిరి మఱియు) మరీచిప్రముఖులైన మునీశ్వరులును యజ్ఞుండును దేవేంద్రుండును మహాతేజోరూపసంపన్ను లయిన ప్రియవ్రతోత్తానపాదులునుం గలిగి పుత్రపౌత్రనప్తృజనసంకీర్ణం బయి యా మన్వంతరంబు (పాలితం బగుచు) వర్తిల్లె మనువు ద్వితీయపుత్త్రి యైన దేవహూతిం గర్దమున కిచ్చి తద్వంశవిస్తారంబు గావించె నని మున్న యెఱింగించితి వెండియు నమ్మనువు మూఁడవచూలైన ప్రసూతి యనుకన్యకను (బ్రహ్మపుత్త్రుం డగు) దక్షప్రజాపతికి నిచ్చె నాదక్షునకుఁ బ్రసూతివలన నుదయించిన ప్రజాపరంపరలచేత ముల్లోకంబులు విస్తృతంబు లయ్యె మఱియుఁ గర్దమపుత్త్రికాసముదయంబు బ్రహ్మర్షిభార్య లగుటం జేసి వారివలనం గలిగినసంతానపరంపరల వివరించెద. 6

## కర్దమప్రజాపతిసంతతిని దెలుపుట.

సీ. ఘనుఁ డౌ మరీచికిఁ గర్దమాత్మజ యగు, కళ యనునంగనవలనఁ గశ్య
పుం డనుకొడుకును బూర్ణిమ యనువాఁడు, బిడ్డయుఁ బుట్టిరి పేర్చి వారి
వలనఁ బుట్టినప్రజావళిపరంపరలచే, భువనంబు లెల్ల నాపూర్ణ మగుచు
జరగెను బూర్ణిమ జన్మాంతరంబున, హరిపదప్రక్షాళితాంబువులను
తే. గంగ యనుపేరఁ బుట్టె యక్కన్య దేవ, కుల్యయనుపేరఁదగునొక్కకూఁతునఖిల
విశ్వసంవ్యాపకుం డగువిరజుఁడనెడి, తనయు నొక్కనిఁ గాంచె మోదంబుతోడ.

క. అనఘుం డత్త్రిమహాముని, యనసూయాదేవివలన నజహరిపురసూ
దనులకళాంశంబుల నం, దనులను మువ్వురను గనియెఁ దద్దయుఁ బ్రీతిన్. 8

క. అనవుడు విదురుఁడు మైత్రే, యునిఁ గనుఁగొని పలికె మునిజనోత్తమ జగతీ
జననస్థితిలయకారకు, లన వెలసినపద్మగర్భహరిహరు లెలమిన్. 9

క. ఏమినిమిత్తం బత్త్రిమ, హామునిమందిరమునందు ననసూయకు ను
ద్దామగుణు లుదయ మైరన, నామైత్రేయుండు పలికె నవ్విదురునితోన్. 10

సీ. సుచరిత్ర విను విధిచోదితుం డై యత్త్రి, దప మాచరింపఁ గాంతాసమేతుఁ
డయి ఋక్షనామకులాద్రితటంబున, ఘుమఘుమారావసంకులవిలోల
కల్లోలజాలసంకలితనిర్వింధ్యాన, దీజలపరిపుష్టరాజితప్ర

1. 'నభినందించిరి... సమరగణంబుల్' వ్రా. ప్ర.

నూనగుచ్ఛస్వచ్ఛమానితాశోకప, లాశకాంతారస్థలమున కెలమి
తే. నరిగి యచ్చటనిర్ద్వంద్వుఁడగుచుఁ బ్రాణ, నియమమున నేకపదమున నిలిచి గాలిఁ
దివుటఁ గ్రోలి కృశీభూతదేహుఁడగుచుఁ, దపము గావించె దివ్యవత్సరశతంబు.
వ. ఇట్లతిఘోరంబైన తపంబు సేయుచుఁ దనచిత్తంబున. 12
క. ఏవిభుఁడు జగదధీశ్వరుఁ, డావిభుశరణంబు సొత్తు నతఁ డాత్మసమం
బై వెలసినసంతతిని ద, యావరమతి నిచ్చుఁ గాక యని తలఁచు నెడన్. 13
చ. మునుకొని యత్తపోధనుని మూర్ధజమైన తపఃకృశానుచే
తను ద్రిజగంబులుం గరఁగి తప్తములైనను జూచి పంకజా
సనమురశాసనత్రిపురశాసను లచ్చటి కేఁగి రప్సరో
జనసురసిద్ధసాధ్యమునిసన్నుతభూరియశోభిరాములై. 14
వ. అట్లు మునీంద్రునాశ్రమంబు డాయం జను నవసరంబున. 15
చ. అనఘుతపోభిరాముఁ డగునత్రిమునీంద్రుఁడు గాంచెఁ దత్తకాం
చనఘనచంద్రికారుచిరచారుశరీరుల హంసనాగసూ
దనవృషభేంద్రవాహుల నుదారకమండలుచక్రశూలసా
ధనుల విరించివిష్ణుపురదాహుల వాక్కమలాంబికేశులన్. 16
వ. మఱియుఁ గృపావలోకనమందహాససుందరవదనారవిందంబులు గలమహాత్ముల సందర్శించి యమందానందకందలితహృదయారవిందుండై సాష్టాంగదండప్రణామంబు లాచరించి పుష్పాంజలి గావించి నిటలతటఘటితకరపుటుండై దుర్నిరీక్షంబైన తత్తేజోవిశేషంబు దేఱి చూడం జాలక ముకుళితనేత్రుండై తత్పరాయత్తచిత్తుండగుచు సర్వలోకగరిష్ఠంబులైన మృదుమధురగంభీరభాషణంబుల నిట్లని స్తుతియించె. 17
సీ. ప్రతికల్పమందు సర్వప్రపంచోద్భవ, స్థితివినాశంబులఁ జేయునట్టి
మహితమాయాగుణమయదేహములఁ బొల్చు, నజవాసుదేవశివాభిధాన
ములు గల్గుమీపాదజలజాతములకు నే, నతిభక్తి వందనం బాచరింతు
నఖిలచేతనమానసాగమ్య మన నొప్పు, మూర్తులు గల్గుమీ మువ్వురందుఁ
తే. బరఁగ నాచేతఁ బిలువంగఁబడినధీరుఁ, డెవ్వఁ డే నొక్కరుని బిల్వ నిపుడు మీరు
మువ్వు రేతెంచుటకు నాదుబుద్ధి విస్మ, యంబు గదిరెడిఁ జెప్పరే యనఘులార.
వ. అదియునుం గాక సంతానార్థంబు నానావిధపూజలు గావించి నాచిత్తంబున ధరియించినమహాత్ముం డొక్కరుండ యనిన నమ్మువ్వురు విబుధశ్రేష్ఠులు నతనిం గనుంగొని సుధామధురంబు లయినవాక్యంబుల నిట్లనిరి. 19
క. విను మేము ముగుర మయ్యును, ననుపమమతిఁ దలఁప నేకమై యుందుము నీ
మనమందు నేమి గోరితి, వనయము నాకోర్కి సఫలమయ్యెడుఁ జుమ్మీ. 20
క. మామువ్వురయంశంబుల, ధీమంతులు సుతులు వుట్టి త్రిజగము లెల్లన్

నీమంగళగుణకీర్తిఁ, శ్రీమహితము సేయఁ గలరు ✽ సిద్ధము సుమ్మా. 21

క. అని మునిచంద్రుఁడు దనమన,మునఁ గామించినవరంబు ✽ బుధవరులు ముదం
బున నొసఁగి యతనిచేఁ బూ,జనములఁ బరితృప్తు లగుచుఁ ✽ జనిరి యథేచ్ఛన్.

ఉ. ఆసుచరిత్రదంపతు లుదంచితలీలఁ గనుంగొనంగ న
బ్జాసనునంశమందు నమృతాంశుఁడు [1]విష్ణుకళన్ సుయోగవి
ద్యాసుభగుండు దత్తుఁడుఁ బురాంతకుభూరికళాంశమందు దు
ర్వాసుఁడు నై జనించి రనవద్యపవిత్రచరిత్రు లిమ్ములన్. 23

క. అంగిరసుఁ డనెడుమునికిఁ గు,లాంగన యగుశ్రద్ధయందు ✽ సంచితసౌంద
ర్యాంగులు గూఁతులు నలువురు, మంగళవతు లుదయ మైరి ✽ మాన్యచరిత్రా.

క. వారు సినీవాలి యనఁ గు,హూరాకానుమతు లనఁగ ✽ నొప్పిరి మఱియుం
గోరసుతయుగము గలిగెను, స్వారోచిషమనువువేళ ✽ శస్తఖ్యాతిన్. 25

వ. వార లెవ్వ రనిన భగవంతుం డగునుచథ్యుండును బ్రహ్మనిష్ఠుం డగుబృహస్పతియు ననం బ్రసిద్ధి వహించిరి పులస్త్యుండు హవిర్భుక్కనునిజభార్యయందు నగస్త్యుని బుట్టించె నాయగస్త్యుండు జన్మాంతరంబున జఠరాగ్నిరూపం బై ప్రవర్తించె వెండియు నాపులస్త్యుండు విశ్రవసునిం గలిగించె నావిశ్రవసునకు నిలబిల యనుభార్యవలనం గుబేరుండును గైకసి యనుదానివలన రావణకుంభకర్ణవిభీషణులునుం బుట్టిరి పులహునకు గతి యనుభార్యవలనఁ గర్మశ్రేష్ఠుండును వరీయాంసుండును సహిష్ణుండును ననుముగ్గురు గొడుకులు జనియించిరి మఱియుఁ గ్రతువునకుఁ గ్రియ యనుభార్యయందు (బ్రహ్మతేజంబున జ్వలించుచున్న) షష్టిసహస్రసంఖ్యలు గలవాలఖిల్యు లనుమహర్షులు గలిగిరి వసిష్ఠుం డూర్జ యనుభార్యయందుఁ జిత్రకేతుండును సురోచియు విరజుండును మిత్రుండును నుల్బణుండును వసుభృద్ధ్యానుండును ద్యుమంతుండును ననుసప్తఋషులను భార్యాంతరంబున శక్తిప్రముఖపుత్రులనుం బుట్టించె నథర్వుం డనువానికిఁ జిత్తి యనుభార్యయందు ధృతవ్రతుండును నశ్వశిరస్కుండు నయినదధ్యంచుండు పుట్టె మహాత్ముం డగుభృగువు ఖ్యాతి యనుపత్నియందు ధాతయు విధాతయు నను పుత్రద్వయంబును భగవత్పరాయణ యగు శ్రీ యనుకన్యకం బుట్టించె నాధాతృవిధాతృలు మేరు వనువానికూఁతు లయినయాయతినియతు లనుభార్యల వలన మృకండప్రాణు లనుకొడుకులం బుట్టించి రందు మృకండునకు మార్కండేయుండును బ్రాణునకు వేదశిరుం డనుమునియుం బుట్టిరి భృగువునకు నుశన యనుకన్యయందుఁ గవి యనువాఁడు పుట్టె నిట్లు కర్దమదుహిత లయినకన్యకాసవకంబువలనం గలిగినసంతానపరంపరలచేత సమస్తలోకంబులుఁ బరిపూర్ణంబు లయ్యె నట్టిసద్యఃపాపహరంబును శ్రేష్ఠతమంబును నైనకర్దమదౌహిత్రసంతాన

1. 'విష్ణుకళందుయోగ' వ్రా. ప్ర.

ప్రకారంబు శ్రద్ధాగరిష్ఠచిత్తుండ వగునీకుం జెప్పితి నింక దక్షప్రజాపతివంశం బెఱింగింతు వినుము. 26

## దక్షప్రజాపతిసంతతిని దెలియఁజేయుట.

క. వనజజునివలన భవ మం,దిన యా దక్షప్రజాపతికి మనునిజనం
దన యగు ప్రసూతివలనను, ననఘా పదియార్వు రుదయ మందిరి కన్యల్. 27

వ. ఇట్లుదయించిన యక్కన్యకాషోడశంబునందు శ్రద్ధయు మైత్రియు దయయు శాంతియుఁ దుష్టియుఁ బుష్టియుఁ బ్రియయు నున్నతియు బుద్ధియు మేధయుఁ దితిక్షయు హ్రీయు మూర్తియు నను నామంబులు గలపదుమువ్వురను ధర్మరాజున కిచ్చె నొక్కకన్యక నగ్నిదేవునకును నొక్కతెం బితృదేవతలకును నొక్కతె (జన్మమరణాదినివర్తకుం డగు) నభవునకుం బెండ్లి సేసె నంత నాధర్మునిపత్నులయందు శ్రద్ధవలన శ్రుతంబును మైత్రివలనఁ బ్రసాదంబును దయవలన నభయంబును శాంతివలన సుఖంబును దుష్టివలన ముదంబును బుష్టివలన స్మయంబును గ్రియవలన యోగంబును నున్నతివలన దర్పంబును బుద్ధివలన నర్థంబును మేధవలన స్మృతియుఁ దితిక్షవలన క్షేమంబును హ్రీవలనఁ బ్రశ్రయంబును మూర్తివలన సకలకల్యాణగుణోత్పత్తిస్థానభూతు లగు నరనారాయణు లనుఋషు లిద్దఱును సంభవించిరి వారలజన్మకాలంబున. 28

సీ. గంధవాహుఁడు మందగతి ననుకూలుఁడై, వీచె నల్దిక్కులు విశద మయ్యె
నఖిలలోకంబులు నానందమును బొందెఁ, దుములమై దేవదుందుభులు మొరసెఁ
గర మొప్పె జలధులు కలఁక లడంగెను, మించినగతిఁ బ్రవహించె నదులు
గంధర్వకిన్నరగానముల్ వీతెంచె, నప్సరోజనములాస్యములు సెలఁగె
తే. సురలు గురియించి రందందవిరులవాన, మునిజనంబులు సంతోషమునఁ జెలంగి
వినుతు లొనరించి రవ్వేళ విశ్వమెల్లఁ, బరమమంగళ మై యొప్పె భవ్యచరిత.

వ. ఆసమయంబున బ్రహ్మాదిదేవతలు మహాత్ములకడకుఁ జనుదెంచి యిట్లని స్తుతియించిరి.

సీ. గగనమందులఁ దోఁచు గంధర్వనగరాది, రూపభేదములట్లు రూఢి మెఱసి
యేయాత్మయం దేని నేపారుమాయచే, నీవిశ్వ మిటు రచియింపఁ బడియె
నట్టియాత్మప్రకాశార్థ మై మునిరూపమున ధర్మగృహమునఁ బుట్టినట్టి
పరమపురుష నీకుఁ బ్రణమిల్లెద మదియుఁ, గాక యీసృష్టి దుష్కర్తవృత్తి
తే. జరగ నీ కుండుకొఱకు నై సత్త్వగుణము,చే సృజించినమ యిట్లు శ్రీనివాస
మైనసరసీరుహప్రభ నపహసించు, నీకృపాలోకనంబుల నెమ్మిఁ జూడు. 31

క. అని యిట్లు దేవగణములు, వినుతింపఁ గృపాకటాక్షవీక్షణములచేఁ
గని వారు గంధమాదన,మున కేఁగిరి తండ్రి ముదము ముప్పిరిగొనఁగన్. 32

క. ధరణీభర ముడుపుట కా, నరనారాయణులు భువి జనన మనయము నొం
దిరి యర్జునకృష్ణాఖ్యలఁ, గురుయదువంశముల సత్త్వగుణయుతు లగుచున్. 33

వ. మఱియు నగ్నిదేవునకు దక్షపుత్రి యైనస్వాహాదేవి యనుభార్యయందు హుతభోజను లగుపావకుండును బవమానుండును శుచియు ననుమువ్వురు గొడుకులు గలిగిరి వారివలనం బంచచత్వారింశత్సంఖ్యలం గలయగ్ను లుత్పన్నంబు లయ్యె నిట్లు పితృపితామహయుక్తంబుగా నేకోనపంచాశత్సంఖ్యలు గలయగ్నులు బ్రహ్మవాదులచే యజ్ఞకర్మంబులం దగ్నిదేవతాకంబు లైనయిష్టులు దత్తన్నామంబులచేతఁ జేయంబడు చుండు (నాయగ్ను లెవ్వ రనిన నగ్నిష్వాత్తులు బర్హిషదులు సౌమ్యులు పితలు నాజ్యపులు సాగ్నులు నిరగ్నులు నన నేను దెఱంగు లై యుండురు దాక్షాయణి యగు స్వధ యనుధర్మపత్నియందు వారలవలన వయునయు ధారిణియు ననునిద్దఱు కన్య లుదయించి జ్ఞానవిజ్ఞానపారగ లగుచు బ్రహ్మనిష్ఠ లయి పరఁగిరి) వెండియు. 34

ఈశ్వరునకును దక్షప్రజాపతికిని విరోధము సంభవించుట.

సీ. దక్షప్రజాపతి తనయ యాభవునిభార్య యనఁగాఁ దగుసతి యనులతాంగి
సతతంబుఁ బతిభక్తి సలుపు చుండియుఁ దనూజాతలాభము నందఁ జాలదయ్యె
భర్గుని దెసఁ జాలఁ బ్రతికూలుఁ డైనట్టి తమతండ్రి మీఁది రోషమునఁ జేసి
వల నేది తా ముగ్ధవలె నిజయోగమార్గంబున నాత్మదేహంబు విడిచె
తే. నని మునీంద్రుండు వినిపింప నమ్మహాత్ముఁ డైనవిదురుండు మనమున నద్భుతంబు
గదురఁ దత్కథవిన వేడ్క గడలుకొనఁగ మునివరేణ్యునిఁ జూచి యిట్లనియె మఱియు.
సీ. చతురాత్మ దుహితృవత్సలుఁ డైనదక్షుండు దనకూఁతు సతి ననాదరము సేసి
యనయంబు నఖిలచరాచరగురుఁడు నిర్వైరుండు శాంతవిగ్రహుఁడు ఘనుఁడు
జగముల కెల్లను జర్చింప దేవుండు సంచితాత్మారాముఁ డలఘుమూర్తి
[1]శీలవంతులలోన శ్రేష్ఠుండు నగునట్టి భవునందు విద్వేషపడుట కేమి
తే. కారణము సతి దా నేమికారణమున విడువరానట్టిప్రాణముల్ విడిచె మఱియు
శ్వశురజామాతృవిద్వేషసరణి నాకుఁ దెలియ నానతియిమ్ము సుధీవిధేయ. 36
క. అని యడిగిన నవ్విదురునిఁ గనుఁగొని మైత్రేయుఁ డనియెఁ గౌతుక మొప్పన్
విను మనఘ తొల్లి బ్రహ్మలు జననుతముగఁ జేయునట్టిసత్త్రముఁ జూడన్. 37
చ. సరసిజగర్భయోగిజనశర్వసుపర్వమునీంద్రహవ్యభు
క్పరమఋషిప్రజాపతులు భక్తిమెయిం జనుదెంచి యుండ [2]న
త్తరణిసమానతేజుఁ డగుదక్షుఁడు వచ్చినఁ దత్సదస్యులుం
దర మిడి లేచి రప్పుడు పితామహభర్గులు దక్క నందఱున్. 38
క. చనుదెంచిన యాదక్షుఁడు వనజజునకు మ్రొక్కి భక్తివశు లై సభ్యుల్
దన కిచ్చినపూజలు గైకొని యర్హాసనమునందుఁ గూర్చుండె దగన్. 39
తే. తన్నుఁ బొడగని సభ్యు లందఱును లేవ నాసనము దిగనట్టిపురహరువలను

1. శీలవ్రతులలోన. 2 'నత్తతఁ దరుణార్కతేజుఁ' వ్రా. ప్ర.

గన్నుఁగొనలను విస్ఫులింగములు సెదరఁ, జూచి యిట్లను రోషవిస్ఫురణ మెఱయ.

తే. (వినుఁడు మీరలు రోదమానవిబుధమునిహు,తాశనాదిసురోత్తములార మోహ
మత్సరోక్తులు గావు నామాట లనుచు, వారి కందఱ కాపురవైరిఁ జూపి.) 41

సీ. పరికింప నితఁడు దిక్పాల[1]యశోహాని,కరుఁ డీక్రియాశూన్యపరుని చేతఁ
గర మొప్పు సజ్జనాచరితమార్గము దూషి,తం బయ్యె నెన్న గతత్రపుండు
మహితసావిత్రీసమానను సాధ్వి న, స్మత్తనూజను మృగశాబనేత్ర
ననలభాస్వురబంధుజనసమక్షమున మ,ర్కటలోచనుఁడు కరగ్రహణ మర్థిఁ

తే. జేసి తాశిష్యభావంబుఁ జెందుటాత్మఁ, దలఁచి ప్రత్యుద్గతాభివందనము లెలమి
నడప కుండిన మానసీ నన్నుఁ గన్న, నోరిమాటకుఁ దనకేమి గోరవోము. 42

సీ. *అనయంబు లుప్తక్రియాకలాపుఁడు మాన,హీనుఁడు మర్యాద లేనివాఁడు
మత్తప్రచారుఁ డున్మత్తప్రియుఁడు దిగం,బరుఁడు భూతప్రేతపరివృతుండు
దామసప్రమథభూతములకు నాథుఁడు, భూతిలిప్తుం డస్థిభూషణుండు
నష్టశౌచుండు నున్మదనాథుఁడును దుష్ట,హృదయుఁ డుగ్రుఁడును బరేతభూని

తే. కేతనుఁడు వితతస్రస్తకేశుఁ డశుచి, యయినతన కొక్క శివనామ మను ప్రవాద
గలిగెఁ గాని యశివుఁ డనికాన కెఱిఁగి, యెఱిఁగి వేదంబు శూద్రున కిచ్చినట్టులు.

వ. ఇతనికి నస్మత్తనూజను విధివత్ప్రకారంబున నిచ్చితి. 44

క. అని యిట్టులు ప్రతికూలవ,చనములు దక్షుండు వలికి శపియింతును శ
ర్వాని నని జలములు గొని కర,మున నిలిచి యిటు లనె రోషమున ననఘాత్మా.

క. ఇతఁ డింద్రోపేంద్రపరీ,వృతుఁడై మఖసమయమున హవిర్భాగము దే
వతలం గూడఁగ మహితని,యతిఁ బొందక యుండుఁ గాక యని శపియించెన్.

వ. ఇట్లు దక్షుండు వల్కినగర్హితవాక్యంబులు వినిందితంబు లగుం గాని యాథార్థ్యంబున వాస్తవంబు లగుచు భగవంతుం డగురుద్రునందు ననిందితంబులై స్తుతిరూపంబుల నొప్పెఁ దదనంతరంబ రుద్రునకు శాపం బిచ్చినకారణంబున దక్షుండు సదస్యముఖ్యులచే నకృత్యం బని) నిషేధింపంబడి ప్రవృద్ధం బయినక్రోధంబుతోడ నిజనివాసంబునకుం జనియె నంత గిరిశానుచరాగ్రసరుం డగునందికేశ్వరుండు దక్షుండు నిటలాక్షుని శపియించినశాపంబు నతనిపల్కినయనర్హవాక్యంబులును విని కోపారుణితలోచనుం డై యిట్లను నీదక్షుండు మర్త్యశరీరంబు శ్రేష్ఠంబుగాఁ దలఁచి యప్రతిద్రోహి యైనభగవంతునందు భేదదర్శి యై యపరాధంబుఁ గావించె నిట్టిమూఢాత్ముండు దత్త్వవిముఖుం డగు మఱియుం గూట

---

1 కవరయశో, హానికరుఁడు క్రియాహీనుచేత. *42 వ 43వ పద్యములకు నడుమ 'ఇట్లను చున్నసమయంబున, క. శివు దక్షుఁడు నిందించుతె, గువకుఁ శిర నూఁచె రుచి భృగుఁడు కనుగీఁటెం. గవకవ నగియెను బూషుఁడు, దివిజులు ఋత్విజులు ననుమతిఁ వినుచుండన్. వ. అంత దక్షుండు మఱియును,' అని యధికపాఠ మొకప్రతిని గానిపించుచున్నది.

ధర్మంబు(లయిననివాసంబు)లగ్రామ్యసుఖకాంక్షులం జేసి సక్తుండై యర్థవాదంబు
లయినవేదంబులచేత నష్టమనీషం గలిగి కర్మతంత్రంబు విస్తృతంబు సేయు
వెండియు దేహాదికంబు లుపాదేయంబులుగాఁ దలఁచుచు బుద్ధిచేత నాత్మత
త్త్వంబు మఱచి వర్తించుచుఁ బశుప్రాయుండై స్త్రీకాముండు నగు నిదియునుం
గాక దక్షుం డచిరకాలంబున మేషముఖుం డగు నని మఱియు. 47

మ. అనయంబుం దనమానసంబున నవిద్యన్ ముఖ్యతత్త్వంబు గాఁ
గని గౌరీశుఁ దిరస్కరించినయసత్కర్మాత్ము నీదక్షుని
న్ననువర్తించినవాఁడు సంసరణకర్మారంభుఁడై నిచ్చలున్
జననం బందుచుఁ జచ్చుచున్ మరల నోజం బుట్టుచున్ వర్తిలున్. 48

వ. అదియునుం గాక యాహారద్వేషులైనద్విజు లర్థవాదబహుళంబులైనవేద
వాక్యంబులవలన మధుగంధసమంబైనచిత్తక్షోభంబుచేత విమోహితమనస్కు
లయి కర్మాసక్తు లగుదురు మఱియును భక్ష్యాభక్ష్యవిచారశూన్యులై దేహాది
పోషణంబుకొఱకు ధరియింపఁబడినవిద్యాతపోవ్రతంబులు గలవారలై ధన
దేహేంద్రియంబులయందుఁ బ్రీతిం బొంది యాచకులై విహరింతు రని నంది
కేశ్వరుండు బ్రాహ్మణజనంబుల శపియించినవచనంబులు విని భృగుమహాముని
మరల శపియింపం బూని యి ట్లనియె. 49

తే. వసుధ నెవ్వారు ధూర్జటివ్రతులు వారు, వారికనుకూలురగుదు రెవ్వారువారు
నట్టిసచ్ఛాస్త్రపరిపంథులైనవారు, నవనిఁ బాషండు లయ్యెద రని శపించె. 50

సీ. సకలవర్ణాశ్రమాచారహేతువు లోక, మునకు మంగళమార్గమును సనాత
నముఁ బూర్వఋషిసమ్మతముజనార్దనమూల, మును నిత్యమును శుద్ధమును బరంబు
[1]నార్యపథానుగం బగు వేదమును విప్ర, గణము నిందించినకారణమున
నేశివదీక్షయం దేని మధ్యమపూజ్యుఁ, డై భూతపతి దైవ మగుచు నుండు

తే. నందు మీరలు భస్మజటాస్థిధార, ణములఁ దగి మూఢబుద్ధులు నష్టశౌచు
లై నశింతురు పాషండు లగుచు ననుచు, శాప మొనరించె నాద్విజసత్తముండు.

వ. ఇట్లన్యోన్యంబును శాపంబులం బొందియు భగవదనుగ్రహంబు గలవార లగుటం
జేసి నాశంబు నొందరై రట్టియెడ విమనస్కుం డగుచు ననుచరసమేతుం డై
భవుండు సనియె నంత. 52

సీ. అనఘాత్మ యే యజ్ఞమందు సర్వశ్రేష్ఠుఁ, డగుహరి సంపూజ్యుఁడై వెలుంగు
నట్టియజ్ఞంబు సమ్యగ్విధానమున స, హస్రవత్సరములు నజుఁ డొనర్చెఁ
గర మొప్ప నమరగంగాయమునాసంగ, మావనిఁ గలుగుప్రయాగయందు
నవభృథస్నానంబు లతిభక్తిఁ గావించి, గతకల్మషాత్ములై ఘనత కెక్కి

తే. [2]తగ నిజాశ్రమభూములఁ దలఁచి వార, లందఱును వేడ్కతోఁ జనిరనుచువిదురు

1. నార్యపథంబును నగు. 2. తమతమాశ్రమ.

నకును మైత్రేయుఁ డనుముని నాయకుండు, నెఱుఁగ వినిపించి వెండియు నిట్టు లనియె.

### దక్షప్రజాపతియజ్ఞమునకు దాక్షాయణి వోఁ గోరుట.

వ. అంత శ్వశురుండగు దక్షునకు జామాత యైన భర్గునకు నన్యోన్యవిరోధంబు పెరుఁగుచుండ నతిచిరం బగు కాలం బరిగె నంత దక్షుండు రుద్రవిహీనంబగు యాగంబు లేనిది యైనను శర్వుతోడి పూర్వవిరోధంబునను బరమేష్ఠికృతం బైన సకలప్రజాపతివిభుత్వగర్వంబుననుం జేసి బ్రహ్మనిష్ఠు లగు నీశ్వరాదుల ధిక్కరించి యరుద్రకంబుగా వాజపేయసవనంబు గావించి తదనంతరంబ బృహస్పతిసవననామకం బైన మఖంబు సేయ నుపక్రమించిన నచ్చటికిం గ్రమంబున. 54

చ. కర మనురక్తి నమ్మఖము గన్గొను వేడుక దొంగలింపఁగాఁ
బరమమునిప్రజాపతిసుపర్వమహర్షివరుల్ సభార్యులై
పరువడి వచ్చి యందఱు శుభస్థితి దీవన లిచ్చి దక్షుచేఁ
బొరిఁ బొరి నచ్చటన్ విహితపూజల నొంది[1]రి సమ్మదంబునన్. 55

తే. దక్షతనయ సతీదేవి దవిలి యాత్మసదనమున నుండి జనకుని సవనమహిమ
ఖగనచరులు నుతింప నాకలకలంబు, విని కుతూహలిని యయి విస్వదిఁ జూడ.

వ. అయ్యవసరంబునఁ దదుత్సవదర్శనకుతూహలులై సర్వదిక్కులవారును జనుచుండి రాసమయంబున. 57

సీ. తనరారు నవరత్నతాటంకరోచులు, చెక్కుటద్దములతోఁ జెలిమి సేయ
మహనీయతపనీయమయపదకద్యుతు, లంసభాగంబుల నావరింప
నంచితచీనిచీనాంబరప్రభలతో, మేఖలాకాంతులు మేల మాడఁ
జంచలాచంచలచారువిలోచనప్రభలు నల్దిక్కులఁ బ్రబ్బికొనఁగ

తే. మించు వేడుక భర్తృసమేత లగుచు, మానితము లైన దివ్యవిమానయాన
లగుచు నాకాశపథమున నరుగుచున్న, ఖచరగంధర్వకిన్నరాంగనలఁ జూచి. 58

క. సతి దనపతి యగునాపశుపతిఁ జూచి సముత్సుకతను భాషించి ప్రజా
పతి మీమామ మఖము సువ్రతమతి నొనరించుచున్నవాఁ డఁట వింటే. 59

క. కావున నయ్యజ్ఞమునకు, నీవిబుధగణంబు లర్థి నేఁగెద రదె వో
దేవ మన మిప్పు డచటికిఁ, బోవలె నను వేడ్క నాకుఁ బుట్టెడు నభవా. 60

క. ఆయజ్ఞముఁ గనుఁగొనఁగా, నాయనుజలు భక్తిఁ బ్రాణనాథులతోడం
బాయక వత్తురు మనముం, బోయిన నే వారి నచటఁ బొడగనఁ గల్గున్. 61

క. జనకునిమఖమునఁ గర్థిం, జని నీతోఁ బారిబర్హసంజ్ఞకతఁ గడుం
దనరినభూషణములఁ గైకొన వేడ్క జనించె నీశ కుజనవినాశా. 62

క. నాతోడను స్నేహము గల, మాతను దత్సోదరీసమాజము ఋషిసం
ఘాతకృతమఖసమంచిత, కేతువుఁ గన వేడ్క గగనకేశ జనించెన్. 63

---

1 వసించి రిమ్ములన్.

వ. అదియునుం గాక దేవా మహాశ్చర్యకరం బై గుణత్రయాత్మకం బగుప్రపంచంబు భవదీయమాయావినిర్మితం బగుటం జేసి నీకు నాశ్చర్యకరంబు గా దయినను భవదీయతత్త్వం బెఱుంగంజాలక కామినీస్వభావంబు గలిగి కృపణురాల నై మదీయజన్మభూమిఁ గనుంగొన నిచ్ఛగించితి నని వెండియు నిట్లనియె. 64

చ. ముదమునఁ దన్మఖోద్భవవిభూతిఁ గనుంగొన నన్యకామినుల్
పసువులు గట్టి భూషణవిభాసిత లై నిజనాథయుక్త లై
మదకలహంసపాండురసమంచితదివ్యవిమానయాన లై
యదె చను చున్నవారు గను మభ్రపథంబున నీలకంధరా. 65

క. అనఘా విను లోకంబుల, జనకుని గేహమునఁ గలుగుసకలసుఖంబుల్
తనయలు సని సంప్రీతిం, గనుఁగొన కేరీతి నిలుచుఁ గాయము లభవా. 66

క. అనయముఁ బిలువక యుండం, జన ననుచిత మంటి వేని జనకగురుసుహృ
జ్జననాయకగేహములకుఁ, జను చుందురు పిలువ కున్న సజ్జను లనఘా. 67

వ. అని మఱియు నిట్లనియె దేవా నాయందుఁ బ్రసన్నుండ వై మదీయమనోరథంబు దీర్ప నర్హుండవు సమధికజ్ఞానంబు గలనీచేత నేను భవదీయదేహంబునం దర్ధంబున ధరియింపంబడితి నట్టినన్ను ననుగ్రహింప వలయు నని ప్రార్థించిన మందస్మితవదనారవిందుం డగుచు [1]జగత్స్రష్టలసమక్షంబున దక్షుండు తన్నాడిన మర్మభేదంబు లైనకుహకవాక్యసాయకంబులం దలంచుచు నిట్లనియె. 68

సీ. కల్యాణి నీమాట గడు నొప్పు బంధువుల్, పిలువ కుండినను సంప్రీతిఁ జనుదు
[2]రంటి విదియు లెస్స యైనను దేహాభి,మానమదమున నమర్షమునను
గడఁగి యారోపితఘనకోపదృష్టులు, గా రేనిఁ బోఁ దగుఁ గాని వినుము
వినుతవిద్యాతపోవిత్తవయోరూప,కులములు సుజనులకును గుణంబు
తే. లివియ కుజనులయెడ దోషహేతుకంబు,లై వివేకంబు సెఱుచు మహాత్ము లైన
వారిమాహాత్మ్య మాత్మగర్వమునఁ జేసి, జడులు పొడగానఁజాలరు జలజనేత్ర.

క. విను మట్టికుటిలు లగుదు,ర్జనులగృహంబులకు బంధుసరణిని బోవం
జనదు వినీతుల కది గడు, ననుచిత మైనట్ల యుండు నది యె ట్లనినన్. 70

ఆ. కుటిలబుద్ధు లయినకుజనులయిండ్లకు, నార్యు లేఁగ వా రనాదరమున
బొమలు ముడివడంగ భూరిరోషాత్ము లై, చూతు రదియుఁ గాక సుదతి వినుము.

చ. సమదరిపుప్రయుక్తపటుసాయకజర్జరితాంగుఁ డయ్యు దుః
ఖము[3]ను బొఱంగి నిద్రఁ గనుఁ గాని కృశింపఁడు మానవుండు నో
యుమ విను మిష్టబాంధవదురుక్తులు మర్మము లంట నాటఁ జి
త్తమున నహర్నిశంబుఁ బరితాపము నొంది కృశించు నెప్పుడున్. 72

క. విను లోకోత్కృష్టుఁడు ద, క్షునికిఁ దనూభవలలోనఁ గూరిమిసుత వై

---

1 బ్రహ్మలసమక్ష. 2 నంటి. 3 నఁ గడంగి.

నను నాసంబంధంబున, జనకునిచేఁ బూజ వడయఁగ జాలవు తరుణీ. 73

వ. అది యెట్లతనిచేత భవత్సంబంధవశంబునం జేసి పూజఁ బడయ లేమికి నతనికి నీకు
విరోధంబునకు హేతు వెట్టి దని యంటి వేని. 74

మ. నిరహంకారనిరస్తపాపసుజనానీకనిందోల్లసత్కీర్తిఁ గొం
దఱు కామించి యశక్తులై మనములన్ దందహ్యమానేంద్రియా
తురులై యూరక మచ్చరింతురు మహాత్ముం డీశ్వరుం డైనయా
హరితో బద్ధవిరోధముం దొడరుదైత్యశ్రేణిచందంబునన్. 75

వ. అదియునుం గాక నీ వతనికిం బ్రత్యుత్థానాభివందనంబులు గావింప కుండుటం జేసి
తిరస్కృతుండ వైతి వంటి వేని లోకంబున జను లన్యోన్యంబును బ్రత్యుత్థానాభి
వందనంబులు గావింతు రదియ ప్రాజ్ఞు లయినవారు సర్వభూతాంతర్యామి
యైనపరమపురుషుండు నిత్యపరిపూర్ణుండు గావునఁ గాయికవ్యాపారం బయుక్తం
బని తదుద్దేశంబుగా మనంబునంద నమస్కారాదికంబులు గావింతురుగాని దేహా
భిమానంబులు గలుగుపురుషులందుఁ గావింపరు గాన యేనును వాసుదేవశబ్దవా
చ్యుండు శుద్ధసత్త్వమయుండు నంతఃకరణంబునందు నావరణవిరహితుండు నై
ప్రకాశించువాసుదేవునకు నెల్లప్పుడు నమస్కరించు చుండుదు ని ట్లనపరాధి నై
ననన్నుఁ బూర్వంబున బ్రహ్మలు సేయుసత్త్రంబునందు దురుక్తులం జేసి పరా
భవించి మద్ద్వేషి యైనదక్షుండు భవజ్జనకుం డైన నతఁడును దదనువర్తు
లయినవారలును జూడఁ దగరు గావున మద్వచనాతిక్రమంబునం జేసి యరిగితి
వేని నచట నీకుఁ బరాభవంబు సంప్రాప్తం బగు లోకంబున బంధుజనం
బులవలనఁ బూజ వడయక తిరస్కారంబు వొందుట చచ్చుటయ కాదే యని
పలికి మఱియు నభవుండు పొమ్మని యనుజ్ఞ యిచ్చిన నచ్చట నవమానంబునం
జేసి యశుభం బగు ననియు నిచ్చటఁ బొమ్మనక నివారించిన మనోవేదన యగు
ననియు మనంబున దలపోయుచు నూరకుండె నంత. 76

సీ. సతి సుహృద్దర్శనేచ్ఛాప్రతికూలదుః,ఖస్వాంత యగుచు నంగములు వడఁక
నందంద తొరఁగెడునశ్రుపూరంబులు, గండభాగంబులఁ గడలుకొనఁగ
నున్నతస్తనమండలోపరిహారముల్, వేఁడినిట్టూర్పుల వెచ్చఁ గంద
నతిశోకరోషాకులాత్యంతదోధూయ,మాన మై హృదయంబు మలఁగుచుండ

తే. మఱియుఁ గుపితాక్షి యై స్వసమానరహితు, నాత్మదేహంబుసగమిచ్చినట్టిభవుని
విడిచిమూర్ఛాత్మ యగుచు నవ్వెలఁది సనియె, జనకుఁ జూచెదువేడుకసందడింప.

వ. ఇట్లతిశీఘ్రగమనంబున. 78

సీ. మానిని చను చుండ మణిమన్మదాదిస,హస్రసంఖ్యాతరుద్రానుచరులు
యక్షులు నిర్భయులై వృషభేంద్రుని, ముందిడికొనుచు నమ్ముదిత దాల్చు
కందుకాంబుజశారికాతాళవృంతద,ర్పణధవళాతపత్త్రప్రసూన

మాలికాసౌవర్ణమణివిభూషణఘన, సారకస్తూరికాచందనాది
తే. వస్తువులు గొంచు నేఁగి శర్వాణిఁ గదిసి, శంఖదుందుభివేణునిస్స్వనము లొప్ప
మానితం బైనవృషభేంద్రయానఁ జేసి, యజ్ఞభూమార్గులై యర్థి నరిగి యరిగి.
వ. ముందట. 80
చ. మనమున మోద మందుచు నుమారమణీమణి గాంచెఁ జారుమృ
త్కనకకుశాజినాయసనికాయవినిర్మితపాత్రసీమము
న్ననుపమవేదఘోషసుమహాత్పశుబంధనకర్మభూమము
మునివిబుధాభిరామము సముజ్జ్వలహోమము యజ్ఞధామమున్. 81
వ. ఇట్లు గనుంగొని యజ్ఞశాలం బ్రవేశించిన. 82
క. చనుదెంచిన యమ్మగువను, జననియు సోదరులుఁ దక్క సభఁ గలజను లె
ల్లను దక్షువలనిభయమున, ననయము నపు డాదరింప రైరి మహాత్మా. 83
క. నెఱిఁ దల్లియుఁ బినతల్లులు, బరిరంభణ మాచరింపఁ బరితోషాశ్రుల్
దొరఁగఁగ డగ్గుత్తికతో, సరసిజముఖి సేమ మరయ సతియును నంతన్. 84
క. జనకుం డవమానించుట,యును సోదరు లర్థిఁ దనకు నుచితక్రియఁ జే
సినపూజల నందక శో,భన మరసిన మాఱుమాట వలుకక యుండెన్. 85
వ. ఇట్లు తండ్రిచే నాదరింపంబడని దై విభుం డైనయీశ్వరునందు నాహ్వానక్రియా
శూన్యత్వరూపం బైనతిరస్కారంబును నరుద్రభాగం బైన యజ్ఞంబునుం గనుం
గొని నిజరోషానలంబున లోకంబులు భస్మంబు సేయం బూనిన తెఱంగున నుద్రే
కించి రుద్రవిద్వేషియుఁ గ్రతుకర్మాభ్యాసగర్విష్ఠుండు నగుదక్షుని వధియింతు మ
నుచు లేచిన భూతగణంబుల నివారించి రోషవ్యక్తభాషణంబుల ని ట్లనియె లో
కంబున శరీరధారు లైనజీవులకుఁ బ్రియాత్మకుం డైనయీశ్వరునకుఁ బ్రియా
ప్రియులును నధికులును లే రట్టిసకలకారణుండును నిర్మత్సరుండును నైనరుద్రు
నందు నీవు దక్క నెవ్వండు ప్రతికూలం బాచరించు నదియునుం గాక మిము
బోఁటివారలు పరులవలనిగుణంబులందు దుర్గుణంబుల నాపాదింతురు మఱి
యుం గొందఱు మధ్యస్థు లైనవారలు పరులదుర్గుణంబులయందు దోషంబుల
నాపాదింపరు గొందఱు సాధువర్తనంబు గలవారలు పరులదోషంబుల నైన
గుణంబుల కా ననుగ్రహింతురు మఱియుం గొంద ఱుత్తమోత్తములు పరుల
యందు దోషంబుల నాపాదింపక తుచ్ఛగుణంబులు గలిగినను సద్గుణంబులుగాఁ
గైకొందు రట్టిమహోత్తములయందు నీవు పాపబుద్ధి గల్పించితి వని వెండియు
ని ట్లను మహాత్ము లగువారలపాదధూళిచే నిరస్తప్రభావు లై జడస్వభావంబు
గలదేహంబు నాత్మ యని పల్కుకుజను లగువారు మహోత్తముల నిందించుట
కార్యంబు గా దదియు వారి కనుచితం బగు నని వెండియు ని ట్లనియె. 86
సీ. అనయంబు శివ యనునక్షరద్వయ మర్థి, వాక్కునఁ బలుకు భావమునఁ దలఁప

సర్వజీవులపాపసంఘముల్ సెడు నట్టి, మహితాత్మునందు నశమంగళుండ
వగునీవు విద్వేషి వగుట కాశ్చర్యంబు, నందెద వినుము నీ వదియుఁ గాక
చర్చింప నెవ్వని చరణపద్మంబుల, నరసి బ్రహ్మానంద మనుమరంద

తే. మఱులభక్తిని తమహృదయంబు లనెడి, తుమ్మెదలచేతఁ గ్రోలి సంతుష్టచిత్తు
లగుదు రత్యంతవిజ్ఞాను లట్టిదేవు, నందు ద్రోహంబు సేసి తే మందు నిన్ను.

క. మఱియును నమ్మహితాత్ముని, చరణసరోజాతయుగము సకలజగంబుల్
నెఱిఁ [1]గొలువఁ గోరుకోర్కులు, దర మిడి వర్షించు నతనిఁ దగునే తెగడన్.

చ. పరఁగఁ జితాస్థిభస్మనృకపాలజటాధరుఁడుం బరేతభూ
చరుఁడు పిశాచయుక్తుఁ డని శర్వ నమంగళుఁ గాఁ దలంప రె
వ్వరు నాకఁ డీవు దక్క మఱి వాక్పతిముఖ్యులు నమ్మహాత్మున
చ్చరణసరోజరేణువులు సమ్మతిఁ దాల్తురు మస్తకంబులన్. 89

చ. నెలకొని ధర్మపాలనవినిర్మలు భర్తఁ దిరస్కరించున
క్కలుషునిజిహ్వఁ గోయఁ దగు గా కటు సేయఁగ నోపఁ డేనిఁ దాఁ
బొలియుట యొప్పు రెంటికిఁ బ్రభుత్వము సాలమిఁ గర్ణరంధ్రముల్
బలువుగ మూసికొంచుఁ జనఁ బాడి యటందురు ధర్మవర్తనుల్. 90

వ. అది గావున. 91

మ. జనుఁ డజ్ఞానమునన్ భుజించినజుగుప్సం బైనయన్నంబు స
య్యన వెళ్లించి పవిత్రుఁ డైనగతి దుష్టాత్ముండ వై యాశ్వను
ఘును నిందించిననీతనూభవ యనం గా నొర్వ నీహేయభా
జన మైనట్టిశరీరమున్ విడిచి భాస్వచ్ఛుద్ధి వాటిల్లెదన్. 92

వ. అదియునుం గాక దేవతల కాకాశగమనంబును మనుష్యులకు భూతలగమనం
బును స్వాభావికంబు లయినట్లు ప్రవృత్తినివృత్తిలక్షణకర్మంబులు రాగవైరా
గ్యాధికారంబులు గా వేదంబులు విధించుటంజేసి రాగయుక్తు లై కర్మతంత్రు
లయినసంసారులకు వైరాగ్యయుక్తు లయి యాత్మారాము లయినయోగిజనులకు
విధినిషేధరూపంబు లయినవైదికకర్మంబులు గలుగుటయు లేకుండుటయు
నైజంబు లగుటంజేసి స్వధర్మనిష్ఠుం డగువాని నిందింపం జన దాయుభయకర్మ
శూన్యుండు బ్రహ్మభూతుండు నయినసదాశివునిఁ గ్రియాశూన్యుం డని నిందిం
చుట పాపం బగుఁ దండ్రీ సంకల్పమాత్రప్రభవంబు లగుటంజేసి మహాయోగి
జనసేవ్యంబు లయినయస్మదీయంబు లగునణిమాద్యష్టైశ్వర్యంబులు నీకు సంభ
వింపవు భవదీయంబు లగునైశ్వర్యంబులు ధూమమార్గప్రవృత్తు లై యాగాన్న
భోక్తలైనవారిచేత యజ్ఞశాలయందె చాల నుతింపంబడి యుండుఁగాన నీమనం

1 గోరినకోరికలను.

బున నే నధికసంపన్నుండ ననియుఁ జితాభస్మాస్థిధారణుం డైనరుద్రుండు దరి
ద్రుం డనియును గర్వింపం జన దని వెండియు ని ట్లనియె. 93

ఉ. నీలగళాపరాధి యగు నీకుఁ దనూభవ నౌట చాలదా
చాలుఁ గుమర్త్య నీదుతనుజాత నగా మది సిగ్గు పుట్టెడి
న్నేల ధరన్ మహాత్ములకు నెగ్గొనరించెడివారిజన్మముల్
గాలుపనే తలంప జనకా కుటిలాత్మక యెన్ని చూడఁగన్. 94

చ. వరవృషకేతనుండు భగవంతుఁడు నైనహరుండు నన్ను నా
దరపరిహాసవాక్యముల దక్షతనూభవ యంచుఁ బిల్వ నేఁ
బురపురఁ బొక్కుచున్ ముదముఁ బొందక నర్మవచఃస్మితంబులం
దొఱఁగుదు నీతనూజ ననుదుఃఖముకంటెను జచ్చు టొప్పగున్. 95

వ. అని యిట్లు యజ్ఞసభామధ్యంబునం బ్రతికూలుం డగుదక్షు నుద్దేశించి పలికి కామక్రోధాదిశత్రువిఘాతిని యగుసతీదేవి యుదఙ్ముఖి యయి జలంబుల నాచమనంబు సేసి శుచి యై మౌనంబు ధరియించి జితాసన యై భూమియం దాసీన యగుచు యోగమార్గంబునం జేసి శరీరత్యాగంబు సేయం దలంచి. 96

సీ. వరుసఁ బ్రాణాపానవాయునిరోధంబు, గావించి వాని నేకముగ నాభి
తలమునఁ జేర్చి యంతట నుదానము దాఁక, [1]నెగయించి బుద్ధితో హృదయపద్మ
మున నిల్పి వాని మెల్లన కంఠమార్గము, నను మఱిభ్రూమధ్యమున వసింపఁ
జేసి శివాంఘ్రిరాజీవచింతనముచే, నాథునిఁ దక్క నన్యంబుఁ జూడ

తే. కమ్మహాత్మునియంకపీఠమ్మునందు, నాదరంబున నుండుదేహంబు దక్షు
వలనిరోషంబునను విడువంగఁ దలఁచి, తాల్చెఁ దనువున ననిలాగ్నిధారణములు.

వ. ఇట్లు ధరియించి గతకల్మషం బైనదేహంబు గలసతీదేవి నిజయోగసమాధిజనితం బయినవహ్నిచేఁ దత్క్షణంబ దగ్ధ యయ్యె నంత. 98

క. అది గనుఁగొని హాహారవ, మొదవఁగ ని ట్లనిరి మానవులుఁ ద్రిదశులు నీ
మదిరాక్షి యకట దేహము, వదలెఁ గదా దక్షుతోడివైరముకతనన్. 99

వ. మఱియు ని ట్లనిరి. 100

సీ. సకలచరాచరజనకుఁ డై నట్టియీ, దక్షుండు దనకూర్మితనయ మాన
వతి పూజనీయ యీసతి దనచే నవ, మానంబు నొంది సమక్షమందుఁ
గాయంబుఁ దొఱఁగంగఁ గనుఁగొనుచున్నవాఁ, డిట్టిదౌరాత్మ్య మెందేనిఁ గలదె
యనుచుఁ జిత్తంబుల నాశ్చర్యములఁ బొంది, రదియునుఁ గాక యిట్లనిరి యిట్టి

తే. దుష్టచిత్తుండు బ్రహ్మబంధుండు నయిన, యీతఁ డనయంబుఁ దానపఖ్యాతిఁ బొందు
నిందఁ బడి మీఁద దుర్గతిఁ జెందుఁ గాక, యనుచు జనములు వలుకున య్యవసరమున.

క. దేహము విడిచినసతిఁ గని, బాహాబల మొప్ప రుద్రపార్షదులును ద

1 గదియించి.

ద్రోహిం ద్రుంచుటకై యుత్సాహంబున లేచి రసిగదాపాణులు నై. 102

క. ఆరవ మపు డీక్షించి మహారోషముతోడ భృగుమహాముని క్రతుసం
హారకమారక మగునభిచారకహోమం బొనర్చె సరభసవృత్తిన్. 103

వ. ఇట్లు దక్షిణాగ్నియందు వేల్చిన నందుఁ దపం బొనర్చి సోమలోకంబున నుండు సహస్రసంఖ్యలు గలఋభునామధేయు లైన దేవత లుదయించి బ్రహ్మతేజంబునం జేసి దివ్యవిమాను లై యుల్ముకంబులు సాధనంబులుగా ధరియించి రుద్రపార్షదు లయిన ప్రమథగుహ్యకగణంబులఁ బాఱందోలిన వారును బరాజితు లై రి తదనంతరంబ నారదువలన నభవుండు దండ్రిచే నసత్కృతురా లగుటం జేసి భవాని పంచత్వంబు నొందుటయుం బ్రమథగణంబులు ఋభునామకదేవతలచేఁ బరాజితు లగుటయు విని. 104

శా. ఆద్యం డుగ్రుఁడు నీలకంఠుఁ డిభదైత్యారాతి దష్టోష్ఠుఁ డై
మాద్యద్భూరిమృగేంద్రఘోషమున భీమప్రక్రియన్ నవ్వుచున్
విద్యుద్వహ్నిశిఖాసముచ్చయరుచిన్ వెల్గొందుచంచజ్జటన్
సద్యఃక్రోధముతోడఁ బుచ్చి వయిచెన్ క్ష్మాచక్రమధ్యంబునన్. 105

వ. ఇట్లు వెఱికి వైచినరుద్రునిజటయందు. 106

శివుఁడు వీరభద్రునిచే దక్షయజ్ఞంబు ధ్వంసంబు సేయించుట.

సీ. అభ్రంలిహాదభ్రవిభ్రమాభ్రభ్రమ, కృష్ణీలదీర్ఘశరీర మమరఁ
బ్రజ్వలజ్జ్వలనదీప్తజ్వాలికాజాల, జాజ్వల్యమాన కేశములు మెఱయఁ
జండదిగ్వేదండశుండాభదోర్దండ, సాహస్రధృత హేతిసంఘ మొప్ప
వీక్షణత్రయలోకవీక్షణద్యుతిలోక, వీక్షణతతిదుర్నిరీక్షముగను

తే. క్రకచకఠినకరాళదంష్ట్రలు వెలుంగ, ఘనకపాలాస్థివనమాలికలును దనర
నఖిలలోకభయంకరుఁడగుచు వీర,భద్రుఁ డుదయించె మాఱటరుద్రుఁడగుచు.

తే. వీరభద్రుండు విహతవిద్వేషిభద్రుఁ, డగుచుఁ దనవేయిచేతులు మొగిచి వినయ
మెసఁగ నేనేమి సేయుదు నెఱుఁగ నాకు, నాన తిమ్మన నతని కయ్యభవుఁ డనియె.

చ. గురుభుజశౌర్య భూరిరణకోవిద మద్భటకోటి కెల్ల నీ
వరయ వరూథినీవరుఁడ వై చని యజ్ఞము గూడ దక్షునిం
[1]బరిపరిసేసి ద్రుంపు మట బ్రాహ్మణతేజ మజేయ మంటి వే
నరిది మదంశసంభవుఁడ వై తగు నీకు నసాధ్య మెయ్యెడన్. 109

వ. అని కుపితచిత్తుం డై యాజ్ఞాపించిన నట్ల కాక యని. 110

చ. అనఘుఁడు రుద్రుఁ జేరి ముద మారఁ బ్రదక్షిణ మాచరించి వీ
డ్కొని యనివార్యవేగమునఁ గుంభిని గ్రక్కదలన్ ఝుళంఝుళ
ధ్వని మణినూపురంబులు పదంబుల మ్రోయఁగ భీషణప్రభల్

1 బరువడిఁ ద్రుంపు మీ వచట.

దనరఁ గృతాంతకాంతకశితస్ఫుటశూలముఁ బూని చెచ్చెరన్. 111

చ. సరభసవృత్తి న ట్లరుగు సైన్యపదాహతపాదధూళిధూ
సరితకుబేరదిక్తటము సభ్యులు దక్షుఁడుఁ జూచి యెట్టిభీ
కరతమ మం చనం దమము గాదు రజఃపటలం బటంచు ని
వ్వెఱపడి పల్కి రాత్మల వివేకవిహీనతఁ బొంది వెండియున్. 112

సీ. ఈధూళి పుట్టుట కెయ్యది హేతువో, విలయసమీరమా పొలయ దిపుడు
ప్రాచీనబర్హి ధరాపతి మహితోగ్ర, శాసనుఁ డిపుడు రాజ్యంబు సేయఁ
జోరసంఘములకో రా రాదు మఱి గోగ, ణాళిరాకకు సమయంబు గాదు
కావున నిప్పుడు కల్పావసానంబు, గాఁ బోలుఁ గా దటు గాక యున్న

తే. నిట్టియాత్యాహితకరజ మెందేనిఁ గలదె, యనుచు మనముల భయమంది రచటిజనులు
సురలు దక్షుఁడు నంతఁ బ్రసూతిముఖ్య, లయినభూసురకాంత లిట్లనిరి మఱియు.

క. తనకూఁతులు సూడఁగ నిజ, తనయను సతి ననపరాధఁ దగ వఱి యి ట్లె
గ్గొనరించినయాదక్షుని, ఘనపాపవిపాక మిదియుఁ గాఁ దగు ననుచున్. 114

వ. అని వెండియు ని ట్లనిరి కుపితాత్ముం డైనదక్షుండు దనకూఁతుతోడి విరోధంబు సాలక జగత్సంహారకారణుం డయినరుద్రునిం గ్రోధింపం జేసె నమ్మహాత్ముం డెంత టివాఁ డం టేనిం బ్రళయకాలంబున. 115

సీ. సుమహితనిశితత్రిశూలాగ్ర[1]సంప్రోత, నిఖిలదిక్కరిరాజనివహుఁ డగుచుఁ
జటులోగ్రనిష్ఠురస్తనితగంభీరాట్ట, హాసనిర్భిన్నాఖిలాశుఁ డగుచు
భూరికరాళవిస్ఫారదంష్ట్రాహతి, పతితతారాగణప్రచయుఁ డగుచు
వివిధహేతివ్రాతవిపులప్రభాపుంజ, మండితచండదోర్దండుఁ డగుచు

తే. వికటఘోషభయంకరభ్రుకుటిదుర్ని, రీక్షదుస్సహతేజోమహిముఁ డనర్చి
ఘనవికీర్ణజటాబంధకలితుఁ డగుచు, నఖిలసంహారకారణుఁ డయి నటించు. 116

తే. అట్టిదేవునిఁ ద్రిపురసంహారకరుని, జంద్రశేఖరు సద్గుణసాంద్రు నభవు
మనము ఘోషింపఁజేసిన మంగళములఁ, బొందవచ్చునె పద్మగర్భునకు నైన.

వ. అని యివ్విధంబున భయవిహ్వలలోచనలై పలుకుచున్నసమయంబున మహాత్ముం డైనదక్షునకు భయావహంబు లై సహస్రసంఖ్యాతంబు లైనమహోత్పాతంబులు భూనభోంతరంబులం గానంబడు చుండె నాసమయంబున రుద్రానుచరులు నానావిధసాధనంబులు ధరియించి కపిలపీతవర్ణంబులు గలిగి వామనాకారులు మకరోదరాననులు నై యజ్ఞశాలాప్రదేశంబునం బరువులు వెట్టుచుఁ గదియం జనుదెంచి దక్షాధ్వరవాటంబులు విటతాటంబులు సేయుచుం గొందఱు ప్రాగ్వంశంబును గొందఱు పత్నీశాలయుఁ గొందఱు సదస్యశాలయుఁ గొందఱాగ్నీధ్రశాలయుఁ గొందఱు యజమానశాలయుఁ గొందఱు మహానసగృహం

1 కుంఠిత.

బును విధ్వంసంబులు గావించిరి మఱియుఁ గొందఱు యజ్ఞపాత్రంబుల నగ్ను
లనుం జెఱిచిరి వెండియుఁ గొందఱు హోమాగ్ను లార్చిరి పదంపడి కొందఱు
హోమకుండంబులయందు మూత్రంబులు విడిచిరి గొంద ఱుత్తరవేదికామేఖ
లలు ద్రెంచిరి గొందఱు మునుల బాధించిరి గొందఱు తత్పత్నుల వెఱపించిరి
మఱికొందఱు దేవతానిరోధంబుఁ గావించి రంత మణిమంతుండు భృగువును
వీరభద్రుండు దక్షునిఁ జండీశుండు పూషుని నందీశ్వరుఁడు భగునిఁ బట్టి
రివ్విధంబున సదస్యదేవర్త్విజ్నికాయంబుల శిలల ఱువ్వియు జానువులఁ బొడి
చియు నఱచేతుల నడిచియుఁ గూర్పరంబులఁ బొడిచియు వివిధబాధలు వఱిచిన
వారు కాందిశీకులై యెక్కడెక్కడేనియుం జనిరి మఱియును. 118

క. మును దక్షుఁ డభవుఁ బలుకఁగఁ, గను గీఁటినభగునిఁ బట్టి కన్నులు పెకలిం
చెను నందీశ్వరుఁ డచ్చటి, జనములు హాహారవముల సందడిఁ బెట్టన్. 119

తే. కుపితుఁడై నాఁడు భవుని దక్షుఁడు శపింపఁ, బరిహసించినపూషునిపండ్లు డుల్లఁ
గొట్టె బలభద్రుఁ డాకళింగునిరదంబు, లెలమి డులిచినపగిదిఁ జండీశ్వరుండు.

క. తగ వేది దక్షుఁ డాసభ, నగచాపుఁ దిరస్కరించునాఁ డట శ్మశ్రుల్
నగుచుం జూపుట నాభృగు, పగకై శ్మశ్రువులు వీరభద్రుఁడు వెఱికెన్. 121

సీ. అతులదర్పోద్ధతుండై వీరభద్రుండు, గైకొని దక్షువక్షంబుఁ ద్రొక్కి
ఘనసితధారాసిఁ గొని మేను వొడిచియు, మంత్రసమన్వితమహితశస్త్ర
జాలావినిర్భిన్నచర్మంబు గలదక్షుఁ, జంపఁగా లేక విస్మయము నొంది
తద్వధోపాయంబు దనచిత్తమునఁ జూచి, కంఠనిష్పీడనగతిఁ దలంచి

తే. మస్తకముద్రుంచి యంచితామర్షణమున, దక్షిణానలమున వేల్చెఁ దదనుచరులు
హర్షమునఁబొంద నచటిబ్రాహ్మణజనంబు, లాత్మలనుజాలదుఃఖంబులందుచుండ.

వ. ఇట్లు వీరభద్రుండు దక్షునియాగంబు విధ్వంసంబుగావించి నిజనివాసంబైన కైలా
సంబునకుఁ జనియె నయ్యవసరంబున. 123

దేవతలు వీరభద్రాదులచేఁ బరాజితులై బ్రహ్మతో విన్నవించుట.

చ. హరభటకోటిచేత నిశితాసి గదా కరవాల శూల ము
ద్గరముస లాదిసాధనవిదారితజర్జరితాఖిలాంగులై
సురలు భయాకులాత్ము లగుచుఁ సరసీరుహగర్భుఁ జేరి త
చ్చరణసరోరుహంబులకు సమ్మతిఁ జాఁగిలి మ్రొక్కి నమ్రులై. 124

క. తమ ధూర్జటిసైనికు లగు, ప్రమథులు దయ మాని పెలుచ బాధించుట స
ర్వముఁ జెప్పి రనుచు మైత్రే, యమునీంద్రుఁడు విదురుతోడ ననియె మఱియున్.

తే. ఇంతయును మున్ను మనమున నెఱిఁగి యున్న
కతన విశ్వాత్మకుండును గమలలోచ
నుండు నన నొప్పునారాయణుండు నజుఁడుఁ

జూడ రారైరి మున్ను దక్షునిమఖంబు. 126

వ. అని చెప్పి సురలిట్లు విన్నవించినఁ జతుర్ముఖుండు వారల కిట్లనియె. 127

క. ఘనతేజోనిధి పురుషుం, డనయంబుఁ గృతాపరాధుఁ డయినను దా మ
ల్లన ప్రతికారముఁ గావిం, చినజనులకు లోకమందు సేమము గలదే. 128

వ. అని మఱియు నిట్లనియె. 129

క. క్రతుభాగార్హుం డగుపశు,పతి నీశ్వరు నభవు శర్వు భర్గుని దూఱి
కృతయజ్ఞభాగుఁ జేసిన,యతిదోషులు దుష్టమతులు సగుమీ రింకన్. 130

సీ. పూని యేదేవునిబోమముడిమాత్రన, లోకపాలకులును లోకములును
నాశ మొందుదు రట్టియీశుండు ఘనదురు,క్తాస్త్రినికాయవిద్ధాంతరంగుఁ
డును బ్రియావిరహితుండును నైనవాఁ, డమ్మహాత్మునిఁ ద్రిపురసంహారకరుని
మఖపునస్సంధానమతి నపేక్షించు మీ,రలు సేరి శుద్ధాంతరంగు లగుచు

తే. భక్తినిష్ఠలఁ దత్పాదపద్మయుగళ,ఘనపరిగ్రహపూర్వంబు గాఁగ నతని
శరణ మొందుఁ డతండు ప్రసన్నుఁడయినఁ, దివిరిమీకోర్కి సిద్ధించుదివిజులార.

వ. అని మఱియు నిట్లనియె నద్దేవుని డాయం జన వెఱతు (మని తలంపకుం)డతనిఁ
జేరునుపాయం బెఱింగింపు మంటి రేని నేను నింద్రుండును మునులును మీర
లును(మఱియు దేహధారు లెవ్వరేని)నమ్మహాత్మునిస్వరూపంబు నతనిబలపరాక్ర
మంబులకొలందియు నెఱుంగఁ జాలమతండు స్వతంత్రుఁడు గావునఁ దదుపాయం
బెఱింగింప నెవ్వఁడు సమర్థుం(డగు నయిన నిపుడుభక్తపరాధీనుండును శరణాగత
రక్షకుండు నగునీశునిఁ జేరం బోవుద) మని వినం బలికి పద్మసంభవుండును దేవ
పితృగణప్రజాపతులం గూడి కైలాసాభిముఖుఁ డై చని చని. 132

ఉ. భాసురలీలఁ గాంచిరి సుపర్వులు భక్తజనైకమానసో
ల్లాసముఁ గిన్నరీజనవిలాసము నిత్యవిభూతిమంగళా
వాసము సిద్ధగుహ్యకనివాసముఁ జారువిరాజమానకై
లాసము గాంతినిర్జితకులక్షితిభృత్సుమహద్విభాసమున్. 133

సీ. ధాతువిచిత్రితోదాత్తరత్న[1]వ్రజ,రుగ్విభాసితతుంగశృంగములును
గిన్నరగంధర్వకింపురుషాప్సరో,జననికరాకీర్ణసానువులును
మానితనిఖిలవైమానికమిథునస,ద్విహరణైకశుభప్రదేశములును
గమనీయనవమల్లికాసుమనోవల్లి. కామతల్లీలసత్కుంజరములు

తే. సమరసిద్ధాంగనాశోభితాశ్రమములు, విబుధజనయోగ్యసంపన్నివేశములును
గలిగి బహువిధపుణ్యభోగములనొప్పు, వినుతసుకృతములకుదండవెండికొండ.

వ. అది మఱియును మందార పారిజాత సరళ తమాల సాల తాల తక్కోల కోవి
దార శిరీ షార్జున చూత కదంబ నింబ నీప నాగ పున్నాగ చంపక పాట లాశోక

---

1 'ప్రభాసంగతోజ్జ్వలతుంగ' అ. ప్ర.

వకుళ కుంద కురవక కన కామ్ర శతపత్త్రి కింశుక కైలా లవంగ మాలతీ మధూక మల్లికా పనస మాధవీ కుటజోదుంబ రాశ్వత్థ ప్లక్ష వట హింగుళ భూర్జ పూగ జంబూ ఖర్జూ రామ్రాతక ప్రియాళు నారికేళేంగుద వేణు కీచక ముఖర తరుశోభితంబును గలకంఠ కాలకంఠ కలవింక రాజకీర మత్తమధుకరనానావిహంగకోలాహలనినదబధిరీభూతదిగ్దంతరాళంబును సింహ తరక్షు శల్య గవయ శరభ శాఖామృగ వరాహ వ్యాఘ్ర కుర్కుర రురు మహిష వృక సారంగ ప్రముఖవన్యసత్త్వసమాశ్రయవిరాజితంబును గదళీషండసమావృతమండిత కమల కహ్లార కైరవకలిత పులినతల లలితకమలాకర విహరమాణ కలహంస కారండవ సారస చక్రవాక బక జలకుక్కుటాదిజలవిహంగకులకూజితసంకులంబును సలిలకేళీవిహరమాణ సతీర మణీరమణీయ కుచమండలవిలిప్తమృగమదమిళితహరిచందనగంధసుగంధజలపూరితగంగాతరంగిణీసమావృతంబును నైనకైలాసపర్వతంబు వొడగని యరవింద సంభవపురందరాదిదేవగణంబు లత్యద్భుతానందంబులం బొంది ముందటం దార హీరహేమమయవిమానసంకులంబును బుణ్యజనమానినీశోభితంబును నైనయలకా పురంబుం గడచి తత్పురోబాహ్య(ప్రదేశ)ంబునం దీర్ఘపాదుం డైనపుండరీకాక్షు పాదారవిందరజఃపావనంబును రతికేళీవ్యాసంగపరిశ్రమనివారకసలిలకేళీవిలోల దేవకామినీపీనవక్షోజవిలిప్తకుంకుమపంకసంగతపిశంగవర్ణ వారిపూరవిలసితంబును నైన నందాలక నందాభిదానంబులు గలనదీద్వితయంబు దాఁటి తత్పురో భాగంబున వనగజసంఘృష్టమలయజ(పరిమిళిత)మలయపవనాస్వాదనముహుర్ముహురున్మథితమానసపుణ్యజనకామినీకదంబంబును వైడూర్యసోపానసమంచితకన కోత్పలవాపీవిభాసితంబును గింపురుషసంచారయోగ్యంబును నగుసౌగంధికవన సమీపంబునందు. 135

—బ్రహ్మాదులు దక్షిణామూర్తిరూపుం డగునీశ్వరుని స్తుతించుట.—

సీ. ఉజ్జ్వలం బగు శతయోజనంబులపొడవును బంచసప్తతియోజనముల
పఱపును గల్గి పేర్పట్టునం దఱుగని,నీడ శోభిల్ల నిర్ణీత మగుచుం
బర్ణశాఖాసమాకీర్ణమై మాణిక్యములం బోలం గలఫలములం దనర్చి
కమనీయసిద్ధయోగక్రియామయ మయి, యనఘముముక్షుజనాశ్రయమును
తే. భూరిసంసారతాపనివారకమును, నగుచుం దరురాజ మనంగం బెం పగ్గలించి
భక్తజనులకునిచ్చలుం బ్రమద మెసంగ, వలయుసంపద లందునావటమువటము.
వ. ఆవృక్షమూలతలంబున. 137

సీ. ఇద్ధసనందనాదిసిద్ధసంసేవితు, శాంతవిగ్రహుని వాత్సల్యగుణునిఁ
గమనీయలోకమంగళదాయకుని శివు, విశ్వబంధుని జగద్వినుతయశుని
గుహ్యకసాధ్యరక్షోయక్షనాథకు, బేరసేవితుని దుర్వారబలుని
నుదితవిద్యాతపోయోగయుక్తుని బాల,చంద్రభూషణుని మునీంద్రనుతునిఁ

తే. దాపసాభీష్టకరు భస్మదండలింగ, ఘనజటాజినధరుని భక్తప్రసన్ను
వితతసంధ్యాభ్రరుచివిడంబితవినూత్న,రక్తవర్ణు సనాతను బ్రహ్మమయుని. 138
వ. మఱియును. 139
సీ. అంచితవామపాదాంభోరుహము దక్షి, ణోరుతలంబున నొయ్య నునిచి
సవ్యజానువుమీఁద భవ్యబాహువు సాఁచి, వలపలిముంజేత సలలితాక్ష
మాలిక ధరియించి మహనీయతర్కము,ద్రాయుక్తుఁ డగుచుఁ జిత్తంబులోన
నవ్యయం బయినబ్రహ్మానందకలితస,మాధినిష్ఠుఁడు వీతమత్సరుండు
తే. యోగపట్టాభిరాముఁ డై యుచితవృత్తి, రోషసంగతిఁ బాసి కూర్చున్నజముని
యనువుననుదర్భరచితబుస్యాసనమున, నున్నమునిముఖ్యసంచితయోగనిరతు.
క. అలఘుని నభవుని యోగీం,ద్రులు విను చుండంగ నారదునితోఁ బ్రియభా
షలు జరపు చున్నసుస్నుని, సలలితపన్నగవిభూషు సజ్జనపోషున్. 141
క. కని లోకపాలురును ముని, జనులును సద్భక్తి నతనిచరణంబులకుఁ
వినతు లయి రప్పు డబ్జా,సనుఁ గని యయ్యభవుఁ డధికసంభ్రమ మొప్పన్.
క. అనఘ మహోత్తముఁ డగువా,మనుఁ డాకశ్యపున కొగి నమస్కారము సే
సినగతి నజునకు నభివం,దన మొగిఁ గావించె హరుఁడు దగ్గయుఁబ్రీతిన్. 143
తే. అంత రుద్రానువర్తను లైన సిద్ధ, *దేవమహఋషిజనము లర్థిని బయోజ
గర్భునకు మ్రొక్కి రంతనాకమలభవుఁడు, శర్వుఁగనిపల్కె మందహాసంబుతోడ.
తే. జగములకు నెల్ల యోనిబీజంబు లైన, శక్తిశివకారణుండ వై జగతి నిర్వి
కారతత్త్వంబ వగుదిన్నుఁ గడఁగి విశ్వ,నాథుఁగా నెఱిఁగెదనామనమునభవ.
తే. సమత నది గాక తావకాంశంబు లైన,శక్తిశివరూపములఁగ్రీడసలుపు దూర్ణ
నాభిగతి విశ్వజననవినాశవృద్ధి, హేతుభూతుండ వగు చుందు వీశ రుద్ర.
సీ. అనఘ లోకంబునయందు వర్ణాశ్రమ, సేతువు లనఁగఁ బ్రఖ్యాతి నొంది
బలసి మహాజనపరిగృహీతంబు లై, యఖలధర్మార్థదాయకము లైన
వేదంబులను మఱి వృద్ధి నొందించుట,కొఱకు నై నీవ దక్షుని నిమిత్త
మాత్రునిఁ జేసి యజ్ఞముఖముఁ గావించితి, వటు గాన శుభమూర్తి వై ననీవు
తే. గడఁగి జగముల మంగళకర్తు లయిన,వారి ముక్తి నమంగళాచారు లయిన
వారి నరకంబు నొందింతు భూరిమహిమ, భక్తజనపోష రాజితఫణివిభూష.
వ. అట్లగుటం దత్కర్మంబు లోకానీకనికి విపర్యాసంబు నొందుటకుఁ గారణం
బెయ్యదియో భవదీయరోషంబు హేతు వని తలంచితి నేనిఁ ద్వదీయపాదార
విందభజను లై సమస్తభూతంబులయందు నిన్నుం గనుంగొనుచు భూతంబుల
నాత్మకు వేఱుఁగాఁ జూడక వర్తించుమహాత్ములయందు నజ్ఞు లైనవారియందుం
బోలె రోషంబు దఱుచు వారయ దఁట నీకుఁ గ్రోధంబు గలదే యని. 148

* 'దేవమహాఋషి' యనియే. వ్రాఁతప్రతులు.

సీ. మఱి భేదబుద్ధిఁ గర్మప్రవర్తనముల, మదయుతు లయి దుష్టహృదయులగుచుఁ
బరవిభవాసహ్యభవమనోవ్యాధులఁ, దగిలి [1]మర్మాంతభేదకము లయిన
బహుదురుక్తులచేతఁ బరులఁ బీడించుచు, నుండుమూఢులను దైవోపహతులఁ
గాఁ దలపోసి యక్కపటచిత్తులకు నీవంటిసత్పురుషు లేవలన నైన
తే. హింసఁ గావింప రుద్ర సమిద్ధచరిత, నీలలోహిత మహితగుణాలవాల
లోకపాలనకలిత గంగాకలాప, హర జగన్నుతచారిత్ర యదియుఁ గాక. 149
సీ. అమర సమస్తదేశములందు నఖిలకా, లములందుఁ దలఁప [2]దుర్లంఘ్యమహిముఁ
డగుపద్మనాభుమాయామోహితాత్మకు, లై భేదదర్శను లైనవారి
వలనను ద్రోహంబు గలిగిన నైనను, నది దైవకృత మని యన్యదుఃఖ
ముల కోర్వలేక సత్పురుషుఁడు దయసేయుఁ, గాని హింసింపఁడు గాన నీవు
తే. నచ్యుతునిమాయమోహము నందకుంటఁ, జేసి సర్వజ్ఞుఁడవు మాయచేత మోహి
తాత్ములై కర్మవర్తను లయినవారి, వలన ద్రోహంబు గలిగిన వలయుఁ బ్రోవ.
వ. అది గావున యజ్ఞభాగార్హుండ వయిననీకు సవనభాగంబు సమర్పింపనికతన నీచేత విధ్వస్తం బయి పరిసమాప్తి నొందనిదక్షాధ్వరంబు మరల నుద్ధరించి దక్షునిఁ బునర్జీవితుం జేయుము భగునినేత్రంబులును (భృగుమునిశ్మశ్రువులును) బూషునిదంతంబులును గృపసేయుము భగ్నాంగు లయినదేవఋత్విజ్నికాయంబులకు నారోగ్యంబు గావింపు మీమఖావశిష్టంబు యజ్ఞపరిపూర్తిహేతుభూతం బయినభవదీయభాగం బగుం గాక. 151

శివుఁడు బ్రహ్మాదులచేఁ బ్రార్థితుఁడై దక్షాదుల ననుగ్రహించుట.

చ. అని చతురాననుండు వినయంబున వేఁడిన నిందుమౌళి స
య్యనఁ బరితుష్టిఁ బొంది దరహాసమునం గృప దొంగలింప ని
ట్లను హరిమాయచేత ననయంబును బామరు లైనవారు సే
సినయపరాధదోషములు చిత్తములో గణియింప నెన్నఁడున్. 152
వ. అట్లయ్యుండి. 153
క. బలియుర దండింపను దుర్బలులను రక్షింప ధర్మపద్ధతి యగుటం
గలుషాత్ములయపరాధము, గొలఁదిని దండించుచుండు గొనకొని నేనున్. 154
వ. అని దగ్ధశీర్షుండయినదక్షుం డజముఖుం డగు భగుండు బర్హిస్సంబంధభాగంబులు గలిగి మిత్రనామధేయచక్షుస్సనం బొడగాంచుఁ బూషుండు పిష్టభుక్కగు(చు యజమానదంతంబులచే భక్షించు) దేవతలు (యజ్ఞావశిష్టంబు నా కొసంగుటం జేసి) సర్వావయవపూర్ణులై వర్తింతురు ఖండితాంగులైనయధ్వర్యుఋత్విగాదిజనంబు లశ్విదేవతలబాహువులచేతను బూషునిహస్తంబులచేతను లబ్ధబాహుహస్తులై జీవింతురు భృగువు బస్తశ్మశ్రువులు గలిగి వర్తించు నని శివుం డానతిచ్చిన

1 పరాత్మభే. 2 దుర్లంఘనీయ మగు.

సమస్తభూతంబులు సంతుష్టాంతరంగంబులై తండ్రీ తండ్రీ యని సాధువాదంబుల నభినందించి రంత (నాశంభునియామంత్రణంబు వడసి) సునాసీరప్రముఖులగు దేవతలు (ఋషులతోడం గూడి రా) నజుండును రుద్రునిం బురస్కరించుకొని దక్షాధ్వరవాటంబునకుం జని రచ్చట. 155

క. శర్వునియోగక్రమమున, సర్వావయవములుఁ గలిగి సన్నుతిఋత్త్వి
గ్గీర్వాణముఖ్యు లొప్పిరి, పూర్వతనుశ్రీల నార్యభూషణ యంతన్. 156

క. విను దక్షు సంత మేషము, ఖునిఁ జేసిన నిద్రమేలుకొని లేచినపో
ల్కిన నిలిచె దక్షుఁ డభవుఁడు, గనుఁగొనుచుండంగ నాత్మఁగౌతుక మొప్పన్.

వ. ఇట్లు లేచి నిలిచి ముందఱ నున్నశివునిం గనుంగొనినమాత్రన శరత్కాలంబున నకల్మషం బైనసరస్సునుంబోలెఁ బూర్వరుద్రవిద్వేషజనితంబు లైనకల్మషంబులం బాసి నిర్మలుం డై యభవుని నుతియింపం దొడంగి మృతిఁ బొందినసతీతనయం దలంచి యనురాగోత్కంఠల బాష్పపూరితలోచనుండును గద్గదకంఠుండు నై పలుకం జాలక యెట్టకేలకు దుఃఖంబు సంస్తంభించికొని ప్రేమాతిరేకవిహ్వలుం డగుచు సర్వేశ్వరుం డగుహరున కిట్లనియె. 158

క. విను నీ కపరాధుఁడ నగు,నను దండించు టిది దండనము గాదు మది
న్నను రక్షించుటగా మన,మునఁ దలఁతును దేవ యభవ పురహర రుద్రా. 159

సీ. అనఘాత్మ తగ నీవు నబ్జగర్భుండును, బరికింప బ్రాహ్మణాభాసు లయిన
వారలయెడల నెవ్వలన నుపేక్షింప, రఁట దృఢవ్రతచర్యు లైనవారి
యెడ నీ కుపేక్ష యెక్కడిది సర్గాదిని, నామ్నాయసంప్రదాయప్రవర్త
నము నెఱింగించుట కమరవిద్యాతపో,వ్రతపరాయణు లైనబ్రాహ్మణులను

తే. వరుసఁ బుట్టించితివి కాన వారి నెపుడుఁ, గల దండంబుఁబూనిగోపాలకుండు
బలసి గోవుల రక్షించుపగిది నీవు, నరసి రక్షించుచుందు గదయ్య రుద్ర. 160

సీ. తలపోయ నవిదితతత్త్వవిజ్ఞానుండ, నైననాచేత సభాంతరమున
నతిదురుక్తాంబకక్షతుఁడవయ్యును మత్కృ,తాపరాధము హృదయంబునందుఁ
దలఁపక సుజననిందాదోషమున నధో,గతిఁ బొందు చున్నదుష్కర్ము నన్నుఁ
గరుణఁ గాచిననీకుఁ గడఁగి ప్రత్యుపకార, మొనరించి కావింప నేర నెంతవాఁడ

తే. నుతచరిత్ర భవత్పరానుగ్రహాను,రూపకార్యంబుచేత నిరూఢ మైన
తుష్టి నీచిత్తమందు నొందుదువుగాక, క్షుద్రసంహార కరణాసముద్ర రుద్ర.

వ. అని యిట్లు రుద్రక్షమాపణంబు గావించి పద్మసంభవుచేత ననుజ్ఞాతుం డై దక్షుం డుపాధ్యాయఋత్విగ్గణసమేతుం డగుచుఁ గ్రతుకర్మంబు నిర్వర్తించు సమయంబున బ్రాహ్మణజనంబులు యజ్ఞంబులు నిర్విఘ్నంబు లై సాగుటకుఁ బ్రమథాదివీరసంసర్గకృతదోషనివృత్త్యర్థంబుగా విష్ణుదేవతాకంబును ద్రికపాలపురోడాశద్రవ్యకంబును నైనకర్మంబుఁ గావింప నుపాత్తహవిష్యుం డగుభృగువు

తోడం గూడి నిర్మలాంతఃకరణుం డగుచు దక్షుఁడు ద్రవ్యత్యాగంబుఁ గావింపఁ బ్రసన్నుం డై సర్వేశ్వరుండు. 162

దక్షాధ్వరంబునకు వచ్చిన నారాయణుని దక్షాదులు నుతించుట.

సీ. మానితశ్యామాయమానశరీరదీ, ధితులు సర్వదిక్కుల దీటుకొనఁగఁ
గాంచనమేఖలాకాంతులతోడఁ గా, శేయచేలద్యుతుల్ సెలిమి సేయ
లక్ష్మీసమాయుక్తలలితవక్షంబున, వైజయంతీప్రభల్ వన్నె సూప
హాటకరత్నకిరీటకోటిప్రభల్, బాలార్కరుచులతో మేల మాడ
తే. లలితనీలాభ్రరుచిఁ గుంతలములు దనరఁ, బ్రవిమలాత్మీయదేహజప్రభ సరోజ
భవభవామరముఖ్యుల ప్రభలు మాప, నఖిలలోకైకగురుఁడు నారాయణుండు.
చ. సలలితశంఖ చక్ర జలజాత గదా శర చాప ఖడ్గని
ర్మలరుచులన్ సువర్ణరుచిరమన్మణికంకణముద్రికాప్రభా
వలులును దేజరిల్ల భుజవర్గ మనర్గళకాంతియుక్తమై
విలసితకర్ణికారపృథివీరుహముం బురుడింపఁ బట్టుగన్. 164
క. సరసోదారసమంచిత. దరహాసవిలోకనములఁ దగ లోకములం
బరితోషము నొందించుచుఁ, బరమోత్సవ మొప్ప విశ్వబంధుం డగుచున్. 165
చ. మఱియును రాజహంసరుచిమద్భ్రమణీకృతతాలవృంతచా
మర లిరువంకలన్ దివిజమానిను లీయ సుధామరీచివి
స్ఫురితసితాతపత్రరుచిపుంజము దిక్కులఁ బిక్కటిల్లఁగాఁ
గరివరదుండు వచ్చె సుభగస్తుతివర్ణ సుపర్ణయానుఁడై. 166
చ. ఘనరుచి నట్లు వచ్చిన వికారవిదూరు ముకుందుఁ జూచి బో
రన నరవిందనందన పురందర చంద్రకళాధరామృతా
శనముఖు లర్థి లేచి యతిసంభ్రమ మొప్ప నమో నమో దయా
వననిధయే యటంచు ననివారణ మ్రొక్కిరి భక్తియుక్తులై. 167
వ. అట్లు కృతప్రణాము లై యనంతరంబ. 168
ఉ. ఆనలినాయతాక్షుని యనంతపరాక్రమదుర్నిరీక్ష్యతే
జోనిహతస్వతేజు లగుచున్ నుతి సేయ నశక్తులై భయ
గ్లాని వహించి బాష్పములు గ్రమ్మఁగ గద్గదకంఠు లై తనుల్
మ్రానుపడంగ నవ్విభుని మన్ననఁ గైకొని యట్టకేలకున్. 169
వ. నిటలతటఘటితకరపుటు లై యమ్మహాత్ముని యపారమహిమం బెఱింగి నుతియింప శక్తులు గాక యుండియు భక్తానుగ్రహపరిగ్రహుం డగుటం జేసి తమతమ మతులకు గోచరించినకొలంది నుతియింపఁ దొడంగి రందు (గృహీతంబు లగు పూజాద్యుపచారంబులు గలిగి బ్రహ్మాదులకు జనకుండును సునందనందాదిపరమ భాగవతజనసేవితుండును యజ్ఞేశ్వరుండు నగుభగవంతుని శరణ్యునిం గాఁ దలం

చి) దక్షుం డి ట్లనియె దేవా నీవు స్వస్వరూపంబునం దున్నయప్పు (డుపరతంబులు గాని) రాగాద్యఖిలబుద్ధ్యవస్థలచే విముక్తుండవును నద్వితీయుండవును జిద్రూపకుండవును భయరహితుండవును నై మాయం దిరస్కరించి మఱియు నామాయ ననుసరించి నటనకొఱకు లీలామానుషరూపంబుల నంగీకరించి స్వతంత్రుండ వయ్యును మాయాపరతంత్రుండ వై రాగాదియుక్తుండునుంబోలె రామకృష్ణాద్యవతారంబులఁ గానంబడు చుందువు గావున నీలోకంబులకు నీవ యీశ్వరుండ వనియు నితరులైన బ్రహ్మరుద్రాదులు భవన్మాయావిభూతు లగుటం జేసి లోకంబులకు నీశ్వరులు గా రనియును భేదదృష్టి గలనన్ను రక్షింపు మీవిశ్వకారణు లైనఫాలలోచనుండును బ్రహ్మయు దిక్పాలురును సకలచరాచరజంతుసంతానములును నీవ గానిది లేశంబు లే దని విన్నవించినం దదనంతరంబ ఋత్విగ్జనంబు లి ట్లనిరి. 170

సీ. వామదేవుని శాపవశమునఁ జేసి క, ర్మానువర్తులము మే మైనకతన
బలసి వేదప్రతిపాద్యధర్మోపల, క్ష్యం బైనయట్టిమఖంబునందు
దీపింప నింద్రాది దేవతాకలితరూ, పవ్యాజమునఁ బొంది పరఁగునిన్ను
యజ్ఞస్వరూపుండ వని కాని కేవల, నిష్కించనుండవు నిర్మలుఁడవు
తే. సరయ ననవద్యమూర్తివి నైననీను, లలితతత్త్వస్వరూపంబుఁ దెలియఁ జాల
మయ్య మాధవ గోవింద హరి ముకుంద, చిన్మయాకార నిత్యలక్ష్మీవిహార.
వ. సదస్యు లి ట్లనిరి. 172
సీ. శోకదావాగ్నిశిఖాకులితంబు పృ, థుక్లేశఘనదుర్గదుర్గమంబు
దండధరక్రూరకుండలిక్లిష్టంబు, పాపకర్మవ్యాఘ్రపరివృతంబు
గురుసుఖదుఃఖకాకోలపూరితగర్త, మగుచు ననాశ్రయ మైనయట్టి
సంసారమార్గసంచారు లై మృగతృష్ణి, కలఁ బోలువిషయసంఘము నహమ్మ
తే. మేతిహేతుకదేహనికేతనములు, నయి మహాభారవహు లైనయట్టిమూఢ
జనము లేనాఁట మీపదాబ్జములు గానఁ, జాలువారలు భక్తప్రసన్న దేవ. 173
వ. రుద్రుం డి ట్లనియె. 174
చ. వరద నిరీహ యోగిజనవర్గసుపూజిత నీపదాబ్జముల్
నిరతము నంతరంగమున నిల్పి [1]సమగ్రభవత్పరిగ్రహ
స్ఫురణఁ దనర్చునన్ను నతిమూఢులు సంతతము న్నమంగళా
[2]చరణుఁ డటంచుఁ బల్కు నది సన్మతి నే గణియింప నచ్యుతా. 175
వ. భృగుం డి ట్లనియె. 176
మ. అరవిందోదర తావకీనఘనమాయామోహితస్వాంతు లై
పరమం బైనభవన్మహామహిమముం బాటించి కానంగ నో

---

1 'భవత్పదనుగ్రహాదికస్ఫురణఁ. 2 చరణు... బల్కుఁగ భవన్మతి నే గణి.' అ. ప్ర.

పరు బ్రహ్మాదిశరీరధారులును నోపద్మాక్ష భక్తార్తిసం
హరణాలోకన నన్నుఁ గావఁ దగు నిత్యానందసంధాయి వై. 177
వ. బ్రహ్మ యి ట్లనియె. 178
సీ. సమధికజ్ఞానార్థసత్త్వాదిగుణముల, కాశ్రయభూత మైనట్టిపురుషుఁ
డగ్రపదార్థభేదగ్రాహకము లైన, చక్షురింద్రియముల సరవిఁ జూడఁ
గలుగునీరూపంబు గాదు మాయామయం, బగునసద్వ్యతిరిక్త మైనయట్టి
నిరుపమాకారంబు నీకు విలక్షణ, మై యుండు ననుచు నే నాత్మఁ దలఁతు
తే. నిర్వికార నిరంజన నిష్కళంక, నిరతిశయ నిష్క్రియారంభ నిర్గతాత్మ
విశ్వసంపాద్య నిరవద్య వేదవేద్య, ప్రవిమలానంద సంసారభయవిదూర. 179
వ. ఇంద్రుం డి ట్లనియె. 180
మ. దితిసంతానవినాశసాధనసముద్దీప్తాష్టబాహాసమ
న్వితమై యోగిమనోనురాగకర మై వెల్గొందునీదేహ మా
యత మైనట్టిప్రపంచముంబలెను మిథ్యాభూతముం గామి శా
శ్వతముం గా మదిలోఁ దలంతు హరి దేవా దైవచూడామణీ. 181
వ. ఋత్విక్పత్ను లి ట్లనిరి. 182
చ. కడఁగి భవత్పదార్చనకుఁ గా నిటు దక్షునిచే రచింపఁ గాఁ
బడి శితికంఠరోషమున భస్మము నొంది పరేతభూమి యై
చెడి కడుశాంతమేధమునఁ జెన్నఱి యున్నమఖంబుఁ జూడు మే
ర్పడ జలజాభనేత్రములఁ బావన మై విలసిల్లు నచ్యుతా. 183
వ. ఋషు లి ట్లనిరి. 184
మ. అనఘా మాధవ నీవ మావలెనె కర్మారంభి వై యుండియుఁ
విను తత్కర్మఫలంబు వొంద వితరుల్ విశ్వంబునన్ భూతికై
యనయంబున్ భజియించునిందిర మిము న్వర్ణించి యేతేరఁ గై
కొన వే మందుము నీచరిత్రమునకున్ గోవింద పద్మోదరా. 185
వ. సిద్ధు లి ట్లనిరి. 186
చ. హరి భవదుఃఖభీషణదవానలదగ్ధతృషార్తమన్మనో
ద్విరదము శోభనంబును బవిత్రము నైనభవత్కథాసుధా
సరిదవగాహనంబునను సంసృతితాపము వాసి క్రమ్మఱం
దిరుగదు బ్రహ్మముం గనినధీరునిభంగిఁ బయోరుహోదరా. 187
వ. యజమాని యగుప్రసూతి యి ట్లనియె. 188
చ. కరచరణాదికాంగములు గల్గియు మస్తము లేనిమొండెముం
బరువడి నొప్ప కున్నగతిఁ బంకజలోచన నీవు లేనియ
ధ్వరము ప్రయాజులం గలిగి తద్దయు నొప్పక యున్నదయ్య యో

హరి యిటు నీదురాక శుభ మయ్యె రమాధిప మమ్ముఁ గావవే. 189
వ. లోకపాలకు లి ట్లనిరి. 190
సీ. దేవాదిదేవ యీదృశ్యరూపం బగు, సుమహితవిశ్వంబుఁ జూచుప్రత్య
గాత్మభూతుండ వై నట్టినీ¹వు నసత్ప్రకాశరూపంబు లై కలుగుమాయ
కేంద్రియంబులచేత నీశ్వర నీమాయ, నొందించి పంచభూతోపలక్షి
తం బగుదేహివిధంబునఁ గానంగఁ, బడుదువు గాని యేర్పడినశుద్ధ
తే. సత్త్వగుణయుక్తమైనభాస్వత్స్వరూప, ధరుఁడవై కానఁబడవు గా పరమపురుష
యవ్యయానంద గోవింద యట్లు గాన, యెనయమాజీవనము నీకనేమి సెలవు.
వ. యోగీశ్వరు లి ట్లనిరి. 192
సీ. విశ్వాత్మ నీయందు వేఱుగా జీవులఁ, గనఁ డెవ్వఁ డట వానికంటెఁ బ్రియుఁడు
నీకు లేఁ డయినను నిఖిలవిశ్వోద్భవ, స్థితివిలయంబులకతన దైవ
సంగతి నిర్భిన్నసత్త్వాదిగుణవిశి, ష్టాత్మీయమాయచే నజభవాది
వివిధభేదము లొందుదువు స్వస్వరూపంబు, నం దుండుదువు వినిహతవిమోహి
తే. వగుచు నుందువుగద నిన్ననన్యభక్తి, భృత్యభావంబుదాల్చి సంప్రీతిఁగొల్చు
మమ్ము రక్షింపవే కృపామయ రమేశ, పుండరీకాక్ష సంతతభువనరక్ష. 193
వ. ప్రజాపతు లి ట్లనిరి. 194
చ. హరి భవదీయతత్త్వము సమంచితభక్తి నెఱుంగ నేను నా
సరసిజసంభవాదులును జాలము సత్త్వగుణాశ్రయుండవుఁ
బరుఁడవు నిర్గుణుండవును బ్రహ్మము మున్నగునీకు నెవ్వ నిం
దఱముఁ జతుర్విధార్థఫలదాయక మ్రొక్కెద మాదరింపవే. 195
వ. అగ్నిదేవుం డి ట్లనియె. 196
మ. హవరక్షాచరణుండ వై నెగడుచు న్నయ్యగ్నిహోత్రాదిపం
చవిధంబుల్ మఱి మంత్రపంచక²సుపూజ్యాయోగ్యము న్నైనయా
హవరూపం బగునీకు మ్రొక్కెదను నీయాజ్ఞఁ భువిఁ హవ్యముల్
సవనవ్రాతములఁ వహింతు హరి యుష్మత్తేజముం బూనుచున్. 197
వ. దేవత లి ట్లనిరి. 198
మ. మును కల్పాంతమునందుఁ గుక్షి నఖిలంబుఁ దాఁచి యేకాకి వై
జనలోకోపరిలోకవాసులును యుష్మత్తత్త్వమార్గంబు చిం
తనముం జేయఁ బయోధియందు నహిరాట్తల్పంబునం బవ్వళిం
చిన ³నీరూపము నేఁడు సూపితివి లక్ష్మీనాథ దేవోత్తమా. 199
వ. గంధర్వు లి ట్లనిరి. 200

---

1 విడ యసత్ప్రకాశరూప మై పరఁ సమాయ. 2 'సుస్పష్టంబై తగం బొల్చునాహవ' అ. ప్ర. 3 'నీరూపముఁ జూడఁ గంటి మిద రాజీవాక్ష సర్వాత్మకా' వ్రా. ప్ర.

మ. హరపంకేజభవామరాలియు మరీచ్యాదిప్రజానాథులు
న్నరవిందాక్ష రమాహృదీశ భవదీయాంశాంశసంభూతులై
పరఁగం దావకలీలకై నెగడు నీబ్రహ్మాండము న్సృష్టియీ
శ్వర నీకే మతిభక్తి మ్రొక్కెదము దేవా దేవచూడామణీ. 201

మ. [1]భవదంశాంశజులీమరీచిముఖరుల్ బ్రహ్మామరేంద్రాద్రిజా
ధవముఖ్యుల్ దివిషద్గణంబుఁ బరమాత్మా నీకు విశ్వంబు న
త్సవలీలాకరకందుకోపమము నాథా వేదశాఖాశిఖా
స్తవనీయాంఘ్రికి నీకొనర్తుము నమస్కారంబు లశ్రాంతమున్. 202

వ. విద్యాధరు లిట్లనిరి. 203

సీ. నలినాక్ష విను భవన్మాయావశంబున, దేహంబు దాల్చి తద్దేహమందు
నాత్మ నహమ్మమేత్యభిమానమునఁ బొంది, పుత్రజాయాగృహక్షేత్రబంధు
ధనపశుముఖవస్తుతతులసంయోగవి, యోగదుఃఖంబుల నొందుచుండు
ధృతివిహీనుఁడు నసద్విషయలాలసుఁడును, నతిదుష్టమతియు నైనట్టివాఁడు
తే. దవిలి భవదీయగుణసత్కథావిలోలుఁ, డయ్యెనేనియు నాత్తమోహంబువలనఁ
బాసి వర్తించువిజ్ఞానపరతఁ దగిలి, చిరదయాకార యిందిరాచిత్తచోర. 204

వ. బ్రాహ్మణజనంబు లిట్లనిరి దేవా యీక్రతువును హవ్యంబును నగ్నియు మంత్రంబులును సమిద్దర్భపాత్రంబులును సదస్యులును ఋత్విక్కులును దంపతులును దేవతలును నగ్నిహోత్రంబులును స్వధయు సోమంబును ధరియించి దంష్ట్రాదండంబున వారణేంద్రంబు నళినంబు ధరియించుచందంబున రసాతలగతయైనభూమి నెత్తితి వట్టియోగిజనస్తుత్యుండవును మఖరూపకుండవును నైననీవు పరిభ్రష్టకర్ములమై కాంక్షించుమాకుం బ్రసన్నుండ వగుము భవదీయనామకీర్తనంబుల సకలయజ్ఞవిఘ్నంబులు నాశంబు నొందు నట్టినీకు నమస్కరింతుము. 205

క. అని తన్ను సకలజనములు, వినుతించిన హరి భవుండు విఘ్నము గావిం
చినయాదక్షునియజ్ఞము, ఘనముగఁ జెల్లించెఁ గొఱఁత గాకుండంగన్. 206

క. సకలాత్ముఁడు దా నగుటను, సకలహవిర్భోక్త యయ్యు జలజాక్షుండుం
స్వకీయభాగమునను న, య్యకలంకుఁడు తృప్తిఁ బొంది యనె దక్షునితోన్. 207

వ. అనఘా కారణభూతుండును నీశ్వరుండును ద్రష్టయును స్వయంప్రకాశకుండును నైనయేను గుణమయం బగునయాత్మీయమాయం బ్రవేశించి జననవృద్ధివిలయంబులకు హేతుభూతంబు లగుతత్క్రియోచితంబు లైనబ్రహ్మరుద్రాది నామభేదంబుల నొందుచుండుదు నట్టియద్వితీయబ్రహ్మరూపకుండ నైననాయందు నజభవాదులును భూతగణంబులను మూఢుం డగువాఁడు వేఱుగాఁ జూచు

1 ఇది యొకానొకప్రతిని జూపట్టెడి.

మద్భక్తుం డగువాఁడు శరీరంబునకుఁ గరచరణాదులు వేఱుగాఁ దలంపనిచందం
బున నాయందు భూతజాలంబు భిన్నంబుగాఁ దలంపండు గావున మామువ్వు
రయందు నెవ్వండు వేఱుసేయకుండు వాఁడు కృతార్థుం డని యానతిచ్చిన
దక్షుండును. 208

క. విను విష్ణుదేవతాకం, [1]బనఁగాఁ ద్రికపాలకలిత § మగునాయాగం
బునఁ దగ నవ్విష్ణునిపద, వనజంబులు పూజ సేసి § వారనిభక్తిన్. 209

వ. మఱియును. 210

సీ. అంగప్రధానక § యాగంబులను జేసి, యమరుల రుద్రుని § నర్థిఁ బూజ
సేసి విశిష్టేష్ట § శిష్టభాగమున ను,దవసానకర్మంబుఁ § దవిలి తీర్చి
దాను ఋత్విక్కులుఁ § దగ సోమపాను లై, యవభృథస్నానంబు § లాచరించి
కడఁక నవాప్తస § కలఫలకాముఁ డై, తనరుదక్షునిఁ జూచి § ధర్మబుద్ధి

తే. గలిగి సుఖవృత్తి జీవింతు § గాక యనుచుఁ
బలికి దివిజులు మునులును § బ్రాహ్మణులును
జనిరి నిజమందిరముల కా § జలజనయన
భవులు వేంచేసి రాత్మీయ § భవనములకు. 211

వ. అంత దాక్షాయణి యయినసతీదేవి పూర్వకళేబరంబు విడిచి హిమవంతునకు
మేనకయందు జనియించి ప్రలయకాలంబునం బ్రసుప్తం బయినశక్తి సృష్టికాలం
బున నీశ్వరునిఁ బొందుచందంబునఁ బూర్వదయితుం డగురుద్రుని వరియించె
నని దక్షాధ్వరధ్వంసకుం డగురుద్రునిచరిత్రంబు బృహస్పతి శిష్యుం డయిన
యుద్ధవునకు నెఱింగించె నతండు నాకుం జెప్ప నేను నీకుం జెప్పితి నని మైత్రే
యుండు వెండియు విదురున కిట్లనియె. 212

క. ఈయాఖ్యానముఁ జదివిన, ధీయుతు లై వినినయట్టి § ధృతిమంతులకు
న్నాయుఃకీర్తులు గలుగును, బాయును దురితములు దొలఁగు § భవబంధంబుల్.

వ. అని వెండియు నిట్లనియె. 214

క. విను సనకాదులు నారదుఁ, [2]డునుహంసుఁడు నరుణియు ఋభుఁ § డుయతియుఁ గమలా
సనజులు నైష్ఠికు లనికే, తను లగుటం జాఁగ వయ్యెఁ § దద్వంశంబుల్. 215

వ. మఱియు నధర్మునకు మృష యనుభార్యయందు దంభుండును మాయ యను
కామినియుం బుట్టి రధర్మసంతానం బగుట వారిరువురును మిథునం బైన వారిని
సంతానహీనుం డగునిరృతి గైకొనియె నాదంపతులకు లోభుండును నికృతి యను
సతియునుం గలిగి మిథునం బైరి నామిథునంబునకుఁ గ్రోధుండు హింస యను
నంగనయుం బుట్టి మిథునం బైరి నామిథునంబునకుఁ గలియు దురుక్తి యనునతి

---

1 'బును త్రికపాలపురోడాశమును నగుయాగం' వ్రా. ప్ర. 2 'డును నరుణియు యతియు ఋభువుఁ § డును నజానకు నం, దనులును' వ్రా. ప్ర.

వయు జన్మించి దాంపత్యంబు గైకొని రాదంపతులకు భయమృత్యువు లను మిథునంబు గలిగె దానివలన యాతనయు నిరయంబునుం బుట్టిరి వీరలు సంసారహేతు వగునధర్మతరుశాఖ లయి నెగడిరి వీని శ్రేయస్కాముం డగుజనుం డీపన్నాత్రంబు ననువర్తింపం జన దివ్విధంబున బ్రతిసర్గంబును సంగ్రహంబున వినిపించితి నిప్పుణ్యకథ నెవ్వండేని ముమ్మాఱు వినిన నతండు నిష్పాపుఁ డగు నని చెప్పి మఱియు ని ట్లనియె. 216

## ధ్రువోపాఖ్యానము.

క. విను నిఖిలభువనపరిపా, లనమునకై చంద్రధరకళాకలితుం డై
వనజజునకు స్వాయంభువ,మను వపు డుదయించెఁ గీర్తిమంతుం డగుచున్. 217

తే. రూఢి నమ్మనువుకు శతరూపవలన, భూనుతు లగు ప్రియవ్రతోత్తానపాదు
లనఁగ నిద్దఱు పుత్రులై రందులోన, భవ్యచారిత్రుఁ డుత్తానపాదునకును. 218

క. వినుము సునీతియు సురుచియు, ననుభార్యలు గలరు వారియందును ధ్రువునిం
గనినసునీతియు నప్రియ,యును సురుచియుఁ బ్రియయు నగుచు నున్నట్టియెడన్.

సీ. ఒకనాఁడు సుఖలీల నుత్తానపాదుండు, నెఱిఁ బ్రియురాలైన సురుచి గన్న
కొడుకు నుత్తముఁ దనతొడలపై నిడికొని, యుపలాలనము సేయుచున్నవేళ
నర్థిఁ దదారోహణాపేక్షితుం డైన,ధ్రువునిఁ గనుంగొని తివుట నాద
రింప కుండుటకు గర్వించి యాసురుచియు, సవతిబిడ్డం డైన ధ్రువునిఁ జూచి

తే. తండ్రితొడ నెక్కు వేడుక దగిలె నేనిఁ, బూని నాగర్భమున నాఁడ పుట్ట కన్య
గర్భమునఁ బుట్టి కోరినఁ గలదె నేఁడు, జనకుతొడ యెక్కు భాగ్యంబు సవతికొడుక.

క. అది గాన నీ వధోక్షజు,పదపద్మము లాశ్రయింపు పాయక హరి నా
యుదరమునఁ బుట్టనిచ్చును, వదలక యట్లయిన ముదము వఱలెడి నీకున్. 221

క. అని యారీతి నసహ్యవ,చనములు పినతల్లి యపుడు జనకుఁడు వినఁగాఁ
దను నాడినదుర్భాషా,ఘనశరములు మనము నాటి కాఱియఁ బెట్టన్. 222

క. తను నట్లుపేక్ష సేసిన, జనకునికడఁ బాసి దుఃఖజలనిధిలోనన్
మునుఁగుచును దండతాడిత,ఘనభుజగముఁబోలె రోషకలితుం డగుచున్. 223

క. ఘనరోదనంబు సేయుచుఁ, గనుఁగవలను శోకబాష్పకణములు దొరఁగన్
జననికడ కేఁగుటయు నిజ,తనయునిఁ గని యాసునీతి దగ్గఱియుఁ బ్రేమన్. 224

వ. తొడలపై నిడికొని. 225

క. కర మనురక్తిని మోము ని,విరి తద్వృత్తాంత మెల్ల వెలఁదులు నంతః
పురవాసులుఁ జెప్పిన విని, పఱపుగ నిట్టూర్పు లెసఁగ బాష్పాకుల యై. 226

తే. సవతి యాడినమాటలు సారెఁ దలఁచి,కొనుచుఁ బేర్చినదుఃఖాగ్నిఁ గుందుచుండె
దావపావకశిఖలచేఁ దగిలి కాంతి,వితతిఁ గందినమాధవీలతిక వోలె. 227

వ. అంత నాసునీతి బాలకునిం జూచి తండ్రీ దుఃఖింపకు మని యిట్లనియె. 228

క. అనఘా యీదుఃఖమునకుం, బనిలే దన్యులకు సొలయ ♦ బలవంతం బై
తనపూర్వజన్మదుష్కృత, ఘనకర్మము వెంట నంటఁ ♦ గా నెవ్వలనన్. 229
వ. కావున. 230
క. పనిమిటిచేతను బెండ్లా, మని కాదు నికృష్టదాసి ♦ యనియును బిలువం
గను జాలనిదుర్భగురా, లనఁ గలనాకుక్షి నుదయ ♦ మందినకతనన్. 231
క. విను నాడినయాసురుచివ, చనములు సత్యంబు లగును ♦ సర్వశరణ్యుం
డనఁ గలహరిచరణంబులు, గను జనకునియంక మెక్కఁ ♦ గాఁ దలఁతేనిన్. 232
వ. కావునం బినతల్లి యైనయాసురుచియాదేశంబున నధోక్షజు నాశ్రయింపు మని
నెండియు నిట్లనియె. 233
సీ. పరికింప నవిశ్వ♦పరిపాలనమునకై, యర్థి గుణవ్యక్తుఁ ♦ డైనయట్టి
నారాయణునిపాద♦నలినముల్ సేవించి, తగ బ్రహ్మ బ్రహ్మపదంబు నొందె
ఘనుఁడు మీతాత యా♦మనువు సర్వాంతర,యామిత్వ మగునేక ♦ మైనదృష్టిఁ
జేసి యాగముల య♦జించి తా భూమసు,ఖములను దివ్యసు♦ఖమున మోక్ష
తే. సుఖములనుబొందె నట్టియ♦చ్యుతునిఁబగుని,వితతియోగీంద్రనికరసం♦వేష్ట్యమాణ
చరణసరసిజయుగళు శ♦శ్వత్ప్రకాశు, భక్తవత్సలు విశ్వసం♦పాద్యు హరిని. 234
వ. మఱియును. 235
క. [1]కరసరసీజగృహీతాం,బుసుహాయు నరవిందగర్భ♦ముఖగీర్వాణుల్
పరికింపం గలలక్ష్మి,తగుణీమణిచేత వెదకఁ ♦ దగుపరమేశున్. 236

ధ్రువుండు నారదోపదేశంబు వడసి తపంబు సేయుట.

వ. నిజధర్మపరిశోభితం బైనచిత్తంబున నిలిపి సేవింపు మమ్మహాత్మునికంటె
నీదుఃఖం బపనయించువాఁ డన్యుం డొక్కరుండు గలండే యని పలికినఁ బరమార్థ
ప్రాప్తిహేతుకంబు లైనతల్లివాక్యంబులు విని తన్నుఁ దాన నియమించుకొని
పురంబు వెడలి చనునవసరంబున నారదుండు తద్వృత్తాంతం బెఱింగి యచ్చటి
కిం జనుదెంచి యతనిచికీర్షితంబు దెలిసి పాపనాశకరం బైనతనకరతలంబున నా
ధ్రువునిశిరం బంటి మానభంగంబునకు సహింపనిక్షత్త్రియులప్రభావం బద్భు
తంబు గదా బాలకుం డయ్యుఁ బినతల్లి యాడినదురుక్తులు చిత్తంబునం బెట్టి
చనుచున్నవాఁ డని మనంబున నాశ్చర్యంబు నొంది (యోబాలక సకలసంపత్స
మృద్ధం బగుమందిరంబు డిగడి యొంటి యెందు నేఁగెదవు స్వజనకృతం బగు
నవమానంబుచే నిను సంతప్తుంగాఁ దలంచెద ననిన ధ్రువుం డిట్లనియె సపత్నీ
మాతృవాగిషుక్షతం బగువ్రణంబు భగవద్ధ్యానయోగరసాయనంబున మాపి
కొందు ననిన విని) ధ్రువునికి నారదుం డిట్లనియె. 237
క. విను పుత్త్రక బాలుఁడ వై, యనయంబును గ్రీడలందు ♦ నాసక్తమనం

1 కరకమలగృహీతలీలాం.

బునఁ దిరిగెడునిక్కాలం, బున నీ కవమానమానములు లే వెందున్. 238

తే. కాన మనమునఁ దద్వివేకంబు నీకుఁ, గలిగె నేనియు సంతోషకలితు లయిన
పురుషు లాత్మీయకర్మవిస్ఫురణఁ జేసి, వితతసుఖదుఃఖము లనుభవింతు రెపుడు.

వ. కావున వివేకంబు గలపురుషుండు దనకుం బ్రాప్తంబు లగుసుఖదుఃఖంబులు దైవవశంబులుగాఁ దలంచి తావన్మాత్రంబునం బరితుష్టుం డగు నీవును దల్లి చెప్పినయోగమార్గప్రకారంబున సర్వేశ్వరానుగ్రహంబునం బొందెద నంటివేని.

సీ. అనఘాత్మ యోగీంద్రు లనయంబు ధరఁ బెక్కు, జన్మంబులందు నిస్సంగ మైన
మతిని బ్రయోగసమాధినిష్ఠలఁ జేసి, యైనను దెలియ లే రతనిమార్గ
మది గాన యతఁడు దురారాధ్యుఁ డగు నీవు, నుడుగుము నిష్ఫలోద్యోగ మిపుడు
గాక నిశ్శ్రేయసకాముఁడ వగుదేనిఁ, దండ్రి వర్తించు తత్కాలమందుఁ

తే. బూని సుఖదుఃఖములు రెంటిలోన నెద్ది, దైవవశమునఁ జేకుఱు దానఁ జేసి
డెందమునఁ జాలసంతుష్టి నొందువాఁడు, విమలవిజ్ఞాని యన ధర వెలయుచుండు.

వ. మఱియు గుణాఢ్యుం డగువానిం జూచి సంతోషించుచు నాభాసుం డగువానిం జూచి కరుణించుచు సమానునియెడ మైత్రి సలుపుచు వర్తించుచున్నవాఁడు తాపత్రయాదికంబులం దొఱంగు నని నారదుండు వలికిన విని ధ్రువుం డిట్లనియె ననఘా యీశమంబు సుఖదుఃఖహతాత్ము లగుపురుషులకు దుర్గమం బని కృపాయత్తుండ వైన నీచేత వినంబడె నట్లయ్యునం బరభయంకరం బగుక్షాత్త్రస్వభావంబు నొందినయవినీతుండ నగునేను సురుచిదురుక్తిబాణవినిర్భిన్నహృదయుండ నగుట మదీయచిత్తంబున శాంతి నిలువదు కావునం ద్రిభువనోత్కృష్టంబు నన్యాధిష్ఠితంబు నగుపదంబునం బొంద నిచ్ఛయించిననాకు సాధుమార్గంబు నెఱింగింపుము నీవు భగవంతుం డగు నజునియూరువువలన జనించి వీణావాదనకుశలుండ వై జగద్ధితార్థంబు సూర్యుండునుంబోలె వర్తింతు వనిన విని. 242

క. నారదుఁ డిట్లను నఘ కుమారక విను నిన్ను మోక్షమార్గంబునకుం
బ్రేరేచినవాఁ డిప్పుడు, ధీరజనోత్తముఁడు వాసుదేవుం డగుటన్. 243

వ. నీవు నమ్మహాత్మునిపదధ్యానప్రవణచిత్తుండ వై భజియింపుము. 244

క. పురుషుఁడు దవిలి చతుర్విధ, పురుషార్థశ్రేయ మాత్మఁ బొందెద ననినన్
ధరఁ దత్ప్రాప్తికి హేతువు, హరిపదయుగళంబు దక్క నన్యము గలదే. 245

వ. కావున. 246

క. వరయమునానదితటమున, హరిసాన్నిధ్యంబు శుచియు నతిపుణ్యము నై
పరఁగినమధువనమునకును, సరసగుణా చనుము మేలు సమకుఱు నచటన్. 247

క. ఆయమునాతటినీశుభ, తోయములం గ్రుంకి నిష్ఠతో నచ్చట నా
రాయణునకును నమస్కృతు, లాయతమతిఁ జేసి చేయు యమనియమములన్.

వ. మఱియు (బాలుండ వగుటం జేసి వేదాధ్యయనాద్యుచితకర్మానర్హుండ వయ్యు

నుచితంబు లగు) కుశాజినంబులం జేసి స్వస్తికప్రముఖాసనంబులం గల్పించికొని త్రివృత్ప్రాణాయామంబులచేతం బ్రాణేంద్రియమనోమయంబు లనుచాంచల్యదోషంబులం బ్రత్యాహరించి స్థిరం బయినచిత్తంబున. 249

సీ. ఆశ్రితసత్ప్రసాదాభిముఖుండును, నిర్ధప్రసన్నాననేక్షణుండు
సురుచిరనాసుండు సుభ్రూయుగుండును, సుకపోలతలుఁడును సుందరుండు
హరినీలసంశోభితాంగుండుఁ దరుణుండు, నరుణావలోకనోష్ఠాధరుండుఁ
గరుణాసముద్రుండుఁ బురుషార్థనిధియును, బ్రణతాశ్రయుండు శోభనకరుండు
తే. లలితశ్రీవత్సలక్షణలక్షితుండు, సర్వలోకశరణ్యుండు సర్వసాక్షి
పురుషలక్షణయుక్తుండుఁ బుణ్యశాలి, యసితమేఘనిభశ్యాముఁ డవ్యయుండు.

వ. మఱియును. 251

సీ. హారకిరీటకేయూరకంకణఘన,భూషణుం డాశ్రితపోషణుండు
లాలితకాంచీకలాపశోభితకటి,మండలుం డంచితకుండలుండు
మహనీయకౌస్తుభమణికీలితాచ్ఛగ్రై,వేయకుం డానందదాయకుండు
సలలితఘనశంఖచక్రగదాపద్మ,హస్తుండు భువనప్రశస్తుఁ డజుఁడుఁ
తే. గమ్రసౌరభవనమాలికాధరుండు, హతవిమోహుండు నవ్యపీతాంబరుండు
లలితకాంచననూపురాలంకృతుండు, నిరతిశయసద్గుణుఁడు దర్శనీయతముఁడు.

క. సరసమనోలోచనము, త్కరుఁడు సుహృత్పద్మకర్ణికానివసితవి
స్ఫురదురునఖమణిశోభిత, చరణసరోజాతుఁ డతులశాంతుఁడు ఘనుఁడున్. 253

వ. అయినపురుషోత్తముం బూజించుచు హృదయగతుండును సానురాగవిలోకనుండును వరదశ్రేష్ఠుండును నగునారాయణు నేకాగ్రచిత్తంబునం ధ్యానంబు సేయుచుఁ బరమనివృత్తిమార్గంబున ధ్యానంబు సేయంబడ్డపురుషోత్తమునిదివ్యమంగళస్వరూపంబు చిత్తంబునం దగిలిన మరల మగుడ నేర దదియునుం గాక హోమంత్రం బేని సప్తవాసరంబులు పఠియించిన ఖేచరులం గనుఁగొనుసామర్థ్యంబు గలుగు నట్టి ప్రణవయుక్తం బగుద్వాదశాక్షరకలితంబును దేశకాలవిభాగవేది యగుబుధానుష్ఠితంబును నయినవాసుదేవమంత్రంబునం జేసి. 254

సీ. దూర్వాంకురంబుల దూర్వాంకురశ్యాము, జలజంబులను జారుజలజనయనుఁ
దులసీదళంబులఁ దులసికాదాముని, మాల్యంబులను సునైర్మల్యచరితుఁ
బత్త్రంబులను బక్షిపత్త్రునిఁ గడు వన్య,మూలంబులను నాదిమూలఘనుని
నంచితభూర్జత్వగాదినిర్మితవివి,ధాంబరంబులను బీతాంబరునిని
తే. దనరుభక్తిని మృచ్ఛిలాదారురచిత,రూపములయందుఁ గాని నిర్బాధమైన
సలిలములయందుఁ గాని సుస్థలములందుఁ,గానిపూజింపవలయు నక్కమలనాభు.

క. ధృతచిత్తుఁడు శాంతుండు ని,యతపరిభాషణుఁడు సుమహితాచారుఁడు వ
ర్ణితహరిమంగళగుణుఁడును, మితవన్యాశనుఁడు నగుచు మెలఁగుచు మఱియున్.

వ. ఉత్తమశ్లోకుం డగుపుండరీకాక్షుండు నిజమాయాస్వేచ్ఛావతారచరితంబుల చేత నచింత్యంబుగా నెద్ది సేయు నద్దియ హృదయగతంబుగా ధ్యానంబు సేయం దగు మఱియుం గార్యబుద్ధిం జేసి సేయంబడుపూజావిశేషంబులు వాసుదేవ మంత్రంబున సర్వేశ్వరునికి సమర్పింప వలయు నిట్లు మనోవాక్కాయకర్మం బులచేత మనోగతం బగునట్లుగా భక్తియుక్తంబు లయినపూజలచేతం బూజిం పంబడి సర్వేశ్వరుండు మాయాభిభూతులు గాక సేవించుపురుషులకు ధర్మాది పురుషార్థంబులలోన నభిమతార్థంబు నిచ్చు విరక్తుం డగువాఁడు నిరంతరభావం బయినభక్తియోగంబునం జేసి మోక్షంబుకొఱకు భజియించు నని చెప్పిన విని ధ్రువుండు నారదునకుం బ్రదక్షిణపూర్వకంబుగా నమస్కరించి (మహర్షిజన సేవ్యం బై సకలసిద్ధుల నొసంగుచు) భగవత్పాదసరోజాలంకృతం బైనమధు వనంబునకుం జనియె నంత. 257

తే. పద్మభవసూనుఁ డుత్తానపాదుకడకు, నరిగి యారాజుచే వివిధార్చనముల నంది సంప్రీతుఁ డై యుచితాసనమున, నెలమిఁ గూర్చుండి యాతని వలనుఁ జూచి.

వ. ఇట్లనియె. 259

క. భూనాయక నీ విపు డ,మ్లానాస్యుఁడ వగుచుఁ జాల మదిలోఁ జింతం బూనుట కేమి కతం బన, నానారదుతోడ నాతఁ డనియెన్ మరలన్. 260

క. మునివర వివేకశాలియు, ననఘుఁడు నై దేండ్లబాలుఁ డస్మత్ప్రియనం దనుఁ డదయుఁడ నగునాచే,తను బరిభవ మొంది చనియెఁ దల్లియుఁ దానున్.

మ. చని యుగ్రాటవిఁ జొచ్చి యచ్చటఁ బరిశ్రాంతుండు క్షుత్పీడితుం డును నామ్లానముఖాంబుజుండు ననఘుం డర్భకుం డైననమ త్తనయుం డుగ్రవృకాహిభల్లముఖసత్త్వశ్రేణి నిర్జించెనో యని దుఃఖించెద నాదుచిత్తమున నార్యస్తుత్య యిట్లాటకున్. 262

తే. అట్టియుత్తమబాలు నాయంకపీఠ,మందుఁ గూర్చుండ నీక నిరాకరించి యంగనాసక్తచిత్తుండ నైనయట్టి,నాదుదౌరాత్మ్య మిది మునినాథచంద్ర.

ఉ. నా విని నారదుండు నరనాథున కిట్లను నీకుమారుఁ డా దేవకిరీటరత్నరుచిదీపితపాదసరోజుఁ డైనరా జీవదళాక్షరక్షితుఁ డశేషజగత్పరికీర్తనీయకీ ర్తివిభవప్రశస్తసుచరిత్రుఁడు వానికి దుఃఖ మేటికిన్. 264

ఉ. కావున నమ్మహాత్ముఁడు సుకర్మముచేత సమస్తలోకపా లావళి కందరానిసముదంచితనిత్యపదంబునం బ్రభు శ్రీ విలసిల్లఁ జెందుఁ దులసీదళదాము భజించి యాజగ త్పావనుఁ డై ననీసుతుప్రభావ మెఱుంగవు నీవు భూవరా. 265

వ. అదియునుం గాక. 266

క. నీకీర్తియు జగములయం, దాకల్పము నొందఁ జేయు నంచితగుణర
త్నాకరుఁ డిట కేతెంచును, శోకింపకు మతనిఁ గూర్చి సుభగచరిత్రా. 267
క. అని నారదుండు వలికిన, విని మనమున విశ్వసించి విభుఁడును బ్రియనం
దనుఁ జింతించుచు నాదర, మునఁ జూడం డయ్యె రాజ్యమును బూజ్యముగన్.
వ. అంత నక్కడ నాధ్రువుండు. 269
క. చని ముందటఁ గనుఁగొనె మధు, వనమును మునియోగిదేవవర్ణితగుణపా
వనమును దుర్భవజలదప, వనమును నిఖిలైకపుణ్యవరభవనంబున్. 270
వ. అట్లు గని డాయం జని యమునానదిం గృతస్నానుం డై నియతుండును సమా
హితచిత్తుండును నై సర్వేశ్వరుని ధ్యానంబు సేయుచుం [1] ద్విరాత్రత్రిరాత్రం
బుల కొక్కమాఱు కృతకపిత్థబదరీఫలపారణుం డగుచు దేహస్థితి ననుసరించి
యొక్కమాసంబు హరిం బూజించి యంతనుండి యాఱేసిదినంబుల కొక్కపరి
కృతజీర్ణతృణపర్ణాహారుం డగుచు రెండవమాసంబున విష్ణుసమారాధనంబు
సేసి యంతనుండి నవరాత్రంబుల కొకమా ఱుదకభక్షణంబు సేయుచు మూఁ
డవమాసంబున మాధవు నర్చించి యంతనుండి ద్వాదశదినంబుల కొకతోయం
బు వాయుభక్షణుం డగుచు (జితశ్వాసుం డై) నాలవమాసంబునం బుండరీకా
క్షుని భజియించి యంతనుండి మనంబున (నలయక నిరుచ్ఛ్వాసుం డై యేక
పదంబున నిలిచి పరమాత్మం జింతించుచు) నచేతనం బైన స్థాణువుంబోలె నై
దవమాసంబును జరపె నంత. 271
సీ. సకలభూతేంద్రియాశయ మగుహృదయంబు, నందు విషయములఁ జెంద నీక
మహదాదితత్త్వసమాజమ్ములకును నా, ధారభూతమును బ్రధానపూరు
షేశ్వరుఁ డైనట్టి శాశ్వతబ్రహ్మంబుఁ, దన హృదయపద్మమున నిలిపి
హరిరూపమునకంటె నన్యంబు నెఱుఁగక, చిత్త మవ్విభునందుఁ జేర్చియున్న
తే. కతనముల్లోకములు సాలఁ గంపమొందె, వెండియును బేర్చి యయ్యర్భకుండు ధరణి
నొక్కపాదంబు చేర్చి నిల్చున్నవేళ, బేర్చి యబ్బాలుసంగుష్ఠపీడఁ జేసి. 272
తే. వసుమతీతల మర్ధము వంగఁ బొచ్చె, భూరిమదదుర్నివారణవారణేంద్ర
మెడమఁ గుడి నొరగఁగ నడుగడుగునకును, జలన మగునుదధిస్థితకలమువోలె.
చ. అతఁడు ననన్యదృష్టిని జరాచరదేహశరీరధారణా
స్థితి గలయాశునందుఁ దనజీవితముం ఘటియింపఁ జేసి యే
కతఁ గనఁ దన్నిరోధమునఁ గైకొని కంపము నొందె నీశ్వరుం
డతఁడు చలింప నిజ్జగము లన్నియుఁ జంచల మయ్యె భూవరా. 274
క. ఆలోకభయంకర మగు, నాలోకమహావిపద్విశాలోకను లై
యాలోకపాలు రందఱు, నాలోకశరణ్యుఁ గాన నరిగిరి భీతిన్. 275

1 త్రిరాత్రోపవాసంబులఁ గృత.

వ. అట్లరిగి నారాయణు నుద్దేశించి కృతప్రణాము లై కరంబులు ముకుళించుకొని
యి ట్లనిరి. 276

చ. హరి పరమాత్మ కేశవ చరాచరభూతశరీరధారి వై
పరఁగుదు వీవు నిట్టులుగఁ బ్రాణనిరోధము లెందు మున్ను నే
మెఱుఁగ మనాథనాథ జగదీశ్వర సర్వశరణ్య నీపదాం
బురుహము లర్థిమై శరణు వొందెద మార్తి హరించి కావవే. 277

వ. అని దేవతలు విన్నవించిన నీశ్వరుండు వారల కిట్లనియె నుత్తానపాదుం డను
వానితనయుండు విశ్వరూపుఁడ నయిననాయందుఁ దనచిత్తం బైక్యముసేసి తపం
బు గావించుచుండ దానం జేసి భవదీయప్రాణనిరోధం బయ్యె నట్టిదురత్యయం
బైనతపంబు నివర్తింపఁ జేసెద వెఱవక మీమీనివాసంబులకుం జనుం డని యా
నతిచ్చిన నాదేవతలు నిర్భయాత్ము లై యీశ్వరునకుం బ్రణామంబు లాచరించి
త్రివిష్టపంబునకుం జనిరి తదనంతరంబ. 278

సీ. హరి యీశ్వరుండు విహంగకులేశ్వర, యానుఁ డై నిజభృత్యుఁ డైనధ్రువుని
గనుఁగొనువేడుక జనియింప నామధు, వనమున కప్పుడు సని ధ్రువుండు
పరువడి యోగవిపాకతీవ్రం బైన, బుద్ధిచే నిజమనోంబురుహముకుళ
మందుఁ దటిత్ప్రభాయతమూర్తి యటఁ దిరో, ధానంబునను బొందితత్క్షణంబ

తే. తనపురోభాగమందు నిల్చినను బూర్వ
సమధికజ్ఞాననయనగోచరసమగ్ర
మూర్తిఁ గనుఁగొని సంభ్రమమునను సమ్మ
దాశ్రువులు రాలఁ బులకీకృతాంగుఁ డగుచు. 279

సాక్షాత్కరించిన భగవంతుని ధ్రువుండు స్తుతించుట.

తే. నయనముల విభుమూర్తిఁ బానంబు సేయు
పగిదిఁ దనముఖమునను జుంబనము సేయు
లీలఁ దగిలి భుజముల నాలింగనంబు
సేయుగతి దండవన్నమస్కృతు లొనర్చె. 280

వ. ఇట్లు దండప్రణామంబు లాచరించి కృతాంజలి యై స్తోత్రంబుసేయ నిశ్చయించి
స్తుతిక్రియాకరణసమర్థుండు గాకయున్నధ్రువునకును [1]సమస్తభూతంబులకు నంత
ర్యామి యైనయీశ్వరుం డాతనితలం పెఱింగి వేదమయం బయినతనశంఖంబు
చేత నబ్బాలునికపోలతలం బంటిన జీవేశ్వరనిర్ణయజ్ఞుండును భక్తిభావనిష్ఠుండును
నగుధ్రువుండు నిఖిలలోకవిఖ్యాతకీర్తి గలయీశ్వరుని (భగవత్ప్రతిపాదితంబు
లగుచు) [1]వేదాత్మకంబు లైనతనవాక్కుల నిట్లని స్తుతియించె దేవా నిఖిలశక్తి
ధరుండవు నంత ప్రవిష్టుండవు నైననీవు లీనంబు లైనమదీయవాక్కులం బ్రా

1 తనవేదస్వరూపంబు లైన.

జేంద్రియంబులం గరచరణశ్రవణత్వగాదులను జిచ్ఛక్తిచేఁ గృపంజేసి జీవింపం జేసినభగవంతుండవును బరమపురుషుండవును నైననీకు నమస్కరింతు నీ వొక్కరుండ వయ్యు మహదాద్యం బైనయీయాశేషవిశ్వంబు మాయాఖ్యం బయిన యాత్మీయశక్తిచేతం (గల్పించి యందుం) బ్రవేశించి యింద్రియంబులం[1]దు వసించుచుఁ దత్తద్దేవతారూపంబులచే నానాప్రకారంబుల దారువులం దున్న వహ్నిచందంబునం బ్రకాశింతు వదియునుం గాక. 281

చ. పరమతి నార్తబాంధవ భవద్ఘనబోధసమేతుఁడై భవ
చ్చరణముఁ బొందినట్టివిధిసర్గము సుప్తజనుండు బోధమం
దరయఁగఁ జూచురీతిఁ గను నట్టిముముక్షుశరణ్య మైననీ
చరణములం గృతజ్ఞుఁ డగుసజ్జనుఁ డెట్లు దలంప కుండెడున్. 282

సీ. మహితాత్మ మతిజన్మమరణప్రణాశన, హేతుభూతుండవు నిద్ధకల్ప
తరువవు నగునిన్నుఁ దగ నెవ్వరే నేమి, పూని నీమాయావిమోహితాత్ము
లగుచు ధర్మార్థకామాదులకొఱకుఁ [2]దా, మర్చించుచును ద్రిగుణాభ మైన
దేహోపభోగ్య మై దీపించుసుఖముల, నెనయంగ మదిలోన నెంతు రట్టి

తే. విషయసంబంధజన్యమై వెలయుసుఖము, వారికి నిరయమందును వఱలు దేవ
భూరిసంసారతాపనివారగుణక, ధామ్మృతాపూర్ణ యీశ మాధవ ముకుంద.

మ. అరవిందోదర తావకీనచరణధ్యానానురాగోల్లస
చ్చరితాకర్ణసజాతభూరిసుఖముల్ స్వానందకబ్రహ్మమం
దరయన్ లే వఁట దండభృద్భటవిముక్తనాకీర్ణ లై కూలునా
సురలోకస్థులఁ జెప్ప నేల సుజనస్తోమైకచింతామణీ. 284

చ. హరి భజనీయమార్గనియతాత్మకు లై భవదీయరూప మై
వఱలినభక్తియుక్తు లగువారలసంగతిఁ గల్గఁజేయు స
త్పురుషసునంగతిన్ వ్యసనదుర్భరసాగర మప్రయత్నతన్
సరసభవత్కథామృతరసంబున మత్తుఁడ నై తరించెదన్. 285

చ. నిరతముఁ దావకీనభజనీయపదాబ్జసుగంధలుబ్ధు లై
న్వారిమదిఁ బొందఁగాఁ గలుగు వారలు తప్పిరియమర్త్యదేహము
న్నరయఁ దదీయదారతనయాదిసుహృద్గృహబంధువర్గముల్
మఱతురు విశ్వతోముఖ రమామహృదయేశ ముకుంద మాధవా. 286

సీ. పరమాత్మ మర్త్యసుపర్వతిర్యఙ్మృగ, దితిజసరీసృపద్విజగణాది
సంవ్యాప్తమును సదసద్విశేషంబును, గైకొని మహదాదికారణంబు
నైనవిరాడ్విగ్రహంబు నే నెఱుఁగుదుఁ, గాని తక్కినసుమంగళము నైన
సంతతసుమహితైశ్వర్యరూపంబును, భూరిశబ్దాదివ్యాపారశూన్య

1 జేష్టింపం జేయుచు దారువులందు. 2 గా భజియించుచును గుణప్రభవ మైన.

తే. మైన బ్రహ్మస్వరూప మే నాత్మ నెఱుఁగఁ, బ్రవిమలాకార సంసారభయవిదూర
పరమమునిగేయ సంతతభాగధేయ, నలిననేత్ర రమాలలనాకళత్ర. 287

సీ. సర్వేశ కల్పాంతసమయంబునందు నీ,యఖిలప్రపంచంబు నాహరించి
యనయంబు శేషసహాయుండ వై శేష,పర్యంకతలమునఁ బవ్వళించి
యోగనిద్రారతి నుండి నాభీసింధు,జస్వర్ణలోకకంజాతకర్ణి
కందుఁ జతుర్ముఖు నమరఁ బుట్టించుచు, రుచి నొప్పు బ్రహ్మస్వరూపి వైన

తే. నీకు మ్రొక్కెద నత్యంతనియమ మొప్ప, భవ్యచారిత్ర పంకజపత్త్రనేత్ర
చిరశుభాకార నిత్యలక్ష్మీవిహార, యవ్యయానంద గోవింద హరి ముకుంద. 288

వ. అట్లు యోగనిద్రాపరవశుండ వయ్యును జీవులకంటె నత్యంతవిలక్షణుండ వై యుండుదు వది యె ట్లనిన బుద్ధ్యవస్థాభేదంబున నఖండితం బయినస్వశక్తిం జేసి చూచులోకపాలననిమిత్తంబు యజ్ఞాధిష్ఠాతవు గావున నీవు నిత్యముక్తుండవును బరిశుద్ధుండవును జిద్రూపకుండవును నాత్మవును గూటస్థుండవును(నాదిపురుషుండవును భగవంతుండవును)గుణత్రయాధీశ్వరుండవును నైవర్తింతువు భాగ్యహీనుండై నజీవునియందు నీగుణంబులుగలుగ వేసర్వేశ్వరునందే నేమి విరుద్ధగతులై వివిధశక్తియుక్తంబు లై నయవిద్యాదు లానుపూర్వ్యంబునం జేసి ప్రలీనంబు లగుచుండు నట్టివిశ్వకారణంబు నేకంబు ననంతంబు నాద్యంబు నానందమాత్రంబు నవికారంబు నగుబ్రహ్మంబునకు నమస్కరించెద మఱియు దేవా నీవు సర్వవిధ ఫలం బని చింతించునిష్కాము లయినవారికి రాజ్యాదికామితంబులలోనఁ బరమార్థం బయిన ఫలంబు సర్వార్థరూపుండ వై నభవదీయపాదపద్మసేవనంబ యిట్లు నిశ్చితంబ యైనను నకాము లైనదీనులను గోవు వత్సంబును స్తన్యపానంబు సేయించుచు వృకాదిభయంబువలన రక్షించుచందంబునం గామప్రదుండ వై సంసారభయంబువలనం బాపుదు వని యిట్లు సత్యసంకల్పుండును సుజ్ఞానియు నయినధ్రువునిచేత వినుతింపంబడి భృత్యానురక్తుం డై నభగవంతుండు సంతుష్టాంతరంగుఁ డై యి ట్లనియె. 289

క. ధీరవ్రత రాజన్యకు,మారక నీహృదయమందు మసలినకార్యం
బారూఢిగా నెఱుంగుదు, నారయ నది వొంద రాని దైనను నిత్తున్. 290

వ. అది యెట్టి దనిన నెం దేని మేధియందుఁ బరిభ్రామ్యమాణగోచక్రంబునుంబోలె గ్రహనక్షత్రతారాగణజ్యోతిశ్చక్రంబు నక్షత్రరూపంబు లయినధర్మాగ్నికశ్యపశక్రులును సప్తర్షులును దారకాసమేతు లై ప్రదక్షిణంబు దిరుగుచుండుదు రట్టి దురాపంబును ననన్యాధిష్ఠితంబును లోకత్రయప్రళయకాలంబునందు నశ్వరంబు గాక ప్రకాశమానంబును నయినధ్రువక్షితి యనుపదంబు ముందట నిరువదియాఱువేలేండ్లు నసం బ్రాపింతువు తత్పదప్రాప్తిపర్యంతంబు భవదీయజనకుండు వనవాసగతుం డైనం దద్రాజ్యంబు పూజ్యంబుగా ధర్మమార్గంబున జితేం

ద్రియుండ వై చేయుదువు భవదనుజుం డగు నుత్తముండు మృగయార్థంబు వనం
బునకుం జని మృతుం డగుఁ దదన్వేషణార్థంబు తదాహితచిత్తయై తన్మాతయు
వనంబునకుం జని యందు దావదహననిమగ్న యగు వెండియు. 291

సీ. అనఘాత్మ మఱి నీవు యజ్ఞరూపుం డనఁ, దగునన్ను సంపూర్ణదక్షిణంబు
లగుమఖంబులచేత నర్చించి సత్యంబు, లగునిహసౌఖ్యంబు లనుభవించి
యంత్యకాలమున న న్నాత్మఁ దలంచుచు, మఱి సర్వలోకనమస్కృతమును
మహిఁ బునరావృత్తిరహితంబు సప్తర్షి,మండలోన్నత మగుమామకీన
తే. పదము దగఁ బొందఁ గల వని పరమపురుషుఁ
డతనియభిలషితార్థంబు లర్థి నిచ్చి
యతఁడు గనుఁగొను చుండంగ నాత్మపురికి
గరుడగమనుఁడు వేంచేసెఁ గౌతుకమున. 292

తే. అంత ధ్రువుఁడును బంకేరుహాక్షపాద,కమలసేవోపపాదితఘనమనోర
థములఁ దనరియుఁ దనమదిచిత్తంబుఁ బోన, దుష్టిఁ బొందక చనియె విశిష్టచరిత.

క. అని మైత్రేయుఁడు ధ్రువుఁ డ, ట్లనయము హరిచేఁ గృతార్థుఁ డైనవిధం బె
ల్లను వినిపించిన విదురుఁడు, విని మునివరుఁ జూచి పలికె వినయం బెసఁగన్.

క. మునినాయక విను కాముక,జనదుష్ప్రాపంబు విష్ణుచరణాంబురుహా
ర్చనమునిజనసంప్రాప్యము, ననఁ గలపంకేరుహాక్షునవ్యయపదమున్. 295

వ. పెక్కుజన్మంబులం గాని పొందరానిపదంబు దా నొక్కజన్మంబుననే పొంది
యుం దనమనంబునం దప్రాప్తమనోరథుండ నని పురుషార్థవేది యైనధ్రువుం
డెట్లు దలంచె ననిన మైత్రేయుం డి ట్లనియె. 296

తే. అనఘ పినతల్లి దన్నుఁ బల్కినదురుక్త
బాణవిద్ధాత్ముఁ డగుచుఁ దద్భాషణములు
చిత్తమందుఁ దలంచుటఁ జేసి ముక్తి
గోరమికి నాత్మలో వగఁ గూరుచుండె. 297

వ. అంత నాధ్రువుండు. 298

చ. అనఘ జితేంద్రియుల్ సుమహితాత్ములు నైనసనందనాదు లెం
దనయము నైకజన్మసముపార్జితయోగసమాధిఁ జేసి యె
వ్వనిచరణారవిందములు వారనిభక్తి నెఱుంగుచుందు రా
ఘనుఁ బరమేశు నీశు నవికారు నమేయు నజయ్యు నాద్యునిన్. 299

వ. ఏను షణ్మాసంబులు భజియించి తత్పాదపద్మచ్ఛాయం బ్రాపించియు భేదదర్శ
నుండ నైతి నక్కటా యిట్టిభాగ్యహీనుండ నైనయేను భవనాశకుం డైనయ
తనిం బొడగనియు నశ్వరంబు లైనకామ్యంబు లడిగితి నిట్టిదూరాత్మ్యం బెం
దేనిం గలదే తమపదంబులకంటె నున్నతపదంబునం బొందుదునో యని సహిం

పం జాలని యీ దేవతలచేత మదీయమతి గలుషితం బయ్యెం గాక నాఁడు నార
దుం డాడినమాట తథ్యంబయ్యె నతనివాక్యంబు లంగీకరింపక యే నసత్తముండ
నై స్వప్నావస్థలం బొందినవాఁడు దైవికం బైనమాయం జెంది భిన్నదర్శనుం
డగుచందంబున నద్వితీయుండ నైనను భ్రాత యనుశత్రువుచేఁ బ్రాప్తం బైన
దుఃఖంబు నొంది జగదాత్మకుండును సుప్రసాదుండును భవనాశకుండును నైన
యీశ్వరు నారాధించి తత్ప్రసాదంబు వడసియు నాయుర్విహీనుం డైనరోగికిం
బ్రయోగించు నౌషధంబుం బోలె నిరర్థకంబు లై నశ్వరంబు లైనయీ కామితం
బులు గోరితి నని వెండియు. 300

మ. ధనహీనుండు నృపాలుఁ జేరి [1]మిగులన్ ధాటిన్ ఫలీకార మి
మ్మని యర్థించినరీతి ముక్తిఫలదుం డైనట్టి పంకేజలో
చనుఁడే చాలఁ బ్రసన్నుఁ డైన నతనిన్ సాంసారికం బర్థిఁ గో
రిననావంటివిమూఢమానసులు ధాత్రిం గల్గిరే యెవ్వరున్. 301

ధ్రువుండు మరలఁ దనపురంబునకు వచ్చుట.

సీ. అని యిట్లు చింతించె ననుచు మైత్రేయ,ముని విదురునకు నిట్లనియెఁ దండ్రి
కమనీయహరిపాదకమలరజోభిసం,స్కృతశరీరులును యాదృచ్ఛికముగ
సంప్రాప్త మగుదాన సంతుష్టచిత్తు లై, వఱలుచు నుండుమీవంటివారు
తగ భగవత్పాదదాస్యంబు దక్కఁగ, నితరపదార్థమే యెడఁదలంచు
తే. మఱచియును గోరనొల్లరు మనుచరిత్ర, తవిలి యిట్లు హరిప్రసాదంబు నొంది
మరల వచ్చుచు నున్నకుమారువార్తఁ, జారుచే విని యుత్తానచరణుఁ డంత.
వ. మనమ్మున నిట్లని తలంచె. 303
క. చచ్చినవారలు క్రమ్మఱ, వచ్చుటయే కాక యిట్టివార్తలు గలవే
నిచ్చలు నమంగళుఁడ నగు, నిచ్చట మఱి నాకు శుభము లేల ఘటించున్.
క. అని విశ్వసింప కుండియు, మనమున నానారదుఁడు గుమారుఁడు వేగం
బున రాఁగలఁ డనుచును బలి,కినపలుకులు దలఁచి నమ్మి కృతకృత్యుం డై.
క. తనసుతునిరాక సెప్పిన, ఘనునకు ధనములును మౌక్తికప్రహారములున్
మన మలర నిచ్చి తనయుని, గనుఁగొనుసంతోష మాత్మఁ గడలుకొనంగన్.
సీ. వలను మీఱినసైంధవంబులఁ బూన్చిన, కనకరథంబు నుత్కంఠ నెక్కి
బ్రాహ్మణకులవృద్ధబంధుజనామాత్య,పరివృతుం డగుచు విస్ఫురణ మెఱసి
బ్రహ్మనిర్ఘోషతూర్యస్వనశంఖకా,హళవేణురవము లందంద చెలఁగ
శిబిక నెక్కియు విభూషిత లై సునీతి సు,రుచు లుత్తముండు నారూఢి నడవ
తే. గరిమ దీపింప నతిశీఘ్రగమన మొప్ప, నాత్మనగరంబు వెలువడి యరుగు చుండి
బలసి నగరోపవనసమీపంబునందు, వచ్చుధ్రువుఁ గని మేదినీశ్వరుఁడు నంత.

1 'యడుగన్ దార్కొన్నచో లేశ మిమ్మని' వ్రా. ప్ర.

చ. అరదము డిగ్గి ప్రేమ దొలఁకాడ ససంభ్రముఁ డై రమామనో
హరుచరణారవిందయుగళార్చననిర్దళితాఖిలాఘు నీ
శ్వరకరుణావలోకనసుజాతసమగ్రమనోరథున్ సుతుం
గర మనురక్తిఁ డాసి పులకల్ నన లొత్తఁ బ్రమోదితాత్ముఁ డై. 308

తే. బిగియఁ గౌఁగిటఁ జేర్చి నెమ్మొగము నివిరి, శిరము మూర్కొని చుబుకంబు సేతఁ బుణికి
యవ్యయానందబాష్పధారాభిషిక్తుఁ, జేసి యాశీర్వదింప నాచిరయశుండు.

క. జనకుని యాశీర్వచనము, లనయముఁ గైకొని ప్రమోదియై తత్పదముల్
దనఫాలతలము సోఁకఁగ, వినతులు గావించి భక్తివిహ్వలుఁ డగుచున్. 310

తే. అంత నాసజ్జనాగ్రణియైనధ్రువుఁడు, దల్లులకు భక్తి వినతులు దగ నొనర్చె
సురుచి మ్రొక్కినయర్భకుఁ జూచి యెత్తి, నగుమొగంబున నాలింగనంబు సేసి.

సీ. కరమొప్ప నానందగద్గదస్వరమున, జీవింపు మనుచు నాశీర్వదించె
భగవంతుఁ డెవ్వనిపై మైత్రి వాటించు, సత్కృపానిరతఁ బ్రసన్నుఁ డగుచు
నతనికిఁ దమయంత ననుకూలమై యుండు, సర్వభూతంబులు సమతఁ బేర్చి
మహిఁ దలపోయ నిమ్నప్రదేశములకు, ననయంబుఁ జేరుతోయములపగిదిఁ

తే. గాన ఘను నమ్మహాత్ముని గారవించె, సురుచి పూర్వంబుఁ దలఁపక సుజనచరిత
విష్ణుభక్తులు ధరను బవిత్రు లగుట, వారి కలుగరు ధరణి నెవ్వారు మఱియు.

వ. కావున నుత్తముండును ధ్రువుండును బ్రేమవిహ్వలు లగుచు నన్యోన్యాలింగితు
లై పులకాంకురాలంకృతశరీరులై యానందబాష్పంబుల నొప్పి రంత సునీతియుఁ
దనప్రాణంబులకంటెం బ్రియం బగుసుతు నుపగూహనంబు సేసి తదవయవస్ప
ర్శనంబుచేత నానందంబు నొంది విగతశోక యయ్యె నప్పుడు సంతోషబాష్ప
ధారాసిక్తంబు లై చనుఁబాలునుం గురిసె నంత. 313

సీ. అప్పుడు సంతోష ముప్పతిల్లఁగఁ బౌర, జనము లాధ్రువుతల్లి నెనయఁ జూచి
తొడరినభవదీయదుఃఖనాశకుఁ డైన, యిట్టితనూజుఁ డెం దేనిఁ బెద్ద
కాలంబు క్రిందటఁ గడఁగి నష్టుం డైన, వాఁ డిప్డు నీభాగ్యవశముచేతఁ
బ్రతిలబ్ధుఁ డయ్యెను నితఁడు భూమండల, మెల్లను రక్షించు నిద్ధమహిమఁ

తే. గమలలోచనుఁ జింతించు ఘనులు లోక, దుర్జయం బైనయట్టిమృత్యువును గెల్తు
రట్టిప్రణతార్తిహరుఁ డైనయబ్జనాభుఁ, డర్థి నీచేతఁ బూజితుం డగుట నిజము.

వ. అని ప్రశంసించి రట్లు పౌరజనంబులచేత నుపలాల్యమానుండును (సంస్తూయ
మానుండును)నగుచు నుత్తానపాదుం డుత్తమసమేతంబుగా ధ్రువుని గజారూఢు
నిం జేసి ప్రహృష్టాంతరంగుం డగుచుఁ బురాభిముఖుం డై చనుదెంచి. 315

సీ. స్వర్ణపరిచ్ఛదస్వచ్ఛకుడ్యద్వార, రాజితగోపురాట్టాలకంబు
ఫలపుష్పమంజరీకలితరంభాస్తంభ, పూగపోతాదివిభూషితంబు
ఘనసారకస్తూరికాగంధజలబంధు, రాసిక్తవిపణిమార్గాంచితంబు

మానితనవరత్నమయరంగవల్లివి, రాజితప్రతిగృహప్రాంగణంబు
తే. శుభనదీజలకుంభసంశోభితంబు, తండులస్వర్ణలాజాక్షతప్రసూన
ఫల[1]బలివ్రాతకలితవిభ్రాజితంబు, నగుచు సర్వతోలంకృతమైనపురము. 316
వ. ప్రవేశించి రాజమార్గంబునఁ జనుదెంచునప్పుడు. 317
మ. హరిమధ్యల్ పురకామినీజనులు సౌధాగ్రంబులందుండి భా
స్వరసిద్ధార్థఫలాక్షతప్రసవదూర్వావ్రాతదధ్యంబువుల్
గరవల్లీమణిహేమకంకణరుణత్కారంబు శోభిల్లఁ జ
ల్లిరి యాభాగవతోత్తమోత్తమునిపై లీలాప్రమేయంబుగన్. 318
వ. ఇట్లు వాత్సల్యంబునం జల్లుచు సత్యవాక్యంబుల దీవించుచు సువర్ణపాత్రరచిత
మణిదీపనీరాజనంబుల నివాళింపం (బౌరజానపదమిత్రామాత్యబంధుజనపరివృ
తుండై) చనుదెంచి. 319
సీ. కాంచనమయమరకతకుడ్యమణిపరి, చ్ఛదవిరాజిస్వచ్ఛసౌధములను
వరసుధాఫేనపాండురగుక్షపరికరో, దాత్తసమంచితతల్పములను
[2]సురతరుశోభితశుకపికమిథునాళి, గానవిభాసితోద్యానములను
సుమహితవైడూర్యసోపానవిమలశో, భితజలపూర్ణవాపీచయముల
తే. వికచకహ్లారదరదరవిందకైర, వప్రదీపితబకచక్రవాకరాజ
హంససారసకారండవాదిజలవి, హంగనినదాభిరామపద్మాకరముల. 320
వ. మఱియును. 321
తే. చారుబహువిధవస్తువిస్తార మొప్ప
నంగనాయుక్త మగుచుఁ బెంపగ్గలించి
యర్థిఁ దనరారుజనకుగృహంబు సొచ్చె
నెలమిఁ ద్రిదివంబు సొచ్చు దేవేంద్రుపగిది. 322
వ. ఇట్లు ప్రవేశించిన రాజర్షి యైనయుత్తానపాదుండు సుతునియాశ్చర్యకరం బైన
ప్రభావంబు వినియుం జూచియు మనంబున విస్మయంబు నొంది ప్రజానురక్తుం
డును బ్రజాసమ్మతుండును నవయౌవనపరిపూర్ణుండును నైనధ్రువుని రాజ్యాభి
షిక్తుం జేసి వృద్ధవయస్కుం డైనతన్నుఁ దాన యెఱింగి యాత్మగతిఁ బొంద నిశ్చ
యించి విరక్తుం డై వనంబునకుం జనియె నంత నాధ్రువుండు శింశుమారప్రజా
పతికూఁతు రైనభ్రమి యనుదాని వివాహం బై దానివలనఁ గల్పవత్సరు లను
నిద్దఱు గొడుకులం బడసి వెండియు వాయుపుత్రి యైనయిల యనుభార్యయందు
నుత్కలనామకుం డైనకొడుకు నతిమనోహర యైనకన్యా(రత్నం బు)నుం గనియె.
నంతఁ దద్భ్రాత యైనయుత్తముండు వివాహంబు లేకుండి మృగయార్థంబు వనం
బున కరిగి హిమవంతంబున యక్షునిచేత హతుం డయ్యె నతనితల్లియుఁ దద్దుః

1 పరివ్రాత. 2 సురతప్రశోభిత.

ఖంబున వనంబున కేఁగునెడ గహనదహనుచేత మృతిం బొందె ధ్రువుండు భ్రా
తృమరణంబు విని శోకవ్యాకులితచిత్తుం డై జైత్రం బగురథం బెక్కి యుత్తరా
భిముఖుం డై చని హిమవద్ద్రోణియందు భూతగణసేవితంబును గుహ్యకసంకులం
బును నైనయలకాపురంబు వొడగని యమ్మహాబాహుండు. 323

ధ్రువుండు కుబేరానుచరు లైనగుహ్యకులతో యుద్ధము సేయుట.

మ. ఘనశౌర్యోన్నతితోడ సర్వకకుబాకాశంబులందుం బ్రతి
ధ్వను లోలిన్ నిగుడంగ శంఖము మహోద్యల్లీలఁ బూరింపఁ ద
న్నినదంబున్ విని యక్షకాంతలు భయాస్వీతాత్మ లై రుగ్రసా
ధను లై యక్షభటుల్ పురిన్ వెడలి రుత్సాహంబు సంధిల్లఁగన్. 324

వ. ఇట్లు వెడలి యాధ్రువునిం దాఁకిన. 325

చ. కరము మహారథుండు భుజగర్వపరాక్రమశాలియున్ దను
ర్ధరుఁడును నైనయాధ్రువుఁడు దన్ను నెదిర్చినయక్షకోటిఁ జె
చ్చెరఁ బదుమూఁడువేల నొకచీరికిఁ గైకొన కొక్కపెట్ట భీ
కరముగ మూఁడుమూఁడుశితకాండములం దగ గ్రువ్వ నేసినన్. 326

ఉ. వారు లలాటముల్ వగిలి వారక సోలియుఁ దేఱి యమ్మహో
దారుపరాక్రమప్రకటధైర్యముఁ దత్కరలాఘవంబుఁ బ
ల్లారు నుతించుచుం గుపితమానసు లై పదతాడితప్రదు
ష్టోరగకోటివోలెఁ జటులోగ్రభయంకరరోషమూర్తు లై. 327

ఉ. ఆరథికోత్తముం దొడరి యందఱు నొక్కటఁ జుట్టు ముట్టి యా
రాఱుశిలీముఖంబులను నంగములం బగిలించి వెండి వి
స్ఫారగదా శర క్షురిక పట్టిస తోమర శూల ఖడ్గముల్
సారథియుక్తుఁ డైనరథసత్తముపైఁ గురియించి రేపునన్. 328

వ. అట్లు గురియించిన నతండు. 329

క. పెంపఱి యుండెను ధారా, సంపాతచ్ఛన్న మైనశైలముభంగిన్
గుంపులు గొని యాకసమునఁ, గంపించుచు నపుడు సిద్ధగణములు వరుసన్.

క. హాహాకారము లెసఁగఁగ, నోహో యీరీతి ధ్రువపయోరుహహితుఁ డు
త్సాహము సెడి యిటు దైత్యస, మూహార్ణవమందు నేఁడు మునిఁగెనె యకటా.

వ. అని చింతించునవసరంబున. 332

క. తా మాతని గెలిచితి మని, యామనుజాశనులు వలుక నట నీహార
స్తోమము సమయించుమహో, ద్దాముం డగుసూర్యుఁ బోలి తద్దయుఁ దోఁచెన్

వ. అట్లు దోఁచిన. 334

మ. అరిదుఃఖావహ మైనకార్ముకము శౌర్యస్ఫూర్తితోఁ దాల్చి భీ
కరబాణావళిఁ బింజఁ బింజ గఱవంగా నేసి ఝంఝానిలుం

దురుమేఘావళిఁ బాఱఁ దోలుగతి నఽత్యుగ్రాహితక్రూరబం
ధురశస్త్రావళి రూపు మాపె విలసఽద్దోర్గల సంధిల్లఁగన్. 335

చ. మఱియును నమ్మహాత్ముఁ డనఽమానబలుండు మహోగ్రబాణముల్
గఱి గఱిఁ దాఁక నేసి భుజఽగర్వ మెలర్ప విరోధివర్మముల్
పఱిపఱి సేసి యంగములు ఽ భంగము నొందఁగఁ జేసె వ్రేల్మిడిఁ
[1]గిఱికొని పర్వతంబుల నొఽగిం దెగఁ గొట్టమునింద్రుకైవడిన్. 336

వ. అయ్యవసరంబున. 337

చ. అలఘుచరిత్రుఁ డమ్మనుకుఽలాగ్రణిచే వికలాంగులైనవా
రలసకిరీటకుండలవిఽరాజితమస్తకకోటిచే సము
జ్జ్వలమణికంకణాంగదలఽసద్భుజవర్గముచేత సంగర
స్థల మతిరమ్య మై తనరె ఽ సంచితవీరమనోహరాకృతిన్. 338

వ. అంత హతశేషులు. 339

క. వరబలుఁ డగుమనుమనుమని, శరసంఛిన్నాంగు లగుచు ఽ సమరవిముఖులై
[2]హరిరాజముఁ గని పఱచిన, కరిబృందముఁబోలెఁ జనిరి ఽ కళవళపడుచున్. 340

క. అప్పుడు రాక్షసమాయలు, గప్పిన ధ్రువుఁ డసురవరులఽకార్యం బెఱుఁగం
జొప్పడక వారిఁ బొడగని, దెప్పర మగుటయును సారఽథిం గని యంతన్. 341

క. తలపోయఁగ భువి మాయా, వులకృత్యం బెఱుఁగ నెవ్వ ఽ రోపుదు రనుచుం
బలుకుచుఁ దత్పురిఁ జొరఁగాఁ, దలఁపఁగ నది గానరాక ఽ తద్దయు మానెన్.

వ. అట్లు పురంబున కరుగుట మాని చిత్రరథుం డైనయాధ్రువుండు సప్రయత్నుం డయ్యును [3]బరప్రతియోగశంకితుం డై యుండె నయ్యెడ మహాజలధిఘోషంబు ననుకరించుశబ్దంబు వినంబడె నంత సకలదిక్తటంబుల వాయుజనితం బయినరజః పటలంబు దోఁచెఁ దత్క్షణంబ యాకాశంబున విస్ఫురత్తటిత్ప్రభాకలితగర్జారవయుక్తంబు లగుమేఘంబు లమోఘంబులై భయంకరాకారంబులై తోఁచె నంత.

మ. అనయంబుం ధ్రువుమీఁద దైత్యకృతమాఽయాజాల మక్లేచి బో
రన మస్తిష్కపురీషమూత్రపలదుఽర్గంధాస్థిమేదశ్శరా
సన నిస్త్రింశ శరాసి తోమర గదా ఽ చక్ర త్రిశూ లాదిసా
ధనభూభృద్భుజగావళిం గురిసె నుఽద్దండక్రియాలోలతన్. 344

వ. మఱియు మత్తగజసింహవ్యాఘ్రసమూహంబులును నూర్మిభయంకరం బై సర్వతఃప్లవనం బయినసముద్రంబును గానంబడియె వెండియుం గల్పాంత(ంబునందుం బోలె) భీషణం బై నమహాహ్రదంబునుం దోఁచె నివ్విధంబున నానావిధంబులు ననేకంబులును నవిరళభయంకరంబులు నయినయసురమాయలుగ్రూరప్రవర్తను

1. 'గిఱిగొనఁ బర్వతంబులఁ బఱగిల్చుమహాశనికోటిరూపునన్' వ్రా. ప్ర. 2 'హరియక్షముఁ గని' వ్రా. ప్ర. 3 'బరోద్యోగశంకితు' వ్రా. ప్ర.

లగుయక్షులచేత సృజ్యమానంబులై యడరె నాసమయంబున. 345
క. అనయంబును నయ్యక్షుల, ఘనమాయ నెఱింగి మునినికాయము వరుసన్
మనుమనుమని మను మను మని, మనమునఁ దలఁచుచును దత్సమక్షంబునకున్.
వ. చనుదెంచి యాధ్రువునిం గని యిట్లనిరి. 347
సీ. అనఘాత్మ లోకు లెవ్వానిదివ్యనామంబు, సమత నాకర్ణించి సంస్మరించి
దుస్తరంబైనమృత్యువునైన సుఖవృత్తిఁ, దరియింతు రట్టియీశ్వరుఁడు పరుఁడు
భగవంతుఁడును శార్ఙ్గపాణియు భక్తజ, నార్తిహారుండును నైనవిభుఁడు
భవదీయవిమతులఁ బరిమార్పఁగా కని, పలికిన మునులసంభాషణములు
తే. విని కృతాచమనుఁడయి మావిభునిపాద
కమలముఁ దలంచి రిపుభయంకరమహోగ్ర
కలితనారాయణాస్త్రంబుఁ గార్ముకమునఁ
బూనఁ దడవఁ దదీయసంధానమునను. 348
తే. కడఁగి గుహ్యకమాయాంధకారమపుడు, వెరవు సెడి దవ్వుదవ్వుల విరిసి పోయె
విమలమైనవివేకోదయమునఁ జేసి, సమయు రాగాదికంబులసరణి నంత. 349
మ. వరనారాయణబాణరాజనితదుర్వారప్రభాహేమపుం
ఖరుచిస్ఫారమరాళరాజసితపక్షక్రూరధారారణ
చ్ఛరసాహస్రము లోలి భీషణవిపక్షశ్రేణిపై వ్రాలె భీ
కరరావంబునఁ గానఁ జొచ్చుశిఖిసంఘాతంబుచందంబునన్. 350
వ. అట్లేసిన. 351
చ. ఖరనిశితప్రదీప్తఘనకాండపరంపరవృష్టిచేఁ బొరిం
బొరి వికలాంగులై యడరి పుణ్యజనుల్ పృథుహేతిపాణులై
గరుడునిఁ జూచి భూరిభుజగప్రకరంబు లెదిర్చి పేర్చి చె
చ్చెర నడతెంచుచందమునఁ జిత్రరథుం బలు పూని తాఁకినన్. 352
ఉ. వారలఁ జండతీవ్రశరవర్గముచేత నికృత్తపాదజం
ఘోరుశిరోధరాంబకకరోదరకర్ణులఁ జేసి యోగిపం
కేరుహమిత్రమండల[1]సకృద్భిద నెట్టిపదంబుఁ జెందు నా
భూరిపదంబునం బెలుచఁ బొందఁగఁ బంపె భుజావిజృంభియై. 353
వ. ఇవ్విధంబున నాచిత్రరథు(ండగుధ్రువు)నిచేత నిహన్యమానులును నిరపరాధులు
ను నయినగుహ్యకులం జూచి యతనిపితామహుండైనస్వాయంభువుండు [2]ఋషి
గణపరివృతుండై చనుదెంచి ధ్రువునిం జూచి యిట్లనియె వత్సా నిరపరాధులైన
యీపుణ్యజనుల నెట్టిరోషంబున వధియించితి విట్టి[3]నిరయహేతువైనరోషంబు
సాలుఁ భ్రాతృవత్సల భ్రాతృవధాభితప్తుండవై కావించునీయత్నం బుడుగు మని.

1 'నికృత్తత నేమిపదంబు' వ్రా. ప్ర. 2 ఋచిసమేతుండై. 3 నిరహేతువైనరోష' వ్రా. ప్ర.

క. అనఘా మనుకులమున కిది, యనుచితకర్మంబ యొకనికై పెక్కండ్రి
ట్లని మొనఁ ద్రుంగిరి యిది నీ, కనయంబును వలవ దుడుగుమయ్య కుమారా.

వ. అదియునుం గాక దేహాభిమానంబునం బశుప్రాయులై భూతహింస గావించుట
హృషీకేశానువర్తు లయినసాధువులకుం దగదు నీవు సర్వభూతంబుల నాత్మభావం
బున(దలంచి)సర్వభూతావాసుండును దురారాధ్యుండును నైనవిష్ణునిపదంబులం
బూజించి తత్పరమపదంబునం బొందితి వట్టిభగవంతునిహృదయంబున(ననుధ్యా
తుండవు) భాగవతులచిత్తంబులకును (సమ్మతుండవు మఱియు) సాధువర్తనుండ
వన నొప్పునీ వీపాపకర్మం బెట్లు సేయ సమకట్టితి వేపురుషుం డైన నేమి మహా
త్ములయందుఁ దితిక్షయు సములయందు మైత్రియు హీనులయందుఁ గృపయు
నితరంబు లగుసమస్తజంతువులయందు సమత్వంబును గలిగి వర్తించువాని
యందు సర్వాత్మకుం డైనభగవంతుండు ప్రసన్నుం డగు నతండు ప్రసన్నుం
డయిన వాఁడు ప్రకృతిగుణంబులం బాసి లింగశరీరభంగంబు గావించి బ్రహ్మా
నందంబునం బొందు నదియునుం గాక కార్యకారణసంఘాతరూపం బయిన విశ్వం
బయస్కాంతసన్నిధానంబు గలిగినలోహంబుచందంబున నేసర్వేశ్వరుండు నిమి
త్తమాత్రంబుగాఁ బరిభ్రమించు నట్టియీశ్వరునిమాయాగుణవ్యతికరంబున నా
రబ్ధంబు లయినపంచభూతంబులచేత యోషిత్పురు)షవ్యవాయంబువలన యోషి
త్పురు)షాదిరూప(సంభూతి యగు నివ్విధంబునఁ ద)త్సర్గంబుఁ దత్సంస్థానంబుఁ
దల్లయంబు నగుచు నుండు నిట్లు దుర్విభావ్యం బైనకాలశక్తిం జేసి గుణక్షోభం
బున విభజ్యమానవీర్యుండు ననంతుండు ననాదియు నై జనంబులచేత జనంబులం
బుట్టించు చుండుటం జేసి జగదాదికరుండును మృత్యుహేతువు లగుజనంబుల ల
యంబు నొందించుటం జేసి యంతకరుం[1]డును ననాది యగుటం జేసి యవ్యయుం
డును నైనభగవంతుండు జగత్కారణుం డగుంగావున నీసృష్టిపాలనవిలయంబు
లం గర్త గానివాఁడునుంబలెఁ జేయుచుండు నిట్లు మృత్యురూపుండును బరుం
డును సమవర్తియు నైనయీశ్వరునికి స్వపక్షపరపక్షంబులు లే వతనికిఁ గర్మా
ధీనంబు లయినభూతసంఘంబును మహావాయువు ననుసరించురజంబులచా
డ్పున (నస్వతంత్రంబు లగుచు) ననువర్తించునతండును (జంతుచ)యాయురుప
చయాపచయకరణంబులం దస్పృష్టుండును (నగు జీవుండు) కర్మబద్ధుం డగు(టం
జేసి కర్మంబ) వానికి నాయురుపచయాపచయంబులం జేయుచుండు మఱియు
(సర్వజగత్కర్మసాక్షి యగు)సర్వేశ్వరుని. 356

క. కొందఱు కర్మం బందురు, కొందఱు స్వాభావ్య మండ్రు కొందఱు కాలం
బందురు కొందఱు దైవం, బందురు కొంద ఱొగిఁ గామ మండ్రు మహాత్మా.

వ. ఇట్టి లవ్యక్తరూపుండును నప్రమేయుండును నానాశక్త్యుదయహేతుభూతుం

1 డు నై యవ్యయుం డైనభగ.

డును నైనభగవంతుండు సేయుకార్యంబులు బ్రహ్మరుద్రాదు లెఱుంగ రఁట
యతనితత్త్వంబు నెవ్వ రెఱుంగ నోపుదు [1]రాభగవంతుండు సృష్టిస్థితిలయంబు
లు సేయు చుండియు ననహంకారుం డగుట గుణకర్మంబులం బొరయఁడు సర్వ
భూతాత్ముండును సర్వభూతనియంతయు సర్వభూతభావనుండు నైనభగవంతుం
డు తనమాయతోడఁ గూడి భూతసృష్టిస్థితిసంహారంబులు సేయుచుండుఁ గావునఁ
బుత్రా యిట్లుత్పత్తిస్థితిలయంబులకు దైవంబు కారణం బైయుండ నీధనదాను
చరులు భవదీయభ్రాతృహంత లగుదు రే యదియునుంగాక యీప్రజాపతులు విశ్వ
సృణ్ణామంబుల నియంత్రితు లై ముకుఁద్రాళ్లు వెట్టినపశువులుంబోలె నెవ్వనియా
జ్ఞాధీనకృత్యులై వర్తింతు రట్టిదుష్టజనమృత్యువును సుజనామృతస్వరూపుండును
సర్వాత్మకుండును జగత్పరాయణుండును నైనయీశ్వరుని సర్వప్రకారంబుల
శరణంబుఁ బొందు మదియునుం గాక. 358

సీ. అనఘాత్మ నీవు పంచాబ్దవయస్కుండ, వై సవతల్లి నిన్నాడినట్టి
మాటల నిర్భిన్నమర్ముండ వగుచును, జనయిత్రి దిగనాడి వనము కేఁగి
తపమునఁ జేసి యచ్ఛపుభక్తి నీశ్వరుఁ, బూజించి మహితవిభూతి మెఱసి
రమణఁ ద్రిలోకోత్తరం బైనపదమును, బొందితి వది గాన భూరిభేద
తే. రూప మైనప్రపంచంబు రూఢి నేను,హాత్మునందుఁ బ్రతీత మై యలరు నట్టి
యగుణుఁ డద్వితీయుండును నక్షరుండు, నైనయీశ్వరుఁ బరమాత్మ ననుదినంబు.
సీ. కైకొని శుద్ధంబు గతమత్సరంబును, నమలంబు నగుహృదయంబునందు
సొలవ కన్వేషించుచును బ్రత్యగాత్ముండు, భగవంతుఁడును బరబ్రహ్మమయుఁడు
నానందమాత్రుండు నవ్యయుఁ డుపపన్న, సకలవీర్యుండును సగుణుఁ డజుఁడు
నయిన సర్వేశ్వరునం దుత్తమం బైన, సద్భక్తిఁ జేయుచు సమత నొప్పి
తే. రూఢి సోహమ్మ మేతిప్రరూఢమగుచు, ఘనత కెక్కువవిద్య యను గ్రంధి నీవు
త్రెంచివైచితి కావున ధీవరేణ్య, సర్వశుభహాని యైనరోషంబు వలదు. 360
క. విను రోషహృదయుచేతను, ననయము లోకము నశించు నౌషధములచే
ఘనరోగములు నశించిన, యనువున నది గాన రోష మడఁపు మహాత్మా. 361
తే. అనఘ నీదుసహోదరహంత లనుచుఁ, బెనఁచి యీపుణ్యాజనులఁ జంపితి కడంగి
పరఁగ నిదియె సదాశివభ్రాత యైన, యర్థవిభునకు నపరాధ మయ్యెఁ గాన.
క. నతినుతులచేత నీ విపు, డతనిఁ బ్రసన్నునిఁగ జేయు మని మనువు దయా
మతిఁ జెప్పి ధ్రువునిచే సత్కృతుఁ డై నయ మొప్పఁ జనియె ఋషియుక్తుండై.
వ. అంత. 364

2 'భూతాత్మకుండు భూతేశుండు భూతభావనుండు సర్వేశ్వరుండుఁ బరాపరుండు నగునీశుండ మాయాయుక్తుం డై స్వశక్తిచే సృష్టిస్థితిలయంబులం జేయు నయిన నహంకారంబునం జేసి గుణకర్మంబులచే నస్పృశ్యుం డగుచు వర్తించు నదియునుం గాక' అ. ప్ర.

తే. యక్షచారణసిద్ధవిద్యాధరాది,జనగణస్తూయమానుఁ డై ధనదుఁ డంతఁ
బుణ్యజనవైశసనివృత్తు భూరిరోష,రహితుఁ డైనట్టిధ్రువునిఁ జేరంగ వచ్చె.

సీ. చనుదెంచి వెసఁగృతాంజలియైనధ్రువుఁజూచి,తివుటనిట్లని యక్షత్రియకుమార
తగ భవదీయపితామహాదేశంబు,నను దుస్త్యజం బైనఘనవిరోధ
ముడిగితి వటు గాన యొనరంగ నిపుడు నీ,యందుఁ బ్రసన్నుండ నైతి భూత
జననలయంబుల కనయంబుఁ గాలంబె, కర్త యై వర్తించుఁ గాన యుష్మ

తే. దనుజుఁ జంపినవార లీయక్షవరులు, గారు తలపోయ నీయక్షగణము నిట్లు
నెఱి వధించినవాఁడవు నీవు గావు, వినుతగుణశీల మాటలు వేయు నేల. 366

వ. అదియునుం గాక మేఁబుద్ధింజేసి కర్మసంబంధదుఃఖా(దిక)ంబులు దేహాత్మానుసంధానంబునం జేసి సంభవించు నట్టియహంత్వ మ్మనునపార్థజ్ఞానంబు స్వప్నమందుం బోలెఁ బురుషునకుం దోఁచు నది గావున సర్వభూతాత్మవిగ్రహుండును నధోక్షజుండును భవచ్ఛేదకుండును భజనీయపాదారవిందుండును ననంతామేయశక్తియుక్తుండును గుణమయాత్మమాయావిరహితుండును నైనయీశ్వరుని సేవింపుము నీకు భద్రం బయ్యెడు భవదీయమనోగతం బైనవరంబుఁ గోరుము నీ వంబుజనాభపాదారవిందసేవనంబుఁ దిరంబుగఁ జేయుదు వని యెఱుంగుదు ననిన రాజరాజుచేత నట్లు మహామతియు భాగవతోత్తముండు నైనధ్రువుండు ప్రేరేపింపంబడి యేహరిస్మరణంబుచేత నప్రయత్నంబున దురత్యయం బైనయజ్ఞానంబుఁ దరియింతు రట్టిహరిస్మరణం (బచలితం బగున ట్లొసంగు మని యడిగిన నట్ల కాక యని) యంగీకరించి యంతం గుబేరుండు సంప్రీతచిత్తుం డయి ధ్రువునికి శ్రీహరిస్మరణం బట్లుపదేశించి యంతర్ధానంబు నొందె నంత ధ్రువుండు (యక్షకిన్నరకింపురుషగణసంస్తూయమానవైభవుం డగుచు) నాత్మీయపురంబునకు మరలి చనుదెంచె నంత. 367

సీ. గణుతింప భూరిదక్షిణలచేఁ గడు నొప్పు, యజ్ఞముల్ సేయ నయ్యజ్ఞవిభుఁడు
ద్రవ్యక్రియాదేవతాఫలరూపస,త్కర్మఫలప్రదాతయును నైన
పురుషోత్తముని నర్థిఁ బూజించి మఱియు స,ర్వోపాధివర్జితుఁ డుత్తముండు
సర్వాత్మకుఁడు నగుజలజాక్షునందుఁ దీ,వ్రం బై ప్రవాహరూపంబు నైన

తే. భక్తిసలుపుచు నఖిలప్రపంచమందు, నలరఁ దనయందు నున్నమహాత్ము హరిని
జిదచిదానందమయునిలక్ష్మీవరుఁ బరము, నీశ్వరేశ్వరుఁ బొడగనె నిద్ధచరిత.

వ. ఇట్లు సుశీలసంపన్నుండును బ్రహ్మణ్యుండును ధర్మసేతురక్షకుండును దీనవత్సలుండు నయి యవని పాలించుధ్రువుండు దన్నుఁ బ్రజలు దండ్రి యని తలంప నిరువదియాఱువే లేండ్లు భోగంబులచేతం బుణ్యక్షయంబును నభోగంబు లైనయాగాదులచేత నశుభక్షయంబునుం జేయుచు బహుకాలంబు దనుకఁ ద్రివర్గసాధనంబుగా రాజ్యంబు సేసి కొడుకునకుఁ బట్టంబు గట్టి యచలితేంద్రియుం డై య

విద్యారచితస్వప్నగంధర్వనగరోపమం బయినదేహాదికం బగువిశ్వంబు భగవన్మా
యారచితం బని యాత్మం దలంచుచు వెండియు. 369

చ. మనునిభుఁ డంత భృత్యజన మంత్రిపురోహితబంధుమిత్రనం
దనపశువిత్తరత్నవని తాగృహరమ్యవిహారశైలవా
రినిధిపరీతభూతలహరిద్విపముఖ్యపదార్థజాలముల్
ఘనమతిచే ననిత్యములు గాఁ దలపోసి విరక్తచిత్తుఁడై. 370

సీ. పురము వెల్వడి చని పుణ్యభూబదరికా, ఘనవిశాలానదీ కలితమంగ
ళాంబుపూరంబుల ననురక్తిమైఁ గ్రుంకి, కమనీయపరిశుద్ధ కరణుఁ డగుచుఁ
బద్మాసనస్థుఁడై పవనుని బంధించి, నెలకొని ముకుళిత నేత్రుఁ డగుచు
హరిరూపమై భవ ధ్యానంబు సేయుచు, భగవంతు నచ్యుతుఁ బద్మనేత్రు

తే. నందు సతతంబు నిశ్చల మైనయట్టి
భక్తిఁ బ్రవహింపఁ జేయుచుఁ బరమమోద
బాష్పధారాభిషిక్తుండు భవ్యయశుఁడుఁ
బులకితాంగుండు నగుచు నిర్ముఁ దనర్చి. 371

వ. మఱియు విగతక్లేశుండును ముక్తలింగుండునునై ధ్రువుండు తన్నుఁ దా మఱచి
యుండుసమయంబున దశదిక్కుల నుద్యద్రాకానిశానాయకుండునుంబోలె వెలిం
గించుచు నాకాశంబుననుండి యొక్కవిమానంబు సనుదేర నందు దేవశ్రేష్ఠులు
ను జతుర్భుజులును రక్తాంబుజేక్షణులును శ్యామవర్ణులును గదాధరులును సువా
సులును గిరీటహారాంగదకుండలధరులును గౌమారవయస్కులును నుత్తమశ్లోక
కింకరులు నగువారల నిద్దఱం గని సంభ్రమంబున లేచి మధుసూదననామం
బులు సంస్మరించుచు వారల భగవత్కింకరులం గాఁ దలంచి దండప్రణామంబు
లాచరించినం గృష్ణపాదారవిందవిన్యస్తచిత్తుండుఁ గృతాంజలియు వినమితకంధ
రుండు నైనధ్రువునిం గనుంగొని పుష్కరనాభభక్తులైన సునందనందులు ప్రీ
తియుక్తులై మందస్మితు లగుచు ని ట్లనిరి. 372

ఉ. ఓనృప నీకు భద్రమగు నొప్పగు చున్నమదీయవాక్యముల్
వీనులయందుఁ జొన్పుము వివేకముతో నయిదేండ్లనాఁడు మే
ధానిధివై యొనర్చినయు దాత్తతపోవ్రతనిష్ఠచేతఁ దే
జోనయశాలి యైనమధుసూదనుఁ దృప్తి వహింపఁ జేయవే. 373

ఆ. అట్టిశార్ఙ్గపాణి యఖిలజగద్భర్త, దేవదేవుఁ డతుల దివ్యమూర్తి
[1]మమ్ముఁ బనుప మేము మాధవపదమున, కర్థి నిన్నుఁ గొనుచు నరుగుటకును.

వ. వచ్చితిమి యేపదంబునేని సూరిజనంబులు (సర్వోత్తమంబని) పొందుదురు దేనిఁ
జంద్రదివాకరగ్రహనక్షత్రతారాగణంబులు ప్రదక్షిణంబుగాఁ దిరుగు చుండు

---

1 పార్షదులము మేము భగవత్పదంబున.

(మఱియు నీదుపితరులచేతను నన్యులచేతను ననధిష్ఠితంబును జగద్వంద్యంబును భక్తజనాతి[1]దుర్జయంబును నయినవిష్ణుపదంబుం బొందుదువు రమ్మిదె విమాన శ్రేష్ఠం బుత్తమశ్లోకజనమౌళిమణి యైనశ్రీహరి పుత్తెంచె దీని నెక్కు నర్హుండ వనిన నునుక్రమప్రియుం డయినధ్రువుండు తన్మధురవాక్యంబులు విని కృతాభిషిక్తుం డయి యచ్చటిమునులకుఁ బ్రణమిల్లి తదాశీర్వాదంబులు గైకొని విమానంబునకుం బ్రదక్షిణార్చనంబులు గావించి హరిపార్షదు లైనసునందనందులకు వందనం బాచరించి భగవద్రూపవిన్యస్తచక్షురంతఃకరణాదికుం డగుచు విమానాధిరోహణంబు గావించుటకు హిరణ్మయరూపంబు ధరియించె నప్పుడు. 375

క. సురదుందుభిపణవానక, మురజాదులు మొరసె విరులకుసురు గురిసెఁ గి
న్నరగంధర్వులపాటలు, భరితము లై చెలఁగె నపుడు భవ్యచరిత్రా. 376

వ. అట్టిసమయంబున ధ్రువుండు దుర్గమం బగుత్రివిష్టపంబునకు నేఁగువాఁ డగుచు దీన యగుజనని దిగనాడి యెట్లు వోవుదు నని చింతించువానిం బార్షదు లవలోకించి యగ్రభాగంబున విమానారూఢ యై యేఁగుచున్నజననిం జూపిన సంతుష్టాంతరంగుం డగుచు. 377

క. జనని సునీతిని మున్నిడి, కొని యతులవిమాన మెక్కి కొనకొని విబుధుల్
దనమీఁదఁ బుష్పవర్షము, లనయముఁ గురియింప ధ్రువుఁడుహర్షముతోడన్.

క. చని చని వెసగ్రహమండల, మును దైవలోక్యంబు సప్తముసిమండలముం
ఘనుఁ డుత్తరించి యవ్వలఁ, దనరెడుహరిపదము నొందెఁ దద్దయుఁ బ్రీతిన్.

వ. అది మఱియు నిజకాంతిచేతం ద్రిలోకంబులం బ్రకాశింపం జేయుచు నిర్దయాగమ్యంబును శాంతులు సమదర్శనులు శుద్ధులు సర్వభూతానురంజనులు నచ్యుతభక్తబాంధవులు నయినభద్రాచారులకు సుగమ్యంబును నయి గంభీరవేగంబు ననిమిషంబు నగుజ్యోతిశ్చక్రమంబు సమాహితం బై గోగణంబు మేధియందుం బోలె నెందుఁ బరిభ్రమించు చుండు నట్టియచ్యుతపదంబునం బొంది విష్ణుపరాయణుం డై నధ్రువుండు త్రిలోకచూడామణి యై యొప్పు చుండె నప్పుడు భగవంతుం డై ననారదుండు ధ్రువునిమహిమం గనుంగొని ప్రచేతస్సత్త్రంబునందు వీణ వాయించుచు. 380

సీ. పతియె దైవంబుగా భావంబులోపలఁ, దలఁచుసునీతి నందనుతపఃప్రభా[2]వముక్రియ ధర్మభవ్యనిష్ఠలఁ బొందఁ, జాలరు బ్రహ్మర్షిజనము లనిన
క్షత్త్రియకులు నెన్నఁగా నేల యెవ్వఁడు, పంచసంవత్సరప్రాయమునను
సురుచిమునుకఠిపాగ్రశరభిన్నహృదయుఁ డై, మద్వాక్యహితబోధమహిఁ దనర్చి

తే. వనమునకు నేఁగి హరిభక్తివశత నొంది, యజితుఁడగుహరితనవశుఁ డై చరింప
జేసి వెసఁ దత్పదంబును జెందె నట్టి, హరిపదంబును బొంద నెవ్వరికిఁ దరము.

---

1 నట్టిదుర్జయంబును. 2. భగవద్ధర్మ.

క. అని పాడె ననుచు విదురున, కనఘుఁడు మైత్రేయుఁ డనియె ననంచితభక్తిన్
వినుతోద్దామయశస్కం, డనఁ గల యా ధ్రువునిచరిత మార్యస్తుత్యా. 382

సీ. మహితసత్పురుషసమ్మతమును ధన్యంబు, స్వర్గప్రదంబు యశస్కరంబు
నాయుష్కరంబుఁ బుణ్యప్రదాయకమును, మంగళకర మఘమర్షణంబు
సౌమనస్యముఁ బ్రశంసాయోగ్యమును బాపహరమును ధ్రువపదప్రాపకంబు
నై యొప్పునీయుపాఖ్యానంబుఁ దగ నీకు, నెఱిఁగించితిని దీని నెవ్వఁ డేని

తే. దివుట శ్రద్ధాగరిష్ఠుఁడై తీర్థపాద
చరణసరసీరుహద్వయాశ్రయుఁడు నైన
భవ్యచరితుఁ[1] దినాంతప్రభాతవేళ
నలఘుమతిఁ బూర్ణిమావాస్యలందు మఱియు. 383

తే. ద్వాదశిని బద్ధబాంధవవాసరమున, శ్రవణనక్షత్రమున దినక్షయమునందుఁ
బరఁగ సంక్రమణవ్యతీపాతలందు, సఫల భక్తిని వినునట్టిసజ్జనులకు. 384

వ. క్లేశనాశంబును మహాప్రకాశంబును నైనభగవద్భక్తియు శీలాదిగుణంబులును గలుగు మఱియుఁ దేజఃకామునకుఁ దేజంబును మనఃకామునకు మనంబును నిష్కామునకుఁ దత్త్వవిజ్ఞానంబును గలుగు దీని వినిపించువారికి దేవతానుగ్రహంబు గలుగు నిట్టియుపాఖ్యానంబు నీ కెఱింగించితి నని మైత్రేయుండు విదురునకుఁ జెప్పినక్రమంబున శుకయోగి పరీక్షిత్తున కెఱింగించిన తెఱంగు సూతుండు శౌనకాదులకు వినిపించి వెండియు నిట్లనియె నట్లు సెప్పినమైత్రేయునిం గని విదురుం డిట్లనియె. 385

సీ. అనఘాత్మ నారదమునిపతి ధ్రువచరిత్రము ప్రచేతసులసత్త్రంబునందు
నర్థిమైఁ గీర్తించె నంటి ప్రచేతసు, లన నెవ్వరెవ్వరితనయు లెట్టి
వంశజు లే సత్త్ర మెవ్వలనను జేసి ర, ధ్వరమందు నిజకులధర్మశీలు
రగు ప్రచేతసులచే యజియింపఁబడునట్టి, యజ్ఞపూరుషుఁ డగు నచ్యుతాంఘ్రి

తే. భక్తియుక్తుండు విదితసద్భాగవతుఁడు, దివిరి హరిపాదసేవావిధిప్రయుక్త
దేవదర్శనుఁ డగునట్టిదివ్యయోగి, నారదుం డెట్లు గొనియాడె శౌరికథలు.

క. నా కిపు డెఱిఁగింపుము సు,శ్లోకునిచరితామృతంబు శ్రోత్రాంజలులం
బైకొని జుఱ్ఱియుఁ దనివిం, గైకొన కున్నది మనంబు గుణోపేతా. 387

క. అని యడిగిన విదురునిఁ గనుఁ,గొని మైత్రేయుండు పలికె గొనకొని ధ్రువుఁడున్
వనమునకుఁ జనిన నాతని,తనయుం డగునుత్కలుండు దనఘుం డై. 388

సీ. చతురుఁ డాజన్మప్రశాంతుండు నిస్సంగుఁ,డును సమదర్శనుండును ఘనుండు
నై యాత్మయందు లోకావలి లోకంబు,లందు నాత్మను జూచు ననఘమైన
యనుపమయోగక్రియాపావకానల, కర్మమలాశయకలనఁ బేర్చి

1. 'ఁడు సాయంప్రాతలందు' వ్రా. ప్ర.

జడునికైవడిఁ జీకుచందంబునను మూఢుపగిది ను న్మత్తునిభంగిఁ జెవిటి

**తే.** వడువునను గానఁబడుచు సర్వజ్ఞుఁడై ప్ర, శాంతకీలహుతాశనుసరణిఁ బొల్చి
సతతశాంతంబు సంచితజ్ఞానమయము, నైన బ్రహ్మస్వరూపంబు నాత్మఁదలఁచి.

**క.** తనకంటె నితర మొకటెఱుఁ,గనికతమున సార్వభౌమశ్రీఁ బొందక
మనమునఁ గోరక యుండుటఁ, గని కులవృద్ధులును మంత్రిగణములు నంతన్.

**వ.** అతని నున్మత్తునింగాఁ దెలిసి తదనుజుండైన వత్సరునికిఁ బట్టంబు గట్టి రావత్స రునికి సర్వర్ధి యనుభార్యయందుఁ బుష్పార్ణుండును జంద్రకేతుండును నిషుండును నూర్జుండును వసువును జయుండును నన నార్వురుతనయులు గలిగి రందుఁ బుష్పార్ణుం డనువానికిఁ బ్రభయు దోషయు ననునిద్దఱు భార్యలై రందుఁ బ్రభ యనుదానికిం బ్రాతర్మధ్యందినసాయంబు లనుసుతత్రయంబును దోష యను దానికిం బ్రదోషనిశీథవ్యుష్టు లనువారు ముగ్గురును బుట్టి రందు వ్యుష్టుఁ డనువానికిఁ బుష్కరిణి యనుపత్నియందు సర్వతేజుం డనుసుతుండు పుట్టె వానికి నాకూతి యనుమహిషివలనఁ జక్షుస్సంజ్ఞుం డయినమనువు జనియించె వానికి నడ్వల యనుభార్యయందుఁ బురువును గుత్సుండును ద్రితుండును ద్యుమ్నుండును సత్యవంతుండును ఋతుండును వ్రతుండును నగ్నిష్టోముండును నతిరాత్రుండును సుద్యుమ్నుండును శిబియును నుల్ముకుండును ననుపన్నిద్దఱు తనయులు గలిగి రందు నుల్ముకునికిఁ బుష్కరిణి యనుదానివలన నంగుండును సుమనసుండును ఖ్యాతియుఁ గ్రతువును నంగిరసుండును గయుండును సత్యవంతుండును ననునార్వురు గొడుకులు పుట్టి రందు నంగునికి సునీథ యనుధర్మపత్నివలన వేనుం డనుపుత్రుం డుదయించిన. 391

**మ.** క్షితినాథోత్తముఁ డాత్మనందనునిదుశ్శీలంబు వీక్షించి దుః
ఖితుఁడై యొంటిగఁ దత్పురిన్ వెడలి యేఁగెన్ వేగ మెందేనిఁ ద
ద్గతి వీక్షించి మునీశ్వరుల్ గుపితులై దంభోళిసంకాశవా
క్యతతిన్ జావ శపింప వాఁ డపుడు పేర్కం గూలె నమ్మేదినిన్. 392

**సీ.** కైకొని యపుడు లోకం బరాజకమైనఁ, బ్రజలు దస్కరపీడఁ బల్లటిల్ల
గనుఁగొని దుఃఖించి మునులు గతాసుఁడై, పడినవేనునివలపలిభుజంబు
నర్థి మథంప నారాయణాంశంబున, నాదిరాజన నొప్పు నట్టిపృథుఁడు
జనియించె ననవుడుఁ విని విదురుఁడు మునిఁ, గనుఁగొని పలికె నోయనఘచరిత

**తే.** సాధువు సుశీలనిధియును సజ్జనుండు, నలఘుబ్రహ్మణ్యుఁడును నైనయట్టియంగ
ధరణివిభునకు దుష్టసంతాన మొప్పు, గలిగె నయ్యంగపతి దేనికారణమున.

**వ.** విమనస్కుం డగుచుఁ బురంబు విడిచె ధర్మకోవిదులైన మునులు దండవ్రతధరుండును రాజు నగు వేనునియందు నేపాపంబు నిరూపించి బ్రహ్మదండం బొనర్చిరది యునుంగాక లోకంబున రాజులు లోకపాలతేజోధరులుఁ (బ్రజాపాలనాసక్తులుఁ)

నైనపృథునకు నీశ్వరబుద్ధిం జేసి యేము నమస్కరింతు మనుసమయంబున. 597

పృథుచక్రవర్తియొద్దకు సనకాదు లరుగుదెంచుట.

క. వినువీదినుండి మెల్లన, చనుదెంచిరి బాలసూర్యసంకాశతనుల్
జనవినుతసిద్ధవర్యులు, సనకాదులు శేముషీవిచక్షణు లంతన్. 598

వ. ఇట్లు సనుదెంచి. 599

క. అనఘాత్ము లతిథిరూపం,బున రా గృహమేధి ప్రాణములు నుద్గతిచేఁ
దనరినఁ బ్రత్యుద్గతివం,దనముల [1]మరలం బ్రతిష్ఠితము లగు ననుచున్. 600

క. వినఁబడువచనన్యాయం,బున నుద్గతము లగుప్రాణములఁ గ్రమ్మఱఁ బొం
దను గోరువాఁడునుంబలె, ననుచరబుత్వ్రిక్సదస్యుఁ డై పృథుఁ డంతన్. 601

తే. ఇంద్రియేశుఁడు గంధాదికేష్టగుణముఁ, గూర్చి యుద్గమనక్రియఁ గోరి చేయు
పగిదిఁ బృథుచక్రవర్తి సంభ్రమముతోడ,మహితభక్తిని బ్రత్యుద్గమంబుసేసె.

క. ఘనగౌరవమున నమ్ముని,జనచిత్తవశీకృతుండు సభ్యుఁడుఁ బ్రియుఁడున్
వినయానతకంధరుఁ డై, జనవరుఁ డాపరమయోగిచంద్రుల నెలమిన్. 603

సీ. పూని యర్హాసనాసీనులఁ గావించి, కర మర్థి విధివత్ప్రకారమునను
బూజించి తత్పదాంభోరుహక్షాళన,సలిలంబు లాత్మమస్తమునఁ దాల్చి
హాటకకలితసింహాసనాసీను లై, విహితాగ్నులను బోలి వెలుఁగు చున్న
శర్వాగ్రజన్ముల సనకాదులను జూచి, యతులశ్రద్ధాసంయమాన్వితుండుఁ

తే. బరమసంప్రీతమతియు నై పలికె రాజు, గోరి యోమంగళాయనులార పూర్వ
భవమునం దెద్ది మంగళప్రదసుకర్మ, మేను జేసితి మిముఁ జూడ నిపుడు గలిగె.

వ. అని వెండియు. 605

క. భువి నెవ్వనియెడ విప్రులు, భవుఁడును విష్ణుఁడుఁ దదీయభక్తులును బ్రస
న్నవదను లగుదురు వానికి, భువి దివిని నసాధ్యకర్మములు లే వరయన్. 606

వ. అని మఱియు ననఘాత్ములారా లోకంబుల నీక్షించుచుం బర్యటనంబు సేయు
మిమ్ము సర్వదర్శనుం డయినయాత్మం గనుంగొనఁ జాలనిసర్వదృశ్యంబుచందం
బున నీలోకంబు గనుంగొనఁ జాలకుండు నట్టిమహాత్ముల రయినమీదర్శనంబునం
జేసి నేను ధన్యుండ నైతి నదియునుం గాక. 607

చ. అరయ ధరిత్రి నెవ్వనిగృహంబు మహార్హజనోపయోగ్యవి
స్ఫురితతృణాంబుభృత్యగృహభూముల సాదెఁ దనర్చు నట్టిమం
దిరపతి పేద యైన జగతిం గడు ధన్యుఁ డటంద్రు గాన సు
స్థిరమతి మీరు వచ్చుట నశేషశుభంబుల నేను బొందెదన్. 608

వ. అదియునుం గాక. 609

చ. వరమతులార యెవ్వనినివాసముఁ [2]దీర్థపదాంతరంగు లై

---

1 ను బునః ప్రతిష్ఠి. 2 దీర్ఘపదాంబుజాతు లై.

పరఁగినయట్టిభాగవతపాదజలంబులు సోఁక వేనిఁ ద
త్పురుషుఁడు భూరిసంపదలఁ బొంపిరిపోయిన నైన వానిమం
దిర మురగప్రకీర్ణజగతీజముఁ బోలు నటంద్రు కోవిదుల్. 610

వ. అని పలికి వెండియు నిట్లనియె. 611

సీ. పరమపావనులార బాల్యంబునందుండి, మానితశ్రద్ధానమన్వితులును
గుణనిధుల్ ధైర్యయుక్తులు ముముక్షువులు నై, యధికవ్రతంబుల నాచరించు
రట్టిపుణ్యుల భవదాగమనంబు స్వాగత మయ్యె సత్కృపాకలితులార
యనివారితవ్యసనార్ణవం బయినట్టి, భూరిదుర్లంఘ్యసంసారమందు

తే. [1]మతివిహీనస్వకీయకర్మములఁ జేసి, యడరి మగ్నుల మై యింద్రియార్థములనె
తివిరి పురుషార్థములుగాఁగఁ దెలియుమాకుఁ, గుశలమున్న దె లోకైకకుశలులార.

వ. మీర లాత్మారాము లగుటం జేసి మీయందుఁ గుశలాకుశలరూపంబు లయిన
మతివృత్తులు సంభవింపవు గావునం గుశలప్రశ్నం బుపపన్నంబు గాదు నేను
గృతవిశ్వాసుండ నై సంతప్తు లయినవారలకు సుహృత్తు లైనమిమ్ము నాకు నీసం
సారంబునందు నేమిట వేగంబె క్షేమంబు గలుగు నని యడిగెద నాత్మవంతులకు
నాత్మయు నాత్మభావనుండు నయినయీశ్వరుండు భక్తానుగ్రహంబుకొఱకు నీ
లోకంబుల మీవంటిసిద్ధరూపంబున వర్తించుచుండు నని పలికినయతనిగంభీ
రార్థగౌరవంబులును శుభకరంబులును న్యాయసహితంబులును మితాక్షరంబు
లును శ్రోత్రప్రియంబులును నయినవచనంబులు విని సంప్రీతచేతస్కుండును
మందస్మితుండును నై సనత్కుమారుం డిట్లనియె. 613

మ. ధరణీశోత్తమ సర్వభూతహితచేతస్కుండ వై ధర్మసు
స్థిరభాగ్యోదయశాలి వై యెసఁగునీచే సాధులోకోత్తరో
త్తరసంప్రశ్నము సేయఁగాఁబడె మహాత్మా సాధులోకైకస
చ్చరితంబుం దలపోయ నిట్టిద కదా చర్చింప లోకత్రయిన్. 614

తే. ధరణి సజ్జనసంగంబు దలఁప నుభయ, సమ్మతం బగువారలు సలుపునట్టి
సరససంభాషణప్రశ్నసరణి నిఖిల, జనములకు సుఖకర మగు జనవరేణ్య. 615

వ. అని యభినందించి మోక్షసాధనోపదేశకాముం డైనపృథుచక్రవర్తికి వెండియు
నిట్లనియె. 616

సీ. ధరణీశ మధునిషూదనుఁ డైనయట్టినా, రాయణులలితపాదారవింద
వరగుణధ్యానధీపరిణతత్వంబున, సకలాత్మమలవిమోచనము లైన
రతియును నిత్యవైరాగ్యంబు మొదలు గా, లోకోత్తరుఁడ వైననీకుఁ గలవు
సమ్యగ్విచారశాస్త్రములందు జనులకు, సేమంబునకును నిశ్చితము లయిన

తే. యాత్మవ్యతిరిక్తవస్తువులందు వీత, రాగతఁ దలంప నిర్గుణబ్రహ్మ మయిన

---

1 మరగి యెపుడు స్వకీయ.

యాత్మయందులరతియును న్ననఁగ నివియ, హేతువులు బుద్ధిఁ జింతింపన్నిద్ధచరిత.

వ. కావున శ్రద్ధయు భగవద్ధర్మచర్యయుఁ దద్విశేషజిజ్ఞాసయు నాధ్యాత్మికయోగ
నిష్ఠయు యోగీశ్వరోపాస్తియుఁ బుణ్యోపాశ్రయుండును బుణ్యశ్రవణుండును
నైననారాయణకథాలాపంబులు నర్థేంద్రియారాము లైనవారలతోడిసంగతుల
యందు విరక్తియు వారల కభిమతంబు లైనయర్థకామంబులందు ననాకాంక్షయు
సర్వేశ్వరునిగుణకీర్తనామృతపానంబు దక్క నితరపదార్థంబులందు వైరాగ్యంబు
నొంది యాత్మారామత గలిగి విజనస్థలంబులందులనుచి గలుగుటయును నహిం
సయు శమాదిప్రధానవృత్తియు నాత్మహితానుసంధానంబును భగవత్కథాను
స్మరణంబును నకామ్యంబు లయినయమనియమంబులును నితరభక్తిమార్గాగర్హ
ణంబును యోగక్షేమార్థక్రియారాహిత్యంబును శీతోష్ణాదిద్వంద్వసహిష్ణుతయు
భాగవతకర్ణాలంకారభూతం బగుభగవద్గుణాభిధానంబును వీనిచేత విజృంభమా
ణం బయినభక్తియోగంబునం జేసి యనాత్మయందు నసంగంబును గార్యకారణ
రూపం బగునిర్గుణబ్రహ్మంబునందు రతియును నెప్పుడు గలుగు నప్పుడ సదాచా
ర్యానుగ్రహవంతుం డయినపురుషుండు బ్రహ్మనిష్ఠులతోడఁ జెలిమి సేయుచు నీష
ణత్రయంబు వర్జించి ప్రకృతిం జేరక జ్ఞానవైరాగ్యవేగంబునం జేసి. 618

సీ. అనఘ సాక్షాత్కార న్ మగుభక్తియోగాగ్నిఁ, గడఁగి జీవాధారన్కమును బంధ
భూతాత్మకంబు నై న్ పొలుచుహృద్గ్రంథిని, బూని స్వకారణన్భూత మయిన
యరణి దహించుహుతాశనుకైవడి, నిర్దహించిన నిల్లు న్ నెఱసి దగ్ధ
చిత్తుఁ డై ముక్తనిశ్శేషాత్మగుణుఁడు [1]స, ద్ధర్ముఁడు నైనయతండు మిగుల

తే. నర్థబాహ్యంబులయినఘటాదికములు, నాంతరములైనసౌఖ్యదుఃఖాదికములు
ననువిభేదము లాత్మ[2]భేదనము లగుట, నయ్యుపాధివినాశంబు న్ నందఁగలఁడు.

వ. అది యెట్లనిన. 620

చ. పురుషుఁడు నిద్రవోఁ గలలఁ న్ బొందినయాత్మసుఖైకహేతు వై
పరఁగిన రాజభృత్యజనభావగుణంబులు సంప్రబోధమం
దరయఁగ మిథ్య యైనగతి న్ నాంతరబాహ్యగుణప్రభేదముల్
పసువడిఁ గాన కుండు జనపాలనశీలన నిత్యఖేలనా. 621

వ. మఱియును ద్రష్ట యైనయాత్మయు దృశ్యం బయినయింద్రియార్థంబు ననువీనికి
నహంకారంబు సంబంధహేతు వగుటం జేసి యది యంతఃకరణంబునం గలుగు
చుండు జాగ్రత్స్వప్నంబులయం దీభేదంబు గనుంగొను చుండు నిట్టియంతః
కరణంబు లేనిది యగుసుషుప్తికాలంబునం బురుషుండు జలదర్పణాదినిమిత్తా
భావం బగునప్పుడు బింబప్రతిబింబభేదంబు గనుంగొననిచందంబున దృశ్య
భేదంబు గనుంగొన కుండుం గావున నంతఃకరణవిలయంబు నొందిన బాహ్యం

---

1 సహృదయుఁడు. 2 సాధనము లగుట.

తరభేదంబు గన కుండుట నిశ్చయం బని వెండియు ని ట్లనియె. 622

సీ. భువి విషయాకృష్టభూతంబు లయినయింద్రియములచేతను దివిరి మనము
దగ విషయాసక్తిఁ దగిలి యాంతర మైన, మహితవిచారసామర్థ్య మెల్ల
[1]శరకుశాది స్తంబజాలంబుహ్రదతోయ,ములు గ్రోలుగతిఁ గ్రమంబున హరించు
నీరీతి నంతర్విచారసామర్థ్యంబు, నపహృతం బయినఁ బూర్వాపరాను
తే. మేయసంధానురూపసంస్కృతి నశించు, నది నశించిన విజ్ఞాన మంతఁ దొలఁగు
నట్టివిజ్ఞాననాశంబు నార్యజనులు, స్వాత్మ కది సకలాపహ్నవం బటండ్రు. 623

వ. అదియునుం గాక యాత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి యను వేద వచనంబునం జేసి విషయంబులకుం బ్రియతమత్వం బైనయాత్మోపాధికంబు నొంది యాత్మాపహ్నవంబునం బాటిల్లుస్వార్థనాశం బెద్ది గలుగు దానికంటె లోకంబున నధికం బైనస్వార్థనాశంబు లే దది యె ట్లనిన సర్వార్థనాశంబునకు స్థైర్యంబు నొందించునట్టియర్థకామాభిధ్యానంబునం దద్ధేతుకం బైనస్వార్థనాశంబునం బరోక్షాపరోక్షరూపజ్ఞానంబునం జేసి నశించుం గావున నాత్మాపహ్నవంబున కంటె నధికతరం బైనసర్వార్థనాశంబు లే దని వెండియు ని ట్లనియె. 624

సీ. అనఘ యీసంసార మతిశయంబునఁ దరి,యింపంగ మది నిశ్చయించువాఁడు
గైకొని ధర్మార్థకామమోక్షములకు, నతివిఘాతుక మెద్ది యట్టిదాని
వలన సంగము సేయ వలవ దాధర్మాను, లందుఁ ద్రివర్గంబు నంతకోగ్ర
భయయుతంబగుటనుబరమమోక్షంబె ము,ఖ్యార్థ మై విలసిల్లునండ్రు బుధులు
తే. భువి గుణవ్యతికరమునఁ బుట్టినట్టి, యబ్జజాతాదులకు నస్మదాదులకును
గాలవిధ్వంసితాఖిలక్రమము గల్గుఁ, గలుగ దెన్నఁడు సేమంబు గాని వినుము.

వ. కావున మోక్షంబె పరమపురుషార్థం బని చెప్పి వెండియు ని ట్లనియె నరేంద్రా దేహేంద్రియప్రాణబుద్ధ్యహంకారపరివృతంబు లయినయీస్థావరజంగమంబుల హృదయంబులందు వ్యాపకుండుఁ బ్రత్యక్షభూతుండుఁ బ్రత్యగాత్ముండు భగవంతుండు నయినయీశ్వరుం డంతర్యామిరూపంబునం బ్రకాశించు చుండు నది నారాయణునిసద్రూపంబు గాఁ దెలియు మని వెండియు ని ట్లనియె. 626

ఉ. భూవర యీమహాపురుషభూషణునందుల నీసమస్తవి
శ్వావళి లీలమై సదసదాత్మకభావము నొంది భూరిమా
యావిభవంబులం దగి సమగ్రవివేకనిరోధిస్రగ్ఘనా
శీవిషబుద్ధిఁ దోఁచుచు విశేషగతిన్ వెలుఁగొందు నెప్పుడున్. 627

చ. సుమహితనిత్యముక్తపరిశుద్ధవిబుద్ధసుతత్త్వుఁ డై యుగు
క్రముఁ డభిభూతసత్త్వకృతి[2]కర్మకళంకుఁడు నైనయట్టియు
త్తమచరితుం గృపాకరు సదాత్తగుణోన్నతు నీశ్వరేశుఁ జి

1. శకులకుశీరాదిజాలంబు. 2 కర్మకలుండును నైన.

త్తమునఁ దలంపు మయ్య జనతాపరిరక్షణ దుష్టశిక్షణా. 628

సీ. వసుమతీనాథ యెవ్వనిపాదపద్మప,లాశవిలాససల్లలితభక్తి
సంస్మరణంబుచే సజ్జనప్రకరంబు, ఘనకర్మసంచయగ్రథిత మగున
హంకార మనుహృదయగ్రంథిఁ జెఱుతురు, వివరింప నిట్లు నిర్విషయమతులు
మహి నిరుద్ధేంద్రియమార్గులు నైనట్టి,యతులకుఁ జేరంగ నలవి గాని

తే. యట్టిపరమేశుఁ గేశవు నాదిపురుషు, వాసుదేవుని భువనపావనచరిత్రు
నర్థి శరణంబు గాఁ దత్పదాంబుజములు, భక్తి సేవింపు గుణసాంద్ర పార్థివేంద్ర.

మ. అరిషడ్వర్గమహోర్మినక్రనికరవ్యాకీర్ణసంసారసా
గర మబ్జోదరకీర్తనాతరణిసాంగత్యంబునం బాసి తా
మరు దారంగ నఘాపహప్రకటయోగాదిక్రియాయుక్తిచేఁ
దరియింపన్ మదిఁ గోరువారలకు దుర్దాంతం బగుం గావునన్. 630

మ. ధరణీశోత్తమ నీవు కేవలసముద్యద్భక్తి ధీయుక్తివై
వరగోవిందపదారవిందయుగభాస్వన్నావ సంధించి దు
స్తరభూరివ్యసనాకరోల్లసితదుర్దాంతోగ్రగంభీరసం
సరణాంభోధిఁ దరింపవయ్య పరమోత్సాహంబు దీపింపఁగన్, 631

క. అని యీగతిఁ బంకరుహా,సనసుతుఁడును బ్రహ్మబోధశాలియు నగునా
ఘనయోగివల్లభునిచే,తను దెలియఁగఁబడిన బ్రహ్మతత్త్వుం డగుచున్. 632

క. జనపతి మునిఁ బొగడి ముదం,బున నిట్లనుఁ బూర్వజన్మమున నే దీనా
వనుఁ డైనయీశ్వరునిచే,తను నిక్క మనుగ్రహింపఁ దగితి మునీంద్రా. 633

క. వినుఁ డట్టియనుగ్రహసా,ధనమున కై మీర లిపుడు దగ నిచ్చటికిం
జనుదెంచితిరి దయాళురు, ననఘులు భగవత్తములును నగుమీచేతన్. 634

సీ. నిరతంబు నాయందు నిష్పాదితము లగు, దేహసమేతమదీయరాజ్య
సర్వసంపదలును సద్ద్విజదత్తముల్, గావునఁ బ్రాణకాంతావిభూతి
మందిరసుతరాజ్యమహీబలకోశప,రిచ్ఛదంబుల నెల్ల ధృతిఁ దలంప
రాజుకు భృత్యుండు రాజకీయము లగు,తాంబూలముఖపదార్థములఁ జేసి

తే. రమణసంతర్పణోపచారములు నడపు,గతిని వారల కవి నివేదితము లయ్యెఁ
గాన మీ కుపచార మేగతి నొనర్తు, [2]నతులగుణసాంద్ర యోగికులాబ్ధిచంద్ర.

వ. అది యెట్లు బ్రాహ్మణాధీనం బంటి రేని సేనాధిపత్యరాజ్యదండనేతృత్వసర్వలోకాధిపత్యంబులు వేదశాస్త్రవేది యైనబ్రాహ్మణునక కాని యితరులకు యోగ్యంబులు గావు గావున బ్రాహ్మణులకు భోజనవసనదానంబులు స్వకీయంబు లై యుండు క్షత్త్రియాదులకు బ్రాహ్మణానుగ్రహంబున నన్నమాత్రంబు దక్కం దక్కినవస్తుస్వాతంత్త్ర్యంబు లేదు గావున మీకు గురుదక్షిణ యేమి సమర్పించు

1. నీపదార్చనమున. 2. నతులగుణసాంద్రులార మహాత్ములార.

వాఁడ నదియునుం గాక స్వాతంత్ర్యంబు గలిగిన నిట్టి యధ్యాత్మవిచారులు వేదాంతవేదులు నై భగవద్భక్తి నుపదేశించెడుమీవంటిపుణ్యాత్ములకుం బరిహాసాస్పదుండు దక్కఁ దక్కినవాఁ డెవ్వం డంజలిమాత్రంబు దక్కఁ దక్కిన ప్రత్యుపకారంబు సేయం దలంచు నది గావున దయాళువు లైనమీరలు స్వకృతోపచారంబులం జేసి సంతుష్టాంతరంగు లగుదురు గా కని పలుకు చున్నయాదిరా జయినపృథుచక్రవర్తిచేతఁ బూజితు లై యాత్మయోగనిష్ఠు లై నసనకాదులతనిస్వభావంబుఁ బ్రశంసించుచు సమస్తజనంబులుఁ జూచు చుండ నాకాశగమనంబునం జని రయ్యవసరంబున. 636

పృథుచక్రవర్తి జ్ఞానవైరాగ్యవంతుం డై ముక్తి నొందుట.

ఆ. విను మహాత్ము ముఖ్యుఁ డగు సనకునిపల్కు, కార్యచిత్తుఁ డగుచు నాత్మనిష్ఠుఁ
డై నయట్టితను నతఁ డాప్తకాముని గాఁగ, బుద్ధిలోనఁ దలఁచె భూవరుండు. 637

వ. అంత. 638

సీ. కర్మంబులను యథాకాలదేశోచిత, బలవిత్తములు గాఁగఁ బరఁగుధర్మ
ములను బ్రహ్మార్పణబుద్ధిని జేసి క, ర్మాసక్తుఁ డగుచు సమాహితుండు
ప్రకృతికంటెను దన్నుఁ బరమైనయాత్మను, గర్మసంచయసాక్షిఁ గాఁగ బుద్ధి
నరిఁ దలంచుచు నాచరించుచు నట్లు, మెఱసి సామ్రాజ్యలక్ష్మీసమేత

తే. మందిరోద్యానవనభూములందు రాజ్య
గరిమ వర్తింపఁగా నహంకారరహితుఁ
డగుచుఁ దనచిత్తమున నింద్రియార్థములను
దగులకయ యుండె సన్మహోదారుఁ డగుచు. 639

వ. ఇట్లధ్యాత్మయోగనిష్ఠుం డై కర్మంబుల నాచరించుచు నర్చి యనుభార్యయందు విజితాశ్వుండు ధూమ్రకేశుండు హర్యశ్వుండు ద్రవిణుండు వృకుండు ననునాత్మసము లైనపుత్రుల నేవురం గనియె నంత. 640

క. జనవినుత భూమివలనను, ధనముల మర్యాదఁ గొనుచు దాననిమిత్తం
బునఁ గ్రమ్మఱఁ దా నిచ్చుచు, దిననాయకుఁ బోలి వసుమతీపతి యొప్పెన్.

వ. అతండు మఱియు నగ్నిచండంబునం దేజోదుర్ధర్షుండును మహేంద్రునిపగిది దుర్జయుండును ధరణికరణి సతతక్షమాయుక్తుండును స్వర్గంబునుంబోలె నభీష్టదుండును బర్జన్యునిభాతిఁ గామితప్రవర్షణుండును సముద్రురీతి గాంభీర్యయుక్తుండును మేరువుపోలికి ధైర్యవంతుండును ధర్మరాజుకై వడి ననుశాసకుండును మహేంద్రునివిధంబున నైశ్వర్యవంతుండును గుబేరునిమాడ్కి ధనవంతుండును వరుణునిసరణి గుప్తార్థుండును సర్వాత్మకుం డగువాయువుచెలువున బలౌజస్తేజోయుక్తుండును రుద్రునిపగిది నసహ్యతేజుండును గందర్పునియనువున సౌందర్యవంతుండును మృగరాజునోజ నధికశౌర్యోపేతుండును మనువుననువున వాత్సల్య

యుక్తుండును నజునిచందంబునం బ్రభుత్వసమేతుండును బృహస్పతిగరిమ బ్రహ్మవాదియు సర్వేశ్వరునిజాడ జితేంద్రియుండును నై విష్వక్సేనానువర్తను లైన గోగురువిప్రజనంబులందు భక్తి గలిగి లజ్జావినయశీలంబులందు బరోపకారంబునందును నిరుపముం డై యివ్విధంబున సర్వలోకపాలకపృథగ్విధగుణంబుల నన్నింటిని దా నొక్కరుండ ధరియించి. 642

క. అనఘాత్మక లోకత్రయ, మున సజ్జనకర్ణరంధ్రముల వినఁబడు నా
వినుతయశోమహనీయుఁడు, జనవినుతుం డైనరామచంద్రునిమాడ్కిన్. 643

చ. సరసవచోర్థసత్పురుషసంఘసమంచితగీయమానసు
స్థిరవరకీర్తిపూరముల దిగ్గజకర్ణములందు నించి తా
నిరుపమసౌమ్యభాషణమనీషలచేతఁ బ్రజానురంజి యై
ధరణిని రాజనామమునఁ దాఁ దగు రెండవచంద్రుఁడో యనన్. 644

వ. మఱియు నమ్మహాత్ముండు విజ్ఞానియు వర్ధితాశేషసత్త్వానుసర్గుండును బ్రజాపాలకుండును స్థావరజంగమవృత్తిదాయకుండును సత్పురుషధర్మవర్తనుండును నిష్పాదితేశ్వరాదేశికుండును నై నన్నృపుం డొక్కనాఁడు దనవార్ధకంబు నీక్షించి నిజాత్మజ [1]నాత్మజులయందు నిలిపి ప్రజలు చింతాతురచిత్తు లగుచుండ నిజభార్యాసమేతుం డై యప్రతిహతనియమంబున వైఖానససమ్మతం బైనయుగ్రతపంబునందుఁ బూర్వంబున దిగ్విజయప్రవృత్తుం డగుచందంబునం బ్రవృత్తుం డై తపోవనంబునకుం జని యందు. 645

మత్తకోకిలము. కందమూలఫలాశి యై బహుకాల ముగ్రతప పరి
స్పందుఁ డై యటమీఁదటం దృణపర్ణభక్షణ సేసి యా
చంద మేది జలాశి యై నృపసత్తముం డది మాని తా
మందగంధవహాశి యయ్యెఁ గ్రమంబునన్ దృఢచిత్తుఁ డై. 646

వ. ఇట్లు వర్తించుచు. 647

సీ. మెండుగా మిటమిటమండు వేసవియందు, దప్తపంచాగ్నిమధ్యమున నిలిచి
మానక జడి గొన్నవానకాలంబునఁ, బైఁ గోక వేయక బయట నిలిచి
జనులు హూహూ యనుచలివేళఁ గుత్తుక, బంటితోయములలోపల వసించి
శిశిరంబు సాల నల్దిశలఁ బర్విన వేళ, వెలయ భూశయనుఁ డై విశ్రమించి
తే. మహితనియతిఁ దితిక్షాసమన్వితుండు
నియతపరిభాషణుఁడు జితానిలుఁడు దాంతుఁ
డిద్ధమతి యీశ్వరార్పితబుద్ధి యనఘుఁ
డూర్ధ్వరేతస్కుఁడును నై క్రమోచితముగ. 648

వ. అతిఘోరం బగునతపం బాచరించె నివ్విధంబునం గ్రమానిరుద్ధం బయినత

1 నాత్మజులయందు నిలిపి జితాత్మ్యనకుఁ బట్టంబు గట్టి ప్రజలు.

పంబున విధ్వస్తాశేషకర్మమలాశయుండును ప్రాణాయామంబులచే జితారిషడ్వర్గుండును ఛిన్నబంధనుండును నై పురుషశ్రేష్ఠుం డైనపృథుచక్రవర్తి భగవంతుం డైనసనత్కుమారుం డెఱింగించినయోగమార్గంబున సర్వేశ్వరభజనంబు గావించె నిట్లు భగవద్ధర్మపరుండును సాధువర్తనుండును శ్రద్ధాసమన్వితుండును నైన పృథునకు నారాయణునందు భక్తి యనన్యవిషయం బై ప్రవృద్ధ బయ్యె నివ్విధంబున. 649

క. నరలోకోత్తర భగవ, త్పరిచర్యారాధనమునఁ దతశుద్ధాంతః
కరణుం డగునాపృథునకు, సరసిరుహోదరుకథానుసంస్మరణమునన్. 650

క. పరిపూర్ణం బగుభక్తిని, గరిమ ననిశము సంశయాత్మకం బై చాలన్
వఱలినహృదయగ్రంథిని, నిరసించువిరక్తియుతమనీష జనించెన్. 651

వ. దానం జేసి యతండు సంఛిన్నదేహాత్మజ్ఞానుండు నధిగతాత్మస్వరూపుండు నై గదాగ్రజుం డయిన శ్రీకృష్ణునికథాసక్తి నొంది సమస్తయోగసిద్ధులందు నిస్పృహుం డగుటను హృదయగ్రంథివిచ్ఛేదకం బయినజ్ఞానయోగంబును విడిచి యాత్మయం దాత్మయోగంబుఁ గావించి బ్రహ్మభూతుం డయి నిజకళేబరంబు విడువ నిశ్చయించి. 652

సీ. కోరి మడమలచే గుదపీడనము సేసి, పూని యుక్తాసనాసీనుఁ డగుచుఁ
దనరుమూలాధారమునఁ నుండి వాయువు, నొయ్యన నెగయించి యొనర నాభి
కలితంబు గావించి క్రమమున హృద్వత్స,కంఠశిర,కోష్ఠకములఁ జేర్చి
కైకొని మూర్ధభాగమునకు నెగయించి, ప్రాణముల్ విడిచి యాపవనుఁ బవను
తే. నందు నాకాశ మాకాశమందుఁ దేజ,మందు దేజంబు నుదకంబునందు నుదక
మర్థిఁ గాయంబు మేదినియందుఁ గలిపెఁ, బూని వానియథోచితస్థానములుగ.

వ. మఱియు భూమి నుదకంబునందును నుదకంబును దేజమందుఁ దేజంబును వాయువున వాయువు నాకాశంబునందు నాకాశంబును మనంబున మనంబు నింద్రియంబుల నింద్రియతన్మాత్రల భూతాది యైనయహంకారంబునందు నహంకారంబు మహత్తత్త్వంబునందును గూర్చి యట్టిసర్వకార్యహేతుభూతం బైన మహత్తత్త్వంబును జీవోపాధిభూతం బయినప్రకృతియందుఁ గలిపి జీవభూతుం డయినపృథుండు జ్ఞానవైరాగ్యంబులచేత బ్రహ్మనిష్ఠుం డై మాయోపాధిం బాసి ముక్తుం డయ్యె నని చెప్పి వెండియు ని ట్లనియె. 654

సీ. అంత నాపృథునిభార్యామణి యగునర్చి, పుడమిపై నడి నడుగిడినఁ గందు
సుకుమారపాదాబ్జసుందరీరత్నంబు, నతులపతివ్రత యగుటఁ జేసి
యాత్మేశకృతసువ్రతాచరణంబును, సుమహితభక్తిశుశ్రూషణమును
నాశ్లేష మగుదేహమాత్రయు ననుపీని, చేత మిక్కిలి కృశీభూతదేహ
తే. యయ్యుఁ బ్రియనాథకృతకరుణావలోక

కరతలస్పర్శనాదిసత్కారములను
నబల సుఖవృత్తిఁ జెంది యయ్యడవులందుఁ
గృశత మదిఁ దోఁప కుండఁ జరించునపుడు. 655

క. తనమనమున నేదుఃఖము, ననయంబు నెఱుంగనట్టియర్చి నిజాధీ
శునిప్రాణరహితదేహము, గనుఁగొని విలపించి విగతశోకాతుక యగుచున్. 656

సీ. మానితమందరసానుప్రదేశంబు, నందుఁ జితారోప మర్థిఁ జేసి
లలితమహానదీసలిలసుస్నాత యై, కలితమహోదారకర్ముఁ డయిన
నాథున కుదకదానక్రియల్ గావించి, యతిభక్తి సురలకు నతు లొనర్చి
వహ్నికి ముమ్మాటు వలగొని పతిపాద, కమలయుగంబుఁ జిత్తమున నిలిపి

తే. వీరవరుఁ డైనపృథుపృథ్వీతలేశు, నందు ననుగమనము సేయునట్టిసాధ్వి
నర్చిఁ గనుఁగొని దేవభార్యాసహస్ర, మాత్మనాథులఁగూడి నెయ్యంబుతోడ.

క. పరమోత్కంఠను నమ్మందరగిరిసానుప్రదేశతలమున వరుసం
గురియించిరి నవసురభిత, వరమందార ప్రసూనవర్షము లంతన్. 658

క. తర మిడి యచ్చర లాడిరి, మొరయించిరి శంఖతూర్యములు దివిజులు వా
డిరి కిన్నరజనులు పర, స్పరనుతు లొనరించి రాసురపర్యాంగనలున్. 659

వ. మఱియు ని ట్లనిరి. 660

సీ. చర్చింప నిట్టియాశ్చర్య మెం దేనిని, గనుఁగొంటిరే యర్చి యనులతాంగి
ధన్యాత్మురాల్ గదా తనవిభుతోఁ గూడి, యిందిరారమణి యజ్ఞేశుఁ గూడి
వెనుచనుకైవడి ననుగమనము సేసె, నియ్యమ నిజహృదయేశుఁ డయిన
ఘను వైన్యు నూర్ధ్వలోకమ్మును బొందును, నేఁ డింతవట్టును నిశ్చితంబు

తే. పరమయోగీంద్రులకు దుర్విభావ్య మైన, దృఢసుకర్మమువలన నతిక్రమించి
వైన్యభూమీశు వెనుచని వరుసనూర్ధ్వ, [1]గామినియునయ్యెనీ యింతి ఘనతనొంది.

వ. కాన పతివ్రతలకు నసాధ్యం బెందునుం గలదే యని మఱియును. 662

క. పరికింపఁగ నేమనుజుఁడు, హరిపదమును బొందఁ జేయునట్టివివేక
స్ఫురణం దనర్చు వానికిఁ, బరువడి నిలఁ బొంద రానిపదముం గలదే. 663

తే. అట్టియపవర్గసాధన మైనమనుజ, భావ మొందియు విషయసంబద్ధుఁ డగుచు
వసుధ నెవ్వఁడు వర్తించు వాఁడు ధరణి, ననయము నిజాత్మవంచకుఁ డనఁగఁ బరఁగు.

క. అని వారలు దన్నర్థిని, వినుతింపఁగ నర్చి యాత్మవిభుఁ డగుపృథుఁ డొం
దినయచ్యుతలోకంబున, ననుపమవిభవమును బొందె నని విదురునకున్. 665

క. మునివరుఁ డగుమైత్రేయుఁడు, వినయంబున నెఱుఁగఁ జెప్పి వెండియుఁ దగ ని
ట్లను నమ్మహానుభావుం, డనఘుఁడు భగవద్వరుండు నగుఁ బృథుఁ డనఘా. 666

క. ఏ నీ కిప్పుడు సెప్పితి, మాను గ నీపుణ్యకథను మహితశ్రద్ధా

---

1 గామి యగు చున్న దీయింతి గాన యిపుడు.

ధీనుం డై విస్ఫురదవ, ధానుం డై యెవ్వఁ డేనిఁ దనరినభక్తిన్. 667

క. వినినఁ బఠించిన వ్రాసిన, వినిపించిన వాఁడు పృథుఁడు విమలగతిం బొం
దినక్రియ హరిపద మొందెడు, ననయము నిర్ధూతపాపుఁ డగుచు మహాత్మా.

సీ. బ్రాహ్మణుఁ డంచితభక్తిఁ బఠించిన, బ్రహ్మవర్చసము సంప్రాప్త మగును
క్షత్త్రియుం డర్థిమైఁ జదివిన విన్నను, జగతీవిభుత్వంబు సంభవించు
వైశ్యుండు విని ధనవంతుఁ డై యొప్పను, శూద్రుండు వినిన సుశ్లోకుఁ డగును
మఱియును భక్తి ముమ్మాఱు పఠించిన, విత్తవిహీనుండు విత్తపతియు

తే. నప్రసిద్ధుఁడు ప్రఖ్యాతయశుఁడుఁ బ్రజలు
లేనియధముఁడు వితతసంతానయుతుఁడు
మూర్ఖచిత్తుండు విజ్ఞానబోధమతియుఁ
నగుచు నుతి కెక్కుదురు మహితాత్మ మఱియు. 669

వ. ఈలోకంబునం బురుషులకు స్వస్త్యయనంబును నమంగళనివారణంబును ధనప్రదంబును యశస్కరంబును నాయుష్కరంబును స్వర్గదాయకంబులు గలిమలాపహంబును నైనయీపుణ్యచరిత్రంబు చతుర్విధపురుషార్థకాము లైనవారికిఁ జతుర్విధపురుషార్థకారణం బగుం గావున వినం దగు సంగ్రామాభిముఖుం డైనరాజీచరిత్రంబు ననుసంధించి విరోధి నెదిర్చిన నవ్విరోధి పృథునకుంబోలెఁ గప్పంబు లిచ్చు ముక్తాన్యసంగుండును భగవద్భక్తుండును నైనవాఁడు పుణ్యంబును వైన్యమాహాత్మ్యసూచకంబును నైనయీచరిత్రంబు వినుచుం బఠియించుచుం గృతమతి యై దినదినంబును నాదరంబునం బ్రకటంబు సేయువాఁడు భవసింధుపోతపాదుం డైనసర్వేశ్వరునియందు నచలం బయినభక్తి గలిగి పృథుచక్రవర్తి పొందినవిష్ణుపదంబుం బొందు నని యిప్పుణ్యచరిత్రంబు మైత్రేయుండు విదురున కెఱింగించి వెండియు ని ట్లనియె. 670

క. పృథునకు నర్చికిఁ బుట్టిన, పృథుకీర్తిధనుండు ఘనుఁడు పృథుతుల్యుం డై
[1]పృథుశౌర్యధైర్యధుర్యుఁడు, పృథివిన్ విజితాశ్వుఁ డొప్పెఁ బృథివీపతి యై.

క. (విను మంతర్ధానగతిం, దనరుసునాసీరువలనఁ దగ విజితాశ్వుం
డును మఱి యంతర్ధానుం, డనుపేరఁ బ్రసిద్ధుఁ డయ్యె నతిచతురుం డై). 672

సీ. స్థిరమతి రాజ్యాభిషిక్తుఁ డై యమ్మేటి, సమమతి నయ్యనుజన్ము లైన
హర్యక్షునకు సమాదరమునఁ దూర్పు దక్షిణదిశఁ దగ ధూమ్రకేశునకును
బరఁగంగ వృకునకుఁ బశ్చిమభాగంబు, ద్రవిణున కర్థి నుత్తరపుదిశను
గామ రొప్ప నలువురకును బంచి యిచ్చి స్వకాంత యైనట్టిశిఖండినికిని

తే. మనుజయోనిని జనియింపుఁ డనుచు మున్ను, పలికినట్టివసిష్ఠుశాపమునఁ జేసి
పూని త్రేతాగ్ను లతనికిఁ బుత్త్రు లగుచు, జనన మొందిరి సజ్జనస్తవ్యచరిత.

---

1 'పృథుశ్రవసుం డనుపేరను... విజితాశ్వుఁ డనెడిపేరం గడఁకన్' వ్రా. ప్ర.

వ. వారలు పావకుండుఁ బవమానుండు శుచియు ననునామంబుల మనుష్యయోనిం
బుట్టియు నాత్మప్రభావంబునం గ్రమ్మఱ నగ్ను లయి చనిరి తదనంతరంబ. 674

క. అతఁడు నభస్వతి యనియెడి, ద్వితీయపత్నివలనను హవిర్ధానుఁడు నా
సుతుఁ గని విజితాశ్వుం డా, నతివిమతుఁడు రాజ్యవర్తనము దలపోయున్. 675

క. విమలాత్మ కరాదానము, దమశుల్కాదికము గరము దారుణ మని ధై
ర్యమునం దీర్ఘమఖవ్యా, జమునం దద్వర్తనంబు సమమతి విడిచెన్. 676

వ. ఇట్లు విడిచి. 677

క. అతఁ డాత్మదర్శనుం డయి, చతురతఁ బరమాత్ము హంసు సర్వేశ్వరుఁ ద
త్క్రతువున యజించి కుశలా, ద్భుతయోగసమాధ ముక్తిఁ బొందె మహాత్మా.

వ. అంత విజితాశ్వుండు పరలోకగతుం డయిన హవిర్ధానుండు హవిర్ధాని యను
భార్యవలన బర్హిషదుండు గయుండు శుక్లుండు గృష్ణుండు సత్యుండు జితవ్ర
తుండు ననుపుత్త్రుల నార్వురం గాంచె నందు బర్హిషదుండు. 679

సీ. సంతతసవనదీక్షాశాలి యగుచు ధ, రాతలం బెల్లను గ్రతువులకును
విలసిల్లుయజనశాలలు వేఱువేఱ క, ల్పించి యజ్ఞములు గావించుచుండి
చిరకీర్తి యతఁడు ప్రాచీనాగ్రకుశలచే, క్షితితలం బెల్ల నాస్తృతము సేయ
వసుధయెల్లను యజ్ఞవాట మై విలసిల్ల, సత్క్రియాకాండనిష్ఠాస్థుఁ డగుచు

తే. సుభగయోగసమాధినిష్ఠుఁడు ప్రజాప, తియగుననితన్నుజనము నుతింప వెలయు
[1]నట్టిఘనుఁడు హవిర్ధాని యఖిలజగతిఁ, బఱపె కుశలను బ్రాచీనబర్హి యయ్యె.

వ. మఱియు నతండు. 681

చ. అలవడ నేసతీమణి సమంచితలీల వివాహవేళ ను
త్కలికఁ బ్రదక్షిణంబు లిడఁగాఁ గని హవ్యవహుండు దొల్లి యి
మ్ముల శుకిఁ జూచి మోహమును బొందినరీతి విమోహి యయ్యె నా
లలితవినూత్నభూషణ యలంకృతచారుశుభాంగి వెండియున్. 682

చ. సురుచిరభంగి నాసతి కిశోరవయఃపరిపాక యై రణ
ద్వరమణిహేమనూపురరవంబు సెలంగఁగ నాడుచుం దివా
కరరుచిరేఖ నొప్పెసఁగఁ గాఁ గని నిర్జితు లైరి దేవకి
న్నరనరసిద్ధసాధ్యమునినాగనభశ్చరముఖ్యు లందఱున్. 683

వ. అట్టిసౌందర్యఖనియు సముద్రపుత్త్రియు నయినశతధృతి యనుకన్యం బ్రహ్మదే
శంబునం బాణిగ్రహణంబు సేసె నాశతధృతివలనం బ్రాచీనబర్హికిఁ బదుగురు
గొడుకులు జనియించిరి వారలు తుల్యనామవ్రతులును ధర్మపారగులును నయిన
ప్రచేతసులు ప్రజాసర్గంబునందుఁ దండ్రిచేత నాజ్ఞాపితు లయి తపంబు గావింప
నర్ణవంబునకుం జనుసమయంబునం దన్మార్గంబునఁ బ్రసన్నుం డగుచు దృశ్యమా

1 'నట్టిసుతుఁడు హవిర్ధానుఁ డనెడి పేరఁ, బరఁగ జనియించెఁ బ్రాచీనబర్హి యనఁగ' వ్రా. ప్ర.

నుండైనశ్రీరుద్రునిచేత నేది యుపదేశింపంబడె [1]దానివస్తుధ్యానపూజానియ
మంబునఁ దపంబు సేయుచుండఁ దపఃపతి యైననారాయణుం బదివేలదివ్యసం
వత్సరంబులు పూజించి రని చెప్పిన విని విదురుండు మైత్రేయున కిట్లనియె.

సీ. తాపసోత్తమ ప్రచేతసులకు నర్ణవ, మార్గంబునందు నాభర్గుతోడ
సంగ మెట్లయ్యెఁ బ్రసన్నుఁడై హరుఁ డెద్ది, తివుట వారల కుపదేశ మిచ్చె
జీవరాసులకు నాశివుతోడిసంగంబు, గడుదుర్లభం బీజగంబునందుఁ
జర్చింప నమ్మేటి సన్మునీంద్రులకును, సంచితధ్యానగోచరుఁడు గాని
తే. పుడమిఁ బ్రత్యక్షమునఁ గానఁబడఁడు మఱియు, నంచితాత్మసదారాముఁ డఖిలలోక
రక్షణార్థంబుగా విరూపాక్షుఁ డాత్మ, శక్తితోఁ గూడి జగతిపై సంచరించు.

రుద్రుండు ప్రచేతసులకు యోగాదేశ మనుస్తోత్రముం జెప్పుట.

క. కావున భగవంతుండును, దేవస్తుతుఁ డయిన దేవదేవునిసంగం
బే వెరవున ఘటియించెనొ, యావిధ మంతయును దెలియ నానతి యీవే.

క. అనవుడు విదురున కమ్ముని, జననాయకుఁ డనియె నట్టిసాధుమనీషం
దనరు ప్రచేతసులును నిజ, జనకునిపరిభాషణములు సమ్మతితోడన్. 687

క. శిరసా వహించి ప్రాగ్దిశ, కరిగెడుసమయమున నెదుర నంబుధికంటెం
బఱపగు నొకసరసి మనో, హరనిర్మలసలిలపూర్ణ యైనది మఱియున్. 688

సీ. రక్తోత్పలేందీవర ప్రఫుల్లాంభోజ, కమనీయకహ్లారకలిత మగుచుఁ
గంజాతకింజల్కపుంజవిక్షేపక, మందగంధానిలానంద మగుచు
రమణీయహంససారసచక్రవాకకా, రండవనినదాభిరామ మగుచు
వరమత్తమధుపసుస్వరమోహనపల్లవాం, కురితలతాతరుభరిత మగుచు
తే. [2]సిద్ధచారణగంధర్వసేవ్య మగుచుఁ
బుణ్యముల కాలయం బయి పొలుపు మిగిలి
లలితమై చూడ నొప్పగు లక్షణములఁ
బరఁగి శుచిలఘుమధురాంబుభవ్య మగుచు. 689

తే. [3]సజ్జనునిహృదయముఁ బోలి స్వచ్ఛమగుచు, హరిపదాకృతిదివిజవిహారమగుచు
ఘనునిసిరిభంగి నర్వజీవనము నగుచు, మానవతివృత్తిగతిని నిమ్నంబునగుచు.

తే. శశికరంబులఁ బోలె విశదము లగుచు
హరికథలఁ బోలి కల్మషహరము లగుచు

---

1 'దాని జపధ్యానపూజానియమంబుల సేవించుచు'. అ. ప్ర. 2 'భువనపాలననిర్మలస్ఫూర్తి మెఱసి, నిర్మలంబైనజీవనాన్వితము నగుచు, మహితయోగీంద్రసంవేద్యమాన మగుచు, లోకపావనమన నొప్పనొకసరస్సు' అని యొకప్రతి. 3 సజ్జనునిహృదయముఁబోలె స్వచ్ఛ మగుచు, మత్స్యకచ్ఛపమకరసంపాది యగుచు, భేకదర్వీకరావళీభీమ మగుచు, నుదధినందన కనిశంబు నునికి యగుచు — అని పాఠాంతరము.

వహ్నులునుబోలె భువనపావనము లగుచుఁ
బొగడఁ దగునీరములచేఁ బ్రపూర్ణ మగుచు.) 691

వ. ఒప్పునట్టిసరోవరంబుఁ బొడగని యందు నొక్కదివ్యపురుషునిం గని రతండు. 692

మ. సమదశ్రీకమృదంగవేణుముఖభాస్వన్నాద మై దివ్యమా
ర్గమనోరంజక మై తనర్చువిలసద్గాంధర్వగానంబు నె
య్యము సంధిల్లఁగ వించుఁ దన్మహిమ కత్యాశ్చర్యముం బొంది వే
గమునం దత్కమలాకరంబు వెడలెం గౌతూహలోల్లాసి యై. 693

వ. ఇట్లు వెడలి వచ్చిన. 694

మ. కని రాతాపసపుంగవుల్ దివిజలోకశ్రేష్ఠునిం దప్తకాం
చనవర్ణున్ సనకాదియోగిజనభాస్వద్ధ్యేయమానుం ద్రిలో
చను భక్తానుగుణానుగున్ సుమహితైశ్వర్యున్ బ్రసాదాభిశో
భనవక్త్రున్ నిహతాఘకర్తృజనసంపద్భద్రునిన్ రుద్రునిన్. 695

క. కని వారలు దమమనముల, ననురాగము నద్భుతంబు ననయముఁ బొడమన్
వినయము దోఁపఁగఁ దత్పద,వనజములకు మ్రొక్కి భక్తివశగతు లగుచున్.

వ. భగవంతుండును (నఖిలధర్ముండును గృపాళుండును) ధర్మవత్సలుండును (నఖిల
పాపహరుండును) నయినహరుండు (ప్రీతుం డగుచుం) బ్రసన్నాంతఃకరణులు
ధర్మజ్ఞులు శీలసంపన్నులు సంప్రీతులు నయినవారల కిట్లనియె. 697

సీ. వినుఁడు నృపాలనందనులార మీమదిఁ, గలతలం పెల్లను గాన వచ్చె
మీకు భద్రం బగు మీయెడ నే నను,గ్రహబుద్ధిచే నిటు గానఁబడితిఁ
గైకొని యిపుడు సూక్ష్మముఁ ద్రిగుణాత్మక,ము నగునాప్రకృతికంటెను ధరణిని
బరఁగుజీవునికంటెఁ బరుఁ డైనవాసుదే,వునిచరణాబ్జముల్ దనరుభక్తి

తే. నర్థి నెవ్వరు భజియింతు రట్టివారు
నాకుఁ బ్రియతముల్ వారికి నయచరిత్రు
లార యేను బ్రియుండ నై భూరిమహిమ
వెలయు చుండుదు నది గాక వినుఁడు మీరు. 698

వ. స్వధర్మనిరతుం డైనపురుషుం డనేకజన్మాంతరసుకృతవిశేషంబులం జతుర్ముఖ
త్వంబు నొంది తదనంతరంబునం బుణ్యాతిరేకంబున నన్నుం బొంది యధికా
రాంతంబున నేనును దేవతాగణంబులును నవ్యాకృతం బైనయేహరిపదంబును
బొందుదు మట్టిపదంబు భాగవతుండు దనంత నె పొందుం గావున మీరు భాగ
వతత్వంబు నొందియు నాకుం బ్రియంబు ఘటియింపుఁడు భాగవతజనంబు
లకు నాకంటె నధికప్రియుండు లేఁడు గాన వివిక్తంబును జప్యంబును బవిత్రం
బును మంగళంబును నిశ్శ్రేయసకరంబును నైననావచనంబు నాకర్ణింపుఁడు
సర్గాదిని బ్రహ్మ నిజనందనుల కెఱింగించినశ్రీహరిస్తోత్రంబు మీకు నెఱింగింతు

వినుం డది యెట్టి దనిన. 699

క. వనజాసనుఁ డాత్మజు లగు, సనకాదులఁ జూచి పలికె సమ్మతితోడన్
వినుఁడు కుమారకులారా, వనజోదరుమంగళ స్తవం బెఱిఁగింతున్. 700

వ. (అని హరిను ద్దేశించి వారలు విన నిట్లనియె) నోయీశా యాత్మవేదులైనవారలకు భవదీయోత్కర్ష స్వానందలాభకరంబు గావున నట్టిస్వానందలాభంబు మాకుం గలుగ వలయు నీవు పరిపూర్ణానందస్వరూపుండ విట్టిసర్వాత్మకుండ వైననీకు నమస్కరింతు నని వెండియు ని ట్లనియె. 701

సీ. పఙ్కజనాభాయ సఙ్కర్షణాయ శాన్తాయ విశ్వప్రబోధాయ భూత
సూక్ష్మేన్ద్రియాత్మనే సూక్ష్మాయ వాసుదేవాయ పూర్ణాయ పుణ్యాయ నిర్వి
కారాయ కర్మనిస్తారకాయ క్షేత్రపాలాయ త్రైలోక్యపాలకాయ
సోమరూపాయ తేజోబలాఢ్యాయ స్వయంజ్యోతిషే దురన్తాయ కర్మ

తే. సాధనాయ పురాపురుషాయ యజ్ఞరేతసే జీవతృప్తాయ పృథ్వీరూప
కాయ లోకాయ నభసేఽన్తకాయ విశ్వయోనయే విష్ణవేజిష్ణవే నమోఽస్తు.

సీ. స్వర్గాపవర్గసుద్వారాయ సర్వరసాత్మనే పరమహంసాయ [1]కర్మ
పాకాయ తదితర ఫలరూపకాయ కృష్ణాయ ధర్మాత్మనే సర్వశక్తి
యుక్తాయ ఘనసాఙ్ఖ్యయోగీశ్వరాయ హిరణ్యవీర్యాయ రుద్రాయ శిష్ట
నాథాయ దుష్టవినాశాయ శూన్యప్రవృత్తాయ కర్మణే మృత్యవే వి

తే. రాట్ఛరీరాయ నిఖిలధర్మాయ [2]వాగ్విభూతయే నివృత్తాయ సత్పుణ్యభూరి
వర్చసేఽఖిలధర్మదేవాయ చాత్మనే నిరుద్ధాయ నిభృతాత్మనే నమోఽస్తు.

తే. సర్వసత్త్వాయ దేవాయ సన్నియామకాయ బహిరన్తరాత్మనే కారణాత్మ
నే సమస్తార్థలిఙ్గాయ [3]నిస్గుణాయ, వేధసే జితాత్మకసాధవే నమోఽస్తు.

వ. అని మఱియుఁ బ్రద్యుమ్నుండవును నంతరాత్మవును సమస్తశేషకారణుండవును జాతుర్హోత్రరూపుండవును నంతకుండవును సర్వజ్ఞుండవును జ్ఞానక్రియారూపుండవును నంతఃకరణవాసివియు నైననీకు నమస్కరింతు నని. 705

క. అనఘా దేవ భవత్పద, వనరుహసందర్శనేచ్ఛ వఱలిన మాకున్
విను వైష్ణవసత్కృత మై, యొనయుభవద్దర్శనంబు నీవె మహాత్మా. 706

వ. అది యెట్టి దనిన. 707

క. అనఘ సకలేంద్రియగుణాం, జనమును భక్తప్రియంబు జలదశ్యామం
బును సౌందర్యసమగ్రము, ననుపమమును నిఖిలమంగళావహ మగుచున్. 708

వ. మఱియును. 709

---

1 ధర్మపాలాయ సద్ధితఫల' అ. ప్ర.2 'భూతివర్చసే పితృదేవాయ వాగ్విభూతయే నివృత్తాయ వరహృషీకేంద్రియాత్మ, నే నిరుద్ధాయ నిభృతాత్మనే నమస్తే' వ్రా. ప్ర. 3 నిర్వికల్పమేధసేహం కృతాత్మనే' వ్రా. ప్ర.

సీ. అళికులోపమలసదలకశోభిత మగు, నమృతాంశురేఖానిభాననమును
సమకర్ణదివ్యభూషాప్రభాకలితంబు, సుందరభ్రూనాససురుచిరంబు
సలలితకుందకుట్మల[1]సన్నిభద్విజ, పూరితస్నిగ్ధకపోలయుగము
పద్మపలాశశోభనలోచనంబును, మందస్మితాపాంగసుందరమును
తే. సస్మితాలోకసతతప్రసన్నముఖము, కంబుసుందరరుచిరమంగళగళంబు
హారమణికుండలప్రభాపూరకలిత, చారుమృగరాజసన్నిభస్కంధయుతము. 710

వ. వెండియు శంఖచక్రగదాపద్మకలితాయతబాహుచతుష్టయంబును వైజయంతీ వనమాలికాకౌస్తుభమణిశ్రీవిరాజితంబును నిత్యానపాయిని యయిన యిందిరా సుందరీరత్నపరిస్పందంబునం దనరి తిరస్కృతనికషోపలం బైన వక్షస్స్థలంబును నుచ్ఛ్వాసనిశ్వాసంబులం జంచలంబు లైన వళిత్రయరుచిరప్రకాశమానదళోదరంబును బూర్వవినిర్గతనిఖిలవిశ్వంబునుం బ్రవిష్టంబు సేయు రీతి నొందు సలిలావర్తసన్నిభగంభీరనాభివివరంబును బంకజకింజల్కవిభాసితదుకూలనిబద్ధ కనకమేఖలాకలాపశోభితశ్యామపృథునితంబబింబంబును నీలకదళీస్తంభరుచిరోరు యుగళంబును సమచారుజంఘంబును నిమ్నజానుయుగళంబును బద్మపత్త్రభా సురపాదద్వయంబును మదీయాంతరంగతమోనివారకనిర్మలచంద్రశకలసన్నిభ నఖంబును గిరీట కుండల గ్రైవేయ హార కేయూర వలయముద్రికామణినూపు రాదివివిధభూషణభూషితంబును నిరస్తసమస్తనతజనసాధ్వసంబును భక్తజన మనోహరంబును సర్వమంగళాకరంబును నైన భగవద్దివ్యరూపంబుఁ దామసజన సన్మార్గపరిదర్శకుండ వైన నీవు మాకుఁ జూపి మమ్ముఁ గృతార్థులం జేయు మని వెండియు నిట్లనియె. 711

సీ. ఆత్మకుఁ బరిశుద్ధి నర్థించువారికి, ధ్యేయవస్తువు భవద్దివ్యమూర్తి
యంచితస్వర్గరాజ్యాభిషిక్తున కైన, సమధికస్పృహణీయతముఁడ వీవు
సద్భక్తియుతభక్తజనసులభుండవు, దుష్టాత్మలకుఁ గడు దుర్లభుండ
వాత్మదర్శనులకు నరయ గమ్యుండవు, నై యర్థి విలసిల్లు దనఘచరిత
తే. యిట్టినిఖిలదురారాధ్యు నీశు నిన్ను, నెఱయ సుజనుల కైన వర్ణింప రాదు
వఱల నెవ్వఁడు పూజించువాఁడు విభువఁ, జాలునే పద్మదళనేత్ర సచ్చరిత్ర.

చ. ఎనసినభక్తియోగమున నే భవదీయపదాబ్జమూలము
న్ననయముఁ బొందువాఁడు చటులాగ్రహభీషణవీర్యశౌర్యత
ర్జనములచే ననూనగతి సర్వజగంబులు సంహరించున
య్యనుపముఁ డైన కాలునిభయంబును బొందఁడు దాను గావునన్. 713

తే. ఇట్టినీపాదమూలంబు లెవ్వఁడేనిఁ, బొంది ధన్యాత్ముఁ డౌ నట్టిపుణ్యుఁ డొందు
మనములోపలఁ గోరునేమఱచియైన, నవ్యయానందగోవింద హరి ముకుంద.

---

1 నిభద్విజకంబు.

క. హరి నీభక్తులతోడను, నిరుపమగతిఁ జెలిమి సేయు। నిమిషార్ధముతో
సరి గాదు మోక్ష మనిన న, చిరశుభ మగుమర్త్యసుఖముఁ। జెప్పఁగ నేలా. 715

క. దురితవినాశకపదపం, కరుహ భవత్కీర్తితీర్థ।కణచయబాహ్యాం
తరసేకధూతకల్మష, పురుషులు ధరమీఁదఁ దీర్థ।భూతులు గారే. 716

వ. అట్టిభూతదయాసమేతులును రాగాదివిరహితచిత్తులును నార్జవాదిగుణయుక్తులు
ను నయినభాగవతజనులసంగంబు మాకుం గలుగఁజేయు మిదియ మ మ్మనుగ్ర
హించుట యని వెండియు ని ట్లనియె. 717

చ. సరసిజనాభ। సత్పురుష।సంగసమంచితభక్తియోగవి
స్ఫురణ ననుగ్రహింపఁబడి। శుద్ధము నొందినవానిచిత్తమ
స్థిరబహి[1]రంగముం గనదు। చెందదు భూరితమస్స్వరూపసం
సరణగుహాగతంబుఁ గనఁ। జాలు భవన్మహనీయతత్త్వమున్. 718

వ. అది యెట్టి దనిన. 719

సీ. అరయంగ నేమిటి।యందు నీవిశ్వంబు, విదిత మై యుండు నీ।విశ్వమందు
నేది ప్రకాశించు। నెప్పుడు నట్టిస్వ, యంజ్యోతి నిత్యంబు। నవ్యయంబు
నాకాశమును బోలి। యవిరళవ్యాపక, మగునాత్మతత్త్వంబు। నధికమహిమ
నమగుపరబ్రహ్మ। మగు నని పల్కు యు, ట్లనియె నవిక్రియుం। డైనవాఁడు
తే. నెవ్వఁ డాతఁడు దనయందు। నెపుడు నాత్మ, కార్యకరణసమర్థంబు। గానిభేద
బుద్ధిజనకంబు నాఁ దగు।భూరిమాయఁ, జేసి విశ్వంబు సత్యంబు। గా సృజించె.

ఆ. మరల మరలఁ బెక్కు।మారు లీవిశ్వంబు, జననవృద్ధివిలయ।సంగతులను
నందఁజేయుచుండు। నట్టియీశ్వరుఁడ వై, తనరునిన్ను నాత్మ।తత్త్వము గను.

వ. తెలియుదు మని వెండియు ని ట్లనియె యోగపరాయణు లగువారు శ్రద్ధాసమ
న్వితు లై క్రియాకలాపంబుల నంతఃకరణోపలక్షితం బయినభవదీయరూపంబు
యజింతురు వారు వేదాగమతత్త్వజ్ఞానులు నీ వాద్యుఁడవును ననాదియు నద్వి
తీయుండవును మాయాశక్తియుక్తుండవు నై విలసిల్లుచుండుదు వట్టిమాయా
శక్తిచేత. 722

సీ. చతురాత్మ సత్త్వర।జస్తమోగుణములు, వఱస జనించెను। వానివలన
మహదహంకారత।న్మాత్రనభోమరు, దనలజలావని।మునిసుపర్వ
భూతగణాత్మక।స్ఫురణ నీవిశ్వంబు, భిన్నరూపమున ను।త్పన్న మయ్యె
దేవ యీగతి భవ।దీయమాయను జేసి, వూఢిఁ జతుర్విధ।రూప మైన
తే. పురము నాత్మాంశమునఁ జెందు।పురుషుఁ డింద్రి
యములచే విషయసుఖము। లనుభవించు
మహిని మధుమక్షికాకృత।మధువుఁ బోలి

---

1 రర్థముం.

యతనిఁ బురవర్తి యగుజీవుఁ డండ్రు మఱియు. 723

వ. ఇట్టిజగత్సర్జకుండ వైననీవు. 724

క. భూతగణంబులచేత నె, భూతగణంబులను మేఘపుంజంబుల ని
ర్ధూతముగఁ జేయుననిలుని, భాతిని జరియింపఁ జేసి పౌరుష మొప్పన్. 725

తే. రూఢిఁ దత్తత్క్రియాలబ్ధరూపుఁడవును, సుమహితస్ఫురదమితతేజుఁడవుఁ జండ
వేగుఁడవు నయి ఘనభుజావిపులమహిమ, విశ్వసంహారమూర్తిఁ గావింతు వీశ.

వ. అది యెట్లనిన. 727

క. ఇతికర్తవ్యవిచారక, మతిచేత ననూనముగఁ బ్రమత్తంబును సం
చితవిషయలాలసము నూర్జితలోభము నైనయట్టిసృష్టి గడంకన్. 728

తే. అప్రమత్తుండ వగుచుఁ బద్మాక్ష నీవు, మ్రింగుదువు చాలనాఁకటమేఁగుచుండి
నాలుకలు గ్రోయుభూరిపన్నగమువాతఁ, బడినయెలుకను భక్షించుపగిది ననఘ.

చ. అనిశము నస్మదీయగురుఁ డైనసరోరుహసంభవుండు న
మ్మనువులు నాత్మసంశయము మాని భజించుభవత్పదాబ్జముల్
మనమున నిల్పి యుష్మదవమానమహావ్యథఁ జెందునట్టిస
జ్జనుఁడు పరిత్యజించునె భుజంగమతల్పక భక్తకల్పకా. 730

క. కావున నాకును సూరిజ, నావళికిని సర్వసంశయంబులు వాపం
గావను బోవను దగుగతి, నీ వని వినుతించినట్టియీస్తవ మెలమిన్. 731

వ. రుద్రుండు ప్రచేతసుల కెఱింగించి వెండియు నిట్లనియెఁ బ్రచేతసులారా యిట్టి యోగాదేశనామకంబైనయీస్తోత్రంబు [1]బహువారావృత్తిఁ జేఁబఠించి మనంబున ధరియించి సమాహితచిత్తులై మీరందఱు నాదరంబున విశ్వాసయుక్తులును స్వధర్మాచారవంతులును భగవదర్పితాశయులును నై జపియించుచు సర్వభూతావస్థితుండు నాత్మారాముండు నైనసర్వేశ్వరుని [2]నుతించుచు ధ్యానంబు సేయుచుఁ బూజించు చుండుఁడు తొల్లి యీస్తోత్రంబు భగవంతుం డైనపద్మసంభవుండు (సిసృక్షు వగుచు) నాత్మజుల మైనమాకును (సృజియింప నిచ్ఛగించు) భృగ్వాదులకును నెఱింగించె నేము (నాభృగ్వాదులును) బ్రజాసర్గంబునందు బ్రహ్మాదిచోదితులమై యీస్తోత్రంబునం జేసి విధ్వస్తసమస్తతమోగుణుల మై వివిధప్రజాసర్గంబు గావించితిమి కావున నీస్తోత్రంబు నెల్లప్పుడు నేకాగ్రచిత్తుండును వాసుదేవపరాయణుండు నై యెవ్వఁడు జపియించు వాఁడు వేగంబె శ్రేయస్సును బొంది తదీయజ్ఞానప్లవంబున వ్యసనార్ణవరూపం బయినసంసారంబును సుఖతరంబుగఁ దరియించు నట్టిమదుపదిష్టం బయినయీహరిస్తవంబు నెవ్వఁడు సదువుచు దురారాధ్యుం డైనశ్రీహరిం బూజించు వాఁడు మదుక్తస్తోత్రగానసంతుష్టుండును శ్రేయస్సులకు నేకాశ్రయభూతుండును నగుశ్రీమన్నారాయణునివలన సమస్తాభీష్టం

1 'నాచార్యోపదేశంబునం బఠించి' వ్రా. ప్ర. 2 ధ్యానయుక్తంబుగాఁ బూజింపుఁడు.

బులం బొందు నెవ్వం డేని బ్రభాతంబున లేచి ప్రాంజలియు శ్రద్ధాసమన్వి
తుండు నై యీమంగళ స్తవరాజంబును వినును వినిపించును వాఁడు గర్మబంధ
విముక్తుం డగు నని మఱియు ని ట్లనియె. 732

క. నరదేవతనయులారా, పురుషాధీశుండు పరమపురుషుఁడు నగునీ
శ్వరుసుస్తోత్రము మీ కే, నెఱిఁగించితి మీరు మదిని నెడపనిభక్తిన్. 733

క. ఏకాగ్రచిత్తులును సు,శ్లోకులు నై జపము సేయుచును ఘనతపముం
గైకొని చేసిన మీకును, జేకుఱు మహితేప్సితార్థసిద్ధి గడంకన్. 734

క. అని యీగతి నుపదేశం, బొనరించి సదాశివుండు నొగి వారలచే
తను బూజితుఁ డై వారలు, గన నంతర్ధానుఁ డయ్యెఁ గౌతుక మొప్పన్. 735

వ. అంత. 736

తే. తివుట వారలు రుద్రోపదిష్ట మైన, యచ్యుత స్తవము జపించు చయుతసంఖ్య
వత్సరము లుగ్రతపము దుర్వారవారి,మధ్యమునఁ జేయుచున్నసమయమునందు.

నారదుండు ప్రాచీనబర్హికి జ్ఞానమార్గమును దెలియఁజేయుట.

వ. ఘనకర్మాసక్తచిత్తుం డై యున్నప్రాచీనబర్హి కడకు సదధ్యాత్మవేదియుం గృపాళువు
నై ననారదుండు సనుదెంచి యారాజునకు జ్ఞానబోధంబు సేయుకొఱకు నతనితో
ని ట్లనియె రాజా యీకర్మంబునం జేసి యెట్టిశ్రేయస్సు నభిలషించుచున్నవాఁడ
వట్టియనిష్టనిరసనేష్టప్రాప్తికరంబు నయినశ్రేయం బీకర్మంబువలన లభింప దని
నం బ్రాచీనబర్హి నారదున కి ట్లనియె. 738

సీ. అనఘ మునీంద్ర మహాభాగ యేను గ,ర్మాపవిగ్నజ్ఞాని నగుచు మోక్ష
మెఱుఁగంగ లే నైతి నిట్టినా కిప్పుడు, గడువిమలంబును గర్మబంధ
నాశకంబును నగుజ్ఞానోపదేశంబు, గావింపు మతిదయాకార కూట
ధర్మంబు లగు గేహతతులందుఁ జెంది జా,యాతనూజాతధనాదికము లె

తే. భూరిపురుషార్థములుగ గర్వబుద్ధిఁ దలఁచు,మతివిహీనుండు సంసారమార్గములను
దగఁ బరిభ్రామ్యమాణుఁ డై నొగిలి మోక్ష,పదమునొందంగఁజాలఁడు భవ్యచ

క. అనవుడు నతనికి నతఁడును, ననఘా యీయధ్వరంబులందును గృప మా [రిత.
లినసీచే విశసింపం, జని కూలినపసుల వేలసంఖ్యలఁ గనుమా. 740

వ. కావునం బశువ్రాతంబులు త్వదీయవైశసంబును స్మరించుచున్న వై లోహాయం
త్రమయశృంగంబులచేత నెప్పుడు నీవు పరలోకంబు నొందెద వప్పుడ నిన్ను
హింసింతు మని భవదీయమృతికి నెదురుచూచు చున్న విట్టిసంకటంబు నొందం
గలనీకు నిస్తారకం బయినయొక్క యితిహాసంబు గల దెఱింగింతు విను మని
యి ట్లనియె. 741

పురంజనోపాఖ్యానము.

సీ. భూమీశ విన వయ్య పూర్వకాలమునఁ బు,రంజనుం డనునొక్క రాజు గలఁడు

నతనికి విజ్ఞాతుఁ డను పేరఁ దగినవి, జ్ఞాతచేష్టితుఁ డగు సఖుఁడు గలఁడు
నా పురంజనుఁడు పురాన్వేషి యై ధరా, చక్రంబు గలయంగ సంచరించి
తన కనురూప మై పెను పొందుపుర మెందు, వీక్షింపఁ జాలక విమనుఁ డగుచు

తే. నేపురము లుర్విఁ బొడగనె నా పురములు
గామములఁ గోరుతనకు నక్కామములను
బొందుటకు వానిని నసమర్థములు గాఁ దనమ
నమునఁ దలఁచి యొకానొకనాఁ డతండు. 742

వ. చనుచున్నసమయంబున హిమవత్పర్వతదక్షిణసానువులందు. 743

సీ. వరనవద్వారకవాటగవాక్షతో,రణదేహళీగోపురముల నొప్పి
ప్రాకారయంత్రవప్రప్రతోళీపరి,ఖాట్టాలకోపవనాళిఁ దనరి
సౌవర్ణరౌప్యాయసఘనశృంగంబుల, రమణీయవివిధగేహముల మించి
రథ్యాసభాచత్వరధ్వజక్రీడాయ, తనసుచైత్యాపణతతిఁ దనర్చి

తే. మరకతస్ఫటికవిదూరమణివినూత్న,మౌక్తికాయుతఖచితహర్మ్యములు గలిగి
విద్రుమద్రుమవేదుల వెలయునొక్క,పురముఁ గనె భోగవతి కెనఁబోలుదాని.

వ. ఇట్లు గనుంగొని యనంతరంబ ముందటం బురబాహ్యాంతరంబున దివ్యద్రుమ
లతాకుంజపుంజంబును సమదనదద్విహంగమత్తమధుకరకులకోలాహలసంకులజ
లాశయశోభితంబును హిమనిర్ఝరబిందుసందోహపరిస్పందకందలితమందమలయ
మరుదుచ్చలితప్రవాళవిటపనళినీతటంబును బాంథజనమనోరంజనాహ్వానబుద్ధిజ
నకకలహంసరాజకీరకోకిలాలాపవిరాజమానంబును మునివ్రతనానావిధవనమృగ
వ్రాతబాధారహితంబును నైనపురబాహ్యోద్యానవనంబునందు యాదృచ్ఛికం
బుగ నేకైకశతనాయకం బైనయనుచరదశకంబును బంచమస్తకసర్పప్రతీ
హారుండును దోడ రాఁ జనుదెంచుచున్న భర్త్రన్వేషిణియుం గామరూపిణియు
నవోఢయు నయినయట్టి. 745

సీ. ఘనసమవిన్యస్తకర్ణకుండలరుచుల్, గండభాగంబుల నిండి పర్వఁ
దమ్మితేకులసిరిఁ దటమటింపఁగఁ జాలు, మెఱుఁగుఁగన్నులు దలఁ దిరిగి రాఁగ
జఘనసంకలితపిశంగనీవిస్ఫూర్తి, కనకకాంచీరుచిఁ గరము పెనుపఁ
జరణసరోజభాసురచలన్నూపుర,ఝణఝణధ్వని నర్మసరణిఁ జూప

తే. లలితయౌవనలక్ష్మీవిలాసభాసు, రోదయవ్యంజితప్రభాయుక్తపీన
సమనిరంతరకుచకుట్మలముల వ్రీడఁ, జెంది పయ్యెదఁ గప్పు బాలేందుముఖిని.

వ. మఱియును బాలయు సుదతియు గజగామినియు నయినయొక్క ప్రమదోత్తమం
గాంచి. 747

క. తెర మిడి ప్రేమోద్గత మై, మరువిందులకోమరు నగుబొమలు గలతరుణీ
సరసాపాంగవిలోకన,శరపరివిద్ధాంగుఁ డగుచు జనవిభుఁ డనియెన్. 748

క. ఎవ్వరిదానవు జనకుం, డెవ్వఁడు పే రేమి భృత్యు । లీపదియొకరిం
డెవ్వరు సతు లెవ్వరు మఱి, యివ్వనమున నుండఁ గార్య । మెద్ది మృగాక్షీ. 749
క. భవదీయపురస్సరుఁ డగు,పవనాశనుఁ డెవ్వఁ డతిశ్రీపామతి నాకున్
వివరింపు మనుచు వెండియు, ధవళేక్షణఁ జూచి ధరణీధవుఁ డిట్లనియెన్. 750
సీ. తరళాక్షి పతి యగుధర్ము నన్వేషింపఁ, జరియించుహ్రీ యను సతివొ కాక
రుద్రు నన్వేషించురుద్రాణివో కాక, బ్రహ్మను వెదకుభారతివొ కాక
నారాయణుని భక్తిఁ । గోరి యన్వేషించు, నిందిరవో కాక । యెవ్వ రీవు
త్వత్పాదకామన త్వమునను సంప్రాప్త,సకలకాముం డగుసరసు నెట్టి
తే. వాని వెదకెదు తరుణి భగవత్కరాగ్ర,పద్మకోశం బదెక్కడఁ । బతిత మయ్యె
నాకు నెఱిఁగింపఁదగుదు పవివేకచరిత, యని నృపాలుఁడు మఱియుని ట్లనియెసతికి.
క. కర మొప్పఁగ నీ విటు భూ,చర వగుటను హ్రీవి శివవు । శారదవును సా
గరకన్యవుఁ గాకుండుటఁ, దరుణీ పొడగంటి నని పదంపడి పలికెన్. 752
సీ. మొనసి యదభ్రకరస్కుఁడ నైననాచేత, నిపుడు పాలిత మైనయీపురంబు
సరసిజోదరునిభుజాపాలితో దాత్త,లలిత వైకుంఠ మలంకరించు
నిందిరాసుందరిచందంబునను నీవ,లంకరింపఁ గడంగుపంకజాక్షి
యది గాక తావకీనాపాంగరుచి మోహి,తాంతరంగుండ నైనట్టినన్ను
తే. మహితసవ్రీడభావసన్మందహాస, చాపవిభ్రమభూ లతాప్రేరితుఁడుగఁ
దనరుభగవంతుఁడగునట్టిమనసిజుండు,పడఁతి యుడుగక పీడింపఁదొడఁగెనిపుడు.
వ. కావున. 754
చ. తరుణి సుతారలోచనయుతంబును మంజుసుధాసమానభా
సురమృదువాక్యయుక్తమును । శోభితకోమలలంబమానసుం
దరచికురాభిరామము నుదారము నైనభవన్ముఖాబ్జమున్
సురుచిరలీల నెత్తి ననుఁ । జూడుము సిగ్గునఁ జెంద నేటికిన్. 755
వ. అని యివ్విధంబున నర్థించు చున్న పలుకుపురంజనుం జూచి యాప్రమదో త్తమ వీర
మోహిత యై సస్మితానన యగుచు నానందంబు నొంది యి ట్లనియె. 756
క. పురుషవర నాకు నీకును, గురువును నామమును గులముఁ । గోరి యెఱుఁగ నీ
పురమున నుండుదుఁ గా కీ,పురమును నిర్మించినట్టిపురుషు నెఱుంగన్. 757
క. వీరలు నాసఖు లీలల,నారత్నము లార్యవినుత । నాచెలు లీవ్ర
ధ్గోరగ మే నిద్రింపఁగ, ధీరత మేల్కాంచి పురము । ధృతిఁ బాలించున్. 758
వ. అని వెండియు ని ట్లనియె. 759
సీ. మనుజనాయక నీవు । మద్భాగ్యవశమున, నిటకు నేతెంచితి । విపుడు నీకు
మంగళం బగు నీవు । మహితేంద్రియగ్రామ,భోగ్యంబు లగుకామపుంజములను
నర్థి సంపాదింతు । వనఘాత్మ యీనవ,ద్వారప్రయుక్త మై । తనరుపురము

[1]నీవు గైకొని యేలు నీకంటె దీనికి, నధిపుఁ డన్యుండు లేఁ డనఘ యిందు
తే. మదుపనీతము లైన కామములననుభ, [2]వింపఁగా సమాశత మధిష్ఠింపు మెలమిఁ
గోరి నీకంటెఁ బ్రియులు నెవ్వారు నాకు, నరసి చూడంగ మనుజేంద్ర యదియుఁ గాక.
వ. మఱియు రతిజ్ఞానవిహీనుండు నకోవిదుండు నిహపరచింతాశూన్యుండుఁ బశుప్రా
యుండుఁ ద్వదన్యుండు నైనవాని నెవ్వని వరియింతు గృహస్థాశ్రమమందు ధర్మార్థ
కామమోక్ష ప్రజానందంబులును యశంబును [3]యతివేద్యంబులు గానిరజస్తమో
విహీనపుణ్యలోకంబులును గలుగుఁ బితృదేవర్షిమర్త్యభూపగణంబులకుం దనకు
నీలోకంబున గృహస్థాశ్రమంబు సర్వక్షేమార్థం బయిన యాశ్రమం బండ్రు గా
వున వదాన్యుండవు వీరవిఖ్యాతుండవుఁ బ్రియదర్శనుండవు స్వయంప్రాప్తుండవు
నయి భోగిభోగసదృశభుజాదండంబులచే నొప్పు భవాదృశుం దగిలి మాదృశ
యగుకన్య వరియింప కుండునే యని వెండియు. 761

క. కరుణారసపరిపూర్ణ, స్ఫురితస్మితరుచివిలోకపుంజము చేతం
గరమర్థి దీనజనభయ, హరణుఁడవై సంచరింపు మఖిలజగములన్. 762

క. అని యీగతిఁ బలికిన యా, వనజాక్షిఁ బురంజనుండు వరియించి ముదం
బున నన్యోన్యము మైత్రిం, దనరుచుఁ దత్పురము సొచ్చి ధన్యుం డగుచున్.

చ. శతసమకాల మప్పురి నజస్రము భూరిసమస్తసౌఖ్యసం
గతులఁ దనర్చి వందిజనగాయకసద్వినుతోరుగానమో
దితమతి నొప్పి సుందరసతీజనసేవితుఁ డై నృపాలకో
చితలలితస్థలంబుల వసించుచుఁ గ్రీడలు సల్పుచుండఁగన్. 764

క. నరనాథుఁడు లోకభయం, కరగతి వర్తించు గ్రీష్మకాలము దోఁపం
దరశీలహరి[4]మనోహర, వరహ్రదిని సలిలమందు వసియించెఁ దగన్. 765

వ. ఇట్లు వసియించి కతిపయదినంబు లరుగు సమయంబున. 766

సీ. అవనీశ్వరోత్తమ యప్పురంబున నాల్గు, వంకల నున్న గవఁకులు వినుము
తూర్పుదిక్కునను నైదును దక్షిణోత్తరం, బుల రెండుఁ బశ్చిమంబునను రెండుఁ
గాఁగ నాతొమ్మిది గవఁకుల నుపరిది, క్కున నేడుఁ గ్రిందిదిక్కునను రెండు
నయి యుండు మఱి వానియందుఁ బృథగ్విధ, విషయగత్యర్థమై వెలయునీశ్వ
తే. రుం డొకం డరయఁ గలండు రూఢిఁ దత్పు, రంబుఁ బాలించునట్టి పురంజనుండు
నాపురద్వారనవకంబునందులోన, నర్థిఁ బ్రాగ్ద్వారపంచకమందు వరుస. 767

వ. ఖద్యోతయు నావిర్ముఖియు ననునామంబులు గలద్వారయుగంబున ద్యుమ
త్సఖుం డై విభ్రాజితాఖ్యజనపదంబును బొందు వెండియు నళినియు నాళినియు

---

1 నందును వసియించి యనుదినంబును మన్మ, నోభీష్టనిరతమైఁ బ్రబోధమున; నందు నా చెలులచే నభిమత కామములన్, నెమ్మి నరిందమ నీవుఁ గూరు. 2 వించుమను సమశత. 3 స్వాద్యంబులు గాని. 4 యుతమనో, హరశీతలసలిలహ్రదమునందు వసించెన్.

నను పేళ్లు గలవాకిళ్లు రెంటియందు నవధూతసఖుం డై సౌరభరూపంబు లయిన
విషయంబులం బొందు మఱియు ముఖ్యానామకం బైనప్రధానప్రాగ్ద్వారంబున
రసజ్ఞవిపణాన్వితుం డై యాపణబహూదనంబు లనువిషయంబుల నొందుఁ బితృ
హూనామకం బయినదక్షిణద్వారంబున శ్రుతధరాన్వితుండై దక్షిణపాంచాలం
బనురాష్ట్రంబు నొందు దేవహూనామకం బయిన యుత్తరపువాకిట శ్రుతధరా
న్వితుం డై యుత్తరపాంచాలం బనురాష్ట్రంబు నొందు వెండియుం బడమటి
వాకిళ్లు రెంటియందు నాసురీనామకం బైనవాకిట దుర్మదసమేతుం డై గ్రామక
నామకంబై నవిషయంబును నిర్ఋతినామకం బయినవాకిటియందు లుబ్ధకయుక్తుం
డై వైశసం బనువిషయంబు నొందు చుండు వెండియుం బురంజనుం డప్పురం
బునం బౌరజనంబులందు నిర్వాగ్యేశస్కరు లన నిద్ద అంధులు గలరు వారల
చేత గమనకరణంబు లనుక్రియల నొందుచు నంతఃపురగతుం డగునప్పుడు
విషూచీసమన్వితుం డై జాయాత్మజోద్భవంబు లైనమోహప్రసాదహర్షంబుల
నొందు చుండు నవ్విధంబునం గర్మాసక్తుండుఁ గామాత్మకుండు నై బుద్ధి యను
మహిషిచేత వంచితుం డయ్యె నక్కామినియు. 768

సీ. పానంబుసేసినఁ ǂ దానుఁ బానముసేయుఁ, గుడిచినఁ దానును ǂ గుడుచు మఱియు
భక్షింపఁ దానును ǂ భక్షించు నడచిన, నడచును నవ్విన ǂ నవ్వు నేడ్వ
నేడుచుఁ బాడినఁ ǂ బాడు విన్నను వినుఁ, జూచినఁ జూచుఁ గూర్చున్న నుండు
దుఃఖింప దీనుఁ డై ǂ దుఃఖించు నిలిచిన, నిలుచు నిద్రింపంగ ǂ నిద్ర వోవు

తే. ముట్టినను ముట్టు మూర్కొన్న ǂ మూరుకొనును
బలుకఁ బలుకును బవళింపఁ ǂ బవ్వళించు
హర్షమును బొంద నాత్మను ǂ హర్ష మొందు
మోదమును బొంద దానును ǂ మోద మందు. 769

వ. ఇవ్విధంబున నతండు మహిషీవిప్రలబ్ధుండును వంచితస్వభావుండును నై పారవ
శ్యంబునం జేసి యజ్ఞుండును నితరేచ్ఛావిరహితుండును నై క్రీడామృగంబుచా
డ్పున వర్తించుచు నాపురంబునఁ గాఁపురం బుండఁ గొన్నిదినంబుల కాపురంజ
నుండు ధనుర్ధరుం డై. 770

సీ. పంచాశ్వయుక్తంబు ǂ పంచబంధనముఁ జక్రద్వితయమును యుǂగద్వయంబు
నాశువేగంబు నేǂకాక్షంబు కూబర,ద్వయముఁ [1]బతాకాత్రిǂతయయుతంబు
నేకప్రగ్రహమును ǂ నేకసారథికంబు, సప్తవరూథంబు ǂ స్వర్ణభూష
మును బంచవిక్రమǂమును నేకనీడంబుఁ, బ్రకటపంచప్రహాǂరణము నయిన

తే. రథము కాంచనరచితవǂర్మము ధరించి, విలసదక్షయతూణీరǂకలితుఁ డగుచుఁ
గడఁక దీపింప నెక్కి యేǂకాదశప్ర,సంఖ్యసేనాసమేతుఁ డై ǂ సరభసము గ.

---

1. 'ద్రితయపతాకయుతము' వ్రా. ప్ర.

వ. పురంబు వెడలి పంచప్రస్థం బనువనంబునకుం జని యందు విడువ రానిమహిషిని విడిచి మృగయాసక్తుం డై తృప్తుం డగుచు ధనుర్బాణంబులు ధరియించి సంచరించుచు నాసురవర్తనంబునం దగిలి ఘోరాత్ముండు నదయుండు నై నిశాతసాయకంబులచేత నమ్మృగవ్రాతంబులం బరిమార్చె రాజులకు మృగయావినోదంబు విహితానుష్ఠానం బగు చుండ నాసురవృత్తి యె ట్లయ్యె నని యంటి వేని నిది రాగప్రాప్తం బగుటను విహితంబు [1]గాదు వినుము శ్రాద్ధాదులందే ప్రఖ్యాతశ్రాద్ధదివసంబులయందే రా జైనవాఁడే మేధ్యంబు లయినపశువులనే వనంబునందే యథోపయుక్తంబుగానే వధియింపం జను ననునియమమాత్రంబు గలదు గావున జ్ఞానియైనవిద్వాంసుండు యాచరింపండుగాక యాచరించినం గర్మానుష్ఠానజనితం బయినజ్ఞానంబునం జేసి యందుఁ బొరయం డట్లుగాక నియమోల్లంఘనంబునం గర్మాచరణుం డగువాఁ డభిమానంబు నొంది కర్మబద్ధుం డై గుణప్రవాహపతితుండును నష్టప్రజ్ఞుండును నై యధోగతిం గూలు ని ట్లగుటం జేసి సాధుజనులకు సర్వప్రకారంబుల నాసురవృత్తి మానం దగు నని వెండియు ని ట్లనియె నంతం బురంజనుం డవ్వనంబున. 772

క. వరచిత్రపక్షునిశిత,శరములచే శశ వరాహ చమరీ రురు కా
సర గవయ శల్య హరిణీ, కరి హరి వృక పుండరీక కపి ఖడ్గములన్. 773

వ. వధియించి మఱియును. 774

సీ. వరుస మేధ్యామేధ్యవనమృగంబుల[2]ఘృణ, నన దుస్సహక్రీడ సంహరించి
శ్రమయుక్తుఁ డై వేఁట సాలించి మరలి మం,దిరమున కర్థి నేతెంచి యందు
సముచితస్నానభోజనకృత్యములు దీర్చి, యతివిశ్రమమున శయానుఁడగుచుఁ
బరిమళమిళితధూపవ్రాతవాసిత,సర్వాంగుఁ డగుచు స్రక్చందనములు

తే. వివిధభూషణచేలముల్ వెలయఁ దాల్చి
తనమనోహారియందుఁ జిత్తంబు వెట్టి
తుష్టుఁడును హృష్టుఁడుఁ మఱి ధృష్టుఁ డై య
నన్యజాకృష్టచిత్తుండు నై రతిప్ర
సంగకౌతుక మాత్మను దొంగలింప. 775

వ. అంత స్వకీయప్రాణవల్లభ యగుమహిషియందు మనంబు నునిచిన నావరారోహయు గృహమేధినియు నయినగృహిణిం గానక విమనస్కుం డై నిజాంతఃపురకామినులం గనుంగొని యి ట్లనియె. 776

క. రామాజనసంఘములా,రా మానవతీలలామ రామామణి నా
రామకృప వడసి మెలఁగుదు,రా మానుగఁ గుశలమా పరామర్శింపన్. 777

ఉ. సారవివేకలార గృహసంపద [3]లీయెడఁ బూర్వరీతిచే

---

1 'గాదయిననుప్రఖ్యాతతీర్థదివసంబులయందే' వ్రా. ప్ర. 2. గృహాజనదుస్సహ. 3 లందుఁ బురాతనక్రియన్

నారయఁ గా రుచింపవు గృహస్థునకుం గృహమందు మాత గా
నీ రమణానుకూలరమణీమణి యై తన రారుభార్య గా
నీ రుచి నొంద కున్నఁ గన నేర్చునె తద్గృహమేధిసౌఖ్యముల్. 778

వ. అదియునుం గాక. 779

క. పొగ డొందుజనని గానీ, తగవున వర్తించునట్టిదయితయు గానీ
తగ నుండనిగృహమున నుం, టగుఁ జక్రవిహీనరథమునం దుం టరయన్.

వ. కావున. 781

చ. తలకొని నాకుఁ దాను సుపథంబునఁ బ్రజ్ఞ జనింపఁ జేసి సం
చలదురుదుర్భరవ్యసనసాగరమగ్నుఁడ నైననన్ను ని
శ్చలమతి నుద్ధరించి యనిశంబును మత్ప్రియ యైనభార్య యే
వలనఁ జరించుచున్న దనివారణ నా కెఱిఁగింపరే దయన్. 782

క. అనవుడు విని యక్కాంతలు, జనపతి కిట్లనిరి రాజసత్తమ యిదిగోఁ
దనకొంగై నను బఱువుగ, నొనరింపక నేలఁ బొరలుచున్నది వగలన్. 783

తే. ఏమికతమున నున్నదో యెఱుఁగ మేము, నీవు సూడు మటన్న నాభూవరుండు
నేలఁబడి పొరలెడుభార్యఁ బోలఁజూచి, మనములో దుఃఖతాపంబు మల్లడింప.

వ. అంత. 785

ఆ. జలజనేత్ర ప్రణయసంజాతరోషభా, వమున నయినయట్టివక్రదృష్టి
జనవిభుండు సూచి యనునయకోవిదుఁ, డగుచు నప్పయోజహస్తిఁ జేరి. 786

క. పొలఁతుకఁ దనయుత్సంగం, బుల నిడి తత్పాదయుగళము సంటుచు మం
జులమృదుభాషణముల నా, లలనామణిఁ జూచి పలికె లాలన మొప్పన్. 787

చ. రమణిరొ భృత్యులందు నపరాధము గల్గిన నాయకుల్ స్వప
క్షముఁ దలపోసి యుగ్రతరశాసనముం దెగి చేయ రట్లు గా
క మనములోనికిన్కఁ దమకంబున నాజ్ఞ యొనర్చి రేని ని
క్కముగ ననుగ్రహించుటయ కాక తలంపఁగ నాజ్ఞ సేయుటే. 788

క. కమలానన బాంధవకృ, త్యముఁ దలఁపక రోషచిత్తుఁ డగుకుటిలాత్ముం
డమదామస్తుఁడు నీతి, క్రమరహితుఁడు నైనబాలుఁ గా నెన్నఁ దగున్. 789

వ. అని వెండియు నిట్లనియె సుదతీ హృదయేశ్వరి వైననీవు. 790

మ. సరసోదారసుధారసోపమవచశ్చాతుర్యసౌభాగ్య వై
హరినీలోపమకోమలాలకయుతం బై విభ్రమభ్రూలతా
పరిజుష్టస్మితసద్విలోకనము నై భాసిల్లుయుష్మన్ముఖాం
బురుహంబుం భవదీయదాసునకుఁ బూఁబోఁడీ కృపం జూపవే. 791

క. ఏను వీరపత్ని నీయెడ, ననయంబును బ్రాహ్మణులును హరిభక్తులుఁ ద

క్కను నితరు లెగ్గు సేసిన, వనితా శిక్షింతు నెంతవారల నయినన్. 792
క. ఈముల్లోకములందును, నామనమున రోష మొదవినన్ భయరహితుం
డై మదిలోఁ బరితోషము,తో మెలఁగెడువానిఁ గానఁ దోయజనేత్రా. 793
సీ. ఇందీవరేక్షణ గా నెందు భవదీయ,తిలకవిరహితము మలినయుతము
హర్షశూన్యంబు మనోప్రకాశకము నై, యత్యమర్షయుతంబు నయినముఖము
గళితాశ్రుబిందుసంకలితసంచితశోభ,మానపీన స్తనమండలమును
రమణీయతాంబూలరాగవిహీన మై,నట్టిసుపక్వబింబాధరంబు
తే. గాఁగ నిట్లుంట కిపు డేమికతము నాకు, నర్థి నెఱిఁగింపవే మృగవ్యసనమంది
యబల నీ కెఱిఁగింపక యరిగినట్టి,తప్పు సైరించి కావంగఁ దగుదు నేను.
క. వనితాజనపరవశుఁ డై, మనసిజశరబాధ్యమానమానసుఁ డగువా
నిని దగఁ గర్తవ్యార్థము,లను భజియింపక తొలంగులలనలు గలరే. 795
వ. అనుచుం దదీయవిభ్రమవశంగతుం డై పలికిన విని. 796
క. కంజాతపత్త్రనేత్రపు,రంజను దెస రోష ముడిగి రమణీయశ్రీ
మంజులమృదూక్తుల మనము, రంజించుచుఁ బలికె సదనురాగ మెలర్పన్.
వ. అంత. 798
సీ. అమ్మహాదేవి నెయ్యంబున మంగళ,స్నాత యై మృదులవస్త్రంబు గట్టి
స్రక్చందనాదిభూషణములు ధరియించి, కమనీయమోహనాకార యగుచుఁ
బతికడ నిలిచిన నతఁడు సంతుష్టాంత,రంగుఁ డై యభ్యంతరమున నుండి
యన్యోన్యసరసగాఢాలింగనంబులు, గావించి గోప్యవాక్యములచేత
తే. నతఁడు ప్రమదాపరిగ్రహవ్యసనమునను
గడఁక నపకృష్టఘనవివేకంబు గలిగి
పగలు రే యని ప్రొద్దు లేర్పఱుప రాక
మొనసి యాయుర్వ్యయంబు దా నెఱుఁగఁ డయ్యె. 799
వ. మఱియు నతం డున్నద్ధమదుండును మహామనుండును సర్వాశయ్యాశయానుం డును మహిషీభుజోపధానుండును నై యజ్ఞానాభిభూతుం డగుటం జేసి స్వరూప భూతపరమపురుషార్థంబు నెఱుంగక నిజమహిషియె పరమపురుషార్థంబు గాఁ దలంచుచు రమించుచుం గామకశ్మలచిత్తుం డైన నతనికి నవయౌవనం బైన కాలంబు క్షణార్థంబునుంబోలె గతం బయ్యె నంత. 800
క. విశదయశోజలనిధి యా, శశిముఖి యగుభార్యవలన సమ్మతి నేకా
దశశతపుత్త్రుల రణక,ర్కశదేహులఁ గాంచి కౌతుకంబున మఱియున్. 801
క. గురుశీలౌదార్యగుణో, త్తరలను సల్లలితగుణకదంబలఁ బ్రియలన్
వరకులపావనల దశో, త్తరశతదుహితలను గాంచెఁ దత్సతివలనన్. 802
వ. ఇట్లు పుత్త్రపుత్త్రికాజనంబులం గని యున్నంత. 803

క. విను మాతనియాయువులో, నను నర్థం బరిగె నంత । నరపతికులవ
ర్ధను లగుసుతులకుఁ బరిణయ, మొనరించెఁ సదృశ లయిన । యువిదలతోడన్.

క. నరనాథుఁ డాఁడుబిడ్డల, వరరూపవయోవిలాస । వైభవములచేఁ
బరఁగిననిజతనయసదృశ, వరులకు సంప్రీతితో వి । వాహము చేసెన్. 805

వ. అట్లు వివాహంబులు గావించి యున్నసమయంబున. 806

క. విను తత్సుతు లొక్కొకనికి, ననయముఁ బాంచాలదేశ । మందులఁ బౌరం
జనకులవర్ధను లగుచుఁ, జనియించిరి నూర్వు రేసి । శౌర్యబలాఢ్యుల్. 807

ఆ. అనఘ యట్టిరిక్థహారులు గేహకో, శానుజీవయుతులు । నయినయట్టి
నందనాదులందుఁ । జెందినమమత ని, బద్ధుఁ డయ్యె నంతఁ । బార్థివుండు. 808

చ. తిర మగునిష్ఠతో నతఁడు । దీక్షితుఁ డై పశుమారకంబులు
న్నరిది భయంకరంబులును । నైనమఖంబులఁ బెక్కు సేసి యా
దరమున నీవునుంబలెను । దత్తదనూనఫలాప్తికాముఁ డై
సురపితృభూతసంఘము న । సూయఁ దనర్ప భజించె భూవరా. 809

వ. ఇట్లాత్మహితంబు లైనకర్మంబులయం దనవహితుండును గుణంబాసక్తమానసుండును నై యున్నయతనికి విరోధి యై ప్రియాంగనాజనంబులకు నప్రియం (బగుకాలంబు సంభవించినం) జండవేగవిఖ్యాతుం డనుగంధర్వాధీశుండు షష్ట్యుత్తరశతత్రయసంఖ్యాకు లైనగంధర్వులును నంగఅ గంధర్వీజనంబులును (సితాసితవర్ణంబులు గలిగి మిథునీభూతు లగుచు) ననుగమింపం జనుదెంచి (స్వపరిభ్రమణంబుచేతనే సర్వకామంబుల నిర్మితం బగు) నాపురంబు నిరోధించిన నప్పుడా చండవేగానుచరు లైనగంధర్వులా పురంజనుపురంబు [1]వ్యాకులత్వంబునొందించుచు నపహరింప నుపక్రమించుసమయంబునఁ బురంజనపురాధ్యక్షుం డైనప్రజాగరుం డనువాఁడు వింశత్యుత్తరసప్తశతంబు లైనగంధర్వగంధర్వీజనంబుల నివారించి బలవంతుం డై సంవత్సరశతంబు యుద్ధంబు గావించి యొక్కరుం డయ్యు నప్పెక్కండ్రతో నిట్లు పోరి క్షీణుం డైనం బురంజనుండును దాన నిలిచి తత్పురంబున నల్పసుఖంబు లనుభవించుచుఁ బాంచాలదేశంబులందు నిజపార్షదులచేత నాసీతంబు లైనపదార్థంబుల నొందుచుం గామినిజనసమేతుం డై భయపర్యాలోచనంబు సేయ నేరక రాష్ట్రపురబాంధవసమేతుం డై యార్తి నొంది చింతాక్రాంతుం డై యుండె నంత. 810

క. అనయంబుఁ గాలపుత్రిక, యనునొకకామిని వరేచ్ఛ । నఖిలజగంబుం
దనయంతఁ గలయఁ దిరుగుచుఁ, జని చని యొకనాఁడు రాజస । త్తమ వింటే.

సీ. అనఘాత్మ రాజర్షి । యైనయయాతికు, మారకుం డయినట్టి । పూరుచేత
వరియింపఁగాఁ బడి । వల నొప్ప నతనికి, వర మిచ్చి సౌభాగ్య । వశత నొంది

---

1. 'ఁ బర్యాయంబున విశీర్ణత్వంబు నొందిం' వ్రా. ప్ర.

ప్రఖ్యాతి గనుట దుర్భగ యనుపేరను, బరఁగునకాంత నేపురుషవరుఁడు వరియింపఁడయ్యె నాతరుణియు నొకనాఁడు,గరమొప్ప బ్రహ్మలోకముననుండి

తే. వసుధ కేతెంచి విను బృహద్వ్రతుఁడ నయిన
నన్ను వరియింపఁ గోరి మదనమునఁ గామ
శరవిమోహిత యై వేఁడఁ గరము నేను
సమ్మతింపక యున్న రోషమున నలిగి. 812

వ. ఇట్లను మునీంద్రా మదీయాశావిముఖుండ వై నసీకు నేకత్రావస్థానంబు లేక యుండుం గాక యని శపించి విహతసంకల్ప యై మనుపదేశంబునం జని యవనేశ్వరుండును భయనామకుండును నయినవానిం గదిసి యిట్లనియె. 813

క. అవనీపతి భయనామక, యవనకులాధీశ్వరుండ వగుదునిఁ బతిఁ గాఁ
దవిలి వరింపఁగ వచ్చితి, సవినయముగ వినుము భూతసంకల్పమునన్. 814

వ. కలుగు మత్కామితంబు వృథ గాదు లోకంబున వేదంబులందు దేయగ్రాహ్యరూపంబై నవస్తువు యాచ్యమానం బగుచుండ నెవ్వండేఁ డెవ్వండిందు దీయమానం బగు చుండం గోరం డట్టివీర లిద్దఱును జడస్వభావు లని సత్పురుషులు శోకంబు నొందుదురు గావున నిన్ను భజియించుచున్ననన్నుం గరుణార్ద్రచిత్తుండ వై భరియింపు మిట్టియార్తానుకంపయుఁ బురుషధర్మం బని పలికిన నక్కాలపుత్రిక వచనంబులు విని యవనేశ్వరుండు దేవగుహ్యచికీర్షు వగుదానిం గనుంగొని మందస్మితవదనుం డగుచు ని ట్లనియె. 815

క. విను తరుణి యాచ్యమానం, బనఁ దగునీలోకమందు సత్యాశుభవు స
జ్జనముల కసమ్మతవు నగు,నిను నభినందింప కుండు నెటి నెవ్వారున్. 816

వ. కావున నేను జ్ఞానదృష్టిం జేసి నీకుం బతినిరూపణంబు సేసెద నది యె ట్లనిన మదీయసేనాసాహాయ్యంబు వడసి ప్రజానాశం బొనరించునట్టినీ వవ్యక్తగతి వై కర్మనిర్మితం బైనలోకంబు ననుభవింపు మీ ప్రజ్వారుం డనువాఁడు నాకు సహోదరుండు నీవు మదీయభగినివి మీ రిద్దఱుం గూడి యీలోకంబునందు నవ్యక్తుండును భీమసైనికుండును నై యేను వర్తింతు ననిన నాభయనామకుం డయినయవనేశ్వరునిదిష్టకారు లైనసైనికులు ప్రజ్వారకాలకన్యాయుక్తు లై భూమండలం బెల్లఁ దిరుగుచు నొక్కనాఁ డతివేగంబున భామభోగాఢ్యంబును జరత్పన్నగపాలితంబును నయినపురంజనుపురంబు నావరించి యున్నంత స్వాభిభూతుం డయిన పురుషునకు నిస్సారత్వంబు గలిగించునట్టికాలకన్యక బలాత్కారంబున నాపురంజనుపురంబు ననుభవించె నట్లు కాలకన్యకోపభుజ్యమానం బైనపురంబు సర్వద్వారంబులందును సర్వతోధికంబు గా నయ్యవనులు ప్రవేశించి తత్పురంబు సమస్తంబును బీడింప నిట్లు పురంబు ప్రపీడ్యమానం బగు చుండ నభిమాని యైనపురంజనుండు. 817

సీ. అనఘు డెంతయు మమతాకులచిత్తుఁ డై, బహువిధభూరితాపములఁ బొందె
ఘనకుటుంబియుఁ గాలకన్యోపగూఢుండు, నష్టసంపదుఁడు వినష్టమతియు
విషయాత్మకుండును వినిహతైశ్వర్యుండుఁ, గృపణుండు సాలనకించనుండు
నగుపురంజనుఁడు శోకావిలభావుఁ డై, గంధర్వయవనసంఘములచేత
తే. నోజ సెడి వికలత నొందునైజపురముఁ
దవిలి ప్రతికూలురును ననాదరణయుతులు
నయినపుత్రుల బౌత్రుల ననుచరులను
సచివపౌరోహితుల నిజసతిని జూచి. 818

వ. మఱియుం గాలకన్యాగ్రస్తుం డయినతన్నును నరిదూషితంబు లైనపాంచాలబలంబులనుం జూచి యపారచింత నొంది తత్ప్రతీకారంబు సేయ నెఱుంగక కాలకన్యాపహృతవీర్యంబు లయినం గామంబుల నభిలషించుచు దీనుండును విగతాత్మగతికుండును స్నేహంబునం జేసి పుత్రదారోపలాలనపరుండును నై కాలకన్యోపమర్దితంబును గంధర్వయవనాక్రాంతంబును నైనపురంబు విడువ నిచ్చ లేకయు విడువ నుపక్రమించె నప్పుడు. 819

క. అనఘా భయనామాగ్రజుఁ, డనఁ గల ప్రజ్వారుఁ డపుడ యరుదెంచి పురం
బును సకలంబును భయనా,మునికిం బ్రీతిగ దహించె మునుకొని యంతన్.

వ. అట్లు పురంబు దహ్యమానం బగుచుండఁ బౌరభృత్యవర్గాదిసమన్వితుండును గౌటుంబికుండును బుత్రాదిసమన్వితుండును యవనోపరుద్ధాలయుండును గాలకన్యాగ్రస్తుండును నయినపురంజనుం డప్పురంబునందుఁ బ్రజ్వారసంస్పృష్టుం డై యనుతాపంబు నొంది తత్పురపాలనంబునందు సమర్థుండు గాక పురుకృచ్ఛ్రగువేపథుం డయి యం దుండ నశక్తుం డయ్యె నంత. 821

క. దవశిఖియుతతరుకోటర,నివసితపన్నగముపగిది నిజపురి వెడలం
దివురుచు నతఁడు శిథిలదవ,యవుఁడును గంధర్వగణవిహతశౌర్యుండున్. 822

సీ. అయిచాల ఘురఘురమనుశబ్ద మడరంగ, మనమునఁ జింతానిమగ్నుఁ డగుచుఁ
గొడుకులఁ గోడండ్రఁ గూఁతుల నల్లుర, మనుమల నాప్తుల ననుచరాళి
ననయంబు నల్పమాత్రావశిష్టం బైన, గృహకోశనివహపరిచ్ఛదముల
మసలునహంకారమమకారములఁ జేసి, మతిహీనుఁ డగుచు నెమ్మనములోనఁ
తే. గడఁకఁ దలఁచుచు విప్రయోగమునఁ దాను, గటకటా యిట్లు నరలోకగతుఁడ నైన
యిట్టిభార్య యనాథ యైకొ యీకుమార,వరుల నేరీతిఁ బ్రోచునో యరసి యనుచు. 824

వ. మఱియు ని ట్లని తలంచు.

సీ. పడఁతి యే మును భుజింపక భుజింపదు నేను, నిద్రవోవక మఱి నిద్రవోదు
నేను నీళ్లాడక నీళ్లాడ నొల్లదు, పదరి యేఁ గోపింప భయము నొందు
భర్జించినను మాఱు పలుకక వా యోదు, బుద్ధిహీనుఁడ నైన బుద్ధి సెప్పు

లలి మీఱ నిట్టికళత్రంబుతో నేను, గడఁగి దేహాంతరగతుండ నైన
తే. ననయమును దాను బుత్రిణి యగుటఁ జేసి
యాత్మశోచిని యగుచు గృహస్థధర్మ
మాచరించుచు నుండునో యనుగమనము
సేయునో యని మనమునఁ జింత నొంది. 825

క. తనపుత్రులు దత్తనయులు, ననయముఁ దాఁ జనినయెడ నిరాశ్రయు లగుచున్
వననిధిమధ్యంబున నవి,సినకలముంబోలె నెట్లు జీవించెదరో. 826

క. అని యివ్విధమునఁ గృపణుని,యనువున ఘనదుఃఖవిహ్వలానర్వాం డ
య్యును దుఃఖించుపురంజను, ననయముఁ గొనిపోవ నిశ్చితాత్ముం డగుచున్.

క. చనుదెంచెను భయనాముం, డనువాఁ డప్పుడు పురంజనాఖ్యుఁడు పెలుచన్
వినుతాత్మ పశువుభంగిని, మనము గలఁగ యవననీయమానుం డయ్యెన్. 828

వ. అనుచరవర్గంబు భృశాతురులును దుఃఖితులు నై వెనుచను చుండ నుపరుద్ధం బగుభుజంగమం బప్పురంబు నెపుడు వాసె నప్పు డాపురంబు పురంజనుం బాసి విశీర్ణంబై ప్రకృతిం బొందె బలవంతుం డయినయవనునిచేత బలాత్కారంబున వికృష్యమాణుం డైనపురంజనుండు దమఃపిహితుం డై పూర్వసుహృత్తగు సఖు నీశ్వరు నెఱుంగ కుండె నంతం బరలోకగతుం డైనపురంజనుం గదిసి పూర్వంబున నదయుం డైనయతనిచేత హింసింపం బడినయజ్ఞపశువులు క్రోధోద్రేకంబునఁ గుఠారంబుల నతని నఱకె నివ్విధంబునఁ బ్రమదాసంగదోషదూషితుండును నపారతమోనిమగ్నుండును నష్టజ్ఞానుండును నయి పురంజనుం డనేక కాలంబు పరలోకంబున నార్తి ననుభవించి తద్భార్య యైనప్రమదోత్తమం జిత్తంబున నశ్రాంతంబును దలంచు చుండం దదీయసంస్మరణంబునం జేసి తరువాతిజన్మంబున విదర్భరాజగృహంబునం బ్రమదోత్తమ యై జన్మించె నంత.

సీ. అవనీశ వీర్యపణాత్త యైనట్టివై,దర్భిని మలయకేతనుఁ డనంగఁ
బరపురంజయుఁ డైనపాండ్యభూమీశుండు, దారుణసంగరస్థలమునందు
శక్తి ననేకరాజన్యుల నిర్జించి, పరిణయం బయ్యె నాగురుభుజుండు
నావిదర్భాత్మజయం దసితేక్షణ, యైనకూఁతును ద్రవిడాధినాథు

తే. లైనకొడుకుల నేడ్వుర నర్థిఁ గనియె, వారలకు నెల్ల నొక్కొక్కవరుస నర్బు
దార్బుదసుతులు సంజాతులైరి యతని,సుత ధృతవ్రత నాయగస్త్యుఁడువరించె.

క. అతఁ డాకన్యకవలనను, జతురుం డై యిధ్మవాహజనకుఁ డగుదృఢ
చ్యుతుఁ డనుమునీంద్రుఁ గనియెను,మతి నంతవిరక్తుఁడగుచుమలయధ్వజుఁడున్.

తే. క్ష్మాతలం బెల్ల నిజతనూజాతులకును, బంచి యిచ్చి సరోజాక్షపాదపంక
జార్చనాయత్తుఁ డగుచుఁ గులాద్రికరుగ,నంత మదిరాక్షి సతియగునావిదర్భి.

తే. కడఁక గృహములు నఖిలభోగములు విడిచి
చంద్రు వెనుచను చంద్రికచందమునను
భక్తి దళుకొత్తఁ బాండ్యభూపాలుఁ డయిన
మలయకేతను వెనుకొని మగువ సనియె. 833

వ. ఇట్లు ధర్మపత్ని వెంట రాఁ జని యందుఁ జంద్రమసాతామ్రపర్ణీవటోదక లను నదులపుణ్యజలంబుల సుస్నాతుండయి ప్రక్షాళితబాహ్యాభ్యంతరమలుండును గందమూలఫలబీజపుష్పపర్ణతృణతోయాహారుండు నై కాయకర్శనం బైన తపం బాచరించుచు శీతోష్ణవర్షవాతంబులు క్షుత్పిపాసలుఁ బ్రియాప్రియంబులు సుఖదుఃఖంబులు ననుద్వంద్వంబులు సమదర్శనుండై జయించి తపోవిద్యాయమనియమంబులం జేసి పక్వకషాయుండై బ్రహ్మంబునందు నిజాత్మ ననుసంధించి విజితేంద్రియప్రాణచిత్తుండై స్థాణువుంబోలె దివ్యవర్షశతంబు తపంబు సేసి భగవంతుం డయినవాసుదేవునియందుఁ బ్రీతి వహించుచు నన్యం బెఱుంగక వర్తించుచుఁ దన్ను స్వప్నమందు మ మేదం శిరశ్ఛిన్న మిత్యాది ప్రతీతియందుంబోలె వ్యతిరిక్తునిఁ గా వ్యాపకునిఁ గా నంతఃకరణవృత్తిసాక్షినిం గా నెఱింగి. 834

సీ. సాక్షాత్కృతుండును సర్వేశ్వరుండును, భగవంతుఁడును గృపాపరుఁడు నైన
హరి యనులోకైకగురునిచే నుక్తమై, సర్వతోముఖమును స్వప్రకాశి
తము నగుమహితశుద్ధజ్ఞానదీపప్ర,భాతతిచేఁ బరబ్రహ్మమందుఁ
దన్నును దనయందుఁ దగఁ బరబ్రహ్మంబు, నెనయఁగఁ గనుచు దగ్ధేంధనాగ్ని

తే. భంగి నీషణములఁ బెడఁబాసి భూరి,వ్యసనసాగరసంసృతివలనఁ జాల
నుపరతుండయ్యె నామహీశోన్నతుండు, నవనినాయక విను మప్పుడతనిభార్య.

క. పతివ్రత శీలసమం,చిత వేణీభూతచికుర చీరాంబర సు
వ్రతచర్యాక్షామాంగి వి,గతదోష విదర్భరాజకన్యక యచటన్. 836

తే. కమలలోచన నిఖిలభోగములఁ దొఱఁగి, మలయకేతనుఁ బరమధర్మజ్ఞుఁ జేరి
నిరుపమైకపతివ్రతానియమ మొప్ప, సాధ్వియై భక్తిఁ బరిచర్యసలుపుచుండె.

క. విమలమతి నిజేశుసమీ,పమునన్ సతి ధూమరహిత[1]పవమానసఖా
గ్రమున వెలుఁగొందుకీలవి,ధమునఁ బ్రకాశించుచుండెఁ దద్దయు వేడ్కన్.

క. సతి దనప్రాణేశ్వరుఁ డుప,రతుఁ డగుట మనంబులో [2]నరయకయు పూర్వ
స్థితి నుపచారక్రియ లం,చితమతిఁ గావింపఁ గలఁచి చిరతరభక్తిన్. 839

క. అనుపమసుస్థిరనియమా,సనుఁ డగునిజనాథు డాయఁ జని పూర్వగతిన్
వినమిత యై సతి తత్పద,వనజము లర్చించునపుడు వరుపాదములన్. 840

క. విను మూష్మత లేకున్నను, గని యూథభ్రష్టహరిణికైవడి సతి నె
మ్మనమున బెగడుచు దీనత, ననయంబును బంధురహిత యై శోకించెన్. 841

1 'వహ్నిపురోభాగమున. 2 నెఱుఁగకయు.' వ్రా. ప్ర.

చ. అనయము నిట్లు శోకవిపులాశ్రుపయఃకణసిక్తమానిత
స్తనయుగ యై వియోగపరితాపమునన్ హృదయంబు మాఁడ శో
భనలలితాధరోష్ఠనవపద్మము గందఁగ సుస్వరంబు గా
వనజదళాక్షి యేడ్చె ననివారణఁ దద్విపినాంతరంబునన్. 842

ఉ. హా నరనాథ హా సుమహితాత్మక హా గుణశాలి యింక నం
భోనిధిమేఖలాకలితభూతల మెల్లను నుగ్రచోరపీ
డానిరతిం గృశింప నకటా తగు నయ్య యుపేక్ష సేయ శో
భానయశాలి నీవు పరిపాలన సేయుదు లెమ్ము భూవరా. 843

చ. అని విలపించుచున్ సరసిజాక్షి నిజేశపదారవిందముల్
దననిటలంబు సోఁకఁ బరితాపమునం బడి బిట్టు చాల రో
దన మొనరించుచుం గఠినదారువులం జితిఁ బేర్చి యందులోఁ
బెను పగుతత్కళేబరముఁ బెట్టి శిఖిం దరికొల్పి యుమ్ములన్. 844

క. తా ననుగమనము సేయం, బూనుటయును నంతలోనఁ బూర్వసఖుఁడు వి
జ్ఞానస్వరూపకుండును, నైన ధరాదివిజుఁ డొక్కఁ డబలం గనుచున్. 845

క. చను దెంచి యత్తిలోదరి, సునయోక్తుల ననునయించుచుం దగ ననియెన్
వనితా నీ వెవ్వతె వె,వ్వనిదాన [1]వితం డెవండు వగచెద వేలా. 846

క. అని యడిగి వెండియును ని, ట్లనియెను నీసృష్టిపూర్వమందును నీ వె
వ్వనితోడిసఖ్యసౌఖ్యం, బనయంబు న్ననుభవించి తట్టిసఖుండన్. 847

క. న న్నెఱుఁగు దేని మనమున, న న్నెఱుఁగక యున్న నైన నలినదళాక్షీ
నన్నుఁ బురాతనసఖుఁ గా, నెన్నం గలదాన వైన నెఱుఁగవె చెపుమా. 848

వ. కావున నీవును నేనునుం బూర్వంబునందు మానసనివాసుల మైనహంసల మై
యుండి గృహంబుఁ బాసి సహస్రవత్సరంబులు సఖుల మై వర్తించునంత నీవు
నన్నుం బాసి భామభోగరతుండ వై మనంబున నివాసంబు నిచ్ఛయించుచు మ
హీమండలంబు గలయం గ్రుమ్మరు నప్పు డొక్కకామినీనిర్మితంబుం బంచారామం
బు నవద్వారసమేతంబు నేకపాలకంబుఁ ద్రికోష్ఠంబు షట్కులంబుఁ బంచవిప
ణంబుఁ బంచప్రకృతియు స్త్రీనాయకంబు నైనయొక్కపురంబు వొడగంటి వది
యెట్టి దనినం బంచారామంబు లనం బంచేంద్రియార్థంబులు నవద్వారంబు లన
నాసికాదిద్వారంబు లేకపాలకం బనం బ్రాణపాలనంబు త్రికోష్ఠంబు లనం దేజో
భిన్నంబులు షట్కులంబు లన నింద్రియసంగ్రహంబు విపణంబు లనం గర్మేంద్రి
యంబులు పంచప్రకృతి యనం బంచభూతంబులు ప్రకృతి యను కామిని యన
బుద్ధి యిట్టిపురంబునకుం బ్రవిష్టుం డైనపురుషుం డంగనాపరతంత్రుఁడు నజ్ఞుండు
నైననీవ యప్పురంబునం గామినీసంస్పృష్టుండ వై రమియించుచుఁ దత్సంగమం

1 వు నిట్లు పడినవాఁ డెవ్వఁ డిలన్.

బున నష్టస్మృతి వై వైదర్భీజనసంభావితసుఖాభాసంబు లగుదుఃఖంబులచే నిట్టి పాపిష్ఠం బైనదశం బొందితివి గావున. 849

సీ. నీవు వైదర్భివి కా గావు వీరుఁ డితండు, వివరింపఁగాఁ గాఁడు కా విభుఁడు నీకు నొగి మున్ను పురమున కా నుపరుద్ధుఁ జేసిన,యాపురంజనపతి కా వరయఁ గావు [1]మఱియు నీ వన్యసీమంతిని యనియును, జర్చింపఁగాఁ బూర్వకాజన్మమందుఁ బురుషుండ వనియును కా బుద్ధిఁ దలంచుట, యరయంగ నీయుభయము నసత్య

తే. మింతయును మామకీన మై కా యెసఁగుమాయఁ జేసి కల్పిత మయ్యెఁ జర్చింప మనము పూర్వమున హంసలమ యని కా పూని తెలుఁగఁ బలికితిఁ దెలియ మనలరూపంబుఁ జూడు. 850

వ. ఏనే నీవు గాని యన్యుండవు గావు నీవే నేఁ గాని యన్యుండం గా నిట్లని యెఱుంగుము విద్వాంసులు మనయిద్దఱయందు నంతరంబు నీక్షింపరు పురుషుండు దను నొక్కనినె యాదర్శచక్షువులందు భిన్నరూపునిం గాఁ దలంచు చందంబున మనయిద్దఱికిని భేదంబు గలిగినయట్లు తోఁచు నని యివ్విధంబున నతం డతనిచేత నీవు పూర్వంబున మదీయసఖుండ వైనహంస వని తెలుపంబడి స్వస్థుం డై తద్వియోగనష్టం బైనజ్ఞానంబు గ్రమ్మఱం బొందె నని చెప్పి నారదుండు ప్రాచీనబర్హిం జూచి యీయధ్యాత్మతత్త్వంబు రాజకథామిషంబున నీకు నెఱింగించితి ననిన. 851

క. విని భూమీశుఁడు నారద,ముని కను భవదీయవచనములు సూరులు దక్కను గర్మమోహితుల మై, వనరెడు నే మెట్లు దెలియువారము చెపుమా.

వ. అనిన యోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె నరేంద్రా యేమికతంబున నాత్మచేత నేకద్విత్రిచతుష్పాదంబును బహుపాదంబును నపాదంబు నగుచుఁ బురంజను దేహంబు ప్రకటం బగు చుండు నాకతంబునం బురంజనుండు పురుషుం డయ్యె నట్టిపురుషునకు నామక్రియాగుణంబుల విజ్ఞాయమానుండు గా కుండుటం జేసి యవిజ్ఞాతశబ్దంబునం జెప్పంబడుసఖుం డీశ్వరుండు పురుషుండు సాకల్యంబునం జేసి దేహపరిగ్రహంబు సేయ నిచ్ఛయించునప్పుడు నవద్వారకలితంబును ద్విహస్తచరణయుక్తంబును నయినపురం బేది గల దదియ లెస్స యని తలంచి యప్పురం బను దేహంబునందుఁ బురుషుం డింద్రియంబులం జేసి గేబుద్ధి నధిష్ఠించి విషయంబుల ననుభవించు నహంకారమమకారంబులకు నేబుద్ధితత్త్వంబు గారణం బగు నట్టిబుద్ధి ప్రమదోత్తమ యనంబడు దానికి సఖులు జ్ఞానకర్మకారణంబు లైనయింద్రియగుణంబులు సఖీజనంబులు దదీయవృత్తులు పంచముఖోరగం బనం బంచవృత్తి యైనప్రాణంబు నేకాదశమహాభటు లన బృహద్బలుండు నుభ

---

1 నర్థి నీ విపుడు పరాంగన వనియును.

యేంద్రియనాయకుండు నైనమనంబు నవద్వారసమేతం బైనయప్పురంబు చుట్టి వచ్చినపాంచాలదేశంబు లనం బంచవిషయంబులు నవద్వారంబు లన నక్షినాసికాకర్ణముఖగుదశిశ్నంబులు నందు నక్షినాసాస్యంబు లైదునుం బ్రాగ్ద్వారపురస్కృతంబులు దక్షిణోత్తరకర్ణంబులు దక్షిణోత్తరద్వారంబులు గుదశిశ్నంబులు పశ్చిమద్వారంబు లందు [1]నేకస్థలనిర్మితంబు లయినఖద్యోతావిర్ముఖులు నేత్రంబులు విభ్రాజితం బన రూపంబు ద్యుమంతుం డనం జక్షురింద్రియంబు నళినీనాళిను లన నాసికాద్వారంబులు సౌరభం బన గంధంబు నవధూత యన ఘ్రాణేంద్రియంబు ముఖ్య యన నాస్యంబు విపణం బన వాక్కు రసజ్ఞుం డన రసం బాపణం బన వ్యవహారంబు బహూదనం బన వివిధాన్నంబు పితృహూ వన దక్షిణకర్ణంబు దేవహూ వన నుత్తరకర్ణంబు చండవేగుం డనం గాలోపలక్షుకం బైనసంవత్సరంబు గంధర్వు లన దివంబులు గంధర్వీజనంబు లన రాత్రులు పరీవర్తనం బన నాయుర్హరణంబు గాలకన్యక యన జర యవనేశ్వరుం డన మృత్యు వతనిసైనికు లన నాధివ్యాధులు ప్రజ్వారుం డనం బ్రాణిహింస యందు శీఘ్రవేగంబు గలిగి శీతోష్ణభేదంబులం ద్వివిధం బైనజ్వరంబు దక్షిణపాంచాలం బనం బితృలోకప్రాపకంబును బ్రవృత్తిరూపకంబును నైనశాస్త్రం బుత్తరపాంచాలం బన దేవలోకప్రాపకంబును నివృత్తిసంజ్ఞికంబు నయినశాస్త్రంబు శ్రుతధరుం డన శ్రోత్రంబు నాసురీనామకం బనం బశ్చాద్ద్వారం బైనమేఢ్రంబు గ్రామకం బన సురతసుఖంబు దుర్మదుం డన గుహ్యేంద్రియంబు నిరృతినామకం బైనపశ్చిమద్వారం బన గుదంబు వైశసం బన నరకంబు లుబ్ధకుం డనం బాయువు సంధు లన హస్తపాదంబు లంతఃపురం బన హృదయంబు విషూచి యన మనం బని వెండియు ని ట్లనియె. 853

సీ. అనఘాత్మ వినుము జాయాత్మజు [2]ననుగుణా, త్మం బగు మతి బుద్ధితత్త్వ మద్ధి
వెలయ నేగతిని [3]వికృతి సేయంబడు, నేతెఱంగుల నింద్రియములు
వికసించు నాయాయివిధమునఁ దద్గుణా, న్వితుఁడును వరుసఁ దద్వృత్తులకును
ఘనుఁడు నుపద్రష్టయును దగునాత్మయుఁ, దద్వృత్తులును బలాత్కారమునను

తే. ననుకరింపంగ నర్థిఁ జేయంగఁ బడుట
ననయమును నాత్మమహిషిని ననుసరించు
టయు నెఱుఁగఁ జెప్పి యిట్టు లనియెను మఱియు
జనవరేణ్యునితో యోగిసత్తముండు. 854

వ. మఱియు నరదం బన దేహంబు దురంగంబు లన నింద్రియంబు లీషాద్వయం బన సంవత్సరంబునుం దత్కృతవయస్సును జక్రద్వయం బనం బుణ్యాపాపకర్మ

1 'నేకత్రనిర్మితం' వ్రా. ప్ర. 2 'లన గుణత్రయ మగు మతి బుద్ధి. 3 వివరింపఁగాఁబడు' వ్రా. ప్ర. 4 'వికృతిని బొందు నావిధము' అ. ప్ర.

ద్వయంబు వేణుత్రయం బన గుణత్రయంబు పంచబంధురం బనం బంచప్రాణం
బులు రశ్మి యన మనంబు సారథి యన బుద్ధి రథికోపవేశస్థానం బన హృదయం
బు గూబరంబు లన శోకమోహంబులు పంచప్రహరణంబు లనం బంచేంద్రియా
ర్థప్రక్షేపంబు పంచవిక్రమం బనం గర్మేంద్రియంబులు సప్తవరూథంబు లన
ధాతువులు హేమోపస్కరం బన రజోగుణం బక్షయతూణీరం బన ననంత
వాసనాహంకారోపాధి యేకాదశచమూపతి యన నేకాదశేంద్రియం బైనమనం
బాసురీవృత్తి యనం బాహ్యవిక్రమంబు పంచేంద్రియంబులచేత మృగయావినో
దంబు[1] చందంబున హింసాదులం జేసి పంచవిషయంబు లనుభవించుటయ మృ
గయాచరణంబును గా నీప్రకారంబున నుండ జీవుండు దేహంబున స్వప్నసుషు
ప్తిజాగ్రదవస్థలయందు నాధ్యాత్మికాధిదైవికాధిభౌతికంబు లైనబహువిధదుః
ఖంబులం జేసి క్లేశంబుల ననుభవించుచు నజ్ఞానావృతుం డయి వర్షశతంబు నిర్గు
ణుం డయ్యును బ్రాణేంద్రియమనోధర్మంబులం దనయందు నధ్యవసించి కామల
వంబుల ధ్యానంబు సేయుచు నహంకారమమకారసహితంబు గాఁ గర్మాచరణం
బు సేయు చుండు. 855

క. పురుషుఁడు నిజప్రకాశతఁ, బరఁగియు నలఘుఁడుఁ బరుండు భగవంతుండుం
గురుఁడును నగునయ్యాత్మను, బరువడి నెఱుఁగంగ లేక ప్రకృతిగుణములన్.

క. విను మెప్పుడు దగులు నప్పుడ, యొనరంగ గుణాభిమానియును గర్మవశుం
డనఁ దగునాపురుషుఁడు దా, ఘన మగుత్రిగుణ్యకర్మకలితుం డగుచున్.

సీ. ధృతి నొప్పుచున్నసాత్త్వికకర్మమునను బ్ర,కాశభూయిష్ఠలోకముల భూరి
రాజసప్రకటకర్మమున దుఃఖోదర్క,లోలక్రియాయాసలోకములను
గైకొని తామసకర్మంబునను దమ,శ్శోకమోహోత్కటలోకములను
[2]బొందుచుఁ బుంస్త్రీనపుంసకమూర్తుల, దేవతిర్యఙ్మర్త్యభావములను

తే. గలుగుఁ గర్మానుగుణములుగాఁగ జగతిఁ, బుట్టి చచ్చుచుఁ గ్రమ్మఱఁబుట్టు చిట్లు
దివిరి కామాశయుం డైనదేహి యొప్పు, చున్నతానతపదముల నొందుచుండు.

వ. అని మఱియు నిట్లనియె. 859

మ. ఎనయన్ క్షుత్పరిపీడఁ గుంది శునకం బింటింటికిం బోవఁ బూ
నినఁ దద్దైవిక మైనదండహతి గానీ కాక చౌర్యాన్న మై
నను గానీ తగఁ బొందుచందమున నెన్నన్ దైవయోగంబు పెం
పున నీజీవుఁడు దాఁ బ్రియాప్రియములం బొందుం ద్రిలోకంబులన్. 860

చ. గొనకొని యట్టిదుఃఖములకుం బ్రతికారము మానవేంద్ర క
ల్గిన విను తత్ప్రతిక్రియ నరకించనవృత్తి జనుండు మస్తకం

1 'న నన్యాయంబునం జేసి' వ్రా. ప్ర. 2 'గడఁక నొందుచుఁ బ్రీలింగస్వరూపములను' వ్రా. ప్ర.

బాన నిడుమోపు మూఁపునను బూనినఁ దద్భరదుఃఖ మాత్మఁ బా
యనిగతి జీవుఁడుం ద్రివిధమై తగుదుఃఖముఁ బాయఁ డెన్నఁడున్. 861

క. ఘనదుఃఖహేతుకర్మం,బును దత్ప్రతికారకర్మమును నన మాయా
జననము లగుటను బురుషుఁడు, గనుఁ గలలోఁ దోఁచినట్టికలచందమునన్.

వ. సవాసనోచ్ఛేదకంబు గా దని వెండియు ని ట్లనియె. 863

సీ. నరనాథ వినుము స్వప్నంబుచందంబున, నజ్ఞానవిలసితం బగుటఁ జేసి
తివిరి మిథ్యాభూతదేహాదికమునకు, నరయ నివర్తనాశయాస మేటి
కని యంటి వేనియు నర్థంబు లేకున్న, నర్థి సోపాధికం బైనమనము
వాంఛతో స్వప్నము వర్తింపఁ బురుషునిఁ, బూని జాగ్రద్బోధచే నుపాధి

తే. చెడక స్వాప్నికసంసృతి విడువనట్లు, తత్త్వవిజ్ఞానమున నవిద్యానివృత్తి
దారదేహాదికనివృత్తి దగుల కున్నఁ, దివుట సంసృతి దా నివర్తింప కుండు.

చ. ఘనపురుషార్థభూత మనఁగాఁ దగు నాత్మకు నేనిమిత్తమై
యొనర ననర్థహేతు వన నూల్కొనుసంసృతి సంభవించిన
ట్లనయముఁ దన్నిమిత్తపరిహారక మర్థి జగద్గురుండు నాఁ
దనరినవాసుదేవపదతామరసస్ఫుటభక్తి యారయన్. 865

క. పూనినతద్భక్తి సమీ,చీనగతిం దెలియ ననఘ చిరవైరాగ్య
జ్ఞానకరం బగుభక్తిని, దానము గోవింద వరకథాశ్రయము యగున్. 866

వ. కావున నది తత్కథాకర్ణనగాననిరతుండు విశ్వాసనంయుక్తుండు నైనవానికి
సంభవించు మఱియును. 867

క. ధర సాధులు విమలాంతః,కరణులు భగవద్గుణానుకథనశ్రవణ
స్ఫురితస్వాంతులు ననఘులు, [1]వరధిషణులు నైనభాగవతజనులసభన్. 868

క. సరసోదారమహత్త్వము,ఖరితము లగుమధువిరోధికమనీయగుణో
త్కరసురుచిరచరితామృత,పరిపూరితవాహినులను బరమప్రీతిన్. 869

క. మన మలరఁగ శ్రోత్రాంజలు,లను బానము సేయుపుణ్యులకు క్షుత్తృష్ణా
ఘనభయశోకవిమోహము, లనయంబును సోఁక కుండు నవనీనాథా. 870

వ. కావున నిట్టిభాగవతసహవాసంబు లేక యున్నఁ (దనంతన భగవద్భాగవతగుణాభి
వర్ణనకథానుచింతనాదులయందుం బ్రవర్తించిన) నాలస్యాదిదోషంబు లొంది
యాజీవలోకంబు సహజక్షుదాదికంబున నుపద్రుతం బై సర్వేశ్వరకథామృత
వాహినియందు రతిం జేయ దిది నిశ్చితం బని మఱియు ని ట్లనియె. 871

సీ. పద్మసంభవుఁడును భవుఁడును మనుకుల,సమితి దక్షాదిప్రజాపతులును
నైష్ఠికులైన సనకాదికముఖ్యమునులుఁ బు,లస్త్యుండు భృగువుఁ బులహుఁడుఁ గ్రతువు
నత్రి మరీచియు నంగిరసుండు న,రుంధతీవిభుఁడును రూఢి మెఱయ

---

1 వరమతులు న్నయనభాగవతనిలయములన్.

బహుపుణ్యులే కడపలఁ గాంగఁ గల బ్రహ్మవాదులు నందఱు వాక్కులకును
తే. నెనయ నీశ్వరులై యుండియును సమగ్రమతిఁ దపోయోగవిద్యాసమాధివరవి
చారులై యుండియును సర్వసాక్షి యైన యీశ్వరుని వెదకియుఁ గానరిద్ధచరిత.
వ. అది యెట్లంటేని. 873
మ. ఘనవిస్తార మపార మద్వయ మనంగా నొప్పునీ వేదము
న్ననువర్తించుచు మంత్రయుక్తి వివిధం బైనట్టి దేవాఖ్యశో
భనసామర్థ్యముచేత నింద్రముఖరూపం బిష్టదైవంబు గాఁ
గని వేడ్కన్ భజియించువారలు గనంగా నేర్తురే యీశ్వరున్. 874
క. విను మాత్మభావితుం డన, నెనసిన భగవంతుఁ డెప్పు డెవ్వనిఁ గరుణ
న్ననయము ననుగ్రహించును, మనుజేశ్వర యపుడ వాఁడు మహితాత్మకుఁ డై.
క. ధీరత నీలోకవ్యవహారంబును వైదికంబు నన నఁ దగు కర్మా
చారములందు వినిష్ఠిత, మైమూఢిఁ దనర్చుబుద్ధి నర్థిన్ విడుచున్. 876
సీ. కావున రాజేంద్ర నీవును బరమార్థ, [1]రూపంబు లగుచుఁ బ్రరోచమాన
ములును గర్ణప్రియంబులును నై స్పృష్టవ, స్తువులును నై నయీవివిధకర్మ
ములయందుఁ బురుషార్థబుద్ధి గావింపకు, మతిఘనస్వాంతులై నట్టివారు
పరఁగుజనార్దనప్రతిపాదకం బైన, శ్రుతి గర్మపర మని చూపుచుండు
తే. వారు వేదజ్ఞు లనఁ దగువారు గారు, మూఢమతి వారు నిత్యస్వరూపభూత
మైనయీయాత్మతత్త్వంబు నలరు వేద, కలితతాత్పర్యమని యాత్మఁ దెలియలేరు.
వ. కావునం బ్రాగగ్రంబు లైన దర్భలచేత సకలక్షితిమండలాస్తరణంబు గావించి యహంకారయుక్తుండవు నవినీతుండవు నై పెక్కుపశువులఁ జంపనే కాని కర్మస్వరూపంబును విద్యాస్వరూపంబును నెఱుంగ వాకర్మవిద్యాస్వరూపం బెట్టి దనిన సర్వేశ్వరపరితోషకం బేది యదియ కర్మంబు గాన సర్వేశ్వరునియందు నేమిట మతి సంభవించు నదియ విద్య యతండే దేహులకు నాత్మయు నీశ్వరుండు నగుచుండుఁ గావునఁ బురుషులకు క్షేమకరం బైనయాశ్రయంబు తత్పాదమూలంబ యతండు ప్రియతముండును సేవ్యమానుండును నగుచుండ నణుమాత్రం బయిన దుఃఖంబు లే దట్టియాభగవత్స్వరూపం బెవ్వం డెఱుంగును వాఁడు విద్వాంసుండును గురుండును హరియు నని చెప్పి వెండియు నిట్లనియె. 878
క. అవనీశ యీవిధంబున, భవదీయప్రశ్న మిట్లు పరిహృత మయ్యెం
దవిలి యిఁక నొక్కగోప్యము, వివరించెదఁ జిత్తగింపు విమలచరిత్రా. 879
సీ. లలి సుమనోవాటికలయందుఁ గల్పప్ర, సూనమరందగంధానుమోద
సంచారియును మృగీసహితముఁ దన్నివే, శితచిత్తమును మధువ్రతనినాద
మేదురశ్రవణానుమోదితమును బురో, భాగచరన్నిజప్రాణహారి

---

1 కలితంబు లగుచుఁ బ్రకాశమాన.

దీపితవృకగణాధిష్ఠితమును లుబ్ధకక్రూరఘనసాయకప్రభిన్న
తే. పృష్ఠభాగంబు నై [1]తగనెదను మృత్యుభీతి వాటిల్ల నొందు దప్పింప వెరవు
గాన కడవిఁ జరించుమృగంబుపగిది, భూవరోత్తమ వినవయ్య పురుషుఁ డెపుడు.

వ. అంగనానివాసంబులయందు క్షుద్రతమం బగుకామ్యకర్మపరిపాకజనితం బైన జిహ్వోపస్థాదికామజనితసుఖలేశంబుల నన్వేషించుచుఁ గామినీయుక్తుండును దన్నివేశితమానసుండును సతిమనోహరవాంఛితవనితాజనాలాపశ్రవణతత్పర చిత్తుండును బ్రత్యక్షంబున నాయుర్హరణకారణాహోరాత్రాదికాలవిశేషగణనా పరుండును గాక పరోక్షంబునం గృతాంతశరనిర్భిన్నగాత్రుండును నగుచు నీజీవుండు విహరించుచుండుం గావున నీవు నిజీవుని [2]మృగచేష్టితంబుగా విచారించి శ్రోత్రాదులం దున్న [3]శబ్దాదులంబోలె బాహ్యవృత్తు [4]లగుశ్రౌతస్మార్తాదిరూప కర్మంబులను హృదయంబునందు నియమించుచు సజ్జనయూథవార్తాసహితం బైనగృహాశ్రమంబు విడువుము సకలజీవాశ్రయుం డైనయీశ్వరుని భజియింపు మిట్లు సర్వతోవిరక్తుండవు గ మ్మని నారదుండు వలికినఁ బ్రాచీనబర్హి యిట్లనియె.

క. మునివర భగవంతుండవు, ననుపమవిజ్ఞాననిధివి ననఁ దగునిచే
తను వివరింపంగాఁ దగి, యొనసినయీయాత్మతత్త్వ మిట నాచేతన్. 882

వ. శ్రుతంబును విచారితంబును నయ్యెఁ [5]గర్మనిష్ఠు లగునుపాధ్యాయు లైనవార లీయాత్మతత్త్వంబు నెఱుంగ రెఱింగి రేని నుపదేశింపరు గావునఁ దత్కృతం బయినమహాసంశయంబు నీచేత నివృత్తిం బయ్యె నని వెండియు నిట్లనియె.

సీ. అనఘాత్మ యేమిటియందు నీయింద్రియవృత్తులు దగఁ బ్రవర్తింప కుండు
టనుజేసి ఋషు లైన ఘనముగ మోహంతు, రట్టియర్థమునందు ననాత్మసంశ
యము గల్గుచున్నది యది యెట్టి దనినను, బురుషుఁ డేయే దేహమునను జేసి
కర్మముల్ సేసి తత్కార్యంబు నీలోక,మందునే విడిచి తా నన్యదేహ
తే. మర్థితో ఘటియించి లోకాంతరమునఁ
బొంది తత్కర్మఫలమును బొందు ననుచుఁ
బ్రకటముగ వేదవేత్తలు వలుకుచుందు
రన్న దది యెట్లు విన నుపపన్న మగును. 884

వ. అదియునుం గాక యాచరితం బైనకర్మంబు తత్క్షణంబ వినష్టం బగుటం జేసి దేహాంతరలోకాంతరభావి యైనఫలం బెట్లు సంభవించు ననినఁ బ్రాచీనబర్హికి నారదుం డిట్లనియె నరేంద్రా స్వప్నావస్థయందు లింగశరీరాధిష్ఠాత యైనజీవుండు జాగ్రద్దేహాభిమానంబు విడిచి తాదృశంబ కాని యతాదృశంబ కాని యైనశరీరాంతరంబు నొంది మనంబునందు సంస్కారరూపంబున నాహితం బైనక

1. మనంబునను 2. యొక్కమృగ. 3. నదులంబోలె. 4. లు ధరియించుచు నీచిత్తంబునందు నియ. 5 నిష్ఠోపదేష్ట లైనవారు.

నాచరించు నాలింగశరీరంబున లోకాంతరంబున దేహవిభేదంబు నొందక తత్ఫ
లం బనుభవించు నదియునుం గాక దానప్రతిగ్రహాదులయందు స్థూలదేహంబున
కుం గర్తృత్వంబు గల దంటి వేని నహంకారమమకారయుక్తుం డయినపురుషుండు
మనంబునం జేసి యేయేదేహంబు పరిగ్రహించు నాయాదేహంబువ సిద్ధం బైన
కర్మం బాజీవుం డనుభవించు నట్లు గాకున్నఁ గర్మంబు పునర్భవకారణం బగు
ట యుపపన్నంబు గాకుండుఁ గావున మనఃప్రధానం బైనలింగశరీరంబునకే
కర్తృత్వం బుపపన్నం బగు నని వెండియు ని ట్లనియె. 885

క. క్షితి నుభయేంద్రియకర్మస్థితు లనుభవ మందఁబడినచిత్తముపగిదిన్
ధృతిఁ జిత్తవృత్తులను లక్షిత మగుఁ దత్పూర్వదేహకృతకర్మంబుల్. 886

వ. అది యె ట్లనిన నీదేహంబునం జేసి యేరూపంబు నేప్రకారంబున నెప్పు డెచ్చ
ట నగు నది యననుభూతంబును నదృష్టంబును నశ్రుతంబును నై యుండు నట్టిది
యొకానొకకాలంబున వాసనాశ్రయుం డయినపురుషునకుఁ (దదనుభవాది
యుక్తం బగు) పూర్వదేహంబున ననుభూతంబును దృష్టంబును శ్రుతంబును నని
విశ్వసింపు మీమనంబున ననుభూతార్థంబు గోచరింపఁ జాల దీమనంబె పురు
షులకు శుభాశుభనిమిత్తంబు లైనపూర్వాపరదేహంబులం బ్రకాశింపం జేయు
చుండు నీమనంబునందు నదృష్టంబు నశ్రుతంబు నై నయర్థంబు స్వప్నాదిక
మందుం దోఁచు నంటి వేని నది దేశకాలక్రియాశ్రయం బని తలంపం దగు
నీసమస్తవిషయంబులుఁ గ్రమానురోధంబున మనంబునం జేసి భోగ్యంబు లగు
నని మఱియు ని ట్లనియె. 887

చ. సుమహితశుద్ధసత్త్వగుణశోభితమున్ సరసీరుహోదరో
త్తమగుణచింతనాపరము ధన్యము నైనమనంబునందు భూ
రమణ సుధాంశునందు నుపరాగమునన్ దివిఁ దోఁచురాహుచం
దమునను గోచరం బగు నుదారత నీయఖిలప్రపంచమున్. 888

వ. అని వెండియు ని ట్లనియె లింగదేహమునకుఁ గర్తృత్వభోక్తృత్వంబులు స్థూల
దేహద్వారకంబు లగుటం జేసి స్థూలదేహవినాశంబు గలుగన్ జీవునకుఁ గర్తృ
త్వభోక్తృత్వంబులు లే కుండుటం జేసి ముక్తి గలుగు నంటి వేని నీస్థూలదేహ
సంబంధంబు జీవునియందు బుద్ధిమనోమోహాద్యగుణవ్యూహరూపాదిలింగశరీర
భంగపర్యంతంబు గలుగు చుండును సుషుప్తిమూర్ఛాదులయందు (నిష్టవియో
గాదిదుఃఖమందు) నహంకారంబు గలిగి యుండు నది యింద్రియోపహతిం జేసి
యమావాస్యయందలిచంద్రుండునుంబోలెఁ దరుణపురుషునకు గర్భబాల్యా
వస్థలయందు నింద్రియపౌష్కల్యంబు లేకుండుటం జేసి యేకాదశేంద్రియస్ఫురణ
సమర్థం బైనయహంకారంబు (గర్భాదులకుఁ) బ్రకాశింపనిచందంబునం దోఁప
కుండుఁ గావున స్థూలదేహవిచ్ఛేదకంబు లే కుండుటం జేసి వస్తుభూతార్థంబు లే

కున్న నీసంసారంబు (విషయంబులయందు దాసక్తుం డగుజీవునకు) స్వాప్నికాప
ర్థాగమనంబునుంబోలె నివర్తింప దీతీరునఁ బంచతన్మాత్రాత్మకంబును (త్రిగుణా
త్మకంబును) షోడశవికారయుక్తంబును నయినలింగశరీరంబు నధిష్ఠించి చేతనా
యుక్తుం డైనజీవుం డని చెప్పంబడు మఱియును. 889

సీ. తివిరి యప్పురుషుండు దేహంబునను జేసి, యనయంబుఁ బెక్కు దేహాంతరముల
నంగీకరించుచు నవి విసర్జించుచు, సుఖదుఃఖభయమోహశోకములను
[1]బొలుపొందుతద్దేహములనె పొందుచు నుండు, నది యెట్లు లన్ననురగ భాగ
తృణమూఁదిమఱిపూర్వతృణపరిత్యాగంబు, గావించుతృణజలూకయునుబోలె
ఆ. జీవుఁ డవనిఁ గొంత జీవించి మ్రియమాణుఁ, డగుచు నొందు దేహమర్థిఁ జెంది
కాని పూర్వ మైనకాయంబు విడువఁడు, గాన మనమె జన్మకారణంబు. 890

తరలము. నరవరోత్తమ యట్లు గాన మనంబె జీవుల కెల్ల సం
సరణకారణ మట్టిక ర్మవశంబునన్ సకలేంద్రియా
చరణుఁ డౌట నవిద్య గల్గును సంతతంబు నవిద్యచేఁ
బరఁగుటన్ బహుదేహకర్మనిబంధముల్ గలుగుం జుమీ. 891

చ. విను మది గాన భూవర యవిద్య లయించుట కై రమాపతిన్
ఘనజననస్థితిప్రళయకారణభూతుఁ బయోజపత్త్రలో
చనుఁ బరమేశు నీశ్వరుని సర్వజగంబుఁ దదాత్మకంబు గాఁ
గనుఁగొనుచుం దదీయపదకంజము లర్థి భజింపు మెప్పుడున్. 892

క. అని యీగతి భగవంతుం, డనఘుఁడు ఘనభాగవతుఁడు నగునారదుఁ డా
ఘనునకు జీవేశ్వరగతి, ఘనకృప నెఱిఁగించి సిద్ధగతిఁ జనినయెడన్. 893

సీ. రాజర్షి యైనట్టిప్రాచీనబర్హి దాఁ, దగఁ బ్రజాపాలనార్థంబు సుతుల
ధరకు నియోగించి [2]తపము సేయుటకు నై, కపిలాశ్రమంబున కపుడు వోయి
యచ్చట నియతి నేకాగ్రచిత్తుండును, ముక్తసంగుండును భూరిధైర్య
యుక్తుండు నగుచు సద్భక్తియోగంబున, ననఘ గోవిందపదారవింద
తే. చింతనామృతపానవిశేషచిత్తుఁ, డగుచు విధిరుద్రముఖ్యులకందరాని
యవ్యయానందమయపదమందె ననఘ, యనుచు మైత్రేయముని విదురునకుఁ జెప్పె.

వ. వెండియు ని ట్లనియె ని ట్లు ముకుందయశంబునం జేసి భువనపావనంబు మనశ్శుద్ధి
కరంబు సర్వోత్కృష్టఫలప్రదాయకంబు దేవర్షివర్యముఖవినిస్సృతంబు నైన
యీయధ్యాత్మపారోక్ష్యంబు నెవ్వండు పఠియించు నెవ్వండు విను నట్టివారు
లింగశరీరవిధూననంబు గావించి ముక్తసమస్తబంధు లయి (విదేహకైవల్యంబు
నొంది) సంసారంబునందుఁ బరిభ్రమింప రనిన మైత్రేయునకు విదురుం డి
ట్లనియె. 895

1 'పురుషుండు తదేహ. 2 దాఁ దపోరూపంబుఁ, బూని కపిలాశ్రమమునకు నేఁగి' ప్రా.ప్ర.

క. మునినాథ [1]ప్రచేతసు లా,ఘన మగురుద్రోపదిష్ట|కమలోదరకీ
ర్తనమున నేగతిఁ బొందిరి, వనజాక్షుఁడు సంతసింప | వారనఘాత్మా. 896

ప్రచేతసులతపంబునకు భగవంతుండు మెచ్చి వరంబు లిచ్చుట.

తే. కడఁగి మఱి వారుయాగృచ్ఛి|కమునఁ జేసి,హరికినిత్యప్రియుండగు|హరునిఁగాంచి
[2]యతనివలనియనుగ్రహ|మంది మోక్ష,మందిరని చెప్పితది నిశ్చ|యంబుమఱియు.
క. హరిదర్శనపూర్వం బిహ,పరలోకములందు నానృ|పాలతనయు లం
దఱు నేఫలముల నందిరి, యెఱిఁగింపు మటన్న నమ్ము|నీంద్రుఁడు వలికెన్. 898
క. విను జనకాదేశము ముద,మునఁ దాల్చి నృపాత్మజులు సర|ముద్రోదరమం
దనుపమజపయజ్ఞంబుస, నొనరఁ దపం బూని ముదము|నొందుచు నుండన్.
క. పదివేలేఁడులు నిష్ఠను, వదలక తప మాచరింప|వారల కర్థి
సదయాంతరంగుఁ డభయ,ప్రదుఁడు సనాతనుఁడు నైన|పద్మోదరుఁడున్. 900
క. అనుపమశాంతము లగునిజ,తనురశ్ములచే నృపాల|తనయతపోవే
దనలు శమింపఁగఁ జేయుచు, ననయముఁ బ్రత్యక్షమయ్యె|నచ్యుతుఁడంతన్.
సీ. ఘనమేరుశృంగసం|గతనీలమేఘంబు, నెఱి గరుడస్కంధ|నివసితుండు
గమనీయనిజదేహ|కాంతివిపాటితా,భీలాఖిలాశాంత|రాళతముఁడు
సుమహితాష్టాయుధ|సుమనోమునీశ్వర, సేవకపరిజన|సేవితుండు
మండితకాంచన|కుండలరుచిరోప, లాలితవదనక|పోలతలుఁడు
తే. చారునవరత్నదివ్యకో|టీరధరుఁడు, కౌస్తుభప్రవిలంబమం|గళగళుండు
లలితపీతాంబరప్రభా|లంకృతుండు, హారకేయూరవలయమం|జీరయుతుఁడు.
క. లలితాయతాష్టభుజముం,డలమధ్యస్ఫురితరుచివి|డంబితలక్ష్మీ
లలనాకాంతిస్పర్ధా,కలితలసద్వైజయంతి|కాశోభితుఁడున్. 903
క. సురగరుడయక్షకిన్నర,నిరుపమ జేగీయమాన|నిఖిలాశాసం
భరితయశోమహనీయ,స్ఫురణుం డగునప్పురాణ|పురుషుం డెలమిన్. 904
క. కరుణావలోకనంబుల, నిర వొంద నృపాలసుతుల|నీక్షించి రమా
వరుఁ డంబుదగంభీరమ,ధురభాషలఁ బలికెఁ బ్రియము|దూఁకొనుచుండన్. 905
తే. తాపసోత్తము లగుప్రచే|తసులు వేడ్క, వినుఁడుమీరలు సౌహార్ద|మున నభిన్న
ధర్ములగుట భవత్సౌహృ|దమున కేను, జాలఁ బరితోష మందితి|సమత నేఁడు.
క. అనయమును మీమనోరథ, మొనరింతు నెఱుంగఁ బలుకుఁ|డుత్తము లగుమి
మ్మనుదినము నెవ్వఁడు సుఖశ,యనుఁడై మదిలోనఁ దలఁచు|నానరుఁ డెపుడున్.
క. భ్రాతృజనసౌహృదంబును, భూతదయాగుణము విమల|బుద్ధియు సుజన
ప్రీతియుఁ గల్గి సుఖించును, పీతసమస్తాఘుఁ డగుచుఁ|విశ్వములోనన్. 908

1 ప్రచేతస్కులు; 'ప్రచేతస్కులు' అనియే నారయప్రయోగము. 2 యతనిచే ననుగృహీతులై యందఱు మోక్ష.

వ. మఱియు రుద్రగీతం బయినమదీయస్తవం బెవ్వ రనుదినంబును స్తోత్రంబు సేయుదురు వారల కభిమతవరంబులు శోభనకరం బగుప్రజ్ఞయు నిత్తు మీరలు ముదన్వితు లై జనకాదేశం బంగీకరించుటంజేసి మీకీర్తి లోకంబుల విస్తరిల్లు మీకు ననూన బ్రహ్మగుణుండు నాత్మసంతతింజేసిలోకత్రయపరిపూర్ణగుణాకరుండు నైనపుత్రుండు సంభవింపం గలండు కండుమహామునితపోవినాశార్థంబు గా నింద్రప్రేషిత యగుప్రమ్లోచ యనునప్సరస గర్భంబు దాల్చి యమ్మునీంద్రుని వీడ్కొని దివంబునకుం జనుసమయంబునం బ్రసూత యై తత్పుత్రిని వృక్షంబులందుఁ బెట్టి చనిన. 909

సీ. ఆశిశు వపుడు పేరాఁకలిచేఁ గుంది, వావిచ్చి బిట్టు వాపోవు చుండ
నాలించి యటకు రాజైనసోముఁడు వచ్చి, వల నొప్ప నవసుధావర్షి యైన
యాత్మీయతర్జని నర్థిఁ బానమ్ము సే,యింపంగఁ బెరిఁగి యయ్యిందువదనఁ
గన్య వరారోహఁ గడఁక మారిష యను,చెలువఁ బుత్ర్యుండు ప్రాచీనబర్హి

తే. [1]యన్నృపునిచేఁ బ్రజావిసర్గావసరము
నందు వేడ్కఁ దదాదిష్టు లైనమీర
లందఱును నెయ్యమున వివాహంబు గండ్ర
యని సరోరుహనయనుఁ డి ట్లనియె మఱియు. 910

వ. అనఘాత్ములారా యభిన్నధర్మశీలనాముల రయినమీకు నందఱకు నాసుమధ్య మైనకన్య యభిన్నధర్మశీలయు భవదర్పితాశయయు నయినభార్య యగు మీర లప్రతిహతతేజస్కుల రై దివ్యవర్షసహస్రంబులు భౌమదివ్యభోగంబులు మదనుగ్రహులై యనుభవించెద రంత నాయందులభక్తిం జేసి నిర్మలాంతఃకరణు లై యీభోగంబులు నిరయప్రాయంబులు గాఁ దలంచి మదీయస్థానంబు నొందెద రని వెండియు ని ట్లనియె. 911

చ. అరయ గృహస్థు లయ్యును మదర్పితకర్ములు నస్మదీయసుం
దరచరితామృతశ్రవణతత్పరమానసయాతయాములుం
సరసగుణాఢ్యు లై తనరుసాధుల కీగృహముల్ దలంప దు
ష్కరభవబంధహేతువులు గావు నృపాత్మజులార యెన్నఁడున్. 912

వ. అది యె ట్లంటి రేని. 913

చ. అనుపమబ్రహ్మవాదు లగుసంచితయోగిజనానుగీయమా
ననిజకథాసముత్సుకుఁ డనం దగునేను [2]మదీయులం దనూ
తనముఁ గ నుండుఁ గావున నుదారత వారికి నీగృహావళుల్
ఘనభవబంధహేతువులు గా విది యంతయు నిక్క మారయన్. 914

క. సరసుఁడ నగుననుఁ బొందిన,పురుషులు ఘనశోకమోహమోదంబులఁ బొం

1 'రాజుచేతఁ బ్రజావిసర్గంబునందుఁ, బూని వేడ్క—. 2 దదీయులం.

దరుగావున [1]నెనయఁగను ద్రి,పురుషాధీశ్వరుఁడ బ్రహ్మభూతుఁడ నగుదున్. 915
వ. అని యిట్లు వలుకు చున్నపురుషార్థభాజనుం డగుడనార్దను దర్శించి తద్దర్శనవిధ్వ
స్తరజస్తమోగుణు లయిన ప్రచేతస్కులు. 916
చ. కరసరసీరుహంబు లెసకం బెసఁగ ముకుళించి గద్గద
స్వరములఁ జేసి యిట్లనిరి సర్వశరణ్యు నగణ్యు నిందిరా
వరు నజితు న్ననంతు ననవద్యచరిత్రుఁ బవిత్రు నచ్యుతుం
బరుఁ బరమేశు నీశు భవబంధవిమోచనుఁ బద్మలోచనున్. 917
సీ. కేశవ సంతతక్లేశనాశనుఁడవు, కోరి మనోవాగగోచరుఁడవు
నిగమనోరథహేతుభూ[2]తోదార,గుణనాముఁడవు సత్త్వగుణుఁడ వఖిల
విశ్వోద్భవస్థితివిలయార్థధారిత,విపులమాయాగుణవిగ్రహుఁడవు
మహితాఖిలేంద్రియమార్గనిరధిగత.మార్గుఁడ వతిశాంతమానసుఁడవు
తే. తవిలి సంసార[3]హారిమేధస్కుఁడవును, దేవదేవుఁడవును వాసుదేవుఁడవును
సర్వభూతనివాసివి సర్వసాక్షి, వైననీకు నమస్కార మయ్య కృష్ణ. 918
వ. మఱియును. 919
ఉ. తోయరుహోదరాయ భవదుఃఖహరాయ నమో నమః పరే
శాయ సరోజకేసరపిశంగవినిర్మలదివ్యవస్త్రవ
స్త్రాయ పయోజసన్నిభపదాయ సరోరుహమాలికాయ కృ
ష్ణాయ పరాపరాయ సుగుణాయ సురారిహరాయ వేధసే. 920
వ. అని వినుతించి. 921
చ. కమలదళాక్ష దుఃఖలయకారణమై తగు తావకీనరూ
పము ననివార్యదుర్భరవిపద్గత దుఃఖము నొందువారికి నీ
సుమహితసత్కృపాగరిమఁ జూపుటకంటె ననుగ్రహంబు లో
కమునఁ దలంప నొం డొకటి గల్గునె భక్తఫలప్రదాయకా. 922
ఉ. భూరిశివేతరాపహ విభుత్వసమేత మహార్తదీనర
క్షారతి నొప్పునీవు చిరకాలమునన్ సుఖవృత్తి మీరు మా
వార లటంచు బుద్ధి ననవద్య తలంచినయంతమాత్రన
త్కారమె చాలు నట్లగుట గాకి టు సన్నిధి వైతి మీశ్వరా. 923
చ. అరయఁగ క్షుద్రభూతహృదయంబులయందుల నంతరాత్మవై
తిరముగ నుండునీవు భవదీయపదాంబురుహద్వయార్చనా
పరమతులైన మాకు శుభప్రదభూరిమనోరథంబు లీ
వెఱుఁగవె భక్తలోకహృదయేప్సితదాయక ముక్తినాయకా. 924
సీ. అయినను విను సరోజాయతలోచన, తగుమోక్షమార్గప్రదర్శకుఁడవుఁ

1 నే నింద్రియ,పురు. 2 తాధార. 3 హరణచేతస్కుఁడవును.

బురుషార్థభూతవిశ్రుతుఁడవు నగునీవు, దగిలి ప్రసన్నుఁడ వగుట మాకు
నర్థి మనోభీష్ట మైనవరం బయ్యె, నైనను నాథ పరాపరుండ
వైనని న్నొకవరం బర్థింతు మనినను, భువిఁ దావకీనవిభూతు లెన్న

తే. నంత మెఱుఁగంగ రామి నగనంతుఁ డనుచుఁ
బలుకుదురు నిన్ను నది గాన పరమపురుష
యేవరం బని కోరుదు మేము దప్పి
గొన్న బాలకుఁ డబ్ధినీ ళ్లెన్ని గోలు. 925

వ. అదియునుం గాక. 926

ఉ. పూని భవత్పదాంబురుహమూలనివాసుల మైనమేము మే
ధానిధి నీవిలోకనముఁ దక్కఁగ నన్యముఁ గోర నేర్తు మే
మానితపారిజాతకుసుమస్ఫుటనవ్యమరందగంధశో
భానయశాలి యైనమధుపంబు భజించునె యన్యపుష్పముల్. 927

చ. హరి భవదీయమాయ ననయంబును జెందిననేము నిచ్చలుం
గర మనురక్తి నేటితుదగా భవకష్టుల మై ధరిత్రిపైఁ
దిరుగుదు మంతదాఁక భవదీయజనంబులతోడిసంగతిన్
గురుమతి జన్మజన్మములకున్ సమకూరఁగఁ జేయు మాధవా. 928

మ. కమలాధీశ్వర తావకీనపదభక్తవ్రాతసంసర్గలే
శముతోడన్ సరిగాఁ దలంప మెలమిన్ స్వర్గాపవర్గాదిసౌ
ఖ్యము లన్నన్ విను మానుషంబు లగునీకామంబులం జెప్ప నే
ల మునిప్రస్తుతపాదపద్మ సుజనాలాపానుమోదాత్మకా. 929

వ. మఱియు భగవద్భక్తసంగంబులయందుఁ దృష్ణాప్రశమనంబు లైనమృష్టకథలు
చెప్పఁబడు(టచేత భూతంబుల)యందు వైరంబును లేకుండు నని. 930

చ. వనముల ముక్తసంగు లగువారు నుతింపఁ దనర్తు వీవు గా
వున నిలఁ బుణ్యతీర్థముల [1]నొప్పఁ బునీతము సేయఁ బూని య
ర్థిని బదచారు లై ధరఁ జరించు భవత్పదభక్తసంగమం
బనుపమభూరిసంసృతి భయస్థునిబుద్ధి రుచింప కుండునే. 931

వ. కావున. 932

చ. వనరుహపత్త్రలోచన భవత్సఖుఁ డైనసుధాంశుమౌళితో
డనిమిషమాత్రసంగతిఁ గడింది వ్రణంబును దుశ్చికిత్సము
న్ననుభవకష్టరోగమున క గ్గలి వైద్యుఁడ వైనవిన్ను నే
మనయముఁ జూడఁ గంటిమి కృతార్థుల మై తగ మంటి మీశ్వరా. 933

వ. దేవా మదీయస్వాధ్యాయాధ్యయనంబులును గురుప్రసాదంబును విప్రవృద్ధాను

1 'బోలఁ బవిత్రము' అ. ప్ర.

వర్తనంబును నార్యజననమస్కరణంబును సర్వభూతానసూయయు నన్నవిరహి
తంబు గా ననేకకాలం బుదకంబులయందు సుతప్తం బయినతపంబు సేయుటయు
విని యన్నియును బురాణపురుషుండ వైనభవదీయపరితోషంబుకొఱకు నగుం
గాక యని విన్నవించెద మని వెండియు నిట్లనిరి. 934

మ. మునుపద్మాసనధూర్జటిప్రముఖధీ|మంతుల్ తపోజ్ఞానస
త్త్వనిరూఢిం దగువారు నీమహిమముల్ | వర్ణింపఁ బారం బెఱుం
గనివా రయ్యును నోపినంత వినుతుల్ | గావింతు రట్లాట నే
మును నిన్నర్థి నుతింతు మీశ వరదా | [1]బుద్ధ్యాదిమూలంబు గన్. 935

వ. అని మఱియు సముండవు నాదిపురుషుండవుఁ (బరుండవు బుద్ధుండవు వాసుదేవుం
డవు) సత్త్వమూర్తివియు భగవంతుండవు నైననీకు నమస్కరించెదము (అని
యిట్లు ప్రచేతసులచేత నుతింపంబడి శరణ్యావత్సలుం డగుహరి సంతుష్టాంతరంగుం
డై వారలకోరినయట్ల వరంబు లిచ్చిన). 936

తరలము. అనుచు నానృపనందనుల్ ముద | మార నన్నుతిఁ జేయఁగాఁ
మనములోఁ బరితోష మంది ర|మాహృదీశుఁడు భక్తపా
లనకరుండు తదీయదర్శన|లాలసాత్మకు లాత్మలం
దనివి సాలక చూడ నాత్మప|దంబు కేఁగె రయంబునన్. 937

వ. తదనంతరంబ ప్రచేతసులు భగవదాజ్ఞ శిరంబుల ధరియించి సముద్రసలిలనిర్గతు
లయి. 938

క. భూరిసమున్నతినాక,ద్వారనిరోధంబు గాఁగఁ | దగఁ బెరిఁగినయా
భూరుహసంపిహితాఖిల,ధారుణి నీక్షించి రాజ|తనయులు వరుసన్. 939

చ. ఘనకుపితాత్ము లై విలయ|కాలభయంకరహవ్యవాహలో
చనుగతి నుగ్రు లై ధరణి|చక్రము నిర్వసుధారుహంబు గా
ననయముఁ జేయఁ బూనిన జ|నాథపసూనులమోముఁదమ్ముల
న్ననలసమీరముల్ జనన | మంది కుజంబులఁ గాల్పఁ జొచ్చినన్. 940

క. నలినభవుఁ డామహీజ,ప్రళయముఁ గని వచ్చి ధరణి|పాలతనూజా
తుల మధురోక్తుల నుపశాం,తులఁ గావించుచును నయము | దూఁకొనఁ బలికెన్.

వ. అట్లు పలికి వారల నుపశమితక్రోధులం జేసినయనంతరంబ. 942

సీ. అవశిష్టధరణీరు|హంబులు భయ మంది, తివిరి చతుస్సుఖా|దేశమునను
మారిష యనుసతీ|మణిఁ దమకూఁతును, నాప్రచేతసులకు | నర్థి నిచ్చె
నానరపాలక|సూనులు దక్షున, కరయంగ [2]మున్నిశ్వ|రాపరాధ
మునఁ బ్రాప్త మైనట్టి|జనపాలజన్మంబు,నకుఁ గారణం బైన|నలిననయన

తే. నాదరంబునఁ గమలజు|నాజ్ఞఁ జేసి, కడఁక దీపింప విధివత్ప్ర|కారమునను

1 బుద్ధ్యానుసారంబు గన్. 2 మును సజ్జనాపరాధ.

వరుస నందఱుం గూడి విశ్వాహ మైరి, గడవ వచ్చునె దైవసంకల్ప మెందు.

క. కలదే జగతిం బదురు నృ,పుల కిల నొకభార్య యెందుఁ బొసఁగునె వినఁగా
నలినోదరఘనమాయా,కలితాద్భుతములకు నతులు గావింపఁ దగున్. 944

వ. అంతఁ జాక్షుషమన్వంతరంబున దైవచోదితుం డై యిష్టప్రజాసర్గంబు గావిం
చుచుఁ బ్రసిద్ధుం డైన దక్షుండు పూర్వదేహంబు గాలవిస్రుతంబుగాఁ బ్రచేతసు
లకు నమ్మారిష యనుభార్యయందు సంభవించి నిజకాంతిం జేసి సమస్తతేజో
ధనుల తేజంబును బిహితంబుగాఁ జేయుచుఁ గర్మదాక్ష్యంబున దక్షుం డనునామం
బు వహించి బ్రహ్మచేతం బ్రజాసర్గరక్షయందు నియోగింపఁబడి మరీచ్యాదులం
దత్తద్వ్యాపారంబులందు నియోగించి యుండె నంత. 945

సీ. ఒనరఁ బ్రచేతస్కు లుత్పన్నవిజ్ఞాను, లగుచు వేగంబ నారాయణోక్తిఁ
దలఁచుచు నాత్మనందనుకడ నిజభార్య, నిడి వనవాసు లై కడఁగి మున్ను
జాబాలి యనుమునీశ్వరునాశ్రమం బైన, భూరిపశ్చిమవార్ధితీరమునను
సర్వభూతాత్మవిజ్ఞానంబు గలయాత్మ, ఘనవిమర్శకృతసంకల్పు లైరి

తే. యంత నచటికి సమ్మోద మతిశయిల్ల, నరసురాసురయక్షకిన్నరవరేణ్య
మానితోన్నతసంపూజ్యమానుఁ డైన, నారదుండు వివేకవిశారదుండు. 946

వ. చనుదెంచి నిర్జితప్రాణమనోవాగ్దర్శనులును జితాసనులును శాంతులును నస
మానవిగ్రహులును నిర్మలం బైనపరబ్రహ్మంబునందు నియోజితం బైనయంతః
కరణంబు గలవారును నైనరాజనందనులకడ నిలిచిన. 947

క. చనుదెంచిననారదమునిఁ, గనుఁగొని నృపసుతులు లేచి కౌతుక మొప్పన్
వినమితు లై సముచితపూ,జనములఁ బరితుష్టుఁ జేసి సద్వినయమునన్. 948

చ. అనఘ మునీంద్రచంద్ర భవదాగమనంబు సమస్తలోకశో
భన మగు నస్మదీయ మగుభాగ్యవశంబున నేఁడు విశ్వపా
వన నినుఁ జూడఁ గంటి మనివార్యభవద్భ్రమణంబు లోకలో
చనుగతివోలెఁ బ్రాణులకు సర్వభయాపహరంబు గావునన్. 949

వ. అని మఱియు నిట్లనిరి. 950

సీ. అనఘాత్మ భగవంతు లైనకేశవవామ, దేవులచే నుపదిష్ట మైన
యాత్మతత్త్వంబు గృహస్థుల మగుమాకు, ననయంబు విస్మృతం బయ్యె నట్టి
కలితతత్త్వార్థప్రకాశకంబును భూరి, తరళసంసారాబ్ధితారణంబు
నై కర మొప్పారునాత్మతత్త్వము నేఁడు, చిరదయామతిఁ బ్రకాశింపఁజేయు

తే. మని ప్రచేతస్కు లర్థిఁ బల్కినఁ జెలంగి, భగవదాయత్తచిత్తుండు భవ్యగుణుఁడు
నఖిలలోకవిహారుండు నైనయట్టి, నారదుఁడు వల్కె నారాకుమారులకును.

సీ. చర్చింప నరుల కేజన్మకర్మాయుర్మ, నోవచనంబుల దేవదేవుఁ
డఖిలవిశ్వాత్మకుం డైనగోవిందుండు, విలసిల్లుభక్తి సేవింపఁబడును

నవియ పో జన్మకర్మాయుర్మనోవచనములను ధరణి నెఱన్నంగఁ దగును
వనరుహనాభసేవారహితము లైన, జననోపనయనదీక్షాకృతంబు

తే. లైనజన్మంబు లేల దీర్ఘాయు వేల, వేదచోదిత యగుకర్మవితతి యేల
జపతపశ్శ్రుతవాగ్విలాసంబు లేల, మహితనానావధానసామర్థ్య మేల. 952

వ. మఱియు హరివిరహితం బైనయింద్రియపాటవంబును నిపుణ మైనబుద్ధియుఁ బ్రాణాయామాదియోగంబును దేహాదివ్యతిరిక్తాత్మజ్ఞానంబును సన్న్యాససాధ్యయనంబులును దక్షిణవ్రతవైరాగ్యాదిశ్రేయస్సాధనంబులును నేల సర్వేశ్వరుండును సమస్తశ్రేయస్స్వరూపుండును సమస్తశ్రేయోనధిభూతుండును సర్వభూతావాసుండును సర్వభూతాత్మప్రముండును సర్వభూతప్రియుండును (సర్వవ్యాపకుండును) గావున. 953

మ. కమలాక్షేశ్వరుఁ బూజ సేయుట సమగ్రప్రీతిఁ బ్రాణోపహా
రము సర్వేంద్రియతృప్తిహేతువును సర్వక్ష్మాజమూలాభిషే
కము శాఖాభుజపుష్టిదంబు నగురేఖన్ సర్వదేవార్చన
క్రమ మై యొప్పు ధరావరేణ్యసుతులారా బుద్ధి నూహించినన్. 954

వ. అదియునుం గాక. 955

క. ఘను వగు వర్షాకాలం, బున దిననాయకునివలనఁ బొడమినసలిలం
బనయముఁ గ్రమ్మఱ గ్రీష్మం,బున సూర్యునియందుఁ జెందుపోలిక మఱియున్.

క. ధరణిఁ జరాచరభూతము, లరయఁగ జనియించి యంద యడఁగినపగిదిన్
హరిచేఁ బుట్టినవిశ్వము, హరియందె లయంబు నొందు నది యెట్లన్నన్. 957

మ. [1]అసితాసభ్రతమః ప్రభల్ మును నభంబు దొప్పఁగాఁ దోఁచి క్ర
మ్మఱ నీక్షింపఁగ నంద లేనిగతి బ్రహ్మంబందు నీశక్తులుం
బరికింపం ద్రిగుణప్రవాహమున నుత్పన్నంబు లై క్రమ్మఱన్
విరతిం బొందుచు నుండుఁ గావున హరిన్ విజ్ఞుల్ భజింపం దగున్. 958

వ. మఱియును సమస్తదేహులకు నాత్మయు (నిమిత్తభూతుండును) నద్వితీయుండును శశ్వత్ప్రకాశుండును బ్రధానపురుషుండును స్వతేజోవిధ్వస్తగుణప్రవాహుండును (మానసబుద్ధిసుఖేచ్ఛాద్వేషాదివికల్పరహితుండును సగుణుండును దేహాత్మభ్రమనివృత్త్యుపలభ్యుండును నాదిమధ్యాంతరహితుండును నిత్యానందస్వరూపుండును సర్వజ్ఞుండునుఁ) బరమేశ్వరుండును నైననారాయణు నభేదబుద్ధిం జేసి భజింపుఁ డతండు సర్వభూతదయయు నెంతమాత్రంబు సంభవించు నంతమాత్రంబున సంతుష్టుం డగుటయును సర్వేంద్రియోపశాంతియు ననునీగుణంబులు గలిగినయెడ సంతుష్టుం డగు నని వెండియు నిట్లనియె. 959

చ. చతురత నట్టియీశ్వరుఁడు సజ్జనలోకనిరస్తసర్వకా

1 అరయ నభ్రతమఃప్రకాశల నభం.

మితవిమలాంతరంగమున । మిశ్రితభావనఁ జేసి సన్నిధా
పితుఁ డగుచుండు దయాకరగంభీరగుణంబులఁ జాల నొప్పి యా
శ్రితజనపారతంత్ర్యమును । జేకొని పాయక యుండు నిచ్చలున్. 960

క. శ్రుతధనకులకర్మసము, న్నతమదములఁ జేసి సజ్జనప్రతతికి సం
తతమును నెగ్గొనరించుచు, మతు లర్థిం జేయుపూజ । మతిఁ గొనఁ డెందున్.

వ. అది యె ట్లనిన. 962

సీ. వల నొప్పఁ దన ననువర్తించు నిందిరా, కామినీమణిఁ దదా । కాంక్షు లగుచు
ధృతి ననువర్తించు । దేవేంద్రముఖ్యుల, నే ననువర్తింప । కెప్పు డాత్మ
నిత్యస్వతంత్రుఁడు । నిజభక్తవరదుఁడు, దీనవత్సలుఁడును । నైనయట్టి
పురుషోత్తముని జగ । ద్భరితు సర్వేశ్వరు, నారాయణునిఁ జిదా । నందమయుని

తే. నజితు నచ్యుతుఁ బుండరీ । కాయతాక్షుఁ, దవిలి సేవింపకుండు నే । ధరఁ గృతజ్ఞుఁ
డైనపురుషుండు సమ్మోది । తాత్ముఁ డగుచుఁ, జాఱుమతులార రాజకు । మారులార.

వ. (అని మఱియు నిట్లనియె భవదీయవంశధుర్యుండుఁ జిత్రరథుండు నగు ధ్రువుండు సపత్నీమాతృవాగ్బాణభిన్నహృదయుం డై పంచవర్షార్భకుం డగుచుఁ దపోవనంబున కరుగునపుడు మార్గంబున నాచే నుపదిష్టం బైనక్రమంబున భగవంతుం డగుపుండరీకాక్షు నారాధించి యితరులచే నొందరానిసర్వోత్తమం బగుపదంబు నొందెఁ గాన మీరును గుర్వుపదేశక్రమంబున సర్వభూతాంతర్యామి యగు నీశ్వరు భవచ్ఛేదంబున కై భజియింపుఁడు.) 964

క. అని యివ్విధమున నారద, ముని రాజకుమారులకును । ముదము దలిర్పన్
వనజోదరుసచ్చరితము, వినిపించి సరోజభవుని । వీటికిఁ జనియెన్. 965

వ. ఇట్లు నారదుండు సనిన యనంతరంబ. 966

చ. నరవరనందనుల్ గడఁక । నారదవక్త్రవినిర్గతంబు సుం
దరమును మంగళావహము । ధన్యము లోకమలాపహంబు నై
పరఁగినవిష్ణుకీర్తి విని । పాయక తత్పదపద్మచింతనా
నిరుపమభక్తిఁ జెంది హరి । నిత్యపదంబునఁ బొందిరున్నతిన్. 967

వ. అని మైత్రేయుండు విదురున కిట్లనియె మహాత్మా నీవు నన్నడిగిన ప్రచేతోనారదసంవాదరూపం బైనహరికీర్తనంబు మనుపుత్త్రుం డైనయుత్తానపాదునివంశప్రకారంబును జెప్పితి నని వెండియు నిట్లనియె నారదువలనం బ్రియవ్రతుం డాత్మవిజ్ఞానంబు నొంది [1]మహీమండలంబుఁ బరిపాలించి యనంతరంబునఁ బుత్త్రులకు రాజ్యంబుఁ బంచి యిచ్చి పరలోకగతుం డయ్యె ననిన. 968

క. విని విదురుం డాతాపసు, ఘనచరణము లాత్మమస్తకంబున మధుసూ
దనుచరణాంభోరుహములు, మనమునఁ దగఁ దాల్చి పలికె । మైత్రేయునితోన్.

1 'మహీంభోగానంతరమున' వ్రా. ప్ర.

క. మునినాథచంద్ర కరుణా,వననిధి నీచేత భక్తవత్సలుఁ డగునా
వనజాక్షుతత్త్వ మెఱిఁగితి, నని తత్పదములకు వినతుఁ డై వినయమునన్. 970
క. ఆమునిచే నామంత్రితుఁ, డై మనమున బంధుదర్శనాకాంక్షితుఁ డై
ధీమహితుఁ డై నవిదురుఁడు, సామజపురమునకుఁ జనియె సమ్మద మొప్పన్.
క. అని శుకుఁడు పరీక్షిత్తున, కనుకంపం జెప్పె నీయుపాఖ్యానంబుల్
వినువాఁ డైశ్వర్యాయు,ర్ధనకీర్తిస్వస్తిగతులఁ దగఁ బ్రాపించున్. 972
క. అని శుకయోగి పరీక్షి,జ్జనపాలసుధాపయోధిచంద్రున కర్థిన్
వినిపించినకథ మోదం,బున సూతుఁడు శౌనకాదిమునులకుఁ జెప్పెన్. 973
చ. సరసవచోవిలాసగుణసాగర సాగరమేఖలామహీ
భరణధురంధర ప్రకటభవ్యభుజాభుజగేంద్ర రాజశే
ఖర ఖరదూషణప్రముఖగాఢతమఃపటలప్రచండభా
స్కర కఱకంఠకార్ముకవిఖండనఖేలన భక్తపాలనా. 974
క. శరవిదళితసారంగా, సరసదయాపాంగ భక్తజలధితరంగా
దురితధ్వాంతపతంగా, వరజనకసుతాభిషంగ వననిధిభంగా. 975
మాలిని. సురవిమతవిదారీ సుందరీశంబరారీ, సరసవినుతసూరీ సర్వలోకోపకారీ
నిరుపమగుణహారీ నిర్మలానందకారీ, గురుసమరవిహారీ ఘోరదైత్యప్రహారీ.

గద్యము. ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్యప్రణీతం బయిన శ్రీమహాభాగవతం బనుమహాపురాణంబునందు స్వాయంభువమనువునకు నాకూతి దేవహూతి ప్రసూతి ప్రియవ్రతోత్తానపాదులు జన్మించుటయు నందు నాకూతిని రుచిప్రజాపతికి నిచ్చుటయు నారుచిప్రజాపతికి నాకూతిదేవియందు శ్రీవిష్ణుమూర్త్యంశజుం డైనయజ్ఞుండును లక్ష్మీకళాంశజ యగుదక్షిణ యనుకన్యకయు నుద్భవించుటయు మనుపుత్త్రి యైనదేవహూతిని గర్దమున కిచ్చుటయుఁ బ్రసూతిం దక్షప్రజాపతి కిచ్చుటయు బ్రసూతిదక్షులవలనం బ్రజాపరంపరలు గలుగుటయు మఱియుం గర్దమప్రజాపతిపుత్త్రి కాసముదయంబును తక్త్రిబ్రహ్మగుల కిచ్చుటయుఁ గర్దమపుత్త్రి యైనకళవలన మరీచికిఁ గశ్యపుం డనుపుత్త్రుండును బూర్ణిమ యనుకూఁతురుం బుట్టుటయును బూర్ణిమవలన గంగయు విరజుం డనెడుకుమారుండును జన్మించుటయుఁ గశ్యపప్రజాపతివలన నయినప్రజాపరంపరలచే ముల్లోకంబు లాపూర్ణంబు లగుటయు నత్త్రిమహామునితపంబును నతనికి హరిహరబ్రహ్మలు ప్రత్యక్షంబగుటయు ననసూయాపాతివ్రత్యమాహాత్మ్యంబువలన ననసూయాత్త్రులకుం ద్రిమూర్తులకళాంశజు లయినచంద్రదత్తాత్రేయదుర్వాసులజన్మంబును దత్తాత్మజలజన్మంబును భృగువువలన ఖ్యాతి యనునంగనకు శ్రీమహాలక్ష్మి జన్మించుటయును భృగుపౌత్త్రుం డయినమార్కండేయుజన్మంబును ధర్మునకు మూర్తివల

న నరనారాయణులు సంభవించుటయును సత్త్రయాగంబునందు దక్షుండు శివుని నిందించుటయును దక్షాధ్వరధ్వంసంబును బ్రహ్మచేఁ బ్రార్థితుండై శివుండు దక్షాదుల ననుగ్రహించుటయును దక్షాదికృతశ్రీహరిస్తవంబును శ్రీహరి ప్రసన్నుం డై దక్షునియజ్ఞంబు సఫలంబుగా ననుగ్రహించుటయును సతీదేవి హిమవంతునకు జనించి హరునకుం బ్రాప్తించుటయు నుత్తానపాదునివృత్తాంతంబును ధ్రువోపాఖ్యానంబును ధ్రువుండు దండ్రిచేత నవమానితుం డై నారదోపదేశంబున మధువనంబునకుం జని తపంబు సేయుటయు హరి ప్రసన్నుం డై యతని మనోరథంబు లిచ్చుటయును నతండు మరలఁ బురంబునకు వచ్చుటయుఁ గుబేరానుచరు లైనయక్షులతోడియుద్ధంబును ధ్రువుండు యజ్ఞంబులు సేయుచు రాజ్యభోగంబులం దనిసి తనయు నుత్కలునిం బట్టంబు గట్టి హరియనుగ్రహంబున ధ్రువక్షితిని నిలుచుటయు నుత్కలుండు వత్సరుం డనుతనసుతునిఁ బట్టంబు గట్టి హరిం జేరుటయు వత్సరునివంశపరంపరయు నంను నంగునిసుతుండయిన వేనుకళేబరంబున లక్ష్మీనారాయణులయంశంబున నర్చియుఁ బృథుండును జన్మించుటయుఁ బృథుండు భూమిం గామధేనువురీతి నఖిలవస్తువులుం బిదుక నియమించి సమస్థలిం జేసి యింద్రుండు వశవర్తి యై యుండ బహుయజ్ఞంబులు సేసిన నతనికి హరి ప్రత్యక్షం బగుటయు నధ్యాత్మప్రబోధంబును నింద్రుని వలనఁ బాషండసంభవంబును నింద్రుని జయించినవిజితాశ్వుని నతనితమ్ములను బృథివీపాలనంబునకు నిలిపి పృథుండు నర్చియుం బరమపదప్రాప్తు లగుటయు వసిష్ఠుశాపంబున త్రేతాగ్నులు విజితాశ్వునికిఁ దనయు లై జనియించుటయుఁ బృథునిపౌత్రుం డయినప్రాచీనబర్హి రాజ్యంబును నతనియజ్ఞంబు లసంఖ్యాతంబు లైన నారదుండు మాన్యం దలంచి పురంజనుకథ నధ్యాత్మప్రపంచంబుగాఁ దెలుపుటయుఁ బ్రాచీనబర్హిసుతు లయిన ప్రచేతసులు పసుపురకు శ్రీమహాదేవుండు ప్రత్యక్షం బై హరిస్తవం బుపదేశించుటయుఁ బ్రచేతసులతపంబునకు మెచ్చి హరి ప్రత్యక్షం బగుటయు వారికి మారిషవలన దక్షుండు పూర్వకాలంబున శివవిద్వేషప్రయుక్తశాపంబునం బుత్రుం డై జనియించుటయును బ్రచేతసులు ముక్తికిం జనుటయును విదురుండు మైత్రేయుని వీడ్కొని హస్తిపురంబున కరుగుటయు ననుకథలు గలచతుర్థస్కంధము. 977

ఓం తత్సద్బ్రహ్మార్పణ మస్తు.



శ్రీరస్తు

శ్రీరామచన్ద్రాయ పరబ్రహ్మణే నమః.

# శ్రీమదాంధ్రమహాభాగవతము

## పంచమస్కంధము

### ప్రథమాశ్వాసము.

---



[1]కర కరుణాసాగర
ప్రాకటలక్ష్మీకళత్ర భవ్యచరిత్రా
లోకాతీతగుణాశ్రయ
గోకులవిస్తార నందగోపకుమారా. 1

[2]వ. మహనీయగుణగరిష్ఠు లగునమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుం డైనసూతుం డి ట్లనియె. 2

క. భూనాథుఁ డుత్తరాత్మజుఁ, డైనపరీక్షిన్నరేంద్రుఁ డభిమన్యుసుతుం
డానంద మంది ఘనసు, జ్ఞానుం డగుశుకునిఁ గాంచి సరసతఁ బలికెన్. 3

వ. మునీంద్రా పరమభాగవతుండు నాత్మారాముండు నైనప్రియవ్రతుండు గృహంబుననుండి యెట్లు రమించెఁ గర్మబంధంబు లయినపరాభవంబులు గలగృహంబులయందు ముక్తసంబంధు లైనపురుషులకు సంతోషంబు గానేర దుత్తమశ్లోకుం డైనపుండరీకాక్షునిపాదచ్ఛాయం జేసి నిర్వృతచిత్తు లయినమహాత్ములు కుటుంబంబునందు నిస్పృహత సేయుదురు గాన ప్రియవ్రతునికి సంసారంబునందుఁ దగులంబు గలుగు టెట్లు దారాగారసుతాదులందుఁ దగులంబు గలవానికి నెట్లు సిద్ధి గలుగు శ్రీహరియం దస్ఖలితమతి యెట్లు గలుగు నీసంశయంబుఁ దేటపఱుపుమని పరీక్షిన్నరేంద్రుఁ డడిగిన శుకయోగీంద్రుం డి ట్లనియె. 4

క. హరిచరణాంబుజమకరం, దరసావేశితమనఃప్రధానుం డగుస

---

1 'శ్రీసీతానయనోత్పల, శ్రీసతిసహజన్మ త్రిదశసేవిత యాశా, వాసప్రకాశజయభాసాసురపతిహరణ రామచంద్రనృపాలా' 2 'సకలపురాణార్థజ్ఞానవిఖ్యాతుం డగుసూతుండు శౌనకాదిమహామునుల కి ట్లనియె' వ్రా.ప్ర.

త్పురుషుఁ డొకవేళ విఘ్నముఁ, బొరసినఁ దనపూర్వమార్గమును విడువఁ డిలన్.

క. ధరణీవల్లభ వినుమా, నరవరుఁడు ప్రియవ్రతుండు నారదమునిశ
చ్చరణోపసేవఁ జెందుచు, నరుదుగ నధ్యాత్మతత్త్వయోగంబందున్. 6

సీ. దీక్షితుం డై ధరిత్రీపాలనముఁ దండ్రి, పనిచిన సుజ్ఞానభంగ మనుచు
నంగీకరింపమి నంతయుఁ దెలిసి పద్మాసనుఁ డతనికి నతులరాజ్య
మందుల మిక్కిలి యాసక్తిఁ బుట్టింతు, ననుచును దనచిత్తమందుఁ దలఁచి
తారకాపరివృతతారాధిపుని మాడ్కి, శ్రుతులతోఁ గూడి యచ్యుతవిభూతి

తే. హంసవాహనుఁ డగుచు నింద్రాదు లెల్లఁ, గదిసి సేవింప బ్రహ్మలోకమున నుండి
సన్మునీంద్రులు దన్నుఁ బ్రశంస సేయ, నల్ల నల్లన యుడువీథి నరుగుదెంచె. 7

వ. మఱియు నాయాయిమార్గంబులయందు సిద్ధసాధ్యగంధర్వచారణగరుడకింపురుషు లిరుదెసల స్తోత్రంబులు సేయుచుండ గంధమాదనద్రోణులం బ్రకాశంబు నొందించుచుఁ జనుదెంచినపద్మాసనునకు నారదుండు స్వాయంభువప్రియవ్రతులతోఁ గూడి ముకుళితకరకమలుండై యెదురు చనుదెంచి సంస్తుతిస్తబకంబులం బూజించిరి విరించి సంతసించి ప్రియవ్రతునిం జూచి నవ్వుచు ని ట్లనియె. 8

క. హరి నామముఖమున నీకును, [1]కర మెఱుఁగింపంగఁ బనిచె గావున నిదె సు
స్థిరమతి విను మంతయు శ్రీ, హరివాక్యము గా నెఱింగి యవనీనాథా. 9

ఆ. కోరి వేడ్క నీవు నారదుండును నేను, నందఱమును నీశ్వరాజ్ఞఁ బూని
యుడుగ కెపుడుఁ జేయుచున్నవారము గాన, యతనియాజ్ఞఁ దప్ప నలవిగాదు.

వ. మఱియు శ్రీహరియాజ్ఞను జీవుండు తపోవిద్యలను యోగజ్ఞానదానార్థధర్మంబులను దనచేత నొరులచేతం దప్పింప సమర్థుండు గాఁడు ఉత్పత్తిస్థితినాశంబులకు శోకమోహభయసుఖదుఃఖంబులకు నీశ్వరాధీనుండ కాని జీవుండు స్వతంత్రుండు గాఁడు శ్రీహరి వాగ్రూపంబు లయిన శ్రుతులందు గుణత్రయం బను రజ్జువున బంధింపంబడిన యస్మదాదులము ముకుఁద్రాటిచేఁ బశువు మనుష్యులకు వశం బయినచందంబున నీశ్వరాజ్ఞం బ్రవర్తించుచుండుదుము నరుండు సుఖదుఃఖానుభవంబులకు నీశ్వరాధీనుండు నేత్రంబులు గలవానిచేతఁ దివియంబడిన యంధుండునుంబోలె నీశ్వరుం డిచ్చినసుఖదుఃఖంబు లనుభవించుచున్నవారము స్వప్నంబునం గన్నపదార్థంబు మేల్కాంచి మిథ్యగాఁ దలఁచినకరణి మోహోత్తీర్ణుండైనసుజ్ఞానవంతుండు ప్రాప్తసుఖదుఃఖంబు లనుభవించుచు దేహారబ్ధకర్మంబులం బాయఁ ద్రోల్లఁడు వనవాసి యైనను జితేంద్రియుండు గాకుండెనేని (గామాదిసహితుం డగుటం జేసి) సంసారబంధంబులు సిద్ధించు గృహస్థాశ్రమంబందు జితేంద్రియుండై యాత్మజ్ఞానంబు గలపురుషునకు మోక్షంబు సిద్ధించు శత్రువుల గెలువ నిచ్ఛయించినపురుషుండు దుర్గం బాశ్రయించి శత్రువుల జయించిన

1 'కర మెఱుఁగింపఁ దలంచి నాకు నెఱుఁగించెను సు' వ్రా. ప్ర.

మాడ్కి నిమోహార్థి యగుపురుషుండు గృహాశ్రయుం డగుచు శ్రీనారాయణ
చరణారవిందంబు లనుదుర్గం బాశ్రయించి యరిషడ్వర్గంబుల జయించు నీవును
ముక్తసంగుండ వై యీశ్వరకల్పితంబు లగుభోగంబుల ననుభవించి ముక్తిం
జెందు మనినఁ బ్రియవ్రతుండు త్రిభువనగురుం డయినచతురాననువాక్యంబు
లవనతమస్తకుం డై బహుమానపూర్వకంబున నంగీకరించె నంత. 11

ఆ. సరసిజాసనుండు స్వాయంభువునిచేత, నధిక మైనపూజ లంది నార
దుండు నాప్రియవ్రతుండును జూడంగఁ, జనియెఁ దనదుపూర్వసదనమునకు.

ఆ. సత్యసంధుఁ డైన స్వాయంభువుం డను, మనువు బ్రహ్మచేత మన్ననఁ దగ
నంది యంత నారదానుమతంబునఁ, దనదుసుతుని రాజ్యమునను నిలిపె. 13

వ. ఇట్లు స్వాయంభువమనువు భూచక్రపరిపాలనంబునకుం బ్రియవ్రతునిఁ బట్టంబు
గట్టి విషమంబు లగువిషయంబులవలన విముక్తుం డై వనంబునకుం జనియె నంత.

మ. ధరణీవల్లభుఁ డాప్రియవ్రతుఁడు మోదం బందుచున్ లీల నీ
శ్వరవాక్యంబునఁ గర్తతంత్రపరుఁ డై సంగంబులం బాపు శ్రీ
హరిపాదాంబుజచింతనం దగిలి నిత్యానందముం బొంది దు
ర్భరరాగాదులఁ బాఱఁ దోలి ప్రజలం బాలించె సత్యస్థితిన్. 15

వ. ఇట్లు ప్రియవ్రతుండు రాజ్యంబు సేయుచు విశ్వకర్మప్రజాపతిపుత్త్రిక యగు
బర్హిష్మతి (యనుదానిం బత్నిఁగాఁ బడసి యాసతి)వలన శీలవృత్తగుణరూపవీ
ర్యౌదార్యంబులం దనకు సమాను లైనయాగ్నీధ్రేధ్మజిహ్వయజ్ఞబాహుమహా
వీరహిరణ్యరేతోఘృతపృష్ఠసవనమేధాతిథివీతిహోత్రకవు లనునామంబులు గల
పుత్త్రదశకంబును నూర్జస్వతి యనునొక్కకన్యకను గాంచె నందుఁ గవిమహా
వీరసవనులు మువ్వురు బాలకు లయ్యు నూర్ధ్వరేతస్కు లై [1]బ్రహ్మవిద్యానిష్ణా
తు లై యుపశమనశీలు రగుచుం బారమహంస్యయోగం బాశ్రయించి సర్వ
జీవనికాయవాసుండు భవభీతజనశరణ్యుండు సర్వాంతర్యామియు భగవంతుండు
నగు వాసుదేవునిచరణారవిందావిరతస్మరణానుగతపరమభక్తియోగానుభావంబు
న విశోధితాంతఃకరణు లగుచు నీశ్వరతాదాత్మ్యంబు నొంది రంత. 16

సీ. వసుధేశ యాప్రియవ్రతుఁ డొండుకాంతయం, దధికుల మన్వంతరాధిపతుల
మఱియు నుత్తముఁడుతామసుఁడు రైవతుఁడను, సుతులను బుట్టించె సుమహి
మున్ను జన్మించినమువ్వురుపుత్త్రులు, నవ్యయపదవికి నరుగుటయును [తులను
నంతఁ బ్రియవ్రతుఁ డఖిలశాత్త్రవకోటిఁ, దనబాహుబలముచేతను జయించి
తే. యతఁడు బర్హిష్మతీకాంతయందుఁ బ్రీతి, గలిగి యౌవనలీలావికాసహాస
హేలనాదులఁ జిత్తంబు గీలుపఱిచి, గతవివేకుఁడుఁబోలె భోగములఁ బొందె.

---

1. 'బ్రహ్మవిద్యావాసనం జెంది పరమహంసయోగం బాశ్రయించి జీవాంతర్యామియగునీశ్వ
రుం బొంది రంత' వ్రా. ప్ర.

వ. ఇట్లు ప్రియవ్రతుం డేకాదశార్బుదపరివత్సరంబులు రాజ్యంబు సేసి యొక్క-
నాఁడు మేరునగప్రదక్షిణంబు సేయుసూర్యునకు నపరభాగంబునం బ్రవర్తించు
నంధకారంబు నివర్తింపం బూని [1]భగవదుపాసనాజనితాతిపురుషప్రభావుం డై
సవితృరథసదృశవేగంబు గలిగి తేజోమయం బైనరథంబు నారోహణంబు సేసి
(రాత్రుల నెల్ల దివంబు లొనర్తు నని) సప్తరాత్రంబులు ద్వితీయతపనుండునుం
బోలె నరదంబు వఱపుటయుఁ గని చతురాననుండు వారించె నారథనేమిమార్గం
బులు సప్తసముద్రంబులును నామధ్యభూసంధులు సప్తద్వీపంబులు నయ్యె నందు.

సీ. వరుస జంబూప్లక్షవరకుశక్రౌంచముల్, శాకశాల్మలులు పుష్కరము ననఁగ
నలరునాద్వీపంబులందు జంబూద్వీప, మొనరంగ లక్షయోజనము లయ్యె
నట యుత్తరోత్తరాయతసంఖ్యఁ దాద్విగు,ణితమయి యొండొంటికతిశయిల్లు
క్షారేక్షురససురాజ్యక్షీరదధ్యుద,కంబులు గలుగుసాగరము లేడు

తే. ద్వీపపరిమాణములు గల్గి యవి విస్తరిల్లు, సంధిసంధిని బరిఖలచందమునను
గ్రమముదప్పక యొండొంటిఁ గలయకుండు, సకలజీవులకెల్ల నాశ్చర్యముగను.

వ. అట్టిద్వీపంబులందుఁ బరిపాలనంబునకుం బ్రియవ్రతుం డాత్మభవులు (నాత్మస
మానశీలురు) నైనయాగ్నీధ్రేధ్మజిహ్వయజ్ఞబాహుహిరణ్యరేతోఘృతపృష్ఠ
మేధాతిథి వీతిహోత్రుల (నొక్కొకని నొక్కొక్కద్వీపంబునకుం) బట్టంబు గట్టి
యూర్జస్వతి యనుకన్యకను భార్గవున కిచ్చిన నాభార్గవునకు నూర్జస్వతియందు
దేవయాని (యనుకన్యారత్నంబు జనించె) నట్టిబలపరాక్రమవంతుం డైనప్రియ
వ్రతుండు విరక్తుం డై యొక్కనాఁడు నిజగురు వగునారదముని (చరణానుసేవా
నుపతితరాజ్యాదిప్రపంచసంసర్గంబు)ఁ దలంచి (దుఃఖించి) యి ట్లనియె. 20

సీ. అక్కట యే నింద్రియములచేఁ గట్టంగఁ, బడి యుండి యందులఁ బాయ లేక
యజ్ఞానవిరచితం బగువిషయము లను,నంధకూపంబున నడఁగియుండి
తరుణులకే వినోదమ్ముగంబ నై యుండి, యవి యెల్ల నే నొల్ల ననుచు రోసి
హరికృపచే నప్పు డబ్బినయాత్మవి,ద్యను గల్గి తనవెంట నరుగుదెంచు

తే. కొడుకులకు నెల్లరాజ్యముఁ గుదురుపఱిచి, తనదుపత్నుల దిగనాడి ధనము విడిచి
హరివిహారంబు చిత్తంబునందు నిలిపి, పరఁగ నల్లన నారదపదవి కరిగె. 21

వ. ఇట్లు దనరథమార్గంబులు సప్తద్వీపసాగరంబులు గాఁ జేసి సూర్యునకుఁ బ్రతి
సూర్యుండై సరిద్గిరివనాదిచిహ్నములచేత (భూతనిర్వృతికొఱకుఁ బ్రతిద్వీపంబు
నకు నవధులు గల్పించి) ద్వీపవర్షనిర్ణయంబులం బుట్టించి పాతాళభూస్వర్గాది
సుఖంబులు నరకసమానంబులు గాఁ దలంచి విరక్తిం బొంది [2]నిరంతరభగవ
ద్ధ్యానవిమలీకృతాశయుం డగుచు హరిభక్తిప్రియుం డైనప్రియవ్రతునిచరిత్రం
బు లీశ్వరునకుఁ దక్క నన్యుల కెఱుంగఁ దరంబు గా దతనిమహిమంబులు నేఁడునుం

1 భగవదుపాసనాప్రభావజనిత వేగంబున. 2 'హరిధ్యానపరుండై నప్రియవ్రతునిచరిత్రంబు' వ్రా.ప్ర.

గొనియాడుదు రని శుకుండు మఱియు నిట్లనియె. 22

క. హరిసేవ నా ప్రియవ్రతుఁ, డరయఁగఁ గైవల్యపదవి నందుట యరుదే
ధరఁ జండాలుం డైనను, హరినామస్మరణఁ జెందు నవ్యయపదమున్. 23

వ. అని పలికి శుకుండు మఱియు నిట్లనియె. 24

మ. జనకుం డిట్లు విరక్తుఁ డై [1]నను దదాజ్ఞం జేసి యాగ్నీధ్రుఁ డే
పున ధర్మప్రతిపాలనుం డగుచు జంబూద్వీపము న్నేలుచుం
దనసత్పుత్త్రులమాడ్కి నెల్లప్రజలం దాత్పర్యచిత్తంబునన్
ఘనతం బ్రోచె ననేకకాల మిలఁ బ్రఖ్యాతంబు గా భూవరా. 25

వ. ఇట్లాగ్నీధ్రుండు రాజ్యంబు సేయుచు నొక్కనాఁడు పుత్త్రకాముం డై మందరాద్రిసమీపంబున నఖిలోపచారంబుల నేకాగ్రచిత్తుం డై యర్చించినం గమలసంభవుండు సంతసిల్లి తనసమ్ముఖంబున సంగీతంబు సేయుపూర్వచిత్తి యనునప్సరోంగనం బంపుటయు నాయప్సరోంగన సనుదెంచి [2]రమణీయవివిధనిబిడవిటపివిటపసమాశ్లిష్టసమీపసువర్ణలతికారూఢస్థలవిహంగమమిథునోచ్చార్యమాణషడ్జాదిస్వరంబులచే బోధ్యమానసలిలకుక్కుటకారండవబకకలహంసాదివిచిత్రకూజితసంకులంబు లయిననిర్మలోదక కమలాకరంబులు గల తదాశ్రమవనోపవనంబునందు [3]విహరించుచు విలాసవిభ్రమగతివిశేషంబులం జలనంబు నొందు స్వర్ణచరణాభరణస్వనం బన్నరదేవకుమారుం డాలించి యోగసమాధిం జేసి ముకుళితనేత్రుం డై యుండి యల్లన కను విచ్చి చూచి తనసమీపంబున మధుకరాంగనయుం బోలెఁ బుష్పాఘ్రాణంబు సేయుచు దేవమానవులమనోనయనంబుల కాహ్లాదంబుఁ బుట్టించు చున్నగతి విహారవినయావలోకనసుస్వరావయవంబుల మన్మథశరపరంపర నొందించుచు [4]ముఖకమలవిగళితామృతసమానహాసభాషణామోదమదాంధంబు లయినమధుకరమిథునంబుల వంచించి శీఘ్రగమనంబునం జలించుకుచకచమేఖలలు గలదేవిం గనుంగొని చిత్తచలనంబు నొంది మన్మథపరవశుం డై జడునిచందంబున నిట్లనియె. 26

క. సతి నీ వెవ్వతె వీప,ర్వతమున కేమేనిఁ గోరి వచ్చినవనదే
వతవో శారదవో రతి,పతి పంచినమాయవో తపస్సారమవో. 27

ఉ. అంగజుఁ డెక్కు డించినశరాసనమున్ ధరియించి యంత నా
యంగజువెంట మానవమృగావళిఁ జూచుచు నున్నదానవో
రం గగునీదుచర్యలతెఱంగు నెఱుంగఁగ నాకుఁ బల్కుమా
యంగన నిన్నుఁ గన్గొనినయంత ననంగుఁడు సందడించెడున్. 28

---

1 ననతనాజ్ఞం జేసి. 2 'రమణీయవివిధశాఖానికరవిటపిసమీపసువర్ణలలితారూఢస్థలవిహంగమమిథునసంచారంబును సలిలకుక్కుట... కలహంసాదిసంకులంబు నుం గలనిర్మలో' వ్రా. ప్ర. '3 మోదించుచుండ నన్నరదేవకుమా' వ్రా. ప్ర. 4 'ముఖకమల మదిరామోదమదాంధ' వ్రా. ప్ర.

క. పొలు పగుచున్న విలాసం,బులు గలయంగజుని బాణ|ములఁ బోలెడిచం
చలసత్కటాక్షవీక్షణ,ముల నెవ్వనియింతి చి|త్తముం గలఁచెదవే. 29

చ. చెదరఁగ వేదముల్ సదుప|శిష్యులపైఁ దగఁ బుష్పవృష్టి స
మ్మదమున నంతలోఁ గురియు|మాడ్కిని మన్మథసామగానముల్
సదివెడుశిష్యులో యనఁగ | షట్పదపంక్తులు సేరి మ్రోయఁగాఁ
బడపడి మీఁద రాలుఁ గచ|భారమునందుల జాఱు క్రొవ్విరుల్. 30

క. [1]అందియలు డిండిమంబుల, చందమునం బాదపంక|జంబులయందు
న్నందంద మ్రోయుచును నా,డెందంబునఁ దగిలి సంద|డించెడిఁ దరుణీ. 31

క. పాయక కదంబపుష్ప,చ్ఛాయం గలవస్త్రకాంతి | సల్లెడుఁ గంటే
యీయెడ నితంబరోచులు, గాయుచు నెడ తెగక తఱిమి | కప్పెడుఁ దన్వీ. 32

క. నిరతము నీతనుమధ్యము, గర మరుదుగ నరసి చూడఁ | గానంబడ దీ
కరికుంభంబులఁ బోలెడి,గురుకుచముల నెట్లు నిలుపు|కొంటి లతాంగీ. 33

క. పొంకము లగుకుచములపైఁ, గుంకుమపంకంబు సొంపు|గొని వాసనలం
గొంకక వెదచల్లెడునీ,బింకం బగుచన్నుదోయి | పెంపో సొంపో. 34

శా. ఏలోకంబుననుండి వచ్చితివి నీ | విచ్చోటికిన్ మున్ను నే
నేలోకంబునఁ జెప్పఁ జూప నెఱుఁగ | న్నీసుందరాకారము
న్నీలాలిత్యము లీవినోదములు నీ కి|ట్లొప్పునే కామినీ
భూలోకంబున కెట్లు వచ్చితివి నా|పుణ్యం బగణ్యంబు గన్. 35

క. హాసావలోకనంబుల, భాసిల్లెడునీముఖంబు | పలుమఱు నిపుడే
యాసలు పుట్టింపఁగ నే, నాసగొనెద నిన్నుఁ జూచి | యంబుజనేత్రా. 36

ఆ. [2]కందులేనియిందు|కళ మించి నెమ్మోము, కాంతియుక్త మగుచుఁ | గానిపించెఁ
గాన విష్ణుకలయుఁ | గాఁబోలు నని నామ,నంబునందుఁ దోఁచె | నలిననేత్ర.

మ. పటుతాటంకరథాంగయుగ్మమునకుం | బల్మాఱు భీతిల్లుచున్
నటనం బందెడుగండుమీనములతో | నాసన్ననీలాలకో
త్కటభృంగావళితో ద్విజావళి లస|త్కాంతిన్ విడంబించుమా
అటకాసారముఁబోలె నెమ్మొగము దా | రంజిల్లు నత్యున్నతిన్. 38

చ. కరువలిఁ బాయువస్త్రమును | గట్ట నెఱుంగవు చూడ్కి దిక్కులం
బరపుచుఁ జంచరీకముల|భాతిఁ జెలంగెడుఁ గంధరంబునం
బొరలెడుముక్తకేశభర|ముం దఱుమంగఁ దలంప విప్పడి
ట్లరుదుగ రత్నకందుకవి|హారము సల్పెదు సంభ్రమంబునన్. 39

---

1 అందియలు టిట్టిభంబులు; అందియల వెలయురత్నము, లందంబుగ లలితపదములన్ సుభగము లై; యందంద మ్రోయుచును నా,డెందంబునఁ దగిలి సందడించుచు నున్నన్. 2 ‘కందు లేక యుండి కడుమంచి కెమ్మోవి.

వ. మఱియు ని ట్లనుఁ దపోధను లగువారలతపంబులను నీరూపంబున నపహ్నవించి నదాన వీచక్కఁదనం బేమితపంబున సంపాదించితి నాతోడం గూడి తపంబు సేయుము సంసారంబు వృద్ధిఁ బొందం జేయుము పద్మాసనుండు [1]నాకుం బ్రత్యక్షుండై నిన్ను నిచ్చినవాఁడు గావున నిన్ను విడువం [2]జాలను నీసఖీజనంబులు [3]నావాక్యంబులకు ననుకూలింతురు గాక నీవు చనుచోటికి [4]నన్నుం దోడ్కొని చను మని స్త్రీలకు ననుకూలంబుగాఁ బలుక నేర్చినయాగ్నీధ్రుండు పెక్కుభంగులం బలికి(న)నాపూర్వచిత్తి(యు నతనియనునయవాక్యంబులకు సమ్మతించి వీరశ్రేష్ఠుం డగునారాజవర్యుని బుద్ధిరూపశీలౌదార్యవిద్యావయశ్శ్రీలచేఁ బరాధీనచిత్త యగుచు జంబూద్వీపాధిపతి యగునారాజశ్రేష్ఠుని) తోడం గూడి శతసహస్రసంవత్సరంబులు భూస్వర్గభోగంబు లనుభవించి యాపూర్వచిత్తివలన నాభి కింపురుష హరివ ర్షేలావృత రమ్యక హిరణ్మయ కురు భద్రాశ్వ కేతుమాలసంజ్ఞలు గలకుమారులఁ (బ్రతిసంవత్సరం బొక్కొక్కనిఁగఁ) దొమ్మండ్రం గాంచె నంత నాపూర్వచిత్తి (యాయర్భకుల గృహంబున విడిచి) యాగ్నీధ్రుం బాసి బ్రహ్మలోకంబునకుం జనిన నాయాగ్నీధ్రిపుత్త్రులు మాతృసామర్థ్యంబునం జేసి [5]స్వభావంబునన శరీరబలయుక్తు లగుచుఁ దండ్రిచేత ననుజ్ఞాతులై తమతమనామంబులఁ బ్రసిద్ధంబు లయినజంబూద్వీపవర్షంబులం బాలించు చుండి రంత నాగ్నీధ్రుండు నాపూర్వచిత్తివలనం గామోపభోగంబులం దృప్తింబొందక పూర్వచిత్తిందలంచుచు [6]వేదోక్తంబు లగుకర్మంబులం జేసి (తత్సలోకంబగు) బ్రహ్మలోకంబునకుంజనియె నిట్లుదండ్రి పరలోకంబునకుఁజనిన నాభిప్రముఖు (లగునాగ్నీధ్రికుమారు)లు దొమ్మండ్రును మేరుదేవియుఁ బ్రతిరూపయు నుగ్రదంష్ట్రయు లతయు రమ్యయు శ్యామయు నారియు భద్రయు దేవియు నను నామంబులు గల [7]మేరుపుత్త్రిక లగుతొమ్మండ్రుకన్యకలను వివాహం బై రంత. 40

భగవంతుం డగునారాయణుండు ఋషభావతార మెత్తుట.

ఆ. నరవరేణ్యుఁ డైననాభి సంతానార్థ, మంగనయును దాను నధికనియతిఁ
యజ్ఞపురుషుఁ డయిననయావాసుదేవుని, శ్రద్ధతోడఁ బూజ సరవిఁ జేసి. 41

వ. మఱియుం (బ్రవర్గ్యసంజ్ఞికంబు లగుకర్మంబులు శ్రద్ధావిశుద్ధద్రవ్య) దేశకాల మంత్రర్త్విగ్దక్షిణావిధానయోగంబులం బరమేశ్వరుని మెప్పించిన నెవ్వారికిం బ్రసన్నుండు గానిపుండరీకాక్షుండు భక్తవత్సలుం డై సురుచిరావయవంబులతోయజనశీలం బయినయాతనిహృదయంబునందుఁ బాయనిరూపంబు గలిగి [8]మనోనయనానందకరావయవంబులు గలతనస్వరూపం బాతనికిఁ జూపం దలంచి. 42

---

1 'మాకుం. 2 జాలము. 3 మావాక్య. 4 మమ్ముం. 5 సారూప్యంబునం జేసి వయోబలయుక్తు వ్రా. ప్ర. 6 'వేదోక్తంబున జన్నంబు సేసి. 7 'మేరుదేవిబిడ్డల వివహం. 8 మనోనందకరం బైన తనస్వరూపంబు' వ్రా. ప్ర.

సీ. అంత నావిష్కృత । కాంతచతుర్భుజం, బులును బీతాంబరం । బును వెలుంగ
శ్రీవత్సకౌస్తుభ । శ్రీరమాచిహ్నంబు, లురమందు రమ్య మై । యిరవుపడఁగ
శంఖచక్రగదాంబు । జాతఖడ్గాదిది, వ్యాయుధంబులు సేతు । లందు మెఱయ
నతులితనవరత్న । హాటకాంకితనూత్న, ఘనకిరీటద్యుతుల్ । గడలుకొనఁగఁ
తే. గర్ణకుండలకటిసూత్ర । కనకరత్న, హారకేయూరవరనూపు । రాదిభూష
ణముల భూషితుఁడైన శ్రీ । నాయకుండు, దంపతులకప్పు డెదురఁ బ్ర । త్యక్షమయ్యె.
తే. ఇట్లు ప్రత్యక్షమయినపర । మేశ్వరునిని, బెన్నిధానంబుఁ గనుఁగొన్న । పేదమాడ్కి
హర్ష మొందినబుత్త్విక్కు । లవనతాస్యు, లగుచు నభినుతిసేసి రి । ట్లనుచు నపుడు.
క. పరిపూర్ణుఁడ వై యుండియు, మఱవక మాపూజ లెల్ల । మన్నింతువు నీ
చరణారవిందసేవయు, ధరఁ బెద్దలు వినిచినటులు । దగఁ జేసెద మా. 45
క. ఏ మిపుడు సేయుసంస్తుతి, నీమహిమ నెఱింగి కాదు । నిరతముఁ బెద్దల్
దా మెది యుపదేశించిరొ, యామతమునఁ బ్రస్తుతింతు మయ్య । మహాత్మా. 46
వ. మఱియు నీవు సంసారాసక్తమతి గలిగినవారికి వశ్యుండవుగా వీశ్వరుండవును ప్రకృతిపురుషవ్యతిరిక్తుండవును బరమపురుషుండవును నయిననిన్నుఁ బొందని ప్రపంచాంతర్గతంబు లయిననామరూపంబులు గలయస్మదాదులచేత నిరూపింప నశక్యం బగు సర్వజీవులం జెందినదురితసంఘంబుల నిరసించుస్వభావంబు గల నీయుత్తమగుణంబులయందు నేకదేశంబు గాని సర్వగుణనిరూపణంబు సేయ నెవ్వరికి శక్యంబు గా నేరదు నీభక్తులు మిక్కిలి భక్తిం జేసి సంస్తుతించుగద్గదాక్షరంబులను సలిలశుద్ధపల్లవతులసీదళదూర్వాంకురంబులను సంపాదించినపూజను సంతసిల్లెడినీకు బహువిధద్రవ్యసంపాదనంబు గలిగి విభవయుక్తంబు లయిన యశ్వమేధాదులును దృప్తికరంబులు గానేరవు స్వభావంబున సర్వకాలంబులందును సాక్షాత్కరించి యతిశయం బై వర్తించుచు నశేషపురుషార్థస్వరూపమవు పరమానందరూపమవు నైనవాఁడ వగుటం జేసి యజ్ఞాదులయందు నీకుఁ దృప్తిలేక యున్న నస్మదాదులకోరికల నాపాదించుకొఱకు యజ్ఞాదుల నొనరింతు మని మఱియు ని ట్లనిరి. 47
క. బాలిశుల మగుచు మిక్కిలి, మే లెఱుఁగనిమమ్ము నీదు । మించినదయచేఁ
బాలించి యిత్తు వెప్పుడుఁ, జాలఁగ నిహపరములందు । సకలసుఖములున్. 48
ఆ. ఇపుడు మేము నీకు । నిష్టంబు లగుపూజ, లాచరింప కున్న । నైన నధిక
మయిననీకృపాక । టాక్షవీక్షణములఁ, జక్కఁ జూచి తగఁ బ్ర । సన్నుఁ డగుచు.
క. వర మీయఁదలఁచి మమ్ముం, గరుణించితి గాక నిన్నుఁ । గనుఁగొనుటకు నై
యరసి నుతింపఁగ మాకుం, దర మగునే వరద నీర । దశ్యామాంగా. 50

---

1 గలిగి వశుండు గాని జీవుండు నీశ్వరుండవు నైననీస్వరూపంబు నిన్ను ముట్టి నీప్రపం... రూపంబుల నిరూపింప శక్యుండు గాఁడు.

వ. మఱియు నిస్సంగులై నిశితజ్ఞానంబునంజేసి దోషరహితులై భగవత్స్వభావులు నాత్మారాములు నగుమునులకు స్తుతియింపఁదగినగుణంబులు గలవాఁడ వగుచుండియుఁ బ్రసన్నుండవు [1]స్ఖలనక్షుతపతనజృంభణాదిదురవస్థలందును జ్వరమరణాదిదుర్దశలందును (వివశుల మగుమాకుఁ) గల్మషనాశకరంబు లయినభవద్దివ్యనామంబులు మావచన[2]గోచరంబు లగుం గాక మఱియు నీరాజర్షి పుత్రకాముం డై నీతోడ సమానుం డయినకుమారునిం గోరి కామంబుల స్వర్గాపవర్గంబుల నీ నోపిననినుం బూజించి ధనకాముం డైనవాఁడు ధనవంతునిం జేరి తుషమాత్రం బడిగినచందంబున మోక్షనాథుండ వైననీవలన సంతానంబు గోరుచున్నవాఁడు జయింప రానినీమాయచేత నెవ్వండు మోహంబు నొంది విషయాసక్తుండు గాక యుండు[3] నర్థకాములము మదాంధులము నగుమేము నిన్ను నాహ్వానంబు సేసినయపరాధంబు (సర్వాత్మకుండ వగుటంజేసి సామ్యంబుచే) మన్నింపం దగుదువు మమ్ము దయఁ జూడు మని ప్రణమిల్లిన సర్వేశ్వరుండు వర్షాధిపతి యగునాభిచేతను ఋత్విక్కులచేతను వంద్యమానుం డై దయాకలితుం డగుచు ని ట్లనియె. 51

క. మునులార వేదవాక్యము,లను బ్రస్తుతి సేసి సర్వలక్షణముల నా
కెన యగుపుత్రుని నిమ్మని, వినఁ బలికితి రిపుడు మిగుల వేడుకతోడన్. 52

క. [4]నాకాదిలోకములలో, నాకుఁ సరివచ్చునట్టినందను నెటు నా
లోకింప లేరు గావున, నాకుఁ సరి నేన కా మనసమున నెఱుఁగుఁడీ. 53

వ. అదియునుం గాక భూసురోత్తములు నాముఖం బగుటంజేసి విప్రవాక్యంబు దప్పింపరాదు మీరు నాయీడుకుమారు నడిగితిరి గావున నాభిపత్ని యగుమేరుదేవియందు నేన పుత్రుండనై జనియించెద నని పలికి పరమేశ్వరుం [5]డాగ్నీధ్రి యపత్ని యగుమేరుదేవి సూచుచుండ నాయజ్ఞంబున నంతర్ధానంబు నొంది యానాభిమీఁదిదయంజేసి (దిగంబరులును దపస్వులును జ్ఞానులును నూర్ధ్వరేతస్కులును నగునైష్ఠికులకు) యోగధర్మంబుల నెఱింగింపం దలంచి పుండరీకాక్షుండు నాభిపత్ని యగుమేరుదేవిగర్భాగారంబునం బ్రవేశించె నంత. 54

ఆ. మేరుదేవియందు మేరుధీరుం డగు,హరి సమస్తలక్షణాన్వితుండు
శమదమాదిగుణవిశారదుం డుదయించె, సకలజనుల కపుడు సంతసముగ.55

ఆ. అతనికాంతియుక్తమయినదేహంబును, మహితబలపరాక్రమంబు వీర్య
మును దలంచి చూచి జనకుండు పేరిడె, సుతుని ఋషభుఁ డనుచు సొంపుతోడ.

క. ధరణీసురులును మంత్రులుఁ, బరివారము హితులుఁ బ్రజలు బాంధవులును సు
స్థిరమతి నాబాలకునిం, గర మనురాగమున రాజుగాఁ జూచి రిలన్. 57

---

1 స్వప్నాదిదురవస్థం. 2 బులకు గోచరంబులు గాకున్నను నీతోడ. 8 మునుల మగుమేము. 4 లోకాలోకములందును... నందనులను నెట్లా కాంక్షింపరు.5 డు హోమగుండంబునందు నంతర్ధానంబు

క. పురుహూతుఁ డతనిమహిమలు, సరగున విని చిత్తమునకు సహ్యము గామిం
బరికించి ఋషభుఁ డేలెడి,ధరణి ననావృష్టి మిగులదట్టము సేసెన్. 58

ఆ. అది యెఱింగి ఋషభుఁ డంతట యోగమా,యాబలంబుకతన నఖిలరాజ్య
మందుఁ గురియఁజేసె నత్యంతసంపూర్ణ,వృష్టి దినదినంబువృద్ధిఁ బొంద. 59

వ. ఇట్లు ఋషభుండు పురందరుండు సేయు[1]దౌష్ట్యంబునకు నవ్వి (యజనాభం బను) తనమండలంబు సుభిక్షంబుగాఁ జేసి నాభియుం దనకోరినచందంబునం బుత్త్రుండు జనియించి వర్ధిల్లుటకు సంతసిల్లి తనచేత నంగీకరింపంబడునరలోక ధర్మంబు గల పుండరీకాక్షునిమాయావిలసితంబునం జేసి బాలక నాతండ్రి యని మోహంబున నుపలాలించుచుఁ బ్రజానురాగంబున సర్వసమ్మతుం డయినపుత్త్రుని (సమయసేతురక్షణంబునకుఁ) బూజ్యం బయినరాజ్యంబునం దభిషిక్తుం జేసి భూసురులకుఁ బ్రధానవర్గంబునకు నప్పగించి మేరుదేవింగూడి నరనారాయణస్థానంబయినబదరికాశ్రమంబునకుం జని యచ్చట మహాయోగసమాధిచే [2]నరనారాయణాఖ్యుండుఁ బురుషోత్తముండు నగువాసుదేవు నారాధించి క్షీణదేహుం డై యానాభి హరితాదాత్మ్యంబు నొందె నంత. 60

చ. సరసత నేనృపాలకునిజన్మమునందు భూసురోత్తముల్
సరసిజనాభునిం దగఁ బ్రసన్నతఁ బెట్టిన నంత మెచ్చి యీ
శ్వరుఁడు దనంత గర్భమున వచ్చి తనూభవుఁ డై జనించె నా
నరపతి నాభికిన్ సరి యనం దగునే నరనాథ యన్యులన్. 61

వ. అంత. 62

సీ. భూవరుఁ డగుఋషభుఁడు దనరాజ్యంబుఁ, గర్మభూమిఁగ నాత్మఁ గాంచి జనుల
కందఱకును బ్రియం బగునట్లు కర్మతం,త్రంబెల్లఁ దెలుపంగఁ దలఁచి కర్మ
ములు సేయుటకు గురుకులయొద్ద వేదంబు, సదివి వారలయనుజ్ఞను వహించి
శతమన్యుఁ డిచ్చినసతి జయంతీకన్యఁ, బరిణయం బై యట్టిపడఁతివలన

తే. భరతుఁ డాదిగ సుతుల నూర్వురను గాంచె, నట్టిభరతునిపేరను నవనితలము
పురవరాశ్రమగిరి[3]తరుపూర్ణ మగుచు, నమరి భారతవర్ష నామమున మించె.

వ. ఆమహాభారతవర్షంబునందుఁ దమతమపేరం బరఁగుభూములకుం గుశావర్త నిలావర్త బ్రహ్మావర్త నార్యావర్త మలయకేతు భద్రసేన నిద్రస్పృగ్విదర్భ కీకటు లనుతొమ్మండ్రు కుమారులను [4]దక్కం గలయెనుబండ్రు పుత్త్రులకుఁ బ్రధానులం జేసె నంతం గవి హరి నంతరిక్ష ప్రబుద్ధ పిప్పలాయ నావిర్హోత్ర ద్రమిళ చమస కరభాజను లనువారు దొమ్మండ్రును [5]భాగవతధర్మప్రకాశకు లైరి (భగవన్మహిమోపబృంహితంబు లగు) వారలచరిత్రంబులు ముంద ఱెఱింగించెదఁ

1 గుర్బుద్ధికి. 2 నీశ్వరోపాస్తి సేయుచు క్షీణ. 3 కుంజపుంజ మగుచు. 4 రాజులుగాఁ జేసె.
5 భగవద్ధర్మంబు గలవా రైరి.

దక్కినయెనుబది యిద్దఱుకుమారులు (పిత్రాదేశకరులు నతివినీతులు) మహాశ్రోత్రి
యులు యజ్ఞశీలురుఁ గర్మనిష్ఠులు నయినబ్రాహ్మణోత్తములైరి ఋషభుండు స్వతం
త్రుండై సంసారధర్మంబులం బొరయక కేవలానందానుభవుం డయినయీశ్వరుం
డై యుండియుఁ బ్రాకృతుండునుంబోలెఁ (గాలానుగతంబు లగు) ధర్మంబుల నాచ
రించుచు (ధర్మప్రవర్తకులకు సముండును నుపశాంతుండును మైత్రుండును గారు
ణికుండును నై ధర్మార్థయశఃప్రజానందామృతావరోధంబుచే గృహస్థాశ్రమంబు
లం బ్రజల నియమించుచుఁ) గొంతకాలంబు నీతిమార్గంబు దప్పక ప్రజాపాలనంబు
సేయుచు (వేదరహస్యంబు లగుసకలధర్మంబులు స్వవిదితంబు లయినను) బ్రాహ్మ
ణోప[1]దేశపూర్వకంబుగా ద్రవ్యదేశకాలవయశ్శ్రద్ధర్త్విగ్వివిధోద్దేశోపచితంబులు
గ నొక్కొక్క క్రతువును శతవారంబు యథావిధి గఁ జేసి సుఖం బుండె నంత.

క. జనవర ఋషభుని రాజ్యం,బున నైహికఫలముఁ గోరుపురుషుని నొకనిం
గనుఁగొన నెఱుంగ మెవ్వఁడు, నిన తేజం డతనిమహిమ లే మని చెప్పన్. 65

ఋషభుండు పుత్రులకు నీతి యుపదేశించుట.

సీ. ఆఋషభుండు రాజ్యంబు సేయుచు నుండి, యంతట నొక్కనాఁ డాత్మయందుఁ
దలపోసి భూలోకఫల మపేక్షింపక, మోహంబు దిగనాడి పుత్రులకును
దనరాజ్యమెల్ల నొప్పనచేసి వెనువెంటఁ, గొడుకులు మంత్రులుఁ గొలిచి రాఁగ
నల్లన యరిగి బ్రహ్మావర్తదేశంబు,సందుల నపుడు మహాత్ము లయిన
తే. యట్టిమునిజనసమ్ముఖంబందుఁ జేరి, తనదుపుత్రుల నందఱ దాయఁ బిలిచి
పరమపుణ్యుండుఋషభుండు ప్రణయ మొప్ప,హర్షమందుచు నప్పుడి ట్లనుచుఁ బ
ఆ. తనయులార వినుఁడు ధరలోనఁ బుట్టిన,పురుషులకును శునకములకు లేని [లికె.
కష్టములను దెచ్చుఁగాన కామంబుల,వలన బుద్ధి సేయ వలదు మీరు. 67
చ. నరులకు నేతపంబున ననంతసుఖంబులు గల్గుచుండు శ్రీ
కరమతి నాతపంబుఁ దగఁ గైకొని చేసిన బ్రహ్మసౌఖ్య[2]మున్
దిరముగఁ గల్గు వృద్ధులను దీనులఁ బ్రోవుఁడు దుష్టవర్తనల్
జరుగుచు నుండుకాముకులసంగతిఁ బోకుఁడు మీఁద మే లగున్. 68

వ. మఱియు (సంగనాసక్తు లగుకాముకులసంగంబు నిరయరూపం బయినసంసారం
బగు మహత్సంగంబు మోక్షద్వారం బగు నట్టిమహాత్ము లెవ్వ రనిన) శత్రు
మిత్రవివేకంబు లేక సమచిత్తులును శాంతులును (క్రోధరహితులును) సకలభూ
తదయాపరులును సాధువులును నగువారలు మహాత్ము లనందగుదు రట్టిమహాత్ము
లు నాయందలిస్నేహంబె (ప్రయోజనంబుగాఁ) గలిగియుండుటం జేసి (విషయవా
ర్తాప్రవృత్తు లగుకుజనులందుఁ) దమదేహగృహమిత్రదారాత్మజాదులందుఁ బ్రీతి
లేక యుండుదురు విషయాసక్తుఁ డయినవాఁడు వ్యర్థకర్మంబులం జేయు నట్టిదు

1 దేశంబునఁ గ్రతుశతంబు సేసి సుఖం బుండె. 2 మం దిరవునఁ బొందు.

ష్కృతకర్మంబులం జేయువాఁ డెప్పుడును బాపకర్ముఁ డగుచుం (గ్లేశదం బగు దేహంబు నొందు) చుండుఁ గావునఁ బాపమూలంబు లయినకామంబులు గోరకుఁడీజ్ఞానం బెంతకాలంబు లేకయుండు నంతకాలంబు నాత్మతత్త్వం బెఱుం గ(ంబడ దాతత్త్వం బెఱుంగ) కుండుటం జేసి దేహికి దుఃఖం బధికం బై యుండు లింగదేహం బెంతదడ వుండు నంతదడవును మనంబు కర్మవశంబై జ్ఞానవంతంబు గాక యవిద్యం బాయ కుండు శరీరంబు గర్మమూలం బగుటవలనఁ గర్మంబులు సేయఁ జనదు (వాసుదేవుం డగు)నాయందుఁ బ్రీతి యెంతదడవు లేక యుండు నంతదడవును దేహధర్మంబులు బాధించు విద్వాంసుం డైనను దేహేంద్రి యాదులయందుఁ బ్రీతిసేసిన(మిథునీభావసుఖప్రధానం బగు)గృహస్థాశ్రమంబు నంగీకరించి (స్వరూపస్మృతిశూన్యుం డై మూఢుం డగుచు) నందు సంసారతా పంబులఁ బొందుఁ బురుషుండు స్త్రీతోడం గూడి యేకీభావంబు నొం(దుట) ద(నకు హృదయగ్రంథియై యుండు) నందు (జనునకు గృహక్షేత్రసుతాప్తవిత్తం బులందు నేను నాయది యనియెడిమోహంబు గలుగు నట్టి స్త్రీపురుషమిథునీ భావంబుచే) సంతానంబు గలుగు నాసంతానకారణంబున గృహక్షేత్రవిత్తా దులు సంపాదింపంబడు నందు మోహం బధికం బగుటం జేసి మోక్షమార్గంబు దవ్వగు నిట్లు సంసారంబునం దుండియు మనంబున నెప్పుడు ముక్తిచింతం జేయు నప్పుడు సంసారంబునుం బాయు మోక్షోపాయంబులు పరమగురుండ నైననాయందుల భక్తి సేయుటయు విగతతృష్ణయు ద్వంద్వతితిక్షయు [2]సర్వలో కంబులందులజంతువ్యసనావగతియు [3]నీశ్వరవిషయజ్ఞానాపేక్షయుఁ (దపంబును) విగతేచ్ఛయు (మత్కృతకర్మంబులు) మత్కథలు వినుటయు నన్నె దైవంబు గా నెఱుంగుటయు నస్మద్గుణకీర్తనంబులును [4]నిర్వైరత్వసామ్యోపశమంబులును దే హగేహంబులందు నాత్మబుద్ధిజిహాసయు నధ్యాత్మయోగంబును నేకాంతసేవ యుఁ [5]బ్రాణేంద్రియాత్మల గెలుచుటయుఁ గర్తవ్యాపరిత్యాగంబును సచ్ఛ్రద్ధయు బ్రహ్మచర్యంబును గర్తవ్యకృత్యంబులందుల నప్రమత్తుం డగుటయు వాఙ్నియ మనంబును సర్వంబు నన్నకాఁ దలంచుటయు జ్ఞానంబును విజ్ఞానవిజృంభితం బైన యోగంబును (ధృత్యుద్యమంబును)సాత్త్వికంబును నాదిగాఁ గల తెఱంగులచేత లింగదేహంబు జయించి దేహి కుశలుం డగుచు నుండ వలయు. 69

ఆ. అరయఁ గర్మరూప మగునవిద్యాజన్న, మైనహృదయబంధనాదిలతల
నప్రమత్తయోగమను[6]మహాచ్ఛురికచేఁ, ద్రెంప వలయు నంతఁ ద్రెంపుతోడ.

ఆ. ఒనర నిట్లు యోగయుక్తుండు గురుఁ డైన, భూపుఁ డైన శిష్యపుత్రవరుల

1 కర్మంబులుం గాయుచుండు. 2 సర్వజంతువ్యసననిరీక్షణంబును. 3 నీశ్వరదర్శనాపేక్షయు. 4 నిరహంకారంబును గర్మత్యాగేచ్ఛయు నధ్యాత్మ. 5 నాత్మజయంబును శ్రద్ధయు. 6 మహాసురియచే. 7 నరపతైన శిష్యవరుల నెల్ల.

యోగయుతులఁ జేయ । నొప్పఁగా వలయును, గర్మపరులఁ జేయఁ । గాదు కాదు.

సీ. జను లెల్ల నర్థవాం । ఛలఁ జేసి యత్యంత, మూఢులై యైహికం । బును మనంబు
లందును గోరుదు । రల్పసౌఖ్యములకు, నన్యోన్యవైరంబు । లంది దుఃఖ [నెంత
ములఁ బొందుదురు గాన । మును గోని గురుఁడైన, వాఁడు మాయామోహ । వశుఁడు
జడుఁడును నైనట్టి । జంతువు సందును, దయ గల్గి మిక్కిలి । ధర్మబుద్ధిఁ

ఆ. గన్ను లున్నవాఁడు । గానని వానికిఁ, దెరువుఁ జూపినట్లు । దెలియఁ బలికి
యతుల మగుచు దివ్య । మైన యా మోక్షమా, ర్గంబుఁ జూపవలయు । రమణతోడ.

వ. మఱియుఁ బితృగురుజననీబంధుపతిదైవతంబులలో నెవ్వరైనను (సంసారరూప) మృత్యురహితంబైన మోక్షమార్గంబుఁ జూప కుండిరేని వా రెవ్వరును హితులు గానేరరు నాదుశరీరంబు (దుర్విభావ్యంబు నాదుమనంబు) సత్త్వయుక్తంబును ధర్మసమేతంబును బాపరహితంబును నగుటం జేసి పెద్దలు నన్ను ఋషభుం డండ్రు గావున (శుద్ధసత్త్వమయంబైన) నాశరీరంబునం బుట్టినకుమారు లందఱును (సోదరుండును మహాత్ముండును నగ్రజుండును) నైన భరతు నన్నే కాఁ జూచి (యక్లిష్టబుద్ధిచే భజింపుం డదియ నాకు శుశ్రూషణంబు) ప్రజాపాలనంబు సేయుట మీకును బరమధర్మం బని మఱియు నిట్లనియె. 73

సీ. భూతజాలములందు । భూజముల్ వర్యముల్, భూరుహములకంటె । భోగికులము
భోగిసంతతికన్న । [1]బోధనిష్ఠులు బోధ, మాన్యులకన్నను । మనుజవరులు
వీరికన్నను సిద్ధ । విబుధగంధర్వులు, వారికన్నను సురల్ । వారికన్న
నింద్రాదిదేవత । లిందఱికన్నను, దక్షాదిసన్మునుల్ । దలఁప నెక్కు

తే. డంతకన్నను భర్గుఁ డా । యబ్జభవుకన్నఁ, గమలభవుఁ డెక్కు డాతని । కంటె విష్ణుఁ
డధికుఁ డాతఁడు విప్రుల । నాదరించుఁ, గాన విప్రుండు దైవంబు । మానవులకు.

క. భూసురులకు సరిదైవం, బీసచరాచరమునందు । నెఱుఁగను నాకున్
భూసురులు గుడుచునప్పటి, యాసంతోషంబు [2]దోఁప । దగ్నులయందున్. 75

సీ. మంగళంబైన బ్ర । హ్మస్వరూపంబును, వేదరూపంబు నా । నాదిరూప
మగుచున్న నాదు దే । హము బ్రాహ్మణోత్తముల్, ధరియింతు రెప్పుడుఁ । దత్త్వబుద్ధి
శమదమానుగ్రహ । సత్యతపస్థితి, క్షలు గల్గు విప్రుండు । సద్గురుండు
గాన మిక్కిలిభక్తి । గల్గి యకించను, లైన భూసురుల దే । హములవలన

తే. నందుచుండును నాదు దే । హంబు గాఁగ, నెఱిఁగి [3]వరు లగు విప్రుల । నెల్ల భక్తిఁ
బూజ సేయుటచే నన్నుఁ । బూజ సేయు, టనుచు వినిపించి మఱియు ని । ట్లనుచుఁ బలికె.

క. ఈ తెఱఁగు దెలిసి భూసుర, జాతిం బూజించునట్టి । జనుఁడును మాయా
[4]తీతుం డై నిక్కంబుగ, భూతలమున మోక్షమార్గ । మును [5]బొడగాంచున్. 77

---

1 బుద్ధిమంతులు బుద్ధిమంతులకన్నను. 2 లేదు యజ్ఞములందున్. 3 యేకాంతు లావిప్రవరుల నెల్ల. 4 పేతులు నై. 5 బొడగందుర్.

వ. ఇట్లు సదాచారు లగుకుమారులకు లోకప్రదర్శనార్థం బాచారంబు లుపదేశించి
మహాత్ముండును బరమసుహృత్తును నగుభగవంతుండు ఋషభాపదేశంబునం గర్మ
త్యాగంబు సేసి (యుపశమశీలు రగు)మునులకు భక్తిజ్ఞానవైరాగ్యలక్షణంబు
లు గలపారమహంస్యధర్మం బుపదేశింపఁ గలవాఁ డగుచుఁ బుత్రశతంబునం
దగ్రజుండును (బరమభాగవతుండును భగవజ్జనపరాయణుండును) నగుభరతుని
(ధరణీపాలనంబునకుఁ) బట్టంబు గట్టి (తాను గృహమందె) దేహమాత్రావలంబ
నంబు సేసి దిగంబరుం డై యున్మత్తాకారుం డగుచుం (బ్రకీర్ణకేశుండై)యగ్ను
ల నాత్మారోపణంబు సేసి బ్రహ్మావర్తదేశంబును బాసి జడాంధబధిరమూకపిశా
చోన్మాదులుంబోలె నవధూతవేషంబు నొంది జనులకు మాఱు వలుకక మౌనవ్ర
తంబునం బుర గ్రామాకర జనప దారామ శిబిర వ్రజ ఘోష సార్థగిరి వనాశ్ర
మాదులయందు వెంటఁ జను దెంచు దుర్జనతర్జన తాడ నావమాన మేహన నిష్ఠీవ
న పాషాణ శకృ ద్రజః ప్రక్షేపణ పూతివాత దురుక్తులం బరిభూతుం డయ్యును
గణనం బెట్టక వనమదేభంబు మక్షికాదికృతోపద్రవంబునుంబోలెఁ గైకొనక
దేహాభిమానంబునం జిత్తచలనంబు నొందక యేకాకి యై చరియించుచుండ నతి
సుకుమారంబు లగుకరచరణోరస్స్థలంబులు విపులంబు లగుబాహ్వంసకంఠవద
నాద్యవయవవిన్యాసంబులుం గలిగి ప్రకృతిసుందరం బగుచు స్వతస్స్నిగ్ధదరహాసరు
చిరముఖారవిందంబై నవనళినదళంబులం బోలి శిశిరకనీనికలం జెలువొంది యరు
ణాయతంబు లగునయన(ంబులచే నొప్పి యన్యూనాధికంబు లగు) కపోలకర్ణకం
ఠనాసాగండ(ంబులచేఁ దేజరిల్లుచు) నిగూఢస్మితవదనవిభ్రమంబులం బ్రకా
శించుతనదివ్యమంగళవిగ్రహంబుచేఁ బరకాంతలచిత్తంబుల [1]కత్యంతమోహంబు
గలుగఁ జేయుచు. 78

ఆ. ధూళిచేత మిగుల ధూసరితంబు లై, జడలు గట్టి కడుఁ బిశంగవర్ణ
ము నగు కేశపాశములను వెలిఁగించుచు, నితరు లెవరుఁ దన్ను నెఱుఁగకుండ.

క. అవధూతవేషమున ని, ట్లవని మలినంబు లైన యవయవములతోఁ
దవిలి చరించుచు నుండును, భువి భూతాక్రాంతుఁ డయిన పురుషునిమాడ్కిన్.

ఆ. జనుల కిట్లు యోగసంచార మెల్ల వి, రుద్ధ మనుచు నాత్మ[3]బుద్ధిఁ జూచి
యజగరంబుమాడ్కి నవనిపై నుండె బీ, భత్సకర్మమునకుఁ బాలుపడుచు. 81

వ. ఇట్లు బీభత్సరూపంబున వసుంధరం బడి యుండి యన్నంబు భుజించుచు నీరు ద్రా
వుచు మూత్రపురీషంబులు విడుచుచు నవి శరీరంబున నంటం బొరలుచుండు
మఱియుఁ దత్పురీషసౌగంధ్యయుక్తం బగువాయువు దశదిశల దశయోజనపర్యం
తంబు పరిమళింపఁ జేయుచుండ గోమృగకాకచర్యలం జరియించుచు భగవదం
శం బైన ఋషభుండు మహానందంబు ననుభవించుచుఁ దనయందు సర్వభూతాం

---

1 మన్మథశరపరంబులు. 2 ధూళిధూసరములతోఁ గుటిలంబు లై. 3 గోసి.

తర్యామి యగువాసుదేవునిం బ్రత్యక్షంబుగాఁ గనుంగొనుచు సిద్ధిం బొందిన
వైహాయసమనోజవపరకాయప్రవేశాంతర్ధానదూరగ్రహణశ్రవణాదియోగసిద్ధు
లు దమంత వచ్చినం గైకొనక యుండె నని పలికిన శుకయోగీంద్రునకుం బరీ
క్షిన్నరేంద్రుం డి ట్లనియె. 82

క. మునివర యోగజ్ఞానం, బునఁ జెఱుపం బడ్డకర్మములు గలపెద్దల్
గని యుండెడి యైశ్వర్యం, బును ఋషభుం డెఱిఁగి యేలఁ బొందక యుండెన్.

వ. అనిన శుకుం డి ట్లనియె. 84

మ. ధరణీవల్లభ నీదువాక్యములు తథ్యం బింతయుం దప్ప దె
ట్లరయన్ వన్యమృగంబు పట్టువడి తా నా వేళ నాలుబ్ధకున్
ధర వంచించినమాడ్కి నింద్రియములన్ దండించి చిత్తంబు ని
ర్భరకామాదుల కాస యిచ్చుఁ గడు సంరంభంబుతోఁ గ్రమ్మఱన్. 85

క. చిరకాలతపము నైనను, హరియింపఁగ నోపుఁ జిత్త మని పెద్దలు న
మ్మరు జారులకున్ జారిణి, కరణిని నడరించు మనసు కామాదులకున్. 86

క. కామక్రోధాదికముల్, భూమీశ్వర కర్మబంధములు మఱియును జే
తోమూలము లగుటను దా, రీమహిలో మనసు నమ్మ రెప్పుడుఁ బెద్దల్. 87

సీ. అది గాన యెన్నఁడు నైశ్వర్యములను జేపట్టఁ జూడఁడు లోకభవ్యు లైన
వారలచే నభివందనంబులు వొంది, వెలయంగ నవధూతవేషభాష
ణంబుల నెఱిఁగికొనఁగ వానిభగవత్స్వరూపంబు గలిగి యా[1]రూపమందుఁ
బరమయోగధ్యానపరులకు నెల్ల దేహత్యాగసమయంబు నంతలోనఁ

తే. జూపుచుండియు దేహంబుఁ బాపనిచ్చ, యించెనచ్చట దివ్యయోగీంద్రుఁడాద్యుఁ
డతులదివ్యప్రకాశకుఁడమరగురుఁడు, పరమపురుషుండు ఋషభుండు పార్థివేంద్ర.

వ. అంత (విముక్తలింగుండును భగవంతుండును నగుఋషభుండు మనంబునం దేహాభి
మానంబు విసర్జించి కులాలచక్రంబు గులాలునిచేత భ్రమియింపంబడి విసృష్టం
బయ్యును భ్రమియించుగతిం బ్రాచీనసంస్కారవిశేషం బగునభిమానాభాసం
బున దేహచలనాదికంబుల నొప్పియుండియు యోగమాయావాసనచే యుక్తుం
డయ్యె మఱియు నాఋషభుం డొక్కదినంబునం గొంకణవంకపటంబు లను
దక్షిణకర్ణాటకదేశంబులకు యదృచ్ఛం జని కుటకాచలోపవనంబున నిజాస్య
కృతశిలాకబళుం డగుచు నున్మత్తునిచందంబున వికీర్ణకేశుండు దిగంబరుండు నై
సంచరింప వాయువేగవిధూతరేణుసంఘర్షణసంజాతం బగునుగ్రదావానలంబు
తద్వనంబు దహింప నందు దగ్ధుం డయ్యె నంత నతనికృత్యంబులు తద్దేశవాసు
లగుజనంబులు సెప్ప నర్హన్నామకుం డగుతద్రాష్ట్రాధిపతి విని నిజధర్మంబులం
బరిత్యజించి స్వదేశస్థులతోడం గూడి దా నాయాచారంబుల నంగీకరించి యధ

1 రూఢి నంతఁ.

ర్మబహుళం బగుకలియుగంబున భవితవ్యతచే విమోహితుం డై మనుజుల నస
మంజసం బగుపాషండమతాభినివేశులం జేసె) మఱియును గలియుగంబునం ద
ర్వాన్తతముల మనుజాధములు దేవమాయామోహితులై శాస్త్రోక్తశౌచాచారం
బులు విడిచి (నిజేచ్ఛం జేసి) దేవతానిందలు సేయుచు నస్నానానాచమనాశౌచకే
శోల్లుంఛనాదికాపవిత్ర వ్రతంబులం జేయుచు [1]నధర్మబహుళం బగుకలియుగంబు
నం జెఱుపంబడ్డబుద్ధిధర్మంబులు గలిగి వేదబ్రాహ్మణయజ్ఞపురుషుల దూషించుచు
లోకంబులం[2]దమతమమతంబులంకుందామె సంతసిల్లుచు (నవేదమూలం బగుస్వే
చ్ఛం జేసి ప్రవర్తించి యంధపరంపరచే విశ్వాసంబు సేసి తమంతన) యంధతమ
సంబునం బడుచునుండుదు రీఋషభుని యవతారంబు [3]రజోవ్యాప్తు లగుపురుషుల
కు మోక్షమార్గంబు నుపదేశించుటకు నయ్యె నదియునుంగాక[4] సప్తసముద్రపరి
వృతంబు లగునీభూద్వీపవర్షంబులందలి జనంబులు దివ్యావతారప్రతిపాదకంబు
శుద్ధంబు నగునెవ్వని కృత్యంబులు గీర్తింతురు మఱియు నెవ్వని యంశంబున నతి
కీర్తిమంతుం డగుప్రియవ్రతుండు గలిగె నెందు జగదాద్యుం డగుపురాణపురు
షుం డవతారంబు నొంది కర్మహేతుకంబు గాని మోక్షధర్మంబుం దెలిపె నెండి
యు నెవ్వండు యోగమాయాసిద్ధుల నసద్భూతంబు లగుటం జేసి నిరసించె నట్టి
ఋషభునితోడం దత్సిద్ధికృతప్రయత్ను లగునితరయోగీశ్వరులు మనోరథంబున
నైన నెట్లు సరియగుదు రిట్లు సకలవేదలోకదేవబ్రాహ్మణులకు గోవులకుం బరమ
గురుండు భగవంతుండు నగుఋషభునిచరిత్రం బెవ్వరు వినినను దుశ్చరితంబులు
దొలంగు మంగళంబులు సిద్ధించు మిక్కిలి శ్రద్ధతో నెవ్వండు విన్నను వినిపించినను
హరిభక్తి దృఢంబగు నట్టిహరిభక్తితాత్పర్యమునం (బెద్దలు భాగవతులగుటం జేసి
సంప్రాప్తసర్వపురుషార్థు లగుచు వివిధవృజినహేతుకం బగు) సంసారతాపంబును
బాసి [5]యవిరతంబుం దద్భక్తియోగామృతస్నానంబు సేసి పరమపురుషార్థం బ
యినమోక్షంబును జెందుదు రని సప్తద్వీపంబులవారు నేఁడునుం గొనియాడు
చుండుదురు. 89

ఆ. యాదవులకు మీకు నత్యంతకులగురుఁ, డైనకృష్ణుఁ [6]డెచటనైనఁ గలఁడు
కొలుచువారికెల్ల సులభుఁ డై మోక్షంబు, నిచ్చుఁ జింత సేయ నేల నీకు. 90

---

1 నధర్మలక్షణంబులం గలిగి కలియుగ. 2 దంధపరంపరను దమతమ. 3 (బ్రాహ్మణక్షత్రి) యు లగు మోక్ష. 4 నతనియంశంబున సప్తద్వీపములం గుఁ బ్రియవ్రతుని యంశంబునకు సరిచెప్ప నలవి గా దేవంశంబున శ్రీహరి యవతరించి మహాయోగధర్మప్రకాశంబు సేసె నాఋషభునిచరితంబు మనోరథంబుననైనఁ బొందలే రతండు యోగమాయను నిరసించి మాయాకల్పితసకలసిద్ధుల నసత్యంబు గాఁ దలఁచె నిట్లు సర్వలోకపూజ్యులైనదేవబ్రాహ్మణులకు. 5 హరికథామృతపానంబున నిర్వృతులై పరమపురుషార్థంబైనమోక్షంబు నపేక్షింప రని సప్తద్వీప:—ఇట 'మోక్షంబు నపేక్షింప' గనుటకు 'తయైవ నిర్వృత్యా పరయా హ్యపవర్గ మాత్యంతికం పరమపురుషార్థమపి నో ఏవాద్రియన్తే' అని మూలము. 6 డెక్కడైనఁ.

సీ. నిత్యానుభూత మా[1]నిజరూపలాభని,వృత్త మై తగుమహాతృష్ణ గలిగి
యతులితవిపులమాయారచితం బైన,లాభంబునకుఁ దగుఫలంబు లేని
మతి గల్గి లోకుల నతివేడ్కఁ గరుణించి, యభయదానం బిచ్చి యందఱికిల
[2]నవ్వయం బై దివ్య మై మహానంద మై, యత్యంతసేవ్య మై యతుల మైన
తే. తనదులోకంబు సూపంగఁ దగినయట్టి
మోక్షమార్గంబు నెఱిఁగించి ముక్తదేహుఁ
డగుచుఁ దాదాత్మ్య మొందెఁ బ్రత్యక్షవిష్ణు
వైనఋషభుండు జనులకు నద్భుతము గ. 91

భరతోపాఖ్యానము.

మ. భరతుం డంత ధరాతలంబుఁ గడఁకం బాలించుచున్ ధారుణీ
శ్వరచంద్రుం డగువిశ్వరూపునకు మున్ సంజాత యై యుండి ని
ర్భరకాంతిన్ విలసిల్లుపంచజని పేరం గల్గుకాంతామణిం
గర మర్థిన్ ధరఁ బెండ్లి యాడె శుభలగ్నంబందు భూవల్లభా. 92
వ. ఇట్లు (వివాహితుం డై) యాపంచజనివలన నహంకారంబునం బంచతన్మాత్రలు జనించిన తెఱంగున సుమతి రాష్ట్రభృత్సుదర్శ నాచరణ ధూమ్రకేతువు లను నేవురు పుత్రులం బుట్టించె నట ము న్నజనాభం బను పేరం బరఁగువర్షంబు భరతుండు పాలించుకతంబున భారతవర్షంబు నాఁ బరఁగె నంత. 93
క. భరతుఁడు పూర్వజు లేలిన, కరణిని గర్మముల నెల్లఁ గైకొని ప్రజలన్
హరికృప నొందుచు నేలెను, ధరణీసురవరులు పొగడ ధరణీనాథా. 94
సీ. భగవంతుఁ డగుజగద్భరితు [3]నల్పంబులు, నధికంబు లైనపెక్కధ్వరముల
దర్శపూర్ణిమలచేఁ దగను జాతుర్మాస్య, [4]ముల నగ్నిహోత్రములవలనఁ గడఁకఁ
బశుసోమములచేతఁ బలమాఱుఁ బూజించి, వేదోక్త మైనయావిమలకర్మ
ములఁ గల్గుధర్మంబుఁ బురుషోత్తమార్పణం,బుగఁ జేయుచును మఖంబులనుమంత్ర
తే. ములను బలికెడునాదైవములను శ్రీశు
నవయవంబులు గాఁ[5]గ భూధవుఁడు ప్రేమ
ననుదినంబును బాయక ఘనతఁ దలఁచి
యఖిలరాజ్యానుసంధానుఁ డగుచు నుండె. 95
క. ఈరీతిఁ గర్మసిద్ధుల, నారయ నత్యంతశుద్ధ మగుచిత్తముతో
నారాచపట్టి భరతుఁడు, ధారుణిఁ బాలించె నధికధర్మాన్వితుఁ డై. 96
వ. మఱియు నాభరతుండు శ్రీవత్సకౌస్తుభవనమాలాలంకృతుండును సుదర్శనాద్యాయుధోపలక్షితుండును నిజభక్తజనహృదయారవిందనివాసుండును బరమ

1 నిజరూపుచేత నివృత్త. 2 నవ్యయంబును మహానందకరంబును, దివ్యంబు నత్యంతసేవ్యమైన.
3 నిగణనాధికము లైన పెక్కుమఖములచేత. 4 అగ్నిహోత్రములచే నతిథిజనములు. 5 మనంబందు.

పురుషుండును నైన వాసుదేవునియందు నధికభక్తి ననుదినంబును జేయుచు నేఁబదిలక్షలవేలేండ్లు రాజ్యంబుసేసి [1]పితృపితామహాద్యాయాతం బగునాధనంబును యథార్హంబు గఁ బుత్రులకుఁ బంచి యిచ్చి బహువిధసంపదలు గలగృహంబును బాసి పులహాశ్రమంబున కరిగె నంత. 97

సీ. ఏయాశ్రమంబున నిందిరాధీశ్వరుఁ, డచ్చటివారల నాదరించి
ప్రత్యక్షమున వచ్చి పాయ కెప్పుడు నుండు, నట్టిరమ్యం బైనయాశ్రమమున
నిలిచి సాలగ్రామములు గల[2]గండకీ,నది యెందు నెంతయుఁ గదిసి యుండు
నచ్చోట నేకాకి యగుచును భరతుండు, బహువిధనవపుష్పపల్లవముల

తే. నతులతులసీదళంబుల నంబువులను, గందమూలాదిఫలములఁ గంజములను
ఘనత నర్పించి నిచ్చలుఁ దనివి లేక, సేవసేయుచు నుండె నాశ్రీశుఁ జేరి. 98

వ. దానంజేసి విగతవిషయాభిలాషుండై శమదమాదిగుణంబులు గలిగి యథేచ్ఛం జేసి యెడతెగక పరమపురుషునిపరిచర్యాభక్తిభరంబున శిథిలీకృతహృదయగ్రంథి గలిగి సంతోషాతిశయంబునం బులకితాంగుండు నానందబాష్పనిరుద్ధావలోకనయనుండు నగుచు నిజస్వామి యైనహరి(చరణారవిందాను)ధ్యాన(పరిచిత)భక్తియోగంబునం బరమానందగంభీరహృదయం బనునమృతకాసారంబున నిమగ్నుండగుచుఁ దా నపుడు పూజించుపూజ నెఱుంగక యిట్లు భగవద్వ్రతంబు ధరియించి యేణాజినవాసస్త్రిషవణస్నానంబుల నార్ద్రకుటిలకపిశవర్ణజటకలాపంబులు గలిగి మార్తాండాంతర్గతుం డయినపరమేశ్వరుని హిరణ్మయపురుషునింగాఁ దలంచుచు ని ట్లనియె. 99

సీ. కర్మఫలంబులఁ [3]గడఁక నిచ్చుచు మనో, వ్యాపారమున నిట్టియఖిలలోక
ములఁజేసి యాలోకములకు నంతర్యామి, యగుచుఁ బ్రవేశించి యంతమీఁద
నానందరూప మైనట్టిబ్రహ్మముఁగోరు, చున్నజీవుఁ దనయం దున్నయోగ
శక్తిచేఁ దగ ననిశంబుఁ బాలనసేయు, చుండి యంతటను మార్తండమధ్య

ఆ. వర్తి యగుచు నిట్లు[4]వఱలుచు జగముల,యందు నుండి ప్రకృతిఁ బొంద కంత
నతులదివ్యమూర్తి యైనయానందరూ, పమును శరణ మొందె భరతవిభుఁడు.

వ. అంత నాభరతుం డొక్కనాఁ [5]డామహానదిం గృతాభిషేకుం డయి ముహూర్తత్రయం బంతర్జలంబులందుఁ బ్రణవోచ్చారణంబు సేయు చుండుసమయంబున నిర్భరగర్భిణి యగునొక్కహరిణి జలార్థిని యై యొంటి జలాశయసమీపంబునకు వచ్చి జలపానంబు సేయునెడ నాసమీపంబున మృగపతి గర్జించి లోకభయంకరంబుగ నాదంబుసేయ నాహరిణి స్వభావంబున భీత యగుటంజేసి బెగ్గడిలి

1 సామ్రాజ్యంబు పుత్రులకుం. 2 చక్రతీ, ర్థంబుఁ జేయును బవిత్రంబుగాఁగ' వ్రా. ప్ర. 3 గతుసమర్పణ. 4 వ్రాఁగూపమున నరు, అందు నుండి. 5 డాచక్రతీర్థంబునం.

(హరివిలోకనవ్యాకులచిత్తయై)దిగ్గన నుదరి గగనంబునకు [1]నెగిరి యపగతతృష
యగుచు నది నుల్లంఘించునెడ నధికభయంబునం జేసి యాగర్భంబు యోనిద్వా
రంబున గళితంబై జలంబులం బడియె నాహరిణి(యుల్లంఘనాదిభయంబునం జేసి)
తత్తీరంబున (నుండుగిరిదరిం బడి) శరీరంబుఁ బాసె నంత నాహరిణపోతంబు జ
లంబులం దేలుచున్న భరతుండు గను విచ్చి చూచి కరుణార్ద్రచిత్తుండై (మృత
జనని యగునా)హరిణపోతంబును దనయాశ్రమంబునకుం గొంపోయి మిక్కిలి
ప్రీతి సేసి యుపలాలనంబుసేయుచుండఁ బోషణపాలనప్రీణనలాలనానుధ్యానంబు
ల భరతునకు నాత్మనియమంబులైన యష్టాంగయోగంబులును [2]బరమపురుష
పూజాపరిచర్యాదులు నొక్కొక్కటిగఁ గ్రమక్రమంబునం గొన్నిదినంబులకు
సమస్తంబును నుత్సన్నం బయ్యె నంత. 101

క. ఘనతపము చలన మొందుట,యును భరతుం డెఱుఁగ కాత్మయోగంబునఁ జ
య్యనఁ బాసె హరిణపోతముఁ, దనమదిలోఁ బ్రీతిఁజేసి తప్పక పలికెన్. 102

ఉ. అక్కట తల్లిఁ బాసి హరిణార్భక మాప్తులు లేమిఁజేసి యే
దిక్కును లేక యున్న నిట దెచ్చితి నాయెడ నీమృగార్భకం
బెక్కుడుప్రేమ సేసి చరియించుచు నున్నది నాదుసన్నిధిన్
మక్కువచేసి దీనిఁ గడుమన్ననలం దగఁ బ్రోతు నెంతయున్. 103

క. శరణని వచ్చినజంతువుఁ, గరుణం గను విచ్చి చూచి కాంచినఁ బుణ్యం
బరయఁగ నధికం బని ము, న్నెఱిఁగించిరి సన్మునీంద్రు లెల్లం బ్రేమన్. 104

వ. అని యిట్లు హరిణపోతంబుం దనయాశ్రమంబున [3]నత్యాసక్తిం జేసి యాసనశయ
నాటనస్నానసమిత్కుశకుసుమఫలపలాశమూలోదకాహరణ దేవపూజాజపాదుల
యెడం దనయొద్దన యునిచికొనుచు వృకసాలావృకాదిక్రూరమృగంబులవలని
భయంబున వనంబుల వెనువెంటం దిరుగుచు (నధికప్రణయభరపరీతహృద
యుం డగుచు నతిస్నేహంబునం జేసి కొంతసేపు స్కంధంబుల వహించుచు మఱి
కొంతతడ వురంబున నుత్సంగంబున నుంచికొని లాలించుచు సంతసంబు
నొందు మఱియు నాభరతుండు నిత్యనైమిత్తికాదిక్రియాకలాపంబు నిర్వర్తించు
నెడ నంత నంత లేచి హరిణకుణకంబుఁ జూచుచుఁ గించిత్స్వస్థహృదయుం డై
దాని నాశీఃపరంపరల నభినందించుచుఁ జుంబనాదులం బ్రీతిసేయుచు) నతిమో
హంబునం బెంచు చుండునెడ. 105

చ. [4]గురువులువాఱి బిట్టులికి కొమ్ములఁ జిమ్ముచు నంత నంత డ
గ్గఱుచును గాలు ద్రవ్వుచు నఖంబుల గీఱుచు గాసి సేయుచు
న్నొఱగుచు ధారుణీశ్వరునియూరువులన్ శయనించి యంతలో

---

1 'నెగసిపడిన గర్భంబు స్రవించి జలం. 2 జలనంబు నొందె నంత' వ్రా. ప్ర. 3 కుం గొని చని స్నానసమి. 4 ఇది యచ్చుప్రతుల లేదు.

నలుకడ మెక్కుచుం బొదలి యాడుచు నాహరిణంబు లీలతోన్. 106

తే. గరిమ నీగతి మెల్లన కెరలు వొడిచి, చెలఁగి యాడంగ భరతుండు చిత్తమందు
సంతసిల్లుచునుండె నాశ్రమముఁ బాసి, హరిణడింభక మంతలో నుటికి చనియె.

వ. భరతుం డంతం దన్మృగశాబకంబు గానంబడమికి (వ్యాకులితచిత్తుం డగుచు
నష్టధనుండునుంబోలె నతిదీనుం డై కరుణతోడం గూడి తద్విరహవిహ్వాలమతి
యై దానిన తలంచుచు నతిశోకంబుతో) మనంబున దుఃఖించి యి ట్లనియె. 108

తే. హరిణపోతంబ నీకు వనాంతమందుఁ
గ్రూరమృగబాధ లేకుండఁ గోరు చుండఁ
దలఁగి పోయితె యనుచుఁ జిత్తంబునందు
రాజవృషభుండు భరతుఁ డారాట మంది. 109

తే. తల్లి చచ్చినహరిణ్యాపోతంబు వచ్చి, పుణ్యహీనుండ నగునన్నుఁ బొంది పాసె
నేమి సేయుదు నే నింక నెట్లు గందుఁ, జేరి యేరీతిఁ గాంచి రక్షించుకొందు.

క. కట్టా యీయాశ్రమమునఁ, బుట్టినతృణవల్లి మేసి పొదలినహరిణం
బి ట్టట్టుఁ దిరుగు చుండఁగఁ, బట్టి మృగేంద్రుండు గొట్టి బాధించె నొకో. 111

వ. ఇట్లు భరతుండు హరిణకుణకక్షేమంబు గోరుచు నెప్పుడు వచ్చి నన్ను సంతోష
పఱచు నానాప్రకారంబు లైనతనగతులచేత నన్ను నెప్పు డానందంబు నొందిం
చు ధ్యానసమాధి నున్నప్పుడు నన్నుఁ గొమ్ముల గోఁకుచు నుండునట్టివినోదంబు
లెప్పుడు గనుఁగొందు దేవపూజాద్రవ్యంబులు ద్రొక్కి మూర్కొనిసం గో
పించి చూచినం గుమారుండునుంబోలె దూరంబునకుం జని నిలిచి మరల
నేఁ బిలిచిన వెనుక నిలిచి యుండు నిట్టిమెలఁకువస్వభావంబులు గలుగుట
యెట్లు లీభూదేవి యెంతతపంబు చేసినదియో యాహరిణపాదస్పర్శంబులం
బవిత్రమైనభూమి స్వర్గాపవర్గకాము లైనమునులకు యజ్ఞార్హ యగు నట్టిహరిణ
పోతంబు నెట్లు గనుఁగొందు. నదియునుం గాక భగవంతుం డగుచంద్రుండు
[1]మృగపతిభయంబున మృతజననియు స్వాశ్రమపరిభ్రష్టంబు నైనమృగశాబకం
బును గొనిపోయి పెంచుచున్నవాఁడో మున్ను పుత్రవియోగతాపంబునం జం
ద్రకిరణంబులం బాపుదు నిపుడు హరిణపోతంబు దనశరీరస్పర్శంజేసి కళానిధి
కిరణంబులకన్న నధికం బగుచుం బుత్రవియోగతాపంబు నివర్తింపం జేసె నను
చుం బెక్కుభంగుల హరిణనిమిత్తంబు లైనమనోరథంబులచేతం బూర్వకర్మవశం
బున యోగభ్రష్టుం డగుభరతుండు [2]భగవదారాధనంబువలన విభ్రంశితుం
డగుచు నితరజాతిం బుట్టినహరిణపోతంబుమీఁదిమోహం బగ్గలం బగుచుండ
నుండె నని పలికి శుకయోగీంద్రుండు మఱియు ని ట్లనియె. 112

సీ. జననాథ మున్ను మోక్షవిరోధ మని పాయఁ, గారానిపుత్రాదికంబు నెల్లఁ

1 'తనయాశ్రమంబునకుం గొని పోయి. 2 హరిసేవం బాసి యితరజాతిం.

బాసి తపస్వి యై ✽ భరతుండు హరిణశా,బకపోషణంబునఁ ✽ బాలనమున
నటలాలనప్రీణ✽నానుషంగంబుల,మూషికబిల మతి✽రోషమునను
సర్పంబు సొచ్చినచందంబునను యోగ,విఘ్నంబు మిక్కిలి ✽ విస్తరిల్లెఁ

ఆ. గాన యెంతవాని ✽ కైనను గాలంబు, గడవ రామి నిట్లు ✽ గాక పోదు
పరమమునుల కైనఁ ✽ బాయవు కర్మంబు, లూరు లనంగ నెంత ✽ నరవరేణ్య.

వ. ఇట్లు భరతుండు మృగవియోగతాపంబు నొందు చుండు నెడ నామృగశాబ
కంబు సనుదెంచిన సంతసిల్లు చుండె నంత నొక్కనాఁడు. 113

మ. భరతుం డల్లన యంత్యకాలము వెసం ✽ బ్రాపింపఁగా నప్పు డా
హరిణంబుం గడుభక్తిఁ [1]బుత్రుగతి న✽త్యాసక్తి వీక్షింప నా
హరిణంబుం దనయాత్మలో నిలిపి దే✽హం బంతటం బాసి తా
హరిణీగర్భమునన్ జనించి హరిణం ✽ బై యొప్పెఁ బూర్వస్మృతిన్. 114

వ. ఇట్లు భరతుండు హరిణీగర్భంబునం బుట్టియు భగవదారాధనసామర్థ్యంబునం
దనమృగత్వకారణంబుఁ దెలిసి కడుం దాపంబు నొందుచు ని ట్లనియె. 115

ఉ. రాజులు ప్రస్తుతింప సుర✽రాజసమానుఁడ నై తనూజులన్
రాజులఁ జేసి తాపసులు ✽ రాజఋషీంద్రుఁ డటంచుఁ బల్కఁగాఁ
దేజము నొంది యాహరిణ✽దేహమునందలిప్రీతిఁ జేసి నా
యోజ [2]సెడంగ నేఁ జెడితి ✽ యోగిజనంబులలోన బేల నై. 116

వ. ఇట్లు శ్రీహరి[3]శ్రవణమననసంకీర్తనారాధనానుసరణాభియోగంబులం జేసియశూన్య
సకలయామం బగుకాలంబు గలనాకు హరిణపోతస్మరణంబుకతంబున యోగ
విఘ్నంబు ప్రాప్తం బయ్యె మోక్షదూరుండ నైతి నని (నిగూఢనిర్వేదుం
డగుచుఁ) దల్లిం బాసి క్రమ్మఱ (నుపశమశీల)మునిగణసేవితం బయి భగవ
త్క్షేత్రం బైన సాల (తరునిబిడతమ) గ్రామపర్వతసమీపపుల స్త్యపులహాశ్రమం
బులకుం (గాలాంజనపర్వతంబువలనఁ) జనుదెంచి యందు మృగత్వావసానంబు
గోరుచు (సంగంబు విడిచి యేకాకి యగుచు) శుష్కపర్ణతృణవీరుదాహారుండై
(మృగత్వనిమిత్తం బగునానదీ)తీర్థంబునందు (నవసానంబుగోరుచుఁద తీర్థోదక
క్లిన్నం బగుచు నుండు)శరీరంబు విడిచె నని శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేం
ద్రునకు వినిపించి మఱియు ని ట్లనియె. 117

భరతుండు హరిణజన్మంబు విడిచి బ్రాహ్మణుం డై జనించుట.

సీ. హరిణదేహముఁ బాసి ✽ యంత నాంగిరసా,న్వయుఁడు పవిత్రుండు ✽ వంశకరుఁడు
శమదమఘనతపః✽స్వాధ్యాయనిరతుండు, గుణగరిష్ఠుఁడు నీతి✽కోవిదుండు
నైనబ్రాహ్మణునకు ✽ నాత్మజుం డై పుట్టి, సంగంబువలనను ✽ జకితుఁ డగుచుఁ

1 'బుత్రునిగతి న్నాలించి వీక్షించుచున్. 2. సెడుండితిన్ ధరను' వ్రా. ప్ర. 3 'యా
రాధనానుస్మరణయోగంబులంజేసి యెల్ల కాలంబునుం గలనాకు.

కర్మబంధంబుల ఖండింపఁ జాలునీ,శ్వరుని నచ్యుతు నజు శ్రవణమనన [నీక
తే. ములను హరిచరణధ్యానములను విఘ్న, భయమునను జేసి మనమందుఁ బాయ
నిలిపి సంస్తుతి సేయుచు నిలిచియుండె, భరితయశుఁడైన భరతుండు పార్థివేంద్ర.

వ. ఇట్లాంగిరసుండు ప్రథమభార్యయందుఁ బుత్రనవకంబును గనిష్ఠభార్యయందు స్త్రీపురుషుల నిద్దఱను గలుగం జేసిన నందుఁ బురుషుండు పరమభాగవతుండును రాజర్షి ప్రవరుండును నుత్సృష్టమృగశరీరుండునుం జరమశరీరంబునం బ్రాప్తవిప్రశరీరుండును నగుభరతుం డయ్యె నతం డాజన్మంబున నన్యజనసంగంబు జన్మపరంపరలకుఁ గారణం బని యత్యంతభయంబు నొంది కర్మబంధవిధ్వంసనశ్రవణస్మరణాదుల శ్రీహరియనుగ్రహంబునం బూర్వజన్మపరంపరల సంస్మరించుచుఁ దనస్వరూపంబు నున్మత్తజడాంధబధిరరూపంబుల లోకులకుం జూపుచుండె నంత.

మ. జనకుం [1]డాంగిరసుండు నాత్మజుని వాత్సల్యంబునం బెంచుచుం
దనరం [2]జౌలముఖాగ్రకర్మములచేతన్ సంస్కృతుం జేసి పా
యనిమోహంబున నిచ్చలుం గడఁక శౌచాచారముల్ సెప్పినన్
ఘనుఁ [3]డాభాగవతుం డసమ్మతిని దత్కర్మంబులం గైకొనెన్. 120

వ. ఇట్లు బ్రాహ్మణకుమారుండు గర్మంబులయందు నిచ్చ లేక యుండియును బితృనియోగనిర్బంధంబునం (బితృసన్నిధియందె యసమీచీనంబుగా వ్యాహృతిప్రణవశిరస్సహితం బగునట్లు) గాయత్రీమంత్రోపదేశంబు నొంది [4]చైత్రాదిచతుర్మాసంబుల సమవేతంబుగ వేదంబుల నధ్యయనంబు సేయుచుండె జనకుం డాత్మజుని శిష్టాచారంబుచే శిక్షింప వలయు ననులోకాచారంబు ననువర్తించి (యాత్మభూతుం డగు నాత్మజునందు నభినివేశితచిత్తుం డగుచు శౌచాచమనాధ్యయనవ్రతనియమగుర్వనలశుశ్రూషణాదికంబు లనభియుక్తంబు లగునం బుత్రునిచే నొనరింపించుచు నప్రాప్తమనోరథుం డయ్యె నంత). 121

క. ఈరీతిని గొడుకున కా,చారంబులు గఱపి చింత సద్గృహమున సం
సారి యగుచుండి విప్రుఁడు, బోరన దేహంబుఁ బాసి పోయినమీఁదన్. 122

ఆ. తల్లి తండ్రితోడఁ దా నగ్నిఁ జొచ్చిన, నతనిమహిమ తెలియఁగ గంతలోన
సవతితల్లికొడుకు లవినీతు లగుచును, శాస్త్రవిద్య లెన్నిఁ జదువ నీక. 123

వ. ఇట్లు బ్రాహ్మణకుమారుని సవతితల్లికొడుకులు వేదవిద్యలవలనం బాపి గృహకర్మంబుల నతని నియమించిన. 124

క. ధరణీసురోత్తముఁడు దా, నగుదుగఁ దమవారు సెప్పినవి యెల్లను నే
మఱ కందుఁ బ్రీతి సేయక, నిరతము గృహకర్మములు నెఱపుచు నుండెన్.

వ. ఇట్లు గృహకర్మప్రవర్తనుం డగుచు (నుండ మూఢు లగుద్విపాత్పశువులచే

1 'డౌటను విప్రుఁ డాతనిని వాత్స. 2 గాఁ జపులాదికర్మములచేతం బ్రీతిఁ బుట్టించి. 3 డావి ప్రసుతుండు గైకొనియె సత్కర్మంబులన్ భూవరా' 4 యనుష్ఠాత యై యధ్యయ. వ్రా. ప్ర.

ను న్మత్త జడ బధిర యని యాహూయమానుం డగునపుడు తదనురూపంబు లగుసంభాషణంబుల నొనర్చుచుఁ బరేచ్ఛాయదృచ్ఛలం జేసి విష్టివేతనయాచ్ఞా దులవలన నియుక్తకర్మంబులం బ్రవర్తించుచు.) 126

తే. అతులమృష్టాన్న మైన శుష్కాన్న మైన
నెద్ది వెట్టిన జిహ్వకు హితవు గాను
తలఁచి భక్షించుఁ గా కొండుఁ దలఁచి మిగులఁ
బ్రీతి సేయఁడు గుచులందుఁ బెంపుతోడ. 127

వ. మఱియు నావిప్రుం డత్యంతనిత్యానందసుఖలాభంబు గలిగి సుఖదుఃఖంబుల యందు దేహాభిమానంబు సేయక శీతోష్ణవాతవర్షాతపంబులకు నోడి పైచీర గప్పక వృషభంబునుంబోలెఁ (బీనుండును గాత్రాంగుండును నగుచు) స్థండిలశాయి యై [1]రజఃపటలంబునం గప్పంబడినదివ్యమాణిక్యంబునుంబోలె ననభివ్యక్తబ్రహ్మవర్చసుండై మలినాంబరపరీతకటితటుండు నతిమషిలి ప్తయజ్ఞోపవీతుండు నగుటం జేసి యజ్ఞజనంబు లతండు బ్రాహ్మణాభాసుండు మందుండు నని పలుక సంచరించుచు (ఒండొం గర్మమూలంబునం బరులవలన నాహారంబు గొనునపుడు) దమ వారును నియమించినవ్యవసాయకర్మంబునందు [2]క్షేత్రవిహితసమవిషమన్యూనాధికంబుల నెఱుంగక ప్రవర్తింపుచు నాఁక తివుడు నెలికపిండి పొట్టు మాఁడు ద్రబ్బెడ యాదిగాఁ గలద్రవ్యంబులయందు నరుచి సేయక యమృతసమానంబుగా భక్షించుచుం జేనికావలి యుండు నెడ నొక్కనాఁడు. 128

వృషలరాజభృత్యులు కాళిబలికి భరతునిఁ గొంపోవుట.

క. పురిలోన వృషలపతి దా, నరుదుగ సంతానకాముఁ డై వేడుకతోఁ
బురుషుఁ డగుపశువుఁ గాళికిఁ, దఱుముక గొనిపోవఁ బశువు దలఁగిన భృత్యుల్.

ఆ. అరసి కాన లేక యారాత్రి వీరాసనమునఁ జేనికావు విమలబుద్ధి
నున్నవిప్రయోగి నొయ్యన పొడగాంచి, పశువు మంచి దనుచుఁ బట్టి రతని.

క. ఆరీతిని భూసురవరు, నారయ నాకాళికాగృహమునకు భృత్యుల్
బోరనఁ గొనిచని సన్పిరి, చారులతా భ్యంజనాదిసంస్కారంబుల్. 131

వ. ఇట్లభ్యంజనాదికృత్యంబులు దీర్చి నూతనవసనంబు గట్ట నిచ్చి గంధపుష్పాభరణాక్షతాలంకృతునిం జేసి మృష్టాన్నంబులు భుజియింపం బెట్టి ధూపదీప(మాల్యలాజకిసలయాంకురఫలోపహారా)దులు సమర్పించి పంచమహావాద్యఘోషంబులతోడ నాపురుషపశువుం గాళికాదేవిసమ్ముఖంబున నాసీనుం గావించి రావృషలపతి పురుషపశువురక్తంబున భద్రకాళి సంతోషపెట్టం దలంచి కాళికామం

---

1 రజోనికరంబునఁ గప్పంబడినవాణిక్యంబో లె బ్రహ్మవిద్య గలిగి సర్వజనంబు లతండు నష్టబ్రహ్మణ్యుం డు మందుండు నని పలుక. 2. క్షైత్రమ్యపత్యపాఠంబు లెఱుంగక.

త్రాభిమంత్రితంబు (నతికరాళంబు) నైనఖడ్గం బంది (నిజాభీష్టసిద్ధికి) హింసింపం
దలంచిన. 132

సీ. సర్వభూతములకు [1]సఖుఁడును బ్రహ్మభూ, తాత్ముఁడు నిర్వైరుఁ డయిన బ్రహ్మ
సుతుని తేజం బంతఁ జూడ దుస్సహ మైన, భయ మంది వడఁకుచు భద్రకాళి
క్రోధంబు మున్మిడిఁ గొనఁగ హుంకారంబు, సలుపుచు నట్టహాసంబు సేసి
పాపాత్ములును దౌష్ట్యపరులును రాజస, తామసకర్మసంధాను లగుచు

తే. విప్రవరు నట్లు హింసించు వృషలపతిని, భృత్యవర్గంబుఁ దోఁడ దలల్ పృథ్విఁ గూల్చి
యపుడు వృషలాధిపుని శిరమంది లీలఁ, బాడి యాడుచు నందంద క్రీడసలిపె.

క. ధరలోన నెవ్వ రేనియు, ధరణీసురవరుల కెగ్గుఁ దలఁచిర యేనిన్
నెరయంగఁ దార చెడుదురు, హరి ధరణీసురవరేణ్యులం దుండుటచేన్. 134

వ. మఱియును. 135

ఉ. అచ్చట విప్రసూనుఁడు భయం బొకయించుక లేక చంపఁగా
వచ్చినవారియందుఁ గరవాలమునందును గాలియందుఁ దా
నచ్యుతభావ ముంచి హృదయంబునఁ బద్మదళాక్షు నెంతయున్
మచ్చికతోడ నిల్పి యనుమానము నొందక యుండె నెంతయున్. 136

వ. మఱియు నావిప్రవరుండు చండికాగృహంబు వెలువడి క్రమ్మఱం జని కావలి
యుండు నెడ. 137

సీ. అంతటఁ గొన్నిహాయనములు సన సింధు, భూపాలనము సేయు భూవరుండు
ధీరత నిక్షుమతీతీరమున నున్న, కపిలమహామునిఁ గాంచి తత్త్వ
విజ్ఞాన మెఱిఁగెడు వేడ్కతోడుత శిబి, కారోహణము చేసి యరుగు చుండ
నాలోన నాశిబి[2]కావహు లాచేనఁ, గాపున్నవిప్రునిఁ గాంచి తెచ్చి

తే. శిబిక మోపింత మీతని చేత ననుచుఁ, బట్టి మూఁపునఁ బల్లకిఁ బెట్టి మోవు
మనుచు మోపించు నంత ధరామరుండు, శిబిక మూఁపున నిడి యంతఁ జింత లేక.

క. తనమనసుకొలఁది నప్పుడు, మునుకొని యట్లప్రయత్నమున నడవఁగ నా
జనపతి నిమ్నోన్నత మై, చనుట యెఱిఁగి శిబిక మోచు జనులకు ననియెన్.

ఆ. మీర లిప్పు డిచటఁ జేరి మిక్కిలి ప్రయ, త్నంబుతోడఁ దగిలి నడచు చుండ
విషమ మగుచు గమనవేగంబు నను బాధఁ, బెట్టుచున్న దనిన బెస్త లనిరి.

వ. దేవా యీవిషమగమనంబు మావలన నైనది గా [3]దీతురీయవాహకుండు సుఖ
గమనంబు గా [4]నడవ నేరండు వీనితోడ మేము నడవ నేర మనిన రహూగణుం
డనునారాజు (పాసితవృద్ధజనుం డైనను బలాత్కారంబునం బుట్టినకోపంబునం)
గోపించి విమర్శ దప్పి నీఱు గప్పిననిప్పునుంబోలె నెఱుంగ రాని బ్రహ్మతేజంబు

---

1 'సముఁడు నెచ్చెలియును, నా బ్రహ్మభూషసుతుం డైన విప్ర. 2 కారోహకులు చేని కాపున్న
3 దీవింతవాఁడు. 4 నడవం డనిన నారాజు' వ్రా. ప్ర.

గలబ్రాహ్మణునికిం గంటకంబుగా నిష్ఠురవాక్యంబుల నిట్లనియె. 141

చ. అలసితి వెంతయున్ ముసలి వాకట డస్సితి [1]వెన్ను మిక్కిలిం
బలుచన యున్న దీశిబికభారము దూరము మోసి తేగతిన్
నిలిచెద వంచు భూవరుఁడు నిష్ఠురముల్ దగఁ బల్క నాయెడం
బలుకక మోసె నాశిబిక బ్రాహ్మణవర్యుఁడు పార్థివేశ్వరా. 142

వ. అప్పు డావిప్రవరుండు దనకుం గడపటిశరీరం బయినకళేబరంబునందు నహంకారమమకారంబులం బొందనీక మిథ్యాజ్ఞానరహితుం డై బ్రహ్మ[2]భూతుం డై మౌనవ్రతంబున నాశిబిక మోచు చున్నవిషమగమనంబుఁ జూచి యతికుపితుం డగుచు నాభూవరుండు వెండియు నిట్లనియె. 143

సీ. ఓరిమర్త్యద విన రోరిజీవన్మృత, నాయాజ్ఞఁ దప్పించి నడచె దీవు
నీవక్రమార్గంబు లిన్నియు విడిపించి, నడపింతు నిన్ను సన్మార్గమందు
నని రాజగర్వాంధుఁ డగుచు గుణత్రయం,బున వృద్ధిఁ బొందిన భూవరుం డ
బద్ధప్రలాపముల్ వల్కుచుండినఁ జూచి, శమదమాదులచేఁ బ్రశస్తుఁ డగుచు

తే. జగతి బ్రహ్మస్వరూప మై సకలభూత,ములకు నత్యంతహితుఁ డై నభూసురుండు
యోగివర్తన దెలియ లేకున్నరాజు, నంత వీక్షించి యల్ల నిట్లనుచుఁ బలికె.

భరతుండు రహూగణునిమాటలకుఁ బ్రత్యుత్తరంబు లిచ్చుట.

వ. నరేంద్రా నీవు సెప్పినది సత్యంబు భారంబు శరీరంబునకే కాని నాకుం గలుగ నేర దైనను స్థౌల్యకార్శ్యంబులు వ్యాధులు నాధులు క్షుత్తృష్ణలు నిచ్ఛావిరోధ భయంబులు జరామరణంబులు రోషనిద్రాజాగరణంబులు నహంకారమమకార మదశోషణాదులును దేహంబుతోడన జనియించుం గాని నాకుం గలుగ నేరవు జీవన్మృతుండ నేన కా(దాద్యంతంబులు గలుగుటం జేసి)యందఱయందును గలిగి యుండు స్వామిభృత్యసంబంధంబులు విధికృతంబు లగుచు వ్యవహారంబులం జేసి శరీరంబులకుం గలుగుం గాని జీవునికి లేకయుండు నదియునుం గాక రాజాభిమానంబున నీవు నన్నాజ్ఞాపించెద వేనిం బ్రమత్తుండ నైననీకుం బూర్వస్వభావం బెట్లుండె నట్లు గాక యిఁక నేమి సేయుదు నెఱింగింపు మున్మత్త(మూకాంధ)జడులుం బోలె సహజస్వభావంబునం బొందిననాయందు నీశిక్ష నేమిలాభంబుఁ బొందింప నేర్చు నదియునుం గాక స్తబ్ధుండు మత్తుండు నైననాకు నీశిక్ష వ్యర్థం బగు నని పలికి యుపశమశీలుం డైనమునివరుండు పూర్వకర్మశేషంబునం గల్గు భారవాహకత్వంబుం దలంగం ద్రోయుటకు భారంబు వహించి శిబిక మోచుచుం జనునెడ నారాజవల్లభుండు దత్త్వజ్ఞానాపేక్షితుం డై చనియెడివాఁ డగుటం దనహృదయగ్రంథివిమోచకంబులును బహుయోగగ్రంథసమ్మతంబులును నగుబ్రాహ్మణవాక్యంబులు విని యాశిబిక దిగ్గన డిగ్గ నుఱికి యావిప్రునికి

1 'మేను. 2 స్వరూపము గలిగి. 3 నెఱింగించెద నున్మత్త' వ్రా. ప్ర.

సాష్టాంగదండప్రణామంబు లాచరించి సర్వగర్వవర్జితుం డై ముకుళితహస్తుం
డగుచు ని ట్లనియె. 145

సీ. ధరణీసురులలోనఁ దలఁప నెవ్వఁడవు నీ, వవధూతవేషి వై యవనియందు
నేమిటికై చరియింపంగ వచ్చితి, చట నొక్కఁడవు నొంటి సనుట నేఁడు
ననుఁ గృతార్థునిఁ జేయ ననుకూలుఁడగుచున్న, యట్టియా కపిలమహామునీంద్రుఁ
డవో నీమహత్త్వంబు దవిలి విచారింప, నెఱుఁగక చేసితిఁ గరుణఁ జూడు
తే. తప్పు సైరింపు నే యమదండమునకు, హరునిశూలంబునకును వజ్రాయుధమున
కనలచంద్రార్కధనదశస్త్రాస్త్రములకు, వెఱవ విప్రుని కే మది వెఱచినట్లు.
వ. మఱియు నిస్సంగుండ వయి జడుండునుంబోలె నిగూఢవిజ్ఞానంబు గలిగి చరి
యించుచు నున్నవాఁడవు నీవచనంబులు యోగశాస్త్రసమానంబు లై వాఙ్మ
నసంబులకు నభేద్యంబు లయి యున్న వే (నవిష్ణుకళావతీర్ణుండు సాక్షాద్ధరియు
నగు)కపిలమహామునివలన బ్రహ్మవిద్య దెలియం గోరి చను చున్నవాఁడ నీవు
లోకనిరీక్షణార్థం బవ్యక్తలింగుండ వై చరియించు చున్నకపిలమహామునీంద్రుం
డవు గాఁ బోలుదువు మందుం డై నగృహస్థుండు యోగీశ్వరచరిత్రంబు లెట్లు
తెలియంగ నేర్చుఁ గర్మవశంబున దృష్టంబై శ్రాంతి వహించుచు (నడచుచు)నున్న
యీయాశ్రమంబు నాకు(నుంబోలె)[1]నీకు నగు నని తోఁచుచున్న దది యె ట్లనిన
ఘటంబు లేక జలంబు దేరాని తెఱంగున లేనివి గలుగ నేరవు గావునం బ్రమాణ
మూలం బయినలోకవ్యవహారంబు సత్పథంబున సమ్మతం బై యుండుటం జేసి
నీ వాడువాక్యంబులు నాకు సమ్మతంబు గా నేర వని సింధుదేశాధీశ్వరుండు విని
పించిన నావిప్రుండు లోకవ్యవహారంబునకు నిత్యత్వం [2]బాధికం బగుం గాని
నిత్యంబు గా నేర దని దృష్టాంతనిదర్శనంబు గా ని ట్లనియె. 147
సీ. పావకశిఖలచే భాండంబు దాఁ దప్త, మగుఁ దప్తఘటముచే నందు నున్న
జలము తపించు నాజలముచేఁ దండులం, బులు తప్త మొంది యప్పుడు విశిష్ట
మైనయన్నం బగు నాచందమునను దా, దేహేంద్రియంబులఁ దెలివితోడ
నాశ్రయించుక యున్న యట్టిజీవునకు దే, హంబునఁ బ్రాణేంద్రియాదికమున
ఆ. జరుగు చుండు నిట్లు సంసారఘటశిక్ష, రక్షకుండు నయినరాజు దుష్ట
కర్మములకుఁ బాసి కంజాక్షపదసేవఁ, జేసె నేని భవముఁ జెంద కుండు. 148
ఆ. అనుచు ధారుణీసురాత్మజుఁ డీరీతిఁ, బలుకుటయును రాజు పరిణమించి
వినయవాక్యములను వినుతించి క్రమ్మఱఁ, బుణ్యుఁ డైనసింధుభూవరుండు.
వ. మహాత్మా నేను రాజ ననియెడియభిమానమదాంధుండ నై మహాత్ములం దిరస్క
రించిననన్నుఁ గరుణింపుము నీ వార్తబంధుండవు నీకృపాదృష్టిం జేసి మహాత్ముల
నవమానంబు సేసినదురితంబువలన విముక్తుండ నయ్యెద విశ్వసుహృత్త వైన

---

1 'నీయాది యని తోఁచు. 2 బారోపితం బగుం' వ్రా. ప్ర.

నీకుం గోపంబు గలుగ నేరదసమర్థు లయినమాబోఁటివారలు మహాజనావ
మానంబున శీఘ్రంబ నశింతురు గావున నీవు కృపాదృష్టి వయి నన్ను మన్నింపు
మనిన నావిప్రుం డి ట్లనియె. 150

క. కడువేడ్క నీ వవిద్యాంధుఁడ వై యుండియును మిగుల విద్యోద్యము విద్వాం
సుఁడుఁబోలెను బలికెద వి,ప్పుడు మే లన వచ్చుఁ గొంత పురుషులలోనన్.

ఆ. పరఁగఁ బెద్ద లీప్రపంచ మంతయుఁ దథ్య, మనరు నీవు తథ్య మనుచుఁ బలికి
తట్లు గాన నిన్ను నధికుండ వని పల్క, రాదు నాకుఁ జూడ రాజచంద్ర. 152

సీ. యజ్ఞాదికములందు నామ్నాయములయందుఁ, దఱుచుగాఁ దత్త్వవాదంబు లేదు
స్వప్నంబునందుల సౌఖ్య మాకారంబు, నందుల నిత్య మై యంత లేని
యట్టిచందమున వేదాంతవాక్యంబులు, తత్త్వంబు నెఱిఁగించి తలఁగుఁ గాని
నిత్యంబు లై యుండ నేరవు పురుషుని, చిత్తంబు గుణములఁ జెంది యెంత

తే. కాల ముండును మఱి యంత కాలమందు, నరయ విజ్ఞానకర్మేంద్రియములచేత
మరగి ధర్మంబులను నధర్మంబు లట్లు, దగిలి పుట్టించుచుండు నత్యంతమహిమ.

వ. మఱియు ధర్మాధర్మవాసనాయుక్తంబు విషయానురక్తంబు నైనచిత్తంబు గుణప్రవాహంబులచేత వికారంబు నొంది దేవతిర్యఙ్మనుష్యరూపంబు లయిన దేహంబులం బుట్టించుచుఁ గాలప్రాప్తంబు లైనసుఖదుఃఖతదుభయఫలంబుల ననుభవించుచు ననవరతంబు జీవునికిం బ్రత్యక్షం బగుచు స్థూలసూక్ష్మరూపంబుల నుండు స్వాంతంబు గుణరహితం బైన ముక్తికారణం బగు ఘృతవర్తులు గలదీపంబు సధూమశిఖలం బుట్టించు ఘృతవర్తులు నాశంబు నొందిన స్వరూపంబుఁ బొందు నీతెఱంగున మనంబు గుణకర్మానుబంధం బైన నీజన్మాదులం బుట్టించు గుణకర్మంబులం బాసె నేనిం బరతత్త్వంబు నొందు జ్ఞానేంద్రియంబు లేనును విషయంబులమీఁదఁ దోఁచు బుద్ధు లేనును నభిమానంబును ననునేకాదశవృత్తులం గూడినమనంబు జీవునికి నసంఖ్యంబు లయినజన్మంబులఁ బొందించు మనోవృత్తుల నతిక్రమించిన జీవుండు పరంజ్యోతి యైననారాయణస్వరూపంబుగా నెఱుంగుము స్థావరజంగమంబు లయినజీవులకుం బవనుండు ప్రాణం బై యున్నచందంబున నీశ్వరుండు సర్వభూతాంతర్యామి యగుచు జీవాత్మస్వరూపంబున నుండు జీవాత్ముండు జ్ఞానోదయంబునం జేసి మాయ నెంతకాలంబు గెలువ కుండు నంతకాలంబు ముక్తసంగుఁడు గాఁ డరిషడ్వర్గంబును జయించి పరతత్త్వంబు నెఱింగిన నీశ్వరుం డగుఁ జిత్తం బెంతకాలంబు విషయాసక్తం బగు నంతదడవు సంసారచక్రంబునందు సంచరించుం గావున మహావీరుండ్డైనను దనకు శత్రు వైనమనంబు నప్రమత్తుం డయి యిచ్ఛావిహారంబున జరగనీక పరమగురుం డైనశ్రీహరిచరణోపాసనాస్త్రంబునం జిత్తంబు గెలిచినం బరతత్త్వంబు నొందు నని విప్రుండు పలికిన నతనిమహిమకు వెఱఁగంది బ్రాహ్మణు

నకు నమస్కారంబు సేయుచు భూవరుం డి ట్లనియె. 154

ఉ. కారణవిగ్రహంబు నుఱుకాయము నీయవధూతవేషముల్
భూరిధరామరత్వమును బూర్వసమాగమ మాత్తభావముం
జారువిహారము న్నతుల శాంతిగుణంబును గూఢవర్తనం
బారయఁ గల్గునీకు ననయంబును మ్రొక్కెదఁ బెక్కుభంగులన్. 155

మ. జ్వరితార్తుం డగురోగి కౌషధ మతీష్టం బైనచందంబునన్
[1]ధరలో నాతపతప్తదేహి కడుశీతం బైనతోయంబునన్
గరిమం గోరినరీతి నెంతయు సహంకారాహిదష్టుండ నై
పరఁగన్ నాకును నీవచోమృతము దప్పన్ మందు వే ఉన్నదే. 156

ఆ. విప్రవర్య నేను వేడ్కతో నాసంశయంబు లెల్ల నిన్ను నడిగి తెలియఁ
దలఁచి యున్నవాఁడఁ దప్పక యెఱిఁగింపు, ముచితవృత్తిఁ దత్త్వయోగ మెల్ల.

వ. (అని యడిగినయారాజునకు విప్రుం డి ట్లనియె.) 158

తే. కాన వచ్చినఫలములు కర్మమూల, మగుటఁ జేసియు సంసారమందుఁ జిత్త
మెపుడు వర్తించుచుండఁగా నెఱుఁగ లేవు, తత్త్వయోగంబుమిగులనిత్యంబటంచు.

వ. [2]మఱియు నీవసుంధర నున్నచరణంబులకు నెక్కుడు జంఘ లామీఁద జానువు లాపైడవున నూరువు లందులకు నుపరిప్రదేశంబున మధ్యం బటమీఁద నుర మందులకు నెక్కువ కంఠం బటమీఁద స్కంధం బందుల దారు వాదారువున శిబిక శిబికయందు రాజ నని యొడియభిమానంబు గలిగి నీ వున్నవాఁడ విట్టిశోచ్యు లయి కష్టదశం బొంది జనుల దయ లేక నిగ్రహించి నీవు ప్రజాపాలనంబు సేయుచున్నవాఁడ ననుగర్వంబున మావంటిమహాత్ములసభలలోనం బూజ్యుండవు గాక యున్నవాఁడ వీస్థావరజంగమంబులకు నివాసస్థానంబు వసుంధర యైనచందంబున సత్క్రియలచేత నెఱుఁగం [3]దగినజగత్కారణం బైనతత్త్వంబు నెఱింగించెదఁ బరమాణుసముదయం బీధరిత్రి యైనచందంబున [4]నవిద్యామనంబులచేతం గల్పితం బయినకృశస్థూలబృహదణుసదసజ్జీవాజీవద్రవ్యస్వభావాశయకాలనామబుద్ధిరూపం బైనమాయచే జగత్తు రెండవది యై కల్పింపంబడియె [5]బాహ్యాభ్యంతరంబులం గలిగి స్వప్రకాశంబై భగవచ్ఛబ్దవాచ్యంబును విశుద్ధంబును బరమార్థంబును జ్ఞానరూపంబును నైనబ్రహ్మం బొకటియ సత్యంబు జగత్తసత్యం

1 న్నరయ న్నాతపతప్తదేహి కమశైత్యం బైనతోయంబునన్. 2 అని యాభ్యర్థించిన విప్రుం డి ట్లనియె మఱియు. వ్రాఁతప్రతుల 158-వ వచనము లేదు. 158-వ పద్యము రహూగణుఁ జెప్పినది గాను వక్కలివచనము విప్రునిదిగాను గానిపించుచున్నది. 3వచ్చినవ్యవహారమూలంబు గలిగ నేని నెఱింగింపుము. 4 నవిద్యామయం బైనమనంబుచేతఁ. 5 బాహ్యాభ్యంతరపరిపూర్ణంబును శుద్ధజ్ఞానస్వరూపంబును బరమార్థంబు నేకంబును సత్యంబును బ్రహ్మరూపంబును భగవచ్ఛబ్దసంజ్ఞికంబు నైనశబ్దంబు వాసుదేవుం డని పెద్దలు పలుకుదు రని శూరసేనసింధుదేశాధీశుం డైనరాజున కెఱింగించి మఱియు.

బగు నని పలికి మఱియును. 160

సీ. ధరలోన బ్రహ్మంబుఁ దపమున దానంబులను గృహధర్మంబులను జలాగ్ని
సోమసూర్యులచేత శ్రుతులచే నైనను, బరమభాగవతుల పాదసేవఁ
బొందినమాడ్కిని బొందంగ రాదని, పలుకుదు రార్యులుఁ బరమమునులు
ఘనతపోబాహ్యసౌఖ్యములకు విముఖులు, నయినట్టిపుణ్యులు హరిగుణాను
తే. మోదితాత్ములు నగుబుధపాదసేవ, ననుదినంబును జేసిన నంతమీఁద
మోక్షమార్గంబునకును బద్ధాత్ముఁ డందుఁ, బట్టు[1]వడియుండు నెప్పుడుఁ బరఁగ బుద్ధి.

వ. నరేంద్రా! నేను బూర్వంబున భరతుం డను రాజను సర్వసంగపరిత్యాగంబు సేసి భగవదారాధనంబు సేయుచు మృగంబుతోడిస్నేహంబుకతన మృగంబ నై పుట్టియు నందును హరిభక్తి దప్పకుండినకతంబున నిప్పుడు మనుష్యుండ నై మనుష్యసంసర్గంబును బాసి గూఢైకాకి నై చరించుచున్నవాఁడ నరుండు వృద్ధసంసేవం జేసి సంసారమోహంబును బాసి హరిధ్యానకథలచే లబ్ధజ్ఞానుం డై పుండరీకాక్షునిం బూజించుచుం బరలోకంబునం బొందు నని పలికి విప్రుండు మఱియు ని ట్లనియె. 162

సీ. ధరణీశ మాయచే తను దాఁటఁగా రాని, పథమునఁ బెట్టంగఁ బద్ధజీవుఁ
డెలమిమై గుణకర్మములఁ జేయుచును లాభ, మాశించి తిరుగు బేహారిమాడ్కి
ఫల మపేక్షించుచుఁ బాయక జీవుండు, సంసారగగనసంచారి యగుచు
ననవరతము నుండు నామహావనమందుఁ, గామలోభాదితస్కరులు గూడి
తే. ధరణి విజితేంద్రియుఁడు గానినరునిఁ బట్టి, ధర్మ మనియెడి యామహాధనము నెల్ల
నరసి కొనిపోవుచుండు ననుదినంబుఁ, గాన సంసారమందు నాకాంక్ష వలదు.

క. అరయఁగ సంసారాటవిఁ, దరలక యాపుత్త్రమిత్త్రదారాదు లనం
[2]బరఁగుచు నుండెడువృకములు, పరువడి నరబస్తములను భక్షించు వడిన్. 164

తరలము. మలసి సంసృతిఘోరకాననమందిరంబుల నెల్లచోఁ
జెలఁగి గుల్మలతాతృణాదులచేత గహ్వర మైనని
శ్చలనికుంజములందు దుర్జనసంజ్ఞలం గలమక్షికం
బులనిరోధము దన్ను సోఁకినఁ బొందు దుర్దశ నెప్పుడున్. 165

ఆ. మఱియు నీగృహస్థమార్గంబునం దెల్ల, విషయములను బొంది విశ్వ మెల్లఁ
గడఁకతోడ నిట్లు గంధర్వనగరంబుఁ, గాఁ దలంచి మిగుల మోదమందు.

ఆ. మరగి కాననమునఁ గొఱవిదయ్యముఁ గాంచి, యగ్నిఁ గోరి వెంట నరుగుమాడ్కిఁ
గాంచనంబు గోరి కలవారియిండ్లపం, చలను దిరుగు నరుఁడు చలనమంది.

ఆ. బహుకుటుంబి యగుచు బహుధనాపేక్షచే, నెండమావులఁ గని యేఁగుమృగము

---

1 బుద్ధి యెప్పుడు భక్తి గలిగి. 2 బరఁగెడు-గోమాయువృకములు-మాయికవృకములు-పరువడి మానవునిఁ బట్టి భక్షించు.

కరణిఁ బ్రేమఁ జేసి ♦ గురువులువాఱుచు, నొక్కచోట నిలువకుండు నెపుడు.

ఆ. మఱియు నొక్కచోట ♦ మత్తుఁడై పవనర,జోహతాత్ముఁడగుచుఁ ♦ జూపు దప్పి
దిక్కెఱుంగ కొండు ♦ దిశ కేఁగుపురుషుని, కరణిఁ దిరుగు నరుఁడు ♦ నరవరేణ్య.

వ. మఱియు నొక్కచోట నులూకఝిల్లీస్వనంబులతోడ సమానంబు లయినశత్రురాజతిరస్కారంబులకు దుఃఖపడుచు నొక్కచోట క్షుధార్దితుండై యపుణ్యాఫలవృక్షంబుల నాశించుమాడ్కిఁ బాపకర్ములు ద్రవ్యహీనులు నగువారి నాశ్రయించుచు నొక్కయెడం బిపాసాతురుం డై జలహీనం బయిననదికిఁ జనినరీతి నిహపరదూరుఁ డైనపాషండుని సేవించుచు మఱియు నొక్కప్రదేశంబునం దగ్నిచేతం దప్తుం డయినవాఁడు దావాగ్నిం జేరి వ్యథ నొందురీతి నన్నార్థి యగుచు దాయాదులం జేరి దుఃఖించుచు మఱియు నొక్కచోటఁ బరబాధం జేసి మున్ను గానక రాజ్యాభిలాషం బ్రాణసఖు లైనపితృపుత్రభ్రాతృజ్యేష్ఠుల నైనను వధియించుచు మఱియు శూరులచేతం గొట్టువడి సర్వధనంబును బోనాడి చింతాపరవశుం డై దుఃఖించుచు నున్నంత గంధర్వనగరప్రాయం బైనసంసారసుఖంబు ననుభవించి మోదించుచు మఱియు నగారోహణంబు సేయునరుండు గంటకపాషాణాదులవలనం బాదపీడితుం డగుచు దుఃఖించుచందంబున గృహాశ్రమోచితమహానుష్ఠానంబునకు నుపక్రమించి వ్యసనకంటకశర్కరాపీడితుండై దుఃఖించుచు నొక్కచోటఁ జఠరాగ్నిపీడితుం డై కుటుంబంబుమీఁద నాగ్రహించుచు వనంబున నజగరదష్టుం డై నిర్విణ్ణుం డైనచందంబున రాత్రి గృహాటవియందు నిద్రాపరవశుం డై యెఱుంగక వర్తించుచు మఱియును వనంబునఁ దృణచ్ఛన్నకూపపతితుం డగుచు సర్పదష్టుఁ డైన తెఱంగున సంసారియై దుర్జనులచేత వ్యథితహృదయుం డగుచు నంధుండై యజ్ఞానాంధకూపంబునం బడుచు నొక్కయెడ జుంటితేనియకు నై మక్షికాబాధ నత్యంతదుఃఖితుం డయినమాడ్కి ని సంసారకాముం డై పరదారద్రవ్యాభిలాషి యగుచు భూపాలకులచేత నైనను గృహపతిచేత నైనను దాడితుం డయి నరకంబునం బడుచు యౌవనంబున సంపాదించినద్రవ్యంబులు పరులచేతం బోనాడినవిధంబున శీతవాతాద్యనేకప్రయాసలబ్ధం బైనధనంబు వోనాడి సంసారి యతిచింతాక్రాంతుం డై యుండు మఱియును వనంబున లుబ్ధకులు సంస్పృష్టం బయినయల్పామిషంబునకు నన్యోన్యవైషమ్యంబునం గలహించినవిధంబున సంస్పృష్టవ్యవహారియై యల్పద్రవ్యంబులకుం బోరాడు చుండు నని భూపాలునకు విప్రుండు సంసారాటవితెఱం గెఱింగించి వెండియు ని ట్లనియె. 170

ఆ. అల్పధనుఁడు విశ్రమస్థానములఁ దృప్తిఁ, బొంద కొంగులధనముఁ ♦ బొందఁ గోరి
యరిగి వారివలన ♦ నవమానములఁ బొంది, యధిక మైనదుఃఖ ♦ మనుభవించు.

ఆ. అంతఁ గొంద ఱల్ల ♦ నన్యోన్యవిత్తాది,వినిమయమునఁ గడుఁ బ్రవృద్ధ మైన

వైరములను బొంది పోరాట నొందుదు, రాత్మచింత లేక యనుదినంబు.

సీ. సంసారమార్గసంచారుఁ డై యధిక ప్ర,యాసంబునను గూర్చునర్థములను
విహరించుచును గొంద నిహలోకఫలములఁ, గోరుచు మోక్షంబుఁ గోర కంతఁ
జెడి పోవు చుందు రెప్పుడు గాని యందుకుఁ, గడపటియోగంబు గానలేరు
మానవంతులు నసమానశౌర్యులు నగు,వారు మిక్కిలి యైన వైరబుద్ధి

తే. నాహవంబున మడియుదు రంతెకాని, మోక్షమార్గంబు గానరు మూఢవృత్తి
ననుచు సంసారగహనవిహార మెల్లఁ, దెలిసి క్రమ్మఱ ననియె ధాత్రీసురుండు.

వ. మఱియుం గాలచక్రనియంత్రితుం డై చక్రాయుధునిం గొల్వక కాకగృధ్రబక
సమాను లైన పాషండులతోడిసఖ్యంబునం జేసి వారలచేత వంచితుం డై బ్రాహ్మణ
కులంబునం జేసి శ్రౌతస్మార్తకర్మానుష్ఠాన[1]పరుం డై విషయసుఖంబులందుఁ దగులము
వడి కాలంబుతుద నెఱుంగక వృక్షంబులుం బోలె నైహికార్థంబులయందుఁ దృ
ష్ణ గలిగి మైథుననిమిత్తంబు సుతదారాదులయందు స్నేహంబు సేయుచుఁ బధి
కుండు మాతంగంబులయందు భయంబున దీర్ఘనిమ్నకూపంబునం [2]బడిన తెఱం
గున సంసారమృత్యుగజభయంబున గిరికందరప్రాయం బయిన యజ్ఞానతమంబు
నం బడుం గావున మాయచేత సంసారమార్గం బైన రాజభావంబు విడిచి సర్వ
భూతమైత్రి గలిగి జితేంద్రియుండ వై జ్ఞానాసిచే మార్గంబు కడపల గను మని
పలికిన భూపాలుం డి ట్లనియె. 174

క. అక్కడ మానుష[3]జన్మము, పెక్కువ యై యుండు నెపుడు భేదమతిం బెం
పెక్కినయోగిసమాగమ, మక్కజముగఁ గలిగెనేని నఖిలాత్మలకున్. 175

క. ధరణీసురవర నీశ్రీ,చరణాంబుజయుగళరేణుసంస్పర్శము నా
దురితంబు లడఁచె నింతట, హరిభక్తియు నంతకంత కధికం బయ్యెన్. 176

వ. మఱియు విప్రవరులయందు యోగీశ్వరు లవధూతవేషంబునం జరియించు చుం
దురు గావున విప్రులు పిన్నపెద్ద లనక యందఱకు నమస్కారం బని స్తుతియిం
చిన నాయోగీశ్వరుండును సింధుపతికిఁ గరుణాన్వితుం డగుచుఁ దత్త్వజ్ఞానం బు
పదేశించి యారాజుచేత వందితచరణుం డై పూర్ణార్ణవంబునుంబోలె సంపూర్ణ
కరుణారసపూరపూరితస్వాంతుం డై వసుంధరం జరియించు చుండె సింధుభూపతి

---

1 ‘పరత్వంబున భగవదారాధనంబు సేయుక విషయు. 2 బడుచుండి తత్కూపగతలతాగ్రహ
ణంబున నాపద్విముక్తుం డై నచందంబున సంసారమయమృత్యుగజభయంబున గిరికందరప్రాయం
బై నయజ్ఞానతమంబునం బడి కర్మవల్లు లవలంబించి పునర్భవంబు నొందు సంసారప్రవర్తకుండు గావున
మాయచేత-ఇట ‘కర్మవల్లీ మవలంబ్య తత ఆపదః కథం చిన్నరకాద్విముక్తః పునరప్యేవం సంసారా
ధ్వని వర్తమానః’ అనుమూలమునకుఁ దెనుఁగు గానిపించుచున్నది. అచ్చుప్రతులందు శోధకులు దీనిని
గబళించిరి కాఁబోలు. 3 జన్మం, బెక్కువ యై యుండుఁ జాలహితమతితోఁ బెం’ వ్రా. ప్ర.

యును సుజనసమాగమంబున లబ్ధతత్త్వజ్ఞానుం డయి దేహాత్మభ్రమం బాసె
నని పలికిన శుకయోగీంద్రునకుం బరీక్షిన్నరేంద్రుం డి ట్లనియె. 177

చ. అరయఁగ మక్షికంబు వినతాత్మజుఁ గూడఁగ లేనిరీతి యా
భరతునిసచ్చరిత్రములు ప్రస్తుతి సేయఁగ నీవసుంధరన్
నరపతు లెల్ల నోపరు మనంబున నైనను నెంచ నింక నా
భరతునిపుణ్యవర్తనముఁ బ్రస్తుతి సేయఁగ నాకు శక్యమే. 178

వ. నరేంద్రా భరతుండు సుతదారరాజ్యాదులను బూర్వకాలంబునందె విడిచి భగ
వత్పరుం డగుచు యజ్ఞరూపంబును ధర్మస్వరూపంబును సాంఖ్యయోగంబును
బ్రకృతిపురుషస్వరూపంబును నైననారాయణునకు నమస్కారం బనుచు మృగ
రూపంబును బాసె నట్టిభరతునిచరిత్రం బెవ్వరు సెప్పిన నెవ్వరు వినిన నట్టి
వారలఁ బుండరీకాక్షుండు రక్షించు నాయురభివృద్ధి యగు ధనధాన్యసమృద్ధియు
నగు చుండ స్వర్గాపవర్గభోగంబులం బొందుదు రని. 179

మ. [1]నరదేవాసురయక్షరాక్షసమునీంద్రస్తుత్య దివ్యాంబరా
భరణాలంకృత భక్తవత్సల కృపాపారీణ వైకుంఠమం
దిర బృందావనభాసురప్రియ ధరిత్రీనాథ గోవింద శ్రీ
కర పుణ్యాకర వాసుదేవ త్రిజగత్కల్యాణ గోపాలకా. 180

క. పరమపదవాస దుష్కృత,హర కరుణాకర మహాత్మ పాతదితిసుత భా
సురగోపికామనోహర, సరసిజదళనేత్ర భక్తజననుతగాత్రా. 181

మాలిని. సరసహృదయవాసా చారులక్ష్మీవిలాసా
భరితశుభచరిత్రా భాస్కరాబ్జారినేత్రా
నిరుపమఘనగాత్రా నిర్మలజ్ఞానపాత్రా
గురుతరభవదూరా గోపికాచిత్తచోరా. 182

గద్యము. ఇది సకలసుకవిజనానందకర బొప్పనామాత్యపుత్త్ర గంగనార్యప్రణీతం
బైనశ్రీమహాభాగవతపురాణంబునందుఁ బ్రియవ్రతునిసుజ్ఞానదీక్షయు బ్రహ్మ
దర్శనంబును నాగ్నీధ్రాదికులజన్మంబును నుత్తమతామసరైవతులజన్మంబును
బ్రియవ్రతుండు వనంబునకుం జనుటయు నాగ్నీధ్రుం డప్సరసం బరిగ్రహిం
చుటయు వర్షాధిపతులజన్మంబును నాగ్నీధ్రుండు వనంబునకుం జనుటయు నాభి
ప్రముఖులరాజ్యంబును నాభియజ్ఞంబును ఋషభునిజన్మంబును ఋషభునిరాజ్యా
భిషేకంబును భరతునిజన్మంబును ఋషభుండు దపంబునకుఁ జనుచు సుతులకు

---

1 ఈయాశ్వాసాంతగద్యపద్యములు పెక్కుప్రతులను గానిపింపవు. 179 వ గద్యమున 'బొం దుదు రని' యన్నపిదప 'సకలపురాణార్థవిజ్ఞాతుం డగుసూతుం డి ట్లనియె' నని యున్నది. కాన యీస్కంధ మేకాశ్వాసముగా నే కొన్నిటఁ జూపట్టుచున్నది.

నతులజ్ఞానం బుపదేశించుటయు భరతునిపట్టాభిషేకంబును భరతుండు వనంబు నకుం జనుటయు భరతుండు హరిణపోతంబునందలిప్రీతిం జేసి హరిణగర్భంబున జనియించుటయు మరల విప్రసుతుం డై జనియించుటయు విప్రుండు చండికా గృహంబున బ్రదికి వచ్చుటయు సింధుపతివిప్రసంవాదంబును ననుకథలు గల పంచమస్కంధంబునందుఁ బ్రథమాశ్వాసము. 183.

ఓం తత్స ద్బ్రహ్మార్పణ మస్తు.



శ్రీరస్తు

శ్రీరామచన్ద్రాయ పరబ్రహ్మణే నమః.

# శ్రీమదాంధ్రమహాభాగవతము

## పంచమస్కంధము

### ద్వితీయాశ్వాసము.



కాంతాహృదయప్రియ
లోకాలోకప్రచార లోకేశ్వర సు
శ్లోక భవభయనివారక
గోకులమందార నందగోపకుమారా. 1

వ. సకలపురాణార్థజ్ఞానవిఖ్యాతుం డగుసూతుం డిట్లనియె. 2

క. మునులార బాదరాయణి, యనఘాత్ముఁ డైనయుత్తరాత్మజునకు స
ద్వినయోక్తి భరతుచరితము, వినిపించుచు మఱియు నిట్లు వినిపించెం దగన్.

ఆ. పార్థివేంద్ర యిట్లు భరతాత్మజుం డైన, సుమతి ధర్మవర్తనమునఁ దిరుగ
సది యెఱింగి దుష్టులైనపాషండులు, దమమతంబు మిగులఁదలఁచి పొగడి.

క. ధరణీవల్లభ నిన్నును, నిరతంబును బుద్ధదేవునిం గొలిచినయా
తెఱఁగునఁ గొలిచెద మని భా,సురమతి బోధించి రప్పుడు సుమతిం బ్రీతిన్. 5

వ. ఇట్లు పాషండబోధితుం డైనసుమతికి వృద్ధసేనయందు దేవతాజిత్తనుపుత్త్రుండు జనించె వానికి దేవద్యుమ్నుం డనుసత్పుత్త్రుం డాసురియం దుదయించె నమ్మహాత్మునకు ధేనుమతియందుఁ బరమేష్ఠి జనియించె నాసత్యసంధునికి సువర్చలయందుఁ బ్రతీహుండు జనియించె నప్పరమపురుషుండు సకలజనులకు బ్రహ్మోపదేశంబు సేసి తాను శుద్ధాత్ముం డై హరినామస్మరణంబు సేయుచు [1]యజ్ఞకరణనిపుణు లగుప్రతిహర్తృప్రస్తోతోద్గాతృ లనుసత్పుత్త్రత్రయంబుం గాంచె నాప్రతిహర్తకు స్తుతియందు [2]వ్యోమభూమనామకపుత్త్రద్వయం బుత్పన్నం బయ్యె నందు

---

1 సువర్చలాదేవకుల్యావిరత్సలయందు యజ్ఞకర్తలయిన. 2 ప్రతిభూముం డనుతనయుం డయ్యె నాధైర్యవంతునకు ఋషికుల్యయం దుద్గీథి పుత్త్రుం డయ్యె నాధర్మాత్మునకు దేవకుల్యయందుఁ బ్రస్తావుండనువాఁడు జనన మందె నాప్రస్తావునకు వివత్సయందు నతిపుణ్యుం డైనవిభుండు గలిగె నావిభునకు జరంతియందు హనుశీర్షణుం డనువాఁడు పుట్టె నాపుణ్యాత్మునకు నాకూతియందు నక్తుం డనువాఁ డవరకుమారుం డయ్యె నాకీర్తిమంతునకు ధృతి యనువాఁడు మహాధీరుం డై పుట్టె నాధృతికి గయుం డనురాజవృషభుండు పుట్టె నంత.

భూమునకు ఋషికుల్యయందు నుద్గీథుం డనుసుతుండు జనించె నతనికి దేవకుల్య
యందుఁ బ్రస్తోత గలిగె నాప్రస్తోతకు వరరుత్సయందు విభుం డనుతనయుం
డుద్భవించె నతనికిని భారతియందుఁ బృథుషేణుం డుదయించె నతనికి నాకూతి
యందు నక్తుండు గలిగె నానక్తునకు రాజర్షిశ్రేష్ఠుం డగుగయుం డనుమహాకీర్తి
సంపన్నుం డుదయించె. 6

ఆ. అట్టిగయునివలన నఖిలజీవులఁ బ్రోవఁ, దలఁచి సాత్త్వికప్రధాన మయిన
యట్టిమేను దాల్చి యాత్మతత్త్వజ్ఞానుఁ, డగుచునుండె హరి నిజాంశమునను.

వ. (ఇట్టిమహనీయసుగుణాకరుం డగుగయునిగాథానువర్ణనంబు పురాణవిదు లగు
మహాత్ములచే నీ తెఱంగున నుతింపంబడుచున్నది సావధానమనస్కుండ వై యాల
కింపు మని యి ట్లనియె.) 8

సీ. ధర్మమార్గంబున ధారుణీజనులను, బ్రేమతోఁ బోషణప్రేషణోప
లాలనశాసనలక్షణాదులఁ బ్రీతిఁ, బోషించుచును యజ్ఞములను యజ్ఞ
పురుషు నీశ్వరుఁ జిత్తమున నిల్పి సేవించి, స్వాంతమం దున్నయీశ్వరునిఁ గాంచి
యఖిలజీవతతికి నానంద మొసఁగుచు, నిరభిమానత మెయి నేల యేలె

ఆ. సత్యమందు మిగులసత్సేవయందును, ధర్మమందు యజ్ఞకర్మమందు
గయుఁడు వసుధలోనఁ గంజాక్షుఁడే కాని, మానవుండు గాఁడు మానవేంద్ర.

వ. అట్టి(మహాపురుషగుణగణపరిపూర్ణుం డగు)గయునికి (దక్షకన్యక లగు) శ్రద్ధామై
త్రీదయాదులు దమయంతన వచ్చి కోరిక లొసంగ నతనిప్రజలకు వసుంధర
కామధేను వై పిదుక వేదంబులు సకలకామంబుల నిచ్చు చుండ సంగరంబున
భంగంబు నొందినరాజు లప్పనంబు లొప్పనంబు సేయ విప్రులు ధర్మం బాఱవ
పాలు పంచి యిడ నిరంతరసోమపానంబును శ్రద్ధాభక్తియోగంబులుఁ గలిగి
యొనర్చుయజ్ఞంబుల నింద్రాదిదేవతలు తృప్తు లై యజ్ఞఫలంబుల నొసంగ
బ్రహ్మాదితృణగుల్మలతాపర్యంతంబు సకలలోకంబులవారినిం దృప్తిం బొందిం
చుచు శ్రీహరిం దృప్తిఁ బొందఁ జేయుచు గయుండు పెక్కుకాలంబు రాజ్యంబు
సేసె నట్టిగయునికి జయంతియందుఁ జిత్రరథస్వాత్యవరోధను లనుమువ్వురు
గొడుకులు పుట్టిరి నాచిత్రరథునికి నూర్ణయందు సామ్రాట్టును వానికి నుత్కళ
యందు మరీచియు నామేటికి బిందుమతియందు బిందుమంతుండును నాబిందు
మంతునకు సరఘయందు మధువును మధువునకు సుమనస యనుదానియందు
వీరవ్రతుండును నావీరవ్రతునకు భోజయందు మన్యుప్రమన్యువు లనునిరువు
రును నందు మన్యువునకు సత్యయందు భువనుండును నతనికి దోషయందుఁ
ద్వష్టయు నాధర్మాత్మునకు విరోచనయందు విరజుం డనువాఁడును జనియించె
నంత విషూచియందు. 10

క. ఆవిరజున కుదయించిరి, భూవినుత జితారిలోక | పుత్రశతంబుల్
ఆవల నొకకన్యకయును, నావేళ సమస్తజనులు | హర్షం బందన్. 11

క. ఘనుఁడు ప్రియవ్రతువంశం,బునకుం దుద యై విరజుఁడు | భూపతి వంశం
బును దా నలంకరించెను, విను మింద్రావరజుఁ డయిన | విష్ణునిమాడ్కిన్. 12

క. అని పలికిన శుకయోగిం, గనుఁగొని యభిమన్యుసుతుఁడు | గడు మోదముతో
వనజదళాక్షునిమహిమలు, విని సంతస మంది యనియె | వేడుక మఱియున్. 13

వ. మునీంద్రా సూర్యరశ్మి యెందాఁకం బ్రవర్తిల్లు నక్షత్రయుక్తం బైనచంద్రకిరణంబు లెంతమేరఁ దిరుగు నంతదూరంబు ప్రియవ్రతునిరథనేమిఘట్టనలచేత సప్తద్వీపంబులును సప్తసముద్రంబులు నయ్యె నని పలికితివి నాద్వీపసముద్రంబుల పరిమాణంబులు సవిస్తరంబుగా నెఱింగింపుము గుణమయంబును స్థూలరూపంబును నయినశ్రీహరిశరీరం బగునీలోకంబునందు నిలిపినచిత్తం బగుణంబును సూక్ష్మంబును నాత్మజ్యోతియు బ్రహ్మంబును నైనవాసుదేవునియందు నిల్చుం గావున ద్వీపవర్షాదివిస్తారంబు వినిపింపు మనిన శుకయోగీంద్రుం డి ట్లనియె. 14

క. ధరణీవల్లభ విను శ్రీ,హరిమాయాగుణవిభూతు | లగుజలనిధులుం
బరఁగినదీవులు వర్షము, లరయంగాఁ గొలఁదిపెట్ట | నలవియె జగతిన్. 15

ఆ. తెలిసినంత నేను | దెలిపెద సంక్షేప,మునను జిత్తగించి | వినుము దెలియ
ననుచుఁ జెప్పఁదొడఁగె | నభిమన్యుసుతునకు, [1]నింపుగాను శుకము | నీంద్రుఁ డిట్లు.

—శుకయోగి యుపదేశరూపమునఁ జెప్పుభూగోళంబునిర్ణయము.—

వ. నరేంద్రా జంబూద్వీపంబు భూపద్మంబునకు మధ్యప్రదేశంబున లక్షయోజనంబులవెడల్పు నంతియ నిడుపునుం గలిగి కమలపత్త్రంబునుంబోలె వర్తులాకారంబయి (నవసహస్రయోజనపరిమితాయామంబు గల)నవవర్షంబులు నష్టమర్యాదాగిరులునుం గలిగి విభక్తం బయి యుండు నందు మధ్యవర్షం బిలావృతవర్షం బగు నందు మధ్యమప్రదేశంబున సువర్ణమయం బయి. 17

క. భూపద్మమునకు మేరువు, దీపించుచుఁ గర్ణికాకృ | తిని బెంపగుచుం
బ్రాపై [2]కులగిరిరాజు గఁ, జూపట్టును సురగణాళి | చోద్యం బందన్. 18

సీ. మఱియును నామేరు | గిరి లక్షయోజనో,న్నత మగు చుండి [3]యానడిమిదళము
విదిత మై పదియాఱు | వేలయోజనములు, నంతియ పాఁతు నై | యతిశయిల్లు
నామీఁద విస్తార | మరయ ముప్పదిరెండు, వేలయోజనముల | వెలసి యుండు
నాగిరి కుత్తరం | బందు నీలశ్వేత,శృంగపర్వతములు | నింగి ముట్టి

ఆ. యుండు రెండువేల | యోజనంబులదాఁకఁ, బఱపు గలిగి పూర్వ | పశ్చిమాయ
తంబు దక్షిణోత్త | రంబును విస్తార, మగుచు మిగులరమ్య | మై నరేంద్ర. 19

1 రమణతోడ బాదరాయణుండు. 2 యత్యున్నతి మై. 3 యానడిమియమ్ము.

వ. ఇట్లు పూర్వపశ్చిమంబులు లవణసాగరాంతంబు లై యున్నసీమాపర్వతంబుల యందు [1]నీలశ్వేతశృంగవత్పర్వతంబులు నిడివిని యథాక్రమంబుగ దశమాంశ న్యూనప్రమాణయోజనంబులు గలవిగా నుండు వీనిమధ్యప్రదేశంబున రమ్యక హిరణ్మయకురువర్షంబు లనునామంబులు గలవర్షంబు లుండు వానివిస్తారంబులు నవసహస్రయోజనంబులు గలిగి లవణసముద్రాంతంబు లై క్రమంబున నీలాదిపర్వతదీర్ఘపరిమాణంబుల నుండు నిలావృతవర్షంబునకు దక్షిణంబున నిషధహేమకూటహిమవత్పర్వతంబు లనుసీమాపర్వతంబులును బూర్వపశ్చిమంబులు నిడుపును దక్షిణోత్తరంబులు విశాలంబును నగుచు నానీలాదిపర్వతంబుల తీరున నుండు నాగిరులమధ్యప్రదేశంబున హరివర్ష కింపురుషవర్ష భారతవర్షంబు లనునామంబులు గలవర్షంబు లుండు నాయిలావృతవర్షంబునకుఁ బశ్చిమంబున మాల్యవత్పర్వతంబును బూర్వభాగంబున గంధమాదనంబును సీమాపర్వతంబులు పూర్వపశ్చిమంబులు నిడుపును దక్షిణోత్తరంబులు విశాలంబులు నగుచు నీలపర్వతనిషధపర్వతంబులం గదిసి ద్విసహస్రయోజనంబులవిస్తారం బై యుండు మాల్యవత్పర్వతంబు పశ్చిమసముద్రాంతం బై కేతుమాలవర్షంబును గంధమాదనపర్వతంబునకుఁబూర్వభాగంబున సముద్రాంతం బగుచు భద్రాశ్వవర్షంబును మేరువునకుం దూర్పున మందరపర్వతంబును దక్షిణంబున మేరుమందరపర్వతంబులును బడమటిపార్శ్వంబుల నుత్తరమునం గుముదపర్వతంబులు ననునామంబులు గలిగి యయుతయోజనోన్నతంబు లయి మేరునగం బనుమధ్యోన్నతమేధిస్తంభంబునకుం జతుర్ముఖంబుల హ్రస్వస్తంభములుంబోలె నుండు నాచతుస్స్తంభంబులయందును బర్వతశిఖరంబుల వెలుఁగొందు కేతువులునుంబోలెఁ జూతజంబూకదంబన్యగ్రోధంబు లనువృక్షరాజంబులు క్రమంబున నొండొంటికి నేకాదశశతయోజనాయతంబును శతయోజనవిస్తారంబును గలిగి యుండు మఱియు నాపర్వతశిఖరంబులం గ్రమంబునం బయోమధ్విక్షురసమ్మృష్టజలంబులు గలిగి శతయోజనవిస్తారంబు లయినసరోవరంబులు దేజరిల్లు నందు సుస్నాతు లగువారలకు యోగైశ్వర్యంబులు స్వభావంబునం గలుగు మఱియు నందన చైత్రరథ వైభ్రాజిక సర్వతోభద్రంబు లనునామంబులు గలదేవోద్యానంబు లాపర్వతశిఖరంబుల వెలుఁగొందు చుండు నందు దేవతాగణంబులు దేవాంగనలం గూడి గంధర్వులగీతనృత్యంబులు గనుంగొనుచు విహరింతు రంత. 20

ఉ. మందరపర్వతంబుతుది మామిడిపం డ్లమృతోపమాన మై
మందరశైలశృంగసుసమానము లై గిరిమీఁద వ్రాల మా
కందఫలామృతంబు గలఁగంబడి జాఱి మహాప్రవాహ మై

1 నీలపర్వతంబు పొడవులోఁతు తొంబది వేలయోజనంబులు శ్వేతపర్వతం బెనుబది వేలు శృంగపర్వతంబు డెబ్బదివేలు వీనిమధ్య.

యం [1]దరుణోదనామమున నద్భుత మై విలసిల్లు నెంతయున్. 21

చ. కడుమధురంబునన్ సురభిగంధముచే నరుణప్రకాశతన్
వడిగొని మందరాచలము వ్రంతలచెంతల జాతి యంతలోఁ
దాడితొడి నాయిలావృతముఁ దోఁచుచు వింతగఁ బూర్వవాహి యై
యుడరుతరంగసంతతుల నందఱి నచ్చటఁ జేయు ధన్యులన్. 22

ఆ. ఆనదీజలంబు లాడిన [2]యచ్చటి, యంబికానుచరులయంగగంధ
మంది పవనుఁ డంత మనుజేశ పదియోజ, నములు సుట్టుఁ బరిమళముల నింపు.

ఆ. మేరుమందరములమీఁద జంబూఫలం, బులు మహాగజోపమములు గ్రాలి
యవిసి యంతఁ దద్రసామృతం బల్లన, యమ్మహానగంబునందుఁ బొడమి. 24

క. అనుపమ మగుజంబూనది, యనుపేరను వెలసి లీల సరుగుచు నంతన్
ఘనత నిలావృతవర్షముఁ, బనుపడఁ దడుపుచును ధరణిఁ బ్రవహించుఁ దగన్.

ఉ. ఆనదినీటఁ దోఁగి పద [3]నై యటు మృత్తనిలార్కసంగతిం
బూని కడున్ విపాకమునఁ బొందుచు శుద్ధసువర్ణజాతి జాం
బూనదనామ మొంది సురముఖ్యుల కెల్లను భూషణార్హ మై
మానుగ వన్నె మించి కడు మంచిది యై విలసిల్లు నెంతయున్. 26

వ. మఱియు సుపార్శ్వనగాగ్రంబు[4]నందుఁ బంచవ్యామపరిణాహబంధురంబు లగు నైదుమధుధారాప్రవాహంబులు పంచముఖంబుల వెడలి సుపార్శ్వనగశృంగంబులం బడి యిలావృతవర్షంబు పశ్చిమభాగంబుఁ దడుపుచుం బ్రవహించు నా తేనియ ననుభవించువారలముఖమారుతసుగంధంబు శతయోజనపర్యంతంబు పరిమళించు. 27

సీ. కుముదపర్వతశిఖాగ్రమున నుత్పన్న మై, కనుపట్టువటతరుస్కంధమునను
నుదయించునట్టిపయోదధిఘృతమధు,గుడవిశిష్టాన్నంబు లోడిక మైన
యంబరశయ్యాసనాభరణాదివ, స్తువులఁ గోరికలు దీర్చుచును గుముద
పర్వతాగ్రంబునఁ బడి యిలావృతవర్ష,మున జనులకు నెల్లభోగ్యములను

ఆ. వదల కొసఁగు వారివళిపలితంబులు, దలఁగు దుష్టగంధములును బాయు
మరణభయము ముదిమిపారయ దెన్నఁడును శీ,తోష్ణబాధ నెందకుండు నధిప.

ఆ. దేవదానవులును దివ్యమునీంద్రగం, ధర్వులాది గాఁగఁ దగిలి యాశ్ర
యించి యుండు శాగరీంద్రమూలమునందు, హర్ష మంది ఘనవిహారలీల. 29

వ. నరేంద్రా [5]కురంగ కురర కుసుంభ వైకంకత త్రికూట శిశిర పతంగ రుచక నిషధ

1 'గు రసోదనామమున. 2 వారలు, సుఖులు చటులపుణ్యశుభము వృద్ధిఁ, బొంది దివ్యగంధ మందంద శతయోజనములఁ బరిమళించు రమణఁ గోడ.' వ్రా. ప్ర. 3 నందిన మేదిని యర్కదీప్త మై. 4 లఁ గదంబకోటరంబుల వెడలిన మధుప్రవాహంబు లేనును సుపార్శ్వ. ఇట 'మహాకదంబస్సుపార్శ్వనిరూఢ స్తస్యకోటరే వినిస్సృతాః పంచమధుధారాః' అని మూలము. 5 ఇట 'కురంగ కురర

శితివాస కపిల శంఖాదు లయినపర్వతంబులు మేరుపర్వతకర్ణికకుఁ గేసరంబు లై పరివేష్టించి యుండు నామహామేరునగంబునకుఁ బూర్వభాగంబున జఠరదేవకూటంబులును బశ్చిమంబునం బవనపారియాత్రంబులు ననుపర్వతంబులు నాలుగు నొంటొంటికి దక్షిణోత్తరంబుల నష్టాదశసహస్రయోజనంబులనిడుపును బూర్వపశ్చిమంబులు ద్విసహస్రయోజనంబులవెడల్పు నగుచును దక్షిణంబునఁ గైలాసకరవీరంబులు నుత్తరంబునఁ ద్రిశృంగమకరంబు లనుపర్వతంబులు నాలుగును బూర్వపశ్చిమంబుల నష్టాదశసహస్రయోజనంబులనిడుపును దక్షిణోత్తరంబుల ద్విసహస్రయోజనంబులవెడల్పు నగుచును నగ్నిపురుషునకుం బ్రదక్షిణం బగు చున్నపరిస్తరణంబులచందంబున మేరువునకుం బ్రదక్షిణంబుగా నష్టనగంబులు నిలిచి యుండు మేరుశిఖరంబున దశసహస్రయోజనంబులనిడుపు నంతియ విస్తారంబు నగుచు సువర్ణమయం బైన బ్రహ్మపురంబు దేజరిల్లుచుండు నాపట్టణంబునకు నష్టదిక్కులయందును లోకపాలురపురంబు లుండు. 30

క. పరమేష్ఠిపట్టణంబున, హరి మున్ను త్రివిక్రమణము నం దర్థి సర్వే
శ్వరచరణాగ్రనఖాహతిఁ, బరువడి నూర్ధ్వాండ మంతఁ బగిలె నరేంద్రా. 31

వ. ఇట్లు చరణనఖస్పర్శంజేసి భేదింపంబడ్డయూర్ధ్వకటాహవివరంబువలన నంతః ప్రవేశంబు సేయు చున్నబాహ్యజలధార శ్రీహరిపాదస్పర్శం జేయుచుఁ జనుదెంచి సకలలోకజనంబులదురితంబులు వాపుచు భగవత్పాది యనుపేరం బరఁగి దీర్ఘకాలంబు స్వర్గంబున [1]విహరించుచు విష్ణుపదంబున నుత్తానపాదపుత్త్రుండును బరమభాగవతుండును నైనధ్రువుండు దనకులదేవత యైనశ్రీహరిపాదోదకప్రభావంబుఁ బ్రతిదినంబును భక్తి నిలిపి యోగంబున నిమీలితనేత్రుం డై యానందబాష్పంబులతో రోమాంచితగాత్రుం డై యత్యాదరంబున నేఁడును శిరంబున ధరియించు చున్నవాఁ డతనికి నధోభాగంబున నుండుమండలాధిపతు లైనసప్తఋషులును హరిపాదోదకప్రభావంబు నెఱిఁగి తాము పొందుతపస్సిద్ధి యాకాశగంగాజలంబుల స్నాతు లగుటగా యని సర్వభూతాంతర్యామి యగునీశ్వరునియందు భక్తి నలిపి యితరపదార్థాపేక్ష సేయక మోక్షార్థి ముక్తిమార్గంబు బహుమానంబు సేయు తెఱంగున (బహుమానయుక్తంబు గాఁ) దమ జటాజూటంబులయందు నేఁడును ధరియించు చుందురు. 32

సీ. అంత నసంఖ్యంబు లై నదివ్యవిమాన, సంకులంబుల సువిశాల మైన
దేవమార్గంబున దిగి వచ్చి చంద్రమం, డలముఁ దోఁచుచు మేరునగశిఖాగ్ర

---

కుముద వైకంకత త్రికూట శిశిర పతంగ రుచక నిషధ శితివాస కపిల శంఖ వైడూర్య... నారదాదయో మేరోః కర్ణికాయాః ఇవ కేసరాః’ అని మూలము. దీని తెనుఁగచ్చుప్రతులందుఁ గానిపింపదు.

1. విహరింప నాకాశంబు విష్ణుపదం బనఁ బరఁగె నట్టివిష్ణుపదంబున.

మునను నా బ్రహ్మదేవుని పట్టణమునకు, వచ్చి యందులఁ జతు।ర్ద్వారములను
వరుసతో దీర్ఘప్ర।వాహంబు లగుచును, బ్రవహించి యమల ప్ర।భావములను

ఆ. నరుగు లవణసాగ।రాంతంబులు గ నాల్గు, మోములందు నాల్గు।నామములను
దన్నుఁ గన్నవారిఁ । దనవారిఁ దోఁగిన, వారి కెల్ల నమృత।వారి యగుచు. 33

వ. [1]ఇట్లు సీత యను పేర వినుతి నొందిన యమ్మహానది ప్రవాహంబు బ్రహ్మసదనపూర్వ ద్వారంబున వెడలి కేసరావలయంబుఁ దడుపుచు గంధమాదనాద్రికిం జని భద్రాశ్వవర్షంబు బావనంబు సేయుచుఁ బూర్వలవణసాగరంబునం బ్రవేశించుఁ జక్షు వను పేరం దేజరిల్లెడు దీర్ఘప్రవాహంబు పశ్చిమద్వారంబున వెడలి మాల్యవత్పర్వతంబు నుత్తరించి కేతుమాలవర్షంబుం బవిత్రంబు సేయుచుఁ బశ్చిమలవణార్ణవంబునం గలయు భద్ర యను పేర వెలుఁ గొందిన యతుల ప్రవాహం బుత్తరద్వారంబున వెడలి కుముద నీల శ్వేతాఖ్యపర్వతశిఖరంబులం గ్రమంబునఁ బ్రవహించుచు శృంగనగరంబునకుం జని మానసోత్తరంబు లగు నుత్తర కురుభూములఁ బవిత్రంబు సేయుచు నుత్తరలవణసాగరంబుఁ జేరు నలకనంద యనం (బ్రఖ్యాతి గాంచిన) యమ్మహానదీప్రవాహంబు బ్రహ్మసదనదక్షిణ ద్వారంబున వెడలి యత్యంతదుర్గమంబు లైన భూధరంబులఁ గడచి హేమకూట హిమకూటనగంబుల నుత్తరించి యతివేగంబునఁ గర్మక్షేత్రం బగు భారత వర్షంబుఁ బావనంబు సేయుచు దక్షిణలవణాంబుధిం గలయు నంత. 34

సీ. జగతిలో మేరు వా।దిగఁ బర్వతములకుఁ, బుత్రిక లైనట్టి।పుణ్యతీర్థ
ములు వేలసంఖ్యలు । గలవు జంబూద్వీప, మందు భారతవర్ష । మరయఁ గర్మ
భూమి దక్కినవర్ష।ముల దివంబుననుండి, భువికి వచ్చినవారు । పుణ్యశేష
ములు భుజించుచు నుండ్రు । భూస్వర్గ మనఁ దగు, నావర్షముల నుండు।నట్టివార

ఆ. లయుతసంఖ్యవత్స।రాయువు లయుతమా, తంగబలులు దేవ।తాసమాను
లతులవజ్రదేహు । లధికప్రమోదితు, లప్రమత్తు లార్యు । లనఘు లధిప. 35

వ. మఱియు సురతసుఖానందంబున మోహంబు నైనం గైకొనక సకృత్ప్రసూతు లగుచు ననవరతంబును ద్రేతాయుగకాలంబు గలిగి ప్రవర్తింతు రీయష్టవర్షంబులయందు దేవతాగణంబులు దమభృత్యవర్గంబు లత్యుపచారంబులు సేయుచుండ నెల్ల ఋతువులయందుం గిసలయకుసుమఫలభరితంబు లైన లతాదుల శోభితంబు లగు వనంబులు గలవర్షనిధిగిరిద్రోణులయందును జలకుక్కుటకారండవ సారసవినోదంబులు గలిగి మత్తాళిఝుంకృతిమనోహరంబు లై నానావిధంబు లయిన కొలంకులయందును దేవాంగనల కామోద్రేకజంబు లయిన విలాసహాస లీలావలోకనంబులం దివియంబడిన మనోదృష్టులు గలిగి విచిత్రవినోదంబులం

1 'ఇట్లమ్మహానదీప్రవాహంబు గలన బ్రహ్మసదనంబు పూర్వద్వారంబున వెడలు సీతానది కేసరావలయంబు' వ్రా. ప్ర.

దగిలి యిచ్ఛావిహారంబులు సలుపు చుండుదురు. 36

క. ఈనవవర్షంబులయం, దానారాయణుఁడు వచ్చి యనవరతము లో
కానుగ్రహమునకై సు, జ్ఞానం బీఁ దలఁచి లీలఁ జరియించుఁ దగన్. 37

సీ. వసుధ నిలావృతవర్షాధిపతి యైన, పురహరుం డావర్షమున వనంబు
నందు నుండుటకు నారయంబికాశాపవ, శంబున నావనస్థలములందు
నెవ్వరు వచ్చిన నింతు లై యుందు రా, వనమందుఁ బార్వతి యనుదినంబు
నంగనాజనసహస్రార్బుదంబులతోడ, నసమలోచనుఁ గొల్చు నతులభక్తి

ఆ. నట్టిశివునిఁ గోరి యాయిలావృతవర్ష, మునఁ జరించుజనులు మోదమునను
గదిసి తత్ప్రకాశకము లైనమంత్రతం, త్రములఁ బూజ సేసి తలఁతు రెపుడు.

క. భద్రాశ్వవర్షమందుల, భద్రశ్రవుఁ డనెడిపేరఁ బరఁగుచుఁ దపసీ
యాద్రిసమధైర్యుఁ డగుచు స, ముద్రాంతం బైనజగతిఁ బొలుపుగ నేలున్.

క. ఆనరవరునకుఁ బ్రియతముఁ, డైనహయగ్రీవమూర్తి ననవరతంబుఁ
ధ్యానస్తోత్రజపాను, ష్ఠానాదులఁ బూజ సేసి సజ్జను లంతన్. 40

ఆ. తత్ప్రకాశకృత్ప్రధానమంత్రాభ్యసం, సిద్ధిఁ జేసి ముక్తిఁ జెంది రప్పు
డట్టివర్షమందు నాహయగ్రీవునిఁ, దలఁచి కొలిచి మిగుల ధన్యు లగుచు. 41

సీ. హరివర్షపతి యైననరహరి ననిశంబు, నం దున్నజనులు మహాత్ము లయిన
దైత్యదానవకులోత్తములు ప్రహ్లాదాది, వృద్ధులఁ గూడి సంప్రీతితోడ
సుస్నాతు లై భక్తిఁ జూచుచు నుందురు, రమ్యదుకూలాంబరములు దాల్చి
తత్ప్రకాశకమంత్రతంత్రజపస్తోత్ర, పఠనసుధ్యానతపఃప్రధాన

తే. మైనసత్పూజలను జేసి యచలబుద్ధి, శ్రీనృసింహునిఁ జేరి పూజించి యతని
కరుణ నొందుచు నతులప్రకాశు లగుచు, భుక్తిముక్తులఁ గైకొంద్రు భూపవర్య.

వ. మఱియుఁ గేతుమాలవర్షంబునందు భగవంతుండు శ్రీదేవికి సంతోషంబు నొసంగుటకు గామదేవరూపంబున [1]నుండు నమ్మహాపురుషునియస్త్రతేజఃప్రకాశంబునఁ బ్రజాపతిదుహిత లగురాత్ర్యధిదేవతలగర్భంబులు సంవత్సరాంతంబున నిర్జీవంబు లై స్రవించు నాకామదేవుండును దనగతివిలాసలీలావిలోకనసుందరభ్రూమండలసుభగవదనారవిందకాంతులం జేసి శ్రీరమాదేవిని రమింపం జేయు [2]భగవన్మాయారూపిణి యగుశ్రీదేవియుఁ బ్రజాపతిపుత్రికలును బుత్రులు నైనరాత్రులం బగళ్లం గూడి కామదేవుని స్తోత్రపఠనపూజాధ్యానాదులం బూజించుచుండు మఱియును. 43

---

1 'నుండుటయు నమ్మహాపురుషునిసుదర్శనప్రకాశతం జేసి ప్రజాపతిదుహితలును బుత్రులు నగు నహోరాత్రాద్యధిపతులగర్భంబులు. 2 భగవంతునిమాయారూపం బగు శ్రీదేవియుఁ బ్రజాపతిపుత్రికలం గూడి' వ్రా. ప్ర.

క. విమలమతిఁ జిత్తగింపుము, రమణీయం బైనవిమలరమ్యకమనువ
ర్షమునకు నధిదేవత దా, నమరం గా మత్స్యరూపుఁ డగుహరి దలఁపన్. 44

ఆ. అట్టివర్షమునకు నధిపతి యగుచున్న, మనువు పుత్త్రపౌత్త్రమంత్రివరులఁ
గూడి మత్స్య మైనకుంభినీధరుఁ జిత్త, మతులభక్తియుక్తి హత్తఁ గొలుచు.

ఆ. తత్ప్రకాశకృత్ప్రధానమంత్రస్తోత్ర, ములను ధర్మకర్మములను హోమ
ములను జనులు సేసిపుణ్యులై భుక్తిము, క్తులను బొందుచుందు రెలమితోడ.

క. వినుము హిరణ్మయవర్షం, బున శ్రీకూర్మావతారమును దాల్చినయా
వనజోదరుఁ డధిదేవత, యనఘుఁడు పితృపతి మహాత్ముఁ డర్యముఁడు నృపా.

క. ఆవర్షమందు నర్యముఁ, డావర్షజనంబు గూడి హరిఁ జిత్తములో
భావించి సంస్తవంబులు, [1]గావించుచు భుక్తిముక్తిఁ గాంతురు గడఁకన్. 48

క. ఉత్తరకురుభూములఁ దను, హత్తుకొని వరాహదేవుఁ డధిపతి యైనన్
సత్తుగ భూపతి యతనిం, జిత్తములో నిలిపి పూజ సేయుచు నుండున్. 49

క. ఆవర్షమందులను బ్రజ, లావిపులవరాహమూర్తి ననవరతంబున్
సేవించి కొలిచి సంస్తుతిఁ, గావించుచుఁ గాంతు రంతఁ గైవల్యంబున్. 50

క. అరయఁగ సీతాలక్ష్మణ, పరివృతుఁ డై వచ్చి రామభద్రుఁడు గడిమిం
బరఁగు నధిదేవతగఁ గిం, పురుషమహావర్షమునకు భూపవరేణ్యా. 51

ఆ. అట్టిరామభద్రు నంజనీసుతుఁడు గిం, పురుషగణముఁ గూడి పూజ సేసి
తత్ప్రకాశకప్రధానమంత్రస్తోత్ర, పఠనములను దగ నుపాస్తి సేయు. 52

సీ. భారతవర్షాధిపతి యైనబదరికా, శ్రమమున నున్ననారాయణుండు
భూనాథ యామహాత్ముని నారదాదులు, భారతవర్షంబుప్రజలఁ బ్రేమఁ
బాయక చేరి యుపాస్తి సేయుచు సాంఖ్య, యోగంబు నుపదేశ ముచితవృత్తి
నంది యందఱును గృతార్థు లై యట్టినా, రాయణదేవు నారాధనంబు

ఆ. సేసి యాత్మఁ జాలఁ జింతించి తత్ప్రకా, శకము లయినమంత్రసంస్తవములఁ
బూజ సేసి ముక్తిఁ బొందుచు నుండుదు, రచల మైనభక్తి ననుదినంబు. 53

క. భారతవర్షమునం దుల, సారాంశము లైనపుణ్యశైలంబులు గం
భీరప్రవాహములు గల, వారయ నెఱిఁగింతు వాని నవనీనాథా. 54

వ. మలయపర్వతంబును మంగళప్రస్థంబును మైనాకంబును ద్రికూటంబును ఋషభపర్వతంబును గూటరంబును గోల్లంబును సహ్యపర్వతంబును వేదగిరియును ఋశ్యమూకపర్వతంబును శ్రీశైలంబును వేంకటాద్రియును మహేంద్రంబును వారిధరంబును వింధ్యపర్వతంబును శుక్తిమత్పర్వతంబును ఋక్షగిరియును బారి

1 ఇట 48-వ పద్యమున 'గావించుచు' మొదలుకొని 50-వ పద్యమున 'సంస్తుతి' అను వఱకుఁ గలపాఠ మచ్చుప్రతులందుఁ గానిపింపదు. ఇందులకు 'ఉత్తరేషు కురుషు భగవాన్ యజ్ఞపురుషః కృతవరాహరూపః...' అని మూల మున్నది.

యాంత్రంబును ద్రోణపర్వతంబును జిత్రకూటంబును గోవర్ధనాద్రియును రైవతకంబును గుకుంభంబును నీలగిరియును గాకముఖంబును నింద్రకీలంబును రామగిరియును నాదిగాఁ గలపుణ్యపర్వతంబు లనేకంబులు గల వాపర్వతపుత్రిక లైనచంద్రపటయుఁ దామ్రపర్ణియు నవటోదయుఁ గృతమాలయు వైహాయసియుఁ గావేరియు వేణియుఁ బయస్వినియుఁ బయోదయు శర్కరావర్తయుఁ దుంగభద్రయుఁ గృష్ణవేణియు భీమరథియు గోదావరియు నిర్వింధ్యయుఁ బయోష్ణియుఁ దాపియు రేవానదియు శిలానదియు సురసయుఁ జర్మణ్వతియు వేదస్మృతియు ఋషికుల్యయుఁ ద్రిసమయుఁ గౌశికియు మందాకినియు యమునయు సరస్వతియుఁ దృషద్వతియు గోమతియు సరయువును భోగవతియు సుషమయు శతద్రువును జంద్రభాగయు మరుద్వృధయు వితస్తయు నసిక్నియు విశ్వయు నను నీమహానదులును సింధుశోణంబు లనునదంబులు నిట్టిమహాప్రవాహంబు లీభారతవర్షంబునఁ గల వందు సుస్నాతు లైనమానవులు ముక్తిం జెందుదురు మఱియు నీభారతవర్షంబున జన్మించినపురుషులు [1]శుక్లలోహితకృష్ణవర్ణరూపంబులగు త్రివిధకర్మంబులం జేసి క్రమంబుగ దేవమనుష్యనరకగతు లను(త్రివిధగతులం) బొందుదురు వినుము [2]రాగద్వేషాదిశూన్యుండు నవాఙ్మనసగోచరుండు ననాధారుండు నగుశ్రీవాసుదేవమూర్తియందుఁ జిత్తంబు నిలిపి భక్తియోగంబున నారాధించెడుమహాత్ము లవిద్యాగ్రంథి గహనంబు గావించుటం జేసి పరమభాగవతోత్తములు పొందెడునుత్తమగతిం జెందుదురు గావున భారతవర్షంబు మిగుల నుత్తమం బని మహాపురుషు లిట్లు స్తుతించుచుండుదురు. 55

ఉ. భారతవర్షజంతువులభాగ్యము లే మని చెప్ప వచ్చు నీ
భారతవర్షమందు హరి పల్మఱుఁ బుట్టుచు జీవకోటికిన్
ధీరతతోడఁ దత్త్వ ముపదేశము సేయుచుఁ జెల్మి సేయుచు
న్నారయ బాంధవాకృతిఁ గృతార్థులఁ జేయుచు నుండు నెంతయున్. 56

క. తనజన్మ[3]కర్మములనుం, గొనియాడెడివారి కెల్లఁ గోరిన [4]వెల్లం
దనియఁగ నొసఁగుచు మోక్షం, బనయముఁ గృపసేయుఁ గృష్ణుఁ డవనీనాథా.

వ. ఇట్లు భారతవర్షంబునందులజనంబులకు నెద్దియు నసాధ్యంబు లేదు నారాయణస్మరణంబు సకలదురితంబుల నడంచుఁ దన్నామస్మరణరహితంబు లైనయజ్ఞతపోదానాదులు దురితంబుల నడంపలేవు బ్రహ్మకల్పాంతంబు బ్రతికెడియితరస్థానం

---

1 సాత్త్వికరాజసతామసకర్మంబులం జేసి. 2 బ్రహ్మవిద్యానిరతు లైనపురుషులు సాయుజ్యంబు నొందుదురు సర్వభూతాంతర్యామియు బ్రహ్మస్వరూపము నైనవాసుదేవునియందుల నిరతిశయభక్తియోగంబున నవిద్యను గెలిచి విష్ణులోకంబుఁ జెందుదురు. కావున నాభారతవర్షం బుత్తమం బగు. 3 కర్మఫలమును. 4 వరముల్. 5 గాని హరికిరహితంబు లయినయజ్ఞ.

బునం [1]బునర్జన్మభయంబున భీతిల్లుచు నుండుటకన్న భారతవర్షంబునందు క్షణ
మాత్రంబు మనంబున సర్వసంగపరిత్యాగంబు సేసినపురుషశ్రేష్ఠునకు శ్రీమ
న్నారాయణపదప్రాప్తి యతిసులభంబుగ సంభవించుం గావున నట్టియుత్తమం
బగునీభారతవర్షంబె కోరు చుండుదురు మఱియు నెక్కడ వైకుంఠునికథావాస
న లేకుండు నేదేశంబున సత్పురుషులైనపరమభాగవతులు లేకుండుదు రేభూ
మిని యజ్ఞేశ్వరునిమహోత్సవంబులు లేక యుండు నది సురేంద్రలోకం బైన
నుండం దగదు జ్ఞానానుష్ఠానద్రవ్యకలాపంబులచేత మనుష్యజాతిం బొంది
తపంబున ముక్తిం బొంద కుండెనేని మృగంబులమాడ్కి నతండు దనకుం దానె
బంధనంబు నొందు భారతవర్షంబునందుం బ్రజలచేత [2]శ్రద్ధాయుక్తంబుగా నను
ష్ఠింపంబడినయజ్ఞంబులయందు వేల్వంబడుహవిస్సులను బెక్కునామంబులం బుం
డరీకాక్షుం డందితనమీందిభక్తి యధికంబుగాం జేయునట్టిభారతవర్షంబునందలి
ప్రజలమీందం గరుణించి సర్వేశ్వరుం డిహపరసౌఖ్యంబుల నొసంగుచుండు జం
బూద్వీపంబున సగరాత్మజు లశ్వమేధాశ్వంబు నన్వేషింపం బూని భూఖననంబు
సేయుటంజేసి స్వర్ణప్రస్థ చంద్రశుక్లావర్తన రమణక మందేహారుణ పాంచజన్య
సింహళ లంకాద్వీపంబు లన నెనిమిదియుపద్వీపంబులు గలిగె. 58

సీ. లక్షయోజనముల • లవణాబ్ధిపరివృత, మగుచు జంబూద్వీప • మతిశయిల్లు
వినుం రెండులక్షల • విస్తృతము గను ప్లక్షద్వీప [3]ముండు నా • క్షారసాగ
రముం జుట్టి యందుల • రమ్యమై యొప్పెడు, వృక్షంబు ప్లక్షంబు • విదితముగను
దనరు నాద్వీపంబు • దరునామమహిమచే, మిగులం బ్లక్షం బన • మించి రహిని
ఆ. నందు సంచరించు • నట్టివారల కగ్ని, దేవుం [4]డమరు నాది • దేవతయుం గ
నందులోన నాప్రి • యవ్రతపుత్రుండు, నిధ్మజిహ్వుం డగుమ • హీవరుండు. 59

వ. నరేంద్రా యాయిధ్మజిహ్వుండు ప్లక్షద్వీపంబు [5]నేడువర్షంబులుగ విభజించి
యందు నావర్షనామధారులుగా నుండుతనపుత్రు లగు శివ యశస్య సుభద్ర శాం
త క్షేమాభయామృతు లనియెడునేడుగుర నేడువర్షంబుల కధిపతులం గావించి
తపంబునకుం జనియె నావర్షంబులయందు మణికూట వజ్రకూట నింద్రసేన జ్యోతి

---

1 బారలుజనులు పునర్జన్మభయంబున భీతిల్లుచుందురు. భారతవర్షంబునందు క్షణమాత్రంబేని మనంబునం గర్మరహితుండైనవానికి మనోధైర్యంబున నామస్మరణ సేసిన ముక్తి లభించు నని భారతవర్షంబె కోరుచుందురు.

2 శ్రద్ధాయుక్తంబులైనయజ్ఞంబులందు వేల్వంబడుహవిస్సులను బెక్కురూపంబులను బుండరీకాక్షునకు సమర్పణంబు సేయుపురుషు నిహపరంబు లొసంగుచుం దనమీందిభక్తి. 3 ఇక్షుసాగరముం జుట్టి, యందుల రమ్యమై యమరు నేకాదశ,శతయోజనములయున్నతి వహించి, యాతరునామాంక మగుచు నవ్వాని ప్లక్షద్వీప మనంగం బ్రశస్త మయ్యె. 4 డతుల మైనదైవ మయ్యె. 5 నందుం దనపుత్రులనామంబులు గల శివ యశస్య.

ష్ణ ధూమ్రవర్ణ హిరణ్యగ్రీవ మేఘమాల లనునామంబులు గలస ప్తకులపర్వతంబులును నరుణయు నృమణయు నాంగిరసయు సావిత్రియు సుప్రభాతయు ఋతంభరయు సత్యంభరయు నన స ప్తమహానదులును నానదులయందు సుస్నాతులగుచు గతపాపు లై నహంసపతంగోర్ధ్వాయనసత్యాంగు లనునామంబులు గల చాతుర్వర్ణ్యంబును గలిగి యుండు నందుఁ బురుషులు సహస్రవత్సరజీవులును దేవతాసములును దృష్టిమాత్రంబునం [1]గ్లమస్వేదాదిరహితం బగునపత్యోత్పాదనంబు గలవార లగుచు వేదత్రయాత్మకుండును [2]స్వర్గద్వారభూతుండును భగవత్స్వరూపియు నగుసూర్యుని వేదత్రయమ్మున సేవింపుచురు ప్లక్షద్వీపం బాదిగా మీఁదటిద్వీపపంచకంబునందలిపురుషులకు నాయురింద్రియపటుత్వంబులును దేజోబలంబులు దోడనె జనియించు చుండు. 60

క. ప్లక్షద్వీపము [3]ద్విగుణిత, లక్షేక్షురసాబ్ధి జుట్టి కొ రా విలసిల్లు
న్నిక్షురసోదద్విగుణం, బక్షయము గ శాల్మలీమహాద్వీప మిలన్. 61

వ. అందు [4]శాల్మలీవృక్షంబు ప్లక్షాయామం బై తేజరిల్లు నావృక్షరాజంబునకు నధోభాగంబునం బతత్త్రిరాజుగా నుండుగరుత్మంతుండు నిలుకడగా వసించు నాశాల్మలీవృక్షంబుపేర నాద్వీపంబు శాల్మలీద్వీపం బన విలసిల్లు నాద్వీపపతి యైన (ప్రియవ్రతాత్మజుం డగు)యజ్ఞబాహువు దనపుత్రు లగుసురోచన సౌమనస్య రమణక దేవబర్హ పారిబ ర్హాప్యాయ నాభిజ్ఞాతు లనియెడువారిపేర నేడువర్షంబుల నేర్పఱిచి యావర్షంబులయం దేడ్వురఁ గుమారుల నభిషిక్తులం జేసె నావర్షంబులయందు స్వరస శతశృంగ వామదేవ కుముద ముకుంద పుష్పవర్ష శతశ్రుతు లనుపర్వతస ప్తకంబును ననుమతియు సినీవాలియు సరస్వతియుఁ గుహువును రజనియు నందయు రాకయు ననుస ప్తమహానదులును గల వందు శ్రుతధర విద్యాధర వసుంధ రేధ్మధరసంజ్ఞు లగునావర్ణపురుషులు భగవత్స్వరూపుండు వేదమయుండు నాత్మస్వరూపుండు నగుసోముని వేదమంత్రంబులచే నారాధింపుదు రాద్వీపంబు లక్షచతుష్టయపరిమితయోజనవి స్తృతం బయినసురాసముద్రంబుచే నావృతం బై తేజరిల్లు నందు. 62

సీ. భూనాథ యాసురాం[భోధికిఁ జుట్టుగా, నుండుకుశద్వీప [ మద్వీమీఁదఁ
దోర మై తా ద్వి చ[తుర్లక్షయోజనం, బులను విస్తార మై [ పొలుపు మిగుల
నందుఁ గుశ స్తంభ [ మనిశంబు దేవతా, కల్పితం బై నట్టి[ కాంతిచేత

---

1 గర్భోత్పత్తు లగుచు. 2 స్వర్గద్వారంబు లైనసూర్యభగవానుల వేదత్రయమ్మున. 3 దాద్విర్లక్షే. 4 అట్టిశాల్మలీవృక్షం బేకాదశశతయోజనోన్నతంబున నందు నాశాల్మలీవృక్షంబు పేర. 5 వేదమయుం డైనసోముని వేదార్థ్యంబులఁ గొలుచు శ్రుతధర... ధర్మ లనునామంబులు గలచాతుర్వర్ణ్యంబు గలిగి యుండు రాద్వీపంబుఁ దిరిగి ద్విచతుర్లక్షయోజనవిస్తారం బై సురాసముద్రం బుండు.

దిక్కులు వెలిఁగించు ద్వీపంబునకుఁ దన, పేరను సత్కీర్తి పెంపు సేయు
తే. నట్టిదీవికి నధిపతి యగుప్రియవ్ర, [1]తతనయుండు హిరణ్యరేతసుఁ డనం ద
నరెడిభూపతి తనసుతనామములను, వర్షములు సేసె నత్యంతహర్షమునను.

వ. ఇట్లు [2]హిరణ్యరేతసుండు వసుదాన దృఢరుచి నాభిగుప్త సత్యవ్రత విప్ర వామదేవు లనునామంబులు గలపుత్త్రులనామంబుల సప్తవర్షంబులం గావించి యా కుమారుల నందు నిలిపి తాను దపంబునకుం జనియె నావర్షంబునందు బభ్రు చతుశ్శృంగ కపిల చిత్రకూట దేవానీ కోర్ధ్వరోమ ద్రవిణంబు లనునామంబులు గల సప్తగిరులును రసకుల్యయు మధుకుల్యయు శ్రుతవిందయు మిత్రవిందయు దేవగర్భయు ఘృతచ్యుతయు మంత్రమాలయు ననుసప్తమహానదులును గల వానదీజలంబులఁ గృతమజ్జను లగుచు భగవంతుం డగుయజ్ఞపురుషునిఁ [3]గుశలకోవిదాభియుక్తు లనుకులంబులు గలవర్షపురుషు లారాధించుచుందురు.

సీ. ఆకుశద్వీపంబు నరికట్టుకొని యుండు, నెనిమిదిలక్షలఘనఘృతాబ్ధి
యాఘృతసాగరం బవ్వల షోడశ, లక్షయోజనముల లలిత మగుచు
నుండుఁ గ్రౌంచద్వీప ముర్వీశ యందు మ, ధ్యప్రదేశంబున నట్టిదీవి
పేరుగాఁ దనపేరఁ బెద్దగాఁ జేసిన, క్రౌంచాద్రి గల దానగంబు మున్ను
ఆ. షణ్ముఖుండు దివ్యశరమున ఘననితం, బంబు దూయ నేయఁ బాలవెల్లిఁ
గరిమఁ దడుపుచుండు వరుణుండు రక్షింప, నందు మిగులభయము నొందకుండె.

వ. నరేంద్రా! యాక్రౌంచద్వీపపతి యగుఘృతపృష్ఠుండు దనకుమారుల నా పేళ్లం గల యామోద మధువహ మేఘపృష్ఠ సుధామ ఋషిజ్య లోహితార్ణ వనస్పతు లను వర్షంబుల కభిషిక్తులం జేసి పరమకల్యాణగుణయుక్తుం డయిన శ్రీహరిచరణారవిందంబుల సేవించుచుం దపంబునకుం జనియె నావర్షంబులయందు శుక్ల వర్ధమాన భోజ నోపబర్హ ణానంద నందన సర్వతోభద్రంబు లనుసప్తసీమాపర్వతంబులును నభయయు నమృతౌఘయు నార్యకయుఁ దీర్ఘవతియుఁ దృప్తిరూపయుఁ బవిత్రవతియు శుక్లయు ననుసప్తనదులును గల వందులఁ బవిత్రోదకంబు లనుభవించుచు గురు ఋషభ ద్రవిణక దేవక సంజ్ఞలు గలిగి వరుణదేవుని నుదకాంజలులం బూజించుచున్నచాతుర్వర్ణ్యంబులు గలిగి యుందురు. 66

సీ. జగతీశ వినుము క్రౌంచద్వీపమును జుట్టి, యుండు షోడశలక్షయోజనముల
విస్తారమై పాలవెల్లి యందునను శా, కద్వీప మతులప్రకాశ మొందు
దండిమై ముప్పదిరెండులక్షలయోజ, నములవిస్తారమై యమరి యుండు
నందులశాకవృక్షామోద మాద్వీప, మును సుగంధంబునఁ బెనఁగఁ జేసి

---

1 ‘తాత్మజుండును బుణ్యుండు నగుహిరణ్యరోముఁ డనువాఁడు పుత్త్రుల నామములను.
2 హిరణ్యరోముండు కుశద్వీపమునందు. 3 సేవించుకుశలకోవిదాభియుక్తకులకసంజ్ఞలు గలచాతుర్వర్ణ్యంబులు గలిగియుందురు’ వ్రా. ప్ర.

తే. [1]యంతఁ దనపేర దీవి ప్రఖ్యాత మగుటఁ, జేసి యందుల మిగులఁ బ్రసిద్ధి కెక్కె
నందు మేధాతిథియుఁ గర్తయగుచునుండెఁ, దవిలి వేడుకఁ దనదునం♦దనులఁ జూచి.

వ. మఱియు నాప్రియవ్రతపుత్రుం డయిన మేధాతిథి దనపుత్రుల పేరం గలపురోజవ మనోజవ వేపమాన ధూమ్రానీక చిత్రరథ బహురూప విశ్వాచారంబు లనుసంజ్ఞలు గలసప్తవర్షంబులయందు వారలకుఁ బట్టంబు గట్టి శ్రీహరిపాదసేవ సేయుచుఁ దపోవనంబునకుం జనియె నాశాకద్వీపంబునందు నీశా నోరుశృంగ బలభద్ర శతకేసరసహస్రస్రోతో దేవపాల మహానసనామంబులు గలసీమాగిరులును నన ఘాయుర్దోభయస్పృష్ట్యపరాజిత పంచపదీ సహస్రస్రుతి నిజధృతు లనుసప్తనదులును గల వానదీజలంబు లుపయోగించి [2]యచ్చటివారలు ప్రాణాయామంబు సేసి విధ్వస్తరజస్తమోగుణు లయి పరమసమాధిని వాయురూపం బైన భగవంతుని సేవింతురు ఋతవ్రత సత్యవ్రత దానవ్రత సువ్రత నామంబులు గల చాతుర్వర్ణ్యం బందుఁ గలిగి యుండు. 68

సీ. అట్టిశాకద్వీప ♦ మరికట్టి తత్ప్రమాణంబున దధిసము♦ద్రంబు వెలుఁగు
నందుకుఁ బరివృతం ♦ బగు పుష్కరద్వీప, మిలఁ జెలువొప్పెల♦క్షలవిశాల
[3]మమ్మహాద్వీపమం ♦ దయుతకాంచనపత్త్రి, ములు గల్గి కమలగ♦ర్భునకు నాస
నం బగుపంకేరు♦హం బుండు నాద్వీప, మధ్యంబునను నొక్క♦మానసోత్త

ఆ. రం బనంగఁ బర్వ♦తం బుండుఁ దనకుఁ బూ, ర్వాపరముల నుండు♦నట్టివర్ష
మునకు రెంటి కట్లు ♦ నిలిచినమర్యాద, నగ మనంగఁ జాలఁ♦బొగడ నెగడు. 69

వ. ఇట్లు దనకు లోపలి వెలుపలి వర్షంబులు రెంటికి మర్యాదాచలంబునుం బోలె నున్న మానసోత్తరపర్వతం బయుత యోజనవిస్తారంబును నంతియ యున్నత్యంబును గలిగియుండు నానగంబునకు నలుదిక్కులయందు నాలుగులోకపాలుర పురంబు లుండు నామానసోత్తరపర్వతంబుతుద సూర్యరథచక్రంబు సంవత్సరాత్మకం బయి యహోరాత్రంబులయందు మేరుప్రదక్షిణంబు సేయు నందు నాపుష్కరద్వీపాధిపతి యగువీతిహోత్రుండు రమణక ధాతక నామంబులు గలపుత్రుల నిరువుర వర్షద్వయంబునం దభిషిక్తులం జేసి తాను బూర్వజు లేఁగిన తెఱంగున భగవత్కార్యశీలుం డగుచుఁ దపంబునకుం జనియె నంత. 70

క. మనుజేశ్వర యావర్షం, బున నప్పుడు సంచరించు♦పురుషులు పద్మా
సనునిఁ దగఁ గర్మకారా, ధన సేయుదు రచలబుద్ధి♦తాత్పర్యమునన్. 71

క. ధరణీవల్లభ విను పు, [4]ష్కర మనుద్వీపమున లేరు ♦ చాతుర్వర్ణ్యాల్

---

[1] 'యూరయ సొంపొందియుండుఁ బ్రఖ్యాత. [2] వాయురూపుఁ డైనభగవంతుని సేవించుచుం బ్రాణాయామంబునం జేసి విధ్వస్తరజస్తమోగుణంబులం గలిగి ఋగ్వ్రత... చాతుర్వర్ణ్యలు గలిగియుందురు. [3] మమ్మహోదధియందు. [4] ష్కరదీవిం దలఁప లేరు ♦ చాతు' వ్రా. ప్ర.

పరఁగఁగ [1]భేదము లేకే, సరసత సము లగుదు రందు సకలజనములున్. 72

వ. మఱియుఁ [2]బుష్కరద్వీపంబు చతుష్షష్టిలక్షయోజనవిస్తారం బై శుద్ధోదకసముద్రముద్రితం బగుచుండు నవ్వల లోకాలోకపర్వతం బుండు శుద్ధోదకసముద్రలోకాలోకపర్వతంబులనడుమ రెండుకోట్లయోజనవిస్తారం బయిననిర్జనభూమి దర్పణోదరసమానం బై (దేవతావాసయోగ్యంబుగా) నుండు (నాభూమిం జేరిన పదార్థంబు మరలఁ బొంద నశక్యంబుగా నుండు) నటమీఁద లోకాలోకపర్వతం బెనిమిదికోట్లయోజనంబులు సువర్ణభూమియు [3]సూర్యాదిధ్రువాంతంబు లగు జ్యోతిర్గణంబులమధ్యంబున నుండుటం జేసి లోకాలోకపర్వతం బనం దగి యుండుఁ బంచాశత్కోటి (యోజనవిస్తృతం బగు) భూమండల (మాన)ంబునకుఁ [4]దురీయాంశప్రమాణంబు గలయాలోకాలోకపర్వతంబుమీఁద నఖిలజగద్గురు వగు బ్రహ్మచేతఁ జతుర్దిశలయందే ఋషభపుష్కరచూడవామనాపరాజితసంజ్ఞలు గలదిగ్గజంబులు నాలుగును లోకరక్షణార్థంబు నిర్మితం బై యుండు మఱియును.

సీ. తనదువిభూతు లై తనరినయాదేవ, బృందతేజశ్శౌర్యబృంహణార్థ
మై భగవంతుండు నాదిదేవుండును, నైనజగద్గురుం డచ్యుతుండు
నరి లేనిధర్మవిజ్ఞానవైరాగ్యాను, లయినవిభూతుల నలరి యున్న
యట్టివిష్వక్సేనుఁ డాది గాఁ గలుగుపా, ర్షదులతోఁ గూడి ప్రశస్తమైన

తే. నిజవరాయుధదోర్దండనిత్యసత్త్వుఁ, డగుచు నాపర్వతంబుపై నఖిలలోక
రక్షణార్థంబుకల్పపర్యంత మైన, యోగమాయావిరచితుఁడై యొప్పుచుండు. 74

వ. ఇట్లు వివిధమంత్రగోపనార్థం బానగాగ్రంబున నున్నభగవంతుండు దక్క లోకాలోకపర్వతంబునకు నవ్వల నొరులకు సంచరింప నశక్యం బయి యుండు బ్రహ్మాండంబునకు సూర్యుండు మధ్యగతుం డై యుండు నాసూర్యునకు నుభయపక్షంబులయందు నిరువదేనుకోట్లయోజనపరిమాణంబున నండకటాహం బుండు నట్టిసూర్యునిచేత నాకాశదిక్స్వర్గాపవర్గంబులును నరకంబులును నిర్ణయింపంబడు దేవతిర్యఙ్మనుష్యనాగపక్షితృణగుల్మలతాదిసర్వజీవులకును సూర్యుండాత్మ యగుచు నుండు. 75

క. కర మనురాగంబుల నీ, ధరణీమండలముసంవిధానం బెల్ల
[5]న్నెఱిఁగించితి నింతియ కా, [6]దెఱిఁగించెద సర్గమాన మెల్ల నరేంద్రా. 76

---

1 'నెక్కువతక్కువ, లెఱుఁగరు సము లగుచు నుందు♦రెల్ల జనంబుల్. 2 మఱియు వందలి జనంబులు సంకల్పసిద్ధులు నయుతాయుష్కులు నిత్యసత్యులగుచు దేవతలతోడ సంభావణంబులు సేయుచుండు రట్టిపుష్కరద్వీపంబు. 3 గలిగియుండు సూర్యాదిగ్రహతేజోంధతమోమధ్యంబున నుండుటం జేసి లోకాలోక. 4 చతుర్థభాగం బై యుండు నాపర్వతంబుమీఁద నఖిలజగద్గురు వగుబ్రహ్మచేత నిర్మితం బై ఋషభపుష్కర...లోకరక్షణార్థం బుండు మఱియును. 5 నరవర యెఱుఁగం జెప్పితి, మఱి వినిచెద వినుము దివ్య♦మానం బెల్లన్. 6 నెఱుఁగుము సర్గప్రమాణ మెల్ల.' వ్రా. ప్ర.

భగణవిషయము.

ఆ. కమలజాండమధ్యగతుఁడై నసూర్యుండు, భరిత మైనయాతపంబుచేత
మూఁడులోకములను ముంచి తపింపంగఁ, జేసి కాంతి నొందఁ జేయుచుండు. 75

వ. అట్టిభాస్కరుం డుత్తరాయణ దక్షిణాయన విషువు లనునామంబులు గల మాంద్యతీవ్రసమానగతుల నారోహణావరోహణస్థానంబులయందు దీర్ఘహ్రస్వసమానంబులు గాఁ జేయు చుండు. 76

ఆ. మేషతులలయందుమిహిరుం డహోరాత్ర,మందుఁ దిరుగు సమవిహారములను
బరఁగఁగవృషభాదిపంచ[1]మాసముల నొ,క్కొక్కగడియ రాత్రిదక్కనడచు.

ఆ. మించి వృశ్చికాదిపంచ[2]మాసముల నొ,క్కొక్కగడియ రాత్రి నిక్క నడచు
దివములందు నెల్ల దిగజాఱునొక్కొ,క్కగడియ నెలకుఁదప్పకారమునను. 78

వ. మఱియు నివ్విధంబున దివసంబు లుత్తరాయణదక్షిణాయనంబుల వృద్ధిక్షయంబుల నొంద నొక్కయహోరాత్రంబున [3]నేకపంచాశదుత్తర నవకోటియోజనంబులపరిమాణంబు గలమానసోత్తరపర్వతంబున సూర్యరథంబు దిరుగు చుండు నామానసోత్తరపర్వతంబునందుఁ దూర్పున దేవధాని యనునింద్రపురంబును దక్షిణంబున సంయమని యనుయమనగరంబును బశ్చిమంబున నిమ్లోచని యను వరుణపట్టణంబును నుత్తరంబున విభావరి యనుసోమునిపుటభేదనంబును దేజరిల్లుచుండు నాపట్టణంబులయందు నుదయమధ్యాహ్నాస్తమయనిశీథంబు లనియెడు కాలభేదంబులను భూతప్రవృత్తినివృత్తినిమిత్తం బచ్చట జనులకుఁ బుట్టించు చుండు సూర్యుం డెప్పు డింద్రనగరంబుననుండి గమనించు నది యాదిగాఁ బది యే నుగడియలను రెండుకోట్లముప్పదియేడులక్షలడెబ్బదియైదు వేలయోజనంబులు నడచు నివ్విధంబున నింద్రయమవరుణపురంబులమీఁదఁ జంద్రాదిగ్రహనక్షత్రంబులం గూడి సంచరించుచుఁ బండ్రెండంచులు నాఱు[4]గమ్ములును మూఁడు [5]దొలులుం గలిగి సంవత్సరాత్మకం బయి నేకచక్రం బయినసూర్యునిరథంబు ముహూర్తమాత్రంబున ముప్పదినాలుగులక్షలు నెనమన్నూఱుయోజనంబులు సంచరించు. 79

సీ. ఇనురథంబున కున్నయిరుసు సొక్కటియు మేరు, శిఖరంబునందును జేరియుండు
నొనరఁ జక్రము మానసోత్తరపర్వతం,బందులఁ దిరిగెడునారథంబు
[6]నిరుసున నున్నరెం డిరుసులు దగులంగఁ, బవనపాశంబుల బద్ధ మగుచు
ధ్రువమండలంబునందిరుసుల నంటి యుండఁగా, సంచరించుచు నుండు సంతతంబు

తే. నట్టియరదంబు ముప్పదిమూఁడులక్షు, లందు నంటినకాఁడియు నన్నియోజ
నములవిస్తారమైతురంగములకంధ,రములఁ[7]దగులుచు వెలుఁగొందురమణతోడ.

1 రాసులకు. 2 రాసులకు. 3 తొంబదికోట్లయెనుబదియొక్కలక్షలయోజనంబుల. 4 నెమ్ములును. 5 నాభులుం. 6 'నిరుసునందున నున్నయిరుసులు. 7 దగిలుండు మిగులంగ రమణ' వ్రా. ప్ర.

వ. ఆరథంబునకు గాయత్రీచ్ఛందం బాదిగా సప్తచ్ఛందంబులు నశ్వంబులై సంచరించు భాస్కరునకు నగ్రభాగంబున నరుణుండు నియుక్తుండై రథంబు గడపుచుండు వెండియు నంగుష్ఠపర్వమాత్రశరీరంబులు గలయఱువదివేలవాలఖిల్యాఖ్యు లగుఋషివరులు సూర్యునిముందట సౌరసూక్తంబుల స్తుతియింప మఱియు ననేక మునులును గంధర్వకిన్నరకింపురుషనాగాప్సరఃపతంగాదులును నెలనెల వరుసక్రమంబున సేవింపం దొమ్మిదికోట్లునేఁబదియొకలక్షయోజనంబులపరిమాణంబు గల భూమండలంబునం (దొకక్షణంబున సూర్యుండు రెండువేలయేఁబదియోజనంబులు సంచరించుచు) నొకయహోరాత్రంబునందె యీభూమండలం బంతయు సంచరించు ననిన శుకయోగీంద్రునకుఁ బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. 81

క. మునివర మేరుధ్రువులకు, నొనరఁ బ్రదక్షిణము దిరుగుచుండెడు[1]నజుఁ డా
యినుఁ డభిముఖుఁడై రాసుల, కనుకూలత నేఁగు నంటి వది యెట్లొప్పున్.

క. అని పలికినభూవరునిం, గనుఁగొని శుకయోగి మిగులఁ గరుణాన్వితుఁడై
మనమున శ్రీహరిఁ దలఁచుచు, విను మని క్రమ్మఱఁగ నిట్లు వినిపించెఁ దగన్.

వ. నరేంద్రా [2]యతివేగంబునఁ దిరుగుచుండుకులాలచక్రంబునందుఁ జక్రభ్రమణంబునకు వేఱైనగతి నొంది బంతి సాగి తిరిగెడుపిపీలికాదులచందమున నక్షత్రరాసులతోడం గూడినకాలచక్రంబు ధ్రువమేరువులం బ్రదక్షిణంబు దిరుగునపు డాకాలచక్రంబువెంట సంచరించుసూర్యాదిగ్రహంబులకు నక్షత్రాంతరంబులయందును రాశ్యంతరంబులయందును నునికి [3]గలుగుటం జేసి సూర్యాదిగ్రహంబులకుఁ జక్రగతిస్వగతులవలన గతిద్వయంబు గలుగుచుండు మఱియు నాసూర్యుం డాదినారాయణమూర్తి యగుచు లోకంబులయోగక్షేమంబులకు వేదత్రయాత్మకం బై కర్మసిద్ధినిమిత్తం బై [4]దేవర్షిగణంబులచేత వేదాంతార్థంబుల ననవరతంబు వితర్క్యమాణం బగుచున్నతనస్వరూపంబును ద్వాదశవిధంబులుగ విభజించి వసంతాదిఋతువుల [5]నాయాకాలవిశేషంబులయందుఁ గలుగఁజేయుచుండు (నట్టిపరమపురుషునిమహిమ నీలోకంబున మహాత్ము లగుపురుషులు దమతమవర్ణాశ్రమాచారములచొప్పున వేదోక్తప్రకారంబుగా భక్త్యతిశయంబున నారాధించుచు క్షేమంబునొందుచుందు రట్టియాదినారాయణమూర్తి జ్యోతిశ్చక్రాంతర్వర్తియై స్వకీయతేజఃపుంజదీపితాఖిలజ్యోతిర్గణంబులు గలవాఁడై ద్వా

---

1 నాసూర్యునకును రాసుల కెదుర, య్యనుచందమునఁ దేటపడఁగ ♦ నెఱిఁగింపు తగన్.
2 కులాలచక్రంబుతోడఁ దిరుగుపిపీలికాదులకు భ్రమణవేగంబున స్థానాంతరంబునం దునికి దోఁపనిచందంబున నక్షత్రరాసులతోడం గూడిన. 3 దోఁచుం గాని రాసికి నెదురునడచుట లే దట్టిసూర్యుం డాదినారాయణు. 4 న తనస్వరూపంబు దేవర్షిగణంబులచేత ధ్యానంబు సేయుంబడ్డ దగుచుండుఁ దనస్వరూపంబును ద్వాదశవిధంబులఁ బుట్టించు వసం. 5 నాకాశగతుండై ద్వాదశమాసంబుల ద్వాదశరాసుల ననుభవించుచుండు.

దశరాసులయందు నొకసంవత్సరంబున సంచరించుచుండు నట్టియాదిపురుషుని గమనవిశేషకాలంబును లోకు లయనఋతుమాసపక్షతిథ్యాదులచే వ్యవహరించుచుందురు మఱియు నప్పరమపురుషుం డారాసులయందు షష్ఠాంశసంచారంబు నొందినసమయంబును ఋతు వని వ్యవహరింపుదు రారాసులయందు నర్ధాంశ సంచారమ్మున రాశిషట్కభోగం బొందినతఱి యయనం బని చెప్పుదురు సమగ్రంబుగా రాసులయందు సంచార మొందినయెడల నట్టికాలంబును సంవత్సరం బని నిర్ణయింపుదు రిట్టిసమగ్రరాశిసంచారంబునందు శీఘ్రగతి మందగతి సమగతు లనియెడుత్రివిధగతివిశేషంబులవలన వేఱుపడెడునావత్సరంబును సంవత్సరంబు పరివత్సరం బిడావత్సరం బనువత్సరం బిద్వత్సరం బని పంచవిధంబులఁ జెప్పుదురు) చంద్రుండు నీకెఱుంగున నాసూర్యమండలంబుమీఁద లక్షయోజనంబులనుండి సంవత్సరపక్షరాశినక్షత్ర[1]భుక్తులు గ్రహించుచు నగ్రచారియై శీఘ్రగతిం జరించుచునంత వృద్ధిక్షయరూపంబునం బితృగణంబులకుఁ బూర్వపక్షాపర పక్షంబులచేత నహోరాత్రంబులఁ గలుగఁజేయుచు సకలజీవప్రాణం బై యొక్క నక్షత్రంబు త్రింశన్ముహూర్తంబు లనుభవించుచు షోడశకళలు గలిగి మనోమయాన్నమయామృతమయదేహుం డై దేవపితృమనుష్యభూతపశుపక్షిసరీసృపవీరుత్ప్రభృతులకుఁ బ్రాణాప్యాయనశీలుం డగుటంజేసి సర్వమయుం డనం బడు.

క. చంద్రునకు మీఁదై మూఁడులక్షయోజనంబులఁ దారల్
గ్రందుకొని మేరుశైలం, బంది ప్రదక్షిణము దిరుగు [2]నభిజిద్యుతోన్. 85

సీ. అటమీఁదఁ దారల కన్నిటి కుపరియై, రెండులక్షల శుక్రుఁ డుండి భాస్క
రునిముందఱంబిఱుఁదనునొమ్మునుమ్మందుశీఘ్ర,సంచారములనుభాస్కరునిమాడ్కి
జరియించుచుండును జనులకు ననుకూలుఁ, డై వృష్టి నొసఁగుచు నంతనంతఁ
జతురత వృష్టివిష్కంభక గ్రహశాంతి, నొనరించువారల కొసఁగు శుభము
తే. లుండు నామీఁద బుధుఁడు దారరెండులక్ష,లనుజరించుచురవిమండలంబుఁబాసి
కానఁబడినను జనులకుఁ[3]గామ్మసాంబ,రాదిభయములఁ బుట్టించు ననతులమహిమ.

సీ. ధరణీతనూజుఁ డంతటమీఁద రెండుల,క్షలనుండి మూఁడుపక్షముల నొక్క
రాశి దాఁటుచునుండుఁగ్రమమున ద్వాదశ,రాసులు భుజియించు రాజసమున
వక్రించి యైన నవక్రత నైనను, దఱుచుగాఁ బీడలు నరుల కొసఁగు
నంగారకునకును నటమీఁద రెండుల,క్షలయోజనంబుల ఘనత మించి
తే. యొక్కరాశినుండియొక్కొక్కవత్సరం, బనుభవించుచుండు నమరగురుఁడు
వక్రమందునైన వసుధామరులకును, శుభము నొసఁగు నెపుడు నభినవముగ.

---

2 ఋతువులు పుచ్చుకొనుచు న[?]... బితృదేవగణంబులకు భుక్తి నిచ్చుచు సకలజీవప్రాణుం డై ...... పశుపక్షిసస్యవనలతాగుల్మాదులకు. 2 నభిజిత్సహితమ్. 3 స్కంధగ్రహోపళాం. తొనరించుచును జను లశనుఁ డనఁగ.

ఆ. సురగురునకు మీఁదై భాస్కరసుతుఁ [1]డిరులక్షలను జగములకుఁ బీడల్
జరపుచుఁ ద్రింశన్మాసము, లరుదుగ నొక్కొక్కరాశియందు వసించున్. 88

క. ప్రాకటముగ రవిసుతునకు, నేకాదశలక్షలను మహీసురులకు నీ
లోకులకు మేలు గోరుచుఁ, జోకగ మునిసప్తకంబు సొంపు వహించున్. 89

క. మునిసప్తకమున [2]కెగువం, దనరుచు నామీఁదఁ ద్రియుతదశలక్షలఁ బెం
పున శింశుమారచక్రం, బనఁగా నిన్నిటికి నుపరి యగుచుండు నృపా. 90

సీ. [3]ఆశింశుమారాఖ్యమగుచక్రమున భాగవతుఁడైనధ్రువుఁ డింద్రవరుణకశ్య
పప్రజాపతియమప్రముఖులతోఁ గూడి, బహుమానముగ విష్ణుపదముఁ జేరి
కణఁకనిచ్చలుఁ బ్రదక్షిణముగాఁ దిరుగుచుఁ, జెలఁగియుండును గల్పజీవియగుచు
ననఘుఁ డుత్తానపాదాత్మజుఁ డార్యుఁడు, నయినయాధ్రువునిమహత్త్వ మెల్లఁ

తే. దెలిసి వర్ణింప బ్రహ్మకు నలవి గాదు, నే నెఱింగినయంతయు నీకు మున్న
తెలియఁబలికితిఁ గ్రమ్మఱఁ దలఁచికొనుము, జితరిపువ్రాత శ్రీపరీక్షిన్నరేంద్ర.

వ. మఱియు నాధ్రువుండు కాలంబుచేత నిమిషమాత్రం బెడ లేక సంచరించుచు జ్యోతిర్గ్రహనక్షత్రంబులకు నీశ్వరునిచేత (ధాన్యాక్రమణంబునఁ బశువులకై యేర్పఱిచినమేధిస్తంభంబుతెఱంగున) మేటి గాఁ గల్పింపంబడి ప్రకాశించుచుండు గగనంబునందు మేఘంబులును శ్యేనాదిపక్షులును వాయువశంబునం గర్మసారథులై చరించుతెఱంగున జ్యోతిర్గణంబులును బ్రకృతిపురుషయోగగృహీతాశులై కర్మనిమిత్తగతి గలిగి వసుంధరం బడ కుండురు. 92

క. పొందుగ జ్యోతిర్గణముల, నందఱ నాశింశుమారమండల నుండం
గొందఱు దఱచుగఁ జెప్పుచు, నుందురు నెఱుఁగంగ విను మహోన్నతచరితా.

క. తలక్రిందై వక్రవమై, సలలిత మగుశింశుమారచక్రమునందున్
నెలకొని పుచ్ఛాగ్రంబున, నిలిచి ధ్రువుం డుండు నెపుడు నిర్మలచరితా. 94

వ. మఱియు నాశింశుమారచక్రపుచ్ఛంబునఁ బ్రజాపతియు నగ్నీంద్రధర్ములును బుచ్ఛమూలంబున ధాతృవిధాతలును గటిప్రదేశంబున ఋషిసప్తకంబును దక్షిణావర్తకుండలీభూతభూతశరీరంబునకు నుదగయననక్షత్రంబులు దక్షిణపార్శ్వంబున దక్షిణాయననక్షత్రంబులును బృష్ఠంబున దేవమార్గంబును నాకాశగంగయు నుత్తరభాగంబునఁ బునర్వసుపుష్యంబులును దక్షిణభాగంబున నార్ద్రాశ్లేషలును దక్షిణవామపాదంబుల నభిజిదుత్తరాషాఢలును దక్షిణవామనాసారంధ్రంబుల శ్రవణపూర్వాషాఢలును దక్షిణవామలోచనంబుల ధనిష్ఠామూలలును దక్షిణవామకర్ణంబుల మఘాద్యష్టనక్షత్రంబులును వామపార్శ్వంబునదక్షిణాయనంబును దక్షిణపార్శ్వంబునఁ గృత్తికాదినక్షత్రత్రయంబును నుత్తరాయణంబు

---

1 డిరులక్ష నుండి జగతికిఁ బీడల్. 2 కెప్పుడుఁ, దనరుచు శ్రీవిష్ణుపదము దశలక్షల. 3 ఆ. శింశుమారాఖ్యమండలంబై శ్రీభాగ.

ను వామదక్షిణస్కంధంబుల శతభిషగ్జ్యేష్ఠలును నుత్తరహనువున నగస్త్యుండును
నపరహనువున యముండును (ముఖంబున నంగారకుండును గుహ్యంబున శనై
శ్చరుండును మేఢ్రంబున బృహస్పతియును వక్షంబున నాదిత్యుండును నాభిని
శుక్రుండును మనంబునఁ జంద్రుండును స్తనంబుల నాశ్వినులును బ్రాణాపానం
బుల బుధుండును) గళంబున రాహువును సర్వాంగంబులఁ గేతుగ్రహంబును
రోమంబులఁ దారలును నుండు [1]నది సర్వదేవతామయం బైనపుండరీకాక్షుని
దివ్యదేహంబు ధ్రువునిం గా నెఱుంగుము. 95

సీ. ఇట్టిదివ్యశరీర మెవ్వఁడు ప్రతిదినం, బందు సంధ్యాకాల [2]మతులభక్తి
మనమందు నిలిపి యేమఱక మిక్కిలి ప్రయ, త్నంబున నియతుఁడై తత్త్వబుద్ధి
మౌనవ్రతంబునఁ బూని వీక్షించుచు, నీసంస్తవంబు దా నెంతొ ప్రేమ
జపియించి కడుఁ బ్రశస్తమును [3]మునీంద్రసే, వ్యమును జ్యోతిస్స్వరూపమున వెలుఁగు
ఆ. విపులశింశుమారవిగ్రహంబునకు వం, దనము వందనంబు లనుచు నిలిచి
సన్నుతించె నేని సకలార్థసిద్ధులఁ, బొందు మీఁద ముక్తిఁ జెందు నధిప. 96

క. ఇనమండలంబునకుఁ గ్రిం, దను దశసాహస్రయోజనంబుల స్వర్భా
నునిమండలంబు గ్రహమై, ఘనముగ నపసవ్యమార్గగతి నుండు నృపా. 97

క. అసురాధముఁ డగురాహువు, బిసరుహసంభవునివరము పెంపున నెంతో
పస యగునమరత్వంబున, నసమానం బైనగ్రహవిహారముఁ బొందెన్. 98

సీ. జననాథ రాహువుజన్మకర్మంబులు, వినిపింతు ముందఱ విస్తరించి
యయుతయోజనవిస్తృతార్కమండలము ద్వి, షట్సహస్రవిశాలచంద్రమండ
లముఁ బర్వకాలంబులను ద్రయోదశసహ, స్రవిశాలమై [4]మీఁద రాహుగప్పు
నది సూచి యుపరాగమనుచును బలుకుదు, రెల్లవారును స్వధర్మేచ్ఛులగుచు
ఆ. నంతలోన నినశశాంకమండలములఁ, గనఁ గ్రోవఁ దలఁచి హరి సుదర్శ
నంబుఁ బుచ్చ ననుభయంబున నైదాఱు, గడియలకును రాహు [5]నడిఁకితొలఁగు.

క. నరవర యారాహువునకు, సరసత నాక్రింద సిద్ధచారణవిద్యా
ధరు లయుతయోజనంబులఁ, దిరముగ వసియించి లీల [6]దిరుగుదు రచటన్.

క. పరికింప సిద్ధవిద్యా, ధరులకుఁ బదివేలు క్రిందఁ దరలక యక్షుల్
మఱియును భూతప్రేతులుఁ, జరియింతురు రాక్షసులు పిశాచులు గొలువన్.

ఆ. వారిక్రిందఁ దగిలి వాయువశంబున, మలయుచుండు మేఘమండలంబు
మేఘమండలంబు మీఁ దగుచుండు భూ, మండలంబు క్రింద నుండు నధిప.

వ. అట్టిభూమండలంబుక్రింద [7]యోజనాయుతాంతరంబున నండకటాహయామం

1 నిది....ధ్రువంబు గా నెఱుంగుము. 2 బుతులభుక్తి. 3 జ్యోతిస్స్వరూపంబును నై ప్రశస్తమైన, విపుల....విగ్రహంబునకును, నధిక వందనంబు లాచరించి, సన్నుతించెనేని. 4 రాహు గప్పు, నది....మనుచుఁ బల్కుదు రెల్లవారును సద్ధర్మవర్తులగుచు. 5 విడిచి తలఁగు. 6 ...రుగుచునుందుర్. 7 లక్షయోజనంబులవిస్తారంబు గలిగి క్రమంబున.

గలిగి క్రమంబున నొండొంటికిం గ్రిందగుచు నతల వితల సుతల రసాతల తలాతల మహాతల పాతాళలోకంబు లుండు నట్టిబిలస్వర్గంబులయందు నుపరిస్వర్గంబున కధికం బైనకామోపభోగంబుల నైశ్వర్యానందంబులను సుసమృద్ధ వనోద్యాన క్రీడావిహారస్థానంబుల (ననుభవించుచు) దైత్యదానవకాద్రవేయాదిదేవయోనులు నిత్యప్రముదితానురక్తులగుచుఁ గళత్రాపత్యసుహృ[1]ద్బంధు దాసీదాసపరిజనులతోఁ జేరుకొని మణిగణఖచితంబు లగునతిరమణీయగృహంబులయందు నీశ్వరునివలనం జేటు లేనికాయంబులు గలిగి వివిధమాయావిశేష వినిర్మితనూతనకేళీసదనవిహరణమండపవిచిత్రోద్యానాదులయందుఁ గేళీవినోదంబులు సలుపుచుఁ జరియింతు రంత. 103

సీ. అట్టిపాతాళంబు లందును మయకల్పి, తము లగుపుటభేదనములయందు
బహురత్ననిర్మితప్రాకారభవనగో, పురసభాచైత్యచత్వరవిశేష
ములయందు [2]నాసురాదులమిథునములచే, శుకపికశారికానికరసంకు
లముల శోభిల్లుకృత్రిమభూములను గల, గృహములచే నలంకృతము లగుచుఁ

ఆ. గుసుమచయసుగంధికిసలయస్తబకసం, తతులచేత [3]ఫలవితతులచేత
నతులరుచిరనవలతాంగనాలింగిత, విటపములను గలుగువిభవములను. 104

వ. మఱియు మానసేంద్రియంబుల కానందకరంబు లైననానావిధజలవిహంగమమిథునంబులు గలిగి నిర్మలజలపూరితంబు లై మత్స్యకులసంచారక్షుభితంబు లైన కుముదకువలయకహ్లారలోహితశతపత్త్రాదికంబులఁ (దేజరిల్లెడుసరోవరంబులు గలయుద్యానవనంబులయందుఁ) గృతనికేతను లై [4]స్వర్గభూముల నతిశయించినవివిధవిహారంబులు గలిగి యహోరాత్రాదికాలవిభాగభయంబులు లేక మహాహిప్రవరు లయినశేషాదులశిరోమణిగోచులచే [5]నంధకారోపద్రవంబు లేక యెల్లప్పుడు దివసాయమానంబుగా నుండు నాలోకంబునందు నఖిలజనులు దివ్యౌషధిరసరసాయనంబుల ననవరతంబు నన్నపానంబులుగా సేవించుటం జేసి యచ్చటివారలకు నాధివ్యాధులును వలితపలితంబులును జరారోగంబులును శరీరవైవర్ణ్యంబులును స్వేదదౌర్గంధ్యంబులును గలుగక పరమకల్యాణమూర్తు లగుచు హరిచక్రభయంబుదక్క నన్యం బగుమృత్యుభయంబు నొందక యుందు రదియునుం గాక. 105

1 దనుచరులం గలిగి గృహపతు లై....గలిగి మాయావినోదు లగుచుఁ జరియిం. 2 నాగాసురలమిథునములచే. 3 నవనతంబు లైన, పాదపముల నొప్పు బహువనావళులచేఁ, బుణ్యనదులచేతఁ బొంపు మిగిలి. 4 యనేకవిహారంబులు గలిగి నిర్మలజలపూరితంబు లగుచు మధుకరనికరవివిధస్వనంరమణీయంబు లయినస్వర్గభూముల నతిశయించి యహోరాత్రాది. 5 సర్వతోధికం బైనతమంబు పంబడుచుండు నందుల పురుషులకు దివ్యౌషధంబులు రసాయనంబులుగా నాధివ్యాధులు.... మూర్తు లగుచుందురు పాతాళపురవాసులకు హరిచక్రభయంబు దక్క నేవింట నన్యభ్రమంబు

తే. అట్టిపాతాళలోకంబునందు విష్ణు, చక్ర మెప్పు డేనియుఁ బ్రవేశంబు నొందు
నప్పు డెల్లను దైత్యకులాంగనలకు, గర్భసంపద లందంద కరఁగు చుండు. 106

చ. అతలమునందు నమ్మయునియాత్మజుఁ డైనబలాసురుండు స
మ్మతిఁ జరియించు షణ్ణవతిమాయలఁ గూడి వినోద మందుచుం
గుతలములందు నేఁడు నొకకొందఱు నచ్చటిమాయఁ జెంది సం
తతముఁ జరించు చుండుదురు దప్పక మోహనిబద్ధచిత్తులై. 107

వ. అట్టిబలుని యావలింతలను స్వైరిణులు కామినులు పుంశ్చలు లనుస్త్రీగణంబులు జనియించి రాకామినీజనంబులు పాతాళంబుఁ బ్రవేశించిన[1]పురుషునికి హాటకరసం బనియెడుసిద్ధరసఘుటిక నిచ్చి రససిద్ధునిం గావించి యతనియందు స్వవిలాసావలోకనానురాగస్మితసల్లాపోపగూహనాదుల నిచ్ఛావిహారంబులు సలుపుచుండ [2]నాపురుషుండు మదాంధుం డై తానె సిద్ధుండ ననియును నాగాయుతబలుండ ననియును దలంచి నానావిధరతిక్రీడలఁ బరమానందంబు నొందుచుండు. 108

సీ. హాటకేశ్వరుఁ డైనయంబికాధీశుండు, వితలంబునందుల వేడ్క నిలిచి
తనపార్షదభూతతతులతో [3]బ్రహ్మసర్గోపబృంహణమున నొక్కచోటఁ
బార్వతీసంభోగపరుఁ డగు చుండఁగా, వారలవీర్యంబువలనఁ బుట్టి
[4]నట్టిది హాటకి యనియెడినది యనిలాగ్నులు భక్షించి యందు నుమియ
తే. నదియు హాటక మనుపేర నతిశయిల్లి, వన్నె మీఱుచు శుద్ధసువర్ణ మయ్యె
నాసువర్ణంబు నాలోకమందు నున్న, జనుల కెల్లను వినుతభూషణము లయ్యె.

సీ. ఆక్రింద సుతలంబు నందు మహాపుణ్యుఁ, డగువిరోచనపుత్త్రుఁ డైనయట్టి
బలిచక్రవర్తి యాపాకశాసనునకు, ముద మొసంగఁగఁ గోరి యదితిగర్భ
మున వామనాకృతిఁ బుట్టి యంతటఁ ద్రివి, క్రమరూపమునను లోకత్రయంబు
నాక్రమించినదానవారాతిచేత ముం, దటన యీఁబడినయింద్రత్వ మిట్లు
ఆ. గలుగువాఁడు పుణ్యకర్తసంధానుండు, [5]హరిపదాంబుజార్చనాభిలాషుఁ
డగుచు శ్రీరమేశు నారాధనము సేయు, చుండు నెపుడు నతిమహోత్సవమున.

వ. నరేంద్రా సకలభూతాంతర్యామియుఁ దీర్ఘభూతుండును నయినవాసుదేవునియందుఁ జిత్తంబు గలిగి యిచ్చినభూదానంబునకు సాక్షాత్కరించిన మోక్షంబు ఫలం బగుం గాని పాతాళస్వర్గరాజ్యంబులు ఫలంబులు గా నేర వయిన నెవ్వారికిని మోక్షంబు సాక్షాత్కృతంబు గా కుండుటం జేసి లోకప్రదర్శనార్థంబు పా

1 పురుషులందు స్వవిలాసావలోకన. 2 నాపురుషులు తామే యీశ్వరు లనియు సిద్ధు లనియు నాగాయుతబలు లనియుఁ దలంచి గర్వించి మదాంధులై యుందురు. 3 భూతసర్గోపబృంహణముకై 4 హాటకి యనియెడు[illegible]నది యనిలాగ్నులు, భక్షించి యెంతయుఁ [illegible] బాఱనుమియ. 5 హరిపదార[illegible]లాషుఁడగుచు, శ్రీరమేశుఁ బూజ[illegible]సేయుచు నుండును, నొనర నెపుడు.

తాళస్వర్గరాజ్యంబుల నిచ్చె క్షుతపతనప్రస్ఖలనాదులందును వివశుం డైనయెడల
హరినామస్మరణంబు సేయుపురుషుండు గర్భబంధంబువలన విముక్తుం డగుచు
సుజ్ఞానంబునం బొందు నట్టివాసుదేవుం డాత్మజ్ఞానప్రమోహణంబు సేయు మా
యామయంబు లైనభోగైశ్వర్యంబుల నెల్ల నెట్లొసంగు నన వలవదు భగవం
తుండు యాచనసేసి సకలసంపదలఁ జేకొని శరీరమాత్రావశిష్టునిం జేసి వారుణ-
పాశంబులం గట్టి విడిచినప్పుడు బలీంద్రుం డి ట్లనియె. 111

సీ. పరమేశ్వరునకు నెǂప్పటిపదార్థములందుఁ, దృష్ణ లేకుండుట ǂ దెలిసినాఁడ
నింద్రాదు లెల్ల నుǂపేంద్రునిఁ బ్రార్థించి, యడిగిరి గాని శ్రీǂహరికిఁ గోరి
కలు లేవు మిక్కిలిǂగంభీర మగుమహా, కాలస్వభావంబు ǂ గలుగు చుండు
నరయంగ మన్వంతǂరాధిపత్యమును లో, కత్రయంబును నెంత ǂ గాన తలఁప
ఆ. మత్పితామహుండు ǂ మానవంతుండు ప్ర,హ్లాదవిభునిఁ జూచి ǂ హర్ష మంది
యెద్ది యైనఁ గోరు ǂ మిచ్చెద ననుటకు, నంతలోన నీశ్వǂరాజ్ఞఁ దెలిసి. 112

వ. ఇట్లు [1]కృతార్థుం డై పిత్ర్యం బయినరాజ్యంబు నొల్లక పరమేశ్వరదాస్యంబ కో
రె నఁట యాప్రహ్లాదచరిత్ర[2]కథనావసరమ్మున నీతండ్రి కిని నీకును విశేషంబుగా
నేపురుషుండు భగవదనుగ్రహంబుఁ బొంద నోపు నని పుండరీకాక్షుం డానతిచ్చిన
వాక్యంబులు [3]వక్ష్యమాణగ్రంథంబున విస్తరించెద నాబలిచక్రవర్తిగృహద్వా
రంబున నఖిలలోకగురుం డయినశ్రీమన్నారాయణుండు గదాపాణియును నిజ
జనానుకంపితుండును శంఖచక్రాద్యాయుధధరుండును నగుచు నేఁడు నున్నవాఁ
డట్టిబలిద్వారంబున నున్నగరుడధ్వజుండు లోకంబుల గెలువ నిచ్ఛయించిన దశగ్రీ
వుం (డుల్లంఘితశాసనుం డై ప్రవేశంబు గావింపఁ) దనపాదాంగుష్ఠంబున యో
జనాయుతాయుతంబులం బాఱం జిమ్మె వినుము. 113

క. ఆసుతలమునకుఁ గ్రిం దై, భాసిల్లుఁ దలాతలంబు ǂ ప్రభు [4]వందు మయుం
డాసురపురనిర్మాతగ, వాసిగఁ బొగ డొంది నేలు ǂ వసుధాధీశా. 114

చ. పురహరుచే రమేశ్వరుఁడు ǂ భూతహితార్థముగాఁ బురత్రయం
బరుదుగ నీఱు సేసె శరǂణాగతు నామయుఁ గాంచి యెంతయుం
గరుణఁ దలాతలంబునకుఁ ǂ గర్తగ నిల్పిన నున్నవాఁడు శ్రీ
ధరునిసుదర్శనంబునకుఁ ǂ దప్పి విముక్తభయుండు గాఁ దగన్. 115

క. తలఁపఁగ నాక్రింద మహా,తలమునఁ గద్రూవధూటిǂతనయులు సర్పం
బులు గలవు పెక్కుశిరములు, నలరంగాఁ గ్రోధవశగǂణావలి యనఁగన్. 116

వ. మఱియును గుహక తక్షక కాళియ సుషేణాదిప్రధాను లయినవార లతులశరీ

---

1 సర్వతోభయం బై సకలసంపదలు గలరాజ్యంబు. 2 ంబు ననుసరించి తమతండ్రి నాతని
వదనుగ్రహంబు నెప్పుడు పొందనోపు నని. 3 ఉత్తరోత్తరంబుగా వినిపింతు, 4 వందులకు
పరత్రయంబును, వాసిగ నిర్మించె మయుఁడు ♦ వసుధాధీశా.

రంబులు గలిగి యాదిపురుషునివాహనం బై నపతగరాజభయంబున [1]ననవరతం బు నుద్వేజితు లగుచు స్వకళత్రాపత్యసుహృద్బాంధవసమేతు లయి యుండుదు రాక్రింద రసాతలంబున దైత్యులు దానవులు నగునివాతకవచకాలకేయు లను హిరణ్యపురనివాసు లగుదేవతాశత్రువులు మహాసాహసులును దేజోధికులును నగుచు సకలలోకాధీశ్వరుం డైనశ్రీహరితేజంబునం బ్రతిహతు లై వల్మీకంబు నందు నడంగి యున్నసర్పంబులచందంబున నింద్రదూత యగుసరమచేఁ జెప్పఁ బడెడుమంత్రాత్మకవాక్యంబులకు భయంబు నొందు చుండుదురు. 117

క. ఇందుకులోద్భవ వినుమా, క్రిందటిపాతాళమునను గ్రీడించుచు నా నందము నొందుచు నుండును, సందడిఁ బడి నాగకులము చతురతతోడన్. 118

వ. ఇట్లు వాసుకిప్రముఖు లైనశంఖ కులిక మహాశంఖ శ్వేత ధనంజయ ధృతరాష్ట్ర శంఖచూడ కంబ ళాశ్వతర దేవదత్తాదు లయినమహానాగపుంగవులు దీర్ఘమర్ష ణంబున నైదు నేడు పది నూఱు వేయి శిరంబులు గలిగి ఫణామణికాంతులం జేసి పాతాళతిమిరంబును బాపు చుండుదురు. 119

సీ. పాతాళలోకంబుపాఁతున శేషుండు, వెలయంగ ముప్పదివేలయోజ నంబులవెడలుపునను దోఁకఁ జుట్టగాఁ, జుట్టుక యుండు విష్ణుని మహోగ్ర మైనతాను శరీర మైనయనంతాఖ్య, సంకర్షణుం డుండు సంతతంబు నట్టియనంతనామాభిధానునిమస్తకమున సిద్ధార్థంబుకరణి ధరణి

ఆ. [2]యంత నావిభుండు నఖిలలోకంబుల, సంహరింపఁ గోరి చండకోప వశత సృజనఁ జేయు వరుస నేకాదశ,రుద్రమూర్తు లనెడురౌద్రమతుల. 120

ఆ. అట్టిరుద్రమూర్తు లతుల త్రినేత్రులు, నఖిలశూలహస్తు లగుచు నుందు రందు నున్నఫణికులాధిపుల్ శేషుని,పాదపంకజముల భక్తిఁ జేరి. 121

ఆ. నమ్రు లగుచు ననుదినంబును వరాళిర,త్నములచేతఁ గడుముదంబు నొంది కోరికలు దలిర్ప నీరాజనంబుల, నిచ్చుచుండు రెపుడు మచ్చికలను. 122

వ. మఱియు నాసంకర్షణమూర్తిం జేరి నాగకన్యకలు కోరికలు గలవార లగుచు నొప్పెడిశరీరవిలాసంబులం జేసి యగరుచందనకుంకుమపంకంబు లనులేపనంబులు సేయుచు సంకర్షణమూర్తిదర్శనస్పర్శనాదుల నుద్బోధితమకరధ్వజావేశితచిత్తం బులు గలిగి చిఱునవ్వు లొలయ నధికాభిలాషం జేసి [3] స్మితావలోకనంబుల సవ్రీడిత లై యవలోకించు చుండ ననంతగుణంబులు గలయనంతదేవుం డుపసంహ రింపంబడినక్రోధంబు గలిగి లోకంబులకు క్షేమంబు గోరుచు సురాసురసిద్ధ గంధర్వవిద్యాధరమునిగణంబు లనవరతంబు ధ్యానంబు సేయ సంతతసంతో

---

1 జకితు లై స్వకళత్రభృత్యసుహృత్కుటుంబసమేతు లై. 2 దేవియుండు బ్రహ్మదేవునిఁ జెందిన, నందుఁ బ్రళయ మైననాగవిభుని,కలన నుదయు మైనవార లేకాదశ, రుద్రమూర్తు. 3 మదముదిత విఘూర్ణితారుణకరుణావలోకననయనవదనారవిందంబులను సంప్రీతిఁ జేయు చుండ ననంతగుణంబులు.

పాతి[1]శయంబున బ్రేఁగన్ను వెట్టుచు సలలితగీతవాద్యంబుల నానందంబు నొందుచుఁ దనపరిజనంబుల నతిస్నేహంబున నవలోకించుచు నవతులసీగంధ పుష్పరసామోదితమధురవ్రాతమధురగీతంబులు గల వైజయంతీవనమాలికల ధరియించుచు నీలాంబరధరుండును హలధరుండును నగుచు నితండు (మహేంద్రుండో) హరుండో యనుచు జనంబులు వలుకుచుండఁ గాంచనాంబరధరుండై ముముక్షువులు ధ్యానంబులు సేయ [2]నధ్యాత్మవిద్యాయుక్తం బయినయానంద హృదయగ్రంథిని భేదించునట్టి శేషుని స్వాయంభువుం డగునారదుండు తుంబురు ప్రభృతు లగుఋషిశ్రేష్ఠులతోఁ జేరుకొని కమలాసనునిసభాస్థానంబునందు నిట్లు స్తుతియించుచుండు. 123

సీ. ఓలిమై నెవ్వని । లీలావినోదముల్, జన్మసంరక్షణ । క్షయములకును
హేతువు లగుచుండు । నెవ్వనిచూపుల, జనియించె సత్త్వర । జస్తమంబు
లెవ్వనిరూపంబు । లేక నై బహువిధం,బులను జగత్తులఁ । బోషించుచుండు
నెవ్వనినామంబు । లెఱుఁగక తలఁచిన,యంతన దురితంబు । లడఁగుచుండు.
తే. నట్టిసంకర్షణాఖ్యుండు । నవ్యయుండు, నైనశేషుని వినుతి సే । యంగఁ దరమె
తలఁప నెప్పుడు వాఙ్మనం । బులకు నింక, మూఁడులోకంబులందును । భూతతతికి.
ఆ. మఱియుఁ బెక్కుగతుల । మాఁబోఁటివారలఁ, బ్రోవఁదలఁచి శేష । మూర్తి సాత్త్వి
కస్వభావ మొందెఁ । గడఁకతో నట్టిశే,షునకు మ్రొక్కుచుందు । ననుదినంబు.

వ. మఱియు నాశేషుని నెవ్వండేని నాకస్మికంబుగ నయినను నార్తుం డగుచు నయినను స్మరించినమాత్రన యఖిలపాపంబులం బాసి సకలశ్రేయస్సులం బొందు నట్టి శేషునినే ముముక్షువు [3]లాశ్రయించి ధ్యానం బొనర్చి భవబంధనిర్ముక్తు లగుదు రతనిఫణంబులయందు భూగోళం బణుమాత్రం బగుచు నుండు నతనిమహామహిమలు గణుతింప సహస్రజిహ్వలు గలపురుషుండైన నోపం డని [4]పలుకుచుండు రాయనంతుండు పాతాళంబున నుండి సకలలోకహితార్థంబు భూమిని ధరియించు నని లోకతిర్యఙ్మనుష్యగతులను లోకస్థితియును శుకయోగీంద్రుండు వినిపించి యింక నేమి విన వలతు వెఱింగింపు మనిన బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె. 126

క. మునివర లోకచరిత్రం, బనుపమము మహావిచిత్ర । మగునట్లుగ నా
కును వినిపించితి వంతయుఁ, బనుపడి నాచిత్తమందుఁ । బాయక నిలిచెన్. 127

వ. అనిన శుకయోగీంద్రుం డిట్లనియె. 128

ఆ. జంతుజాలములకు । శ్రద్ధలు త్రిగుణాత్మ,కములు గాన వారి । కర్మగతుల

---

1 శయవిలోకంబునఁ బ్రేఁగన్ను వెట్టుచు. 2 విద్యామయం బయిన హృదయగ్రంథిని భేదించు నట్టి శేషభగవంతుని బ్రహ్మదేవుండు తుంబురునారదాదులం గూడి బ్రహ్మలోకంబునందుండి యిట్లని స్తుతియించుచుండు. 3 లాశ్రయింతు రతనిఫణ. 4 యజుండు వలుకు నాయనంతుండు.

తారతమ్యములును । దగిలి యిన్నియు [1]వివిధంబు లగుచు సంతతంబు నుండు.

వ. నరేంద్రా ప్రతిషిద్ధలక్షణం బగునధర్మం (బాచరించునరుని శ్రద్ధ విపరీతంబుగాఁ ప్రవర్తిల్లు నట్టివానికిఁ గలిగెడికర్మఫలంబును విపరీతంబుగానె యుండుం గావున ననాద్యవిద్యాకామప్రవర్తనలవలనఁ బెక్కుతెఱంగులఁ గలిగెడుకర్మగతుల సంగ్రహంబుగ) నెఱింగించెద ననిన (శుకునితోఁ బరీక్షి)న్నరేంద్రుం డి ట్లనియె.

ఆ. మునివరేణ్య నరకములు ముజ్జగంబుల,యందొ యంతరాళమందొ వెలినొ
యదియుఁగాక [2]దేశమం దుండుభూవిశేషములయందొ తెలుపు । సంతసమున.

వ. అనిన శుకయోగీంద్రుం డి ట్లనియె. 132

శుకయోగి పరీక్షిత్తునకుఁ దెలిపెడినరకలోకవర్ణనము.

క. ఎడతెగక ముజ్జగంబుల, కడపల నయ్యామ్యదిశను । గదలక [3]నిలుచుం
గడుఘోరములుగ నరకము, లడరంగా నంతరాళమందుల నధిపా. 133

వ. మఱియును దక్షిణంబున నగ్నిష్వాత్తాదిపితరులు దమతమగోత్రజులకు (మేలు గలుగుటకొఱకు సత్యంబు లగు)నాశీర్వాదంబుల నొసంగు చుండుదు రచ్చటి పితృపతి యగుశమనుండు దనలోకంబునకుం జనుదెంచుజంతువులకర్మంబులకుం దగినఫలంబుల నిచ్చి శిక్షించుచునుండు నందుఁ దామిస్రంబును నంధతామిస్రంబును రౌరవంబును మహారౌరవంబును గుంభీపాకంబును గాలసూత్రంబును నసిపత్త్రవనంబును సూకరముఖంబును నంధకూపంబును గ్రిమిభోజనంబును సందంశంబును దప్తోర్మియు వజ్రకంటకశాల్మలియు వైతరణియుఁ బూయోదంబును బ్రాణరోధంబును విశసనంబును లాలాభక్షంబును సారమేయాదనంబును నవీచిరయంబును రేతఃపానంబును ననునేకవింశతిమహానరకంబులును మఱియును క్షారకర్దమంబును రక్షోగణభోజనంబును శూలప్రోతంబును దందశూకంబును నవటనిరోధనంబును బర్యావర్తనంబును సూచీముఖంబును నన సప్తవిధనరకంబులతోడం గూడి యష్టావింశతినరకంబులు గల వని కొందఱు నొడువుదు రందు.

క. పరపుత్త్రకళత్త్రంబులఁ, బరికింపక యపహరించు । పాపాత్ముఁడు దు
ష్కరపాశబద్ధుఁ డై యమ,పురుషులచే నధికబాధఁ । బొందుచు నుండున్. 135

వ. మఱియు నివ్విధంబున బాధితుం డగుచుఁ దామిస్రనరకంబునం బడి యనశనాద్రిపాతనదండతాడనతర్జనాదిబాధలం జెంది కడుభయంబున మూర్ఛలం బొందు చుండు. 136

క. పరకాంత నెవ్వఁడేనియుఁ, [4]బురుషుం డుండంగ మోఱఁగి । పొందిన యమకిం
కరు లతనిఁ బట్టి వడిఁ ద,త్తఱమునఁ బడవైతు రంధ । తామిస్రమునన్. 137

వ. నరేంద్రా యెవ్వఁడేనిం గుటుంబపోషణార్థంబు పరులకు ద్రోహంబు సేయు నాన

---

1 త్రివిధంబు. 2 మఱియు నందులభూవిశేషములఁ దెలియఁ బలుకు. 3 నిలిచె,ప్పుడుఁ ఛాయ నుండునరకము. 4 బురుషుఁడు దగ మోహమునను బొందిన·· నడిగాఁ దఱుముచుఁ బడవైతు.

రుండు రౌరవనరకంబునం బడు నెవ్వాం (డిహలోకంబునందు స్వేచ్ఛావిహారం
బున సంచరించుచుఁ బరోపద్రవపరాఙ్ముఖంబు లయి యుండు)పశుపక్షిమృగా
దుల బాధించు నాయామృగంబులు రురురూపంబులఁ దాల్చి [1]యట్టిపాపజనుల
నానావిధయాతనల బాధించుటం జేసి రౌరవమహారౌరవనరకంబు లనంబడు
నెవ్వాం డేని [2]దేహపోషణార్థంబు మూషికాదుల బిలనిరోధంబుఁ జేసి వధించు
నానిష్కరుణుం డైనపురుషునిం గుంభీపాకనరకంబులయందుఁ గలతప్తతైలం
బులం బెక్కుబాధల నలయింతురు. 138

సీ. తల్లిదండ్రులకును | ధరణీసురులకును, నహితంబు సేసిన | యట్టివాఁడు
కాలసూత్రం బను | కడుఁదీవ్రనరకంబు, నందును నందంద | యయుతయోజ
[3]నాయతపాత్రాదు | లందుల సూర్యుఁడా, మీఁదఁ గ్రిందను వహ్ని | మిగుల మండ
నత్యంతక్షుత్పిపా | సాదులచేతను, బాధితుం డగు చుండుఁ | బాయ కెపుడుఁ

ఆ. బరువు వెట్టుచున్నఁ | బడి యున్న నిలిచినఁ, గదల కున్నఁ జాల | నొదిఁగియున్న
బాధఁ బొందుచుండుఁ | [4]బశురోమముల లెక్క, వరుస నపరిమేయ | వత్సరములు.

వ. మఱియు వేదమార్గంబు విడిచి పాషండమార్గంబు లాదరించుపురుషుని నసిపత్ర
వనంబునందు యమకింకరు[5]లు తఱుట్ల నడుచుచుఁ బరిహసించుచుం దోలు నెడ
నాయసిపత్రంబు లిరుగెలంకుల శరీరంబు ద్రెంచుచుండు నడుగడుగునకు బిట్టు
మొఱవెట్టు చుండ బాధించు చుండుదురు, 140

క. దండింపఁ దగనివారల, దండించిన విప్రవరుల | తనువులు ముట్టన్
దండించిన దుర్మతుల, న్దండింతురు కాలసూత్ర | నరకములందున్. 141

ఆ, మఱియు నట్టిదుష్ట | మానవుఁ గింకరుల్, విఱిచి చెఱకుఁగోల | విఱిచినట్లు
బాధపెట్టుచుండఁ | బడి మూర్ఛఁ జెందుచు, మొఱలువెట్టుచుండ | భూపవర్య.

వ. నరేంద్రా యెవ్వాం డేని యీశ్వరకల్పితవృత్తి గలజంతువుల హింసించు [6]నట్టివాని
నంధకూపం బనునరకంబునం బడవైచిన నందు నతండు దొల్లి తాను జేసినభూత
ద్రోహంబున నచ్చట వివిధక్రూరపక్షిమృగపశుసర్పమశకమత్కుణమక్షికాదుల
చేత హింసం బొందుచు మహాంధకారంబునందు నిద్రానుభవసుఖలేశంబును
లేక కుశరీరంబునందులజీవుండునుంబోలె మృతప్రాయుం డై యుండునంత. 143

క. తనకలిమి నెవ్వఁడేనిం, దనబాంధవవరులఁ గూడి | తగఁ గుడువక తా
నును వాయసంబు భక్షిం, చినమాడ్కిం దిన్నవాని | శీఘ్రమె యచటన్. 144

క. క్రిమిభోజన మనియెడినర, కమునం బడి క్రిములె కూడు | గాఁ గుడుచుచుఁ దాఁ
గ్రిమి యగుచు లక్షపరిమా, ణముఁగల క్రిమిగుండమందు | నాటుక యుండున్.

---

1 యట్టివాని బాధించుట. 2 పశుమృగాదులఁ బ్రాణనిరోధంబు సేసి. 3 నాయసిపత్రాదు. 4 బశువురోమము లెన్ని, వరుస నన్ని వేలవత్సరములు. 5 లదరంట నడుచుచు. 6 నెడ వానికిం దన బుద్ధిబలంబునఁ బ్రతిహింస చింతించు.

వ. మఱియు నీభూలోకంబున నెవ్వఁ డేని నవిపన్నుం డై చౌర్యవృత్తిచే బ్రాహ్మ
ణాదులహిరణ్యరత్నాదిద్రవ్యంబు లపహరించినను బ్రాహ్మణుం డితరజాతివారల
హిరణ్యాద్రవ్యంబపహరించినను నట్టిపురుషుని నగ్నివర్ణంబు లగు[2]నయఃపిండంబుల
నగ్నితప్తంబు లగుశూలంబుల నతనిశరీరంబునం దివియుచుండుదురు మఱియును
మదనాతురు లగుచు స్త్రీపురుషు లగమ్యాగమనంబు సేసిరేని నట్టివారిని యమ
లోకంబున [3]నతితీక్ష్ణకశాతాడితులం జేసి యగ్నిమయంబు లయినయుక్కుప్రతి
మల నాలింగనము సేయింతురు. 146

ఆ. [4]సర్వజంతుజాలసంగమ మొందెడు,వానిఁ బట్టి కట్టి | వజ్రదంష్ట్రి
కములు గలుగునట్టి | ఘనతరశాల్మలీ,[5]తరువులందుఁ జేర్చి | దంతు రెపుడు. 147

ఆ. పార్థివేంద్ర నరుఁడు | పాషండదర్శనుఁ, డగుచు ధర్మమార్గ | మడఁచె నేని
వాఁడు నరకమందు | వైతరణీనది, నుడుగ కెపుడుఁ బొరలి | పడుచు నుండు. 148

వ. మఱియు నట్టివైతరణీనదియందు జలగ్రాహంబులు దిగిచి భక్షింపం బ్రాణంబులు
నిర్గమింపఁ దనపాపంబు లుచ్చరించుచు విణ్మూత్రపూయశోణితకేశనఖాస్థిమేదో
మాంసవసాదులం దప్తుం డగుచు నుండు విప్రుండు శూద్రకామినులం బొంది
శౌచాచారంబులం బాసి గతలజ్జుం డై పశువుంబోలెఁ జరియించె నేని నతండు
నరకంబునం బొంది యందుఁ బూయవిణ్మూత్రలాలాశ్లేష్మపూర్ణార్ణవమందు
(ద్రొబ్బం)బడి యతిబీభత్సిత(ంబు లగునా)ద్రవ్యంబుల భుజియించు చుండు.

క. శునకములఁ బెంచి యెవ్వం, డనయంబును వేఁటసలిపి | యాత్మార్థముగా
వనమృగములఁ జంపును నా,మనుజాధము నస్త్రములను | మర్దింతు రొగిన్. 150

ఆ. జృంభణమున నరుఁడు | దంభార్థ మై పశు,వులను జంపి జన్న | ములను జేయు
వానిఁ బట్టి యముని | వారలు గోయుచు,నుందు రెపుడు మిగుల | సందడిలుచు.

వ. కామమోహితుం డై యెవ్వం డేనిఁ దనభార్యచేతఁ గోశఃపానంబు సేయించు
నాపాపాత్ముని రేతోహ్రదంబునం ద్రోచి యారేతంబునె పానంబు సేయింపు
దురు రాజపుత్రు లైనను జోరు లైనను ధనికులగ్రామంబుపైఁ బడి యందు గృహ
దాహంబు సేయువారలను విషాదులవలన నన్యులఁ జంపెడువారలను వజ్ర
దంష్ట్రిలు గలవింశత్యుత్తరసప్తశతశునకంబులెడ తెగక తిగిచి భక్షించుచుండు.

సీ. లంచంబుఁ గొని సాక్షి | వంచించి యనృతంబు, వలికెడుపాపాత్ముఁ | బట్టి కట్టి
యంత మానక వీచి | యనునరకమునందు, శతయోజనోన్నత | శైలశిఖర
మునఁ దలక్రిందుగా | నునిచి యధోముఖం,బుగఁ బడద్రొబ్బిన | బొబ్బలిడుచుఁ
గల్లోలములు లేని | కమలాకరముఁబోలె, జదర మై యున్నపా | షాణమందుఁ

---

1 స్నేహబలోద్బుద్ధుల ధరామరుల హిరణ్యాది. 2 నినుపతండసంబుల శరీరంబుఁ బొలియు చుందురు. 3 నతితిగ్మంబు లై తప్తంబు లయినయుక్కుప్రతిమల. 4 పర్వకాలమందుఁ బడఁతులఁ బొందిన, వానిఁ బట్టి కట్టి వజ్రకంటకములు. 5 దారువులను జేర్చి తర్తు రెపుడు.

తే. బడినయంతన దేహంబు పగిలి పెక్కు, తునుకలై పాసి యది గూడి కొనుచునుండ
దండియాకులతను బొందుచుండుఁ గాని, చావు లేకుండు నాదుష్టజంతువునకు.

ఆ. సోమయాజిభార్యఁ గామించి పొందిన, వానిఁ గపటమద్యపానసోమ
పాన మనుదినంబుఁ బానంబు సేయువి,ట్క్షత్రియులను బట్టి సంభ్రమమున.

ఆ. ఱొమ్ముఁ ద్రొక్కి మోము తిమ్మవట్టఁగ మోఁది, యనలముఖమునందు నగ్నివర్ణ
ముగను గాఁచి వక్త్రమున నిండఁగా నుక్కు, నీరు వోతు రేచి నిష్ఠురముగ.

వ. మఱియు నీచవర్ణుండు నిష్ఠ సలుపుచుఁ దపోదానవిద్యాచారంబులఁ బెద్దల కవమానంబు సేయువాఁడు క్షారకర్దమం బనునరకంబునందు నధోముఖుం డగుచు బాధలం బొందు స్త్రీపురుషు లెవ్వ రేని శరీరరక్షణార్థంబు పశువుల మానవుల బలి యిచ్చి రేని వారల నిరయంబునందు యమకింకరులు సురియలం దునిమి తద్రక్తంబు పానంబు సేయుచుం బాఱాడు చుందురు గ్రామారణ్యంబులయందు జంతువుల శూలప్రోతంబులం గావించి (హింసించుచు హర్షించు చున్న) వారలను శూలసూత్రం బనునరకంబునందు శూలప్రోతులం జేసిన క్షుత్పిపాసాపరవశు లగుచుండఁ గంకగృధ్రాదులు (దీక్ష్ణతుండాగ్రంబులం) దిగిచి భక్షించుచుండు మఱియు ధూర్తస్వభావంబున జంతుపీడనంబుఁ గావించెడుపాపాత్ముల దందశూకం బనునరకంబునందు నైవ నైదునేడుముఖంబులసర్పంబులు గఱచు చుండు. 156

ఆ. [1]ఏనయ దొడ్డిలోన నిండ్లలో నైనను, బశుపతంగహారిణపంక్తి నెల్లఁ
బట్టి హింస సేయుపాపాత్ము విషవహ్ని,ధూమశిఖల ద్రొబ్బుదురు నృపాల. 157

క. తనయింటికి వచ్చినమను,జుని నతిథిం గ్రోధదృష్టిఁ జూచినవానిం
గనుఁగవల వజ్రదంష్ట్రలఁ, దనరినయాకంకగృధ్రతతి భక్షించున్. 158

మ. ధనవంతుం డగుమానవుండు గడఁకన్ ధర్మోపకారంబులన్
ఘనతం జేయక యుండెనేని యమలోకంబందు సూచీముఖం
బనునాదుర్గతిఁ బట్టి త్రోచి యిది గాపై యున్నభూతం బట
న్నును బాశంబులఁ బట్టి కట్టి వడిలో నొప్పింతు రత్యుగ్రులై. 159

ఆ. నరవరేణ్య యిట్టినరకముల్ యమలోక, మందుఁ గలవు మఱి సహస్రసంఖ్య
లందు శమనదూత లనిశంబు బాధింతు, రవని ధర్మదూరు లయిననరుల. 160

ఆ. ధర్మవంతు లెల్లఁ దప్పక స్వర్గంబు,నందు భోగసమితిఁ బొందు చుందు
రెలమిఁ బుణ్యపాపములశేషములవల్లఁ, బుట్టుచుందు రవనిఁ బుణ్యచరిత. 161

వ. నరేంద్రా మోక్షమార్గంబు మున్నె వినిపించితి నిప్పుడు నీ కెఱిగించిన వెల్లను బ్రహ్మాండకోశంబునం జతుర్దశకోశంబులు గల వని పురాణంబులు వలుకుచుండు నట్టిబ్రహ్మాండంబు శ్రీమన్నారాయణునిస్థూలశరీరం బగుటం జేసి బ్రహ్మాండం బెవ్వ

1 దొడ్లలోన నైనఁ దొడి నిండ్లలో నైన.

రు వర్ణింతు రెవ్వరు విందురు వారలకు సకలశ్రేయస్సులుం గలుగు నీశ్వరస్థూల
శరీరంబుఁ దెలిసినవారికి శ్రద్ధాభక్తులం జేసి స్థూలదేహంబు నెఱుంగవచ్చు భూ
ద్వీపవర్షసరిదద్రినభస్సముద్రపాతాళదిఙ్నరకతారాగణలోకసంస్థితం బయినసకల
జీవనికాయ్యంబై యద్భుతం బైనశ్రీహరిస్థూలశరీరప్రకారంబు వినిపించితి [1]నని.

చ. జలజభవాదిదేవమునిసన్నుత తీర్థపదాంబుజాత ని
ర్మలనవరత్ననూపురవిరాజిత కౌస్తుభభూషణాంగ యు
జ్జ్వలతులసీ[2]కురంగమదవాసనవాసితదివ్యదేహ [3]శ్రీ
నిలయశరీర కృష్ణ ధరణీధర భానుశశాంకలోచనా. 163

క. శ్రీతరుణీహృదయస్థిత, పాతకహర సర్వలోకపావన భువనా
తీతగుణాశ్రయ యతివి,ఖ్యాతసురార్చితపదాబ్జ కంసవిదారీ. 164

మత్తకోకిలము. దండితారిసమూహ భక్తినిధాన దానవిహార [4]మా
ర్తాండమండలమధ్యసంస్థిత తత్త్వరూప గదాసికో
దండశంఖసుదర్శనాంక సుధాకరార్కసునేత్ర [5]భూ
మండలోద్ధరణార్తపోషణ మత్తదైత్యనివారణా. 165

గద్యము. ఇది శ్రీసకలసుకవిజనానందకర బొప్పనామాత్యపుత్ర గంగనార్యప్రణీతం
బైనశ్రీమద్భాగవతమహాపురాణంబునందు భరతాత్మజుం డైనసుమతికి రాజ్యాభి
షేకంబును పాషండదర్శనంబును సుమతిపుత్రజన్మవిస్తారంబును గయునిచరిత్రం
బును గయునిసంస్తుతియు భూద్వీపవర్షసరిదద్రినభస్సముద్రపాతాళదిఙ్నరకతారా
గణసంస్థితియు ననుకథలు గలపంచమస్కంధంబునందు ద్వితీయాశ్వాసము.

ఓం తత్సద్బ్రహ్మార్పణ మస్తు.

---

1 'సర్వంబును విష్ణుమయం బని తెలియుము శ్రీహరిపాదారవిందంబులు నిరంతరంబును ధ్యానంబు సేయువారలు విష్ణుపదంబునం జెందంగలవారలు గావున నీవు పరమభాగవతుండవును నారాయణపారాయణుండవును గావున నీకు వినిపించితి నీపరమపావనం బైనకథాప్రపంచంబు వినునతండు విగతపాపుం డై వైకుంఠంబున వసియించు నని శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకుం జెప్పె నని సూతుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నిట్లు' వ్రా. ప్ర. 2 మరందమద. 3 'శ్రీనిలయ నిశాచరేంద్రఘననీరదమారుత రాఘవేశ్వరా' అనియు, 4 'మార్తాండవంశసుధాబ్ధిపూరసుధామయూఖ సదాసి' అనియు, 5 'భూమండలేశ నతార్తిపోషణ' అనియు నీయాశ్వాసమునంత్యపద్యములును ఆదిపద్యముంబోలె రామాంకితముగాఁ జూపట్టెడి. మఱియు నీస్కంధపురెండాశ్వాసములగద్యములును నేకగద్యముగాఁ గానిపించుచున్నవి.

శ్రీ ర స్తు

శ్రీరామచన్ద్రాయ పరబ్రహ్మణే నమః.

# శ్రీమదాంధ్రమహాభాగవతము

## షష్ఠస్కంధము



[1]వత్సాంకితకౌస్తుభస్ఫురితలక్ష్మీచారువక్షస్స్థల
శ్రీవిభ్రాజితు నీలవర్ణు శుభరాజీవాక్షుఁ గంజాతభూ
దేవేంద్రాదిసమస్తదేవమకుటోద్దీప్తోరురత్నప్రభా
వ్యావిద్ధాంఘ్రిసరోజు నచ్యుతుఁ గృపావాసుం బ్రశంసించెదన్. 1

ఉ. నిందుమతిం దలంతుఁ గమనీయభుజంగమరాజమండలీ
మండనుఁ జంద్రఖండపరిమండితమస్తకుఁ దారమల్లికా
పాండురవర్ణుఁ జండతరభండను హేమగిరీంద్రచారుకో
దండు మహేశు గంధగజదానవభంజను భక్తరంజనున్. 2

ఉ. హంసతురంగముం బరమహంసము నంచితదేవతాకులో
త్తంసము నాగమాంతవిదితధ్రువపుణ్యగమావతంసముం
గంసజిఘాంసునంశమును గర్బురసూత్రసమావృతాంసమున్
హింస నడంచు[2]బ్రహ్మము నహీనశుభంబులకై భజించెదన్. 3

ఉ. మోదకహస్తునిన్ సమదమూషకవాహను నేకదంతు లం
బోదరు నంబికాతనయు నూర్జితపుణ్యు గణేశు దేవతా
హ్లాదగరిష్ఠు దంతిముఖు నంచితభక్తఫలప్రదాయకున్
మోదముతోడ హస్తములు మోడ్చి భజించెద నిష్టసిద్ధికిన్. 4

ఉ. కల్లతనంబు గాక పొడగట్టినపూర్వపురీతి నేఁడు నా
యుల్లమునందు నుండుము సమున్నతతేజముతోడ భక్తిరం
జిల్లినచూపు గూడ విధిఁ జెందినప్రోడ బుధాళిసీడ మా
తల్లి దయామతల్లి ప్రణతద్రుమకల్పకవల్లి భారతీ. 5

---

1 కొన్నిప్రతుల నీపద్యమునకు మాఱుగా 'క. భూతనయాహృదయస్థిత, పాతకహర సర్వలోకపావన భువనా, తీతగుణాశ్రయ యతివి,ఖ్యాత సురార్చితపదాబ్జ కరుణానిలయా' అని యున్నది.

2 'నబ్జభవు నెల్లశుభం' వ్రా. ప్ర.

క. విలసత్కంకణరవరవ, కలితం బగునభయవరదకరముల బెరయం
జెలరేఁగి భక్తులకు నల, కలుముల దయసేయుజలధికన్యకఁ దలఁతున్. 6

క. కాళికి బహుసన్నుతలో, కాళికిఁ గమనీయవలయకరకీలితకం
కాళికిఁ దాపసమానస, కేళికి వందనము సేసి కీర్తింతు మదిన్. 7

వ. అని యిష్టదేవతాప్రార్థనంబు సేసి. 8

చ. పరమసమాధిధుర్యుఁ బటుపావనకర్మవిధేయు దేవతా
వరనరవంద్యు సద్విమలవాక్యు జనార్దనకీర్తనక్రియా
భరణసమగ్రు వేదచయపారగు భవ్యుఁ ద్రికాలవేది భా
సురమతిఁ గొల్చి గొప్ప బుధశోభితుఁ బుణ్యుఁ బరాశరాత్మజున్. 9

క. వ్యాసుని భగవత్పదసం, వాసుని నాగమపురాణవరవిష్ణుకథా
వాసుని నిర్మలకవితా, భ్యాసునిపదపద్మయుగము భావింతు మదిన్. 10

సీ. వరకవిత్వోద్రేకి వాల్మీకిఁ గొనియాడి, భాగవతార్థవైభవముఁ బలుకు
శుకమంజులాలాపు శుకయోగిఁ బ్రార్థించి, బాణమయూరులప్రతిభ నొడివి
భాససౌమిల్లికభారవిమాఘుల, ఘనసుధామధురవాక్యములఁ దలఁచి
కాళిదాసుఁ గవీంద్రకల్పవృక్షముఁ గొల్చి, నన్నపాచార్యు వర్ణనలఁ బొగడి
తే. వెలయఁ దిక్కనసోమయాజుల భజించి, యెఱ్ఱనామాత్యుభాస్కరు నిచ్చఁగొల్చి
సుకవిసోముని నాచనసోము నెఱిఁగి, కవిమనోనాథు శ్రీనాథు ఘనత మెచ్చి.

ఉ. ఎమ్మెలు సెప్ప నేల జగ మెన్నఁగఁ బన్నగరాజశాయికిన్
సొమ్ముగ వాక్యసంపదలు సూఱలు సేసినవానిభక్తిలో
నమ్మినవాని భాగవతనైష్ఠికుఁ డై తగువానిఁ బేర్మితో
బమ్మెరపోతరాజుఁ గవిపట్టపురాజుఁ దలంచి మ్రొక్కెదన్. 12

వ. అని సకలసుకవినికరంబులకు ముకుళితకరకమలుండ నై. 13

ఉ. ఎయ్యది కర్మబంధముల నెల్ల హరించు విభూతికారణం
బెయ్యది సన్మునీంద్రులకు నెల్లఁ గవిత్వసమాశ్రయంబు మ
న్నెయ్యది సర్వమంత్రముల నేలిన దెయ్యది మోక్షలక్ష్మిరూ
పెయ్యది దానిఁ బల్కెద సుహృద్యము భాగవతాఖ్యమంత్రమున్. 14

వ. అని శ్రీమహాభాగవతపురాణంబునందు షష్ఠస్కంధం బాంధ్రభాష రచియిం
పం బూని యీకృతికిం బతిగా నద్దేవుండు గలం డని వితర్కించి నాకుం గవిత్వ
మహత్త్వంబు సంప్రాప్తం బగుకాలంబు దలంచి నారాయణుండె దైవం బని
యెఱింగి మనోరథంబు సఫలం బయ్యె నని యీకృతిఁ గృష్ణార్పణంబు చేసితి
నది యె ట్లనిన నేను విద్యాభ్యాసంబునం దగిలి కొండుక నై యుండ నొక్క
నాఁడు దివంబున. 15

చ. కలితవిశేషవస్త్రములు గట్టి హిమాంబుసుగంధచందనం

బలఁది వినూత్నభూషణము లారఁగఁ దాల్చి వినోదలీల నిం
పులమృదుశయ్య నిద్రఁ దగఁ బొందినచోఁ గనుపట్టెఁ బల్లఱుం
దలమునఁ గ్రమ్ముక్రొమ్మెఱుఁగుగు తెండము రూపున నిల్చుపోలికన్. 16

సీ. ఉరవడిఁ బ్రాగ్వీథి నుదయించుమార్తాండ,కోటిబింబచ్ఛాయ గూడినట్లు
హరిహరబ్రహ్మల యాత్మలలో నుబ్బి, కరుణ యొక్కట మూర్తి బెరసినట్లు
ఖరకరకరతీవ్ర గతిని గరంగుచు, హేమాద్రి[1]చెంతఁ బె ల్లెగసినట్లు
ఫణిరాజఫణరాజి మణిగణవిస్ఫూర్తి. సుషిరంపువెలిఁ దల చూపినట్లు
తే. లుట్టిపడ్డట్లు కట్టెజ్జ నూఁదినట్లు, తేజ మెసఁగంగ నామ్రోల దివ్యవాణి
పూని సాక్షాత్కరించి సం పూర్ణదృష్టిఁ, జూచి యిట్లనిపలికె మం జులముగాను.

ఉ. ఆటలుఁ బాటలుం జదువు లద్భుతముల్ విన నొప్పువాద్యముల్
సాటి దలంప రానిబలు సాములు ము న్నగువిద్య లెల్ల నీ
కాటలుఁ బాట లయ్యె విను మన్నిటికిన్ మెఱుఁ గిడ్డభంగి నా
చాటునఁ జాటుకారపద సాధుకవిత్వముఁ జెప్పు మింపుగన్. 18

వ. అని యాన తిచ్చు జగన్మాతృకృపావలోకనసుశ్లోకుండ నై యే నొక్క శ్లోకంబు నాక్షణంబ నుడివితి నది యెట్టి దనిన, 19

శ్లో. హంసాయ సత్త్వనిలయాయ [2]సదాశ్రయాయ
నారాయణాయ నిఖిలాయ నిరాశ్రయాయ
సత్సంగ్రహాయ సగుణాయ సదీశ్వరాయ
సంపూర్ణపుణ్యపతయే హరయే నమస్తే. 20

వ. ఈశ్లోకం బద్దేవి యంగీకరించె నంత మేలుకాంచి యానందభరితుండ నై నాఁట నుండి చంద్రానుగత యగుచంద్రికయుంబోలె నారాయణాంకితం బయినకవిత్వ తత్త్వజ్ఞానంబు గోచరం బయ్యె దానికి ఫలంబుగా గోపికావల్లభుని నుల్లంబున నిడుకొని. 21

ఆ. పలుకఁ గలిగె మొదల భాగవతార్థంబు, భర్త కృష్ణుఁ డయ్యె భాగ్యమొదవె
నమృతరసముఁ గోర నలరుచింతామణి, పాత్ర సంభవించు భంగి నిపుడు. 22

ఆ. (భాగవతము దేట పఱుప నెవ్వఁడు సాలు, శుకుఁడుదక్క నరుని సఖుఁడుదక్క
బుద్ధిఁ గోఁచినంత బుధులచే విన్నంత, భక్తి నిగిడినంత పలుకువాఁడ.) 23

ఉ. పుట్టిననాఁటనుండియును బుట్టద యెట్టియ దట్టు నైనఁ జే
పట్టి నుతింపఁ జిత్తము శుభం బగు మద్వరవాక్ప్రసీమకుం
బట్టము గట్టినాఁడ హరిఁ బాయక తత్కథనామృతంబు నే
నుట్టిపడంగఁ జెప్పెదు బుధోత్తము లానుఁడు శ్రోత్రపద్ధతిన్. 24

వ. అని. 25

---

1 భాగ పె ల్లెగసి. 2 యనీశ్వరాయ.

సీ. శ్రీవత్సగోత్రుండు శివభక్తియుక్తుఁ డా,పస్తంబసూత్రుఁ డపారగుణుఁడు
నేర్పారి శాసనుం డెఱ్ఱనప్రెగ్గడ, పుత్త్రుండు వీరన పుణ్యమూర్తి
కాత్మజుం డగునాదయామాత్యునకుఁ బోల,మాంబకు నందను లమితయశులు
కసువనామాత్యుండుఘనుఁడు వీరనమంత్రి, సింగధీమణియు నంచితగుణాఢ్యు
తే. లుద్భవించిరి తేజంబు లూర్జితముగ, సారిది మూర్తిత్రయం బన శుభ్రకీర్తిఁ
బరఁగి రందులఁగసువనప్రభువునకును,ముమ్మడమ్మనుసాధ్వి యిమ్ములను వెలసె.
ఉ. ఆడదు భర్తమాట కెదు రాడదు వచ్చినవారి పీడఁగా
నాడదు పెక్కుభాష లెడ నాడదు వాకిలి వెళ్లి కల్ల మా
టాడదు మిన్న కేని సుగుణావళి కిందిర గాక సాటి యే
చేడియ లేదు చూరికులశేఖరుకస్వయముమ్మడమ్మకున్. 27
క. ఆకసువయమంత్రికిఁ బు,ణ్యాకల్పశుభాంగి ముమ్మడమ్మ మము న్న
వ్యాకులచిత్తుల నిరువుర, శ్రీకరగుణగణులఁ బుణ్యశీలురఁ గాంచెన్. 28
క. అంగజసమలావణ్యశు, భాంగులు హరిదివ్యపదయుగాంబుజవిలస
ద్భృంగాయమానచిత్తులు, సింగయ తెలగయలు మంత్రిశేఖరు లనఁగన్. 29
క. అం దగ్రజుండ శివపూ,జం దనరినవాఁడ విష్ణుచరితామృతని
ష్యందిపటువాగ్విలాసా,నందోచితమానసుండ నయకోవిదుఁడన్. 30
వ. కావునం గృష్ణపాదారవిందసందర్శనాదర్శతలాయమానచిత్తుండ నయి. 31

షష్ఠ్యంతములు.

క. శ్రీపతికి మత్పతికి నుత,గోపతికిఁ ద్రిలోకపతికి గురుజనబుధసం
తాపనివారణమతికిని, బ్రాపితసనకాదితతికి బహుతరధృతికిన్. 32
క. హరికి గురుకలుషకుంజర,హరికి బలాభీలహరికి నంగస్థితగ
హ్వరికి నరహరికి రక్షిత,కరికిఁ గరాగ్రస్థగిరికిఁ ఘనతరకిరికిన్. 33
క. గుణికి సమాశ్రితచింతా,మణికి మహేంద్రాదిదివిజమండలచూడా
మణికిఁ బ్రకల్పితశయ్యా,ఫణికి నురోభాగకౌస్తుభప్రియమణికిన్. 34
క. కంసాసురసంహారున, కంసాంచితకర్ణకుండలాభరణునకున్
హింసాపరవరమస్తక,మాంసకరాళితగదాభిరామతహస్తునకున్. 35
క. వరయోగిమానసాంతః,కరణసుధాంభోధిభావకల్లోలలస
త్పరతత్త్వశేషశాయికిఁ, జిరదాయికి సకలభక్తచింతామణికిన్. 36
వ. సమర్పితంబుగా నాయొనర్పం బూనినషష్ఠస్కంధంబునకుఁ గథాప్రారంభక్రమం
బెట్టి దనిన హరిచరణస్మరణపరిణామవినోదు లయినశౌనకాదులకు నిఖిలపురాణేతి
హాసనిర్ణయవిఖ్యాతుం డైనసూతుం డి ట్లనియె. 37
క. శ్రీరమణీరమణకథా,పారాయణచిత్తుఁ డగుచుఁ బలికెఁ బరీక్షి
ద్భూరమణుఁ డాదరంబున, సూరిజనానందసాంద్రు శుకయోగీంద్రున్. 38

సీ. షడ్గుణైశ్వర్యశాశ్వతమూర్తి వయినట్టి, మునినాథ దయతోడ ముక్తిపదము
మున్నుగా నేమార్గమున వినిపించితి, వారయ నపవర్గభూరిమహిమఁ
గ్రమయోగసంభవబ్రహ్మంబుతోఁగూడ, ననుపొంద నగు నని వినుతికెక్క
మఱియు సత్త్వరజస్తమఃప్రభావంబులఁ, గడిఁది వై యున్నట్టి కర్మచయము

తే. నప్పటప్పటి కడఁగనియట్టి ప్రకృతి, గలుగుపురుషునిభోగార్థఘటన దేహ
కారణారంభరూపమార్గంబు మొదలు, మాటిమాటికి నన్నియుఁ దేటపడఁగ.

వ. మఱియు ననేకపాపలక్షణంబు లగునానావిధనరకంబులును వాని కాద్యంతంబులును స్వాయంభువసంబంధి యగుమన్వంతరంబును బ్రియవ్రతోత్తానపాదుల వంశంబును దచ్చరిత్రంబును ద్వీపవర్షసముద్రాదినద్యుద్యానవనస్పతులును భూమండలసంస్థాపనంబును వానిపరిమాణంబును జ్యోతిశ్చక్రచలనప్రకారంబును విభుం డయినపరమేశ్వరుం డెవ్విధంబున నిర్మించె నావిధం బంతయు నెఱింగించినాఁడ విప్పుడు. 40

ఆ. కడిఁది వేదనలకుఁ గారణం బై యుండు, గుఱుతు లేనినరకకూపరాశి
పాలు గాక నరుఁడు బ్రదికెడుమార్గంబు, పరమపుణ్య తెలియఁ బలుకవయ్య. 41

వ. అనినం బరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డి ట్లనియె. 42

క. కట్టా త్రికరణ [1]మెఱుఁగక, పుట్టినదురితముల నపుడ పొలియింపనియా
కట్టిఁడి దేహం బుడిగినఁ, గొట్టాడును బిట్టు నరకకూపంబులఁగోన్. 43

ఉ. కావునఁ గాలకింకరవికారము గానకమున్న మృత్యుదు
[2]ర్భావనఁ జిత్తముక్తి వెడఁగుపాటును జెందకమున్న మేనిలో
జీవము వెల్లు చుండఁ దనచెల్వము దప్పకమున్న పన్నుగాఁ
బావనచిత్తుఁ డై యఘముఁ బాయ నెఱుంగొనరింపఁగాఁ దగున్. 44

క. కాలం బెడ గని పాపము, మూలముఁ జెఱుపంగ వలయు మును [3]రోగములం
దేలినదోషము నెఱుఁగుచు, వాలాయము దాని నడఁచువైద్యునిభంగిన్. 45

సీ. అనవుడు నాతని కనియె భూకాంతుండు, కనుకలి వినుకలి గలిగినట్టి
పాపము దనకు నొప్పని దని కని చాలఁ, బరితప్తుఁ డయ్యుఁ గ్రమ్మఱ నొనర్చు
మూఢాత్మునకు దోషమోచనం బెయ్యది, యారయ నెఱిఁగింపు మదియుఁగాక
కలుషమొక్కొకచోటఁ గావించు నొకచోటఁ, గావింపకుండుఁ దత్కర్మమెఱిఁగి

ఆ. యిట్టిజనుఁడు పుణ్య మేరీతిఁ జేసిన, నది ఫలింప నేర దని తలంతు
సలిలమందు మేనిమలినంబు వోకుండ, గజము గ్రుంకువెట్టుగతియుఁబోలె.

వ. అనిన శుకుం డి ట్లనియె. 47

క. కర్మము గర్మముచేతను, నిర్మూలము గాదు తెలియ నేరక తానే

---

1 'ములచేఁ బుట్టిన. 2 ర్భావన చిత్తముక్తి బెగడుపాటుగఁ జేయకమున్న. 3 దేహములం దేలినరోగము నెఱుఁగుచు' వ్రా. ప్ర.

కర్మముసేసినఁ దత్ప్రతి,కర్మం బొనరింప వలయుఁ గలుషవిదూరా. 48

క. హితవు గలకుడుపు మతి రు,గ్వితతులఁ బొడమంగ నీనివిధమున నతిస
ద్వ్రతుఁ డైనవాఁడు [1]నిర్మల,మతిచే నఘరాశి నెల్ల మట్టము సేయున్. 49

చ. తపమున బ్రహ్మచర్యమున దానమునన్ శమసద్దమంబులన్
జపమున సత్యశౌచముల సన్నియమాదియమంబులం గృపా
నిపుణులు ధర్మవర్తనులు నిక్కము హృత్తనువాక్యజంపుపా
పపుగుది ద్రుంతు రగ్ని శతపర్వవనంబుల నేర్చుకైవడిన్. 50

వ. అదియునుం గాక. 51

ఉ. కొందఱు పుణ్యవర్తనులు గోపకుమారపదారవిందజా
నందమరందపానకలనారతషట్పదచిత్తు లౌచు గో
విందపరాయణుల్ విమలవేషులు దోష మడంతు రాత్మలం
జెందినభక్తిచేత రవి చేకొని మంచు నడంచుకైవడిన్. 52

క. హరిభక్తిచేతఁ గొందఱు, పరిమార్తురు మొదలు ముట్టఁ బాపంబుల ని
ష్ఠురతరకరములసూర్యుం, డురుదగఁ బెనుమంచుఁ బించమడఁచినభంగిన్. 53

క. దంతిపురనాథ విను మొక,మంతన మెఱిఁగింతు శమదమంబులు నంహో
వంతు శుభవంతుఁ జేయవు, కంతునిగురుభక్తి ముక్తిఁ గలిగించుగతిన్. 54

సీ. హరికి నర్థముఁ బ్రాణ మర్పితంబుగఁ జేయు,వానికైవల్య మెవ్వానికి లేదు
వనజలోచనుభక్తవరుల సేవించిన, వానికైవల్య మెవ్వానికి లేదు
వైకుంఠనిర్మలవ్రతపరుం డైనట్టి, వానికైవల్య మెవ్వానికి లేదు
సరసిజోదరుకథాశ్రవణలోలుం డైన, వానికైవల్య మెవ్వానికి లేదు

తే. లేదు తపముల బ్రహ్మచర్యాదినియతి,శమదమాదుల సత్యశౌచముల దాన
ధర్మమఖముల సుస్థిరస్థాన మైన, వైష్ణవజ్ఞానజనితనిర్వాణపదము. 55

తే. అరయ నెన్నఁడుఁ జేటు లేనట్టిముక్తి,వర్త్మ మీలోకమందు నెవ్వారికిఁ గలదు
సాధులును బుణ్యశీలురు సజ్జనులును, హరిపరాయణతత్పరు లయినఁ గాక.

క. అరుదుగ నరహరిభక్తిం, బొరయనిమాపురుషుసుకృతపుంజంబులు వే
మఱుఁ బుణ్యుఁ జేయ నేరవు, సరవర మధుఘటముఁ బెక్కునదులుం బోలెన్.

చ. సతతముఁ గృష్ణపాదజలజంబులయందు మనంబు నిల్పుసు
వ్రతులుఁ దదీయశుద్ధగుణరాగులుఁ గాలునియుగ్రపాశసం
హతుల ధరించుతత్సుభటకౌఘములం గలలోనఁ గాన రే
గతులను దుష్టకర్మములు గైకొని వారలఁ జెంద నేర్చునే. 58

వ. కావున నీయర్థంబునకుం బురాతనం బగునొక్కయితిహాసంబు గల దది విష్ణు
దూతయమదూతసంవాదం బనంబడు దాని నెఱింగింతు నాకర్ణింపుము. 59

---

1 తాలిమి, కతమునఁ దత్త్వంబుకొఱకుఁ ♦ గల్పించుఁ జూపి.

## అజామిళోపాఖ్యానము.

సీ. నరనాథ వినుము కన్యాకుబ్జపురమునఁ, గలఁడు బ్రాహ్మణుఁ డజామిళుఁ డనంగఁ
బాతకుం డతులనిర్భాగ్యుం డవజ్ఞుండు, నష్టసదాచారి కష్టరతుఁడు
జూదంబులందు దుర్వాదంబులందును, శౌర్యంబునందు మచ్చరము గలిగి
తొత్తాత్మపత్నిగా మత్తుఁడై వరియించి, కొడుకులఁ బదుగురఁ బడసి చాల
ఆ. మోహజలధిలోన మునిఁగి ముచ్చట దీర, బాలలాలనాదిలీలఁ దగిలి
పెద్దకాల మతఁడు పెంపార సుఖియించి, [1]ఫలిత మెల్ల వదలి పతితుఁ డయ్యె.
సీ. నిర్మలంబునఁ జాల నెఱయుచిత్తం బన, నల్లనివెండ్రుకల్ దెల్ల నయ్యెఁ
దగుమోహపాశబంధంబు జాఱినమాడ్కిఁ, బొదలినయంగముల్ వదలి వ్రేలె
నింద్రియంబులకోర్కు లీక నొల్ల ననుభంగి, నుడుగకతలచాలవడఁకఁజొచ్చెఁ
దమకంబుప్రాయంబుఁదగిలిపోయినమాడ్కి, లోచనంబులచూడ్కి సీచ మయ్యె
ఆ. వగరు పుట్టె నంత బెగలె దంతంబులు, నుక్కిసయును దగ్గుఁ బిక్కటిల్లె
శిరసు నొవ్వఁ దొడఁగెఁ జెదరె మనం బంతఁ, గడిఁది యైనముప్పుకాలమందు.
ఆ. ఎనయ నతని కెనుబదెనిమిదివర్షంబు, లంత నరుగుటయును భ్రాంతుఁ డగుచుఁ
గొరి పిన్నకొడుకు నారాయణాఖ్యుండు, బాలుఁ డగుట మిగుల భక్తిఁ జేసి.
క. తనసతియుఁ దానుఁ గూరిమి, మనమునఁ బెనఁగొనఁగ నక్కుమారుని ననిశం
బును ముద్దుసేయు చుండెను, జనవర వాత్సల్య మాత్మ సందడిగొనఁగన్. 63
క. బాలుని [2]ముగ్ధవచోబుజు, ఫాలుని నిజజనకబంధుపరిణామకళా
శీలుని లోలతఁ గనుఁగొని, యాలరి బ్రాహ్మణుఁడు నందితాత్ముం డగుచున్. 64
క. అత్యంతపానభోజన, కృత్యంబులఁ బొత్తు [3]గలిగి క్రీడలఁ దత్సాం
గత్యంబు వదల కాగత, మృత్యువుఁ గన నేరఁ డయ్యె మిక్కిలిజడుఁడై. 65
తే. తెలియ కీరీతి నతఁడు వర్తించుచుండ, భయదమగుమృత్యుకాలంబు ప్రాప్తమైన
భూరివాత్సల్యవృత్తి నప్పుత్త్రుఁ [4]దలఁచి, యాత్మఁ బ్రలపించె నారాయణా యటంచు.
వ. అప్పుడు. 67
క. కింకరుల ధర్మరాజవ, శంకరుల దురంతపంకసమధికజననా
శంకరుల సకలలోకభ, యంకరులం గనియె నింద్రియాకులుఁ డగుచున్. 68
క. ఘాతుకుల దండదండిత, పాతకుల మహోగ్రకర్మభరనిష్కరుణా
జాతకులఁ బ్రేతనాయక, దూతకసంతతుల నతఁడు దూరమునందున్. 69
మ. కనియెన్ బ్రాహ్మణుఁ డంత్యకాలమున వీఁకన్ రోషనిష్ఠ్యూతులన్
ఘనపీనోష్ఠవికారవక్త్రవిలసద్గర్వైకుణోపేతులన్
జనసంత్రాసకరోద్యతాయతసుపాశశ్రేణికాహేతులన్

---

1 'బలిత మెల్ల వవలి పలితుఁ డయ్యె. 2 నర్థవచోబుజు. 3 గలసి. 4 గూర్చి, యడరి పలవించు నారాయణాహ్వాయునిని' వ్రా. ప్ర.

హననవ్యాప్తివిభీతులన్ ముగుర నా।త్త్రాణేతరులన్ దూతలన్. 70

వ. [1]ఇట్లతివికృతతుండగండాభోగవిభాగవిషమవివృత్తనేత్రులు నతిపుష్టనిష్ఠురతను యష్టిసంవేష్టితమహోర్ధ్వరోములు నభ్యస్తసమస్తజీవాపహరణకరణప్రశస్త హస్తవిన్యస్తపాశధారులు నగుయమభటుల మువ్వురం గనుంగొని యజామిళుండు వికలేంద్రియుండును వికంపితప్రాణుండును వికృతలోచనుండును విహ్వలాత్మకుండును నై. 71

క. దూరమున నాడుబాలుఁడు, బోరనఁ దనచిత్తసీమఁ। బొడగట్టిన నో
నారాయణ నారాయణ, నారాయణ యనుచు నా।త్మనందను నొడివెన్. 72

చ. మరణపువేళ నద్దనుజ।మర్దనుసంస్మరణంబు సేయఁ ద
త్పరిసరవర్తు లాత్మపరి।పాలకునామము నాలకించి ని
ష్ఠురగతి నేఁగుదెంచి పొడ।సూపి యదల్చిరి కాలుదాసులన్
ఖరతరభాషులన్ వికట।కల్పితవేషుల దీర్ఘరోషులన్. 73

క. దాసీభర్తనజామిళ, భూసురుఁ దత్తనువువలన। బోరన వెలికిం
దీసినయమభటులను బోఁ, ద్రోసిరి శ్రీవరునికూర్మి।దూతలు కడిమిన్. 74

-విష్ణుదూతయమదూతలసంవాదము.-

వ. ఇట్లు విష్ణుదూతలవలన నిర్ధూతప్రయత్నులై యమదూత లిట్లనిరి. 75

క. ఎవ్వరివారలు మాతోఁ, జివ్వకుఁ గత మేమి యిట్లు। చిక్కినవానిం
ద్రొవ్వున విడిపించితి రిఁక, నవ్వులకో జముని శాస।నంబులు జగతిన్. 76

వ. అదియునుం గాక. 77

సీ. ఎవ్వరు మీ రయ్య। యీభవ్యరూపముల్, కన్నుల కద్భుత।క్రమ మొనర్చె
[2]దివిజులో భువిజులో। దేవతాప్రవరులో, సిద్ధులో సాధ్యులో। చెప్పరయ్య
దళితపాండురపద్మ।దళదీర్ఘనేత్రులు, వరపీతకౌశేయ।వాసు లరయ
గండమండలనట।త్కుండలద్వయులును, బటుకిరీటప్రభా।భాసితులును

తే. భూరిపుష్కరమాలికా।చారువక్షు, లమితకోమలనవయౌవ।నాధికులును
బాహుకేయూరమణిగణ।భ్రాజమాన,ఘనచతుర్భుజు లభ్రసం।కాశరుచులు. 78

క. ధనువులు నిషంగచయములుఁ, గనదంబుజశంఖచక్ర।ఖడ్గగదాసా
ధనములు ధరియించినమీ, తనువులు లోకముల కద్భు।తం బొనరించెన్. 79

క. శాంతంబు లయినమీతను, కాంతులు జగములను దిశలఁ। గలిగినబహుళ
ధ్వాంతములఁ బాఱఁ దోలుచు, సంతస మొనరించె నిపుడు। సర్వంకష మై.

వ. ఇట్లఖిలలోకానందకరకమ్రాకారులు నఖిలవిభ్రాజమానతేజోదుర్నిరీక్ష్యమాణులును నిఖిలధర్మపాలురును నగుమీరు ధర్మపాలపరిచారుల మమ్ము నడ్డపెట్టం గతం బేమి యనిన (వారు ధర్మరాజానుచరులు గా రనుతలంపున) మందస్మిత

1 ఇట్లతివికృతాకారులఁ గాలకింకరులం గనుంగొని. 2 దివ్యోపదివ్యులో.

కందళితముఖారవిందు లయి గోవిందునికందువమందిరంబు(కావలి)వారలు వారి వాహగంభీరనిర్ఘోషపరిపోషణంబు లైనవిశేషభాషణంబుల నిట్లనిరి. 81

ఉ. మీరు పరేతనాయకుని కేమిలిమిదూత లటేని బల్కుఁడా
ఘోరపుఁబుణ్యలక్షణము దుష్కృతభావము దండకృత్యముల్
బీరముతోడ నీతని కభీష్టనివాసముఁ బూని దండ్య లె
వ్వారలొ సర్వభూతములొ [1]వారొకకొందఱుపాపకర్ములో. 82

వ. అనిన యమభటు లి ట్లనిరి. 83

క. వేదప్రణిహితమే యను,మోదంబుగ ధర్మ మయ్యె మున్ను తదన్యం
బేది యగు నది యధర్మం, బాదియు హరిరూపు వేద మని వినుకతనన్. 84

సీ. ఎవ్వనిచేఁ దనరియిర వొందు త్రిగుణస్వభావ మైనట్టియీప్రాణిచయము
లనుగుణనామక్రియారూపములచేత, నేర్పడుగతిఁ దాన యెఱుఁగఁబడును
నర్యముం డనలంబు నాకాశమును బ్రహ్మం,జనుఁడు గోచయమును శశధరుండు
సంధ్యలు దినములు శర్వరీచయములుఁ, గాలంబు వసుమతీజాలములును

తే. దేహధారికి సాక్షు లై తెలుపుచుండు, దండనస్థానవిధము సద్ధర్మగతియుఁ
దగులుమీఁరీక్రమానురోధనముసేసి, యఖిలకర్ములు దండనార్హులరయ నెపుడు.

తే. కోరికర్మంబునడపెడువారి కెల్లఁ, గలితశుభములు నశుభముల్ గలుగుచుండు
నరయఁగా దేహి గుణసంగి యైనయపుడె, పూని కర్మంబు సేయక పోవనరాదు.

క. ప్రకృతమునఁ దా నొనర్చిన,సుకృతము దుష్కృతము నెంత చూడఁగ నంతే
[2]వికృతి గని యనుభవించును, నకృతమతిం దత్ఫలంబు నతనిపుణుం డై. 87

వ. మఱియు వినుండు జన్మంబు శాంతఘోరమూఢగుణంబులచేత నైనను (సుఖదుఃఖగుణంబులచేత నైనను) ధార్మికాదిగుణంబులచేత నైనను సకలభూతంబులుఁ ద్రైవిధ్యంబు నేప్రకారంబునం బొందు నాప్రకారంబున జన్మాంతరంబునం బొందుచుండు దేవుం డైనయముండు సర్వజీవాంతర్యామి యై ధర్మాధర్మయుక్తం బైనపూర్వరూపంబుల [3]విశేషరూపంబులచేతం జూచు చుండి వాని కనురూపంబులఁ జింతించు చుండు నవిద్యోపాధి జీవుండు తమోగుణయుక్తుం డై ప్రాచీనకర్మంబులచేత నేర్పడినవర్తమానదేహంబు నే నని తలంచుచుండి నష్టజన్మస్మృతి గలవాఁడై పూర్వాపరంబు లెఱుంగం జాలకుండు మఱియుఁ గర్మేంద్రియంబులచేతఁ గర్మంబులం జేయుచుండి జ్ఞానేంద్రియంబులచేతఁ దమోవిషయంబు లైనశబ్దస్పర్శరూపరసగంధంబుల నెఱుంగు చుండి పదియేడవది యైనమనంబుతోఁ గూడి పదియేడవవాఁ డగు చుండి షోడశోపాధ్యంతర్గతుం డై యొక్కరుం డైనజీవుండు సర్వేంద్రియవిషయప్రతిసంధానంబుకొఱకు జ్ఞానేంద్రియకర్మేంద్రియమనోవిషయంబులఁ బొందు చుండి షోడశకళలు గలిగి లింగశరీరం బనం బరఁగి

1 వారక కొందఱు. 2 వికృతగతి ననుభ. 3 మనస్సుచేతం జూచు చుండి.

గుణత్రయకార్యం బనునిమిత్తంబున హర్షశోకభయంబుల నిచ్చు చున్నసంసా
రంబు ధరియించుచుండు విజితషడ్వర్గుం డైనదేహి కర్మంబు లొల్లనిబుద్ధి నెఱిం
గియు వినియుఁ గర్మంబులు సేయు చుండి తనసంచారకర్మంబునం జుట్టుకొన్న
పసిరికాయపురుగునుంబోలె నిర్గమోపాయం బెఱుంగక నాశంబు నొందు చుండు
వర్తమానవసంతాదికాలంబు భూతభావివసంతాదికాలయోగ్యం బైనపుష్ప
ఫలాదులు తత్కాలజ్ఞాపకంబు లెట్లు సేయు నట్లు భూతభావిజన్మంబులకు ధర్మా
ధర్మంబులు నిదర్శనంబులు సేయుచుండు నొక్కరుండు నొకక్షణంబును గర్మం
బు సేయ కుండువాఁడు లేఁడు పూర్వసంస్కారంబులం గలగుణంబులచేతఁ బు
రుషుం డవశుండు గావున బలిమిఁ గర్మంబు సేయింపం బడు చుండు నవ్యక్త
నిమిత్తంబు నొంది తదనురూపంబు లైనస్థూలసూక్ష్మశరీరంబులు మాతాపితృ
సదృశంబు లగు చుండు నిట్టివిపర్యయంబు పురుషునికిఁ బ్రకృతిసంగమంబునం
గలుగు చుండు నాప్రకృతి పురాణపురుషుం డైనయప్పరమేశ్వరుని సేవించినం
దలంగు చుండు. 88

సీ. కావున నితఁడు సత్కర్మవర్తనమున, భూదేవకులమునఁ బుట్టినాఁడు
దాంతుఁ డై శాంతుఁ డై ధర్మసంశీలుఁ డై, సకలవేదంబులఁ జదివినాఁడు
వినయంబు గురువుల నతిభక్తిఁ బెద్దలఁ, జేరి శుశ్రూషలఁ జేసినాఁడు
సర్వభూతములకు సమబుద్ధి యై చాల, బహుమంత్రసిద్ధులఁ బడసినాఁడు
తే. సత్యభాషణనియమంబు జరపినాఁడు, నిత్యనైమిత్తికాదుల నెరపినాఁడు
దండిలోభాదిగుణములఁ దెరపినాఁడు, మంచిగుణములు దనయందు నమరపినాఁడు.
క. సతతాచారసమంచిత, మతి యై సుజ్ఞానమునకు మరగెడుతఱి నా
యతఁ గని యాతని కంగజ, మత మై నవయౌవనాగమం బెడసొచ్చెన్. 90
సీ. కడకంట యౌవనగర్వంబు పొడకట్టె, మదిలోన నుద్రేకమదము పుట్టెఁ
గడు మేనఁ గామవికారంబు దలచూపె, ముఖమునఁ జిఱునవ్వు మొలకలెత్తె
నతిపుష్టి నిష్ఠురం బయ్యె దేహం బెల్లఁ, గచభారమున నెఱిఁ గప్పు మెఱసెఁ
గటిభారమున నూరుకాండముల్ నిగిమీఱె, బాహుశాఖలు దీర్ఘభంగిఁ దోఁచె
ఆ. నురము విపుల మయ్యె నుల్లసద్వరకాంతిఁ, బూర మంగకమునఁ బొందుపడియె
భూరితేజుఁ డగునభూసురాన్వయునకు, నభినవైకయౌవనాగమమున. 91
క. హృదయమునఁ బొడమయౌవన, మదము వెలిం దోఁచుభంగి మానితరుచిఁ ద
ద్వదనమున నూఁగుమీసలు, పొదలుచుఁ గప్పడరి చూడఁ బొంకం బయ్యెన్.
వ. మఱియును. 93
క. తమ్మివిరిమీఁద వ్రాలిన, తుమ్మెదపంక్తియునుబోలెఁ దోరపులీలం
గ్రమ్ముకొని విప్రతనయుని, నెమ్మొగమునఁ గానఁబడియె నెఱిమీసంబుల్. 94
వ. అంత ననంగబ్రహ్మతంత్రంబునకు వసంతుం డొనర్చునంకురార్పణారంభంబునుం

బోలె లలితకిసలయవిసరప్రసారభాసురబహుపాదపాదిపురోపవనపవనజవనప్రభా
వపరికంపితవిటవిటీజనహృదయప్రఫుల్లపల్లవభల్లంబును ననూనప్రసూననిర్భర
గర్భావిర్భూతసురభిపరాగపటలపటఘటితనభోమండలంబును నమందనిష్యంద
మరందబిందుసందోహకందళితచిత్తమత్తమధుపసంకులఝంకారముఖరిత సకలది
శావలయంబును నిరంతరధారాళరసభరితపరిపక్వఫలానుభవప్రభవసమ్మోదవాద
శుకప్రముఖపతంగకోలాహంబును నై మధుమాసంబు సర్వజనమనోహరం
బును నై నిఖిలవనపాదపంబుల నలంకరించె నయ్యవసరంబున నజామిళుండు
పితృనిర్దేశంబునం గుశసమిత్పుష్పఫలార్థంబు వనంబున కరిగి తిరిగి వచ్చుసమ
యంబున నొక్కలతాభవనంబున. 95

క. బద్ధానురాగ యై స్మర,యుద్ధంబున కలరుబుద్ధి నునుకామకళా
సిద్ధ యగువృషలితోఁ బ్రియ,వృద్ధిం దగఁ గూడి యున్నవిటు నొరుఁ గాంచెన్.

క. భటునిఁ రతిశాస్త్రకళా,ర్భటునిఁ వరయౌవనానుభవమదవిభవో
ద్భటునిఁ సురతేచ్ఛాసం,ఘటునిఁ విగతాంబరోరుకటునిఁ విటునిన్. 97

శా. హాలాఘూర్ణితనేత్రతో మదనతంత్రారంభసంరంభతో
[1]ఖేలాపాలనయోగ్యభూవిభవతోఁ గీర్ణాలకాజాలతో
హేలాలింగనభంగివేషవతితో నిచ్ఛావతీ[2]మూర్తితోఁ
గేళిం దేలుచు నున్నవానిఁ గనెం బుంఖీభూతరోమాంచుఁ డై. 98

క. [3]కలికి వరుమదనకదనపుఁ,బలుకులకలకలము బెడఁగుపడుమేఖలము
వ్వాలరవళిఁ దగిలి [4]గతిగొనఁ, గలకంఠ రతంబు సలుపుగమకముఁ గనియెన్.

క. [5]కవకవ నై పదనూపుర,రవరవ లాగుబ్బుకొన్నరతిపతిగతులం
జివచివ నై విటుచెయ్వుల, రవళిఁ రతిసల్పురతులరవరవ గనియెన్. 100

చ. కురు లళికంబుపై నెగయఁ గ్రొమ్ముడి వీడఁగ గుబ్బదోయిపై
సరములు చౌకళింపఁ గటిసంగతి మేఖల తాళగింప స
త్కరవరకంకణావళులు గర్జిలఁ గా నసియాడ మీఁదు గా
మరునివినోదముల్ సలిపె మానిని యౌవనగర్వ రేఖతోన్. 101

క. మవ్వపుసుకుమారాంగిని, జవ్వని నుపగూహనాదిసముచితరతులఁ
నివ్వటిలుదానిఁ గని మది, నువ్విళ్లూరంగ మన్మథోద్దీపనుఁ డై. 102

తరలము. బహుళదృక్పరిపాకమోహనిబద్ధుఁ డౌచు మనంబులో
సహజకర్మము వేదశాస్త్రము సాత్త్వికంబుఁ దలంచి త
న్నిహితచిత్తము పట్టి పట్టఁగ నేరఁ డయ్యె సదా మనో
గహనమందు మరుండు పావకుఁ డై వడిం జరియింపఁగాన్. 103

---

1 ఖేలాపాటవకోటరీవిభవతో. 2 మూర్ధ్నితో. 3 కలికివగమదన. 4 గరిగొన; రతిగొన.
5 కవకవలై...రవరవలై గుబ్బుగొన్న.

శా. ఆలీలావతిగండపాళికలపై । హాసప్రసాదంబుపై
నాలోలాలకపంక్తిపై నళికపై । నాకర్ణదృగ్భాతిపై
హేలాపాదికుచద్వయోరుకటిపై । నిచ్చల్ పిసాళింపఁగా
జాలిం బొందుచు నాత్మఁ గుందుచు మనో । జాతానలోపేతుఁడై. 104

తే. మఱి కులాచారవర్తన । [1]మాలుచేసి, పరఁగుపిత్ర్యములు దాని । పాలు చేసి
సాధులక్షణగుణవృత్తిఁ । జాలుచేసి, లోలలోచనపసఁ జెంది । లోలుఁ డయ్యె.

క. శ్యామఁ గుసుమాస్త్రఖేలన, కామఁ గులస్త్రీలలామఁ । గమనీయగుణ
స్తోమ నిజభామ నొల్లక, [2]ధామమున నటించెఁ గ్రించుఁ । దదన మోదఁ బొడమన్.

ఉ. బంధులఁ దిట్టి సజ్జనుల । బాధలఁ బెట్టి యనాథకోటిఁ బెం
బంచలు సుట్టి యీరములు । వట్టి పథంబులు గొట్టి దిట్టయై
నిందల కోర్చి సాధులకు । నిందితుఁడై గడియించువిత్త మా
సుందరి కిచ్చి మెచ్చికలు । సొంపెదఁ గూర్చి వసించె దత్కృపన్. 107

సీ. సముచితశ్రుతిచర్చఁ । జర్చింప నొల్లక, సతికుచద్వయచర్చఁ । జర్చ సేయుఁ
దర్కకర్కశపాఠ । తర్కంబు గాదని, కలికితోఁ బ్రణయ । తర్కంబు సేయు
స్మృతిపదవాక్యసం । గతి గాక తత్సతి, పదవాక్యసంగతి । పరఁగఁ జేయు
నాటకాలంకార । నైపుణం బుడిగి తె, న్నాటకాలంకార । పాటిఁ దిరుగుఁ

తే. బరఁగఁ బరకాల మీరీతిఁ । బాపనియతి, రమణ దాసీకుటుంబభా । రము వహించి
యదికుటుంబినిగాఁగఁ బా । పాత్ముఁ డగుచు, నశుచియును దుష్టవర్తనుఁ । డై మెలంగె.

క. అట్టు గాన పాపకర్మునిఁ, గుటిలుని సుజనాస్తిఘాతుఁ । గ్రూరుని నే మా
వటమునఁ గొని పోఁదగగ మం, దెట దండమువలన నితఁడు । ధన్యత నొందున్.

వ. ఇట్లు పలుకుచున్న యమదూతల వారించి నయకోవిదులైన భగవద్దూత లిట్లనిరి.

క. అపురా [3]ధర్మవివేక, ప్రపాలపన గాంచఁబడియె । బాపము పుణ్యో
ద్ధృతుల యదండ్యులదండన. వివరం బొనరింపఁబడియె । [4]విధ మెఱుఁగమిచేన్.

చ. సములును సాధులున్ విహిత । శాసనులున్ సుదయాళురున్ శుభ
శ్రోత్రములును నైన యట్టి తలి । దండ్రులు బిడ్డల కెగ్గు సేయుచోఁ
గ్రమ మఱి వార లెవ్వరికిఁ । గైకొని కుయ్యిడఁ జాలువారు సం
భ్రమమతి మీమనంబులఁ దిరంబుగఁ జర్చ యొనర్చి చూడుఁడా. 112

ఆ. ఎఱుక గలుగునాతఁ । డేది యొనర్చిన, నది యొనర్తు రితరు । లైనవార
లతఁడు సత్య మిట్టి । దనెనేని లోకంబుఁ, దప్పి వర్తనమునఁ । దగిలియుండు.

ఆ. నెమ్మిఁ దొడలమీఁద । నిద్రించుచెలికాని, నమ్మఁదగినవాఁడు । నయము విడిచి
ద్రోహబుద్ధిఁ జంపఁ । దొడరునే యెంతైన, భీతి లేక ధర్మ । దూతలార. 114

---

1 'మాటుసేసి' అ. ప్ర. 2 ధామంబు నడంచు క్రించు. 3 ధర్మవిలోక ప్రవరులసభఁ గానఁ. 4 వృథ యగు నేఁటన్.

ఆ. చిత్త మెల్ల నిచ్చి చెలితనంబున వచ్చి, నచ్చి కలయ మెచ్చి నమ్మువానిఁ
గరుణ గలుగువాఁడు కడుసౌమ్యుఁ డగువాఁడు, చింతసేయ కెల్ల సెలుప నేర్చు.
వ. అదియునుం గాక. 116
ఉ. ఈతఁడు కోటిసంఖ్యలకు నెక్కుడుపుట్టువులందుఁ జెంది యా
యాతము లైనపాపనివహంబుల నన్నిటిఁ బాఱఁ దోలి ప్ర
[1]ఖ్యాతమతిన్ మహామరణకాలమునన్ హరిపుణ్యనామసం
భూతసుధామయాద్భుతవిభూతికరాక్షరసంగ్రహంబునన్. 117
సీ. బ్రహ్మహత్యానేకపాపాటవులు కగ్ని,కీలలు హరినామకీర్తనములు
గురుతల్పకల్మషకూరసర్పములకుఁ, గేకులు హరినామకీర్తనములు
తపనీయచౌర్యాఘతమసంబునకు సూర్య,కిరణముల్ హరినామకీర్తనములు
మధుపానకిల్బిషమదనాగసమితికిఁ, గేసరుల్ హరినామకీర్తనములు
తే. మహితయోగోగ్రనిత్యసమాధివిధుల, నలరుబ్రహ్మాదిసురులకు నందరాని
భూరినిర్వాణసామ్రాజ్యభోగభాగ్య, ఖేలనంబులు హరినామకీర్తనములు. 118
సీ. ముక్తికాంతైకాంతమోహనకృత్యముల్, గేలిమై హరినామకీర్తనములు
సత్యలోకానందసౌభాగ్యయుక్తముల్, గేలిమై హరినామకీర్తనములు
మహితనిర్వాణసామ్రాజ్యాభిషిక్తముల్, గేలిమై హరినామకీర్తనములు
బహుకాలజనితతపఃఫలసారముల్, గేలిమై హరినామకీర్తనములు
తే. పుణ్యమూలంబు లనపాయపోషకంబు, లభిమతార్థంబు లజ్ఞానహరణకరము
లాగామాంతోపలబ్ధంబులమృతసేవ, లార్తశుభములు హరినామకీర్తనములు.
క. కామంబు పుణ్యమార్గ,స్థేమంబు మునీంద్రసాంద్రచేతస్సరసీ
ధామంబు విష్ణునిర్మల,నామంబుఁ దలంచువాఁడు నాఘుఁడు కాఁడే. 120
క. డెందంబు పుత్త్రువలనం, జెందిన దని తలఁప వలదు శ్రీపతిపే రే
చందములఁ బలుకఁ గలిగిన, నందకధరుఁ డందుఁ గలఁడు నాఘుం డగుచున్.
ఆ. బిడ్డపేరు వెట్టి పిలుచుట విశ్రామ,కేలి నైన మిగుల గేలి నయినఁ
బద్యగద్యగీతభావార్థములనైనఁ, గమలనయనుఁ దలఁపఁ గలుషహరము. 122
ఉ. కూలినచోటఁ గొట్టుపడి కుందినచోట మహాజ్వరాదులం
బ్రేలినచోట సర్పముఖపీడల నందినచోట నార్తు లై
తూలినచోట విష్ణు భవదూరునిఁ బేర్కొని రేని మీఁద న
క్కాలుని [2]యాతనావితతిఁ గానరు పూనరు దుఃఖభారముల్. 123
సీ. అతిపాపములకుఁ బ్రయత్నపూర్వకముగఁ, దనుపాపముల కమితంబు గాఁగ
సన్మునివరులచే [3]సంపాద్య మై యుండు, నిర్మలం బగుపాపనిష్కృతములు
గ్రమరూపమున నుపశమనంబు లగుఁ గాని, [4]తత్పాపచయములు దలఁప లేవు

1 ఖ్యాతమునన్. 2 యాతనంబులను. 3 సంపాద్య; సంప్రోక్త. 4 తత్క్షణంబుననవి తరుపలేవు.

సర్వకర్మంబుల । సంహార మొనరించి, చిత్తంబునకుఁ దత్త్వ।సిద్ధి నొసఁగు
ఆ. నొనర నీశుసేవ । యోగిమానససరో,వాసుసేవ హేమ।వాసుసేవ
వేదవేద్యుసేవ । వేదాంతవిభుసేవ, పరమపురుషుపాద।పద్మసేవ. 124
క. హరి నెఱుఁగనియాబాలుఁడు, [1]హరిభక్తులతోడఁ గూడి । హరి యనువాఁడున్
సరియై దోషము లడఁచును, గరువలితో నగ్ని దృణముఁ । గాల్చినభంగిన్. 125
ఉ. ఆరయ వీర్యవంత మగు।నౌషధ మెట్లు యదృచ్ఛఁ గొన్నఁ ద
చ్చారుగుణంబు రోగములఁ । జయ్యనఁ బాపెడుమాడ్కిఁ బుణ్యవి
స్ఫారుని నంబుజోదరునిఁ । బామరుఁ డజ్ఞుఁ డవజ్ఞఁ బల్కినన్
వారక తత్ప్రభావము ధ్రు।వంబుగ నాత్మగుణంబుఁ జూపదే. 126
క. ధృతి దప్పినతఱిని బురా,కృతమునఁ గా కెట్లు దోఁచుఁ । గేశవుఁడు మదిన్
మితి లేనిజగముఁ దాల్చిన,యతఁ డొక్కనిమనములోన । నడఁగెడువాఁడే. 127
మ. నిరతంబై నిరవద్యమై నిఖిలచి।న్నిర్మాణమై నిత్యమై
నిరహంకారగుణాఢ్యమై నియమమై । నిర్దోషమై సట్ట్రిశ్రీ
హరినామస్మరణామృతం బితఁడు ప్ర।త్యక్షంబు సేవించెఁ దా
మరణాంతంబున నిట్టిసజ్జనునిధ।ర్మం బేల వ్యర్థం బగున్. 128
వ. అని యిట్లు శ్రీమద్భగవద్దూతలు భాగవతధర్మంబు నిర్ణయించి [2]బ్రాహ్మణుని నతి ఘోరం బయిన యామ్యపాశబంధనిర్ముక్తునిం గావించి [3]యమభటులవలనియుదుటు వాపి రంత నాయమదూత (లాభగవద్దూతలసంభాషణప్రభావంబునఁ దమ మనంబుల శాంతి నొంది భగవత్తత్త్వజిజ్ఞాసు లయి) చేయునది లేక (నిరాకృతులై) యమలోకంబునకుం జని పితృపతికి సర్వంబును నెఱింగించి రంత. 129
క. అతఁడును పాశచ్యుతుఁడై, గతభయుఁడై ప్రకృతి నొంది । కడునుత్సవసం
గతిఁ జూచి మ్రొక్కె మదిలో, నతులితముద మొదవి పొదలి।హరిదాసులకున్.
ఆ. నిలిచి కేలుమొగిచి । పలుక నుద్యోగించి, చెలఁగు చున్నలోని।తలఁపు దెలిసి
చక్రధరునికూర్మి।సహచరు లరిగిర,దృశ్యు లగుచు దేవ।దేవుకడకు. 131
క. వేదత్రయసంపాద్యము, వాదంబు గుణాశ్రయంబు । మొగి భగవద్ధ
ర్మాదేశం బగుతద్భట,వాదంబు నజామిళుండు । వదలక వినుచున్. 132
క. శ్రీమన్నారాయణపద,తామరసధ్యానసలిల।ధౌతమహాఘ
స్తోముం డై సద్భక్తికి, ధామం బగు చుండెఁ దెలిసె । తత్క్షణమాత్రన్. 133
క. బరవసమున నరికట్టిన, దురితంబులఁ దలఁచి తలఁచి । [4]తుదిఁ దాపమునన్
హరి నీశు నాశ్రయించుచుఁ, బరితాపము నొంది పలికె । బ్రాహ్మణుఁ డంతన్.
సీ. వృషలియం దనురాగ।వృద్ధి బిడ్డలఁ గని, కులము గోదావరిఁ । గూలఁ ద్రోచి

1 హరిభక్తుఁడు భక్తితోడ హరియన రెండున్. 2 యీయర్థంబున మీకు సంశయంబు గలదేని మీరాజా నడుగఁ బొం డని పలికి బ్రాహ్మణ. 3 మృత్యువువలనియెడరు వాపి. 4 దురు పెల్లొదవన్.

రచ్చల కెక్కి వెఱ్ఱిॱరజ్జునేఁతల సరి, వారిలోపలఁ దలఁవంపు చేసి
కట్టిఁడిముదుక నై ॱ కర్మబంధంబుల, పుట్ట నై నిందలॱపోవ నగుచుఁ
దరుణులరోఁతలఁ ॱ ద్రవ్వి భోగించిన, కడిఁదినాజన్మంబు ॱ గాలి పోయెఁ
ఆ. జదువు చట్టువడియె ॱ శాస్త్రంబు మన్నయ్యెఁ, బుద్ధి పురువుమేసెఁ ॱ బుణ్య మడఁగె
నీతి మట్టువడియె ॱ నిర్మలజ్ఞానంబు, [1]ముట్ట నుడిగె బోధ ॱ మూరిఁ బోయె.

క. చిక్కనిచక్కనిచన్నుల, మక్కువయిల్లాలి విడిచి ॱ మాయలు గలయా
వెక్కసపుమద్యపానపు, డొక్కపసం దగిలి దుర్విటుఁడ నై చెడితిన్. 136

ఉ. అక్కట ఘోరదుష్కృతమహానలకీలలు నన్ను ముట్టి పె
రుక్కడఁగింప కిల్లు ధృతి ॱ నుండఁగ నిచ్చె నహో దురాత్ముని
గ్రక్కునఁ దల్లిదండ్రుల నకల్మషచిత్తులఁ బెద్దలన్ మతే
దిక్కును లేనివారిఁ బలుॱ[2]త్రిక్కులఁ బెట్టుచుఁ బాఱఁ దోలితిన్. 137

క. అకృతజ్ఞుఁడ నై విడిచితిఁ, బ్రకృతిం గలబంధువులను ॱ బాల్యమునను దు
ర్వికృతిఁ బడ కుండఁ బెంచిన, సుకృతుల మజ్జనకవరుల ॱ శోభనకరులన్. 138

వ. అప్పుడు. 139

ఆ. పెక్కుపాతకముల ॱ భృశదారుణం బైన, దొడ్డనరకమందుఁ ॱ బడ్డనన్ను
నాపదలకుఁ బాపి ॱ యరికట్టి రక్షించి, రిట్టిధర్మపురుషు ॱ లెందువారొ. 140

శా. చోద్యం బై కలవోలె నీక్షణమునం ॱ జూడంగఁ బ్రత్యక్ష మై
వేద్యం బయ్యెను నన్ను నీడ్చినమహాॱవీరుల్ భృశోదగ్రు లా
యుద్యోగంబులవారు పాశధరు లీॱయుత్సాహముల్ మాని సం
పాద్యానేకవికారరూపకుటిలॱప్రఖ్యాతు లెం దేఁగిరో. 141

ఉ. దారుణపాశబంధనవిॱధానములన్ నరకార్ణవంబులోఁ
గూరినవాని నన్నుఁ జెడ ॱ కుండ నొనర్చినపుణ్యమూర్తు లం
భోరుహనేత్రు లుజ్జ్వలనॱభోమణితేజులు లోచనోత్సవుల్
చారుదయాసమంచితవిॱచారులు నల్వురు నెందుఁ బోయిరో. 142

మ. నను రక్షించినపుణ్యవంతులు కనॱన్నాళీకపత్త్రాక్షు లం
జనసంకాశులు శంఖచక్రధరు లాॱజానూరుబాహుల్ స్మితా
నను లాలంబితకర్ణవేష్టనసువॱర్ణచ్ఛాయదివ్యాంబరుల్
ఘనకారుణ్యరసైకపూర్ణులు సమॱగ్రస్ఫూర్తి నెం దేఁగిరో. 143

వ. పాతకుండ నగునాకు నవ్విబుధోత్తమదర్శనంబు పురాకృతంబు లగుపుణ్య(విశే
ష)ంబులం గాని దొరక నేరదు తత్సందర్శనం బాత్మకు నతిసుప్రసన్నం బయి
యొప్పె నట్లుగా కుండెనేనిఁ గలుషవర్తనంబున వృషలీభర్త నై యుండి మృతిఁ

1 నుట్ట నురిఁగె. 2 టీకులఁ.

బొందు చున్ననాదుజిహ్వకు శ్రీమన్నారాయణనామగ్రహణంబు సంభవింప
నేరదు మఱియును. 144

ఆ. పాతకుండ జడుఁడ బ్రహ్మఘాతుకుఁడను, మానలోభమోహమత్సరుండ
నాకు నెట్లు దొరకు నారాయణునిదివ్య,నామవిమలకీర్తనంబు మదికి. 145

సీ. దారుణమోహాంధకారపూరితుఁడను, హరివిస్మయస్మరణార్హమతినె
పంచమహాతీవ్రపాతకోపేతుఁడ, హరివిస్మయస్మరణార్హమతినె
కౌటిల్యకితవవికారపారీణుండ, హరివిస్మయస్మరణార్హమతినె
యఖిలదుఃఖైకఘోరార్ణవమగ్నుండ, హరివిస్మయస్మరణార్హమతినె
తే. నిందలకు నెల్ల నెలవైననిర్గుణుండ, మందభాగ్యుండ నే నేడ మధువిదారి
దివ్యగుణనామకీర్తనతేఱఁగ నేడఁ, బూర్వసుకృతంబుగాకెట్లు పొందఁగలుగు.

వ. అని వితర్కించి. 147

మ. యతచిత్తేంద్రియమానసుండు నగుచున్ యత్నం బొనర్తున్ హరి
వ్రతసంపత్తికిఁ బుణ్యవృత్తికిఁ జిదావాసోన్ముఖాసక్తికిన్
యుతనిర్వాణపదానురక్తికి సుభోద్యోగక్రియాశక్తికిన్
ధృతిలబ్ధోత్తమముక్తికిన్ సకలధాత్రీధుర్యసద్భక్తికిన్. 148

క. విడిచితి భవబంధంబుల, [1]నడఁచితి మాయావిమోహమైనతమంబు
న్నొడిచితి నరివర్గంబులఁ, గడచితి నాజన్మదుఃఖకార్ణవమున్. 149

క. యోషిద్రూపంబున నను, [2]నేషణముఖగహ్వరమున నెగమ్రింగి కడున్
ద్వేషమున గోతి సేసిన, దోషద యగునాత్మమాయఁ దొలఁగం గంటిన్. 150

వ. అని యిట్లు వైష్ణవజ్ఞానదీపం బాత్మస్నేహంబునం దోఁచిన నాబ్రాహ్మణుండు.

మ. భగవద్ధర్మపరాయణోత్తములసంభాషైకమంత్రంబులన్
మిగులన్ జ్ఞానము పుట్ట మోహభవసమ్మిశ్రాత్మబంధంబులం
దెగ ఖండించి సబంధుమిత్రసుతపత్నీమోహవిభ్రాంతుఁడై
జగతీనాథు రమేశు కృష్ణునిదయైశ్వర్యంబులం గోరుచున్. 152

క. హరిభక్తులతో మాటలు, ధర నెన్నఁడుఁ జెడనిపుణ్యధనములమూటల్
వరముక్తికాంతతేటలు, నరిషడ్వర్గంబు చొరనియను దగుకోటల్. 153

సీ. అనుచు నాబ్రాహ్మణుం డతితత్త్వవేదియై, భవబంధముల నెల్లఁ బాఱఁద్రోచి
మొనసి గంగాద్వారమున కేఁగి యచ్చటఁ, [3]బ్రబ్బినదేవతాభవనమందు
నాసీనుఁడై యోగ మాశ్రయించి చెలంగు, దేహేంద్రియాదుల తెరువువలనఁ
దనుఁ బాపుకొని పరతత్త్వంబుతోఁ గూర్చి, మానుగా యోగసమాధిచేత
ఆ. గుణగణంబుఁ బాసి [4]కోమరొప్పినభగవ,దనుభవాత్మయందు నాత్మఁగలిపి

---

1 'జడిసితి మాయావిమోహసంతమసంబున్' వ్రా. ప్ర. 2 'నీషణ...మ్రింగుచు బద్వేషమున.
3 పంబినదేవాలయంబునందు 4 కొనుచును భగవంతుఁడైనయాత్మ' వ్రా. ప్ర.

రమణఁ దన్ను మొదల రక్షించినట్టియా, పురుషవరులఁ గాంచి పొసఁగ మ్రొక్కె.

వ. అట్లజామిళుండు యోగమార్గంబున దేహంబు విడిచి పుణ్యశరీరుం డై యగ్రభాగంబునం బ్రాగుపలబ్ధు లైనమహాపురుషకింకరులం గాంచి సమంచిత[1]రోమాంచితచలచ్ఛటాపింజరితస్వేదబిందుసందోహమిషనిష్యందమహానందవల్లికామతల్లికాంకురసంకులపరిశోభితతనుండును హర్షనికర్షమాణమానసోద్యోగయోగప్రభావోత్సాహవిస్మయమందస్మితకందళితముఖారవిందకందళితుండును [2]నిఖిలజగజ్జేగీయమానాఖండశుభప్రదశుభాకారసందర్శనసమాసాదితకుతూహలమానసుండును నై ప్రణామంబు లాచరించుచు భాగీరథీతీరంబునఁ గళేబరంబు విడిచెం గావునఁ దత్క్షణంబ హరిపార్శ్వవర్తు లైనదాసవరులస్వరూపంబుఁ దాల్చి యావిష్ణుసేవకులతోడం గూడి (దివ్యమణిగణఖచితం బై) సువర్ణ(మయం బైనయసమాన)విమానం బెక్కి సకలమహానందభోగభాగ్యానుభవాకుంఠితం బైనవైకుంఠనగరంబునకు శ్రీమన్నారాయణపదారవిందసేవాచరణపరిణామస్థితికిం జనియె నిట్లు విప్లావితసర్వధర్ముండై నదాసీపతి గర్హితకర్మంబులచేతఁ బతితుండును హతవ్రతుండును నై నరకంబునం గూలుచుండి భగవన్నామగ్రహణంబున సద్యోముక్తుం డయ్యెఁ గావున. 155

క. కర్మంబు లెల్లఁ బాయను, మర్మము దెలుపంగ లేదు మధురిపుపేరే
పేర్మిఁ బఠించుటకంటెను, దుర్మదమునఁ జిత్త మెన్నిత్రోవలఁ జన్నన్. 156

ఉ. పాండవవంశపావన నృపాలక యీయితిహాస మెవ్వఁడే
నొండొకభక్తి లేక విను నొప్పుమెయిం బఠియించు నాతఁ డు
ద్దండత ముక్తికామినికిఁ దానక మై దనుజారిలోకమం
దుండు మహావిభూతి యమదూతలచూడ్కి కగోచరాకృతిన్. 157

తే. అరయఁ బుత్రోపచారిత మైనవిష్ణు, నామ మవసానకాలంబునను భజించి
శార్ఙ్గినిలయంబుఁ జేరె నజామిళుండు, నిట్లు సద్భక్తిఁ బలికిన నేమి సెప్ప. 158

క. కోరినవారల కెల్లను, జేరువ కైవల్యపదము శ్రీవరుని మదిం
గోరనివారల కెల్లను, దూరము మోక్షాప్తి యన్నిత్రోవల నైనన్. 159

వ. అనినం బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె మునీంద్రా యాజ్ఞాభ్రష్టుండై యమధర్మరాజు శ్రీవిష్ణునిర్దేశకులచే విహతు లైనభటులచేత వర్ణింపంబడిననారాయణదేవుని మహానుభావం బాకర్ణించి వారల కేమనియె మఱియు నెన్నఁ డేని యమదండంబు విఫలం బై పోయినతెఱంగు గల దేని వినవలయు నీసందేహంబుఁ బాప (మహాత్మా) నీవు దక్కఁ దక్కినవారలు చాల రని తలంచుచున్నవాఁడఁ జిత్తం

1 'రోమాంచచ్ఛటాజనితస్వేదకణసందోహ. 2 దలితలోచనోత్సవకరాకారసందర్శనానందధారేయుండును నై ప్రణా' వ్రా. ప్ర.

బును బ్రసాదాయత్తంబుగా భవదీయవచనసుధాధారలం బ్రసాదింప వలయు ననిన శుకుం డిట్లనియె. 160

క. శ్రీకృష్ణభటులచేత ని, రాకృతులై యామ్యభటులు ♦ యమునకు నా త్మ
స్వీకృతవిప్రకథాక్రమ, మీక్రియ ముగ్గ దెలిపి రదియు ♦ నెఱిఁగింతుఁ దగన్.

తే. చేరి [1]త్రైవిధ్యమున మించు ♦ జీవతతికిఁ, గర్మఫలములఁ దెలిపెడు ♦ కారణంబు
లగుచుశిక్షించువార లీ ♦ యవనిమీఁద, దేవ యెందఱు గలరయ్య ♦ తెలియవలయు.

క. దక్షిణశాధినాయక, శిక్ష దగం జేయువారు ♦ క్షితిఁ బెక్కం డ్రే
నీశుయమును నశుయమును, సాక్షాత్తు[2]గ నెందు రెండు ♦ సంపన్న మగున్.

తే. దట్ట మైనట్టికర్మబంధముల నెల్ల, నాజ్ఞవెట్టెడువారు పెక్కైనచోట
నకట శాస్తృత్వముపచార ♦ మయ్యెఁగాదె, శూరులైనట్టిమండలేశులకుఁబోలె.

ఉ. కావున నీవ యొక్కఁడవ ♦ కర్తవు మూఁడుజగంబులందు సం
భావితభూతకోటిఁ బరి ♦ పాకవశంబున శిక్ష సేయఁగా
నీవరశాసనం బఖిల ♦ నిర్ణయ మై తనరారు చుండ నేఁ
డీవలఁ గ్రమ్మఱింప మఱి ♦ యెవ్వఁడు శక్తుఁడు ధర్మపాలనా. 165

క. చండకరతనయ యొరులకు, దండధరత్వంబు గలద ♦ తగ జగమున ను
ద్దండధరవృత్తి నొప్పిలి, దండింతువు నిన్ను దండ ♦ ధరుఁ డని పొగడన్. 166

సీ. ఇట్టినీదండంబ ♦ యీమూఁడుజగములఁ, దగువమై నేఁడు వర్తిల్లు చుండ
మనుజలోకంబున ♦ మహితాద్భుతాకార, సిద్ధుల మిగులఁ బ్రసిద్ధులైన
వారు నల్వురు వేగ ♦ వచ్చి నిర్దేశంబు, భంగించి మ మ్మంత ♦ చెంగఁ ద్రోలి
నీశాసనంబున ♦ నే మీడ్చికొని వచ్చు, క్రూరచిత్తునిఁ బుచ్చి ♦ కొని యదల్చి

తే. పాశబంధంబు లీసునఁ ♦ బట్టి త్రెంచి, బలిమి మిగులంగ మమ్మును ♦ బాఱఁద్రోలి
యిచ్చఁ జనినారు వారు దా ♦ మెవటివార, లాదరమ్మున మాకు నేఁ ♦ డానతిమ్ము.

వ. అని రని మఱియు శుకుఁ డిట్లనియె నట్లు దూతలు పరితాపసమేతులై పలికిన దండధరుండు పుండరీకాక్షునిచరణకమలంబులు దనమానసంబున సన్నిహితంబులుగఁ జేసికొని వందనం బాచరించి పరమభక్తిపరుం డై వారల కిట్లనియె.

సీ. కలఁడు మదన్యుండు ♦ ఘనుఁడొక్కఁ[3]డతిఁ డెంపు, వెలికిఁగానఁగరాక ♦ విశ్వమెల్ల
నతిలీలమై మహా ♦ స్యూతసమగ్రస్ఫూర్తి, నుండును గోక నూ ♦ లున్నభంగి
దామెనఁ బశువులు ♦ దగిలి యుండెడుమాడ్కి, నామసంకీర్తన ♦ నర్మగతుల
విహరించు నెవ్వఁడు ♦ విలసితమస్వాజ, లెవ్వనిపదముల ♦ నివ్వటిల్లుఁ

ఆ. గనుట మనుట చనుట ♦ గల్గు నెవ్వనిలీల, లందు లోక మెవని ♦ యందుఁ బొందు
నెన్నఁబడుచుఁ బుడమి ♦ నెవ్వనినామముల్, గర్మబంధనముల ♦ పేర్మి నడఁచు.

తరలము. వినుఁడు నేను మహేంద్రుఁ డప్పతి ♦ వీతిహోత్రుఁడు రాక్షసుం

---

1 త్రైవిధ్య మొనరించు. 2 సాక్షాత్తు మ అవ్వ రంగు. 3 డతనండు.

డనిలుఁ డర్కుఁడు చంద్రుఁడుం గమలాసనుండు మరుద్గణం
బును మహేశుఁడు రుద్రవర్గము భూరిసంయమిసిద్ధులున్
మొనసి కన్గొనఁ జాల రెవ్వనిమూర్తి విశ్రుతకీర్తిమై. 170

క. సత్త్వేతరగుణపాశవ, శత్వంబునఁ బొంద వీరు జలజాక్షునకై
కర్తృత్వంబు గాన నోపరు, సత్త్వప్రాధాన్యు లితరజనములతరమే. 171

చ. అభవు నమేయు నవ్యయు ననంతు ననారతుఁ బూని మేనిలో
నుభయము నై వెలుంగుపురుషోత్తముఁ గానరు చిత్తకర్మవా
గ్విభవగరిష్ఠులై వెదకి పీఱిఁడిప్రాణులు సర్వవస్తువుల్
శుభగతిఁ జూడ నేర్చి తనుఁ జూడఁగ నేరనికంటిపోలికన్. 172

చ. పరముని భక్తలోకపరిపాలనశీలుని దుష్టలోకసం
హారుని పతంగపుంగవవిహారునికూరిమిదూత లామనో
హరులు సురేంద్రవందితులు నాహరిరూపగుణస్వభావులై
తిరుగుచు నుందు రెల్లెడల దిక్కులఁ దేజము పిక్కటిల్లఁగన్. 173

ఉ. లెక్కకు [1]నెక్కు వై కసటు లేనిమహాద్భుతతేజ మెల్లెడం
బిక్కటిలం జరింతు రతిభీమబలాఢ్యులు విష్ణుదూత లా
చక్రనిధర్మశాంతు లతిసాహసవంతులు దేవపూజితుల్
గ్రిక్కిటి నీజగంబునను కేశవసేవకరక్షణార్థమై. 174

క. నావలనను మీవలనను, దేవాసురగణమువలనఁ ద్రిజగంబులలో
నేవగలఁ బొంద కుండఁగఁ, గావం గలవారు పుడమిఁ గలవైష్ణవులన్. 175

క. భగవత్ప్రణిహితధర్మం, బగపడ దెవ్వారిమతికి ననిమిషగరుడో
రగసిద్ధసాధ్యనరసుర, ఖగతాపసయక్షదివిజఖచరుల కైనన్. 176

క. ఎన్నఁడుఁ దెలియఁగ నేరరు, పన్నగపతిశాయితత్త్వభావము మేనం
గన్నులవేల్పును డాపలఁ, జన్నమరినవేల్పు ముదుకచదువులవేల్పున్. 177

సీ. వరమహాద్భుత మైనవైష్ణవజ్ఞానంబుఁ, దిరముగా నెవ్వరు దెలియఁ గలరు
దేవాదిదేవుండు త్రిపురసంహరుఁ డొండెఁ, గమలసంభవుఁ డొండెఁ గార్తికేయ
కపిలనారదులొండెఁ గంగాత్మజుం డొండె, మనువొండె బలియొండె జనకుఁ డొండె
బ్రహ్లాదుఁ డొండె నేర్పాఱుగా శుకుఁ డొండె, భాసురతరమతి వ్యాసుఁ డొండెఁ
తే. గాక యన్యులతరమె యీలోకమందు, నీసుబోధంబు సద్బోధ మీపదార్థ
మీసదానందచిన్మయ మీయగమ్య, మీవిశుద్ధంబు గుహ్యంబు నీశుభంబు.

క. ఈపన్నిద్దఱు దక్కఁగ, నోపరు తక్కొరులు దెలియ నుపనిషదుచిత
[2]శ్రీపతినామమహాద్భుత, దీపితభాగవతధర్మదివ్యక్రమమున్. 179

తే. ఏది జపియింప నమృతమై యెసఁగుచుండు, నేది సద్ధర్మపథమని [3]యెఱుఁగఁదగిన

1 మిక్కులై. 2 శ్రీపరిణామమహా. 3 యెన్నఁబడును.

దదియె సద్భక్తియోగంబు । నలవరించు, మూర్తిమంతంబు దా హరికీర్తనంబు.

తే. కంటిరే మీరు సుతులార । కమలనేత్రు, భవ్య మగునామకీర్తన।ఫలము నేఁడు
దవిలి మృత్యువుపాశబం।ధములవలన, జాణతనమున నూడె న।జామిళుండు. 181

ఉ. ఏటికి జాలిఁ బొంద నరు । లీక్రియ కృష్ణునికీర్తనంబు పా
పాటవులన్ దహింపఁ గల । దాటకు సందియ మేల యిప్పు డీ
తూఁటరి దోసకారి పెను।దోషి యజామిళుఁ డంత మొందుచుం
బాటిగ విష్ణునామసుతుఁ । బల్కుచుఁ గేవలముక్తిఁ గేఁగఁడే. 182

క. ఇంతయును దథ్య మని మది, నింతయుఁ దెలియంగ లేరు । హీనాత్ములు దు
ర్దాంతతరఘటితమాయా, క్రాంతాత్యంతప్రకాశ।గౌరవజడులై. 183

మంగళమహాశ్రీవృత్తము.

[1]ఈవిధమునన్ విబుధు । లేకతమ చిత్తముల । నేకతము లేక హరి నీశున్
భావమున నిల్పి తగు।భాగవతయోగపరి।పాకమున నొందుదురు వారిం
దే వలదు దండనగ।తిం జనదు మాకు గుఱి।తింప నఘముల్ దలఁగు మీఁదన్.
శ్రీవరునిచక్రము వి।శేషగతిఁ గాచు సుర।సేవితులు ముక్తిఁ గనుఁబెద్దల్.

ఉ. ఎవ్వరు సిద్ధసాధ్యఖచ।రేశలసత్పరిగీతగాథలం
దెవ్వరు ముక్తిభోగతల।హేమమనోహరచంద్రశాలలం
దెవ్వరు శంఖచక్రగురు।హేతిగదారుచిరోగ్రపాణు లా
మవ్వపురూపవంతు లస।మానులు వో ధరలోనివైష్ణవుల్. 185

సీ. శ్రుత్యంతవిశ్రాంత।మత్యనుక్రమణీయ, భగవత్ప్రసంగతుల్ । భాగవతులు
సనకాదిమునియోగి।జనసదానందైక, పరమభాగ్యోదయుల్ । భాగవతులు
కృష్ణపదధ్యాన।కేవలామృతపాన, పరిణామయుతులు శ్రీ।భాగవతులు
బహుపాతకానేక।పరిభవప్రక్రియా, పరుషోగ్రమూర్తులు । భాగవతులు

తే. భావతత్త్వార్థవేదులు । భాగవతులు, బ్రహ్మవాదానువాదులు । భాగవతులు
సిరులు దొలఁకంగ నెన్నఁడుఁ। జేటులేని, పదవి నొప్పారువారు వో । భాగవతులు.

క. అది గాన విష్ణుభక్తులఁ, గదియఁగఁ జన వలదు మీరు । కరివరదులస
త్పదపద్మవినతివిముఖులఁ, దుది నంటఁగఁ గట్టి తెండు । ధూర్తులు వారల్.

సీ. ఎకసక్కెమునకైన । నిందిరారమణుని, బలుకంగ లేనిదు।ర్భాషితులను
గలలోన నైన శ్రీ।కాంతునిసత్పాద, కమలముల్ నూడని।కర్మదృశుల

1 ఇది 'ఈవిధమునన్ విబుధు।లేచి తమచిత్తముల । నేకతము లేక పర।మేశు హరి నీశున్.
భావమున నిల్చి తగు।భాగవతయోగపరి।పక్వమున నొందుదురు । పాలుపడి వారిం, దే వలదు దండ
నగ।తిం జనగు మాకు గను।తింప నఘముల్ దొలఁగుఁ।దెల్ల మనుమీఁదన్, శ్రీవరునిచక్రము వి।శే
షగతిఁ గాచు సుర।సేవితులముక్తిఁ గనుఁ।జెందుదురు పెద్దల్' అని వ్రాఁతప్రతుల యందు గ్రాహ్యముగా
నున్నది.

నవ్వుచు నైనఁ గృష్ణప్రశంసకుఁ జెవిఁ, [1]దార్ప నేరనిదుష్కథాప్రవణుల
యాత్రోత్సవంబుల నైన నీశునిగుడి, త్రోవఁ ద్రొక్కఁగ లేనిదుష్పదులను.

ఆ. బరమభాగవతులపాదధూళిసమస్త, తీర్థసార మనుచుఁ దెలియ లేని
వారి వారివారి వారిఁ జేరినవారిఁ, దోలుతఁ గట్టి తెండు దూతలార. 188

ఆ. ఎల్లపాపములకు నిల్లైనయింటిలో, బద్ధతృష్ణు లగుచు బుద్ధి దలఁగి
పరమహంసకులము గుఱి దప్పి వర్తించు, ధూర్తజనులఁ దెండు దూతలార.

ఆ. అరయఁ దనదుజిహ్వ హరిపేరు నుడువదు, చిత్త మతనిపాదచింతఁ జనదు
తలఁపఁ దమకు ముక్తి తంగేటిజున్నొకో, సకలవిష్ణుభక్తులకునుబోలె. 190

ఆ. పద్మనయనుమీఁదిభక్తియోగంబెల్ల, ముక్తియోగమనుచు మొదలెఱుంగు
వారి వారివారి వారిఁ జేరినవారి, త్రోవఁ దలఁప వలదు దూతలార. 191

వ. అని పలికె నని చెప్పి మఱియు శుకుం డిట్లనియె శ్రీకృష్ణనామకీర్తనంబు జగన్మంగళం బనియును [2](జగన్మోహనం బనియును) జగజ్జేగీయమానం బనియును నిఖిలపాపైకనిష్కృతి యనియును నిఖిలదుఃఖనివారణం బనియును నిఖిలదారిద్ర్యనిర్మూలనం బనియును నిఖిలమాయాగుణవిచ్ఛేదకం బనియును నుద్దామంబు లగు హరివీర్యంబుల నాకర్ణించువారలచిత్తంబు లతినిర్మలంబు లగుభంగిం దక్కినవ్రతాచరణంబులం గా వనియును శ్రీకృష్ణపదపద్మంబులు హృత్పద్మంబుల నిలుపువార లన్యపాపకర్మంబు లగునవిద్యావ్యసనంబులం బొరయనేర రనియును నిజస్వామి యైన(యమ)ధర్మరాజుచేతఁ గీర్తింపంబడినభగవన్మహత్త్వంబు నాకర్ణించి విస్మితులై కాలకింకరులు నాఁటనుండియు వైష్ణవజనంబులం దేఱి చూడ వెఱతురు నరేంద్రా పరమగుహ్యం బగునీయితిహాసంబును బూర్వకాలంబున సకలవిజ్ఞానగోచరుం డైనకుంభసంభవుండు నఖిలదుఃఖవిలయంబును (సకలపుణ్యనిలయంబును) నైనమలయంబునఁ బురాణపురుషుం డైనపురుషోత్తము నారాధనంబు సేయుచుండి నా కెఱింగించె నని చెప్పిన విని విస్మయానందహృదయుం డై పరీక్షిజ్జనపాలుం డిట్లనియె. 192

క. స్వాయంభువమనువేళల, నోయయ్య సురాసురాండజోరగనర[3]వ
ర్గాయతసర్గము దెలిపితి, పాయక వినవలయుఁ దెలియఁ బలుకం గదవే. 193

క. ఉత్తరకొడు కిట్లడిగిన, నుత్తరమును సమ్మునీంద్రుఁ డుత్తమచేతో
వృత్తి ముద మంది పలికెను, దత్తఱపా టుడిగి వినుఁడు తాపసవర్యుల్. 194

సీ. పూని ప్రచేతసుపుత్త్రులు పదుగురు, ప్రాచీనబర్హిషప్రాఖ్యఁ గలుగు
వారు మహాంభోధివలన వెల్వడి వచ్చి, తగ వృక్షవృత మైనధరణిఁ జూచి
మేదినీజములపై మిక్కిలి కోపించి, మదిలోన దీపితమన్యు లగుచు

---

1 జొఱవేయనిదుష్కథాభిరతుల. 2 'జగజ్జయం బనియు జగచ్ఛరణ్యం బనియు జగచ్ఛ్లాఘ్యం బనియు నిఖిలపాపై. 3 సర్గాయతము గలిగె నంటివి.

వక్త్రంబులను మహావాయుసంయుతమైన, యనలంబుఁ గల్పించి యవనిజములఁ

తే. [1]బెల్లు వడఁ గాల్పఁ దొడఁగినఁ దల్లడిల్లి, వారికోపంబు వారించువాఁడపోలెఁ
బలికెఁ జందురుఁ డో మహాభాగులార, దీనమగు వృక్షములమీఁదఁ దెగుటదగునె.

తే. మొదల వరిష్ఠు లగుమిమ్ము సదయహృదయు
లగు ప్రజాపతు లనుచు సర్వాత్ముఁ డనియె
నట్టిమీరు ప్రజాసృష్టికై నవార
లీవనస్పతితతుల దహింపఁ దగునె, 196

సీ. ఆదికాలంబున నా ప్రజాపతి[2]పతి, యైనలోకేశ్వరుం డచ్యుతుండు
పద్మనేత్రుఁడు వన[3]స్పతుల నోషధిముఖ్య, జాతంబు నిషము నూర్జంబుఁ గోరి
కల్పించె నందు ముఖ్యంబైన యన్నంబు, నచరంబు, లైనట్టి యపద మెల్లఁ
బాదచారులకును బాల్వెట్టి యిరుగాళ్లఁ, జేతులు గలిగిన జీవతతికి

తే. [4]పాణు లొగి లేని యాచతుష్పాత్తు లెల్ల, నన్నముగఁ బూని కాపించె నదియుఁగాక
నా మహాభాగుఁ డచ్యుతుఁ డాదరమున, మీకు ననఘాఖ్యవిఖ్యాతి జోకపఱచె.

క. నిజముగ దేవాధీశ్వరుఁ, డజుఁడు ప్రజాసర్గమునకు ననఘుల మిమ్ముం
సృజియించె నిట్టివారికిఁ, గుజదహనము సేయ నెట్లు గోరిక వొడమెన్. 198

చ. సతత మహత్త్వసత్త్వగుణసత్పురుషస్తుతిఁ బొందరయ్య మీ
పితరులునుం బితామహులుఁ బెద్దలు నెన్నఁడుఁ బొందనట్టిదు
ష్కృతిమత మైనకోపమునఁ గిల్బిషభావము మానరయ్య సం
భృతకరుణావలోకమున భీతతరుప్రకరంబుఁ జూచుచున్. 199

ఉ. తప్పక [5]యర్భకావళికిఁ దల్లియుఁ దండ్రియు నేత్రపంక్తికిం
ఱెప్పలు నాతికిం [6]బతియు ఱేఁడు ప్రజావళి కెల్ల నర్థికిం
బొప్ప గృహస్థు మూఢులకు నుత్తము లెన్న సమస్తబాంధవుల్
ముప్పునఁ గావ లేనికడు మూర్ఖులు గాఁగ నిజాలచుట్టముల్ 200

సీ. అఖిలభూతముల దేహాంతస్థమగునాత్మ, యీశుఁ డచ్యుతుఁ డని యెఱుఁగవలయు
నెఱిఁగి సర్వంబైన యిందిరారమణు లోఁ, జూపులఁ దనివిగాఁ జూడ వలయుఁ
జూచిన చిద్రూపశుద్ధాత్ము లగుమిమ్ము, నెనసిన వేడ్కతో నిచ్చ మెచ్చు
మెచ్చిన సర్వాత్ము మీ రెఱింగిన చోటఁ, గోపగుణంబులఁ బాప వలయుఁ

ఆ. బాపి దగ్ధశేషపాదపజాలంబు, దియ్య మెసఁగఁ బ్రదుక నియ్యవలయు
ననఘులార మీర లస్తదీయప్రార్థనంబు పరఁగఁ జేకొనంగ వలయు. 201

క. ఇదె వృక్షసముద్భవ యగు, మదిరేక్షణ [7]నాప్సరసిఁ గుమారిక నిత్తుం
వదలక పత్నిఁగఁ జేకొని, ముద మందుఁడు పాదపముల మోసము వాయన్.

---

1 'పొల్లు సెడ. 2 తండ్రియైన. 3 స్పతులను నోషధిజాతంబు. 4 బాహువులు లేని యాచతుష్పదుల నెల్ల, 5 యెల్లవారలకు. 6 బలి ♦ విరించి ప్రజాళికి భిక్షుకోటికిం. 7 నాప్సరీకుమారిక' వ్రా ప్ర.

వ. అని యిట్లామంత్రణంబు సేసి మారిష యనుకన్యకను వారల కిచ్చి చంద్రుం
డు సనియె నప్పుడు. 203

క. వారలు పర్యాయంబున, నీరేజముఖిన్ వరించి ♦ ♦ నెఱి రమియింపన్
ధీరుఁడు ప్రాచేతసుఁ డై, వారక దక్షుండు వుట్టె ♦ వనజజసముఁ డై. 204

క. ఎవ్వనిసంతానంబులు, నివ్వటిలెన్ వసుధ నెల్ల ♦ నెఱి నాదక్షుం
డివ్వాలన జగము లన్నిటఁ, బ్రవ్వ జలము నిలిపినట్లు ♦ ప్రజఁ బుట్టించెన్. 205

ఉ. వారని వేడ్కతో దుహితృ♦వత్సలదక్షుఁడు దక్షుఁ డాత్మలోఁ
గోరి సృజించెఁ గొన్నిటి న♦కుంఠితవీర్యముచేతఁ గొన్నిటిన్
బోరన ఖేచరంబులను ♦ భూచరముఖ్యవనేచరంబులన్
నీరచర వ్రజంబు రజ♦నీచరజాలదివాచరంబులన్. 206

క. నరసురగరుడోరగకి, న్నరదానవయక్షపక్షి♦నగవృక్షములం
దర మిడి సృష్టి యొనర్చెను, -దిరముగ దక్షప్రజాప♦తి వితతకీర్తిన్. 207

క. బహువిధముల బహుముఖముల, బహురూపము లైనప్రజల ♦ బహులోకములన్
బహుళముగఁ జేసి మదిలో, బహుమానము నొందఁడయ్యెఁ ♦ బ్రఖ్యాతముగన్.

తే. [1]ఆప్రజాసర్గబృంహితం ♦ బయినజగము
దక్షుఁ డీక్షించి మదిలోనఁ ♦ దాప మొంది
మఱియు జననంబు నొందించు♦మతము గోరి
పరమపురుషుని నాశ్రయిం♦పంగఁ దలఁచె. 209

వ. ఇట్లు దక్షప్రజాపతి ప్రజాసర్గంబు సాలక చింతించి మంతనంబున లక్ష్మీకాంతుని
సంతుష్టస్వాంతుం జేయువాఁ డై. 210

క. మోదం బై పరిదూషిత, ఖేదం బై శాబరీద్ధ♦కిలికించితద్రు
చ్ఛదం బై బహుసౌఖ్య,పాదం బై యొప్పువింధ్య♦పాదంబునకున్. 211

వ. ఇట్లు వింధ్యపాదంబున కరిగి యం దఘమర్షణం బనుతీర్థంబు సర్వదురితహరం
బయి యొప్పుదాని ననుసవనంబు సేవించి యతిఘోరం బైనతపంబు సేయుచు
హరిం బ్రసన్నుం జేసి హంసగుహ్యం బను స్తవరాజంబున ని ట్లని స్తుతియించె.

-దక్షుఁడు స్తుతియించినహంసగుహ్యం బను స్తవరాజము.-

తే. పరమునికి వందనము సేతుఁ ♦ బరిభవించి
మున్నవితథానుభూతికి ♦ మ్రొక్కికొందు
మెఱయ గుణములఁ [2]దెలుని♦మిత్తమాత్ర
బంధు వై నట్టివానికిఁ ♦ బ్రణతి సేతు. 213

ఆ. తవిలి గుణులచేతఁ ♦ దత్త్వబుద్ధులచేత. నిగిడి కాన రాని♦నెలవువాని
మొదలఁ దాన కలిగి ♦ ముక్తిమానావధి,రూపుఁజెందువాని♦ప్రాపుఁ గందు. 214

1 అంత సర్గంబు బృంహిత ♦ మైనఁ జూచి, దక్షుఁ డెంతయు మదిలోన. 2 దెలుప నిమిత్త.

ఆ. ఎల్లతనువులందు నిరవొంది తనతోడఁ, బొందుసేసినట్టి పొందుకాని
పొందువొందలేఁడు పురుషుండు [1]గుణము నా, గుణినిఁబోలునట్టి గుణి భజింతు.

ఉ. పూని మనంబునుం దనువు భూతములున్ మఱి యింద్రియంబులుం
బ్రాణములున్ వివేకగతిఁ బాయక యన్యముఁ దమ్ము నెమ్మెయిం
గానఁగనేర వాగుణనికాయములం బరికించునట్టిస
ర్వానుగతున్ సమస్తహితు నాదిమపూరుషు నాశ్రయించెదన్. 216

వ. మఱియు [2]ననేకవిధనామరూపనిరూప్యం బగుమనంబునకు దృష్టస్మృతులనాశం బువలనఁ గలిగెడు నుపరామం బగుసమాధియందుఁ గేవలజ్ఞానస్వరూపంబునఁ దోఁచునిర్మలప్రతీతిస్థానం బైనహంసస్వరూపికి నమస్కరింతుఁ దారువందు నతిగూఢం బైనవీతిహోత్రుని బుద్ధిచేతం బ్రకాశంబు నొందించుభంగి బుద్ధిమంతులు హృదంతరంబున సన్నివేశుం డయినపరమపురుషుని [3]నాత్మశక్తిత్రయంబుచేతం దేజరిల్లఁ జేయుదు రట్టిదేవుండు సకలమాయావిచ్ఛేదకం బయిన నిర్వాణసుఖానుభవంబునం గూడి యుచ్చరింపం గోలంది గానిశక్తి గలవిశ్వరూపుండు నాకుం బ్రసన్నుం డగుం గాక వాగ్బుద్ధీంద్రియమానసంబులచేతం జెప్పను నిట్టి దని నిరూపింపను నలవి గాక యెవ్వనిగుణరూపంబులు వర్తించు నెవ్వండు నిర్గుణుండు సర్వంబు నెవ్వనివలన నుత్పన్నం బగు నెవ్వనివలన స్థితిం బొందు నెవ్వనివలన లయం బగు నట్టిపరాపరంబులకుం బరమం బై యనన్యం బై (ప్రా)క్ప్రసిద్ధం బై యదియ బ్రహ్మం బై యాదికారణం బై యున్నతత్త్వంబు నాశ్రయింతు నెవ్వనిప్రభావంబు మాటలాడెడువారలకు వాదంబు సేయువారలకు వివాదస్థలంబు లగుచు నప్పటప్పటికి మోహంబు నొందించుచుండు నట్టి యనంతగుణంబులు గలమహాత్మునకు నతిభక్తిం బ్రణామంబు సేయుదు నస్తి నాస్తి యనువస్తుద్వయనిష్ఠలం గలిగి యొక్కటన యుండి విరుద్ధధర్మంబులుగఁ గనంబడునుపాసనాశాస్త్రసాంఖ్యశాస్త్రంబులకు సమం బై వీక్షింపఁదగినపరమంబు నాకు ననుకూలం బగుం గాక యెవ్వఁడు జగదనుగ్రహంబుకొఱకు జన్మకర్మంబులచేతి నామరూపంబు లెఱుంగంబడకుండియు నామరూపంబులు గలిగి తేజరిల్లు నట్టియనంతుం డయినభగవంతుండు ప్రసన్నుం డగుం గాక యెవ్వండు జనులకుఁ బురాకృతజ్ఞానపదంబులచేత నంతర్గతుం డై మేదినిం గలుగుగంధాది గుణంబుల నాశ్రయించినవాయువుభంగి మెలంగుచుండు నాపరమేశ్వరుండు మదీయమనోరథంబు సఫలంబు సేయుం గాక యనుచు భక్తిపరవశుం డయి

---

1 'గుణకర్త, గుణముఁ బోలునట్టి. 2 నామరూపంబుల రూపవిభవంబునకు దృష్టిస్మృతిసంప్రమోషంబువలన నేప్రకారంబునఁ బొందరాక తమందులం గలసుజ్ఞానంబుచేత నేది యెఱుంగంబడుచుండు నట్టితేజోధామం బైనపరమహంసంబునకు నమస్కరింతు. 3 నాత్మశక్తు లైన నపద్రవ్యంబులచేత నశక్తిత్రయంబులచేతను దేజరిల్లు' వ్రా. ప్ర.

యుక్తివిశేషంబున స్తుతియించుచున్నదక్షునికి భక్తవత్సలుం డైన శ్రీవత్సలాంఛ
నుండు ప్రాదుర్భావంబు నొందె నప్పుడు. 217

సీ. భర్మాచలేంద్ర ప్రపాతద్వయంబునఁ, గలిగిననీలంపుఁ గను లనంగ
మొనసి తార్క్ష్యునియిరు మూఁపుపై నిడినట్టి,పదములకాంతులు పరిఢవింపఁ
జండదిఙ్మండల శుండాలకరముల, కైవడి నెనిమిది కరము లమరఁ
జక్రకోదండాసి శంఖనందకపాశ,చర్మగదాదుల సరవిఁ బూని

ఆ. నల్లమేను మెఱయ నగుమొగం బలరంగఁ, జల్లచూపు విబుధసమితిఁ బ్రోవ
బసిఁడికాసెఁ బూని బహుభూషణకిరీట,కుండలములకాంతి మెండుకొనఁగ.

సీ. కుండలమణిదీప్తగండస్థలంబులు, పూర్ణేందురాగంబుఁ బొనుఁగుపఱుప
దివ్యకిరీటాంత దీప్తు లంబరరమా,సతికిఁ గౌసుంభవస్త్రంబు గాఁగ
వక్షస్స్థలంబుపై వనమాలమాలిక, శ్రీవత్సకౌస్తుభ శ్రీల నొఱయ
నీలాద్రిఁ బెనఁగొని నిలిచినవిద్యుల్ల,తలభాతిఁ గనకాంగదములు మెఱయ

ఆ. నఖిలలోకమోహనాకారయుక్తుఁ డై, నారదాదిమునులు సేరి పొగడఁ
గదిసి సురలు గొలువ గంధర్వకిన్నర,సిద్ధగానరవము సెవుల నలర. 219

క. సర్వేశుఁడు సర్వాత్ముఁడు, సర్వగతుం డచ్యుతుండు సర్వమయుం డై
సర్వంబుఁ జేరి కొలువఁగ, సర్వగుఁ డై దక్షునకుఁ బ్రసన్నుం డయ్యెన్. 220

వ. ఇట్లు ప్రసన్నుం డయినసర్వేశ్వరుని సర్వాంకషంబును మహైశ్వర్యధుర్యంబును
నయి తేజరిల్లుదివ్యరూపంబుఁ గాంచి భయంబును హర్షంబును విస్మయంబును
జిత్తంబున ముప్పిరిగొని చొప్పు దప్పింపం దెప్పిఱి కప్పరపాటునం బుడమిపై
నిడుసాఁగిలం బడి దండప్రణామంబు లాచరించి కరకమలంబులు మొగిడ్చి సెల
యేఱులతోట్టునఁ గొట్టువడి యుట్టుట్టుఁ బట్టుచాలక నిట్టవొడిచి మున్నీరు దన్నిని
లిచినపెన్నీరునుంబోలె సర్వాంగంబులుం దొంగలింపఁ జిత్తంబు నాత్మాయత్తం
బు సేసి పిక్కటిల్లినసంతోషంబుచేత భగవంతుం బలుకను నత్యంతమంగళసం
దోహపాదకంబు లైనతన్నామంబు లుగ్గడింపను నతినిర్మలంబు లయినతదీయ
కర్మంబులు దడవను విబుధహర్షకరంబు లైనతత్పౌరుషంబులు వొగడను నా
త్మీయమనోరథంబు వాక్రువ్వను నోపక ప్రజాకాముం డై యూర కున్నప్రజా
పతిం జూచి సర్వజీవదయాపరుండును సర్వసత్త్వహృదంతరస్థుండును సర్వ
జ్ఞుండునుం గావున నతనిభావంబు దెలిసి జగన్నాథుం డార్తపోషణంబు లైనభాష
ణంబుల ని ట్లనియె. 221

క. మెచ్చితిఁ బ్రాచేతస తప, మిచ్చట ఫలసిద్ధి యయ్యె ని ట్లతిభక్తిన్
హెచ్చగుమద్భవవిభవము, నచ్చుపడం బొంద నెవ్వఁ డర్హుఁడు జగతిన్. 222

ఆ. తపము సాలు నింకఁ దగ భూతతతికి వి,భూతు లొనరుఁ గాక పొందుపడఁగ
నిదియ సుమ్ము మాకు నిచ్చలోఁ గలకోర్కి, పొసఁగ నీదువలనఁ బొందుపడియె.

వ. వినుము బ్రహ్మయు భర్గుండును బ్రజాపతులును మనువులును నింద్రులును నిఖిల భూతంబులకు భూతిహేతువు లయినమద్విభూతివిభవంబులు మఱియు నాకు (యమనియమాదిసహితసంధ్యావందనాదిరూపం బగు)తపంబు [1]హృదయంబు సాంగజపవద్ధ్యానరూపం బగువిద్య శరీరంబు ధ్యానాదివిషయపుంవ్యాపారం బు గా నుండుభావనాదిశబ్దవాచ్యం బగు క్రియ యాకృతి క్రతుజాతంబు లంగంబులు ధర్మం బాత్మ దేవతలు ప్రాణంబులు నిగమంబు మత్స్వరూపంబు (జగదుత్పత్తికి నాదియందు నే నొక్కండన తేజరిల్లుచుంటి) బహిరంతరంబుల (వే ఱొక్కటి) లేక (సుషుప్త్యవస్థయందు) సర్వంబు [2]లీనం బగుటం జేసి సంజ్ఞామాత్రుండును నవ్యక్తుండునుగా నుండుజీవునిభంగి నొక్కండన యుండుదు ననంతుండనై యనంతగుణంబులు గలమాయాగుణంబువలన గుణవిగ్రహం బగుబ్రహ్మాండంబును నయోనిజుండు స్వయంభువు నగుబ్రహ్మయును నుదయించిరి మదీయవీర్యోపబృంహితుం డయి మహాదేవుం డగునాబ్రహ్మ యసమర్థుండునుం బోలె నకృతార్థమ్మన్యమానమనస్కుం డయి సృజింప నుద్యమించుతఱిఁ దపం బాచరింపు మని నాచేత బోధితుండై ఘోరం బైనతపం బాచరించి తొలుత సృష్టికర్తృత్వంబు వహించినమిమ్ము సృజియించె నంతఁ బంచజనప్రజాపతితనూజ యగునసిక్ని యనుపేరిట వినుతి నొందియున్నయిక్కన్యకను నీ కిచ్చితి దీనిం బత్నిఁగాఁ గైకొని మిథునవ్యవాయధర్మంబు గలవాఁడవై మిథునవ్యవాయధర్మంబు గలయీనాతియందుఁ బ్రజాసర్గంబు నతివిపులంబుగఁ గావింపం గలవాఁడవు మఱియు నీకుఁ బిదప నీక్రమంబున నిఖిలప్రజలును మన్మాయామోహితు లయి మిథునవ్యవాయధర్మంబునఁ బ్రజావృద్ధి నొందించి మదారాధనపరులై యుండఁ గలవా రని పలికి విశ్వభావనుం డైనహరి స్వప్నోపలబ్ధార్థంబునుంబోలె నంతర్ధానంబు నొందె నప్పుడు దక్షుండు విష్ణుమాయోపబృంహితుం డై (పాంచజనియగు)నసిక్నియందు హర్యశ్వసంజ్ఞల (వినుతిఁ జెంది యున్నయయుతసంఖ్యాపరి

1. 'బ్రహ్మంబు శరీరంబు క్రియ యాకృతి.' 2 'నేన యై యుండుదు నవ్యక్తంబు సంజ్ఞామాత్రంబు గలిగి యొక పాలక నిద్రించు నానిభంగి విశ్వంబువలన నేమియు బహిరంతరంబులు లేక యుండుదు ననంతుండనై యనంతగుణంబులు గల నాగుణంబువలన గుణవిగ్రహంబు పుట్టె నావిగ్రహంబువలన నాథ్యుండై స్వయంభు వై నయజుం డయ్యె మదీయవీర్యోపబృంహితుం డై మహాదేవుం డై స్వసర్గకర్మంబుల యం దశక్తుం డై యఖిలంబును నశ్వంగాఁ దలంచె దారుణం బైనతపంబువలన నాచే భేదితంబుగాఁ జేసి నవబ్రహ్మలై నమస్కృ నేవిధిఁ బ్రభువై సృజించె నట్టిపంచజనప్రజాపతికిసుహితయైన యసిక్ని యనంబడునిక్కన్యక నిచ్చితి దీనిం బత్నిగాఁ గైకొని మిథునవ్యవాయకర్మంబు గలిగి ప్రజాసర్గంబు గావింపుము మిథునవ్యవాయధర్మిణి యందు భూతసంఘంబును గలిగింప విశ్వయించి నీవలన నుత్పన్నం బైనప్రజ లెల్లను మిథునీభూయంబులై మదీయమాయచేతం బుట్టుచు మత్సేవాపరు లగుదురు గాక యని పలికి విశ్వభావనుం డైనహరి' వ్రా. ప్ర.

గణితులైన పుత్రులం దశసహస్రంబులం బుట్టించె నప్పుడు ధర్మశీలు రైన దాక్షాయణులు పితృనిర్దేశంబునం బ్రజాసర్గంబుకొఱకుం దపంబు సేయువారై పశ్చిమదిశకుం జని యచ్చట నారాయణసరస్సనం బరఁగు తీర్థరాజం బై సింధుసముద్రసంగమంబున నొప్పుచుండి సమస్తదేవమునిసిద్ధగణసేవితంబై దర్శనస్పర్శనాలోకనమాత్రంబున నిర్ధూతకల్మషులను నిశ్చలధర్మపరులను నిర్మలచిత్తులనుం జేయుచున్న యప్పుణ్యతీర్థంబున నవగాహనంబు సేసి నిర్మలాంతరంగులై పరమహంసధర్మంబునందు నుత్పన్నమతులై ప్రజాసర్గంబుకొఱకుం దండ్రియను మతంబున నుగ్రతపంబు సేయుచుండ వారికడకు నారదుండు వచ్చి యిట్లనియె.

సీ. మీ రతిమూఢులు । మీఁదటిగతి గాన, రెన్నంగఁ బసిబిడ్డ । లన్నలార
పుడమి దా నింతని । కడఁ బరికింపరు, ప్రజలఁ బుట్టింప నే । ప్రతిభ గలదు
అట్లైన నొక్క మ । హాత్ముఁడు పురుషుండు, బహురూపములు గల । భామయొకతె
[1]పుంశ్చలి గర్తంబుఁ । బురణింప నుభయప్ర, వాహంబు గలనది । వఱలఁ గదల

ఆ. నంచ యొకటి యిరువ । దైదింటిమహిమలఁ, గలిగి యుండు తెరువు । గాన రాక
వజ్రనిబిడ మగుచు । వసుసఁ దనంతన, తిరుగుఁ [2]గాష్ఠబిలము । దేటపడఁగ.

క. వినుఁ డంకుల ననురూపము, నను వొందఁగ నెఱుఁగ కాత్మ । సృష్టి గుహా క్రిం
గొనసాగించెద మను మి, మ్మన నేమియు లేదు మూఢు । లని తెలిసితగన్.

వ. అని నారదుండు బోధించిన హర్యశ్వులు సహజబుద్ధిచేత నారదవాక్యంబులఁ దమలో నిట్లని వితర్కించిరి. 227

తే. సారిది క్షేత్రజ్ఞుఁ డన నతి । సూక్ష్మబుద్ధి, నరయ నజ్ఞానబంధనం । బగుచు లింగ
దేహ మన నెద్దిగల దది । తెలియకున్నఁ, గలదె మోక్షంబు దుష్కర్మ । గతులచేత.

తే. కలఁడు జగ దేకసన్నుత । కారణుండు, స్వామి భగవంతుఁ డభవుండు । స్వాశ్రయుండు
పరముఁ డాతనిఁ జూడక । బ్రహ్మకైనఁ, గలుగునే ముక్తిపదము దు । ష్కర్మగతుల.

ఆ. పురుషుఁ డెట్టు లేనిఁ । బూని బిలస్వర్గ, గతుఁడుఁబోలె వ । ర్తకంబు మాను
నట్టిబ్రహ్మ మెఱుఁగ । నయ్యకు స్వర్గోభగ, కర్మగతుల నేమి । గానఁబడును. 230

శా. తన్నిష్ఠాగతి లేనివానికి నస । త్కర్మప్రచారంబుచే
ము న్నే మయ్యెడి నాత్మబుద్ధిగుణస । మ్మోహంబునం దోఁచుచున్
వన్నెల్ వెట్టుక వింత బాగులతఱిన్ । వర్తించు నాగుణ్యసం
పన్నశ్రీయునుబోలె నెల్లగతులం । బ్రఖ్యాతమై యుండఁగన్. 231

సీ. అను నొంద సృష్టి న । వ్యయముగఁ జేయుచుఁ, బ్రచుర ప్రవాహసం । పతిత మైన
నెఱయఁ గూలం బను । నిర్గమస్థానంబు, నందు వేగము గల । క్రందుమాయఁ
[3]గదలి యహంకార । గతివశంబునఁ జాల, వివశుఁడై బోధకు । విపరి యైన
వానికి నీరీతి । వలవంత కర్తప్ర, చారంబులను మీఁదఁ । జక్కనైన

1. పుంశ్చలీభర్తయు...వఱలుగడల. 2. రాష్ట్రబిలము. 3 గడఁగి......విముఖుఁడై నవానికి.

ఆ. జన్మమరణముఖ్యజాడ్యంబులఁ బాసి, నిఖిలసౌఖ్యపదవి నెఱసి కమ్ర
మార్గమైనయట్టిమహనీయధామంబుఁ, జిత్తమార నెట్లు సేరఁ గలఁడు.
తే. దానిసంసర్గగుణములు దప్పి నడచు, కుచ్ఛితపుభార్యఁ జేకొన్నకుమతి వోలెఁ
దివిరి సుఖదుఃఖములఁ గూడి తిరిగి జీవరూప మెఱుఁగనివారికిఁ బ్రాపుగలదె.
మత్తకోకిలము. పంచవింశతితత్త్వరాశి కపారదర్పణ మయ్యుఁ దాఁ
గొంచెమై పురుషుండు తత్త్వముఁ గోరి పట్టఁగ నేరకే
మంచుఁ గించుఁ దలంచు[1]వార మమార్గక్రమము సేయఁగా
మంచిలోకము వారి కేటికి మానుగా సమకూరెడిన్. 234
క. బంధానుమోక్షణక్రమ, సంధానైశ్వర్యధుర్యశాస్త్రసమగ్ర
గ్రంథంబు మాను చిద్రూ, పాంధునకును గర్గతుల నగునే శుభముల్. 235
మత్తకోకిలము. చూడ నిజగమంతయుఁ వెసఁ జుట్టి పట్టుక లీల నే
జోడు లేక రయంబునం [2]గుడిసుట్టునట్టిస్వతంత్రముం
గూడి యుండినకాలచక్రముఁ గోరి చూడనివారి కే
జాడఁ గల్గును గర్మసంగతిఁ జారుమోక్షపదం బిలన్. 236
ఆ. జన్మహేతు వైనజనకునిర్దేశంబు, తనకుఁ జేయ రాని దనుచుఁ దెలిసి
గుణమయప్రవృత్తి ఘోరాధ్వనిశ్వాస, నిరతుఁ డగుచుఁ జేయ నేరఁ డతఁడు.
వ. అని తమలో విచారించి యూరకుండి రప్పుడు. 238
సీ. వినవయ్య భూపాల మునివరేణ్యునిమాట, లనువొందఁ దలపోసి వినయ మలర
వలగొని యతనికి వందనంబు లొనర్చి, తిరిగి యెన్నఁడు రాని తెరువు పట్టి
చయ్యన నేఁగిరి [3]సహజసత్త్వబ్రహ్మ, మయ మైనపంకజనయనుపాద
పద్మమరందంబు పానంబు సేయుచు, మత్తిల్లి నిలిచినమానసాళి
ఆ. పరిణమింప విష్ణుఁ బాడుచుఁ దత్కీర్తి, సరణి నొప్పుమహతి సంఘటించి
నారదుండు గుణవిశారదుం డెందేనిఁ, జనియెఁ దన్ను జగము సన్నుతింప.
క. అప్పుడు దక్షుఁడు దనయులు, దప్పి మహాపథము గనుటఁ దగ నారదుఁడే
చెప్పినఁ గప్పినశోకము, ముప్పిరిగొని చిత్తవృత్తి మూరింబోవన్. 240
చ. అడలుచు నున్న వచ్చి కమలాసనుఁ డూఱడిలంగఁ బల్కె మఱిన్
పడసినలీలఁ బుత్రుల నపారగుణాఢ్యులఁ గాంచు చున్న నా
[4]పడఁతుకయందుఁ బల్వురను బన్నగఁ దా శబళాశ్వసంజ్ఞులన్
బెడఁ గగువారిఁ బుణ్యములఁ బేర్చినవారి సహస్రసంఖ్యులన్. 241
క. పుట్టించిన జనకునిమదిఁ, బుట్టినతలఁ పెఱిఁగి వారు పూనికఁ బ్రజలం
బుట్టించువ్రతముఁ గైకొని, గట్టిగఁ దప మాచరింపఁగాఁ జనిరి వెసన్. 242

---

1 'వాఁడు కదధ్యకర్మను' ఆ. ప్ర. 2 'సుడిసుట్టు'. 3 'సహజస్వరబ్రహ్మ, భాసితకాశేయ వాసుపాద. 4 'పడఁతుకవల్లఁ గమ్మఱను బల్వురఁ దా శబళాశ్వసంజ్ఞులన్' వ్రా. ప్ర.

వ. ఇట్లు శబళాశ్వులు ప్రజాసర్గంబుకొఱకుఁ దండ్రిపంపునం దపంబు సేయువారై యేతీర్థంబు తీర్థరాజం బై సకలతీర్థఫలంబుల నాలోకనమాత్రంబున ననుగ్రహించుచు సకలపాపంబుల నిగ్రహించు నేతీర్థప్రభావంబున నగ్రజన్ములు ఫలసిద్ధిం బొందుదు రట్టినారాయణసరస్సనుపుణ్యతీర్థంబునకుం జని తదుపస్పర్శమాత్రంబున నిర్ధూత[1]మలాశయు లై. 243

శా. బ్రహ్మేంద్రాదులు నంద నేరనిపరబ్రహ్మంబుఁ జింతించుచున్
బ్రహ్మానందముఁ బొంది జిహ్వికలపై బ్రహ్మణ్యమంత్రంబులన్
బ్రహ్మాలోకనవాంఛతో నిలుపుచున్ బ్రహ్మం బితం డంచు మున్
బ్రహ్మజ్ఞానగురున్ హరిం [2]దపమునం బాటించి రబ్బాలకుల్. 244

సీ. ఏకపాదాంగుష్ఠ మిలమీఁద సవరించి, నిశ్చలకాయు లై నిక్కి నిలిచి
కరములు గీలించి సరవి మీఁదికి నెత్తి, గుఱుతుగాఁ జెనుబయల్ గుట్టి పట్టి
నిడివిగాఁ గ్రూర మై నిగిడినచూడ్కులఁ, గడుఁదీవ్రభానునిఁ బొడిచి పట్టి
వడిఁ గొంతకాలంబు వాయువు భక్షించి, యంతనుండియు నిరాహారు లగుచు

ఆ. సకలలోకములను సంహారకరమును, బేర్చి దేవతలకు భీతికరముఁ
గాఁగ ఘోరతపముఁ గావింపఁ దొడఁగిరి, మహితచిత్తు లక్కుమారవరులు.

నారదుఁడు శబళాశ్వులకు నివృత్తిమార్గంబు నుపదేశించుట.

వ. ఇట్లతిభయంకరం బైనతపంబు సేయుచు నెడ తెగక భగవన్మంత్రంబులు నొడువుచుఁ బ్రజాసర్గకాము లై యున్నయచ్చిన్నిబాలురకడకు నారదుండు సనుదెంచి పూర్వవిధంబునం బలుకుచు నిట్లనియె భ్రాతృవత్సలు లై యున్నమీరలు వేదాంతసారం బొలుకుచున్ననావచనంబు లాదరించి తోఁబుట్టువులు సనినమార్గంబునఁ జనుం డెవ్వఁ డేని దనయగ్రజులు సన్నమార్గంబునం దానునుం దప్పక వర్తించె నేని నట్టివానిని విశేషధర్మం బెఱింగినవాఁ డంద్రు సతతంబును బుణ్యబంధువు లైనదేవతలం గూడి సుఖం బుండుఁ డని పల్కి నారదుండు సనియె వారలును సర్వకర్మంబులయందు నిర్మోహితు లై పరమపదంబునకు నాస్పదంబు లయినదేవర్షివాక్యంబుల నాశ్రయించి. 246

ఉ. అప్పుడు లజ్జతోడ శబళాశ్వులు పూర్వజు లేఁగినట్టియా
చొప్పున నెన్నఁడుం దిరిగి చూడనిత్రోవ విశేషపద్ధతిం
దప్పక పోయి రయ్యగుణధాములు నేఁడును మళ్లి రేమి నేఁ
జెప్పెదఁ గాక రాక కడసేరినరాత్రులఁ బోలి భూవరా. 247

క. దక్షున కాకాలంబున, లక్షిత మై యుండెఁ బెక్కులాగుల నుత్పా
తక్షోభంబులు వానికి, రూక్షవ్యథ నొంది యాపుత్రుపనాశంబున్. 248

---

1 కల్మషు లై. 2 దలఁపులం. 3 బొందుగా భానుని. 4 బంధుం డై దేవతలం గూడి సుఖం బుండు నని పల్కి.

క. నారదకృత మని యెఱిఁగి మహారోషముతోడ నేఁగి యాతనిఁ గని దుః
ఖారూఢచిత్తుఁ డై మది, నూఱడిలం దెరువు లేక యుగ్రుం డగుచున్. 249
ఆ. మోము జేవుఱింప ముడివడ బొమ్మలు, చూపువెంట మంట సుడిగొనంగఁ
బెదవు లదరఁ బండ్లు పెటపెటఁ గొఱుకుచు, దక్షుఁ డాగ్రహించి తపసిఁ బలికె.
చ. నెఱయఁగ సాధురూపమున నీ వతిబాలుర కాత్మజాలికిం
గఱకున భిక్షుమార్గ మగు కందువ సెప్పితి వేల ధూర్త వై
మఱుఁగక యుండ వచ్చునె కుమారుల [1]నీదురితంబు వొంద ని
న్నొఱలఁగఁ ద్రోతు నాదుసమదోగ్రమహోగ్రహాశాపవహ్నులన్. 251

దక్షుండు నారదుని శపియించి ప్రజాసర్గం బొనరించుట.

వ. అది యెట్లం టేని దేవర్షిపితృఋణంబులు దీర్పక [2]మీమాంసితకర్మంబులు గల బాలురకు బుద్ధిఁ జెఱిచి వారలకు నుభయలోకంబుల శ్రేయోహాని నొనర్చితి విట్టిపాపంబున భాగవతోత్తములలో లజ్జాహీనుండ వై యశోహానిఁ బొంది చరింతువు గాక సకలభూతంబులును గ్రహంబులును దారకంబులును నిన్నుం దఱిపట్టునఁ గలహంకారి వని తలంపుదురు గాక యతికుతూహలంబున నీచేత స్నేహపాశనికృంతనం బైన మిత్రభేదంబె కాని తదుపశమనంబు గాకుండెడు నింతనుండియుఁ బురుషుండు విషయతీక్ష్ణత్వంబు లనుభవింపక కాని తెలియకుండెడు జ్ఞానంబు తనంత నెకాని యొరులచే బోధింపంబడి తెలియరాకుండెడి నిరంతరంబును జరియించు నీకు నేలోకంబునను నునికిపట్టు లేకుండుం గాక యని నిర్దయుండై శాపం బిచ్చె నంత నారదుండు తత్క్రోధవాక్యంబుల కలుగక యట్ల కా కని

---

1 నీదురితంబు నేఁడు నిన్నొఱలఁగఁ ద్రోతు. ఇందులకు 'మీమాంసితకర్మణాం। విఘాతశ్శ్రేయసః పాపలోకయో రుభయోః కృతః॥ ఏవం త్వం నిరనుక్రోశో బాలానాం మతిభిద్ధరేః। పార్షదమధ్యే చరసి యశోహాని రపత్రపః॥ ననుభాగవతా నిత్యం భూతానుగ్రహకాతరాః। ఋతే త్వాం సౌహృదఘ్నం వై వైరంకర మవైరిణామ్॥ నేత్థం పుంసో విరాగస్స్యాత్త్వయా కేవలినా మృషా। మన్యసే యద్యుపశమం స్నేహపాశనికృంతనం॥ నానుభూయ న జానాతి పుమాన్ విషయతీక్ష్ణతాం। నిర్విద్యతే స్వయం తస్మాన్న తథా భిన్నధీః పరైః। అని మూలము. ఇందు 'ననుభాగవతా నిత్యం భూతానుగ్రహకాతరాః' అనుటకు 'నను...భూతానిగ్రహతారకాః' అని పాఠముగ్రహించి కవి తెనిఁగించియుండునని తోఁచెడిని. ఇది యట్లుండె వచ్చుప్రతులందు కర్మవిచారంబు సేయనిబాలురమనంబులకు నైహికేచ్ఛలయందు నైరాశ్యంబు గలుగం జేసి నివృత్తిమార్గం బుపదేశించి వారలకు నుభయలోకములయందుఁ జెందఁగల శ్రేయోహాని నొనర్చితి విట్టిపాతకంబున భాగవతోత్తములతో లజ్జాహీనుండ వై యశోహానిం బొంది చరింపుదు గాక నిరపరాధులై వైరంబులేని నాపుత్రులపట్ల ద్రోహకృత్యం బొనర్చిన నీవుదప్పఁ దక్కిన భాగవతోత్తములు సకలభూతానుగ్రహపరవశులు గావున నిరంతరంబును లోకసంచారి వైన నీవు' అని యున్నది. ఈపాఠమున 'భూతానుగ్రహతారకాః' అనుదానిని సరిగాఁ దెనిఁగించుట యొకటి తప్ప మూలములోఁ దక్కిన 'మన్యసే యద్యుపశమమ్' ఇత్యాదిపాఠమునకుఁ దెనుఁగు గానిపింపదు. వ్రాఁతప్రతులం దిందులకుఁ దెనుఁగు గానిపించెడిని గాన యదియె గ్రంథమునఁ జేర్పఁబడియె.

సమ్మతించి చనియె నిట్టిశాంతభావం బెవ్వనివలనం గలుగు నతండు సర్వాతీతుం
డయినసర్వేశ్వరుం డనంబడు మఱియు దక్షుండు దనమనోరథంబు విఫలం బగు
టం జేసి యతిదుఃఖితమనస్కుం డై పొగులు చున్నం బితామహుండు సనుదెంచి
మఱియుం బ్రజాసర్గోపాయం బెఱింగించిన నా ప్రజాపతి ప్రియభామ యైనయసిక్ని
యందుం బితృవత్సల లైనకూఁతుల నఱువదుండ్రం బుట్టించి వారిలో ధర్మునకుం
బదుగురను గశ్యపునకుం బదుమువ్వురను జంద్రునకు నిరువదేడ్వురను భూతున
కు నాంగిరసునకుఁ గృశాశ్వునకు నిద్దఱేసిచొప్పున నార్వురను దార్క్ష్యుఁ డను
నామాంతరంబుఁ దాల్చినకశ్యపునకు (మరలఁ గడమ)నలువురను నీక్రమం
బున నిచ్చె వారినామంబు లాకర్ణింపుము. 252

ఆ. ఎట్టిపుణ్యవతులొ యీచేడియలు సెప్ప, సవతు లేనియట్టిసవతు లయ్యుఁ
గడుపు వడసి రెట్టికడుపునఁ బుట్టిరో, కడిఁది త్రిజగ మెల్లఁగడుపు గాఁగ. 253

వ. వార లెవ్వరనిన భానువు లంబయుఁ గకుప్పు జామియు విశ్వయు సాధ్యయు మరుత్వ
తియు వసువు ముహూర్తయు సంకల్పయు ననంబదుగురు ధర్మునకుం బత్నులై కొడు
కులం బడసిరి వార లెవ్వరంటేని భానువునకు [1]వేదఋషభుండు పుట్టె నతనికి నింద్రసే
నుండుదయించె లంబకు విద్యోతుండు గలిగె నతనికి స్తనయిత్నువులను వారు పుట్టిరి
కకుబ్దేవికి సంకటుండు పుట్టె సంకటునకుం గీటకుండు పుట్టెఁ గీటకునకు దుర్గాభి
మానిను లయిన దేవతలు జన్మించిరి జామిదేవికి [2]దుర్గభూముల కధిష్ఠాన దేవ
తలు జనియించిరి వారికి స్వర్గుండును నందియు జన్మించిరి విశ్వ యనుదానికి విశ్వే
దేవగణంబు జనియించె వార లపుత్రకు లనం బరఁగిరి సాధ్య యనుదానికి సాధ్య
గణంబులు పుట్టె వానికి నర్థసిద్ధి యనువాఁడు పుట్టె మరుత్వతి యనుదానికి మరు
త్వంతుండు జయంతుం డనువార లుదయించి రందు జయంతుండు వాసుదేవాం
శజుం డైనయుపేంద్రుం డనం బడె వినుతి నొందె ముహూర్త యనుదానికి సకల
భూతంబులకు నాయాకాలంబులం గలిగెడు నాయాఫలాఫలంబుల నిచ్చుమౌ
హూర్తికు లనియెడు దేవగణంబులు పుట్టిరి సంకల్ప యనుదానికి సంకల్పుండుద
యించె నాసంకల్పునకుఁ గాముండు జనియించె వసు వనుదానికి ద్రోణుండును
ప్రాణుండును ధ్రువుండును నర్కుండును నగ్నియు దోషుండును వస్తువును విభా
వసువును నన నెనమండ్రు వసువు లుదయంబు నొంది రందు ద్రోణునకు నభి
మతి యనుభార్యయందు హర్షశోకభయాదులు పుట్టిరి ప్రాణునకు భార్య యైన
యూర్జస్వతియందు సహుండును నాయువును బురోజవుండును ననువారు గలిగిరి

---

1 వేదుండును ఋషభుండును నింద్రసేనుండును ననుమువ్వురు పుట్టిరి. ఇందులకు 'భానోస్తు వేద ఋషభ ఇంద్రసేన స్తతో నృప' అనుమూలమును 'భానోస్తు వేదో ఋషభ, ఇంద్రసేన స్తతో నృప' అని గ్రహించి కవి తెనిఁగించె నని తోఁచుచున్నది. 2 దుర్గంబులు పుట్టె.

ధ్రువునకు భార్య యగుధరణియందు [1]వివిధంబు లగుపురంబులు పుట్టె నర్కునికి భార్య యగువాసనయందుఁ దర్షాదు లుదయించి రగ్నికి భార్య యైనవసుధారయందు ద్రవిణకాదులు పుట్టిరి మఱియుఁ గృత్తికలకు స్కందుండు (గలిగె నా స్కందునకు) విశాఖాదు లుదయించిరి దోషునకు శర్వరి యనుభార్యయందు హరికళ శింశుమారుం డుదయించె వస్తువునకు నాంగిరసయందు విశ్వకర్మయనుశిల్పాచార్యుం డుదయం బందె నావిశ్వకర్మకు నాకృతి యనుసతియందుఁ జాక్షుషుం డనుమనువు జనియించె నామనువువలన విశ్వేలు సాధ్యు లనువారలు పుట్టిరి విభావసునకు నుష యనుభార్యయందు వ్యుష్టియు రోచియు నాతపుండును జనించి రందు నాతపునికిఁ బంచయాముం డనుదివసాభిమానదేవత జనియించె శంకరాంశజుం డయినభూతునకు సురూప యనుభార్యయందుఁ గోట్లసంఖ్యలై నరుద్రగణంబు లుదయించిరి మఱియు రైవతుండు నజుండు భవుండు భీముండు వాముండు నుగ్రుండువృషాకపియు నజైకపాత్తు నహిర్బుధ్న్యుండు బహురూపుండు మహాంతుండు ననువారలును రుద్రపారిషదులును నతిభయంకరు లయినప్రేతులును వినాయకులును బుట్టి రంగిరసుం డనుప్రజాపతికి స్వధ యనుభార్యయందుఁ బితృగణంబులు పుట్టిరి సతి యనుభార్యకు నధర్వవేదాభిమానిదేవతలు పుట్టిరి కృశాశ్వునకు నర్చి యనుభార్యయందు ధూమ్రకేశుం డనుపుత్త్రుం డుదయించె వేదశిరునకు ధిషణ యనుభార్యయందు దేవలుండును వయునుండును మనువునుం బుట్టిరి తార్క్ష్యునకు వినత కద్రువ పతంగి యామిని యన నలువురు భార్యలందుఁ బతంగికిఁ బక్షులు పుట్టె యామినికి శలభంబులు పుట్టె వినతకు సాక్షాత్కరించిన యజ్ఞాధిపతికి వాహనం బయినగరుడుండును సూర్యునకు సారథి యైనయనూరుండును జనియించిరి కద్రువకుఁ బెక్కుతెఱంగు లగుభుజంగమంబులు పుట్టెఁ జంద్రునకుఁ గృత్తికాదినక్షత్రంబులు భార్యలై నను వారలయందుఁ జంద్రుండు రోహిణియందు మాత్రము మోహితుం డగుటం జేసి దక్షశాపంబున క్షయరోగగ్రస్తుండై సంతానంబు వడయ నేరఁ డయ్యె నంత దక్షప్రసాదంబు నక్షయపీడితంబు లగుషోడశకళల మరలం బొందె మఱియును. 254

సీ. కామితప్రదుఁ డైన కశ్యపుకౌఁగిట, ముచ్చట దీర్తు రేరముద్దరాండ్రు
రఖిలలోకములకు నవ్వలై జగ మెల్లఁ, బూజింప నుందు రేరపువ్వుఁబోండ్లు
బలియులై పుత్రులఁ బౌత్రులఁ ద్రిజగంబుఁ, జేలంగఁ జూతు రేరయిందుముఖులు
ముంగొంగుపసిఁడి యై మూల్గుపుణ్యంబుల, విట్టవీఁగుదు రెట్టివింతరాండ్రు

తే. వారి కలగంపకడుపుల [2]నేరుపఱుప, నరిది బిడ్డలఁ బడసినయదితిసుతుల
నామములు నన్వయంబులు నేమనంబు, పూనఁ జెప్పెదు వినవయ్య యమానవేంద్ర.

---

1 'ఇంగలకు 'ధరణీహ్యసూత వివిధాః పురాః' అని మూలము 'పురాః=పురాణి' అనివ్యాఖ్యానము. దీనికి 'వివిధు లగుపురుషు లనువారు జనించిరి' అని అ.ప్ర. 2 'ఏరుపఱచు' అని యీకవిప్రయోగము.

తరలము. [1]అదితియున్ దితి గాష్ఠయున్ దను వయ్యరిష్టయుఁ దామ్రయు
న్నదనఁ గ్రోధవశాఖ్యయున్ సురసాఖ్యయున్ సురభిన్ మునిన్
మొదలుగాఁ దిమియు న్నిళాఖ్య సుముఖ్య యాసర మాదిగా
ముదిత లెన్నఁగఁ గన్నసంతతి ముజ్జగంబుల భూవరా. 256

సీ. చాలంగఁ దిమికిని జలచరంబులు వుట్టె, [2]శ్వాపదంబులు వుట్టె సరమయందు
సురభికి మహిషాదిసురభులు జనియించెఁ, దామ్రకు శ్యేనగృధ్రములు గలిగె
మునికి నప్సరసలమూఁకలు జనియించె, నిళ గనె భూరుహములను గ్రోధ
[3]వశ కుద్భవిల్లె దుర్వారసర్పంబులు, సరి యాతుధానులు సురస కరయ

తే. నుప్పతిల్లిరి గంధర్వులొక్కమొగి న,రిష్టకు సుతుల్ దనువునకుఁ ద్రిదశరిపులు
పదియు నెనమండ్రు నైనట్టివిదితబలులు, వారినామాన్వయంబులఁ గోరివినుము.

వ. ద్విమూర్ధుండును శంబరుండును నరిష్టుండును హయగ్రీవుండును విభావసుండును నయోముఖుండును శంకుశిరుండును స్వర్భానుండును గపిలుండును నరుణియుఁ బులోముండును వృషపర్వుండును నేకచక్రుండును ననుతాపకుండును ధూమ్రకేశుండును విరూపాక్షుండును దుర్జయుం డగువిప్రచిత్తియు ననువారలు వీరలలోన స్వర్భానునకు సుప్రభయనుకన్యక వుట్టె దాని నముచి వివాహంబయ్యె వృషపర్వునకు శర్మిష్ఠ యనుకూఁతురు వుట్టె దాని నహుషపుత్రుం డైనయయాతి పెండ్లి యయ్యె వైశ్వానరునకు నుపదానవి హయశిరస పులోమ కాలక యను నలువురుపుత్త్రిక లుదయించి రందు నుపదానవి హిరణ్యాక్షునకుం బత్నియయ్యె హయశిరసను గ్రతువు వివాహం బయ్యె పులోమకాలక లనునిరువురను గశ్యపప్రజాపతి చతుర్ముఖునివాక్యంబునఁ గైకొనియె నాయిరువురకును సమరకోవిదులయినదానవులు పౌలోమకాలకేయు లనం బుట్టిరి మఱియు నాయిరువురకు నఱువదివేలరాక్షసులు జన్మించిరి వారు యజ్ఞకర్మంబులకు విఘాతుకులై వర్తింప వారి నింద్రునకుం బ్రియంబుగా నీపితామహుం డగునర్జునుండు వధించె మఱియు విప్రచిత్తి సింహిక యనుదానియందు రాహుప్రముఖంబుగాఁ గలకేతుశతంబును బడసె వారలు గ్రహత్వంబుఁ గైకొనిరి మఱియుం బురాణపురుషుం డైన శ్రీమన్నారాయణుండు దనయంశంబునఁ బరమభాగ్యవతి యయినయదితి గర్భంబున నుదయించె నాయదితివంశంబును విదితంబుగా వినిపించెద సావధానుం

---

1 ఈతరలమునకు మాఱుగా 'అదితియు దితియుఁ గాష్ఠయు నరిష్ఠయు సారసయు నిళయు మునియుఁ గ్రోధవశయుఁ దామ్రయు సురభియు సరమయుననఁ బదుమువ్వురు గల రందు' అని వచనమే వ్రాఁతప్రతులఁ గానిపించెడి. 2 'మఱి శ్వాపదులు సరమకును బ్రజలు' అ.ప్ర. 3 'వశకు సర్పములు దుర్వారాసురులు సారసకును గంధర్వులు సతి కరిష్ఠ, కలరుఁ గాష్ఠకుఁ బంచశఫాదు లుద్భవించెఁ ద్రిదశారివర్గ మావిర్భవించె, దనువు కఱువదియొక్కరుదారబాహులు' వ్రా.ప్ర. ఇందు 'అఱువదియొక్కరు' అనుటకు 'సుతాదనో రేకషష్టిః' అని మూలము.

డ వయి వినుము వివస్వంతుండును నర్యముండును బూషుండును ద్వష్టయు సవిత యు భగుండును ధాతయు విధాతయు వరుణుండును మిత్రుండును శక్రుండును నురుక్రముండును ననుమనువ్రులు జన్మించి రందు వివస్వంతునకు శ్రాద్ధదేవుం డనుమనువు సంజ్ఞాదేవియందు నుదయించె మఱియు యముండు యమియు నను నిరువురు మిథునంబుగా నుదయంబు నొందిరి వెండియు నాసంజ్ఞాదేవి బడబాస్వ రూపంబు నొంది యశ్విదేవతలం గనియె ఛాయాదేవియందు శనైశ్చరుండును సావర్ణి యనుమనువును దపతి యనుకన్యయుం బుట్టె రాతపతిని సంవరుణుండు వరియించె నర్యమునకు మాతృక యనుపత్నియందు జర్షణు లుదయించిరి వారి మూలంబున మనుష్యజాతి యీలోకంబున స్థిరంబుగా నుండునట్లు బ్రహ్మదేవుని చేఁగల్పింపంబడెఁ బూషుండు భర్గునిఁజూచి దంతంబులు వివృతంబులుగా నగిన నతండు క్రోధించి దంతంబు లూడ నడచిన నాఁటనుండియు భగ్నదంతుం డయి యనపత్యుం డయి పిష్టాదులు భక్షించుచుండెఁ ద్వష్టకు దైత్యానుజ యైనరచన యనుకన్యకకు నధికబలాఢ్యుం డగువిశ్వరూపుండు పుట్టె నంత నాదేవతలు బృ హస్పతి గోపించి తలంగి పోయినం దమకు నావిశ్వరూపుని నాచార్యునింగా వరి యించి రని చెప్పిన విని శుకయోగీంద్రునకుం బరీక్షిన్నరేంద్రుం డి ట్లనియె.

సీ. అరయంగ యోగీంద్ర । యచ్యుతం బయ్యును, సురలపై నేటికి । సురగురుండు
గోపించె నీతండు । గురుభావమున దేవ,తల కేమియూపకఁ । దలఁగఁ జేసె
నెఱిఁగింపు మనవుడు । నింద్రుండు త్రిభువనై,శ్వర్యమదంబున । సత్పథంబు
గానక వసురుద్ర । గణములు నాదిత్య,[1]మరుదశ్విదేవాది । మండలములు

తే. సిద్ధచారణగంధర్వ । జిహ్మగాది,మునులు మునులును రంభాది । సుందరాంగు
లాడఁబాడంగవినుతిసే । యంగఁగొలువ, మెఱుఁగు భద్రాసనంబున । నుక్కుమీఱి.

సీ. నిండుపున్నమనాఁడు । గండరించినచంద్ర,మండలశ్రీతోడ । మాఱు మలయు
భద్రవిద్యోతాత । పత్రంబు గ్రాలంగ, మిన్నేటితరఁగల । మేలుకొలుపఁ
గలితదివ్యాంగనా । కరతలచాతుర్య, చామరశ్రేణులు । జాడపడఁగఁ
జింతామణిస్ఫుట । కాంతరత్నానేక,ఘటితసింహాసనా । గ్రంబునందు

తే. నూరుపీఠంబుపై శచి । యుండ నుండి, వసువ దిక్పాలకాదిదే । వతలు గొలువ
సాటిసెప్పంగ రానిరా । జసముతోడ, నింద్రుఁ డొప్పారె వైభవ । సాంద్రుఁడగుచు.

వ. అప్పుడు. 261

క. గురుతరధర్మక్రియ నయ,గురుఁడు మహన్మంత్రవిషయ । గురుఁడు వచశ్శ్రీ
గురుఁడు సమస్తసురావలి,గురుఁడు గురుం డరుగుదెంచెఁ । గొల్వునకు నృపా.

చ. అమితతపఃప్రభావుఁ గరు । ణాత్ముని గీష్పతిఁ జూచి రాజ్యదు
ర్దమమదరేఖ నింద్రుఁడు వృ । థా తనగద్దియ లేవ కుండె నె

1. మరుదశ్వినీఋషిమండలములు.

య్యమున నెదుర్కొనం జనక యాసన మీయక గౌరవోపచా
రములఁ బ్రసన్నుఁ జేయక తిరంబుగ దివ్యసభాంతరంబునన్. 263

క. అప్పుడు మహేంద్రుకన్నులఁ, గప్పినసురరాజ్యపదవికారంబునకుం
జప్పుడు సేయక గృహమున, కప్పుణ్యుఁడు దిరిగి పోయె నతిఖిన్నుండై. 264

చ. ఎఱుఁగమిఁ జేసినట్టిగురుహేళన మంత నెఱింగి యింద్రుఁ డ
చ్చెరువడి భీతి నొంది యతిచింతితుఁడై తలపోసి పల్కె న
ప్పరమపవిత్రు లోకనుతభవ్యచరిత్రు విశేషపాదపం
కరుహముఁ బూజ సేయక యకర్మముఁ జేసితి నప్రబుద్ధినై. 265

క. త్రిభువనవిభవమదంబున, సభలో మద్గురువునకుఁ బ్రసన్నునకు లస
త్ప్రభువునకు నెగ్గు సేసితి, శుభములు దొలఁగంగ నే నసురభావమునన్. 266

ఆ. [1]పారమేష్ఠ్య మయినపదవి నొందినభూపు, లెట్టివారి కైన లేవ వలదు
విబుధు లిట్లు సెప్పువిధ మెన్న వారలు, ధర్మవేత్త లనుచుఁ దలఁపఁబడరు.

ఆ. కుపథవర్తు లగుచుఁ గుత్సితదుర్వచో, నిపుణు లయినవారు [2]నియతి విడిచి
తొలఁగ లేక తా రధోగతిఁ బడుదురు, తప్ప లేక రాతితెప్పభంగి. 268

ఉ. కావున లోకవందితుని కార్యవిచారునియింటి కేఁగి త
త్పావనపాదపద్మములపై మకుటంబు ఘటిల్ల మ్రొక్కి త
త్సేవ యొనర్చి చిత్తము [3]వశించి ప్రసన్నునిఁ జేతు నంచు న
ద్దేవవిభుండు వోయె నతితీవ్రగతిన్ గురుధామసీమకున్. 269

సీ. ఈరీతిఁ దనయింటి కేతెంచు దేవతా, పతిరాక యాబృహస్పతి యెఱింగి
యధ్యాత్మమాయచే నడఁగి యదృశ్యుఁడై, పోయె నప్పుడు దేవపుంగవుండు
సకలంబుఁ బరికించి జాడఁ గానక గురుఁ, జింతించి తలపోసి చిన్నఁబోయెఁ
బోయినవిధ మెల్ల దాయలు రాక్షస, వీరులు వేగులవారివలనఁ

తే. దెలిసి మిక్కిలితమలోనఁ దెలివిఁ గొంది, యందఱునుగూడి భార్గవునాశ్రయించి
తత్కృపాదృష్టిఁ దమశక్తి దట్టమైన, దేవతలమీఁది దాడికిఁ దెరువువెట్టి. 270

—దానవులు దేవతలతో యుద్ధము సేసి దేవతల నోడించుట.—

క. ధూర్తులు సమస్తకిల్బిష, మూర్తులు వరధర్మకర్మ[4]ముంచితమార్గా
వర్తులు దుర్ణయనిర్మిత, కీర్తులు దానవులు సనిరి గీర్వాణులపై. 271

స్రగ్ధర. దండిం గోదండకాంతోద్ధతరథహయవేదండతండంబుతోడన్
దండెత్తెన్ మెండుగా నద్దనుజనికరముల్ [5]దైవవర్గంబుమీఁదం

---

1 'పారమేష్ఠ్య మైనపదవి నొందినవారు, లెస్స వారి కనుక లేవ రనుచు, విబుధజనులవలన వినఁబడెనేని యూ, నరియు పరమధర్మ మంత్రుఁడు మొదల' వ్రా. ప్ర. 2 'నిశిని గలిసి' అ. ప్ర. 3 'వశించు' 'చేకును' అని కవిప్రయోగములు. 4 'మోచిత' కు 'ముంచిత' అని కవి ప్రయోగించినాఁడు. 5 'దైవతాకోటిమీఁదన్' వ్రా. ప్ర.

జండబ్రహ్మాండభేదోగ్రోచ్చ్రయజయరవముల్ । సర్వదిక్క్షోభగా ను
ద్దండప్రఖ్యాతలీలం । దలపడిరి సురల్ । దర్పులై వారితోడన్. 272

చ. మదమున దేవదానవులు । మచ్చరులై కడుఁ బిచ్చలించి సం
పదలకుఁ గోరి పోరునెడ । భార్గవమంత్రకళావిశేషులై
[1]యదరులు వాఁడి నస్త్రముల । నార్చి మహాసురు లేర్చి రేసి పెం
గుదులుగఁ గ్రువ్వ దేవతలు । గొల్లల క్రొవ్వక పాఱి రయ్యెడన్. 273

ఆ. దనుజవీరు లేయు । దారుణదివ్యాస్త్ర, దళితదేహు లగుచుఁ । దలలు వీడ
నోడి పాఱి రప్పు । డోపేతబలులైన, త్రిదశవరులు బిట్టు । దిట్టినట్లు. 274

క. ఒకమొగము గాక దివిజులు, వికమక గొని వైరు లెల్ల । దీకొని తమ్ముం
[2]బకపక నగ నకనకలై, లుకలుకఁ బఱు వెత్తి రోడి । లోఁగొనుభీతిన్. 275

చ. దనుజులగర్వరేఖయును । దానవవీరులయంపజోకయుఁ
మనుజవిశేషభోజనుల । మచ్చరికంబు నిశాటకోటి యే
చినబలశౌర్యముం గమరు । సిగ్గును హాని మహాభయంబు ని
గ్గుణతను జేయునమ్మలికఁ । గొల్లల క్రొవ్వక పాఱి రాస్థులై. 276

క. అమరులు విస్ఫుటదారుణ, సమరులు శరభిన్నదేహ । సంతాపగుణ
భ్రమరులు దైత్యకిరాతక, చమరులు కమలజునికడకుఁ । జనిరి భయార్తిన్. 277

ఉ. ధాతకు దేవతావిభవ । ధాతకుఁ బుణ్యజనానురాగసం
ధాతకు సర్వలోకహిత । దాతకు వైదికధర్మమార్గని
ర్ణేతకు నుల్లసద్విభవ । నేతకు సర్వజగజ్జయాంగజ
భ్రాతకుఁ బుణ్యయోగిజన । భావవిజేతకు మ్రొక్కి రయ్యెడన్. 278

క. ఆఖండలుండు మొదలుగ, లేఖానీకముల బ్రహ్మ । లేనగవున ని
త్యాఖండసత్కృపారస, శేఖరవాక్యముల వారి । సేదలు దేర్చెన్. 279

వ. ఇట్లు బ్రహ్మదేవుండు దేవేంద్రప్రముఖు లయిన దేవతల కనుకంపాతిశయవిభ
వంబున నభయం బొసంగి యిట్లనియె. 280

ఉ. నెట్టన పాపకర్మమున । నేరమిఁ జేసితి రేమి సెప్ప మీ
పుట్టిననాఁటనుండియును । బుద్ధులు సెప్పి జగంబు నేలఁగాఁ
బట్టముఁ గట్టి పెంచినకృ । పానిధి బ్రహ్మకళావిధిజ్ఞుఁ జే
పట్టక గుట్టు జాఱి సిరి । పట్టునఁ గొట్టినపొట్టక్రొవ్వునన్. 281

వ. బ్రహ్మిష్ఠుం డైన బ్రాహ్మణు నాచార్యుం గైకొనక గురుద్రోహంబు సేసితిరి తద్దో
షం బిపుడు మీకుఁ జేసేత శత్రుకృతం బై యనుభవింపం జేసె నతిబలవంతు
లయినమిమ్ము [3]నతితీక్ష్ణులు లయిన రాక్షసులు జయించుట దమయాచార్యుం డైనశు

---

1 'యెదురులు.... నేయ మహాసురు లేచి యేసి....క్రొవ్వక వీఁగి రయ్యెడన్' అ. ప్ర. 2 బికపిక
లై నకనకలై' అ. ప్ర. 3 నతితీక్ష్ణబలు లయినరాక్షసులు.

క్రు నారాధించి తన్మంత్రప్రభావంబునఁ బునర్లబ్ధవీర్యులై యిప్పుడు మదీయం బయిననిలయంబు నాక్రమింపం గలవారు నై మదోద్రేకంబున నెదురులేక వర్తిల్లు చున్నరక్షోనాయకులకుం ద్రిదివంబుఁ గొనుట తృణప్రాయం బభేద్యమంత్ర బలంబు గలభార్గవునకు వారు శిష్యు లగుటం జేసి విప్రగోవిందగవేశ్వరానుగ్రహంబు గలవారలకుఁ దక్కం దక్కినరాజుల కరిష్టం బగుం గావున మీ రిప్పుడు త్వష్ట యనుమనుపుత్త్రుం డగువిశ్వరూపుం డనుముని నిశ్చలతపోమహత్త్వసత్త్వస్వభావుం డతని నారాధించిన మీకు నభీష్టార్థంబుల నతండు సంఘటించు నెట్టి దుర్దశల నైన నడంచు నని చెప్పిన దిక్పాలకాదులు డెందంబులు డిందుపడి కమలగర్భుని వీడ్కొని విశ్వరూపుకడకుం జని యి ట్లనిరి. 282

తే. అన్న మే లగు నీకు ని ట్లన్నదుగఁ గోరి
వచ్చినారము భవదీయ వనమునకును
దండ్రులకు నేఁడు సమయోచితంబు లైన
కోర్కు లొడఁగూడఁ జేసి చేకొమ్ము యశము. 283

క. సుతులకుఁ బితృశుశ్రూషణ, మతిపుణ్యము సేయు చుండు నాత్మజులు గుణోన్నతి బ్రహ్మచారు లేనియు, మతిలో గురుసేవకన్న మతియుం గలదే. 284

వ. అదియునుం గాక. 285

సీ. అరయ నాచార్యుండు పరతత్త్వరూపంబు, దండ్రి దలంపఁగ ధాతరూపు
రూపింప భ్రాత మరుత్పతిరూపంబు, దెలియంగఁ దల్లి భూదేవిరూపు
భగిని [1]కరుణరూపు భావంబు ధర్మస్వ. రూపంబు దా నర్థిరూపు మొదల
నభ్యాగతుఁడు మున్న యగ్నిదేవునిరూపు, సర్వభూతములు గేశవునిరూపు
ఆ. గాన తండ్రి వేగ కడు నార్తు లగుపిత్రు,జనుల మైనమమ్ముఁ జల్లఁ జూచి
పరభయంబు వాపి నిరుపమం బగుతపో,మహిమచేత మెఱసి మనుపవయ్య.

వ. ఇట్టిబ్రహ్మిష్ఠుండ వైనని న్నాచార్యునింగా వరియించి భవదీయతేజోవిశేషంబుచేత వైరివీరులం బరిమార్చెద మాత్మీయార్థం బయినయవిష్ఠపాదాభివందనంబు నిందితంబు గా దని వేదవాక్యంబు గలదు గావున నీకు నమస్కరించు చున్న దేవవరులం గైకొని పౌరోహిత్యంబు సేయు మనినం బ్రహసితవదనుం డై యమ్మునీశ్వరుం డి ట్లనియె. 287

తే. బ్రహ్మతేజంబు వోమెడిప్రార్థనంబు, ధర్మగుణగర్హితం బని తా నెఱింగి
సొరిదిననుబోఁటితపసియాసురలచేతఁ, బ్రకటమధురోక్తి నేటికిఁబలుకఁబడియె.

వ. విశేషించియు. 289

క. గురుధనముఁ గూర్ప నేటికి, గురుశిక్షం దగిలి మంత్రకోవిదు లై సద్గురుధర్మనిరతు లేనియు, గురువులకును శిష్యవరులె కూర్చినధనముల్. 290

సీ. అరయ నకించను లై నట్టివారికిఁ, బంబినట్టిశిలోంఛనంబె ధనము

దానిచే నిర్వర్తితప్రియసాధుస,త్క్రియ గలవారలై ప్రీతి నుందు
రది గాన సద్వర్తితాచార మైనయా,చార్యత్వ మిపుడు మీ శాసనమునఁ
గైకొంటి గురువుల కామంబు ప్రాణార్థ,వంచనములు లేక వడి నొనర్తు
ఆ. ననుచు విశ్వరూపుఁ డనియెడిముని ప్రతి,జ్ఞోక్తిఁ బలికి వారి నూఱడించి
మహిత మైనతత్సమాధిచే గురుభావ, మమరఁ జేసె దేవసమితి కపుడు.
క. భార్గవవిద్యాగుప్త,స్వర్గశ్రీ ద్విగుణదనుజసమధికసంప
ద్వర్గముల విష్ణుమాయా,నర్గళగతిఁ దెచ్చి యింద్రునకు నిచ్చె నృపా. 292
క. ఏవిద్యచేత రక్షితుఁ, డై వజ్రి దురంబులోన నసురులఁ ద్రుంచెన్
భావింప నట్టివిద్యను, శ్రీవరమాయామతంబుఁ జెప్పెను హరికిన్. 293
ఉ. నావుడుఁ బాండవాన్వయుఁడు నమ్మినభక్తి జగన్నివాసు రా
జీవదళాక్షుఁ గృష్ణుఁ దనచిత్తమునన్ భజియించి పల్కె నో
దేవగణార్చితాంఘ్రియుగ దివ్యమునీశ్వర విశ్వరూపుఁ డ
ప్పావన మైనవిద్య సురపాలున కేక్రియ నిచ్చెఁ జెప్పవే. 294
ఉ. ఎందును రక్షితుం డగుచు నింద్రుఁడు లీలయపోలె వైరిసే
నం దునుమాడి దేవతలు నమ్మి సుఖింపఁగ నిష్టసంపదం
జెంది సమస్తలోకములఁ జేకొని యేలె మునీంద్ర దాని నే
విందు సుఖంబుఁ గందు నిఁక వీనులు సంతస మందఁ బల్కవే. 295

శ్రీమన్నారాయణకవచప్రారంభము.

క. వరనారాయణకవచము, నరిభీకరవజ్రకవచ మాశ్రితసంప
త్పరిణామకర్మసువచము, పురుహూతున కెట్లు మాని బోధించెఁ దగన్. 296
వ. అనినం బరీక్షిజ్జనపాలునకు మునినాథుం డిట్లనియె. 297
సీ. వినవయ్య నరనాథ మునినాథుఁ డింద్రున, కను వొంద నారాయణాఖ్య మైన
కవచంబు విజయసంకల్పంబు నప్రమే,యస్వరూపంబు మహాఫలంబు
మంత్రగోప్యము హరిమాయావిశేషంబు, సాంగతతోడ నెఱుంగఁ జేసె
దాని నే వినిపింతుఁ బూని తదేకాగ్ర,చిత్తంబుతోడుతఁ జిత్తగింపు
తే. మొనరధౌతాంఘ్రిపాణియై యుత్తరంబు,ముఖముగా నుత్తమాసనమున వసించి
కృతనిజాంగకరన్యాస మతిశయిల్ల, మహితనారాయణాఖ్యవర్మము నొనర్చె.
వ. ఇట్లు నారాయణకవచంబు ఘటియించి పాదంబులను జానువులను నూరువులను నుదరంబునను హృదయంబునను నురంబునను ముఖంబునను శిరంబునను నిట్లష్టాంగంబులం బ్రణవపూర్వకం బైనయష్టాక్షరీమంత్రరాజంబు న్యాసంబు సేసి (ద్వాదశాక్షరవిద్యలచేతం గరన్యాసంబు సేసి)మంత్రమూర్తియై[2]భగవచ్ఛబ్దవా

1 'భగవచ్ఛబ్దవాచ్యం బగుషట్చక్తిసంయుతుండగుచు విద్యామూర్తియు నైనపరమేశ్వరునందు భావించి, శ్రీనారాయణకవచాఖ్య' వ్రా. ప్ర.

చ్యంబైన (ప్రణవాదియకారాంత మగుమహామంత్రంబుచేత నంగుళ్యంగుష్ఠపర్వ సంధులయం దుపన్యసించి మఱియు హృదయంబున నోంకారంబు వికారంబు మూర్ధంబున షకారంబు భ్రూమధ్యంబునందు ణకారంబు శిఖయందు వేకారంబు నేత్రంబులయందు నకారంబు సర్వసంధులయందు మఱియు నస్త్రము నుద్దేశించి మకారంబు నుపన్యసించెనేని మంత్రమూర్తి యగు మఱియును నస్త్రాయఫట్టనుమంత్రంబున దిగ్బంధనంబు సేసి పరమేశ్వరునిం దనభావంబున నిల్పి విద్యామూర్తియుఁ దపోమూర్తియు నగు)షట్ఛక్తిసంయుతం బయిననారాయణ కవచాఖ్య మైనమంత్రరాజంబు నిట్లని పఠియించె. 299

చ. గరుడునిమూఁపుపైఁ బదయుగంబు ఘటిల్లఁగ శంఖచక్రవ
ర్మరుచిరశార్ఙ్గఖడ్గశరరాజితపాశగదాదిసాధనో
త్కరనికరంబు లాత్మకరకంజములన్ ధరియించి భూతిసం
భరితమహాష్టబాహుఁడు కృపామతితో ననుఁ గాచుఁ గావుతన్. 300

ఆ. [1]ప్రకటమకరవరుణపాశంబులందుల, జలములందు నెందుఁ బొలియకుండఁ
గాచుఁ గాక నన్ను ఘనుఁ డొక్కఁడై నట్టి, మత్స్యమూర్తి విద్యమానకీర్తి.

క. వటుఁడు సమాశ్రితమాయా, నటుఁడు బలిప్రబలశోభనప్రతిఘటనో
ద్భటుఁడు త్రివిక్రమదేవుఁడు, [2]చటులస్థలమందు నన్ను సంరక్షించున్. 302

చ. అడవుల సంకటస్థలుల నాజిముఖంబుల నగ్నికీలలం
దెడరుల నెల్ల నాకు నుతి కెక్కఁగ దిక్కగుఁ గాక శ్రీనృసిం
హుఁడు [3]సురశత్రుయూథపవధోగ్రుఁడు విస్ఫురితాట్టహాసవ
క్త్రుఁడు ఘనదంష్ట్రపావకవిఘూతదిగంతరుఁ డప్రమేయుఁడై. 303

చ. అరయఁగ నెల్లలోకములు నంకిలి నొంద మహార్ణవంబులో
[4]నారగి నిమగ్న మైనధర నుద్ధతిఁ గొమ్మున నెత్తినట్టియా
కిరిపతి [5]యగ్నికల్పుఁ డురుఖేలుఁడు నూర్జితమేదినీమనో
హరుఁడు కృపావిధేయుఁడు సరిదాధ్వములన్ ననుఁ గాచుఁ గావుతన్. 304

క. రాముఁడు రాజకులైకవి, రాముఁడు భృగుసత్కులాభిరాముఁడు [6]సుగుణ
స్తోముఁడు నను రక్షించును, [7]శ్రీమహితోన్నతుఁడు నద్రిశిఖరములందున్. 305

సీ. తాటక మర్దించి తపసిజన్నముఁ గాచి, హరువిల్లు విఱిచి ధైర్యమున మెఱసి
ప్రబలులైనట్టివిరాధకబంధాగ్ర, ఖరదూషణాదిరాక్షసులఁ దునిమి
వానరవిభు నేలి వాలిఁ గూలఁగ నేసి, జలరాశిగర్వంబుఁ జక్కఁజేసి
సేతువు బంధించి చేరి రావణకుంభ, కర్ణాదివీరులఁ గడిమిఁ ద్రుంచి

తే. యలవిభీషణు లంకకు నధిపుఁ జేసి

---

1 'వరుసజలధికూపవరుణపాశములందు. 2 'చటులస్థలివలన. 3కనకాక్షరాక్షసవధో. 4 నురుతరమగ్న మైనధర. 5 యజ్ఞకర్ముఁ డురుఖేలనుఁ దూర్జిత. 6 శాంతి. 7 శ్రీమహితోన్నతుల నద్రి' వా. ప్ర.

భూమిసుతఁ గూడి సాకేతపురమునందు
రాజ్యసుఖములు గైకొన్న రామవిభుఁడు
వరుస నను బ్రోచు చుండుఁ బ్రవాసగతుల. 306

వ. మఱియు నఖిలప్రమాదంబు లైనయభిచారకర్మంబులవలన నారాయణుండును గర్వంబువలన నరుండును యోగభ్రంశంబువలన యోగనాథుం డయినదత్తాత్రేయుండును గర్మబంధంబులవలన గణేశుం డైనకపిలుండును గామదేవునివలన సనత్కుమారుండును మార్గంబుల (దేవహేళనంబు సేయుట)వలన శ్రీహయగ్రీవమూర్తియును దేవతానమస్కారతిరస్కారదేవపూజాచ్ఛిద్రంబులవలన నారదుండును నశేషనిరయంబులవలనఁ గూర్మంబును నపథ్యంబువలన భగవంతుం డైనధన్వంతరియును ద్వంద్వంబువలన నిర్జితాత్ముం డైనఋషభుండును జనాపవాదంబువలన నగ్నిదేవుండును [1]జననమరణాదులం గలుగఁజేయుకర్మంబులవలన బలభద్రుండును గాలంబువలన యముండును సర్పగణంబులవలన శేషుండును నప్రబోధంబువలన ద్వైపాయనుండును బాషండసమూహంబులవలన బుద్ధదేవుండును [2]శనైశ్చరునివలనఁ గల్కియు నై ధర్మరక్షణపరుం డయినమహావతారుండు నన్ను రక్షించుం గాతఁ బ్రాహ్ణమధ్యాహ్నాపరాహ్ణసాయంకాలంబులను బ్రదోషార్ధరాత్రాపరరాత్రప్రత్యూషానుసంధ్యాప్రభాతంబులను గదాద్యాయుధంబుల ధరియించి కేశవ నారాయణ గోవింద విష్ణు మధుసంహర త్రివిక్రమ వామన హృషీకేశ పద్మనాభ శ్రీవత్సధామ సర్వేశ్వరేశ జనార్దన విశ్వేశ్వర కాలమూర్తులను నామరూపంబులుగలదేవుండు నన్ను రక్షించుంగాక ప్రళయకాలానలాతితీక్ష్ణసంభ్రమభ్రమణనిర్వక్రవిక్రమవశీకృతదనుజచక్రం బైనసుదర్శనపుణ్యనామచక్రంబ మహావాయుప్రేరితుం డై హుతాశనుండు నీరసతృణాటవుల భస్మీభూతంబు సేయుభంగి భగవత్ప్రయుక్తంబ వై మద్వైరిసైన్యంబుల దగ్ధంబు గావింపుము జగత్సంహారకాలపటుఘటితచటులమహోత్పాతగర్జారవతర్జనదశదిశాభివర్జితఘనఘనాంతరనిష్ఠ్యూతనిష్ఠురకోటిశతకోటిసంస్పర్శస్ఫురద్విస్ఫులింగనిర్గమానర్గళభుగభుగాయమానమూర్తివిస్ఫూర్తినారాయణకరకమలవర్తిగదాయుధోత్తమ మదీయవైరితండోపతండంబుల ఖండసంబునం జండగతిం జెండిగాఁ జండికాకూష్మాండవైనాయకరక్షోభూతగ్రహంబులు చూర్ణంబులు గాఁ గొం డొకవినోదంబు సలుపుము [3]దరేంద్రంబ వైనపాంచజన్యంబ సర్వలోకజిష్ణుం డైనశ్రీకృష్ణుని నిఖిలపుణ్యైకసదనవదననిష్ఠ్యూతనిశ్వాసా[4]ధరవేణుపరిపూరితంబ వై యున్మత్తభూతప్రేతపిశాచవిప్రగ్రహాదిక్రూర[5]దుర్గ్రహంబులు విద్రావణంబులుగా నస్మత్పరవీరమండలంబులగుండియలతోఁ దదీయమానినీదుర్భర

1 వంశకాకృతిం జేయుభూతంబులవలన బలభద్రుండును. 2 కలివలన. 3 దరేంద్రుండు. 4 ధర్వణపూరితం. 5 దృగ్గణంబులు.

గర్భంబులు గర్భస్థార్భకనిర్భేదంబులుగా నవియ బ్రహ్మాండభాండభీకరం బయిన భూరినాదంబున మోదింపు మతితీవ్రధారాదళితనిశాటకోటికఠోరకంఠకరాళరక్తధారాధౌతమలీమసవిసరంబ వైననందకమహాసిశేఖరంబ జగదీశప్రేరితంబ వై మద్విద్వేషివిషమవ్యూహంబుల మెండుగడికండలుగఁ జెండి చెండాడుము నిష్కళంకనిరాతంకనిశ్శంకసాంద్ర చంద్రమండలపరిమండిత సర్వాంగరక్షణావిచక్షణధర్మనిరతంబ వయిన[1]చర్మంబ దుర్మదమద్వైరిలోకభీకరాలోకంబులను సమాకులనిబిడనీరంధ్రనిష్ఠురతమఃపటలపటుఘటనం(బులం) గుటిలపఱుపుము నిఖిలపాపగ్రహంబులవలనను సకలనరమృగసర్పక్రోడభూతాదులవలనను నగు భయంబులు భగవన్నామరూపయానదివ్యాస్త్రంబులవలనం బొంద కుండుఁ గాక బృహద్రథంతరాదిసామంబులచేత స్తోత్రంబు సేయంబడు చున్నఖగేంద్రుండు (రక్షణదక్షుం డై) నన్ను రక్షించుఁ(గాక) శ్రీహరినామరూపవాహనదివ్యాయుధపారిషదోత్తమప్రముఖంబు లస్మదీయబుద్ధీంద్రియమనఃప్రాణంబుల సంరక్షించు భగవంతుం డయినశేషుండు సర్వోపద్రవంబుల నాశంబు సేయు జగదైక్యభావం బయినధ్యానంబు గలవానికి వికల్పరహితుం [2]డై భూషణాయుధలింగాఖ్య లగుశక్తులం దనమాయచేత ధరియించి [3]తేజరిల్లు చుండులక్ష్మీకాంతుండు వికల్పవిగ్రహంబులవలన నన్ను రక్షించుఁగాక లోకభయంకరాట్టహాసభాసురవదనగహ్వరుండగుచు సమస్తతేజోహరణధురీణతేజఃపుంజసంజాతదివ్యనృసింహావతారుం డగునప్పరమేశ్వరుండు సర్వదిగ్భాగంబులవలన సమస్తబహిరంతరంబులవలన నన్ను రక్షించు చుండుఁ(గాత) మని నారాయణాత్మకకవచప్రభావం బితిహాసరూపంబున [4]నింద్రుండు దెలిసికొని ధ్యానంబు సేసి తద్విద్యాధారణమహిమవలన నరాతుల నిర్జించెం గావున నెవ్వ రేని నిర్మలాత్మ లగువారలేతద్విద్యాధారణు లై యనుదినంబును బఠియించిన నతిఘోరరణంబుల నత్యుత్కటసంకటంబులను సర్వగ్రహానిగ్రహకర్మమారణకర్మాది[5]దుష్కర్మజన్యక్లేశంబులను వదలి యవ్యాకులమనస్కు లై విజయంబు నొందుదురు మఱియును సర్వరోగంబులకు నగమ్యశరీరు లై సుఖంబు నొందుదు రదియునుం గాక. 307

సీ. అతిభక్తిఁ గౌశికుం డనుబ్రాహ్మణుఁడు దొల్లి, యీవిద్యధరియించి యెలమి మించి
మరుభూమియందు నిర్మలచిత్తుఁ డై యోగ, ధారణంబున బిట్టు తనువు విడిచె
దానిపై నొకనాఁడు గంధర్వవరేణ్యుండు, చిత్రరథాఖ్యుఁ డజేయుఁ డొంటి
చదలఁ జనంగఁ దచ్ఛాయ తదస్థిపైఁ, గదిసిన నాతఁడు గళవళించి
ఆ. యువిదపిండుతోడ వవవిమానముతోడఁ, దనదువిద్యతోడ ధరణిఁ ద్రెళ్లి

1 'ధర్మంబ. 2 డయ్యు నప్పరమేశ్వరుండు భూషణాయుధచిహ్నిత మైనశక్తిం. 3 విశేష విగ్రహంబు గలలక్ష్మీకాంతుండు నన్ను రక్షించు. 4 మునీంద్రుండు వ్యాఖ్యానంబుసేసి యింద్రున కుపదేశించిన నతండు తద్విద్యా. 5 దుష్కర్మంబులకు నతిభయంకరు లై విజయంబు. వ్రా. ప్ర.

తివిచి లేవలేక తికమక గుడువంగ, వాలఖిల్యమూని వానిఁ జూచి. 308

క. నారాయణకవచసమా, ధారణపుణ్యాప్తి దీని దగ్గఱ నీకుం
గూరెడినె విష్ణుభక్తుల, వారక చేరంగ నెట్టివారికిఁ దరమే. 309

ఇంద్రవజ్రము. సంధించి నీయంగకసంఘ మెల్లన్. బంధించి తన్మంత్రబలంబు పేర్మి
న్నందంబు మాన్పింపఁ దదన్యమేదీ, సింధుప్రవాహోన్నతి[1]చేతఁ దీరున్. 310

వ. కావున నీ విప్పు డీపుణ్యశల్యంబులు భక్తియుక్తుండ వై కొనిపోయి ప్రాఙ్ముఖంబు నఁ బ్రవహించెడుసరస్వతీజలంబుల[2]నిక్షేపణంబుసేసి కృతస్నానుండ వై యాచ మనంబు సేసిన నీసర్వాంగబంధనంబు లుడుగు ననిన నతం డట్లచేసి తనవిమానం బెక్కి నిజస్థానంబున కరిగెం గావున. 311

క. అనుదినము దీని నెవ్వరు, విని లేనిఁ బఠించి లేని విస్మయ మొదవన్
ఘనభూతజాల మెల్లను, మునుకొని వారలను గాంచి మ్రొక్కుచు నుండున్.

ఆ. విశ్వరూపువలన నైశ్వర్యకర మైన, యిట్టివిద్యఁ దాల్చి యింద్రుఁ డపుడు
మూఁడులోకములకు మూఁద లై నట్టిశ్రీ, ననుభవించి మించె నధికమహిమ.

సీ. భూపాల యావిశ్వరూపున కరు దైన, తలలు మూఁ డను వొందఁ గలిగియుండు
నొరిది సురాపానసోమపానంబులు, [3]నన్నాద మనఁగను నమరవరుల
తోఁ గూడి భుజియించి తూకొని వారితో, యజ్ఞభాగంబు ప్రత్యక్ష మొంది
కైకొను చుండి దుర్మర్కుఁ డై యాయజ్ఞ, భాగంబు రాక్షసప్రవరులకును

ఆ. దల్లిమీఁదఁ గలుగుతాత్పర్యవశమున, దివిజవరుల మొఱఁగి తెచ్చి యిచ్చు
నది యెఱింగి యింద్రుఁ డతిభీతచిత్తుఁ డై, తనకుఁ గానియతనితలలు ద్రుంచె.

క. భాసురుఁ డనక మహాత్మా, గ్రేసరుఁ డన కతఁడు పూర్వకృతకర్మగతిన్
వేసరఁ డనక మహేంద్రుఁడు, భూసురుతల లపుడు రోషమునఁ దెగ నడిచెన్.

వ. ఇట్లయ్యింద్రుండు క్రోధంబు సహింపం జాలక విశ్వరూపుతలలు ఖడ్గంబునం దెగ నడిచిన సోమపానంబు సేయుశిరంబు గపింజలం బయ్యె సురాపానంబు సేయు శిరంబు గలవింకం బయ్యె నన్నంబు భక్షించుశిరంబు తిత్తిరి యయ్యె నిట్లు త్రివిధపక్షిస్వరూపంబు దాల్చి బ్రహ్మహత్య యేతెంచి యింద్రునిఁ జుట్టుకొని తమ్ముఁ బరిగ్రహింపు మని నిర్బంధింప నపు డింద్రుం డతిభీతచిత్తుం డై త్రిలోక నాయకుం డై నన్ దానిం దప్పించుకొనం జాలక యంజలి యొగ్గి యమ్మహాదో షంబుఁ గైకొని తద్దోషం బొక్కసంవత్సరం బనుభవించి యంతం బాపుకొను వాఁ డై భూజలవృక్షస్త్రీలం బ్రార్థించి మద్దురితంబు చతుర్విధంబులం బుచ్చికొ నుండనిన భూమి తనయందుఁ జేయంబడినఖాతంబు తనంతన పూఁడునట్టివరంబును జలంబు సర్వంబు దనయందుఁ బ్రక్షాళితం బై నం బావనం బగునట్టివరంబును వృక్షంబులు భేదింపంబడి పునఃప్రరోహంబు గలుగువరంబును స్త్రీ లెల్లపుడుం

1 జేర్పఁ దీరున్. 2 నై చికృత. 3 నన్నంబు మొదలుగా.

దమకుఁ గామసుఖంబు గలుగునట్టివరంబును గోరిన నతం డట్ల కా నొసంగిన నత
నిదుష్కృతంబు ధరణి [1]యీరిణవిధంబునను నుదకంబు బుద్బుదఫేనరూపంబు
నను మహీరుహంబులు నిర్యాసభావంబునను నింతులు రజోవికారంబునను
నిట్లు చతుర్భాగంబులం బంచికొని రంత. 316

మ. హతపుత్రుం డగువిశ్వరూపజనకుం డాత్వష్ట దుఃఖాయతో
ద్ధతరోషానలదహ్యమానుఁ డగుచుం దా నింద్రుపై మారణ
క్రతుహోమం బొనరింప నందుఁ బొడమెం గల్పాంతకాకారవి
శ్రుతకీలానలనిష్ఠురేక్షణగుణాక్షుభ్యత్త్రిలోకోగ్రుఁడై. [చుఁ

సీ. యుగముత్రుంగెడునాఁడు జగములు వొలియించు, నంతకుమూర్తిపై నింతయగు
బఱపునుబొడవును బ్రతిదినంబును నొక్క, శరపాత మంగంబు విరివిగొనుచుఁ
గడుదగ్ధశైలసంకాశదేహమునందుఁ, గరము సంధ్యారాగకాంతి బెరయ
మునుగాఁకరాగిచేఁ గనుమించుమించులఁ, గఱకుమీసలుక చాక్రములు మెఱయఁ
తే. జండమధ్యాహ్నమార్తాండమండలోగ్ర, చటులనిష్ఠురలోచనాంచలవిఘాత
దశదిశాభాగు డుజ్జ్వలతరకరాళ, భీకరసునిశితదంష్ట్రికావదనగుహుఁడు. 318

ఉ. నింగికి నేలకుం బొడవు నిట్టలమై శిఖలందుఁ బర్వను
త్తుంగతరాగ్నిజాలములఁ దొట్రిలుచుం గ్రహపంక్తి జాఱ ని
స్సంగకరాళశాతఘనసద్ఘృణిమండలచండశూల ము
ప్పొంగుచుఁ గేలలీలఁ గొని భూమి చలింపఁగ నోలి నూఁడుచున్. 319

సీ. వదలక విరివిగా వదనంబుఁ దెఱచుచు, నాకాశ మంతయు నప్పళించుఁ
గడనాల్క నిగిడించి గ్రహతారకంబుల, నయ మెల్ల దిగజాఱ నాకి విడుచు
నలవోకయునుబోలె నట్టహాసము సేసి, మెఱసి లోకము లెల్ల మ్రింగఁ జూచుఁ
దనగుదిగ్దంతిదంతములు సెక్కులు వాఱ, నుగ్రదంష్ట్రలు ద్రిప్పు నుక్కుమిగిలి
తే. త్వష్టబలితంపుఁదపమునఁ బుట్టినొంది, యఖిలలోకంబు లెల్లఁ దా నాక్రమించి
వృత్రనామాఖ్య దేవతాశత్రుఁ డగుచు, దారుణాకారుఁ డఖిలదుర్దముఁడు మెఱసె.

మత్తకోకిలము. అట్టివృత్రునిమీఁద దేవత లల్కతోఁ బెనుమూఁకలై
చుట్టి ముట్టి మహాస్త్రవిద్యలు సూపి చేవున నేయ నా
గొట్టువీరుఁడు వార లేసిన క్రూరశస్త్రము లన్నియుం
జుట్టి పట్టుక మ్రింగి శూరత జోక నార్చె మహోగ్రుఁడై. 321

క. భక్షితదివ్యాస్త్రుం డగు, రక్షోనాయకుని నమరరాజప్రముఖుల్
వీక్షింప వెఱచి పఱచిరి, రక్షకుఁ జింతించికొనుచు రయ మొప్పారన్. 322

వ. ఇట్లు సర్వసాధనంబుల(తోడ సాధుజనంబుల) వృత్రాసురుండు మ్రింగిన నచ్చెరు
వడి చేయునది లేక తత్తేజోవిశేషవిభవంబునకు భయంబు నొంది కందినడెం

---

1 'నెఱియ లూషరక్షేత్రంబులవిధంబున' అ. ప్ర.

దంబునం గుందుచుం బురందరప్రముఖు లార్తరక్షకుం డగుపుండరీకాక్షునకుం
గుయ్యిడువార లై. 323

లయగ్రాహి. వీఁడు కడుదుర్దముఁడు వాఁడిమన కైదువులు
పోఁడి చెడఁగా మెసవి యీడు గన కున్నాఁ
డేడ బ్రదు కింకఁ బెనుఁగీడు వొడమెన్ మనకుఁ
దోడుపడ నొక్కరుఁడు లేఁడు హరి దక్కన్
వేఁడుదము శ్రీధరునిఁ గూడుదము సద్భటులఁ
బాడుదము గీతములఁ జోడుపడ నంతన్
వీఁడు చెడుత్రోవ దయతోడ నెడఁగించు ఘనుఁ
డోడక సురాలయము పాడువడ దింకన్. 324

క. అని తలపోయుచుఁ దమలో, మునుకుచుఁ దికమకలు గొనుచు మురరిపుసభకున్
గునుకుచుఁ గునుకుచు నేఁగిరి, ఘనరాక్షసుఁ గన్నకన్నుఁగవ బెగ్గిలఁగన్. 325

వ. ఇట్లు భయార్తు లై యమ ర్త్యవ్రాతంబు సని చని ముందట నభంగభంగరంగ
దుత్తుంగడిండీరమండల సముద్దండాడంబరవిడంబిత నారాయణనిరంతరకీర్తిలతా
కుసుమగుచ్ఛస్వచ్ఛంబును ననవరతగోవిందచరణారవిందసేవాసమాకులకలిత
ఫలితమహాపుణ్యఫలాయమానసముద్దీపితావర్తవర్తితదక్షిణావర్తరుచిరశంఖమం
డల మండితంబును నతినిష్ఠురకఠనపాఠీనపృథురోమరాజీవశకులతిమితిమింగిల
కర్కటకమఠకచ్ఛపమకరనక్రవక్రగ్రహగ్రహణఘుమఘుమాయమానదారుణ
గమనవిషమితవిషమతరంగఘట్టనఘట్టితసముద్ధూతశీకరనికరసిరంధ్రతారకితతా
రాపథంబును మహోచ్ఛ్రయశైలోచ్ఛ్రయశిఖరాగ్రప్రవహితదుగ్ధనిర్ఝరసమ్మా
ర్జితపురాణపురుషవిశుద్ధశుద్ధాంతవిహారణధురీణనవసుధాధౌతధావళ్యధగద్ధగాయ
మానరమ్యహర్మ్యనిర్మాణకర్మంబును నతిపవిత్రగుణవిచిత్రనిజకళత్రప్రేమానంద
సందర్శితముకుందపరిస్రవదంతరంగకరుణారస పరిమిళితభావబంధురవిద్రుమ
వల్లీమతల్లికాంకురశోభితంబును బ్రసిద్ధసిద్ధరసాంబువాహసంగమసముత్థితగంభీర
ఘోషపరిపూరితసకలదిగంతరాళంబును సముద్రమేఖలాఖిలప్రదేశవిలసితనవీ
నదుకులాయమానంబును హరిహరప్రముఖదేవతానిచయపరిలబ్ధామృతమహై
శ్వర్యదానధౌరేయమహానిధానంబును వైకుంఠపురపౌరవారమనోహరకామ్య
ఫలఫలితమందార పారిజాత సంతాన కల్పవృక్ష హరిచందన ఘనవనానుకూల
కూలంబును నై యొప్పుచుఁ గుబేరుభాండాగారంబునుంబోలెఁ బద్మమహాపద్మ
శంఖమకరకచ్ఛపముకుందకుందనీలవరసమగ్రం బై విష్ణుకరకమలంబునుంబోలె
సుదర్శనావర్తప్రగల్భం బై కైలాసమహీధరంబునుంబోలె నమృతకళాస్థాన
శేఖరపదార్పణం బై యింద్రవైభవంబునుంబోలెఁ గల్పవృక్షకామధేనుచిం
తామణిజనితవిశేషం బై సుగ్రీవసైన్యంబునుంబోలె నపరిమితనిబిడహరిసంచా

రం బై నారాయణోదరంబునుంబోలె నిఖిలభువనభారభరణసమర్థం బై శంకరు జటాజూటంబునుంబోలె గంగాతరంగిణీసమాశ్రయం బై బ్రహ్మలోకంబునుంబోలెఁ బరమహంసకులసేవ్యం బై పాతాళలోకంబునుంబోలె ననంతభోగిభోగయోగ్యం బై నందనవనంబునుంబోలె నైరావతమాధవీరంభాదిసంజననకారణం బై సౌదామినీనికరంబునుంబోలె నభ్రంకషం బై విష్ణునామకీర్తనంబునుంబోలె నిర్మలస్వభావం బై క్రతుశతగతుండునుంబోలె హరిపదభాజనం బై యొప్పుచున్న దుగ్ధవారాశి డాసి శ్వేతద్వీపంబు దర్శించి యందు సకలదిక్పాలకాదిదేవతలు దేవదేవు నాశ్రయించి యిట్లని స్తుతియించి రంత. 326

సీ. పంచమహాభూతపరినిర్మితం బైన, ముజ్జగంబుల కెల్ల నొజ్జ యైన
బ్రహ్మయు నేమును బరఁగ [1]నందఱుఁ గూడి, యెవ్వనికై పూజ లిత్తు మెపుడు
నట్టిసర్వేశ్వరుం డాగమవినుతుండు, సర్వాత్మకుఁడు [2]మాకు శరణ మగును
అతిపూర్ణకాము నహంకారదూరుని, సముని శాంతునిఁ గృపాస్పదుని గురుని
తే. మాని యన్యుని సేవింపఁ బూనునట్టి, కపటశీలుని నతిపాపకర్మబుద్ధి
శునకవాలంబు పట్టుక ఘనతరాబ్ధిఁ, దరియఁజూచుటగాదె తాఁ దామసమున.

చ. ఉదకమయంబునై వసుధ నోడగఁ జేసి తనర్చుకొమ్మునన్
వదలక యంటఁ గట్టి మనువల్లభుఁ గాచినమత్స్యమూర్తి స
మ్మదమున మమ్ముఁ బ్రోచు ననుమానము మానఁగ మృత్యుచేతియా
పద దొలఁగించి నేఁడు సురపాలురపాలిటిభాగ్యదైవమై. 328

మత్తకోకిలము. రంతుసేయుచు వాతధూతకరాళభంగురభంగదు
ర్దాంతసంతతసాగరోదకతల్ప మొంది వసించుధా
తంతవానిని బొడ్డుఁదమ్మిన యాఁచి కాచిన నేర్పరిం
తంతవాఁ డనరానియొంటరి యాదరించు మముం గృపన్. 329

తే. దేవతల మైనమే మిట్టి దేవదేవు, సర్వలోకశరణ్యుని శరణు చొచ్చి
బలిత మైనట్టివీనియాపదలఁ బాసి, మీఁది శుభములఁ జేకొనువార మిపుడు.

వ. ఇట్లు స్తుతియించుచున్న దేవతలకు భక్తవత్సలుం డైన వైకుంఠుండు ప్రసన్నుం డయ్యె నప్పుడు. 331

సీ. తగుశంఖచక్రగదాధరుం డగువాని, శ్రీవత్సకౌస్తుభశ్రీలవానిఁ
గమనీయమాణిక్యఘనకిరీటమువాని, దివ్యవిభూషణదీప్తివాని
మండితకోటీరకుండలంబులవాని, సిరి యురస్స్థలమునఁ జెలఁగువానిఁ
దనుఁ బోలుసేవకతండంబు గలవాని, జిలుఁగైనపచ్చనిచేలువానిఁ
ఆ. దెల్లదమ్మివిరులఁ దెగడుకన్నులవాని, నవసుధాద్రవంపునవ్వువానిఁ
గనిమె వేల్పుపిండు కప్పరపాటుతోఁ, గన్నులందు నున్నకఱవు దీఱ. 332

---

1 తక్కినవారు. 2 మమ్ముఁ జాలఁ బ్రోచు.

సీ. తనసేవకులలోనఁ । దడఁబడురూపంబు, శ్రీవత్సకౌస్తుభ । శ్రీలఁ దెలుప
వికచాబ్జములతోడ । వీడ్వడుకన్నుల,కడలు దైవారెడు । కరుణఁ దెలుప
నెల్లలోకములకు । నిల్లైనభాగ్యంబుఁ, గాఁపురం బుండెడు । కమల దెలుప
మూఁడుమూర్తులకును । మొదలైనతేజంబు, తాతఁ బుట్టించిన । తమ్మి దెలుప
ఆ. బుద్ధిఁ బోల్పరాని । పుణ్యంబుఁ దత్పాద,కమలజనిత మైన । గంగ దెలుప
నప్రమేయుఁ డభవుఁ । డవ్యక్తుఁ డవ్యయుఁ, డాదిపురుషుఁ డఖిల । మోది యొప్పె.
వ. ఇట్లు జగన్మోహనాకారుం డయిననారాయణునికృపావలోకనాస్వాదచకితస్వభావ
చరితులై సాష్టాంగదండప్రణామంబు లాచరించి ఫాలభాగపరికీలితకరకమలు
లై యి ట్లనిరి. 334
ఆ. దుర్గమంబు లయిన । స్వర్గాదిఫలములఁ, బుట్టఁ జేయఁ జాలు । నట్టిగుణము
గలిగి మెలఁగుచున్న । ఘనుఁడ వైనట్టినీ, కరయ మ్రొక్కువార । మాదిపురుష.
సీ. దండంబు యోగీంద్ర । మండలనుతునకు, దండంబు శార్ఙ్గకో । దండునకును
దండంబు మండిత । కుండలద్వయునకు, దండంబు నిష్ఠుర । భండనునకు
దండంబు మత్తవే । దండరక్షకునకు, దండంబు రాక్షస । ఖండనునకు
దండంబు పూర్ణేందు । మండలముఖునకు, దండంబు తేజఃప్ర । చండునకును
తే. దండ మద్భుతపుణ్యప్ర । ధానునకును, దండ ముత్తమవైకుంఠ । ధామునకును
దండ మాశ్రితరక్షణ । తత్పరునకు, దండ మురుభోగినాయక । తల్పునకును. 336
ఉ. చిక్కిరి దేవతావరులు । చిందఱవందఱ లైరి ఖేచరుల్
స్రుక్కిరి సాధ్యసంఘములు । సోలిరి పన్నగు లాజిభూమిలో
మ్రక్కిరి దివ్యకోటి గడు । మ్రగ్గిరి యక్షులు వృత్రుచేత నీ
చిక్కనివారి నైన దయ । సేయుము నోవక యుండ నోహరీ. 337
క. మొద లాఁటినరక్కసులకు, మొదలై మా కాపదలకు । మూలం బగుచుం
దుద మొదలు లేనిరక్కసు. తుదిఁ జూపఁ గదయ్య తుదకుఁ । దుది యైనహరీ.
తే. అకట దిక్కుల కెల్ల ది । క్కైన మాకు, నొక్కదిక్కును లేదు కా । లూఁద నైన
దిక్కు గావయ్య నేఁడు మా । దిక్కుఁ జూచి, దిక్కు లే కున్నవారల । దిక్కు నీవ.
క. నీదిక్కు గానివారికి, నేదిక్కును లేదు వెదక । నిహపరములకున్
మోదింపఁ దలఁచువారికి, నీదిక్కే దిక్కు సుమ్ము । నీరజనాభా. 340
తే. అరయ మా తేజములతోడ । నాయుధములు
మ్రింగి భువనత్రయంబును । మ్రింగు చున్న
భీకరాకారు వృత్రునిఁ । బీఁచ మడఁచి
యెల్లభంగుల మాఁబన్న । మీఁగు మభవ. 341
ఆ. పరమపురుష దుఃఖ । భంజన పరమేశ, భక్తవరద కృష్ణ । భవవిదూర
జలరుహాక్ష నిన్ను । శరణంబు వేఁడెద, మభయ మిచ్చి కావ । వయ్య మమ్ము.

వ. [1]నమస్తే భగవన్నారాయణ వాసుదేవ యాదిపురుష మహానుభావ పరమమంగళ పరమకల్యాణ దేవ పరమకారుణికు లయినపరమహంస లగుపరివ్రాజకులచేత నాచరితంబు లగుపరమసమాధిభేదంబులం బరిభావితపరిస్ఫుటం బయినపరమహంసధర్మంబుచేత నుద్ఘాటితం బగుతమఃకవాటద్వారంబున నపావృతం బయిన యాత్మలోకంబున నుపలబ్ధమాత్రుండ వై నిజసుఖానుభవుండ వై యున్ననీ వాత్మసమవేతంబు లై యుపేక్షింపంబడనియీశరీరంబులకు నుత్పత్తిస్థితిలయకారణుండ వై యుండుదువు గుణసర్గపతితుండ వై యపరిమితగుణగణంబును గల నీవు దేవదత్తునిమాడ్కిం బారతంత్ర్యంబున స్వకృతంబు లైనకుశలాకుశలఫలంబుల ననుభవింతువు షడ్గుణైశ్వర్యసంపన్నుండ వైననీ వాత్మారామస్వభావుండవయి యపరిమితగుణగణంబులు గలిగి యీశ్వరాహ్వయానవగాహ్యమాహాత్మ్యంబందు నర్వాచీనవికల్పవితర్కవిచారప్రమాణాభాసంబులగుతర్కశాస్త్రంబులం గర్కశంబు లయినప్రజ్ఞలు గలిగి దురవగ్రహవాదు లైనవిద్వాంసులవివాదావసరంబులయందు నుపరతంబు లగున స్తినాస్తీత్యాదివాక్యంబుల సమస్తమాయామయుండ వై నిజమాయచేతం గానంబడక యుక్తిగోచరుండ వై సమవిషమరూపంబులం బ్రవర్తింతువు దేవా రజ్జుఖండంబునందు సర్పభ్రాంతి గలుగున ట్లొండు ద్రవ్యంబున ద్రవ్యాంతరభ్రాంతి గలుగుచుండు సర్వేశ్వర సర్వజగత్కారణరూపంబ వైననీవు సర్వభూతప్రత్యగాత్మ వగుటం జేసి సర్వగుణావభాసోపలక్షితుండ వై కానంబడుచుందువు లోకేశ్వరా భవత్కథామహామృతసముద్రవిప్రుడసకృత్పానమాత్రంబున సంతుష్టచిత్తు లై నిరంతరసుఖంబున విస్మారితదృష్టశ్రుతవిషయసుఖలేశాభాసు లైనపరమభాగవతులు భవచ్చరణకమలసేవా

1 ఇందులకు 'మఱియును భగవన్నారాయణ.... భేదంబులం బరిస్ఫుటం బయినపరమహంసధర్మంబుచేత ననువాదితం బగుపరమకపాలద్వారంబున నావృతం బయిన యాత్మలోకంబున... సమవేతంబు లై యుపేక్షింపంబడునశరీరంబులకు.... గుణసర్గభావితుండ వై .... బారతంత్ర్యంబున నబ్బినకుశలఫలంబులు ననుభవించి చింతింతువు షడ్గుణైశ్వర్యసంపన్నుండ వైననీ వాత్మారాముండ వయి యుందువు గుణసర్గభావితుండ వయి యపరిమితగుణగణంబు లర్వాచీనవితర్కవిచారప్రమాణభావంబు లగు తర్కశాస్త్రంబులం గర్కశంబు లైనప్రజ్ఞ గలిగి దురాగ్రహవాదు లైనవిద్వాంసుల వివాదావసరణంబులయందు.... గోచరుండ వై సమస్తవిషమరూపంబులం బ్రవర్తింతువు. దేవా రజ్జువునందు సర్పభ్రాంతిగలుగునట్లు ద్రవ్యాంతరంబులచేత బ్రహ్మంబయిననీయందుం బ్రపంచభ్రాంతిగలిగెడి నని యిట్లతిమనోహరచతురవచనంబులు' అచ్చుప్రతి. ఈపాఠము 'ఓం నమస్తే అస్తుభగవన్నారాయణాయ....' అనుమూలమునకు అనుగుణము కామిచేతను వ్రాఁతప్రతులపాఠ మనుగుణ మగుటంబట్టియు, రెండవపాఠమే గ్రంథమునం గూర్పంబడియె మఱియు మూలమునందు 'సఏవహి పున స్సర్వవస్తుషు వస్తుస్వరూప స్సర్వేశ్వర స్సకలజగత్కారణ...' మొదలుకొని 'గ్రస్తానియేనవః కృష్ణతేజాంస్యస్త్రాయుధానిచ' అనువఱకుం గలగొప్పగ్రంథమునకు వ్రాఁతప్రతులందే తెనుఁగు గానిపించుచున్నది. కాని యచ్చుప్రతులం గానిపింపదు.

ధర్మంబు విడువరు త్రిభువనాత్మ భవన త్రివిక్రమ త్రిణయన త్రిలోక మనోహ
రానుభావ భవదీయ మైన భవవిభూతిభేదంబు లైన దనుజాదులకు ననుపక్రమస
మయం బెఱింగి నిజమాయాబలంబున సురనరమృగజలచరాదిరూపంబులు ధరి
యించి తదీయావతారంబుల ననురూపం బైనవిధంబున శిక్షింతువు భక్తవత్స
లా భవన్ముఖకమలనిర్గతమధురవచనామృతకళావిశేషంబుల నిజదాసుల మైన
మాహృదయతాపం బడంగింపుము జగదుత్పత్తిస్థితిలయకారణప్రదానదివ్య
మాయావినోదవర్తి వై సర్వజీవనికాయంబులకు బాహ్యాభ్యంతరంబులయందు
బ్రహ్మప్రత్యగాత్మస్వరూపప్రధానరూపంబుల దేశకాలదేహావస్థానవిశేషంబులఁ
దదుపాదానానుభవంబులు గలిగి సర్వప్రత్యయసాక్షివై సాక్షాత్పరబ్రహ్మస్వరూ
పుండవై యుండెడినీకు నేమని విన్నవించువారము జగదాశ్రయంబై వివిధవృజిన
సంసారపరిశ్రమోపశమనం బైనభవదీయదివ్యచరణశతపలాశచ్ఛాయ నాశ్ర
యించెద మని పెక్కువిధంబుల వినుతించి యిట్లనిరి. 343

క. తేజంబు నాయువును వి, భ్రాజితదివ్యాయుధములుఁ బరువడి వృత్రుం
డాజిముఖంబున మ్రింగెను, మాజయ మిం కెందుఁ జెప్పుమా జగదీశా. 344

వ. అని యిట్లతిమనోహరంబు లైనవచనంబుల భక్తిపరవశు లయి వినుతిసేయు
చున్నదేవతలం జూచి యప్పరమేశ్వరుం డమృతప్రాయంబు లగుగంభీరభాషణం
బుల ని ట్లనియె. 345

క. మదుపస్థానం బగుమీ, సదమలసుజ్ఞానమునకు సంతోషమునం
బొదలె మదిఁ బ్రీతి నొందితి, వదలక నాభక్తి వొడమి వ్యర్థం బగునే. 346

వ. మఱియును బ్రీతుండ నైననాయందు భక్తులకుం బొందరానియర్థంబు లేదు
విశేషించి నాయందు నేకాంతమతి యైనతత్త్వవిదుం డన్యంబులం గోర కుండు
గుణంబులయందుఁ దత్త్వజ్ఞానగోచరుం డైనవాఁడు విషయనివృత్తచిత్తుం డై
సంసారమార్గంబు నిచ్ఛింపండు కావున మీకు శుభం బయ్యెడు దధీచి యను
ఋషిసత్తముండు గలం డతనిశరీరంబు [1]మద్విద్యాతిశయమహత్త్వంబునను దే
జోవిశేషంబునను సారవంతం బై యున్నయ దతని నడిగి తచ్ఛరీరంబుఁ బుచ్చి
కొనుం డతండు పూర్వకాలంబున నశ్విదేవతలకు నశ్వశిరోనామం [2]బను బ్రహ్మస్వ
రూపం బగునిష్కళంకం బయినవిద్య యుపదేశించిన వారలు జీవన్ముక్తత్వంబు
నొందిరి మఱియుఁ ద్వష్టృపుత్రుం డయినవిశ్వరూపునకు మదాత్మకం బయినయ
భేద్యకవచంబు నిచ్చెఁ గావున నతం డతివదాన్యుం డశ్విదేవతలచేత యాచింపం
బడి దేహంబు వంచింపక మీ కిచ్చు నతనిశల్యంబులు విశ్వకర్మనిర్మితంబు లై
శతధారలు గలయాయుధశ్రేష్ఠం బయి మత్తేజోపబృంహితం బయి వృత్రాసుర

1. మద్విద్యాతిశయంబునను సద్వ్రతాతిశయంబునను దేజోమహత్త్వంబునను సారం బై యున్నయది. 2 బను నిష్కళంకం బైనబ్రహ్మవిద్య.

శిరోహరణకారణం బయి యుండు దానంజేసి మీరు పునర్లబ్ధతేజో౽స్త్రాయుధసం
పదలు గలిగి వెలింగెదరు విశేషించియు మద్భక్తవరు లయినవార లేలోకం
బుల నెవ్వరికి నజయ్యులు కావున మీకు భద్రం బయ్యెడు మని యాదేశించి
భూతభావనుం డైనభగవంతుండు వారల కదృశ్యుం డయ్యె నప్పుడు దేవతలు
దధీచిమునికడకుం జని యశ్వాలం బురస్కరించుకొని యిట్లనిరి. 347

ఆ. దేహి సుఖము గోరి । దేహంబు ఘటియించు, దేహి విడువలేఁడు । దేహమెపుడు
దేహి యస్మదీయ । దేహంబుకొఱకు నై, దేహ మీఁ గదయ్య । దేవతలకు. 348

ఉ. ఎక్కడ నెల్లలోకముల । నెవ్వరుఁ గోరనికోర్కి నేఁడు మా
తెక్కలిపాటు కై తివిరి । దేహము వేఁడఁగ వచ్చినార మే
మెక్కడఁ దీవ్రకర్మగతి । యెక్కడ దైవకృతంబు గాక యీ
[1]రొక్కపుదాన మీవరుస । రోయక వేఁడుదురే జగంబులన్. 349

క. నీచగతి యెల్లభంగుల, యాచన యని తెలిసి తగని । దడుగుదు రేనిన్
యాచకవర్గములోపల, [2]నీచకు లనఁబడరె యెంత । నేర్పరు లైనన్. 350

క. అడుగంగ రానివస్తువు, లడుగరు బతిమాలి యెట్టి । యర్థులు నిను నే
మడిగితిమి దేహ మెల్లను, గడు నడిగెడువారి కేడఁ । గరుణ మహాత్మా. 351

ఉ. నావుడు నాదధీచియు మ । నంబున సంతస మంది నవ్వి సం
భావితవాక్యపద్ధతులఁ । బల్కుచు నిట్లనెఁ బేర్మితోడ నో
దేవతలార ప్రాణులకుఁ । దెక్కలిమృత్యుభయంబు పూను టే
భావములం దలంపరు కృ । పామతి నెన్నఁడు మీమనంబులన్. 352

ఆ. ఎలమి బ్రదుక నిచ్చ । యించినవారికి, దేహ మెల్లభంగిఁ । దీపు గాదె
యచ్యుతుండు వచ్చి । యర్థించె నేనియుఁ, దన్ను నిచ్చునట్టి । దాత గలఁడె. 353

వ. అదియునుం గాక. 354

సీ. అర్థంబు వేఁడెడు । నర్థులు గలరు గా, కంగంబు వేఁడెడి । యర్థి గలఁడె
తగుకోరికల నిచ్చు । దానశీలుఁడు గాక, దనదేహ మీ నేర్చు । దాత గలఁడె
యీ నేర్చువాఁడు ద । న్నిచ్చిన రోయక, చంపెడునట్టియా । చకుఁడు గలఁడె
చంపియుఁ బోవక । శల్యంబు లన్నియు, నేటి పంచుకపోవు । వారు గలరె

ఆ. రమణ లోక మెల్ల । రక్షించువారికి, హింస సేయుబుద్ధి । యెట్టు వొడమె
బ్రాఁతి యైనయట్టి । ప్రాణంబుపైఁ దీపు, తమకుఁబోలె నెదిరిఁ । దలఁప వలదె.

వ. అనిన దేవత లిట్లనిరి. 356

తే. సర్వభూతదయాపర । స్వాంతులకును, బుణ్యవర్తను లగుమిమ్ము । బోఁటివారి
కమితసత్కీర్తికాముల । కలఘుమతుల, కియ్యరానిపదార్థంబు । లెవ్వి గలవు.

ఆ. అడుగరానిసొమ్ము । నడుగ రా దని మానఁ, డడుగువానిమాట । లడుగ నేల

---

1 చక్కనిదాన 'మీ' నొకఁడు చాలునె. 2 నీచకయాచకము గాదె నిర్ణయమతికిన్.

భ్రాంతి నడుగుచోటఁ బ్రాణంబు లేనియు, నిచ్చువాఁడు దాఁపఁ డిచ్చుఁగాని.

వ. అని పరసంకటంబు దలంపక నిలింపులు (గార్యపరతఁ సవినయ) వాక్యపరంపరలఁ బ్రార్థించిన నతండు దరహసితభాసితవదనుం డై యఖిలలోకధర్మం బెఱింగియు నొక్కింతకాలంబు ప్రతివాక్యం బిచ్చితి దీని సహింపం దగుదురు మీయట్టివార లకుం బ్రియం బగునేని నెప్పుడైన విడువం దగినశరీరంబు విడుచుట యేమిదుర్లభం బధువం బైనయీశరీరంబుచేతం గీర్తిసుకృతంబుల నెవ్వం డార్జింప కుండు నతండు పాషాణాదులకంటె నతికష్టుండు మీయట్టిపుణ్యశ్లోకులచేత నాశింపంబడినయీశరీరం బప్రమేయధర్మార్జితం బేదేహంబుచేత నేనియు సకలభూతంబులు శోకానుభవంబున శోకించు హర్షానుభవంబున హర్షించు నట్టి మహాకష్టదైన్యాకరం బైనయీశరీరంబు కాకశునకసృగాలాదులపాలు గాకుండ మే లయ్యె నని నిశ్చితాత్ముండయి దధీచి దత్త్వావలోకనంబుచేత నిరసితబంధనుం డై బుద్ధీంద్రియమానసంబులతోడఁ గూడినక్షేత్రజ్ఞునిఁ బరబ్రహ్మస్వరూపం బైన భగవంతునందు నేకీభూతంబుసేసి యోగజ్ఞానంబున శరీరంబువిడిచె నప్పు డింద్రుం డతనిశల్యంబుల విశ్వకర్మనిర్మితం బై నిశితశతధారాసమావృతం బై వెలుంగు వజ్రాయుధంబుఁ గైకొని భగవత్తేజోపబృంహితుం డయి యైరావతారూఢుం డై సకలదేవోత్తమగరుడగంధర్వఖచరకిన్నరకింపురుషసిద్ధవిద్యాధరపరిసేవితుం డై సకలమునిజనంబులు వినుతింపఁ ద్రిలోకహర్షకారి యై (భగవదనుగ్రహసంప్రాప్తమహోత్సాహవికసితవదనారవిందుం డై) వృత్రాసురుపై నడచె నప్పుడు.

ఉ. వృత్రుఁడు మానవాన్వయపవిత్రుఁడు లోకజిఘాంసకక్రియా
సూత్రుఁడు విగ్రహగ్రహణసుస్థిరవాక్యవివేకమానచా
రిత్రుఁడు దేవలోకరగడకరీకృతవక్త్రుఁడు రోషదూషితా
మిత్రుఁడు శత్రురాకఁ గని మిక్కిలి యైనయుగాంతరాకృతిన్. 360

క. మెండు గలదనుజనాయక, మండలములు గొల్వ నడచె మహితోద్ధతి వే
దండములనడుమఁ జనునడ, గొండయునుంబోలె నిబిడకోపోద్ధతుఁ డై. 361

క. కాలగతిఁ డడరి కడువడిఁ, గాలునిపైఁ గవయుమాడ్కి ఖరతరరవసం
[1]చాలితపూర్వదిగంతరుఁ, డై లీల మహేంద్రుమీఁద నతఁ డరిగె నృపా. 362

వ. ఇట్లు రుద్రగణంబులు మరుద్గణంబు లాదిత్యగణంబులు నశ్విదేవతలుఁ బితృదేవతలు విశ్వేదేవులు వహ్ని యమ నైరృతి వరుణ వాయు కుబేరేశానాదులు సిద్ధసాధ్యకిన్నరకింపురుషగరుడగంధర్వఖేచరప్రముఖంబు లగునింద్రసైన్యంబుల తోడ నముచియు శంబరుండును ననర్వుండును ద్విమూర్ధుండును వృషభుండును నంబరుండును హయగ్రీవుండును శంకుశిరుండును విప్రచిత్తియు నయోముఖుండును బులోముండును వృషపర్వుండును హేతియుఁ బ్రహేతియు నుత్కటుండు

1 చారితసర్వదిగం... నడరె నృపాలా.

ను ధూమ్రకేశుండును విరూపాక్షుండును కపిలుండును విభావసుండును నిల్వ
లుండును బల్వలుండును దందశూకుండును వృషధ్వజుండును కాలనాభుండును
మహానాభుండును భూతసంతాపనుండును వృకుండును సుమాలియు మాలియు
ము న్నగు దైతేయదానవయక్షరాక్షసా ద్యసంఖ్యంబు లగువృత్రాసురబలంబు
లంతంతం దలపడి సమరంబు సేసి రప్పుడు. 363

చ. అసురులకుఁ సురావలికి న య్యె మహారణ మప్పు డొండొరుల్
ముసల గదాసి కుంత శర ముద్గర తోమర భిందిపాల ప
ట్టిసపటుశూలచక్రముల దేవలు సూపి యదల్చి యార్చుచుఁ
మసలక కప్పి రస్త్రముల మార్కొని మంటలు మింట నంటఁగన్. 364

క. ఒండొరులఁ గడవ నేసిన, కాండము లాకాశపథముఁ గప్పి మహోల్కా
[1]దండంబు లోలసి నిష్ఠుర, భండనముఖ మొప్పెఁ జూడఁ బ్రళయోచితమై.

చ. సురవరు లేయుబాణములు సూడిక్క కగోచరమై నభస్స్థలం
బఱిమిఱిఁ గప్పి [2]రేసి దివసాంతముఁ జేసినలీల నాసురే
శ్వరబల[3]యూథవీరులును సాయకపంక్తులచేత వాని రూ
పఱ [4]శతధూళిఁ జేసి పఱ పైనతమం బొనరించి యార్చుచున్. 366

చ. సమరమదాంధులై సురనిశాచరవీరులు సైనికాంఘ్రిసం
క్రమితమహీపరాగములు గ్రమ్మిన నమ్మలికంపుఁజీఁకటుల్
దమకనుదోయి కడ్డముగఁ దాకొనినం జల మూఁది పోరి రా
క్రమితనిజాంతరంగపరిఘట్టితరోషమహాగ్ని పెంపునన్. 367

క. అతిగళితరక్తధారా,క్షతములతోఁ గానఁబడిరి సైనికులు మహో
ద్ధతరోషవహ్నికీలలు, వితతంబై పిక్కటిల్లి వెడలెడిభంగిన్. 368

సీ. రవణించుశింజినీటంకారరవములు, భటసింహనాదంబుఁ బరిఢవింప
భీషణోత్తమహయహేషావిఘోషంబు, కరిబృంహితస్ఫూర్తిఁ గ్రందుకొలుప
సమర[5]నిశ్శంకాంకశంఖనినాదంబు, నేమిస్వనంబుల నిహ్నవింపఁ
దుములమై చెలఁగెడుమందుభిధ్వానంబు, లట్టహాసంబుల నాక్రమింప

తే. ఘటితశస్త్రాస్త్రనిష్ఠురఘట్ట[6]నోత్థ, ఖరకరోగ్రోరువిస్ఫులింగంబు లడరి
దివ్యకోటీరమణిఘృణి ధిక్కరింప, సమర మొనరించి రసురులు నమరవరులు.

వ. ఇట్లు ప్రళయసంరంభవిజృంభితసముత్తుంగరంగత్తరంగితభైరవారావనిష్ఠ్యూత
నిష్ఠురమహార్ణవంబునుంబోలె యుగాంతసంక్రాంతఝుంఝూపవనపరికంపితదీర్ఘ
నిర్ఘాతనిబిడనిష్ఠురనీరదంబులుంబోలె నుభయసైన్యంబులుం గలసి సంకులసమ
రంబు సలుపుసమయంబున యుగాంతకృతాంతసకలప్రాణిసంహారకారణలీలయుం

1. దండములువోనినిష్ఠుర. 2. లేని. 3. యోధవీరులును. 4. శరఘాళితోడఁ బఱపైన. 5 నిస్సాణాంక. 6 నోగ్ర, ఖరకరకరోరు.

జోలెంబదాతిరాహుత్తగజారోహకరథికమహారథికవీరు లొండొరులు చండగతిం గాండంబులు పఱపుచు గదలం జదుపుచుం గత్తులం గత్తళంబులం జినుఁగం బొడుచుచు నడిదంబుల నడుచుచుం గుంతంబులం గ్రుచ్చుచుం గుఠారంబుల వ్రచ్చుచు ముసలంబుల మోఁదుచు ముద్గరంబులం బాఁదుచుం జక్రంబులం ద్రుంచుచు సబళంబుల నొంచుచు సురియల మెఱుముచు శూలంబులం దుఱుముచు వాజుల కుఱికియు వాలంబుల నఱికియుం దొడలు తుండించియుం దొండంబులు ఖండించియు మెడ లెడయించియు మొగళ్లు గెడయించియు నడుములు ద్రుంచియు నాసికలు ద్రెంచియుం బదంబుల విఱిచియుం బార్శ్వంబులం జఱిచియు గజంబులం బఱిపియు గాత్రంబుల నుఱిపియుం గుంభంబులం బగిలించియుం గొమ్ములం బెకలించియు హస్తంబులం ఖండించియు నంగంబులం జించియు రథంబుల నలియించియు రథికులం బొలియించియు సారథులం జంపియు సైంధవంబుల దంపియు శిరంబుల నొగిలించియు సీసకంబు లగిలించియు ఛత్త్రంబులనుఱుమాడియుం జామరంబులం దుఱుమాడియు సైన్యంబులం జదిసియు సాహసుల మెదిపియు (నడుములు ద్రుంచియు మఱియును) బరస్పరగుణవిచ్ఛేదనంబును నన్యోన్యకోదండఖండనపటుత్వంబును నుభయసైంధవధ్వజసారథిరథికరథవికలనంబును నొండొరుల పాదజానుజంఘాహస్తమస్తకనిర్దళనంబును రక్తమాంసమేదఃపంకసంకలితసమరాంగణంబును నై యతిఘోరభంగిం బెనంగి రప్పుడు. 370

చ. సమజయముం సమాపజయసామ్యపరిశ్రమముం సమానవి
క్రమము సమాస్త్రశస్త్రబలగర్వము నై కడుఘోరభంగి నా
నముచిహరాగ్రసైన్యగణబాహులతోడ నిశాచరేశ్వరో
త్తములు దురంబు సేసి రొగిం దాకొని వృత్రుబలంబుప్రాపునన్. 371

వ. అప్పుడు. 372

లయగ్రాహి.
మొత్తముగఁ బాఱుపెను నెత్తురుమహానదులఁ దత్తఱముతో నుఱికి కుత్తుకలు మోవం
జిత్తముల నుబ్బి వెస నెత్తుకొనుభూతములు సత్తుకొని శాకినులు జొత్తిలెడిమాంసం
బుత్తలముతో మెసఁగి నృత్తములు సేయుమద మత్తఘనడాకినులు నృత్తగతిఁ బ్రేవుల్
బిత్తరములందిగిచి మెత్తమెదడుల్గొనసి సత్తుగొనుచుండ భయవృత్తిఁ గల నొప్పెన్.

వ. ఇట్లు దేవదానవులు నర్మదాతీరంబునఁ గృతయుగంబునం దలపడి త్రేతాయు
గంబు సొచ్చునంతకాలంబుఁ బోరు దారుణంబుగాఁ జేయుచుండ నంత వృత్రా
సురుభుజబలంబు పెంపునఁ దెంపు సేసి కంపింపక నిలింపులపై రక్కసులగుంపులు
సొంపుపెంపు చూపి మహావృక్షపాషాణగిరిశిఖరంబులు వర్షించిన. 374

మ. గిరిపాషాణమహీజముల్ గురియఁగా గీర్వాణు లన్నింటి ని

క్షురనారాచపరంపరల్ వఱపుచుం జూర్ణంబుఁ [1]గావింప ని
ర్భరలీలం దమచేయుసత్త్వములు దోర్భంగంబులై పోవఁగాఁ
దెరలన్ రాక్షసయోధవీరులు మదోద్రేకంబు సంఛిన్నులై. 375

క. ప్రచురముగ రాక్షసావళి, ఖచరులపై నేయునిబిడకాండావళి దు
ర్వచనుఁ డెడనాడుమాటలు, సుచరిత్రునియందుఁబోలెఁ జొరవయ్యె నృపా.

వ. అప్పుడు. 377

వనమయూరము.

అంత సుర లేయునిబిడాస్త్రములపాలై, పంతములుదక్కి హతపౌరుషముతో ని
శ్చింతగతి రక్కసులు సిగ్గుడిగి భూమిన్, గంతుకొని పాఱి రపకారపరు లార్వన్.

క. కొండలఁ బోలెడురక్కసు, లొండొరులం గడవఁ బాఱి [2]రుక్కఱి పటుకో
దండముఖసాధనంబులు, భండనమున వైచి దివిజపతు లార్వంగన్. 379

వ. ఇట్లు సమరతలంబు వాసి తనప్రాపు దూసి తీసి పఱచు చుండుదండనాయకులం
జూచి యకుటిలమతిం బకపక నగి వృత్రాసురుం డిట్లనియె. 380

ఉ. క్షుల్లకవృత్తి మీ కగునె శూరుల కిమ్మెయిఁ గీర్తిభోగముల్
గొల్లగఁ జేయుచావు మదిఁ గోరినవారల [3]కేను గల్గ నీ
తల్లడ మంది యీసమరధర్మము మాని తలంగఁ బాడిగా
మల్లుఁడు దుర్దమప్రథనమత్తుఁడు వృత్రునిప్రాపెఱుంగరే. 381

క. చావు ధ్రువ మైనప్రాణికిఁ, జావులు రెం డరసికొనుఁడు సమరమునందున్
భావింప యోగమందును, జావంగా లేనిచెడుగుచావుం జావే. 382

వ. అని వాసుదేవతేజోవిశేషవిశేషితుండై దవానలకీలలంబోలె వెలుంగుచు వెఱచి
వెన్నిచ్చి పఱచునసురుల వెనుకొని తఱుముసురవీరులం జూచి హుంకరించి
స్వర్గానుభవంబున నిచ్చ లేకుండెనేని మదవలోకనస్పర్శనమాత్రంబు ముందర
నిలుతురు గాక యని ఱేచి కల్పాంతానల్పఘనఘనాటోపంబునుంబోలెఁ గఠోర
కంఠహుంకారభర్జనంబులన్ గర్జిల్లుచుఁ బ్రళయకాలపవనపరిభాసితమహాశిఖిశి
ఖావళులఁ దృణీకరించుకుటిలావలోకనంబుల నాలోకించుచుం గాలపరిపక్వలీలా
లోలుం డయినశూలిపోలిక నాభీలమూర్తియై సకలజీవభారభరణదుర్భరభగ్న
బ్రహ్మాండభాండమహాధ్వానంబుగా నాస్ఫోటించిన. 383

ఉ. కూడె జగంబు లన్నియును గ్రుంకిరి సూర్యసుధాంశు లద్రు లూ
టాడె నభస్స్థలం బగిలె నంబుధు లింకె నుడుగ్రహాళిప
ట్టూడె వడిన్ దిశల్ వగిలె నుర్వర గ్రుంగె నజాండభాండ మ
ల్లాడె విధాత బెగ్గడిలె నార్చుచు వృత్రుఁడు బొబ్బ వెట్టినన్. 384

1 గావించి నిర్భర... సత్త్వములతోభంగంబులై ... దెరలెన్. 2 రుక్కుటపటు. 3 కైనఁగల్గునే.

లయగ్రాహి.
కూలిరి వియచ్చరులు సోలిరి దిశాధిపులు వ్రాలి రమరవ్రజము దూలి రురగేంద్రుల్
[1]ప్రేలిరి మరుత్తులెడ జాలిగొని రాశ్వినులు కాలుడిగి రుద్రులవలీలఁ బడి రార్తిన్
వ్రేలిరి దినేశ్వరులు కీ లెడలినట్లు సురజాలములు పెన్నిదుర పా లగుచు ధారా
భీలగతితోడఁ దమ కేలిధనువుల్ విడిచి నేలఁ బడి మూర్ఛలను దేలిరి మహాత్మా.

వ. ఇట్లు కఠోరకంఠనాదం బొనర్చిన నశనిపాతంబునం గూలు ప్రాణిచయంబు భంగి నంగంబు లెఱుంగక రణరంగంబునం బడి బిట్టు మూర్ఛిల్లిన దివిజరాజసైన్యంబుల వృత్రాసురుండు సంగరరంగదుర్దముండై మహీవలయంబు పదాహతుల గజగజ వడంక నిశితశూలంబు గేల నంకించుచు మదించిన భద్రమాతంగంబు కమలవనంబు చొచ్చి మట్టి మల్లాడు విధంబున నిమీలితాక్షుం డయి తనపదతలంబుల రూపంబులు మాయం జమురుచు వెక్కసంబుగఁ గ్రీడించువానిం గని వజ్రి వజ్ర(శతోపమ)నిష్ఠురగదాదండం బాభీలభంగిఁ బ్రళయకాలమార్తాండచండపరివేషఘోరంబుగాఁ ద్రిప్పి వైచిన. 386

మ. అది మింటం బెనుమంట లంటఁ బఱపై యాభీలవేగంబునం
గదియన్ వచ్చిన లీల వామకరసంక్రాంతంబు గావించి బె
ట్టిదుఁడై చేరి సురారి దానిఁ గొని కాఠిన్యోరుపాతంబులం
జదియన్ మోఁదె గజేంద్రమస్తకము నుత్సాహైకసాహాయ్యుఁడై. 387

ఆ. అగ్గజంబు గులిశహతిఁ గూలుకులమహీ,ధ్రంబుఁ బోలె రక్తధార లురుల
మస్తకంబు వగిలి మద మఱి జిఱజిఱఁ, దిరిగి భీతితోడఁ దెరలి పఱచె. 388

ఉత్సాహము. గజము దెరలి దాని కొఱలి కంప మొంది పాఱఁగా
భజన నింద్రుఁ డంకుశమునఁ బట్టి బిట్టు నిల్పుచుం
నిజసుధా[2]రసైకపాననిర్ణయార్ద్రకరమునన్
ఋజుత మీఱ నిమిరె నదియు [3]రీతి మెఱసి క్రమ్మఱన్. 389

వ. ఇవ్విధంబున నైరావతంబును సేద దేర్చుచు నెదుర నిలుచున్న భిదురపాణిం గని తోఁబుట్టువుఁ జంపిన తెంపుఁ దలంచి మోహశోకంబుల విపర్యాసంబుగా నవ్వుచు నాహవకామ్యార్థి యై వృత్రుం డిట్లనియె. 390

శా. నాకుం బెద్దన నీకు సద్గురువు దీనవ్రాతరక్షున్ శుభా
లోకుం జంపితి విట్లు పాపమతి వై లోభంబుతో నియ్యెడన్
లోకుల్ నవ్వఁగ మద్భుజాపటిమకున్ లోనైతి వీశూలమం
దాకంపింపఁగ నిన్ను గ్రుచ్చి ఋణముక్తాత్ముండ నై పేర్చెదన్. 391

---

1 ప్రేలిరి దివాకరులు♦ కాలుడిగిరుద్రు లవ♦ లీలఁబడిరశ్వినులు♦ జాలిగొని రార్తిన్. 2 రసార్ద్రహస్తనిభృత మైనకరమునన్ 3. రూఢిఁ దెలిసి క్రమ్మఱన్.

క. ఎట్టితులు వయినఁ గానీ, నెట్టన తన బ్రదుకుకొఱకు నీవలె గురువుం
జుట్టమును బుణ్యు బ్రాహ్మణుఁ, బట్టి వధింపంగఁ గలఁడె పశువుంబోలెన్. 392
చ. దయయును సత్యముం విడిచి ధర్మము మాని యశంబుఁ బాసి శ్రీ
జయములఁ బాఱఁ దోలి పురుషత్వము గానక లోకనిందితా
హ్వాయుఁ డగువానిచావునకు నార్యులు గుందుదు రే సృగాలముల్
ప్రియమున నంటునే శవముఁ [1]బ్రేలక చేరునె కంకగృధ్రముల్. 393
క. నిక్క మగుపాపములచేఁ, జిక్కితివి నిశాతశూలశిఖరాగ్రమునం
ద్రొక్కించి నీదుమాంసము, గుక్కలు నక్కలును బెఱికికొని తినఁజేతున్. 394
ఉ. దీకొని నీకు నేఁ డిచట దిక్కని వచ్చినవారు గల్గిరే
నేకమతిం బిశాచముల కెల్లను దృప్తిగ మన్నిశాతశూ
లైకమహాగ్నికీలల ననేకవిధంబుల సోమయాజి నై
మేఁకలఁ జేసి వ్రేల్చెద నమేయమదోద్ధతి వ్రాలి యియ్యనిన్. 395
క. కాక ననుఁ గులిశధారల, దీకొన నిర్జింపఁ గలిగితేనియు భూతో
ద్రేకంబు సేసి శూరుల, ప్రాకటపదపద్మధూళి[2]భాగం బగుదున్. 396
వ. అని మఱియు వాసుదేవకృపాలబ్ధదుర్నిరీక్ష్యుం డైన వజ్రహస్తునింగని యిట్లనియె.
సీ. సందియం బేటికి జంభారి వేవేగ, భిదురంబు వ్రేయు మాభీలభంగి
నతిలోభి నడిగినయర్థరాశియుఁబోలెఁ, గడపకు మిది వృథ గాదు సుమ్ము
మురమర్దనుని తేజమున నాదధీచి వి, ద్యాతిశయంబున నధిక మయిన
యది గాన హరిచే నియంత్రితోన్నతుఁడ వై, గెలువుము శత్రుని గీటడంచి
ఆ. యెందుఁ గలఁడు విష్ణుఁ డందు జయశ్రీలు, వొందుగాఁగ వచ్చిపొందుచుండుఁ
గాన భక్తవరదుఁ గమలాక్షు సర్వేశు, పదములందు మనముఁబదిలపఱుతు.
వ. ఇపుడు వజ్రధారలం ద్రెంపంబడినవిషయభోగంబులు గలవాఁడ నయి శరీరంబు విడిచి భగవద్ధామంబు నొందెద నారాయణునిదాసుండ నైననాకు స్వర్గమర్త్యపాతాళంబులం గలసంపద్భోగంబులు [3]నిచ్ఛగింపంబడవు త్రైవర్గికాయాసరహితం బయినమహైశ్వర్యంబు ప్రసాదించుం గావున ననుపమేయం బయిన భగవత్ప్రసాదం బన్యుల కగోచరం బద్దేవునిపాదైకమూలంబుగా నుండుదాసులకు దాసానుదాసుండ నగు చున్నవాఁడ నని యప్పరమేశ్వరు నుద్దేశించి. 399
చ. అరయఁగ భక్తపాలనము లైన[4]భవద్గుణజాల మాత్మసం
స్మరణము సేయ వాక్కు నిను సన్నుతి సేయ శరీర మెల్లఁ గిం
కరపరివృత్తి సేయ మదిఁ గాంక్ష యొనర్చెదఁ గాని యొల్ల నే
నరిది ధ్రువోన్నతస్థలము [5]నబ్జజపట్టణ మింద్రభోగమున్. 400

1. ప్రేలఁగ; వ్రేలఁగ 2. భరియింతుఁ దలన్. 3. నిచ్ఛయింపఁబడు 4, భవచ్చరితంబులాత్మ. 5. నబ్జజాపట్టమా నింద్ర.

ఉ. ఆఁకలి గొన్నక్రేపులు రయంబున నీఁకలు రానిపక్షులుల్
దీకొని తల్లికిన్ మఱి విదేశగతుం డగుభర్త కంగజ
వ్యాకులచిత్త యైనజవరాలును దత్తఱ మందుభంగి నో
శ్రీకర పంకజాక్ష నినుఁ జేరఁగ నామది గోరెడుం గదే. 401

క. [1]నాకును సఖ్యము పుణ్య,శ్లోకులతోఁ గాని తత్త్వశూన్యులు సంసా
[2]రైకవిమోహులతోడం, గాకుండ నొనర్పు మయ్య కంజదళాక్షా. 402

వ. అని పలుకుచు. 403

మహాస్రగ్ధర. హరిపై సర్వాత్ముపై నత్యగణితగుణుపై నంతరంగంబు పర్వన్
సరిమే నుప్పొంగఁ జావున్ జయమును సరిగా సంతసం బందుచున్ భీ
కరుఁడై కాలాగ్నివోలెం గనలుచుఁ గవిసెన్ గర్వదుర్వారుఁడై దు
ర్భరలీలన్ భూమి గంపింపఁగ దిశ లద్రువన్ భండనోద్దండవృత్తిన్. 404

క. దొరఁకొని ప్రళయోదకమున, హరిపైఁ గైటభుఁడు గవియు హంకారమునన్
సురనాథుమీఁద వృత్రా,సురుఁడు మహోద్వృత్తి నడచె శూలాయుధుఁడై.

శా. కల్పాంతాగ్నియుఁబోలె నుల్క లెగయం గాఁ ద్రిప్పుచున్ దీన [3]నో
యల్పా చావు మటంచు శూలము రయం బారంగఁ బైవైచినం
బోల్పం గోటిరవిప్రకాశత దివిం బోవంగ వీక్షించి యా
[4]వేల్పుల్ వొంగఁగ వజ్రధారఁ దునిమెన్ విన్నాణ మొప్పారఁగన్, 406

ఆ. శూల మప్పు డతఁడు స్రుక్కక ఖండించి, పూనితోన కదిసి భుజముఁ ద్రుంచె
నసుర గనలి యేకహస్తుఁడై పరిఘంబు, గొని మహేంద్రుఁ గిట్టి హనువు లడిచె.

వ. ఇట్లు ప్రళయకాలభీషణపరివేషవేష్టంబు గా రోషంబునం బరిఘంబుఁ ద్రిప్పి కు
ప్పించి గజకుంభస్థలంబు భగ్నంబు సేసి యింద్రుహనుప్రదేశంబును నిష్ఠురాహతి
నొంచిన. 408

క. గజము మద ముడిగి తిరుగుచు, గుజగుజనై గీఁకవెట్టఁ గులిశము నేలన్
భజన చెడి విడిచె నింద్రుఁడు, గజిబిజితో బెగడె నసుర కడిమి జగంబుల్. 409

క. గరుడుఁడు పొదివినసర్పము, కరణిన్ వృత్రాసురేంద్రు కడిమికి లోనై
తిరుగుడు వడ్డహరిం గని, పురపుర నాహా యటంచుఁ బొగిలిరి దివిజుల్. 410

వ. అప్పుడు. 411

ఆ. గజముపాటు సూచి కడుదీనగతిఁ జూచి, పవి కరంబు జాఱి పడుటఁ జూచి
యుద్ధధర్మ మెఱిఁగి యున్నవృత్రునిఁ జూచి, సిగ్గుతోడ వజ్రి శిరమువాంచె.

వ. ఇట్లు యుద్ధరంగంబున శత్రుసన్నిధిం గరంబు జాఱి పడినవజ్రంబుఁ బుచ్చికొనక
నివ్వెఱపడి లజ్జించి యున్నపాకశాసనుం జూచి వృత్రుం డిట్లనియె. 413

క. దురమునఁ గైదువు వైచిన, శర ణన్నను వైరిజనులఁ జంపము మది ని

1. మాకీసఖ్యము. 2. రైకసమూహులతోడను. 3. నోరల్పా 4. వేల్పువొంగుచు.

వ్రేఁగంద నేల కులిశము, కర మరుదుగఁ బుచ్చికొనుము కాచితి నింద్రా!

సీ. వజ్రంబుఁ గైకొని వైరి నిర్జింపు మి, ట్లడలంగ వేళ గా దమరనాథ
యెనయ దేహాధీను లైన[1]మూర్తుల కెల్ల, నీశు లక్ష్మీశు సర్వేశుఁ బాసి
కడ తేఱ జయములు గల్గునె యెందైనఁ, దలపోసి చూడుమా తత్త్వబుద్ధి
[2]నీలోకపాలకు లెవ్వానివశగతి, వలఁ బడ్డపక్షులవర్తనమునఁ

తే. జిక్కి చేష్టలు సేయుచుఁ [3]జింత గాంతు, రట్టిమృత్యుబలంబుల నాత్మజయము
తమది గాఁ గోరి యజ్ఞానతంత్రు లగుచుఁ, గమలలోచనులీలావికారములను.

తే. మెఱయ యంత్రమయం బైనమృగముభంగి, దారునిర్మిత మైనట్టితరణిపోల్కి
శుక్ర యెఱుఁగుమ యీభూతజాలమెల్ల, ధవళపంకేరుహాక్షుతంత్రములుగాఁగ.

వ. మఱియు భూతంబులచేతను నింద్రియంబులచేతను నవశుం డైనపురుషుండు ప్రకృతిచేత వేఱుసేయంబడినయాత్మ పరమేశ్వరానుగ్రహంబు వాసి సుఖియించుచుండు నవిద్వాంసుం డైనవాఁ డనవరతంబుఁ దన్ను స్వతంత్రుంగాఁ దలంచుచుండు భూతంబులవలన భూతంబులు పుట్టుచుండు నాభూతంబులు భూతంబులచేత భక్షింపంబడుచుండుఁ బురుషున కాయువు శ్రీయును గీర్తియు నైశ్వర్యంబును మొదలయినవి యనుభవింప నెంతగాలంబు ప్రాప్తం బంతగాలంబు నివసించు నాప్రాప్తంబు దీఱినఁ బురుషుండు జాలిం బొందిన నవి యుండకపోవుచుండుంగావున (గుణంబును నవగుణంబునుఁ) గీర్త్యపకీర్తులును జయాపజయంబులును సుఖదుఃఖంబులును [5]చావుబ్రదుకులును సమంబు లయి కలుగుచుండు నజ్ఞాని యైనవానికి సత్త్వరజస్తమోగుణంబులు గలిగి యుండు నట్టివానికి గుణమయంబు లైనయింద్రియాదులె యాత్మ యని తోఁచుచుండుం గావున వాఁ డాగుణంబులచేత బద్ధుం డగు నాగుణంబులకు సాక్షిమాత్రం బగుశరీరంబు వే అని యెవ్వఁ డెఱుంగనోపు వాఁ డాగుణంబులచేత బద్ధుండు గాఁడు గావున గుణంబులును గుణియును భోక్తయును భోగ్యంబును జయంబును నపజయంబును హర్తయును హన్యంబును నుత్పత్తిస్థితిలయకర్త యైన సర్వోత్కృష్టుం డైనయప్పరమేశ్వరుండె కాని యన్యంబు లేదిప్పు డొక్కహస్తంబు నాయుధం

1. 'ధూర్తుల కెల్ల 2. నీలోకచయ మెల్ల నెవ్వని 3. జింత సేతు, రమృతమర్త్యబలంబును నాత్మ.
6. భూతేంద్రియాంతఃకరణంబులును బ్రకృతి పురుషుం డైనభగవంతునియనుగ్రహంబు లేమి స్వర్గాదులయందు సమర్థంబులు గావు ప్రకృతిచేత వశుం డైనపురుషుండు సుఖదుఃఖంబుల ననవరతం బనుభవించుచునుండి తన్ను స్వతంత్రునిగాఁ దలఁచుచుండుఁ గాని స్వతంత్రుండు గాఁడు స్వతంత్రుం డైన యీశ్వరుండు భూతంబులవలన భూతంబులఁ బుట్టించుచుండు నాభూతంబులు భూతంబుల భక్షించుచుండుఁ బురుషునకు' వ్రా. ప్ర. 5 'మృత్యుజీవితంబులును ననుద్వంద్వంబులకు సముండు గావలయు సత్త్వరజస్తమంబులు ప్రకృతిగుణంబు లాగుణంబులకు సాక్షిమాత్రం బైనయాత్మ నెవ్వఁ డెఱుంగనోపు వాఁ డాగుణంబులచేత' అని కొన్నిప్రతులు.

బునుం బోయినను భవత్ప్రాణాపహరణ(ంబునకు) సమర్థుండ నగుచున్న నన్నుం
జూడు మని (వృత్రాసురుండు) మఱియు నిట్లనియె. 417

తే. వాహనంబులు సారెలు వాఁడిశరము, లూర్జితాక్షము లసువులె యొడ్డనములు
గాఁగఁ బోరెడు నీద్యూతకర్మమందు, నెఱుఁగు జయముఁ బరాజయ మెవ్వఁ డెఱుఁగు.

చ. అనవుడు వృత్రుమాటలకు నద్భుత మంది సురేంద్రుఁ డెంతయుం
దనమదిఁ గుత్సితం బుడిగి దైవముగా నతనిం దలంచి కై
కొనియెఁ గరంబునన్ దిగువఁ గూలినవజ్రము నప్పు డాత్తలోఁ
దనరె జగంబు లన్నియు ముదంబునఁ బొందిరి ఖేచరావళుల్. 419

క. రాహుగ్రహవక్త్రగుహా, గేహాంతము వాసి వచ్చి కిరణావళి స
ద్బాహుళ్య మొప్ప వెలిఁగెడు, నాహరిదశ్వుండుఁబోలె హరి యొప్పె నృపా.

వ. ఇట్లు కరకలితవజ్రాయుధుఁ గుండలమండితగండమండలుం డయి జంభారి గంభీరవా
క్యంబుల విస్మయమందస్మితముఖారవిందుం డయి వృత్రున కిట్లనియె. 421

క. ఓదానవేంద్ర నీమతి, వేదాంతముఁబోలెఁ దత్త్వవిజ్ఞానకళా
మోదము నీ వతిభక్తుఁడ, వాదిమపురుషునకుఁ బతికి నబ్జాక్షునకున్. 422

ఉ. లోకము లెల్ల నిండి తనలోనుగ సర్వముఁ జేసి ప్రాణులన్
దీకులఁ బెట్టి యెల్లెడలఁ దీపులు సూపెడివిష్ణుమాయ నేఁ
డేకమతిం దలంచి తిది గాల మహాసురరూపు మాని సు
శ్లోకుఁ బురాణపూరుషుని శోభనమూర్తి ధరింపు మింపునన్. 423

ఉ. ఏనియమంబు సల్పితివొ యెట్టిమహాతప మాచరించితో
పూని రజోగుణాభిరతిఁ బొందిననీమతి శాంతదాంతస
న్మానసమానసానుభవమత్త[1]మరాళుని లోకభావస
న్మాను నమేయు నాదనుజమర్దనుభక్తిఁ బొసంగె నెంతయున్. 424

క. నారాయణరూపామృత, పారావారమునఁ [2]దేలుభక్తుఁడు దా భూ
దారకరఖాతకోదక, పూరంబుల నేల తృప్తిఁ బొందు మహాత్మా. 425

వ. అని పలుకుసురేంద్రు నుపలక్షించి వృత్రాసురుం డాయోధనదుర్ధర్షణసంఘ
ర్షమాణమానసుం డై వైరిం బురికొల్పుకొని వామహస్తంబునం బరిఘంబుఁ
ద్రిప్పుచు నుప్పరంబునకుం గుప్పించుచు బ్రహ్మాండకర్పరంబు నిష్ఠురభైరవారా
వంబునం బగిలించుచు సముత్తుంగమత్తమాతంగ(పుంగవ)ంబు [3]వృషభంబుపైఁ
గవియుభంగి సురవృషభు పేరురం బుపలక్షించి భీషణాశనినిపాతవేగంబునం గొ
ట్టిన నింద్రుండు కులిశధార నప్పరిఘంబుఁ దునిమి తోడన శేషఫణావిశేషభాసురం

1 'మరాళుఁ డశేషభావస, న్మానుఁ డమేయుఁ డాదనుజ.' అ. ప్ర. 2 'నొనరు పటుభక్తి యిదే, యారిత్తఖాదకోదక.' 3 సింగంబుపై.

బయినబాహుదండంబు ఖండించె నప్పుడు వృత్రుండు భిన్నబాహుద్వయమూలుండై రక్తధారావలిం దొఁగుచు వజ్రిచేతఁ బక్షహతుం బై దివంబుననుండి జాఱు చున్నకులపర్వతంబునుంబోలెఁ జూపట్టి ప్రళయకాలసంహారనిటలచ్చటచ్ఛటార్భటకఠోరకీలాభీలాగ్నిసమానక్రూరకుటిలనిరీక్షణదుర్నిరీక్ష్యుం డయి భూమిం గ్రిందిదౌడను నాకాశంబు మీఁదిదౌడను హత్తించి నభోమండలంబునుంబోలెఁ దుది మొదల లెఱుంగ రాక వికృతంబుగా వక్త్రంబు దెఱచి మందరమథనమథ్యమానవిషధరజనితవిషవిషమజిహ్వాభీలం బగునాలుక నభంబు నాకుచుఁ గాలసంహారకారణుం డయినకాలునిభుజాదండమండితం బగుకాలదండంబునుం బోనిదంష్ట్రలచేత జగత్త్రయంబును మ్రింగెడువాఁడునుంబోలె నతిమాత్రమహాకాయుం డయి పర్వతంబులం దలంగ మీటుచు నడగొండయుంబోలె నభోభాగభూభాగంబుల నాక్రమించి యప్పుడు. 426

ఉ. కాలమునాఁటిమృత్యువుముఖంబునఁబోలెను విస్ఫులింగముల్
గ్రాలఁగ దేవసంఘములు కంపము నొంద జగంబు లెల్ల నా
హాలులితారవం బెసఁగ నభ్రగజంబును నాయుధంబుతో
నాలుకఁ జుట్టిపట్టి సురనాథుని మ్రింగె మహాద్భుతాకృతిన్. 427

ఆ. లోక మెల్ల నపుడు చీకాకుపడెఁ దమం, బడరె నుడుగణంబు లవనిఁ బడియె
[1]సోనవాన గురిసె సూర్యచంద్రాగ్నుల,రశ్ము లడఁగె దిశలు రభస మయ్యె.

వ. అప్పుడు. 429

ఉ. కందఁడు భీతిఁ గుందఁడు ప్రకంపము నొందఁడు పెద్దనిద్దురం
జెందఁడు తత్తఱింపఁడు విశేషముఁ దప్పఁడు వైష్ణవీజయా
నందపరైకవిద్యను మనంబునఁ దాల్చుచు నుండెఁ గాని సం
క్రందనుఁ డానిశాచరునిగర్భములో హరిరక్షితాంగుఁడై. 430

వ. ఇట్లు కవచరూపశ్రీనారాయణకృపా[2]పాలితుం డై యోగబలంబున బలభేది యతనియుదరంబు వజ్రాయుధంబున భేదించి యైరావణసహితుం డై వెడలి యతని కంధరంబు తెగ నడువ వజ్రంబుఁ బ్రయోగించిన నతినిష్ఠురవేగంబున వృత్రహరణార్థంబుగం దిరుగుచు సూర్యాదిగ్రహనక్షత్రంబులకు దక్షిణోత్తరగతిరూపం బయినసంవత్సరసంధియందు నహోరాత్రమధ్యంబున వృత్రుశిరంబు పర్వతశిఖరంబునుంబోలెఁ ద్రుంచి కూలం ద్రోచె నప్పుడు. 431

మ. మొరసెన్ దుందుభు లంబరంబునఁ గడున్ మోదించి గంధర్వులున్
సురలున్ సాధ్యులు సిద్ధులున్ మునివరుల్ సొంపార వృత్రఘ్ను భీ
కరతేజోవిభవప్రకాశకరవిఖ్యాతైకమంత్రంబులం

1 'రక్తవృష్టి గురిసె రవిచంద్రవహ్నుల, ప్రభలు మాసె దిశలు భస్మ మయ్యె' వ్రా. ప్ర.
2 దంశితుం డై.

దిర మొప్పం బఱియించుచుం గురిసి రెంతేఁ గ్రొత్తపూసోనలన్. 432

ఆ. ఏమి సెప్ప నప్పు డింద్రారితనువున, నొక్కదివ్యతేజ ముబ్బి వెడలి
లోక మెల్లఁ జూడ [1]లోకులు సూడ నీ,లోక మరసి విష్ణులోను సొచ్చె. 433

వ. ఇట్లు లోకభీకరుం డైన వృత్రాసురుండు గూలిన నఖిలలోకంబులుఁ [2]బరితాపంబు లుడిగి సుస్థితిం బొందె దేవర్షి పితృగణంబులు (దానవులతోడం) గూడి యింద్రునకుం జెప్పక తమతమస్థానంబునకుం జని రనిన విని పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె. 434

ఆ. ఏమికారణమున నింద్రుతోఁ బలుకక, సురలు వోయి రట్టిసురగణంబు
లెందుచేత సుఖముఁ జెందిరి వజ్రికిఁ, జేటు గలుగు టెట్లు సెప్పవయ్య. 435

వ. అనిన శుకుం డిట్లనియె వృత్రపరాక్రమచకితు లయిననిఖిలదేవతలును మహర్షిగణంబులును మున్ను వృత్రవధార్థం బింద్రునిం బ్రార్థించిన నతండు బ్రహ్మహత్యకుం జాలక తొల్లి విశ్వరూపునిం జంపినపాపంబు స్త్రీలయందును భూమియందును జలంబులందును ద్రుమంబులందును విభజించి పెట్టితి నిపు డీహత్య యేమిటం బాపుకొనువాఁడ నా కశక్యం బనిన మహర్షు లశ్వమేధయజ్ఞంబు సేయించి యజ్ఞపురుషుం డయిన శ్రీనారాయణదేవుని సంతుష్టునిం జేసి యీహత్యం బాపం గలవారము స్వభావంబున బ్రాహ్మణపితృగోమాతృసజ్జనహంత లైనవార లేదేవునిం గీర్తించి శుద్ధాత్ము లగుదు రద్దేవుని నశ్వమేధమహామఖంబున శ్రద్ధాన్వితుండ వై మాచేత ననుష్ఠితుం డై సేవించిన నీకు ఖలుం డైనయిద్దురాత్ముని హింసించినహత్య యేమి సేయం గల దని యొడంబఱిచిన నింద్రుండు వల్లె యని యవ్విధంబున మార్తునిం బరిమార్చి బ్రహ్మహత్యం బొంది యప్పాపంబు భరియింప నోపక దుర్దశం బొందె నప్పుడు. 436

సీ. పాపంపుఁజండాలరూపంబు గలదాని, ముదిమిచే నొడ లెల్లఁ గదలుదాని
క్షయకుష్ఠరోగసంచయకృతం బగుదాని, నురురక్తపూరంబు దొరఁగుదాని
నరసినవెండ్రుకల్ బెరసినతలదాని, నటఁ బోకు పో కుండు మనెడుదానిఁ
గదురుకంపునఁ బేర్వు లదరఁజేసెడుదానిఁ,దా నెందుఁ బాఱినఁ దఱుముదాని

ఆ. నాగుణంబు లెల్ల భోగింప కేరీతి, నరుగ నెంతవాఁడ వనెడుదాని
బిట్టు దిరిగి చూచి భీతిల్లి సిగ్గుతో, దేవనాయకుండు దెగచి పఱచె. 437

వ. ఇట్లతివికృతత్వంబుతో బ్రహ్మహత్య వెనుతగుల నింద్రుండు నభోభాగభూభాగదిగ్భాగంబు లెల్లం దిరిగి చోరం దెరువు లేక దీర్ఘని[3]ర్ఘాతాటోపనిశ్వాసదూషితుం డై యీశాన్యభాగంబునకుం బఱచి యద్దెస సమేయపుణ్యాగణ్యం బయిన మానససరస్సునం బ్రవేశించి యం దొక్కకమలనాళంబు సొచ్చి యందుఁ దంతువులం గలసి రూపంబు లేక యలబ్ధభోగుం డై బ్రహ్మహత్యావిమోచనంబుఁ

1. లోకంబు సూడని, లోక మరిగి విష్ణు. 2. బరితోషంబు నొందె. 3. తోపమనిశ్వాస.

చింతించికొనుచు సహస్రవర్షంబు లుండె నా చండాలియు నది పరమేశ్వర దిగ్భాగంబగుటం జేసి యందుం జొర రాక కాచి యుండె నంతకాలంబునఁ ద్రిదివంబున నహుషుండు విద్యాబలతపోబలయోగబలంబులం బాలించుచుండి సంపదైశ్వర్యమదాంధుం డై యింద్రపత్నిం గోరి యింద్రుండు వచ్చునందాఁక నాకుం బత్నివి గ మ్మనిన నా శచీదేవి బృహస్పతిప్రేరితయై బ్రహ్మర్షివాహ్యశిబిక నెక్కి వచ్చి నన్ను భోగింపు మనిన నతం డట్లచేసి కుంభసంభవశాపహతుం డై యజగరయోనియందుఁ బుట్టె నంత నింద్రుండు బ్రహ్మర్షిగణోపహూతుం డై త్రిదివంబునకు వచ్చె నంతగాలంబు నారాయణచరణారవిందధ్యానపరుం డై చింతించుచుఁ దద్దిశాధినాయకుం డైన శంకరుచేత రక్షితుం డై యుండుటం జేసి తద్దోషబలంబు దఱిఁగి సహస్రాక్షుం బీడింప లే దయ్యె నప్పు డింద్రుండు నిజైశ్వర్యంబునుం బొంది బ్రహ్మర్షిపరివృతుం డై మహాపురుషారాధనంబు సేసి హయమేధాధ్వరంబునకు దీక్షఁ గైకొని బ్రహ్మవాదులచేత యజింపఁబడుచున్నవాఁ డయి సర్వదేవతామయుం డైన నారాయణుం బరితృప్తుం జేసి మంచు విరియించుమార్తాండుని చందంబునఁ ద్వాష్ట్రవధరూపపాపంబు నాశంబు నొందించి సకలదివిజయక్షగంధర్వసిద్ధమునిజనసంస్తూయమానుం డయి త్రిభువనైశ్వర్యభోగభాగ్యంబులం గయికొనియె నప్పుడు. 438

చ. సతతమరీచిముఖ్యముని సంఘముచేత యథోచితంబుగాఁ
కృతఘనవాజిమేధమునఁ [1]గేశవు నీశుఁ బురాణపూరుషున్
హితు జగదీశు యజ్ఞపతి [2]నిష్టఫలప్రదు నంతరంగసం
గతు భజియించి వజ్రి గతకల్మషుఁ డై నెగడెన్ మహీశ్వరా. 439

సీ. మఱియుఁ బుట్టింపంగ మనసు వెట్టినయట్టి, క్రూరకర్మాంభోధి కుంభజుండు
అంగారములు సేయ నాహుతిఁ గన నోపు, బహుపాపకానన పావకుండు
కందక దిగ మ్రింగి గ్రక్కునఁ ద్రేఁపంగఁ, గల్మషగరళ గంగాధరుండు
ఘనగుహాంతరములఁ గాలూన నియ్యని, కలుషదుస్తరతమో గ్రహవిభుండు

ఆ. సకలముక్తిలోక సామ్రాజ్యసమధిక, సహజభోగభాగ్య సంగ్రహైక
కారణాప్రమేయ, కంజాక్షసర్వేశ, కేశవాదినామ కీర్తనంబు. 440

సీ. అఖిలదుఃఖైక సంహారకారణమును, నఖిలార్థసంచయాహ్లాదకరము
విమలభక్త్యుద్రేక విభవసందర్శనం, బనుపమభక్తవర్ణనరతంబు
విబుధర్షభానేక విజయసంయుక్తంబు, గ్రస్తామరేంద్రమోక్షక్రమంబు
బ్రహ్మహత్యానేక [3]పాపాబ్ధితారణ, కారణసజ్జన కాంక్షితంబు

తే. నైనయీయితిహాసంబు నధికభక్తి, వినినఁ జదివిన [4]వారికి ననుదినంబు

---

1. 'కీర్తితుఁ డైనపురాణ. 2. నీశు రమేశు నిజాంతరంగ' వ్రా.ప్ర. 3. 'పాపనిస్తరణంబు, గమనీయసజ్జనకాంక్షితంబు. 4. వ్రాసిన... నాయురారోగ్యభాగ్యభోగాభివృద్ధి....గల్గుననఘు' అ.ప్ర.

నాయురారోగ్యకరము జయాభివృద్ధి, కర్మనాశము సుగతియుఁ గల్గు చుండు.
సీ. నాపుడు యోగీంద్ర నామనం బీవృత్రు, వివరంబు నీచేత విన్నమొదలు
కడు నద్భుతంబునఁ గళవళం బందెడుఁ, గొఱలు రజస్తమోగుణములందు
వర్తించునీపాపవర్తికి నేరీతి, మాధవపదభక్తి మది వసించె
సత్త్వస్వభావు లై సముబుద్ధు లై తపో, నియమప్రయత్ను లై నిష్ఠచేత
తే. నిర్మలాత్మకు లై నట్టిధర్మపరుల, కమరులకుఁ బుణ్యమునులకు నంబుజాక్షు
భూరికైవల్యసంప్రాప్తిమూల మైన, భక్తి వీనికిఁ బోలె నేర్పాటు గాదు. 442
సీ. [1]భూస్థలిఁ గల రేణువులకన్న దట్ట మై, కడు నొప్పుజీవసంఘములు గలవు
ఆజీవములలోన నరయ ధర్మాయత, మతి వసించినవారు మనుజజాతి
యామనుష్యులలోనఁ గామంబుఁ బెడఁబాసి, మోక్షాపేక్షలగువారు మొదల నరిది
మోక్షమార్గం బాత్మమూలంబుగా నుండు, వారిలో ముక్తులు లేరు తఱచు
తే. ముక్తు లై నట్టివారిలో యుక్తిఁ దలఁపఁ, జాలదుర్లభుఁ డమితప్రశాంతిపరుఁడు
పరమసుజ్ఞాననిరతుండు భద్రగుణుఁడు, రమణ శ్రీవాసుదేవపరాయణుండు.
తే. సకలలోకాపకారి దుస్సంగతుండు, వృత్రుఁ డేక్రియ సుజ్ఞానవేది యయ్యె
సమరమునఁ బౌరుషంబుచే నమరవిభుని, నెట్లు మెప్పించె దీని నాకెఱుఁగఁ జెపుమ.

## చిత్రకేతూపాఖ్యానము.

వ. అని పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రు నడిగె నని సూతుండు శౌనకాదిమును
లకుం జెప్పి మఱియు నిట్లనియె నట్లు గజపురవల్లభుండు సంప్రశ్నంబు సేసిన
బాదరాయణి హరిస్మరణశ్రద్ధాపరుం డయి యిట్లనియెఁ దొల్లి కృష్ణద్వైపాయన
నారద దేవల మహాత్ములు నా కెఱింగించిన యితిహాసంబు గలదు దాని నెఱింగిం
చెద సావధానుండ వై యాకర్ణింపుము. 445
చ. అమితవిభూతిఁ జాల నమరాధిపుఁ బోలుచు శూరసేనదే
శములకు భర్త యై ప్రజలు సంతస మందఁగ సార్వభౌముఁ డై
క్షమ దన కెల్లకాలమును గామదుహంబు గఁ జిత్రకేతునా
మమునఁ బ్రసిద్ధి కెక్కె గుణమండనుఁ డంచితకీర్తికాముఁ డై. 446
సీ. మానితతారుణ్యమద[2]నతురంగులు, కందర్పవిజయైకఖడ్గలతలు
మదనసమ్మోహనమంత్రాధిదేవతల్, పంచశిలీముఖుబందెకత్తె
లసమాస్త్రుఁ డఖిలంబు నడకించుబొమ్మలు, నాత్మసంభవునికట్టాయితములు
పుండ్రేక్షుకోదండుభూరితేజంబులు, శంబరవిద్వేషిసాహసములు
తే. నాఁగఁబొలుపారునొకకోటినలినముఖులు, దనకుఁ బత్నులుగాఁగ నత్యంతవిమల
కీర్తివైభవసన్మార్గవర్తి యగుచు, జగతిఁ బాలించు చుండె నాజనవిభుండు. 447
తే. కడిమి వేవేలుభార్యలు గలిగి యుండి, పరఁగ సంతతి యొకరందుఁ బడయ లేక

1 'ఊర్వరఁ గలరేణువుల. 2 మదనాంగులు' వ్రా. ప్ర.

చిత్తమునఁ జాలఁ బాయని చింత వొడమి, బడలఁ జొచ్చెను వేసవి మడువుఁ బోలె.

ఉ. రూపము సత్ప్రతాపము మరుత్పతిభోగము యౌవనంబు సం
దీపితచారువర్తనము దిగ్విజయంబును సత్యముం జగ
ద్వ్యాపితకీర్తియున్ సతులు వైభవముఖ్యము లెల్ల మాన్పఁగా
నోపక యుండె నా నృపతి నొందిన సంతతి లేనిదుఃఖమున్. 449

వ. ఇట్లు సంతతి లేక యతిదుఃఖమానసుం డయిన యా నరేంద్రుని మందిరంబున కంగిరసమహాముని వచ్చి యతనిచేత నతిథిసత్కారంబులు వడసి కుశలం బడిగి రాజ్యంబు భవదధీనంబ కదా పృథివ్యప్తేజోవాయ్వాకాశమహదహంకారంబు లనియెడి యేడింటిచేత రక్షింపంబడ్డ జీవుండునుం బోలె నమాత్యజనపదదుర్గద్రవిణసంచయదండమిత్రంబు లనెడి సప్తప్రకృతులచేత రక్షితుండ వై ప్రకృతిపురుషులయందు భారంబు వెట్టి రాజ్యసుఖంబు లనుభవింతువు గదా మఱియు దారప్రజామాత్యభృత్యమంత్రిపౌరజానపదభూపాలురు నీకు వశవర్తులు గదా సర్వంబునుం గలిగి సార్వభౌముండ వైన నీ వదనంబున విన్నఁదనంబు గలిగి యున్న యది కతం బేమి యనిన నా మునిప్రవరునకు నతం డిట్లనియె మీ తపోబలంబున మీకు నెఱుంగరాక యున్న యదియుం గలదే యని తల వంచి యూరకున్న నతని యభిప్రాయం బెఱింగి యా భగవంతుం [1]డైన యంగిరసుండు దయాళుం డై పుత్రకామేష్టి వేల్చి యజ్ఞశేషం బతని యగ్రమహిషి యయిన కృతద్యుతి కిచ్చి నీకుం బుత్త్రుండు గలిగెడి నతనివలన సుఖదుఃఖంబు లనుభవింపంగల వని చెప్పి యమ్మహాత్ముండు సనియె నా కృతద్యుతి యను దేవి గర్భంబు ధరియించి నవమాసావసానంబునం గుమారునిం గనియె నాకాలంబున రాజును సమస్తభృత్యామాత్యజనంబులుఁ బరమానందంబుఁ బొంది రపుడు చిత్రకేతుండు గృతస్నానుం డై సకలభూషణభూషితుం డై సుతునకు జాతకర్మంబు నిర్వర్తించి బ్రాహ్మణులకు నపరిమితహిరణ్యరజతదానంబులు వస్త్రాభరణంబులును గ్రామంబులును గజంబులును వాహనంబులును ధేనువులును నాఱేసియర్బుదంబుల(ద్రవ్యంబును) దానంబు సేసి ప్రాణిసముదయంబునకుం బర్జన్యుండునుం బోలెఁ దక్కిన వారలకు నిష్టకామంబులు వర్షించి పరమానందహృదయుం డై యుండెఁ గుమారుండును మాతృపితృబంధుజనంబులకు సంతోషంబు సేయుచు దినదినప్రవర్ధమానుం డై పెరుఁగు చుండె నంతం బుత్రమోహంబునం గృతద్యుతియందు బద్ధానురాగుం డై మహీధవుండు వర్తించుచుండం దక్కిన భార్యలు సంతానసంతోషవికల లై యీ మోహంబునకుం గారణంబు పుత్త్రుండ యని యీర్ష్యం జేసి దారుణచిత్త లై కుమారునకు విషంబుఁ బెట్టించిన సుఖనిద్రితుండునుం బోలె బాలుండు మృతిఁ బొందె నప్పుడు వేగుటయు దాది బోధింపం జని యా కుమారుని వికృతాకారం

1. డైన బ్రహ్మపుత్రుండు.

బుఁ జూచి విస్మయశోకభయార్తయై పుడమిం బడి యాక్రందించె నప్పుడు.

తరలము. పుడమి నిట్టకనిల్వనం బడి । పొక్కుచుం గడుదీనయై
యడఁకు వేమియు లేనివాక్కుల । నావు రంచు విలాపమం
[1]దెడరు దోఁప భృశాతురోన్నతి । నేడ్చినన్ విని భీతితోఁ
గడుపు బిట్టవియంగ భూపతి । కాంత గ్రక్కున నేఁగుచున్. 451

ఆ. బాలుఁ డొక్కరుండు । పరిణామశీలుండు, వంశకర్త తపసి । వరమువలనఁ
బుట్టి మిన్న కట్లు । వాలిసి యున్నట్టియా, కొడుకుఁ జూచి తల్లి । యడలఁజొచ్చె.

ఉ. కుంకుమరాగరమ్యకుచ । కుంభములం గడుఁ గజ్జలంబుతోఁ
బంకిల మైనబాష్పముల । పాల్పడ మజ్జన మాచరించుచుం
గంకణపాణిపల్లవయు । గంబున వక్షము మోఁదికొంచు నా
పంకరుహాక్షి యేడ్చెఁ బరి । భావితపంచమసుస్వరంబునన్. 453

క. ఆయార్తరవమునకు భూ, నాయకుఁడు భయంబు నొంది । నయ ముడిగి సుతున్
డాయఁగ వేగంబునఁ జని, పాయనిమోహంబుతోడ । బాలునిమీఁదన్. 454

స్రగ్విణి. వ్రాలి యాపుత్రసం । వార్త దంభోళియై, కూలఁగా వ్రేయ కీ । కొద్దినన్నేటికిన్
జాలి నొందించె నా । జాడ యిం కెట్టిదో, తూలుమీతల్లికిన్ । దుఃఖ మెట్లాయెనో.

వ. అని తల మొల యెఱుంగక పలవించుచు భృత్యామాత్యబంధుజనంబులం గూడి యడలుచు నున్నయారాజుదుఃఖం బెఱింగి యంగిరసుండు నారదునితోడం గూడి చనుదెంచి మృతుం డైనపుత్త్రునిపదతలంబున మృతుండునుంబోలెఁ బడియున్న యారాజుం గనుంగొని యి ట్లనియె. 456

సీ. నీకు వీఁ డెవ్వఁడు । నీ వెవ్వనికి శోక, సంతాప మందెదు । సార్వభౌమ
పుత్త్రమిత్త్రాదులు । పూర్వజన్మంబున, నెవ్వనివారలో । యెఱుఁగఁ గలవె
మొదల నదీవేగ । మున నాడ కాడకు, సికతంబు గూడుచుఁ । జెదరు చుండు
నారీతిఁ బ్రాణుల । కతికాలగతిచేతఁ, బుట్టుట చచ్చుట । పొసఁగు చుండుఁ

ఆ. గాన భూతములకుఁ । గలుగు భూతంబులు, మమతతోడ విష్ణు । మాయఁ జేసి
దీని కడల నేల । ధృతిఁ దూలఁగా నేల, బుద్ధిఁ దలఁప వలదె । భూతసృష్టి. 457

వ. మఱియు నేము నీవును దక్కినవారలును బ్రవర్తమానకాలంబునం గలిగినజన్మంబు నొంది మృత్యువువలన విరామంబు నొందం గలవార మై యిపుడ లేక పోవుదుము చావుపుట్టువులకు నిక్కవంబు లే దీశ్వరుండు దనమాయచేత భూతజాలంబులవలన భూతంబులం బుట్టించు వాని నాభూతంబులచేతన రక్షించు వాని నాభూతంబులచేతన హరించు స్వతంత్రంబు లేనితనసృష్టిచేత బాలుండునుంబోలె నపేక్ష లేక యుండు దేహి యైనపితృదేహంబుచేత దేహి యైనపుత్త్రదేహంబు మాతృదేహంబువలనం గలుగు చుండు నాప్రకారంబున బీజంబువలన

1 దెసఁదఁ దోఁప-దెడము తేశ.

బీజంబు పుట్టుచుండ దేహికి నివి శాశ్వతంబై జరుగుచునుండుఁ బూర్వకాలంబున
[1]సామాన్యవిశేషంబులు సన్మాత్రం బైనవస్తువులం దేవిధంబునం గల్పింపంబడియె
నా ప్రకారంబున దేహంబునకు జీవునకు నన్యోన్యవిభాగంబు (పూర్వకాలంబున)
నజ్ఞానకల్పితం బయ్యె [2]జన్మఫలంబులను జూచుచున్నవారికి దహనక్రియల నగ్ని
పెక్కురూపంబులం గానంబడుభంగి నొక్కండైనజీవుండు పెక్కుభంగుల వెలుం
గుచుండు నివి యన్నియు నాత్మజ్ఞానంబు సాలక దేహి దేహసంయోగంబు
స్వప్నంబునందు భయావహం బైనప్రయోజనంబు నడపుచుండి మేల్కాంచి
యాస్వప్నార్థం బైనప్రయోజనంబు తనది గాదని యెఱుంగుభంగి జీవుండే తా
నని జ్ఞానగోచరుం డైనవాఁ డెఱుంగుం గావున నన్నియును మనోమాత్రం బని
తెలిసి మోహాతమంబు వాసి భగవంతుం డైనవాసుదేవునియందుఁ జిత్తంబు
పెట్టి నిర్మలాత్మకుండ వగు మని బోధించినఁ జిత్రకేతుండు లేచి వారల కిట్లనియె.

సీ. యతివేషములు పూని । యతిగూఢగతి నిందు, నేతెంచినట్టిమీ । రెవ్వరయ్య
కడఁగి [3]నన్ బోలిన । గ్రామ్యబుద్ధుల నెల్ల, బోధింప వచ్చిన । పుణ్యమతులొ
రమణఁ గుమార నా । రద [4]ఋషభాదులొ, దేవలాసితు లను । ధీరమతులొ
వ్యాస వసిష్ఠ [5]దు । ర్వాసో మృకండుజ, గౌతమ శుక రామ । కపిలమునులొ
తే. యాజ్ఞవల్క్యుండుఁ దరణియు । నారుణియును, జ్యవనరోమశు లాసురి । జాతుకర్ణ
దత్త మైత్రేయ వరభర । ద్వాజబోధ్య, పంచశిఖులొ పరాశర । ప్రభృతిమునులొ.

క. వీరలలో నెవ్వరు సుర, చారణగంధర్వసిద్ధ । సంఘంబులలో
వారలొ యీసుజ్ఞానము, కారణ మై యెవరియందుఁ । గలదు తలంపన్. 460

క. పొందుగ గ్రామ్యపశుత్వముఁ, బొంది మహాశోకతమత । బ్రుంగిననాకున్
ముందఱ దివ్యజ్ఞానముఁ, జెందించినవారి మిమ్ముఁ । జెప్పుఁడు తెలియన్. 461

వ. అనిన నంగిరసుం డిట్లనియె నేను బుత్రకాంక్షి వైననీకుఁ బుత్త్రుం బ్రసాదిం
చినయంగిరసుండ నితండు బ్రహ్మపుత్త్రుం డయిననారదభగవంతుండు దుస్తరం
బైనపుత్త్రశోకంబున మగ్నుండ వైననిను ననుగ్రహించి పరమజ్ఞానం బుపదే
శింప వచ్చితిమి నీదుఃఖం బెఱింగి పుత్త్రు నిచ్చితిమేనిఁ బుత్త్రవంతు లైనవారితా
పంబు నీచేత ననుభవింపంబడు నీప్రకారంబున లోకంబున సతులును గృహం
బులును సంపదలును శబ్దాదు లయినవిషయంబులును రాజ్యవైభవంబును జంచ
లంబులు మఱియు రాజ్యంబును భూమియును బలంబును ధనంబును భృత్యా
మాత్యసుహృజ్జనంబులును మొదలైనవి శోకమోహభయపీడితులం జేయుచుం
డుఁ గాని సుఖంబుల నీ నేరవు గంధర్వనగరంబునుంబోలె స్వప్నలబ్ధమనోరథంబు

---

1 'జాతివ్యక్తివిభాగంబులఁ దన్మాత్రంబు లైన. 2 దారువికారంబు లైన దీర్ఘత్వవక్రత్వాదు లగ్నియందుఁ గానంబడుభంగి నసద్ధర్మంబు లయిననానాత్వంబును క్షయవృద్ధులును క్రియాఫలంబుం జూచుచున్నయాత్మయందుఁ గానంబడు. 3 నన్బోఁలైన. 4 శివాంగీరసదేవలా. 5 దుర్వాసమార్కండేయ.

నుంబోలె నర్థంబును బాసి కానంబడుచు మనోభవంబు లయినయర్థంబులం గూడి స్వార్థంబు లై కానంబడ నేరవు కర్మంబులచేత ధ్యానంబులు సేయుచుండు [1]మనంబులు నానాకర్మంబు లగుచు నుండు నీదేహి దేహంబు ద్రవ్యజ్ఞానక్రియాత్మకంబై దేహికి వివిధక్లేశసంతాపంబులం జేయుచుండుం గావున నీవు నిర్మలం బయినమనంబుచేత నాత్మగతి [2]వెదకి ధ్రువం బయినపదవి నొందు మనియె నప్పుడు నారదుం డిట్లనియె నుపనిషద్గోప్యం బగు నేనిచ్చుమంత్రం బెవ్వండేని సప్తరాత్రంబులు పఠియించు నతండు సంకర్షణుం డైన భగవంతునిం జూచు నెవ్వనిపాదమూలంబు సర్వాశ్రయం బై యుండు నట్టి శ్రీమన్నారాయణునిపాదంబులు సేవించి యీమోహంబు వదలి యతిశీఘ్రంబున నుత్తమపదంబు నొందు మిప్పు డిక్కుమారునకు నీకును బ్రయోజనంబు గల దేనిం జూడు మని నారదుండు మృతబాలకునికళేబరంబుఁ జూచి యోజీవుండ నీకు శుభం బయ్యెడు మిందుఁ బ్రవేశించి మీతల్లిదండ్రుల బంధుజనులం జూచి వీరలదుఃఖంబు లార్చి యీకళేబరంబునందుఁ బ్రవేశించి యాయుశ్శేషంబు ననుభవించి పితృదత్తం బైనరాజ్యాసనంబునఁ గూర్చుండు మనిన నబ్బాలుం డిట్లనియె. 462

తే. కర్మవశమున నెందు సుఖంబు లేక, దేవతిర్యఙ్నృయోనులఁ । దిరుగునాకు
వెలయ నేజన్మమందునో । వీరు తల్లి,దండ్రు లయినారు చెప్పవే । తాపసేంద్ర.

తే. బాంధవజ్ఞాతిసుతులును । బగతు రాత్మ,వరు లుదాసీనమధ్యస్థ । వర్గములును
సరవి [3]గనుచుండురొక్కొక్క । జన్మమునను, నెఱయఁ బ్రాణికి నొకవావి । నిజముగలదె.

తే. రత్నములు హేమములు సను । రాగలీల
నమ్మకంబుల నీవల । నావల నగు
భంగి నరులందు జీవుండు । ప్రాప్తుఁ డగుచు
నెలమిఁ దిరుగుచు నుండుఁ దా । నెందుఁ జెడఁడు. 465

సీ. ఒక్కఁడై నిత్యుఁడై । యెక్కడఁ గడ లేక, సొరిది జన్మాదుల । శూన్యుఁ డగుచు
సర్వంబునం దుండి । సర్వంబుఁ దనయందు, నుండంగ సర్వాశ్ర । యుండ దనంగ
సూక్ష్మమై స్థూలమై । సూక్ష్మాధికములకు, సామ్యమై స్వప్రకా । శమున వెలిఁగి
యఖిలంబుఁ జూచుచు । నఖిలప్రభావుఁడై, యఖిలంబు దనయంద । యడఁచికొనుచు

తే. నాత్మమాయాగుణంబుల । నాత్మమయము
గాఁగ విశ్వంబుఁ దనసృష్టి । [4]ఘనతఁ జెందఁ
జేయు చుండును సర్వసం । జీవనుండు
రమణ విశ్వాత్ముఁ డయిననా । రాయణుండు. 466

క. సతు లెవ్వరు సుతు లెవ్వరు, పతు లెవ్వరు మిత్రశత్రు । బంధుప్రియసం

---

1 మనంబునకు-నానాకర్మంబులు గలుగుచుండు-నాకరంబులగుచుండు. 2 వెదకి ద్వైతభ్రాంతి విడిచి ధ్రువం బయిన. 3 నగుచుండు-దగుచుండు. 4 ఘటన నొంద.

గతు లెవ్వరు సర్వాత్మక, గతుఁ డై గుణసాక్షి యైన ఘనునకుఁ డొక్కనికిన్. 467

**చిత్రకేతుండు తపం బాచరించి భగవత్ప్రసాదంబు నొందుట.**

వ. మఱియు సుఖదుఃఖంబులం బొందక సర్వోదాసీనుం డై పరమాత్మ యై యుండు నప్పరమేశ్వరరూపుండు నయిననాకును మీకు నెక్కడిసంబంధంబు మీకు దుఃఖంబునకుం బని లేదని పలికి యాజీవుండు వోయినం జిత్రకేతుండును బంధువులు నతివిస్మితచిత్తులై శోకంబులు విడిచి మోహంబులం బాసి యమునానదియందు నక్కుమారునకు నుత్తరకర్మంబులు [1]నిర్వర్తించిరి చిత్రకేతుండు గాఢపంకంబునం బడి వెడలిన యేనుంగునుంబోలె గృహాంధకూపంబునందుండి వెడలి కాళిందీనదికిం బోయి యందు విధిపూర్వంబుగఁ గృతస్నానుండై మౌనంబుతోడ నారదునకు నమస్కరించిన నతండు ప్రసన్నుం డై భగవన్మంత్రంబు విధిపూర్వకంబుగా నతనికి నుపదేశించి యంగిరసుతోడం గూడి బ్రహ్మలోకంబునకుం జనియెఁ జిత్రకేతుండును నారదోపదేశమార్గంబున నిరాహారుం డై సమాధినియతుండై నారాయణరూపం బయినయావిద్య నారాధించి సప్తరాత్రాంతంబున నప్రతిహతం బయినవిద్యాధరాధిపత్యంబును భాస్వద్రత్నదివ్యవిమానంబునుం బడసి నారాయణానుగ్రహంబునుం బొంది మనోగమనంబునం ద్రిజగంబులం జరియించు చుండఁ గొన్నిదినంబులకు నొక్కచోట. 468

సీ. తారహారపటీరధవళదేహమువాని, రమణీయనీలాంబరంబువాని
మణికిరీటస్ఫురన్మస్తకంబులవానిఁ, గంకణకేయూరకరమువానిఁ
గర్బురమయదీప్తకటిసూత్రములవానిఁ, దరళయజ్ఞోపవీతములవానిఁ
నతిసుప్రసన్నవక్త్రాంబుజంబులవానిఁ, దరుణవిస్తృతనేత్రములవాని
ఆ. సిద్ధమండలంబు సేవింపఁ బుణ్యప్ర, సిద్ధి వెలసినట్టి యిద్ధచరితుఁ
బద్మలోచనునకుఁ బాదపీఠం బైన, ఘనునిఁ బన్నగేంద్రుఁ గాంచె నతఁడు.

ఆ. కన్నమాత్ర నతఁడు కల్మషంబులఁ బాసి, విమలచిత్తుఁ డగుచు విశదభక్తి
నిట్టరోమములకుఁ బట్టగు చానంద, బాష్పనేత్రుఁ డగుచుఁ బ్రణుతి సేసె.

క. సంతోషాశ్రులచేత న, నంతునిఁ బరిషిక్తుఁ జేసి యతఁడు ప్రమోదం
బెంతయు నరికట్టిన నొక, కొంతయుఁ బలుకంగ లేక కొండొకవడికిన్. 471

చ. మది నొకయింతమాత్రము సమంబుగఁ జేయుచు బాహ్యవర్తనం
గదిసినయింద్రియంబుల [2]నొకంతకుఁ దెచ్చి వచోవిలాసముల్
గుదురుగఁ ద్రోచి తత్త్వమునఁ గూర్చుచు [3]శాశ్వతవిగ్రహంబు నా
సదయుఁ బ్రశాంతు లోకగురు సన్నుతి సేయఁ దొడంగె నిమ్ములన్. 472

---

1 నిర్వర్తించి రాభూపాలుభార్యలు బాలహత్యాదోషంబు బ్రాహ్మణోత్తమనిరూపితవ్రతంబున నివర్తించి రంత. 2 వికారము మాన్పి. 3 సాత్వతవిగ్రహంబు.

క. అజితుఁడ వై భక్తులచే, విజితుఁడ [1]వైనాఁడ విపుడు వేడుక వారల్
విజితులు నీచేఁ గోర్కులు, భజియింపనివారు నిన్నుఁ బడయుదురె హరీ. 473

ఉ. నీవిభవంబు లీజగము నిండుట యుండుట నాశ మొందుటల్
నీవిమలాంశజాతములు నెమ్మి జగంబు సృజించువార లో
దేవ భవద్గుణాంబుధులతీరముఁ గానక యాశ బుద్ధితో
వావిరిఁ జర్చ సేయుదురు వారికి వారలు దొడ్డవార లై. 474

క. పరమాణువు మొదలు గాఁ గొని, పరమము దుది గాఁగ మధ్యపరికీర్తనచే
స్థిరుఁడవు త్రయీవిదుఁడ వై, సరి సత్యాద్యంతమధ్యసద్ధ్రువగతి వై. 475

తే. ఉర్వి మొదలైన యేడు నొండొకటికంటె, దశగుణాధిక మై యుండు దాని నండ
కోశమందు రజాండంబు కోటులెవ్వ, నందు నణుమాత్ర మగు ననంతాఖ్యుఁ డతఁడు.

వ. మఱియు నొక్కచోట విషయతృష్ణాపరు లైననరపశువులు పరతత్త్వంబ వైన
నిన్ను మాని యైశ్వర్యకాము లై తక్కిన దేవతల భజియింపుదురు వా రిచ్చుసం
పదలు రాజకులంబునుంబోలె వారలం గూడి నాశంబునం బొందు చుండువిష
యకాము లేని నిన్ను సేవించి రేని వేఁచినవిత్తనంబునుంబోలె దేహాంతరోత్పత్తి
నొందకుండుదురు నిర్గుణుండ వై (జ్ఞానవిజ్ఞానరూపంబు నొందియున్ననిన్ను గుణ
సమేతునింగా జ్ఞానులు భావింపుదురు) నీభజనం బేరూపున నయిన మోక్షంబు
ప్రసాదించు జితమతి వైననీవు భాగవతధర్మం బేప్రకారంబున నిర్ణయించితి వా
ప్రకారంబున సర్వోత్కృష్టుండ వయిననిన్ను సనత్కుమారాదులు మోక్షంబు
కొఱకు సేవించుచున్నా రీభాగవతధర్మంబునందు జ్ఞానహీనుం డొక్కండును లేఁ
డన్యకామ్యధర్మంబులందు విషమబుద్ధిచేత నేను నీవు నాకు నీకు నని [2]వచియిం
చు చున్నవాఁ డధర్మనిరతుం డై క్షయించు చుండు స్థావరజంగమప్రాణిసమూ
హంబునందు సమం బైన భాగవతధర్మంబుల వర్తించు చున్నమనుజునికి భవద్ద
ర్శనంబువలనఁ బాపంబు క్షయించుట యేమిచిత్రం బిపుడు భవత్పాదావలోక
నంబున నిరస్తాశయమలుండ నైతి మూఢుండ నయిననాకుఁ బూర్వకాలంబున
నారదుం డనుగ్రహించి భగవద్ధర్మంబు దయసేసె నది నేఁడు నాకు వరదుండ
వైననీకతంబున దృష్టం బయ్యె ఖద్యోతంబులచేత సూర్యుండు గోచరుండు గాని
మాడ్కి జగదాత్మకుండ వైననీమహత్త్వంబు మనుజులచేత నాచరింపంబడి ప్ర
సిద్ధం బైనది గా దుత్పత్తిస్థితిలయకారణుండ వై భగవంతుండ వైననీకు నమ
స్కరించెద నని మఱియును. 477

తే. అరయ బ్రహ్మాదు లెవ్వని ననునయించి, భక్తియుక్తుల భయమునఁ బ్రస్తుతింతు
రవని యెవ్వనితలమీఁద నావగింజఁ, బోలు నా వేయుశిరములభోగిఁ గొల్తు.

---

1 'వై యుంటివిపుడు వేడుకతోడన్, విజితాత్ము లగుచుఁ గోర్కులు, భజియింపనివారు నిన్నుఁ బడయుదురు హరీ. 2 రచియింపఁబడు మన్న.

క. ఈవిధమున వినుతింపఁగ, నావిద్యాధరులభర్త కనియె ననంతుం
డోవిమలబుద్ధి నీదగు, ధీవిభవంబునకు మెచ్చితిం బ్రియ మారన్. 479

ఆ. అరయ నారదుండు నంగిరసుండును, దత్త్వ మొసఁగినారు దానికతన
నన్నుఁ జూడఁ గల్గె నాభక్తిమదిఁ గల్గె, నాపథంబు నీకు నమ్మఁ గలిగె. 480

సీ. పూని నారూపంబు భూతజాలంబులు, భూతభావనుఁడ నేఁ బొందువడఁగ
బ్రహ్మంబు మఱియు శబ్దబ్రహ్మమును శాశ్వ, తం బైన తనువులు దగిలె నాకు
నఖిలలోకములందు ననుగతం బై యుండు, లోకంబు నాయందు జోకఁ జెందు
నుభయంబు నాయందు నభిగతం బై యుండు, నఖిలీనమగుదు నియ్యుభయమందు

తే. వెలయ నిద్రించువాఁ డాత్మ విశ్వమెల్లఁ, జూచి మేల్కాంచి తా నొక్క చోటివానిఁ
గా వివేకించుమాడ్కి నీ[1]జీవితేశ, మాయ దిగనాడి పరమధర్మంబుఁ దెలియు.

ఆ. నిద్ర వోవువేళ నిరతుఁ డై దేహి దా, నెట్టిగుణముచేత నింద్రియములఁ
గడచినట్టిసుఖముఁ గను నట్టిబ్రహ్మంబుఁ, గడిమి మెఱయ నన్నుఁ గా నెఱుంగు.

ఆ. స్వప్నమందు నెట్లు సంచార మొనరించు, మేలుకాంచి [2]దృష్టమోలి నెఱుఁగు
నుభయ మెఱుఁగునట్టియుత్తమజ్ఞానంబు, తత్త్వ మట్టి దైన తలఁపు నేను.

సీ. అరయంగ నెవ్వని కలవి గానట్టియీ, సలలితమానుషజాతిఁ బుట్టి
యాత్మతత్త్వజ్ఞానహేతుఁ డైనవానికిఁ, గలుగునె యెందు సుఖం బొకింత
వెలయఁ బ్రవృత్తినివృత్తిమార్గంబుల, సుఖములు దుఃఖంబు సొరిదిఁ దెలిసి
పనిచెడిసంకల్పఫలమూలమునఁ బాఱు, కడు సుఖదుఃఖమోక్షములకొఱకు

ఆ. దంపతిక్రియామతంబు వర్తింతురు, దాన మోక్ష మేల దక్కి యుండు
నఖిలదుఃఖహేతు వయినయీకర్మంబు, నెఱిఁగి నన్నుఁ దలఁప రిచ్చలోన.

వ. మఱియు విజ్ఞానాభిమాను లయినమనుష్యులకు నతిసూక్ష్మం బయినయాత్మగతి నిజస్థానత్రయలక్షణంబునఁ జతుర్థాంశంబు నెఱింగి యైహికాముష్మికవిషయంబులచేతను [3]వివేకబలంబులచేతను నియుక్తుం డై జ్ఞానవిజ్ఞానసంతృప్తుం డైనపురుషుండు నాకు భక్తుం డగు నీవిధంబులు గలవారలు యోగనైపుణబుద్ధి గలవారలు నై స్వార్థం బయినయాత్మచేతం బరమాత్మను దెలియుచుందురు నీవు నీక్రమంబున మద్భక్తిశ్రద్ధాపరుండవై విజ్ఞానసంపన్నంబు లైనవాక్కులచేత నన్ను స్తోత్రంబు సేసి ముక్తుండ వైతి వని యాశేషభగవంతుండు విద్యాధరపతి యైన చిత్రకేతుం బలికి యతని కదృశ్యుం డై పోయె నేదిక్కున సర్వాత్మకుం డైనయనంతుం డంతర్ధానంబు నొందె నాదిక్కునకు విద్యాధరభర్త నమస్కరించి గగనచరుం డై చని లక్షలసంఖ్య లైనదివ్యవర్షంబు లవ్యాహతబలేంద్రియుం డై పరమయోగిపురుషులును దివ్యమునీంద్రులును సిద్ధచారణగంధర్వులును వినుతి సేయం గులద్రోణాదిశైలంబులను రమ్యప్రదేశంబులను సంకల్పసిద్ధప్రదేశంబు

1 జీవదేశ. 2 దృష్ట మెల్ల. 3 నిర్ముక్తు లై జ్ఞానవిజ్ఞాన.

లను వినోదించుచు శ్రీనారాయణదత్తం బగుదివ్యవిమానంబునందుఁ జరియిం
చుచు నుండె. 484

శా. ఆడించుర్ హరిదివ్యనాటకగుణవ్యాపారనృత్యంబులం
బాడించుర్ జలజాతనేత్రబిరుదప్రఖ్యాతగీతంబులం
గూడించుర్ సతతంబు జిహ్వలతుదిర్ గోవిందనామావళుల్
[1]క్రీడం గిన్నరయక్షకామినులచేఁ గృష్ణార్పితస్వాంతుఁడై. 485

సీ. వాసించు నాత్మఁ బో వైష్ణవజ్ఞానంబు, నాశించు భాగవతార్చనంబు
భూషించు నేత్రాద్దుఁ బుండరీకాక్షుని, భాషించు హరికథాపారిధి మెఱసి
ఘోషించు హరినామగుణనికాయంబులు, పోషించుఁ బరతత్త్వబోధ మరసి
సేవించు శ్రీకృష్ణసేవకాసికంబు, సుఖమునఁ జేయు నీశునకు బలులు

తే. పాడుఁ బాడించు వైకుంఠభర్తనటన, రూపవర్తనగుణనామదీపితోరు
గీతజాతప్రబంధసంగీతవిధులఁ, గేశవప్రీతి గాఁ జిత్రకేతుఁ డపుడు. 486

చిత్రకేతుం డీశ్వరధిక్కారంబున గౌరిచే శాప మొందుట.

మ. హరిఁ గీర్తించుచు నల్లనల్ల మదిలో నబ్జాక్షు [2]సేవించుచుం
బరమానందము నొందుచుర్ జగములం బ్రఖ్యాతి వర్తించుచుర్
సురరాజోపమమూర్తి యక్షగణముల్ సొంపార విద్యాధరా
ప్సరసల్ గొల్వఁగఁ బాడఁగా సితగిరిప్రాంతంబున న్నేఁగుచున్. 487

శా. ఆవిద్యాధరభర్త గాంచె హరసింహారామ్యతాహాసముర్
శ్రీవిభ్రాజితముర్ నిరస్తగిరిజాసేవాగతాయాసముర్
దేవాసికవికాసముర్ శుభమహాదేవాంఘ్రిసంవాసమున్
భూవిఖ్యాతవిలాసముం ద్రిభువనీపూతింబుఁ గైలాసమున్. 488

క. ఆరజతభూధరంబున, నీరేజభవామరాదినికరము గొల్వం
బేరోలగమున నుండిన, గౌరీయుతుఁ డయినహరునిఁ గనియె నరేంద్రా. 489

సీ. తననిజరూప [3]మింతయు నున్కి దెలియక, వాదంబు సేసెడువేదరవముఁ
గరుణావలోకనాకాంక్షితులై యున్న, బ్రహ్మాదిసనకసంప్రణుతిరవము
సారశివానందసల్లాపముల నొప్పు, ప్రమథగణాళియార్భటరవంబు
డమరుమృదంగాదిఘుమఘుమధ్వనితోడి, పటుభృంగినాట్యవిస్ఫారరవము

తే. మానుగాఁ జామరలు వీచుమాతృకాది, కామినీజనమహితకంకణరవంబు
మెండుఁజెలఁగంగఁగన్నులపండువయ్యెఁ, గొండరాచూలిపెనిమిటినిండుకొల్వు.

వ. ఇట్లు బ్రహ్మాదిసురనికరసేవితుండై యూరుపీఠంబున నున్నభవానిం గౌఁగిటం
జేర్చికొని యొడ్డోలగంబున నున్నపరమేశ్వరుం జూచి చిత్రకేతుండు పకపక
నగి యద్దేవి విను చుండ ని ట్లనియె. 491

---

1 గ్రీడించుర్ నరయక్ష. 2 నీక్షించుచుం. 3 మింతం తని.

సీ. కోమ రొప్పఁగా లోకగురుఁడును గడలేని, ధర్మస్వరూపంబుఁ దాన యగుచు
జడలు ధరించియు సరిలేనితపమునఁ, బొడ వైనయీయోగిపుంగవులును
బ్రహ్మవాదులుఁ గొల్వ భాసిల్లుకొల్వులో, మిథునరూపంబున మెలఁతతోడఁ
బ్రాకృతుండునుబోలె బద్ధానురాగుఁ డై, లాలితుం డయ్యె నిర్లజ్జత నిట
ఆ. నకట ప్రకృతిపురుషుఁ [1]డైనఁ దానేకాంత, మందు సతులతోడ నలరుఁ గాని
యిట్లు ధర్మసభల నింతులతోఁ గూడి, పరిభవింప లేఁడు భ్రాంతి నొంది. 492
క. అన విని సర్వేశ్వరుఁ డా, తని నేమియు ననక నవ్వి తత్సభవారల్
గనుఁగొన నూరక యుండెను, మనుజేశ్వర యీశుధైర్యమహి మెట్టిదియో.
వ. ఇట్లు దనపూర్వకర్మశేషంబున నింద్రియజయుండ నని పుట్టినయహంకారంబున
జగద్గురువుం బెక్కుప్రల్లదంబు లాడుచున్నచిత్రకేతుం జూచి భవాని యిట్లనియె.
క. మముబోఁటిలజ్జ లుడిగిన, కుమతులకుం గర్త యగుచుఁ గోపింపంగా
నమితాజ్ఞానిపుణుం డగు, శమనుండా వీఁడు నేఁడు జగముల కెల్లన్. 495
క. భృగునారదకపిలాదులు, నిగమాంతజ్ఞులును యోగనిర్ణయనిపుణుల్
త్రిగుణాతీతు మహేశ్వరు, నగ రెన్నఁడు వారు ధర్మనయ మెఱుఁగ రొకో.
సీ. ఎవ్వనిపదపద్మ మింద్రాదివిబుధుల, చూడాగ్రపంక్తుల నీడఁ గాంచు
నెవ్వనితత్త్వంబ దెనయంగ బ్రహ్మాది, యోగిమానసపంక్తి నోలలాడు
నెవ్వనిరూపంబు నేర్పాటు గానక, వేదంబు లందంద వాద మడుచు
నెవ్వనికారుణ్య మీలోకముల నెల్లఁ, దనిపి యెంతయు ధన్యతములఁ జేయు
తే. నట్టిసర్వేశుఁ బాపసంహారు ధీరు, శాశ్వతైశ్వర్యు నాత్మసంసారు నీశు
నెగ్గు వల్కినపాపాత్ముఁ డెల్లభంగి, దండనార్హుండు గాకెట్లు దలఁగఁగలఁడు.
తే. నిఖిలలోకాశ్రయంబు సన్నిహితసుఖము, సకలభద్రైకమూలంబు సాధుసేవ్య
మైనకంజాక్షుపాదపద్మార్చనంబు, ననుచరింపంగ ఖలుఁడు వీఁ డర్హుఁ డగునె.
వ. కావున నోరి దురాత్మక యీపాపంబునం బాపస్వరూపం బైనరాక్షసయోనిం బు
ట్టు మని శపియించి యింతనుండి మహాత్ములకు నవజ్ఞ సేయ కుండు మని పలికినఁ
జిత్రకేతుండు విమానంబు డిగ్గి వచ్చి యద్దేవికి దండప్రణామంబు లాచరించి
కరకమలంబులు దోయిలించి యిట్లనియె నో జగన్మాతా భవచ్ఛాపవాక్యంబు
లట్ల కైకొంటిఁ బ్రాచీనకర్మంబులం బ్రాప్తం బైనసంసారచక్రంబుచేత నజ్ఞానమో
హితు లై తిరుగుచున్నజంతువులకు సుఖదుఃఖంబులు నైజంబు లై ప్రవర్తిల్లు
చుండు నిందులకుఁ బరతంత్రు లైనవా రాత్మపరసుఖదుఃఖంబులకు నెవ్వారు కర్త
లీగుణంబులనిమిత్త మై శాపానుగ్రహంబులును స్వర్గనరకంబులును సుఖదుఃఖం
బులును సమంబులు భగవంతుం డొక్కండ తనమాయచేత జగంబు సృజియిం
చుచుండు వారివారికి బంధాదిరాగంబులు గలుగంజేయుచుఁ దాను వానికిలోను

1 డైనను నేకాంత, సీమ సతులతోడఁ జెలఁగువాని.

